# సంస్కృతగ్రంథములు.



## ఇతిహాసపురాణములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| బాలరామాయణము, పెద్దచ్చు | ... | 0 | 2 |
| ,, సటీక | ... | 0 | 4 |
| శ్రీమద్రామాయణము, మూలము మాత్రము | ... | 6 | 0 |
| ,, మేలుప్రతి | ... | 8 | 0 |
| ,, సుందరకాండము, మూలము | ... | 1 | 8 |
| ,, ఉత్తరకాండము, రఫ్ ప్రతి | ... | 0 | 12 |
| అధ్యాత్మరామాయణము, మూలము | ... | 1 | 3 |
| ,, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 8 | 0 |
| శ్రీమద్రామాయణము, సటీక, 15 వాల్యుములు | ... | 70 | 0 |
| శ్రీమద్రామాయణము, వ్యాఖ్యానచతుష్టయవిశిష్టము, 2 వాల్యుములు | | 18 | 0 |
| శ్రీమద్రామాయణము, సాంధ్రతాత్పర్యము:— | | | |
| బాలకాండము ,, | ... | 3 | 0 |
| అయోధ్యాకాండము ,, | ... | 4 | 0 |
| అరణ్యకాండము ,, | ... | 3 | 0 |
| కిష్కింధాకాండము ,, | ... | 3 | 0 |
| సుందరకాండము ,, | ... | 3 | 0 |
| యుద్ధకాండము ,, | ... | 5 | 0 |
| ఉత్తరకాండము ,, | ... | 3 | 0 |
| కార్తికమాహాత్మ్యము ,, | ... | 1 | 0 |
| కాశీమాహాత్మ్యము, తెనుఁగువచనము | ... | 0 | 8 |
| కేదారఖండము, పాతప్రతి | ... | 0 | 12 |
| గయామాహాత్మ్యము, తెనుఁగువచనము | ... | 0 | 6 |
| సింహాచలక్షేత్రమాహాత్మ్యము ,, | ... | 0 | 8 |
| గరుడపురాణము, సవ్యాఖ్యానాంధ్రతాత్పర్యము | ... | 1 | 8 |
| పద్మపురాణాంతర్గత మాఘపురాణము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 3 | 0 |
| శ్రీమహాభారతము, గద్యవ్యాఖ్యానసహితము, 3 సంపుటములు | ... | 40 | 0 |
| శ్రీమద్భాగవతము, శ్రీధరీయవ్యాఖ్యానసహితము, 2 సంపుటం | ... | 15 | 0 |
| శ్రీమద్దేవీభాగవతము, సవ్యాఖ్యానము | ... | 15 | 0 |

## వైదికగ్రంథములు.

| | | ప్రతి 1-కి రూ. | అ: |
|---|---|---|---|
| ఋగ్వేదపూర్వప్రయోగాదర్శము | ... | 2 | 8 |
| పంచోపనిషత్తులు, తైత్తిరీయము, సస్వరము | ... | 0 | 12 |
| తైత్తిరీయ ఆరణ్యకోపనిషత్తులు, పితృమేధము, మంత్రపన్నములు సహా, సస్వరము | ... | 3 | 0 |
| యజుర్వేదసంధ్యావందనభాష్యము | ... | 0 | 12 |
| యాజుషపూర్వప్రయోగచంద్రిక, సస్వరము | ... | 2 | 8 |
| రుద్రాధ్యాయము | ... | 1 | 8 |
| సత్యనారాయణవ్రతకల్పము, తాత్పర్యసహితము | ... | 0 | 8 |
| వ్రతరత్నాకరము, ప్రథమభాగము | ... | 0 | 12 |
| ,, ద్వితీయభాగము | ... | 1 | 8 |
| వ్రతచూడామణి, సంస్కృతము | ... | 2 | 8 |

## జ్యోతిషగ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| అఱువది (గత) సంవత్సరముల పంచాంగము | ... | 10 | 0 |
| ఆరూఢరత్నసిద్ధాంజనము | ... | 0 | 12 |
| కాలామృతము, మేలుప్రతి | ... | 1 | 8 |
| కృష్ణవాస్తుశాస్త్రము, అను వాస్తుసారసంగ్రహము | ... | 0 | 12 |
| జాతకచంద్రిక, గోపాలరత్నాకరము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 12 |
| బృహజ్జాతకము, ఆంధ్రటీకాతాత్పర్యవ్యాఖ్యానసహితము, చక్కనిప్రతి | | 2 | 8 |
| ముహూర్తదర్పణము, సటీక | ... | 1 | 0 |
| రెట్టమతశాస్త్రము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 14 |
| లఘుజాచకము ,, | ... | 0 | 12 |
| వృద్ధపారాశర్యము ,, | ... | 0 | 12 |
| శ్రీపతి ,, | ... | 1 | 8 |
| సర్వార్థచింతామణి, మూలముమాత్రము | ... | 0 | 12 |
| సారావళి, సాంధ్రతాత్పర్యము | ... | 3 | 8 |

## ధర్మశాస్త్రగ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రీకృతన్యాయదర్శనము, ప్రథమభాగము | ... | 1 | 4 |
| ధర్మసింధు, తెనుగువచనము | ... | 5 | 0 |
| మనుస్మృతి, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 6 | 0 |

## వేదాంతగ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| అష్టోత్తరశతోపనిషత్తులు, మూలము | ... | 8 | 0 |
| ఉత్తరగీతా, సటీక, చిన్నసైజు | ... | 0 | 12 |
| అద్వైతవేదాంతపరిభాష, సవ్యాఖ్యానము | ... | 1 | 8 |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | | ప్రతి 1-కి | |
| ఉపదేశసాహస్రి, ఆంధ్రతాత్పర్యము | ... | 3 | 0 |
| కామకలావిలాసము ,, | ... | 2 | 8 |
| జ్ఞానవాసిష్ఠము ,, | ... | 10. | 0 |
| విద్యారణ్యకృత జీవన్ముక్తిప్రకాశిక, ఆంధ్రతాత్పర్యము | ... | 2 | 8 |
| నైష్కర్మ్యసిద్ధి, సురేశ్వరాచార్యకృతము, ఆంధ్రటీకాతాత్పర్య సహితము | ... | 5 | 0 |
| పంచదశీప్రకరణము, సటీక | ... | 6 | 0 |
| ప్రశ్నోత్తరరత్నమాల, ఆంధ్రతాత్పర్యము | ... | 0 | 8 |
| బ్రహ్మసూత్రములు, మూలము | ... | 0 | 4 |
| ,, తెనుఁగువచనము | ... | 12 | 0 |
| ,, శంకరభాష్యము | ... | 10 | 0 |
| భగవద్గీతలు, మూలము, చిన్నసైజు | ... | 0 | 6 |
| ,, కాలికోబైండు | ... | 0 | 6 |
| ,, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 1 | 8 |
| ,, ,, చిన్నసైజు | ... | 0 | 12 |
| ,, ద్వైతమతానుసారమైనవివరణము | ... | 1 | 0 |
| ,, శ్రీరామచంద్రసరస్వతీకృత ఆంధ్రటీకాతాత్పర్యసహితము | | 4 | 8 |
| ,, ఆనిబిసెంటుగారి ఇంగ్లీషుతర్జుమా | ... | 0 | 10 |
| మహావాక్యదర్పణము, ఆంధ్రతాత్పర్యము | ... | 1 | 8 |
| మహావాక్యరత్నావళి ,, | ... | 2 | 8 |
| శంకరగీతాభాష్యము, సంస్కృతము | ... | 2 | 8 |
| వాసుదేవమననము, తెనుఁగువచనము | ... | 1 | 0 |
| విచారసాగరము ,, | ... | 5 | 0 |
| విచారచంద్రోదయము ,, | ... | 0 | 10 |
| శివగీతా, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు | ... | 1 | 0 |
| సనత్సుజాతీయము, సటీక | ... | 0 | 8 |
| శంకరవిజయము, సవ్యాఖ్యానము | ... | 2 | 8 |
| వివేకచూడామణి, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 1 | 0 |
| సౌందర్యలహరి, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 6 |
| హఠయోగప్రదీపిక, సాంధ్రతాత్పర్యము | ... | 3 | 0 |
| ద్వాదశోపనిషత్తులు, తెనుఁగువచనము | ... | 3 | 8 |

శ్రీరస్తు.

# దశావతారచరిత్రము

ధరణీదేవుల రామయమంత్రికృతము.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము



1926




ఈగ్రంథమును రచించిన కవి ధరణీదేవుల రామయమంత్రి. నియోగిబ్రాహ్మణుఁడు. ఈతనితాత తిమ్మయమంత్రి. తండ్రి నాగయమంత్రి. తల్లి ఫణియమ్మ. ఈ గ్రంథమునందు శ్రీమహావిష్ణుని దశావతారములును గూర్చినకథ చెప్పఁబడినది. పదియవతారముల కథను బదియాశ్వాసములలో నిమిడ్చినాఁడు. రామావతారకథ రెండాశ్వాసములక్రిందను, బుద్ధకల్క్యవతారముల రెంటికథను నొక్కయాశ్వాసముక్రిందనుఁ జెప్పినాఁడు. రామావతారకథవంటి పెద్దదియైనను బలరామావతారకథను రెండాశ్వాసములక్రింద రచియింపలేదు గాని, కృష్ణచరిత్రమును రెండవభాగముగా విభజించినట్లున్నది. ఈగ్రంథము మగదల కృష్ణమంత్రి కంకితము చేసినాఁడు. ఈకృష్ణమంత్రి నెల్లూరిమండలములోని ప్రళయకావేరిపట్టణములో గతశతాబ్దాంతమం దొలాందావారికి ద్విభాషిగా నుండెనని యాంధ్రకవులచరిత్రమునఁ దెలియవచ్చుచున్నది. గత శతాబ్దాంతమనఁగా, నాంధ్రకవులచరిత్రమే 19-వ శతాబ్దాంతమందు రచియింపఁబడి యుండుటచేత 18-వ శతాబ్దాంత మనుకొనవలయును. మఱియుఁ బుష్పగిరి తిమ్మన్న, కంకంటి పాపరాజులు రామయమంత్రికి సమకాలికులైనట్లు తెల్పుచు వారివిషయము 1790 ప్రాంతమునని కవులచరిత్రము వ్రాయుటకూడ దీని కాధారము.

ఈరామమంత్రి సంస్కృతప్రాకృతాద్యష్టభాషలు నేర్చినవాఁడు. అట్టివానికిఁ దెనుఁగుకవిత్వము లెక్కలోనిదిగాదు. పూర్వకవులు సంస్కృతముతోపాటు స్వభాషను గూడఁ గృషి చేయుచుండెడివారు. పెద్దపెద్ద పండితులయొద్దఁ గాశి మొదలగుతావులఁ జదువుకొనివచ్చి (సంస్కృతమును) యింటికడ మాతృభాషను బరిశ్రమచేయువారు కావచ్చును. కవులుచేయు గురుస్తుతి సంస్కృతవిద్యాభ్యాసము చేయించిన గురువులస్తుతియనియే తలఁపవచ్చును. ఈవిషయ మింతకంటె నిక్కడ నప్రస్తుతము. ఈకవి సంస్కృతమును దెనుఁగును చక్కఁగా గ్రంథమం దంతటను వాడినాఁడు. సంస్కృతవాక్యములను దెనుఁగుపద్యములనడుమ "అద్యభవే త్త్వవ సర్వమంగళావాప్తిః" అటంచు నీరీతిగాను జేర్చును. పాణౌకృతి, నాభౌసరోజుఁడు, దంభూతవామాంగుఁడు- మొదలగుపదములఁ బ్రయోగించెను. తెనుఁగునను గూడ నపూర్వపదప్రయోగము గావించినాఁడు కాని యందందు, "అదేమే వైరినెన్నేవు, నవ్వేరెవరైన, ఇంట్లోవారికి దుఃఖించ" ఇట్టి వ్యాకరణవిరుద్ధపదములు కలవు. లోకో

క్తులు జాతీయములు చక్కగా వాడినాఁడు. "ముక్కునగవ్వగుట్టి నిను ముందుగ నీడిచి-అబలలము మూఁడుమాటల నాఱుతప్పులు." ఇట్టిసహజములును, "ఆయం భోదమ్ములఁ జూచి చెర్వుజలమాద్యంతంబుఁ జల్లింతురే" ఇట్టి స్వతంత్రములు నగు లోకోక్తులను బ్రయోగించినాఁడు. పాఠకులకు విదితము కాఁగలదని యిట విస్తరింపలేదు. సంస్కృతాంధ్రముల రెంట నీతని కవిత్వము, వర్ణనలు, కల్పనలు, మృదుమధురములు రసానుగుణములునుగా నుండును. స్వభావవర్ణముల కీతఁడు పెట్టినది పేరు. యమకములు, నంత్రనియమములు, గర్భకవిత్వము, బంధకవిత్వముఁ జక్కగ నభ్యసించినవాఁడు. స్తుతిసమయములలోఁ బలువురచేఁ బలువితముల నాయారీతి గర్భబంధకవిత్వముం జెప్పించినాఁడు. పాఠకులు చిత్తగింతురు గాక! అదితిచేఁ బ్రాకృత సీసపద్యముతో విష్ణుస్తుతి చేయించి, స్త్రీకావున నేమో ఇట్లప్రాకృతగుణాతీతయగు నదితి ప్రాకృతగుణాతీతుని (బ్రాకృతమున) వర్ణించినట్లు నుడివినాఁడు. ఆంజనేయునిచే శ్రీరాముని ఉత్పలమాలికలో మంజుభాషిణి యను వృత్తముంగూర్చి స్తుతిచేయించి రామునిచే నాతనికవిత్వమునకు మెప్పించి సీతచే ముత్యాలహారము నిప్పించినాఁడు. ఈతఁడే పక్షపాతము నసూయయులేని కవి. తానొక ప్రభువునొద్దఁ గవిత్వముచెప్పి జాంబూనదాంబరమణి భూషణాదులం గొనుకవి తనవంటి కవులకును ప్రభు సంస్థానములలోఁ జెప్పి యిప్పించిననేగదా కీర్తికలుగును. ఇక్కవి తెనుఁగుప్రాకృతము సంస్కృతముపదములే కాక అన్నగళు (అఱవము) చికరాయపట్టను (కన్నడము) సాహెబూ (హిందుస్తానీ) పదములనుగూడ వాడినాఁడు.

శృంగారవర్ణనములకుఁ గడఁగెనా యీతని కొండలు తెలియదనుట సాహసము కాఁగూడదు. బాలురగు రామలక్ష్మణులయొద్ద విశ్వామిత్రునిచేత నహల్యచరిత్రమును బచ్చిపచ్చిగా వర్ణింపించినాఁడు. ఇంద్రునిచేష్టలు మానవసామాన్యముగా నున్న వనిపించినాఁడు. కృష్ణుఁడు, గోపికలు, వీరలవిషయము చెప్ప నక్కఱయేలేదు. ఏవిషయముననుగూడ శృంగారించి చెప్పఁజూచును. అదితి స్త్రీ, యీమె చేసిన విష్ణుస్తుతిలోఁ గూడ "ళచ్చిత్థణాహేయలలిఅహత్థపయోఅ" (లక్ష్మీస్తనాధేయ లలిత హస్తపయోజ) అనిపించినాఁడు. కొన్నితావులఁ జెప్పవలసినవిషయము తగ్గించి వర్ణనలు విస్తరించినాఁడు. కవులనఁగా వర్ణించువారేకాని స్థలము, సమయము, తదుచితముగూడ నాలోచించుచుండవలయును. ఇందేకాదు, ఈ విషయము సర్వసామాన్యముగాఁ గథనుమాత్రమే తెల్పవలసిన పురాణములలోఁ

గూడఁ బూర్వులిట్లే సమయోచితముచూడకుండ వర్ణించియున్నారు. రామపరశు రాముల సంభాషణము చాలఁ దగ్గించినాఁడు. బుద్ధినిబోధలు క్రొత్తవి యంతగా లేవు. ఇట్టులే పాఠకులు చదివిన నాయాస్థానముల విశదము కాఁగలదు.

ఈగ్రంథమును బ్రకటించుటకు బహుప్రతులలో సరిచూడవలసి వచ్చినది.

1. ఆంధ్రసాహిత్యపరిషత్తులోని పేఁచుకాగితములప్రతి - ఇది నలనామ సం॥ మాఘ బ ౧౦ జయవారమున దుగ్గిరాల చినసుబ్బయ్యగారి కుమారుఁడు నరసింహముగారు బందరు ఖొజ్జిల్లిపేఁటలో నివసించు భూమకరు సీనయ్యగారను శ్రీనివాసరావుగారి ప్రతినిజూచి వ్రాసినది. (2) పరిషత్తులోని తాళపత్రప్రతి-అజవదేశపుది. కోరప్పటి వేంకటరామయ్యగా రిచ్చినది. ఈరెంటిలో నక్కడక్కడఁ గొన్ని భాగములు లేవు.

2. దొరతనమువారి ఓరియంటల్ లైబ్రరిలోఁ గొన్నిటీకలు గొన్నిమూలమాత్రములును గలవు. అందును రెండుతాళపత్రప్రతులు పూర్తిగానున్నవి. తక్కినవి యసంపూర్ణప్రతులు. టీకలలో మూఁడునాలుగాశ్వాసములకు టీకలు లేవు. పంచమాశ్వాసములోని ప్రాకృతసీసము వ్రాయకుండ విడిచిపెట్టఁబడియెను. ఒక కాగితము మూలములోనే యాపద్యమువిడిచి స్థలముమాత్రము వదలినారు. పూర్ణగ్రంథములలోఁ బాఠభేదములు సనర్థములు వ్రాఁతతప్పులు మెండుగానున్నవి.

ఈ దశావతారచరిత్రమును బుప్పగిరితిమ్మన్న రచియించెననువాడుక గలదు గాని రచనసుబట్టి యిది తిమ్మన్నకవిత్వముగాఁ దోఁపదనియు నట్లు వదంతిపుట్టుటకుఁ గారణము కనఁబడదనియు రా॥ బ॥ వీరేశలింగము పంతులుగారు వ్రాసినారు.

ఈ పుస్తకమునఁ జాలఁభాగము చక్కఁజేసి ముద్రించినారము. అయినను లోపము లింక నుండవచ్చును. ఆలోపములను బాఠకులుదెల్పిన రెండవసారి ముద్రించునపుడు తప్పక సవరించెదము. పాఠకబృందము మేము శీఘ్రకాలములో ద్వితీయముద్రణము గావించున ట్లాశీర్వదించునుగాక!

తండయార్పేట,
చెన్నపురి. 6-2-1926.

ఇట్లు,
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

# వి ష య సూ చి క.



శ్రీరస్తు.

# దశావతారచరిత్రము.

## పీఠిక.



కరమత్స్యకూర్మకిటిసింహవటూత్తమరామబుద్ధక
ల్క్యాకృతుల న్వచోమరధరార్భకవాసవసంశ్రవార్కకా
మాకుముదాప్తభృజ్జయకృతావనుఁడై తగు వేంకటేశుఁ డెం
తేఁ గృపఁ బద్మనాభసచివేశ్వరుకృష్ణసుధీంద్రుఁ బ్రోవుతన్. 1

ఉ. పాణితవాణి పంకరుహపాణి రమాఘనవేణి నిత్యక
ల్యాణము పచ్చతోరణములం దగి తామరతంపరై కవి
ప్రాణపదంబు తా మగదలాన్వయకృష్ణ సుధీంద్రచంద్రక
ల్యాణమణీగృహంబున నిరంతరము న్వసియించుఁగావుతన్. 2

శా. అంతర్వాణులు రీణు లంచును నపఖ్యాతి న్నివారించెఁ గా
సంతోషంబున వస్తువాహనము లశ్రాంతంబుఁ దా నిచ్చి మా
కింతేచాలు నటంచు సంతసముతో నింపొందు నాభారతీ
కాంతుం డీవుతఁ గృష్ణమంత్రిమణి కాకల్పంబు దీర్ఘాయువున్. 3

మ. తతయుక్తిక్ష ఘనశబ్దము ల్వెలయ నర్థవ్యంజకప్రక్రియల్
తతి నానద్ధతమించఁ దత్తదుచితాలంకారము ల్మీఱ శ్రీ
పతిచారిత్రము సర్వగోచరతచే భాసిల్లఁగా భారతీ
సతి యస్మద్రసనాగ్రరంగమున లాస్యప్రౌఢిఁ బాటింపుతన్. 4

ఉ. సప్తఋషీంద్రు లెల్ల బుధజాలము మెచ్చఁగఁ బార్వతీచకో
రాప్తముఖీవివాహమున 'నవ్య భవే త్త్వ సర్వమంగళా
వాప్తి' యటంచుఁ బల్క దరహాసము పూను శివుండు సత్కృపై
కాప్తతఁ బద్మనాభసచివాగ్రణికృష్ణసుధీంద్రుఁ బ్రోవుతన్. 5

మ. తనగంభీరతచేత నిర్జలతఁ జెందం జేసి వారాశి డాఁ
గినమైనాకునిఁ బైటవైవక జగద్ధేయప్రదానంబు వా
హినుల న్నించె నటంచు సమ్ముదముతో నింపొందు శైలేంద్రనం
దన యిచ్చుఁగాక దయఁ బద్మనాభఘను కృష్ణస్వామి కైశ్వర్యముల్ 6

మ. తళుకుఁబంగరుమేను వజ్రమయమౌ దంతంబు హస్తంబునం
దళుకున్ముత్తెపుమోదకంబు దగ శృంగారంబుగాఁ జేసి ని
చ్చలుఁ బూజించుటచేఁ బ్రసన్నుఁడయి నిష్ప్రత్యూహసంసిద్ధిచే
వెలయించు న్గృతి నేకదంతుఁడు గృపావేశంబుతో నెప్పుడున్. 7

మ. భవతేజంబునఁ బుట్టి రామభజనాపారీణుఁడై పద్మసం
భవసామ్రాజ్యరమాధురంధరతకై భాసిల్లియు న్నిత్యస
త్యవిశేషస్థితి సద్విరోధివిషయధ్వాంతార్కబింబాకృతిన్
భువిలో మంతునకెక్కి నట్టి హనుమంతుం గొల్తు నిష్టాప్తికిన్. 8

మ. ఘనశబ్దేభ ముదీర్ణవర్ణమణిప్రేంఖద్ఘాటిఘోటంబు చం
కనదర్థం బతిహృద్యపద్యభటసంఘాతంబు లోకైకరం
జనశృంగారవధూక మైనకవితాసామ్రాజ్య మేలంగ నే
ర్చినవిద్వత్కవిరాజరాజుల వచశ్శ్రీ నెంచి ప్రార్థించెదన్. 9

మ. పదలాలిత్యము లేమి ఖంజులును శబ్దజ్ఞానవిజ్ఞానసం
పద లేమిన్ బధిరు ల్పదార్థములఁ గాన్పన్ లేమి జాత్యంధులు
న్మృదుత న్వొఁడిన నుత్తరంబొసఁగలేమి న్మూఁగలౌ వారి దు
ర్మద మేమాత్ర మదేల తాదృశకవిమ్మన్యు ల్వివాదార్హులే. 10

సీ. శ్లేషాదిపదములు చెలువుసూపఁగఁ బదవాక్యార్థదోషము ల్వర్జములుగ
విమలకైశిక్యాదివృత్తులు దనర వైదర్భ్యరీతులు దళుకునెఱప
సరసరత్యాదికస్థాయిభావములు శృంగారాదిరసముల క్రమము మెఱయ
భావవిభావానుభావసాత్త్వికభావసంచారిభావము ల్మించుగులుక
తే. విలసదుపమాద్యలంక్రియ ల్వింతఁ దెలుప
లలితముగఁ బాకములు సేయ లక్ష్యశయ్యఁ
గవిత రచియింపనేర్చు సత్కవికి గాకఁ
గాకవుల కేది లోకవిఖ్యాతకీర్తి. 11

వ. అని క్రమంబున విశిష్టేష్టదేవతానమస్కృతియు సుకృతిజనపురస్కృతియు దుష్కృతితిరస్కృతియుం గావించి చమత్కృతి మత్కృతి నిర్మిమిషాయత్తచిత్తంబుతో నున్న యవసరంబున. 12

సీ. తనదుకీర్తి సరోజధామమున భువనజాతమ్ములు భువనజాతములు గాఁగఁ
దనప్రతాపాగ్ని కుద్ధతనృపాలపతంగమండలంబు పతంగమండలముగఁ

దనదయాశరధిరత్నమునకు మార్గణౌఘంబులు మార్గణౌఘములు గాఁగ
దనదుయావనవసంతవిజృంభణమునకుఁ గలకంఠికలు గలకంఠికలుగఁ

తే. బ్రబలుమగదలపద్మనాభప్రధాన, పూర్వజన్మసహస్రసంపూర్ణరచిత
పుణ్యపరిపాకఫలరూపబుద్ధిశాలి, మహితగుణపాళి కృష్ణయామాత్యమౌళి. 13

వ. వెండియు నఖండనవఖండధరణీమండలభరణప్రచండమనీషాదండితపుండరీకకుండలీంద్రుండును నిజకటాక్షవీక్షాయత్తచిత్తనిర్వర్తితప్రతివసంతయాగకుండలీంద్రుండును, మహోదారధీరతావధీరితసుధారతాధారతాపాత్రగోత్రుండును గాశ్యపగోత్రుండును, సగణితరమణీయగుణమణిస్యూతిక్రియానుగుణాయతానవద్యవిద్యానిషద్యాయితవిద్వత్తవికల్పితహృద్యవేద్యగద్యపద్యసూత్రుండును నాపస్తంబసూత్రుండును, నప్రతిమానప్రతీకబలవిజితసార్వభౌముండును మగదలసార్వభౌముండును, నిర్వేలవిభవవిజితపవిత్రుండును నార్వేలకులపవిత్రుండును, సకలజనస్తుత్యపాతివ్రత్యనిత్యాంతరంగమాంబాప్రతిబింబరంగమాంబా మనఃపద్మపద్మబాంధవపద్మనాభప్రధానవతంసనందనుండును దద్జ్ఞానవరతవినుతజ్ఞానసనందనుండును, సతతసత్కీర్తిపరాయణాదినారాయణాదిసోదరుండును కృపాతామరసోదరుండును నగుకృష్ణమంత్రిచంద్రుం డొకానొకనాఁడు కొలువుశృంగారంబై యతిశీతలక్షమాతలోదరీహృదయతలనిదర్శనాయమానమానితయామినీకాంతాకాంతకాంతకాంతవేదికాంతరంబును, నక్షీణయశోహార్యక్షసముత్పాటితానీతహరిదంతవంతావళదంతకర్ణేజపవంతపాంచాలికాసమంచితకాంచనస్తంభసహస్రసంభావితంబును, జామర కళాచికాకనకభృంగారతాలవృంతహాటకవీటికాపేటికాదిధారివధూటికాకోటికాప్రతిబింబాడంబరసచిత్రవిచిత్రనీరంధ్రమణిప్రభానీరంధ్రకుడ్యభాగంబును, నన్యరాజన్యకన్యకాహస్తకమ్రతరసామ్రాణిధూపధూమస్తోమశ్యామభూమాభిరామభ్రమరలలామప్రకామకామప్రదామోదమేదురజలజాతకేతకీసౌగంధికబంధురితవితానప్రతానంబును, జటులతరస్ఫటికపటలప్రకటితసోపానరుచితరంగితాభంగురగంగాతరంగిణీతరంగాంతరంగరంగజ్జలసారంగశృంగారపారంగత మౌక్తికమత్తేభప్రభాసమానోభయపార్శ్వంబును, నూతనతానమానగాయినీగానద్రవమాణవలభీవలభిదుపలజలబిందుసందోహాసందేహదోహళతదంతదంతురతంతన్యమానచంచచ్చంచలాచంచలచామీకరచలదళాంచలసమంచితముక్తామణితోరణంబును, రణాంగణభయానకజయానకాగణ్యధాణంధణ్యాకర్ణనోదీర్ణకర్ణచిత్రస్తలీనమత్సమస్తదేశాధినాథవక్షస్స్థలీవిన్యస్తనిస్తులకస్తూరికాలేపనానురూపముక్తారంగవల్లికాటోపప్రదీపితప్రతిబింబితరూపాజీవికాంభోజనయనాశాతకుంభకుంభకుచకుంభికుంభవిజృంభమాణతారావతారతారతారహారమనోహరప్రాంగణంబును, బద్ధాప్తరుచిపద్మాచ్ఛద్మపద్మరాగసరాగవిటంకానురాగపారావారాపారదృశ్యాపారపారావతారావకూటంబు నగుకొ

లువుకూటంబునం బొడవు కెంపుసొంపునింపువిను కెంపునుడికింపువిడి కెంపురవచెక్కడంపుకడవన్నె పసిఁడిగద్దియనధివసించి, కరివేల్పుముద్దియ చెలంగుముద్దియ యూట పట్టువిరిగద్దియపైఁ బెద్దగొలువుండు తెలిగంటిపెద్దతో నుద్దియై, ప్రచండతరమార్తండమండలంబున నిండుకొలువుండు పుండరీకనయనుని గండుమిగిలి చింతామణిభద్రపీఠంబున సుఖాసీనుం డగునాఖండలు మెండుకొల్లలాడి ధాతుపుంజంబు కెంజిగి రంజిల్లు నుదయగిరినుదయించుపరిపూర్ణపూర్ణిమాచంద్రబింబంబుడంబరంబు విడంబించుచు నోలగంబై పొడగను పాండ్యతుండీరచోళనేపాళగౌళకర్ణాటకరహాటభోటాదిదేశాధినాథులప్రధానులయెడ బహుమానంబును, బైగోవరక్కంగుపారసిమక్కామలాకాదినానాంతర్ద్వీపధరణీపతు లంపినపట్టంపు టేనుంగులు, పట్టుచుట్టలుఁ, బచ్చకప్పురంబు మొదలగుపరిమళంబులుఁ, బడమటిపన్నీరుచెంబులుఁ, బంచవర్ణపుఁజిలుకలుఁ, బటీరతరుఖండంబులు, స్ఫటికపుగిండ్లు, పగడపుఁగోళ్ళపట్టెమంచంబులు, పఱపుగలకుంకుమపుపఱపులు, పసిఁడిప్రతిమలం బోలు పరిచారికాజనంబులు మొదలుగాఁగలుగుకానుకలు గన్గొనుపట్లం బరాకును, వందిమాగధపఠ్యమానబిరుదగద్యపద్యాకర్ణనంబున సలజ్జావలోకనంబును, బాంధవజనంబులయెడ వినయంబును మిత్రులపై ననురాగంబును, భేదాభేదంబులు వాదించువిద్వజ్జనంబులకెల్ల ననుకూలంబుగా నేకోత్తరం బొసంగునెడఁ బాండిత్యంబును, బ్రకృతిపురుషవివేకంబు ప్రసంగించుసాంఖ్యసంఖ్యావత్ప్రసంగంబున నంగీకారంబును, యోగశాస్త్రంబుల ననుభవంబును, దర్కకర్కశోక్తుల దరస్మితంబును, గణాదేశ్వర ప్రతిష్ఠాపనంబున సమాదరంబును, నిరీశ్వరకర్మవాదుల మంగళాచరణాదిప్రసంగంబున సర్వేశ్వరత్వంబు సాధించు మేధావిశేషంబును, నానాదిగంతాగతకవీశ్వరఘటిత నిజనామాంకితబిరుదావళీచక్రవాళభోగావళీత్యాగఘోషణాయత్తగానోదాహరణతారావళీశతకాదికవితారచనావిశేషంబుల రసజ్ఞతయుం, బ్రవీణవైణికవీణాశ్రవణానురాగరాగమేళలయస్ఫురితశిరఃకంపనానువాదంబున నానందంబును, మానికపుఁగంబంబుల దండనుండు చికిలిదంతంపుబొమ్మలాడిగంపుఁజక్కెరబొమ్మ లని యోసరిలు ద్వీపాంతరజనంబుల ముగుదతనంబునకు నగుతమచక్కనినగవు చొక్కపుఁజీనిచక్కెరని సొక్కి మెక్కనుంకించుచు ఱెక్కలార్చుకేళీకాశుకంబుల కుత్సుకంబుగ సుధామధురాధరబింబంబులఁ గూడికొను వారవిలాసినులవిలాసంబు లవలోకించునెడ నుల్లాసంబునుం జెల్వొందం గొలువున్న యవసరంబున. 14

క. నను సంస్కృతాంధ్రభాషా,వినుతు ద్వినైకప్రబంధవిరచనదక్షుం
గనుఁగొని యిట్లని పలికె, స్వినయంబు నయంబు హెచ్చ విబుధులు మెచ్చన్.

సీ. శ్రీరామకరుణారసారూఢసంస్కృతప్రాకృతాద్యష్టభాషాకవిత్వ
తత్త్వసంవేదివి ధరణిదేవుల తిమ్మయామాత్యపౌత్త్రుండ వన్నదాన

ముఖ్యనానాదానముదిత భూసురచంద్ర నాగప్రభానేంద్రనందనుఁడవు
పణియమాంబాగర్భపాథోధిచంద్రుఁడ వాత్మవిద్రఘునాయకాద్యనుజుఁడ
తే. వాపుఁడవు గాన వేఁడెద నంపముగను
గృష్ణునిదశావతారము లృతి యొనర్చి
యంకితముసేయు మాకుఁ బ్రఖ్యాతి నీకు
మహితగుణసాంద్ర రామయామాత్యచంద్ర. 16
వ. అని కనకాంబరాభరణగ్రామబహుగ్రామసమేతంబుగాఁ గర్పూరతాంబూలంబు సమర్పించినం గైకొని కౌతుకతరంగితాంతరంగంబుతోఁ గృతినాయకుని వంశావతారం బభివర్ణించెద. 17
సీ. శ్రీకరవేదాంతసిద్ధాంతవైఖరీపారదృశ్వలు పరబ్రహ్మ మనియు
సృష్టిప్రధానప్రకృతితత్త్వవిజ్ఞానపరులైనసాంఖ్యులు పురుషుఁ డనియుఁ
గ్రతుముఖ్యనిర్మలకర్మప్రవర్తనహితులు మీమాంసకు లీశుఁ డనియుఁ
బంచసంస్కారవద్భక్తిప్రపత్త్యుపంచితపాంచరాత్రులు శేషి యనియు
ఆ. మఱియు ధన్యులయిన మాధ్వు లంతర్యామి, యనియు నెట్టిదేవు నాశ్రయింతు
రట్టిదేవదేవుఁ డాదినారాయణుఁ, డఖిలజనముఁ బ్రోచు నాదరమున. 18
తే. [1]భువనజాతాశ్రయం బౌట భోగిశయను, నుదరతలమున నీరజ మొదవె దానఁ
గలిగె బ్రహ్మరజోయుక్తిఁ గారణాను,గుణము కార్యం బగుట యెట్లొకో గణింప.
తే. బ్రహ్మకు జనించెను మరీచి బ్రహ్మపర్చ, సత్కృతధర్మమరీచిలోచనమరీచి
యతనికుదయించెఁ గశ్యపుఁడనభివిదిత, గోత్రదాయకుఁ డయికులగోత్రధృతిని.
శా. శ్రీమత్కాశ్యపగోత్రవారిధి జనించెం బూర్ణసోమాకృతిఁ
సోమామాత్యుఁడు సత్కళావిలసనాస్తోకావలోకంబు శ్యా
మామోదంబుఁ గలప్రసక్తికమలోదారప్రచారంబు ని
త్యామందప్రమదాశ్రయద్బుధకుమారాసక్తియు న్మీఱఁగన్. 21
సీ. రసమంటె ననుచు నీరసముతోఁడఁ బుటంబు వేయ మేరువుఁ జేరె విశ్వకర్మ
రాయంచఁ దేనెమిరాయం చమర్షియై సాదితో వాదించె షణ్ముఖుండు
నారదకలను గన్నారఁ దర్శింతురే యని తుంబురుని వేఁడె నమరవిభుఁడు
నలువదనంబులనలువొందుశివుఁ డెందుఁ గలిగె నంచు విరించిఁ గనిరి మునులు
తే. మహితమగదలసోమనామాత్యసోమ
రామణీయకయుతకీర్తిరామరుచిర
రుచినిచయ మెల్లదిక్కులఁ బ్రచుర మయిన
భ్రమసి తెలియంగఁజాలక ప్రౌఢు లయ్యె. 22

1 భువనజాతాస్పదం.

క. సోముఁడుగావున గౌరీ, భామినిఁ జేకొనియె ననుచుఁ బ్రజ లెన్నఁగ నా
సోమామాత్యశిఖామణి, ప్రేమంబున గౌరమాంబఁ బెండిలి యయ్యెన్. 23

క. గౌరమ సుగుణావళి బా, గౌరమ మహిమహిళ నగుక్షమాన్విత యయ్యెన్
గౌరమనోహరకీర్తులు, గ్లౌరమ హసియింపఁగా జగన్నుతలీలన్. 24

తే. గౌరియందుఁ గుమారునిఁ గనియె సోముఁ, డౌర యచ్చెరు వని జనులనఁగ సోమ
మంత్రి గౌరమయందుఁ గుమారుఁగనియెఁ, దిమ్మనామాత్యచంద్రు సుధీఫణీంద్రు.

శా. ఏమే జాహ్నవి యేమి రాఘవ యదేమే వైరి నెన్నేవు నీ
వేమీ నానవతిం [1]గణించెద వదేమీ నీవు కాళిందివా
యామే నేటికిఁ దెల్లనాయె జలధీంద్రా తిమ్మమంత్రీశ్వర
శ్రీమత్కీర్తులు గ్రమ్మఁగా ననిన నాశ్లేషించు హర్షంబునన్. 26

క. తిమ్మనమంత్రీంద్రుఁడు లక్ష్మమను వరియించి కనియె నాశ్రితజలరు
ట్సమ్మోదనచాతుర్యర, విమ్మాన్యదయాప్రచారు వేంకటధీరున్. 27

చ. మగదలతిమ్మధీరునికుమారుని వేంకటమంత్రి నెన్నఁ బ
న్నగపతి శక్తుఁ డౌనె తదనారతకల్పితదానవాహినీ
లగనసమృద్ధసస్యఫలలాభములన్ సకలప్రజావ్రజం
బగణితభోగమొంద [2]వృథలోఁ జెలువు ల్దొరవు ల్ప్రావర్షముల్. 28

సీ. అగ్రహారంబుల నలరించె ధారుణీరమణీకుచాగ్రహారములు గాఁగ
దానము లొనరించె ధరణి నిర్జరభూరిదారిద్ర్యహరణ [3]నిదానములుగ
నర్థులఁ బోషించె ససమానచీనిచీనాంబరదానకృతార్థులుగను
బంధుల రక్షించె సింధుబంధుసుతాదృగంతబంధురకృపాబంధులుగను

తే. మంత్రిమాత్రుండె మానినీమానమథన, మదనసమమూర్తి హరిదంతమధురకీర్తి
[4]వినతనృపపాళి మర్దితవిమతపాళి, మహితరుచిహేళి వేంకటామాత్యమౌళి. 29

క. పద్మాధరణుల నేలిన, పద్మాక్షునిలీల [5]వెలసె భాసురతేజ
స్సద్మము వేంకటధీమణి, పద్మాంబిక వేంకటాంబ భార్యలుగాఁగన్. 30

తే. ఔర వేంకటవిభుద్వితీయద్వితీయ, యద్వితీయగుణస్ఫూర్తి నతిశయించి
యద్వితీయేందుహసియించు నలికరేఖ, వశమె యావేంకటాంబ చెల్వంబుఁ బొగడ.

సీ. విబుధేంద్రమాతయై ప్రబలె నాయదితి దాఁ గశ్యపుసంగతి [6]గాంచు టెట్టు
లతిసువర్ణాఢ్యత నందె నాభారతీపతి హయంబులఁ బట్టఁ బనుపు టెట్లు
స్నేహంబు గలిగె నాక్షితిభృత్కుమారి యీశ్వరుతల జడగట్ట నరయు టెట్లు
విభవంబుఁ జెందె నాఋభురాజగేహిని గనుమూయ నెడలేక మనుట యెట్లు

---

1 గణించితివి యేమీ. 2 వితతా. 3 విధాన. 4 విజిత. 5 మెఱసె. 6 'గాంచుదెట్లు; వసుపుదెట్లు' అనియుఁ గలదు.

తే. మతము గాదిది విబుధేంద్రమాత యనిన
నతిసువర్ణాఢ్య యనిన స్నేహావతి యనిన
విభవవతి యన్న మగదలవేంకటాంబ
గాక యితరల కెవ్వి యీగౌరవములు. 32

క. ఆవేంకటాంబగర్భసు, ధావార్ధి జనించి రమరధరణీరుహాసు
శ్రీ వెలయఁగ నేగురుసుతు, లావిర్భావాదివితరణాన్వితు లగుచున్. 33

ఉ. తిమ్మన వీరరాఘవసుధీమణి కేశవమంత్రి దాతృతా
హమ్మతి పద్మనాభసచివాగ్రణి నారణశౌరి వారిలోఁ
దిమ్మన పాండితీగతి నుతింపఁగ శక్యమె భోగివల్లభుం
గిమ్మనఁడు వాదములకే చనుదెంచిన యుక్తిశక్తులన్. 34

సీ. సంగీతపుంభావశారద సాహిత్యతత్త్వాద్యతనకాళిదాసుఁ డతుల
వితరణైదంయుగీనతపనతనయుండు [1]భూతదయాధృతభూతలుండు
భక్తిప్రహృష్టనాభాసరోజుఁడు శాశ్వతైశ్వర్యపాకౌక్షతాద్రిసుతుఁడు
దిక్కూలముద్రుజదేదివర్ధనకీర్తిజాగ్రద్విషంతపశౌర్యశాలి
తే. వీరవేంకటపతిరాయవిభువతంస, భావితోభయచామరభద్రదంతి
దంతపల్యంకికాదిసన్మానఘనుఁడు, ధీమరున్మంత్రి మగదలతిమ్మమంత్రి. 35

ఉ. తిమ్మనమట్ల తేనియలు తేరగఁ బల్కఁగ నేర్చు బంధుజా
తిమ్మనఁజూచుఁ బ్రోచు నతిథిప్రకరమ్ములఁ నైగటభాభియా
తి మ్మనసారఁ గొల్చునతిధీరత వేంకటమంత్రిపుత్త్రుఁడౌ
తిమ్మనమంత్రి పాటిజగతీస్థలిలోపల మంత్రి గల్గునే. 36

తే. అట్టితిమ్మనమంత్రి వెంగాంబయందుఁ, గనియెఁ దిరువేంగళాంబనాఁ గన్యఁ క్ష్మీ
చెలువునను శ్రీనివాసార్యుచెట్టపట్టి, [2]కనియె నాదెప్ప రంగప్ప ననఘమతుల.

తే. వీరరాఘవమంత్రికి వీరరాఘవుండె సరిగాక ధర మానవుఁడు సరియె
శౌర్యగాంభీర్యసౌందర్యసౌకుమార్య, కార్యచాతుర్యధుర్యతౌదార్యములను.

మ. తరమే వేంకటమంత్రి కేశవుమహోదారత్వ మెన్న స్థిరం
తరముం దాసజనైకవర్షకఘనానందం బతం డొందఁగాఁ
బరమంత్రీశ్వరకీర్తిహంసికలు విభ్రాంతంబులై యేడకో
యరిగె న్మానసవాసముం గనక యత్యాశ్చర్య మౌనే కదా. 39

సీ. మాననీయనరేంద్రమంత్రాచరణవేళ ఫణినాయకుఁడు తడఁబడకయున్న
విబుధవల్లభసభావిద్యాప్రసంగతి గురుఁడు చార్వాకంబు గోరకున్న
నతిశయాళుతఁ గాంచునవసరంబున బ్రహ్మ యాగమపాళిఁ బోనాడకున్నఁ
దత్త్వవివేకచింతనవేళఁ బురవైరి సర్వజ్ఞగతిని గాంచకయె యున్న

1 భూసురత్రాకృతభూమితలుఁడు. 2 గనియె రంగప్ప నాదెప్ప.

తే. సాటి యనవచ్చు మగదలశాసనాంక, వేంకటామాత్యమకరాంకపంకరహిత
పంకజగృహాజనకనిష్కలంకపూర్ణ, చంద్రునకుఁ బద్మనాభసుధీంద్రునకును. 40

సీ. ప్రతిఘటించిన నెంతబలవంతులను బటాపంచగాఁ దతిమించుప్రౌఢిమంబు
సమ్మితి మన్న నెంతటివరిద్రుల నైన శ్రీలచేఁ జెల్వొందఁజేయుకరుణ
మతభేద మన్నచో మతిమంతు లౌనన నైకమత్యము సేయునలఘుబుద్ధి
వలయునటన్న భూవరుల చెంగటఁ గార్య మెంతయైనను నిర్వహించు నేర్పు

తే. విద్య వినయంబు తాదృశవిభవమునను,శాంతి యేపట్ల ధైర్యంబు సరసమృదుల
భాషణంబులుఁ గల్గి వైభవముమీఱఁ, బ్రబలు మగదలపద్మనాభప్రభుండు. 41

సీ. మంత్రీశ్వరుఁడు గాన మాళిపై వలగొన్న భాగీరథి యనంగఁ బాగ దనర
రామకథాసుధారసము బుగ్గలఁబోలి కట్టాణిగొప్పచౌకట్లు మెఱయఁ
గనకంబుఁ గెలుచునంగంబు తేజములీల నేకరంగికబాయి యింపుగులుకఁ
బైకొన్న యాదిమప్రభులకీర్తులరీతి వలిపెపై ఠాణిదుప్పలువ వెలయ

ఆ. గుణములనుబోలి వృత్తానుగుణము లయిన,కంఠమాలికముత్యాలకడియములును
మొదలుగాఁగల భూషణంబులు వెలుంగఁ, బ్రబలు మగదలపద్మనాభప్రభుండు.

సీ. అపరిహాస్యంబుగా నన్యమతంబులయందు శంకఘటించునౌఘళంబు
నలరామకథల పాయసవిభాగంబుల నేకరీతిగ నిర్వహించుపటిమ
జీవకర్మానాదిభావ మీశ్వరసమత్వము గ్రమంబునఁ దెల్పు తత్త్వసరణి
ఘనభర్తృహరిశతకత్రయంబునఁ బ్రతిశ్లోకంబునను వింతఁజూపు సొబగు

తే. మఱియుఁ జాటువులందు రామాయణాది
బహువిధగ్రంథములయందుఁ బ్రాజ్ఞులెన్నఁ
బూర్వసిద్ధాంతపక్షము ల్వ్యాసఁగఁ జేయు
భళిర మగదలపద్మనాభప్రభుండు. 43

సీ. దరముతోఁ దుహినకందరముతో గిరిశనూపురముతోఁ బచ్చకప్పురముతోడ
రసముతో ధవళసారసముతో శివమహానసముతో సుషితమానసముతోడ
శరముతో మరుజాజిశరముతో ముత్తెలసరముతో దేవతాసరముతోడ
భవునితో నజతనూభవునితో రేవతీధవునితోఁ గుముదబాంధవునితోడ

తే. దోడునీడయి క్రీడించు వేడుకలరఁ, బ్రౌఢగావున మగదలపద్మనాభ
సచివమూర్ధన్యబహుదానజాయమాన, కీర్తికాంతాలలామ దిగ్విజయధామ.

చ. మగదలపద్మనాభునిసమస్తగుణవ్రజముం గణింపఁగా
నగణితమాట నూరకగుణాకరుఁ డంటిని దొంటివారలుఁ
సగుణుఁడు పద్మనాభుఁ డని సన్నుతిసేయుటె కాని తద్బహు
ప్రగుణగుణంబులు న్వరుసఁ బాయక యన్నియు నెన్న నేర్చిరే. 45

తే. జలధిమధ్యస్థుఁ డాతఁడు జలధితీర, వాసియితఁ డనునొకమాటవాసి గాక
పద్మనాభుండు మగదలపద్మనాభుఁ, డఖిలలోకావనమున నన్యోన్యసములు. 46

ఉ. [1]కోసలరాజకన్యక యె కుంభినిలోపల వేంకటాంబయై
భాసిలఁ బద్మనాభుఁడయి ప్రాగ్ర్యఘువీరుఁడు పుట్టెఁ గానిచో
మాసము తార లగ్నము సమస్తశుభగ్రహవీక్షణంబు లొం
డై సరివచ్చువేళ నుదయంబగునో విబుధాళిఁ బ్రోచునో. 47

మ. ధనదోదారుఁడు పద్మనాభ సచివాధ్యక్షుండు పక్షంబుతో
ననఘాత్యుత్తమదొడ్లప్రత్తికులజుం డైనట్టిధర్మప్రథా
నునికాసూత్షమకుం జనించి బుధరాణ్ణుత్యస్ఫురల్లక్షణా
వనియా రంగమఁబెండ్లియాడె మహితైశ్వర్యం బవార్యంబుగన్. 48

సీ. పతిభక్తిచే నరుంధతి యుద్ది యనవచ్చుఁ దను ప్రేలఁజూపించికొనకయున్న
దాక్షిణ్యమున శైలతనయ జోడనవచ్చు నీశవిగ్రహమున నెనయకున్న
క్షాంతిచే ధారుణి సరి యనవచ్చు ధాతనుజేరి మొఱపెట్టుకొనకయున్న
మతిమహత్త్వమున భారతి సాటి యనవచ్చుఁ బ్రజలనోళ్లకు నెల్లరాకయున్నఁ
తే. గాక యితరధరాతలకాంత లెనయె, యంచు జనులెంచ నంచితోదారసుగుణ
మణిగణంబుల కెల్లయై మనుముఖాబ్జ,రచితశశిబింబ మగదల రంగమాంబ. 49

సీ. ఏసాధ్వి [2]పెరటిలోనెలదోఁటఁగని వజ్రినందనవని నిందనం బొనర్పు
నేయంబపెండ్లిండ్ల కిప్పింపఁగా బ్రహ్మచారులు కఱవైరి జగతిలోన
నేతల్లి వడ్డింప నింపుతో భుజియించు జనులకు మాతృవిస్మరణ మొదవు
నేయమ్మ దయఁ బాలువోయింపఁబురబాలురాయురారోగ్యభాగ్యములు గాంతు
తే. రట్టిలోకైకపావని యఖిలవిమల,గుణకలాపావని తటాకకోటిభాగ
సుప్రతిష్ఠితపావని క్షోణి వెలయు, రక్షితమహీసురకుటుంబ రంగమాంబ. 50

ఉ. శ్రీయలమేలుమంగవలెఁ జెన్నగురంగమగర్భవార్ధిచం
ద్రాయితవేంకటేశసచివాగ్రణికృష్ణసుధీవరుండు నా
రాయణమంత్రిశేఖరుఁడు రామవిభుండును వేంకటేశుఁ డ
త్యాయతకీర్తిశాలు లుదయింబయి రాశ్రితకల్పశాఖులై. 51

సీ. శ్రీవరేశ్వరులకుఁ గోవెల లూరూరఁ గట్టించె నేమంత్రి ఘనత మెఱయ
నాకాశిసేతుమధ్యస్థపుణ్యస్థలుల్ సేవించె నేమంత్రి శివి వెలయ
ఖ్యాతికెక్కఁగ దీర్ఘికాతటాకంబులు త్రవ్వించె నేమంత్రి తలఁచుగాఁగ
సకలమార్గంబులఁ జల్లగా వనములు వేయించె నేమంత్రి వేడ్క మీఱ
తే. నతఁడు చెలువొందు నన్నదానాదిసకల,దానవిద్యాపరాభూతధనవిభుండు

1 కోసలరాజనందనయొ. 2 పెరటియొలదోఁటఁ.

నూత్న దేదీప్యమానభానుప్రభుండు, నవ్యవిభవుండు నారాయణప్రభుండు. 52

సీ. అతనుండు మొదల బ్రసాపూకారుఁ డౌటచేఁ జెలువంబునను సాటిసేయరాదు
గురుఁడును సర్వలఘుత్వ మొందుటఁజేసి యాయతమతి సాటిసేయరాదు
రవిఁగడపట వివర్ణంబుగాంచుటఁజేసి స్థిర తేజమున సాటిసేయరాదు
శారదాబ్దం బపశబ్దం బగుటఁజేసి చిరకీర్తితో సాటిసేయరాదు

తే. సాటియే నేఁటి యొకపాటిసచివకోటి, వైరిగిరిశతకోటికి వచనవిభవ
భవతులాకోటికి వితీర్ణిపాండితీని, నస్తచింతామణికి నా నార్యమణికి. 53

మ. అగధీరుం డగునారనార్యుఁ డపురా యాసానబూదూరిలోఁ
దగవిశ్వేశ్వరు నన్నపూర్ణ నటచెంతం డుంఠి విఘ్నేశ్వరు
న్నిగమస్తుత్యుని క్షేత్రపాలు మణికర్ణిం గల్గఁగాఁ జేసె విం
తగ సాధుల్ఫలదాత్రి భావనయ కాదా యంచుఁ గీర్తింపఁగన్. 54

సీ. వనిలోన స్త్రీమాట విని యన్న కొకవంత దెచ్చినలక్ష్మణదేవుఁ దెగడి
తనవింటిబ్రద్దఁ దిట్టెనటంచు నగ్రజుదూషించినట్టి పార్థుని హసించి
యన్నపక్షమువారి నటుడించి తానొకపక్షమౌ పుండరీకాక్షు నవ్వి
మునుదా గురుద్రోహమునకు లోనై యగ్రభవునకుఁ జేర్చిన లవుసఁ దెగడి

తే. హర్ష మొసఁగుచు మాఱుమాటాడ వెఱచి
యన్నపక్షము దనపక్షమై చెలంగ
బహుళసుకృతంబు లొనఁగూర్చి ప్రబలుఁ బద్మ
నాభునసుజుండు నారాయణప్రభుండు. 55

శా. ఆనారాయణమంత్రిశేఖరుఁ డమిత్రాంభోదపాళీజగ
త్ప్రాణుండౌ కురుగోటిమాధవయకు న్రామక్కకుం బుత్రియై
తోనం దిమ్మయవీరరాఘవముఖుల్ దోఁబుట్టులై వర్తిలన్
శ్రీనారీమణిఁబోలు వెంకమ వరించె న్వేడుక ల్మించఁగన్. 56

తే. అసము వాసగంగ మఱియు రాయసము చెలవ
యార్యమౌళికి నారాయణమ్మ కాత్మ
జాతయైనట్టి నరసమ్మ సమతమించు
మమతవరియించె నారనామాత్య విభుఁడు. 57

సీ. తనయాశ్రితుల సంపదలఁజూచి ధనభర్త ధనవాంఛ శివుఁగూర్చి తపము సేయఁ
దనవిలాసము గనుంగొని సీటువెట్టెడు సూనాస్త్రురతియను చుక్కరనఁగఁ
దనదానజలవార్ధిఁ గనియుల్కినయగస్త్యుఁ గడలఁ దాపసుల కేరడములాడఁ
దనవైభవమునుజూచినవారలింద్రుఁ డం చొరులతోఁ బన్నిదం బూనికొనఁగఁ

తే. ప్రబలు దేశాధినాథనబాబుసాహి, బూవితీర్ణ సువర్ణజాంబూనదాంబ
రాసమగ్రామబహుమానభాసమాన, నవ్యవిభుఁ డాదినారాయణప్రభుండు. 58

సీ. నీరాకరము లెల్ల క్షీరాకరము లయ్యెఁ దటినులు గీర్వాణతటిను లయ్యె
ధేను లెల్లను గామధేనువు లయ్యెను మ్రాఁకులు దెఱగంటి మ్రాఁకు లయ్యె
నగము లెల్లఁ దుషారనగము లయ్యెను బన్నగంబులు దొలిపన్నగంబు లయ్యె
మును లెల్ల నారదమును లైరి గగనవిహారులు భుజగేంద్రహారు లైరి
తే. యెవారి మగదలవంశరత్నాకరాధినాథచంద్రాదినారాయణప్రధాన
చంద్రనిస్తంద్రతరకీర్తిసాంద్రరుచులు, మించి లోకత్రయంబాక్రమించుకతన.
తే. అనఘుఁ డయ్యాదినారాయణార్యమౌళి, ఘనుఁడు రాచూరి వేంకటేంద్రునకుఁ గోన
మకును సుతయైన తిమ్మాజమను వరించి, కనియె భాస్కరదాసాదితనుజమణుల.
ఉ. హాటకదాతయౌ మగదలాధిపకృష్ణునిదానవాహినీ
ఝూటము చేత నుబ్బుచును సర్వజనస్తవనీయత న్నిరా
ఘాటగభీరతాగుణము గాంచిన స్రుక్కుచునుండఁగాఁ జుమీ
పోటును బాటునంచు జనము ల్గణియింతును వారిరాశికిన్. 61
తే. గరిమ నఱువదినాలుగుకళలఁ బొసఁగి, యెసఁగు మగదలకృష్ణమంత్రీంద్రవదన
మునకుఁ బదియాఱుకళలచేఁ దనరునబ్జమండలము జోడె పాదాభ నుండుఁగాక.
సీ. అమరంగఁ దా నంబరము గప్పుకొను నట్టు కవులకీయఁడు మేఘఘనత యెంత
తాను రత్నోర్మికల్దాల్చు నెవ్వనికీఁడు పాథోధినాథుని ప్రభుత యెంత
గంధంబు గను నొసంగదు ద్విజశ్రేణికిఁ గల్పవృక్షము కల్పకత్వ మెంత
సుమనోవతంసమౌచును బుణ్యజనుల కీ దనిమిషేంద్రమణిరాతన మదెంత
తే. భువిఁ జతుర్విధశృంగారములు సమిత్ర, బంధుకవిధీరజనము గాఁ బొగడిమీఱఁ
బూను మగదల కృష్ణప్రధానభాను, నిరుపమౌదార్య లీల వర్ణించు వేళ. 63
మ. తలపం గర్ణుఁ డపార్థదాతయె యపాత్రత్యాగిమూర్ధన్యుఁ డా
బలి వ్యర్థంబగు గల్పకంబు ఫలియింప న్మేఘుఁడుం దారవో
తలమాత్రంబు ధనంబొసంగఁడు గదా తద్దానము ల్మెత్తునే
యలఘు ప్రౌఢిమఁ బద్మనాభఘను కృష్ణామాత్యుఁ గీర్తింపుచోన్. 64
సీ. రాజరాజసుహృద్ధరాజరాజముఖివిరాజరాజన్ముఖ ప్రభల నేలి
పారిజాతకపాదపారిజాతరిపుద్విపారిజాత[1] శ్రీలఁ బ్రతిఘటించి
హారికాండగంగాలహరికాండజకులేంద్రహరికాండదీప్తుల నతకరించి
ఘనసారశారదఘనసారసజవాహఘనసారకాంతులఁ గడకుఁ దఱిమి
తే. కలశజలనిధిహాలధరజలజతుహిన, విమలమలయజసురగజవిశదకమల
కుముదసముదయధవళిమ రమణఁ దాల్చి, యెసఁగె మగదలకృష్ణమంత్రీంద్రుకీర్తి.
సీ. తల్లిదండ్రులు ముకుందద్రోహు లంచును బాథోధిలోపలఁ బ్రభవమొంది
పాథోధిలోపలఁ బ్రభవింపఁ బంకజాతావాసయై క్షితి నవతరించి

1 శ్రీలనవఘళించి.

క్షితిజయై పతివివాసితయాట వలన వైదర్భభూవిభున కావిర్భవించి
వైదర్భియై మహీవరుల సన్నిధిని గోపాలకబాలకాపహృత యగుచు
తే. వెనుకఁ దపములచేఁ గొండవీటి సిద్ధి,రాజఘనుకనకాంబగర్భమునఁ బొడమి
కృష్ణనిభుఁడైన మగదలకృష్ణవిభునిఁ,జేరి కొదలేక తనరు లక్ష్మమ్మగాత్రి. 66
తే. గుణసముద్రుండు గణుతింపఁ గొండవీటి, సిద్ధిరాజేంద్రుఁ డెల్ల నళీతకరుఁడు
లక్ష్మి లక్ష్మమ్మ సౌభాగ్యలక్షణములఁ, గృష్ణదేవుఁడు మగదల కృష్ణవిభుఁడు. 67
ఉ. నారదమౌని యేమిసురనాథ విశేషములేమి వింటిరో
సారసగర్భుచెంగటను శారద లేదఁట యెందు నిల్చెనో
యారసిచూడుఁడా మగదలాన్వయదుగ్ధపయోధిరాజమం
దారము కృష్ణమంత్రిరసనాస్థలి నిల్చెను యుక్తమే కదా. 68
సీ. శ్రీవిరాజితుఁడైన సిద్ధిరాజేంద్రుఁడు శ్రీకృష్ణదేవుని చెలువు గుల్క
ననిశంబు రుక్మిణియై మించుకనకాంబ భోజమహీరాజుపుత్త్రిఁ బోలఁ
గులరూపసౌభాగ్యగుణములఁ బెద్దయా కోనాంబ రతిదేవికోవుచూప
[1]నాశ్రితదోషాపహరుఁ డైనయెల్లన యనిరుద్ధవిఖ్యాతి ననుసరింప
తే. భామినీజనమోహనాంబకవిలాస, వైఖరులఁ గాంచి మన్మథువలెఁ జెలంగుఁ
గొండవీటికులాంభోధికువలహితుఁడు, మత్యహీశ్వరుఁ డెల్లనామాత్యవరుఁడు.
సీ. శ్రీరామచరణరాజీవకైంకర్యతత్పరరంజనుఁడు రామదాస ఘనుఁడు
దాక్షిణ్యనైపుణ్యరక్షితానేకసత్కవితంత్రి శంకరదాసుమంత్రి
యనవద్యహృద్యవిద్యాప్రౌఢిఁ బద్మగర్భనిభుండు బద్మనాభప్రభుండు
నలకూబరజయంతనలవసంతలతాంతసాయకాకృతి రంగశాయిసుకృతి
తే. వివిధరాజద్గుణకదంబ వేంకటాంబ,నుత్యనయశాలి రఘుపత్యమాత్యహేళి
ధన్యజనమాన్య సీతాభిధానకన్య,జనన మొందిరి కృష్ణధీసచివమణికి. 70
సీ. దేవిదేవరఁ బాలిశీవిష్మై వర్ధిల్లి తల్లిదండ్రియు సంతతంబుఁబ్రోవ
శ్రీరామునను సరించిన లక్ష్మణునిభక్తి సహజుండు సౌభ్రాత్ర సరణి నెఱప
హరినిఁ జెందినలక్ష్మి కరణి సద్ధర్మిణి చిత్తానుగుణలీలఁ జెలువుచూప
జలధిసంతానంబునలువున నౌదార్యకలితమైపుత్త్రవర్గంబు మెలఁగ
తే. నల్లశోభరినడవడి నైమనవీని,కెనయెయంచు జగజ్జనంబెల్లఁ బొగడ
సిద్ధసంకల్పుఁడై సుఖశ్రీలవెలయు, జిష్ణువిభవుండు మగదలకృష్ణవిభుఁడు. 71
సీ. చంద్రికపూవన్నె జిలుగురుమాలుపై జాతిమిన్నుల తురా చౌకళింప
నగుముద్దుమోమున మృగనాభి తిలకంబుగులుకుడాల్నిరులుముంగురుల నెరయఁ
దళుకుఁగిరీటిపచ్చలకు జోడై తేట నునుపాలకాయ యొంటులు పొసంగఁ
గమికెందుముత్యాలకంఠమాలికఁగూడి నీలంపుదుమ్మెదతాళి మెఱయఁ

1 నాశ్రితోషాకరుం డగుచిన్నయల్లన.

తే. గుందనపుఁదళ్కు నెఱపూఁతగంద మమరఁ
దగటుఁచెలుగులఁ జెంగావి సొగసుఁజూపఁ
జిల్కుసామ్రాణి తేజివజీరుఁ గేరు
కృష్ణమంత్రీంద్రుచెలువు వర్ణింపఁదరమె. 72

షష్ఠ్యంతములు.

క. ఈదృశగుణహారునకును, దాదృశనయమార్గసంతత విహారునకున్
స్త్రీదృఙ్నవమారునకున్, సౌదృగ్జనవినుతభక్త్యజకుమారునకున్. 73

క. ధీరునకుఁ గీర్తిఘటజల, ధీరునకుభుజప్రతాప ధృతసర్వవిరో
ధీరునకుఁ బాలితాఖిల, ధీరునకు సుధారసోన్నతిధీరునకున్. 74

క. సకలకలాపావనునకు, సుకవికలాపావనునకు శ్రుతిచాతుర్య
ప్రకలితధీరక్షణునకుఁ[1], బ్రకటితధీరక్షణునకుఁ బద్మాక్షునకున్. 75

క. ధృతిబందీకృతనానా, క్షితిధరశంకావిధాయిశృంఖలితమదో
న్నతగజపూర్ణాంగణునకు, రతిరాజ సమానరూప రమ్యగుణునకున్. 76

క. చరణానతశరణాగత, భరణాత్తవత్సలత్వపాత్రునకు సదా
భరణాయితకరుణాయుత, తరుణాయత విమలకమల దళనేత్రునకున్. 77

క. మగదలకులధన్యునకున్, జగదేకవదాన్యునకు ద్వీపద్ధరణీభృ
ద్దిగధిపమూర్ధన్యునకున్, జగతీమాన్యునకు వినుతసౌజన్యునకున్. 78

క. భద్రశ్రీమిహికాదిమ, భద్రశ్రీవరకరాబ్జఫణిప బిడౌజో
భద్రశ్రీకంధరబల, భద్రశ్రీ నిధియశోవిభవభద్రునకున్. 79

క. ఇంద్రశిలాతంద్రకళా, సాంద్రవిలాసాఢ్యకనకసౌధోన్నతికిం
జంద్రమణీరుంద్రఘృణీ, చంద్రతృణీకరణచంద్రశాలాతతికిన్. 80

క. మంత్రియుగంధరునకుఁ బర, [2]మంత్రిక్షతాంతునకు దివిజమంత్రినిభునకున్
మంత్రిశరచ్చంద్రునకు, స్మంత్రిమృగేంద్రునకుఁ గృష్ణమంత్రీంద్రునకున్. 81

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నేరచియింపంబూనిన రసికజనకంఠాభరణశ్రీకృష్ణ
దశావతారచరిత్రమహాప్రబంధపవిత్రముక్తాదామంబునకు విచిత్రకథా
సూత్రం బెట్టిదనిన. 82



1 అకలంకయశోవిరాజితారాధ్యునకున్. 2 మంత్రివిశాఖునకు.

# దశావతారచరిత్రము.



## కథాప్రారంభము.



రమణాంగుష్ఠశిఖరీంద్రమథితావరణపయోధిజసుధారస మనంగ
భువనరక్షణసదాశివసిద్ధయోగీంద్రసంభృతసిద్ధరసం బనంగ
భూరిమేఘాళివిస్ఫుటపత్త్రపుష్కరాళిందపూరితమకరంద మనఁగ
ధరణీవధూమహీధరపయోధరభాగలక్షితక్షౌమచేలం బనంగఁ

తే. దనరు గంగాతరంగిణీతటమునందు, వెలయుఁ ద్రిభువనవిఖ్యాతవిభవవిజిత
దేవతాపురభోగవతీపురక్షు, మాపనానాపురము హస్తినాపురంబు. 83

శా. క్ష్మారామామణిహారవల్లు లన గంగాకుల్య లేపార ము
క్కారుంబందుఁ బ్రశస్యసస్యములు రంగద్భీష్మసూక్షీరపా
నారూఢోత్తమసత్త్వహస్తిహయముఖ్యంబు ల్దగు న్జాహ్నవీ
తీరావాసపవిత్రులై ప్రజలు నెంతే మింతు రప్పోలునన్. 84

ఉ. అప్పురిగొప్పయుప్పరిగలందు వసించిన ముగ్ధకాంత లే
యొప్పెడిచందమామ కిది యొప్పునె తప్పని పైఁటకొంగులం
దప్పక రాచిచూచి తమునవ్వెడి ప్రౌఢలహాసకాంతులే
యప్పుడుఁగప్పఁ గప్పినఁ గృతార్థులమంచు హసింతు రెంతయున్. 85

చ. ఎలమి విమానమెక్కి చరియించుచు నంబర వీథిఁ దెచ్చుకో
లలుకను రంభవచ్చి పురమండలి మేడలపైఁడిబొమ్మలం
[1]గలసియటూరకున్నఁ గలఁక న్నలకూబరుఁ డేమి నేరమే
పలుకవె యంచు బొమ్మచెయిపట్టిన రంభనగుం గిలాకిలన్. 86

చ. శతమఖువారణేంద్ర మతిశక్తి నిజాకృతిఁజూచి కొమ్మలక్ష
రతనపుఁగోటఁగ్రుమ్మినను రాలెడుకెంపు లగడ్తలోఁ బడం
జతనముమీఱ నెత్తి కడుసంతస మొప్పఁగ నెత్తిఁబన్నగ
ప్రతతులు దాల్చుఁగాక మఱి పాములకేడవి జాతిరత్నముల్. 87

ఉ. పట్టణమధ్యభాగపరభాగమణీమయమందిరంబులం
గట్టినటెక్కెపుందు వలు గాడఁగ బెజ్జముపుట్టెఁ దమ్మిపూఁ

---

1 గలుసుకయూరకున్నఁ.

జుట్టుములోనఁ గానియెడ శూరులు నాకముఁ జేరఁ బోవఁగాఁ
బుట్టుటయెట్లు తోఁచు పరిపూర్ణదినేశ్వరమండలంబునన్. 88

చ. శుకముఖ్యద్విజకీర్ణ తత్పురవనక్షోణీజపాళీఫల
ప్రకరస్యందిరసైకతుందిలితమై పాథోదబృందంబుధా
త్రికి వర్షించును గాక యున్న లవణాబ్ధి న్నీరముల్ గ్రోలివా
ర్షుకము ల్దియ్యనినీరముల్ గురియునే చోద్యంబుగా కెయ్యెడన్. 89

సీ. ఒకవటుండేచాలు సకలంకవేదశాస్త్రనిరూఢి బ్రహ్మ నధఃకరింప
నొకరాసుతుఁడె చాలు నుద్వేలశక్తి దిక్పాలురఁ గదిమి కప్పములుగొనఁగ
నొకవైశ్యసుతుఁడెచా లురుసంపదలధనాధిపునాదిభిక్షుమైత్రికిని జూనుప
నొకశూద్రసుతుఁడె చా లుర్వీతలంబెల్ల బహుసస్యమయముగాఁ బయిరుసేయ

తే. నొకరథముసాలుఁ గనకాద్రి కొద్దుసూప
నొకగజము చాలు దిక్కరిప్రకర మెదుర
నొకహయముసాలు రవిహయాత్యుద్ధతిఁ గన
నొకభటుఁడె చాలు రుద్రుతో నోరయ నచట. 90

చ. ఎక్కడు మోహదృష్టి రతినిచ్చఁ దలంపక వచ్చి వేఁడినం
జక్కనివాఁడు గాఁడనుచుఁ జక్కెరవిల్తుని మెచ్చ రన్నచో
నక్కడి వారకామినుల యందము వారి విటాళిచందము
న్నిక్కము సన్నుతింప నలసీరజగర్భున కైనశక్యమే. 91

గీ. అప్పురంబున కధిపతి యై ధరిత్రి, పాలనమొనర్చునే కాతపత్రముగను
భామినీజనమోహనపారవశ్వ, మ్మృదులతనుమేజయుఁడు జనమేజయుండు. 92

చ. ప్రతిదినముం బ్రభాతమునఁ బాఠకగీతుల వీతనిద్రుఁడై
క్షితిసురపాళితో నరిగి చెంతఁ బొసంగెడి గంగలో సమం
చితమతి నిత్యకృత్యము లశేషముఁదీరిచి గాంగపంకజ
ప్రతతులఁ బూజసేయు నరపాలుఁడు కృష్ణు నభీష్టదైవమున్. 93

తే. ఆమహీపతి యొకనాఁ డహర్ముఖంబు, నందు నెప్పటికరణి జాహ్నవిని నిత్య
కృత్యములుదీర్చి నగరికి నేగుదెంచి, కొలువుసింగారమై కంతుచెలువు మెఱసి.

సీ. నిండుఁగొల్వునను కూర్చుండ ధర్మజుతోడఁ గార్యము దెలిపెడిగౌరవంబు
దుర్యోధనాదు లాందోళమొందఁగ విశ్వరూపంబు సూపెడుప్రోడతనము
సంగరంబున ధనంజయరణస్థాయియై ధవళాశ్వములఁ బట్టుదంట తనము
వైరాటిసూతికాద్వారంబునను జక్రహస్తుఁడై గాచిన యట్టి మహిమ

తే. తెలియ శ్రీకృష్ణమూర్తిఁ జింతించినట్టి, కొలువుకూటంబులోపల నలువుమీఱ
భద్రపీఠికఁ గొల్వుండెఁ బాండవాన్వ, యుండు జనమేజయక్ష్మాఖండలుండు.

వ. అయ్యవసరంబున. 96

శా. శ్రీశంపాయతలోచనారమణచారిత్రాపగాసంభవ
శ్రీశైలంబగుధాతురాగజటలుఙ్ శృంగారనిష్యందనీ
కాశప్రక్రియ జన్నిదంబు లతివక్షస్స్ఫూర్తిశోభిల్లఁగా
వైశంపాయనుఁ డేగుదేర భవనద్వారంబునం జూచుచున్. 97

క. దౌవారిక వరుఁడొక్కఁడు, వేవేగ న్వచ్చి విన్నవించిన గురునిం
దేవేంద్రుఁ డెదురుకొనుగతి, భూవరశాసనుఁడు వినయమున సత్వరుఁడై. 98

సీ. సౌవిదల్లులు చేరిసముఖాయనఁగగద్దె డిగునంతలోన దుంపీరుఁడిడిన
నెఱిమించుచండనన్నియచెక్కడపు బొమ్మ చికిలిదంతంపు పాదుకలు దొడిగి
పాండ్యుఁ డడ్డముపట్టు పావడ ముఱుఁగున లాటభూభర్త గాళాంజివ్యూన
గండూష మొనరించి కర్ణాటపతిచేతి పావడం దడియొత్తి పసిఁడిసరిగె
తే. చలువదుప్పటిపలెవాటు వెలయ రాజ,సమున నెదురేగి యల్లంతసంయమీంద్రుఁ
గాంచి కైదండయును బాదుకలును వదలి,హర్షభయభక్తివినయంబులతిశయిల్ల.

క. గోత్రప్రవరలు నొడువుచు, గోత్రేంద్రుఁ డురోవిలిప్తకుంకుమపంకా
చిత్రితధాత్రీతలుఁడై, తత్రభవన్మౌనిరాట్పదంబుల కెరఁగెన్. 100

సీ. రాజితాష్టాంగవజ్రచ్ఛటాచకచకల్ పొదలిప్రత్యౌళ నాంబువులు గాఁగఁ
గమనీయతరమౌక్తికశ్రేణిధళధళల్ నవకుందసుమపూజనంబు గాఁగ
నిర్దోషనీలమాణిక్యాళినిగనిగ ల్మంజుళధూపధూమములు గాఁగ
రమణీయతరపద్మరాగ ధగద్ధగ ల్నలువొందు నీరాజనంబు గాఁగ
తే. భ్రమరఘుంటారవాన్విత ప్రసవదామ, సుమరసం బుపహారమై సొంపునింప
మనుజపతికన్న మున్ను దన్మౌళిమాళి, మానిమాళికిఁ బూజావిధాన మొసఁగ.

చ. "శ్రీరస్తుక్షితినాథ తే" యని మునిశ్రేష్ఠుండు దీవింపఁగా
నారాజన్యుఁడు లేచి [1]సంభ్రమముతో నమ్మౌనిచూడామణి
న్రారాజన్మణిపీఠిపై నునిచి యర్ఘ్యంబు బాదియౌ పూజచే
నారాధించి ప్రహృష్టమానిఁ గని ధన్యం మన్యచిత్తంబునన్. 102

మ. వ్రతితిలకా భవత్పదపరాగము సోఁకఁ బవిత్రమయ్యె నా
యతనము మిమ్ముఁగొల్వఁగఁ గృతార్థుఁడనైతి ఫలించె నింక నా
యతనము లెల్ల నాంతరతమోపహసూరులుగారె మీరు సం
తతశుభదాయకంబులు గదా మహదాగమనంబు లెయ్యెడన్. 103

మ. శతవర్షంబు లరోగదివ్యతనులై సామ్రాజ్యసంపన్నులై
సుతులంబౌత్రుల మిత్రులం గని కడుఙ్ శుద్ధాత్ములై యంచనా
హతమౌ మోక్షము గాంచనేది సులభోపాయంబు నాకానతి
చ్చి తగఙ్ ధన్యునిఁ జేయు మీ చరణము ల్సేవింతు మౌనీశ్వరా. 104

[1] సమ్మదముతో.

తే. అనినఁ జిఱునవ్వు నవ్వి యమ్మునివరుండు, ధ్యారమణ యైహికాముష్మికంబు లింత
సులభములె యైన వినిపింతుఁ దెలివిగాఁగ,నప్రమత్తుఁడవై విను మాదరమున.

ఆ. మేదినీశ వినుము "నాదత్తముపతిష్ఠ, తే" యనంగఁ గర్మదృఢత లేక
యిహసుఖంబు గల్గునెట్లు "జ్ఞానాన్మోక్ష",మనఁగనజ్ఞుఁ డెట్టులందు ముక్తి. 106

క. గుణజలనిధిగహనా "క, ర్మణోగతి" యనంగ సులభమాకర్మము దా
రుణము "శుకో ముక్తో" యని, గణుతింపఁగ నెటులు ముక్తిగల దన్యులకున్.

తే. కానఁ గర్మంబు లాత్మవిజ్ఞాన సరణి
దుర్లభములు విశేషించి దుష్టమైన
కలియుగమువేళ నెటువలెఁ గలుగు నైన
నొకయుపాయంబు దెల్పెద యుక్తముగను. 108

ఉ. కృష్ణదశావతారములు కేవలభక్తిని విన్న సజ్జనుల్
జిష్ణుసమానవైభవము జెంది యిహంబున సంతమీఁదటన్
వైష్ణవధామమొందుదు రవశ్యము నశ్యము సుమ్ము రెంటికిన్
గృష్ణకులీన యన్న నృపకేసరి యెంతయు సంతసంబునన్. 109

తే. పద్మనాభుండు పాండవపక్షపాతి, యందు మిక్కిలి విజయునకనుఁగు గానఁ
దత్కథలె విందుఁ గృష్ణావతారపూర్వ,కముగ వినిపింపు మవతారకథల ననిన.

శా. శ్రీకల్యాణగుణంబుల న్సమతచేఁ జెన్నొందియు న్భక్తర
క్షాకౌశల్యముఁ దెల్ప ధర్మసుతు రాజ్యశ్రీయుతుం జేసి యెం
తే కుంతీసుతపక్షపాతి యనుకీర్తిస్ఫూర్తివర్తిల్లు నా
శ్రీకృష్ణుండు కృపాకటాక్షమున రక్షించు న్శుభవ్రాతమున్. 111

సీ. ధరణీశ కృష్ణావతారంబు మున్నుగా వినిపింపు మని దన్ను వేఁడినాఁడ
వవతారములలోన నాకృష్ణచరితంబు గణియింతు రందు నొక్కటిగ బుధులు
బలభద్రచరితంబు దెలిపినపిమ్మట నుడివెదఁ దదనుజన్ముని చరితము
మానసం బలరార మత్స్యకూర్మవరాహనారసింహాద్యవతారకథలు

తే. వినుము క్రమమున వీనులవిందుగాఁగ, నీసమంచితభక్తివర్ణింప వశమె
తపముఫలియించె జన్మంబు ధన్యమయ్యెఁ,గలిగె భాగ్యంబు శ్రీవిష్ణుకథలు దెలుప.

క. అని పులకాంకురములు మై, దనరఁగ మోదాశ్రులొలుకఁ దన్మయచిత్తం
బున నలరుచు వైశంపా,యనముని దెలుపంగఁ దొడఁగె నధిపతి వినఁగన్. 113



# ౧. మత్స్యావతారకథ.

గీ. పంటవాల్గంటి గబ్బిగుబ్బలఁ జెలంగు, తళ్కుజిగిచిల్కపచ్చతాతాళిఁ బోలి
పచ్చగందని పైరుల నిచ్చమెచ్చు, దెచ్చు హెచ్చుగ ద్రావిడదేశ మధిప. 114

క. ఆదేశము సురపురవిభ, వాదేశము నృపతివితరణైశ్వర్యజిత
శ్రీదేశము కలుషానిల, కాదేశము నెగడుఁ బొగడ నలవియె యెందున్. 115

సీ. సతతంబు నభ్రంకషంబులై కనుపట్టు ధాన్యరాసులఁ జూచి తలఁకియేమొ
జపతపస్స్వాధ్యాయ చతురులై తగుమహీసురుల ధైర్యముఁ జూచి స్రుక్కియేమొ
పైఁటచాటెఱుఁగక ప్రబలు ద్రావిడవధూకుచకుంభములఁ జూచి క్రుంకియేమొ
యభవునియాజ్ఞ వింధ్యాద్రి మెట్టిన కుంభసంభవునాగతి జడిసియేమొ
తే. కాక భూపాలుచేవాలు కఱుకువాలు, కఠినశితకోటిశతకోటిఁ గాఁ దలంచి
నేమొ లేకున్న నచట మహీధరములు, పోఁక లంతైనఁ బొడసూపఁ బోకయున్నె.

ఉ. సాలములో యనందగురసాలము లంబరిపాకలీలఁ జే
రాలు మెఱుంగుముత్తియపురాలు ఖగంబులగుంపు దోలఁగా
యేలలుగంగ వానిఁ గని యేలలు వాడుదు రందు నవ్వగు
ల్వాళిఁ గొనంగ శాలివనపాళికహాలికబాలికామణుల్. 117

ఉ. బాలరొ పుష్పమంజరులపై భ్రమరంబులు వ్రాలె నవ్వగా
వ్రాలినచో సుపద్రవకరంబులు గావవి వాని మాన్పఁగా
నేలని నేర్పుమీఱ వచియింతురు పల్కులఁ దేనె లొల్కఁగా
హాలికబాలికామణు లుదంచితశాలివనాంతరంబులన్. 118

శా. శ్రీమత్తాదృశదేశవల్లభుఁడు లక్ష్మీనాథపాదాబ్జసే
వామాద్యద్భ్రమరంబ రాతినృపదీవ్యద్ధర్మకోటీరకో
టీముక్తాయిత వామపాదనఖకోటిజ్యోతి సత్యవ్రత
క్ష్మామానిస్యధినాథుఁ డొప్పు క్షితిరక్షాదక్షకాంక్షేయుఁడై. 119

సీ. తనప్రతాపము సముద్దండశాత్రవకోటి గడిసీమఁ దోరణకట్టికొనఁగఁ
దనకీర్తి బహుసముద్రద్వీపములుదాఁటి చక్రవాళాద్రిపైఁ జౌకళింపఁ

దనకటాక్షము దిగంతరయాచకశ్రేణి రూఢికెక్కఁగఁ గుబేరులనుజేయఁ
దనచేతి యప్పటి కీర్తులేలు వేల్పు [1]రాజులపాగలం దురాచెల్వుచూప
తే. నతఁడు చెలువొందుఁ బరకిరీటాగ్రఖచిత, పాకభిన్నీలమౌక్తికపద్మరాగ
షట్చరణచక్రచక్రాంగచక్రవాక, యుగపదాశ్రితపాదాబ్జయుగళుఁ డగుచు.
క. ఆసత్యవ్రతభూవర, శాసనుఁ డొకనాఁడు వేఁగుజామున ఘనగ
ర్జాసమసమధికవంది, శ్రీసూక్తుల మేలుకాంచి చిత్త మెలర్పన్. 121
క. హరి మదిఁ దలఁచుచుఁ బ్రాతః, కరణీయ చికీర్ష విబుధగణసంయుతుఁ డై
స్వరధిపనిభ వైభవభా, స్వరత న్స్నానవాహ మెక్కి చనఁ జన నెదుటన్. 122
క. హేళికులాగ్రణి యగునృప, మౌళి గనుంగొనియె ధరణిమహిళాసుమనో
మాలిక పోలికఁ దగుకృత, మాలిక యనునదిని మదిఁ బ్రమద ముదయింపన్.
క. కనుఁగొని హరి దిగి విబుధుల, రని కొనియాడుచును వింటిరా యీతటినిం
గనుఁగొను పుణ్యుఁడు మిక్కిలి,కనుఁగొను నెన్నుదుట నెన్నఁగాఁ దరమగునే.
క. కృతమాచరించు భూరిసు, కృతమానిన భాగ్యశాలికిం గలుగుం దు
ష్కృతమాలిక నడంపంగల, కృతమాలిక మునుఁగ దొరకునే యన్యులకున్.
తే. అనుచు ననుచు ముదంబున నంబుజాప్త, నిభవిభుఁడు మేదినీవిభుఁ డభిమతార్థ
దాయి తటినికిడిగ్గి హృత్తటిని భక్తి, పూర్ణతరముగ సంకల్పపూర్వకముగ. 126
క. మజ్జన మొనరించెను ధీ, మజ్జననుతు లెసఁగ నృపతిమహి మహితముగా
మజ్జనము గావింపు న, మజ్జనని తటిని యని సమంజసభక్తిన్. 127
తే. మజ్జన మొనర్చి యిటుల న మ్మనుజవిభుఁడు,కాల్యకరణీయములు దీర్చి గంధసింధు
రజవసైంధవపృథుహేమరథసుయోధు,లెలమి నెలసంక వలవంక బలసికొలువ.
తే. నగరికేతెంచె నిట్టు లన్వాహము తటినిఁ
గాల్యకరణీయములు దీర్చుకతన నతని
మదిని వైరాగ్య మొదవ సామ్రాజ్యతంత్ర
ములకుఁ దనమంత్రులనె స్వతంత్రులనుజేసి. 129
క. కృతమాలికాతటంబున, క్షితిపతి సలిలాశియగుచుఁ జేసె న్దపమా
శతమఖముఖబర్హిర్ముఖు, లతివిస్మయమంద మాధవార్పితబుద్ధిన్. 130
క. ఒకనాఁ డుదయత్క్ష్మాభృ, న్మకుటస్ఫుటపద్మరాగమణినా దిననా
యకుఁ డలరనృపతి మురభిం, జకునకు నర్ఘ్యంబొసంగు సమయమునందున్.
క. నునుగరులు దళుకుమీసలు, మినుమినుకను కన్నుదోయి మిహికుంచనవుం
దనువుంగల యొకమీనము, దనయంజలిఁ దవుల నృపుఁ డుదకము న్విడిచెన్.
క. తనునటుల నీటఁ ద్రోచినఁ, గని మీనం బనియె రాజ కారుణికుఁడ వం
చును నిన్ను నమ్మి చేరితిఁ, జను నే నట్టేటఁ ద్రోయ శరణాగతులన్. 133

1 వేల్పువజ్రీలపాగలఁ దురాచెల్వు.

సీ. శ్రీరామచంద్రుఁడు చేపట్టఁడా యెనా శరణుఁజొచ్చిన విభీషణునిఁదొల్లి
శిబిచక్రవర్తి రక్షింపఁడే మును దన్నుఁ జేరినపక్షి దాక్షిణ్యగరిమ
నచ్ఛభల్లముఁ బ్రోవఁడా తొల్లి బెబ్బులిపాలు గాకుండ నృపాలసుతుఁడుఁ
దనశరీర మొసంగి వనచరునొక్కని దయగావదే కపోతంబు దొల్లఁ
తే. గాన శరణాగతులఁ బ్రోచుకంటెఁ బుణ్య, మేదిమేదినిలోన నన్నేది యింక
నాదిరాజన్యకీర్తులఁ బ్రోదిసేయు, ధర్మగుణసాంద్ర సత్యవ్రతక్షితీంద్ర. 134
క. సకలం బెఱిఁగినయాదిమ, శకులం బటులనిన రాజచంద్రుని చిత్తం
బకలంకమయ్యె నించుక, వికలముగా నిట్టులను సవిస్మయుఁ డగుచున్. 135
మ. శరణన్న న్విడ నిన్ను నేను శఫరీసామాన్యబుద్ధి న్నిరా
దరతం దోఁచితి వేళగామి నిదియే తప్పంచు నీ వెంచి ని
ష్ఠురతం బల్కితి పాడియే దెలుపుమిచ్చో నే భయంబయ్యె న
న్నరణోందం బనియేమి నావలన రక్షాసిద్ధి నీకెట్లగున్. 136
తే. అనుచుఁ బలికిన జనపతి మనుచువేడ్కఁ
బెనుచువాలుగ మేలుగాఁగనుచు ననియె
నుదకమునఁ దత్తరింపుచు నున్న నన్నుఁ
జూచి భయమేమి యనుటగా చోద్యమయ్యె. 137
సీ. కూర్మికిఁ గూర్మిచేకులునె నోరికిఁజిక్క నెగడుము న్నెగడుపై నెగడుచుండ
మొసలికి మొసలియే దెసలఁ జేరఁగరాదు పాములబాములఁ బడుట కడిఁది
కర్కటిమర్కటిగాదె పట్టినచోటఁ గప్పలుగొప్పలుగలవు మ్రింగ
బకము లంబకము లెప్పటికి మాపైసిల్పు మీలముచ్చులు ముచ్చులేల విడుచుఁ
ఆ. గన్నతల్లి కన్నఁ గరుణ లే దొకవేళఁ, బట్టిపట్టెఁ దివియుఁ బార్థివేంద్ర
గండకముల కిట్టిగండము ల్గలవిఁకే, మనఁగవచ్చు నెట్లు మనఁగవచ్చు. 138
తే. అటులుగాన నిరంతర ప్రాప్తశైత్య, తరళతరవారిధార సాదనలు సేయు
మీనుపిల్లల జన్మంబు మేలసంగఁ,బడునె పరికింప విషములో బ్రతుకు గాదె.
క. కాన నిరుపద్రవంబగు, చో ననువిడిపించి తేని సులభముగాఁ జే
కొనగు నాచంద్రార్కం, బై నసుకృత మసిన నృపతి యతివత్సలుఁ డై. 140
తే. అధికనైష్ఠికవృత్తి మన్మథునిఁ గెలిచి, డాలు గైకొన్న జ్యోశమండలవిభుండు
డాసి యున్నది యుదకమండలములోనఁ, దలఁకు మీసంబుఁ దనకమండలము సేర్చి.
సీ. తనయాశ్రమమున కల్లనఁ దెచ్చి రాజర్షి వల్లభుఁ డాశ్రమ మెల్లఁదీఱ
సతతపయోధారసమకూర్చి భూమిలో నేఁటఁ బెంచినవారిఁ బూఁట బెంచె
ననుమాట నిజముగా నెనరుతోఁ బోషింప శిశుకమారాత్రిలోఁ జిత్రముగను
మెండుగా బలిసిభూమండలాఖండల కొండిక కుండికనుండఁ గూడ

తే. దింతనిర్బంధమైనచో నెటులనోర్తు, నింక నొండొకవిరివియా నెడవసింపఁ
జేయు మెందైన నందైన చింతదీఱ, విశ్రమించెద నన్నుఁ బృథ్వీవరుండు. 142

ఆ. గండకంబు వేఱుకడ వసింపఁగఁజేయు, మన్నమాట గడవ కాక్షణంబ
కడువశంవదుండు గావున నొకగొప్ప, కడవలో వసింపఁగా నొసర్చె. 143

క. ఘటిఘటియించిన రెండవ, ఘటినే యండజము ఘటినిఁ గలయ బలిసియా
ఘటమున నుండుటకుందు, ర్ఘటమై యున్నది యటంచుఁ గడుదీనంబై. 144

ఆ. మీన మడుగుటయును మేదినీంద్రవతంస, మడుగులకును బ్రేమ మడుఁగులిడుచు
నఖిలధీవరజన మడుగు గానఁగలేని, మడుగులోన నించె మహిమమించ. 145

మ. మడుగు న్నిండఁగనిండి గండకమనుక్ష్మామండలాధీశ యి
క్కడ నుండం దరమే జడాశయము యోగ్యంబౌనె నావంటి యె
క్కుడురూపంబున వెంచువాని కిటఁ గైకోవయ్య విస్తారమౌ
కడ సిల్పం గదవయ్య యార్తజనరక్షాదక్షదీక్షానిధీ. 146

క. నావుడుఁ గడువిస్మయమున, భూవరుఁడొండొకప్రదేశము మదిఁదలఁచుచు
న్వేవిధముల నిదియేతగు, నీవేళకటంచు నిశ్చయించి రయమునన్. 147

మ. అలరించె న్లవణాంబుధి న్మొదట నే యారారశుద్ధోదకం
బులవార్ధి న్గడవైచె ధాత జడజోద్భూతుండురా యంచులో
కులు నిందింపఁగలంగి యన్నలువదిక్కూలంకషోర్మిచ్ఛటల్
గలయం దజ్జలరాశిముందిడియెనాఁగా నొప్పు గాసారమున్. 148

తే. చేర్చి సుఖముండు మనిన రాజీవమనియె, సదయు రాజవతంసుని సన్నుతింప
నల్ల రాజీవగర్భున కైనఁ దరమె, శ్రితనరాజీవ ద్రవిడధాత్రీకళత్ర. 149

క. అని పొగడుచు నొకదినమున, ననిమిషకులచక్రవర్తి యాకాసారం
బును నాక్రమించి వేఱొ, క్కనివాసముఁ జేర్చు స్వైరగతివిహరింపన్. 150

మ. అసిన న్భూవిభుఁడొండుచోటగునె మీనావాస మింకం దగు
న్ఘనఝుంఝూనిలసంఘసంఘటితసంఘర్షాఖిలాశావిలం
ఘనజంఘాలతరంగరంగతలరంగత్పాండుడిండీరచం
దనసందీప్తవిలాసముద్రము సముద్రంబే యటంచు న్మదిన్. 151

క. జడరాశిం బడవైచిన, మిడుకుచు నప్పుడమితేని మీనంబనియె
న్గడనేఁటికి నేటికి దిగ, విడిచెదు నమ్మితిని గావవే దయమీఱన్. 152

ఆ. బాల్యఁ జిలుకఁ బెంచి బావురుగానికి, నొప్పగించురీతి నుచిత మగునె
యిన్నినాళ్లుఁ బ్రోచి యిప్పుడు జలరాశి, మొసలివాతఁ ద్రోయ వసుమతీశ. 153

క. జలరాశిఁ దిమితిమింగిల, ములు నాఁదగుమీనసత్వములు వినలేదే
కులశైలసుతుఁడు జలచర, ములతో రావెడల నుమియుఁ బునుకలతోడన్.

క. తాదృశమీనంబులు న, న్నే దెసవసియింపనిచ్చు నిటదిగవిడువం

గాదెసఁగినకారుణ్యము, నాదెసనుంపంగదయ్యనరనాథమణీ. 155
మ. అనిన న్నివ్వెఱఁగంది భూవిభుఁడు నాహా యిట్టిమీనంబులం
గనినామో వినినామొ యెందయిన లోకత్రాణపారీణుఁ డ
బ్జనజాక్షుం డిటువంటిరూపమున సేవల్గాఁ బ్రసాదింపఁగాఁ
జనుదేఁ బోలు నటంచు నించుక మది న్సందేహముం జెందుచున్. 156
మ. పలరా పెక్కుపుమీనవో సురలఁ బోషించు మీనంబవో
తెలియ న్వానికి నైన నీబలిమి సందేహంబు నేఁగొల్చు న
జ్జలజాక్షుండవొ ఫాలచక్షుఁడవొ సాక్షాద్బ్రహ్మవో తెల్పు మీ
వలవంత ల్పచరింపనేల కుహనావైసారిణగ్రామణీ. 157
క. అన నేనేమీనముగా, ననఘాత్మ స్వభావమీన మని యెన్నుము నీ
వనుమానము మానుము నను, జనుమానముతోడఁ బోవు జాగేమిటికిన్.
తే. విపధిలోపలఁ జాలరి వేటకాండ్రు, వలకుఁ జిక్కిన గాలంబు వంచికొనిన
గారవెట్టిన నేరీతిఁ గడవనేర్తు, నాకు గతియొండుగలదె నా వరవరుండు. 159
తే. అనియె నీవు స్వభావమత్స్యంబ వైన, జాలరులు నిన్నుఁ బట్టంగఁజాల రెందు
నీయధీనంబు గాలంబు నీకు భయము, సేయనోపునె పరులకుఁ జేయునట్లు. 160
క. నీవలకుఁ జిక్కెలోకము, లీవల నీవలకుఁజిక్కు దేజలరాశి
న్నీవలకుం జిక్కుదుగా, కేవలనం గేవలంబె యీనీమహిమల్. 161
తే. పృథివి సంసారమన గారఁ బెట్టఁజాలు, నీదుమాయావిలాసంబు నిఖిలజనుల
నందఱకు నీవగతిగాక యన్యుఁడొకఁడు, నీకుగతియానె సకలలోకైకనాథ.
క. యోజనలేటికి నీవ ప్ర,యోజనయనమూర్తివే ప్రయోజనమున కీ
యోజ నటించెదు దినకత, యోజనమాత్రంబు వెరుఁగ నోపుదు చెపుమా.
శా. శ్రీనారీకుచకుంభికుంభయుగళాశ్లేషంబొ బ్రహ్మాదినా
నానాకేశనమస్క్రియాదరమొ వీణామానిలోకాగ్రణీ
గానాకర్ణనమో వధూనటనశృంగారావలోకంబొ యీ
మీనాకారము దాల్పనేమిపని స్వామీ నా కెఱిఁగింపవే. 164
సీ. కలిమిగుబ్బెతమిన్న గబ్బినిబ్బరపుబ్బుగుబ్బలో జక్కవగిబ్బజోడు
తెలిదమ్మివిరియింటి తెలిగంటికెంపువాతెఱసొంపు పవడంపుతీవగుంపు
లెడఁజకాఁపురపుఁ పుత్తడిబొమ్మనిడువాలు గన్నులో యీవాలుఁ గన్నులరయ
ననవింటిదంటఁగన్నమిటారినూగారు తీరులో యీనాచుతీవగుమురు
తే. ఏల బ్రమసితి వీవార్థి నేమిగంటి, తేలియాడెడు మీనంబు తెఱఁగుపూని
యారార తెలియకయంటిగా కయ్య నీమ,హత్త్వమెఱుగంగ శక్యమే యజునకైన.
క. నే నొక నెపమున నైనను, మానక నినుఁగొల్చినాఁడ మక్కువ నాపై
నూనుము "సఖ్యం సాప్తపదీనం" బని మున్ను వింద దీనశరణ్యా. 166

క. మునుపటిభవమున నేఁజే, సినపుణ్యమువలన మిమ్ము సేవింపఁగఁ గం
టిని మాయలేటి కింకిట, వినిపింపఁ గదయ్య నీదువృత్తాంతంబున్. 167

మ. అనినం గైతవమత్స్యమూర్తి [1]కరుణాయత్తైకచిత్తంబుమీ
ఱ ననున్నాఖవర యాత్మతత్త్వము పరబ్రహ్మంబుగా నెమ్మనం
బునఁ జింతింపుము సంశయింప కిఁక నేమో యంచు నీచర్యకే
ననుమోదించి యనుగ్రహించితి నభీష్టార్థంబు నీకయ్యెడున్. 168

సీ. వినుము సత్యవ్రత వినయగుణాన్విత భావికార్యము తేటపఱుతు నీవు
కనుఁగొనుచుండు మింకను నేఁడుమొదలుగా నేడుదినంబుల కిప్పయోధి
భువనముల్ త్రిభువనంబులను లోఁగొను నేలనన్న నానాఁటికి నబ్జభవుని
రేయైన నతఁడు నిద్రించుఁ గావున దాని కెడఁద భయంపడ కెనయ నప్పు
తే. డోషధీబీజరాసుల యోడనీకు, నంపుచున్నాఁడ నోడక యందుసప్త
ఋషులతోఁగూడి వసియింపు మెపుడునాదు, భక్తజనమున కెందునాపదలు లేవు.

తే. అనుచు నానతియిచ్చి మాయావిసార
మూర్తి యంతర్హితుండైన మ్రొక్కి నృపతి
యెంత దయగలవాఁడు సర్వేశ్వరుండొ
హో యటంచును నిష్ఠతో నుండు నంత. 170

సీ. ప్రథితసుమేధుఁడై పరగునుమేధుండు విరజుఁడై శాంతిచే వెలయు విరజుఁ
డాభాహవిష్మంతుఁ డగుహవిష్మంతుండు నుత్తముఁడైనట్టి యుత్తముండు
వనజాక్షపదభక్తవనమధుండగు మధుం డఘుపారదమహాగ్ని యైనయగ్ని
ద్వంద్వసహిష్ణుఁడై తగిన సహిష్ణుండు ననఁదగు సప్తర్షు లమితహర్షు
తే. లగుచు వచ్చిరి లవణమహాంబురాశి, వేల దర్భశయానుఁడై విభుఖగేశ
యాను నతివేలభక్తిభాగనఘుజనకృ, పాలు హరిఁగొల్చు ద్రవిడనృపాలుకడకు

ఆ. అట్టు లరుగుదెంచి నట్టియయ్యతులకు, నతులగతుఁ మతులునతులు చేసి
యతివినీతి నున్న క్షితితలపతిధృతి, మతిని మెచ్చికొనుచు మౌను లనిరి. 172

క. శతవర్షంబుల నుండియు, క్షితి వర్షములేని కతన శిథిలంబగు చో
నతివృష్టిమించె జలనిధి, గతి దృష్టించితివె ముజ్జగంబులు ముంచున్. 173

తే. ఇందు నెవ్వారిఁ గనుఁగొన మిజ్జగంబు, నందు నాశ్చర్యపు మయ్యెనో యవనినాథ
యేకతంబున వారాశి సైకతమున, నేకతంబున నున్నాఁడ వెఱుఁగఁ జెపుమ.

ఉ. నావిని తావినీతి జననాయకుఁ డిట్లను మౌనులార రా
జీవముకుంద మొన్న ననుఁ జిత్రముగా భ్రమియించి యంతటన్
భావికథ ల్సవిస్తరతఁ బల్కి పయోధి మునుంగకుండ నే
నావఘటింతు నీకు మునినాథులతో వసియింపు మత్తరిన్. 175

1 కరుణైకాయత్తచిత్తంబు.

తే. అంచు ననుమించు వేడుక నానతిచ్చి, గోచర మగోచరం బైనఁ గొంత ధైర్య
శాలి నై యుంటిఁ దన్ని దర్శనముఁ గోరి, నేఁడు మీదర్శనమున సందియము దీఱె.

మ. అనిన న్నంతసమాని మానిజను లాహా యింక నెట్లో కదా
వనధు ల్మింపఁగఁ జూగె ముజ్జగము లేవంక న్వసింపంగవ
చ్చునటంచుం గడుఁద త్తఱించినతఱిం జోద్యంబుగా నీడకుం
జను దెంచుం దరియంచుఁ బల్కితిఁ దరింపన్వచ్చు నిచ్చోన్నృపా. 177

క. అనిపలుకుచు నుండఁగ న, వ్వననిధిఘనఘోషమడర వలమానతరం
గనికాయంబులఁ బొదువఁగఁ, గనికాయంబదర లేచి గ్రక్కునవారల్. 178

సీ. పటుదీర్ఘతరజటాపటలంబు ముడివీడి కన్నులకడ్డమై గప్పికొనఁగ
భయవేగసంచలత్పాణిపరిస్ఫుటస్ఫటికాక్షమాలిక ల్జాఱిపడఁగఁ
గాషాయపటములు గటితటంబుల నూడి త్రొక్కుడుపాటుచేఁ దుసియుచుండఁ
జాలినొందుచు నెత్తఁజాలక వచ్చుచో ఘనకమండలువు లక్కడనె చిక్క

తే. జడిమ నడుగులు దడఁబడ నుడుగ కూర్పు
లడర బడిబడి బడలిక లొడలఁ బొడమఁ
గడలికడనుండిమగిడి క్రేఁగంటి దృష్టి
యిడుచుఁ బాఱుచు జడదారియొడయ లపుడు. 179

శా. “అస్మాన్ పాహి భయాతురాం స్త్రి జగతీమాప్లావయద్వారిధి
ర్విస్మార్యా నఖలు త్వయావయ మితో విష్ణో భవాన్ రక్షకః
తస్మా త్త్వాం శరణంగతా అగతికా ధావంత ఏతేభృశం
కస్మాదేవ ముపేక్షసే” యని మును ల్గార్పణ్య మేపారఁగన్. 180

తే. మొఱలు పెట్టుచు శరనిధి మఱలిమఱలి
కాంచుచో నిదె యోడని కదియఁ జనుచుఁ
దెలియ వీక్షించి యదిగాదు జలముగ్రోలు
జలద మిది యని మదిలోన జలదరింప. 181

మహాస్రగ్ధర. కనియె న్భూపాలుఁ డంత న్ఘనతరసముదగ్రస్వకీయాగ్రభిద్య
ద్వనరుద్ధబ్రహ్మాండభాండావరణపరిపతద్వారిధారాళి శంకా
జనకాసంఖ్యాతసూత్రోజ్జ్వలదృఢగుణవృత్తచ్ఛటాకించిదాకం
పనలీలాకృన్న భస్వత్పటకటపటలప్రస్యదం బైన నావన్. 182

క. కని యిట్లను మునులారా, కనుఁగొంటిరె దివ్యరత్నకమనీయంబై
కనకన వెలుఁగుచు నిదిగోఁ, గనన య్యొంగనకతరణి గరుడధ్వజమున్. 183

క. అనునంతలోన దరికిం, జను దెంచిన య త్తఱిన్ ససంభ్రమముగ న
మ్మునినాథు లెక్కి రొండొరు, లనువడిఁ జేయూఁతగా హళాహళిమీఱన్. 184

తే. ఎక్కి మనలను దరిసేర్ప సిద్ధగుని కె, భారమగుఁగాన దరిసేర్చె నావ యనుచు
విడిచి కాషాయవస్త్రము ల్బెట్టువిసరు,గాలి నెండించుకొనుచు నాకలమునందు.

సీ. కలధౌతనిర్మితోజ్జ్వలశిరోగృహములు దీపితమాణిక్యదీపతతులు
రమణీయవైడూర్యరచితపర్యంకముల్ సౌవర్ణమణిమయజాలకములు
పృథులగోమేధికపీఠికాపేటిక లకలంకనవవజ్రముకురసమితి
మానితముక్తావితానవితాన మాయతపుష్పరాగభద్రాసనములు

తే. విద్రుమస్తంభములు నీలవేదు లమర
గాంగజలపూర్ణ ఘనకాచఘటచయంబు
విత్తనము లోషధులుఁ దక్కు వివిధవస్తు
జాలములు సూచిసూచి యాశ్చర్యమునను. 186

శా. ఓహో కంటిరె వారిరాశిసలిలం బుద్వేలమై శైలసం
దోహాగ్రంబులు దక్కఁ దక్కిన పురాదుల్ముంచె నందున్నప
ర్వాహార్యాగ్రమె కాని కాన మితరం బాహా విమానస్వయం
గ్రాహగ్రాహము లెచ్చరించెనుభువఃక్రాంతిఁ విజృంభించుచున్. 187

తే. తరణి మెఱుఁగారు గారుడధ్వజము గాంచి
కలఁగి పరువిడుచిలువవర్గములు సడలి
పఱచుహయములసారథి పట్టలేమిఁ
దత్తరించుచునున్నది తరణిరథము. 188

తే. ఔర సకలంకమైనట్టి యబ్జమండ, లముసఖండంగాబ్జమండలభ్రిమ గడంగి
జలధిజలకరితుండంబు సాచి తివియు, నేమనఁగవచ్చు మత్తుల కెఱుక గలదె.

క. మహిజనులఁ బీడఁ బెట్టెడు, గ్రహములఁ బీడింపఁదోడఁగె గ్రాహము లివిగో
సహజ మగుసత్త్వసంపద, నహహా యాకారవృద్ధి నధికము లగుటన్. 190

తే. మాయురే తోయనిధిలోన మకరమీన, కర్కటకరాసులొండొండగగనమకర
మీనకర్కటరాసుల మించువేడ్కఁ, గౌఁగిలించె సజాతీయగౌరవమున. 191

తే. అదరిపాటున వారాశియుదుటు సూచి
మిగులభయమునఁ దమతమ మెఱుఁగుబోండ్లు
చేరి తముఁదామె కౌఁగిటఁ జేర్ప సౌఖ్య
వార్ధిఁదేలె మహర్లోకవాసి జనము. 192

తే. ఇదియు: గనుఁగొంటి రే చిత్ర మిట్టివేళ, భైరవభుజాగ్రశూలాగ్రభాసికాశి
కానఁ గానయ్యె మోక్షలక్ష్మీనివాస, నాళసమ్మేళితారవిందమ్మురీతి. 193

శా. ఆశాలంఘనజాంఘికోజ్జ్వలతరంగాభంగనానాపయో
రాశివ్యాపృతవిష్టపత్రయచతుర్వక్త్రీయనక్తంబున

న్నాశంబొందక తేజరిల్లె సకలోన్నత్యంబు సూచించుచున్
గాశీపట్టణవైభవంబుఁ బొగడంగా శక్యమే యేరికిన్. 194

క. అని యొండొరులు వచించుచుఁ, గనఁగ మహర్లోకమవధిగా నీచందం
బున ముజ్జగములు దనలోఁ, గొనుచు న్హరిఁ బోలు నయ్యకూపారమునన్.

సీ. వడి నీరువడిఁజిక్కువడి చక్రవాళాద్రి క్షణమాత్రమునఁ బ్రదక్షిణము సేయు
నతిరయస్ఫూర్తిచే నరుగుచో నాడాడ నగశృంగములు ఘణిల్లనఁగఁ దాఁకు
ఘనవర్తులావర్తగర్తభాగముల దిర్దిరను గుమ్మరసారెరీతిఁ దిరుగు
శతయోజనాయతోన్నతమహాపాఠీనసంఘసంఘటితఘర్షమున నదరు

తే. జలధి యుల్లోలకల్లోలములను దగిలి, యట్టె యెగయుచు డిగుచును బొట్టిపిట్ట
పగిది మెలఁగెడునావలోపల వసింప, భయపడుచునుండునంతలోపల నెయెదుటఁ.

సీ. తనభయంకరవాల వినిపాత మమరేంద్రకరవాలహతి యంచుగిరులు వడఁకఁ
దనమస్తకోర్ధ్వరంధ్రవినిస్రుతాంబువు ల్వినరుత్పథద్గంగపోలుపు దెలుపఁ
దనవక్త్రబిలము సొచ్చినసుహతిమితిమింగిలతద్గిలంబు లంగిటను వెడలఁ
దనపార్శ్వభాగసంఘర్షణంబున ద్వీపకోటులు నుగ్గులై నీటఁ గలయఁ

తే. దనమహోద్దండనాసికాదండమునను, ఖండఖండంబులై యహిగ్రాహకమఠ
కర్కటీ నక్రముఖజంతు కాండ మగల,జలధివిహరించునొక్కమత్స్యంబుఁగనిరి.

చ. కని యిదియేమి యద్భుత మొకానొకనాఁడును జూడ మిట్టిజీ
వనచర మింక దీనిఘనవాలము సోఁకినయంతఁ దున్కలై
చను గిరులైన నీతరణిచందము నెన్నఁగనేల యంచు నె
మ్మనము గలంగి చూచుతఱి మానవనాథుఁడు వారి కిట్లనున్. 198

క. ఓహో భయపడ నేటికి, నూహించితి నాఁటియండజోత్తమ మిది సం
దేహింపకుండి మనకుఁ, సాహాయ్య మొనర్పవచ్చె జలనిధి ననినన్. 199

తే. మౌనివరు లిట్టులనిరి యోమానవేంద్ర, నీవు నేసినభక్తి కెంతేని మెచ్చి
సకలవేదాంతములకుఁ గోచరము గాని,యాదితత్త్వంబుగోచరమయ్యెనిపుడు.

క. నన్నఁగూడి తుంగ దలకె, క్కినవిధమున నిన్నుఁగూడి కేశవమూర్తి
న్గనుఁగొంటి మింక నీహరి, వినుతింపుమటన్న ధరణివిభుఁ డుత్సుకుఁడై. 201

క. చూచితిరే శ్రీహరిమా, యాచాతురి హేమమీనమై జలధిచల
ద్వీచీడోలాకేళీ, వైచిత్రిం జెలఁగుప్రాభవము మునులారా. 202

సీ. అంభోధివరుఁడు వియన్నదీకన్యకఁ బైనించుముత్తెలప్రా లనంగ
వైమానికాంగనాసీమంతములఁబొల్చు సొగవజ్రపుఁ జేరుచుక్క లనఁగ
గగనలక్ష్మీవేణికాభారమును మించునిగ్గు క్రొవ్విరిజాజిమొగ్గ లనఁగ
నభిమతవిజయయాత్రారంభమున దిశాలలనామణులు జల్లులాజ లనఁగఁ

తే. గంధమథ్యాంబుచక్రచంక్రమణనిపుణ, కపటపాఠీనరాజజాగ్రన్మహోగ్ర
దీర్ఘవాలాగ్రవినిహతోత్క్షిప్యమాణ, లోలకల్లోలజలబిందుజాల మమరె. 203

సీ. అనిమిషేంద్రం బౌటన సురరోషరసాత్తరక్తసహస్రనేత్రము లనంగఁ
దనగృహంబునకు వచ్చెనటంచు వరుణుండు పూజసేసిన పైఁడిపువ్వు లనఁగ
రత్నాకరాంతరభ్రమణవిస్ఫురణచే మైనంటి కనుపట్టు మణులనంగ
రాజీవనామవిభ్రాంతితో మైవ్రాలి కదలనిచక్రవాకము లనంగఁ

తే. బృథులశతకోటిశితకోటిశృంగసహితి, నెనయు జగడంబుపగడంపుతునుకలనఁగ
శాంబరీమత్స్యమూర్తిదేహంబునందుఁ, బొలుచురంగారుబంగారుపొడలబెడఁగు.

క. అని యనితరమతిఁ బొగడుచు, జనపతి వందన మొనర్ప జలజాక్షుఁడు మె
ల్లనఁ గ్రిందికిఁ జని నావం, దనమై ధరియించె భక్తతత్పరుఁ డగుచున్. 205

సీ. తనక్రేవఁ గనుపట్టు ధరణీధ్రములఁ గిట్టు సెలసికొమ్మునఁ గొట్టుఁ దలఁగఁ బెట్టుఁ
బొడువఁగా నడతెంచుజడచరంబులఁ గాంచు నిడుదకోఱలఁ జించుఁ గడుపు వెంచు
వెనకబారులుదీర్చుఁ బెనుగ్రాహములనోర్చు ఘనవాలమల్లార్చుఁ గడఁకఁ జేర్చుఁ
బ్రక్కలయం దబ్బురంబుగాఁ బెల్లుబ్బుఁదరగలఁ బడగెబ్బ గరులద్రొబ్బుఁ

తే. గాయకాంతులఁ దిమిరనికాయములకుఁ, బగలు గావించుచును బట్టపగలు సేయు
సారమున మించుమాయావిసారమూర్తి, యించు వేడుకదరి ధరియించునపుడు.

సీ. భోగభాగాభోగభాగసర్ఘ్యచిరత్నరత్నదీప్తులు తమిస్రంబునొడియఁ
దారతారస్ఫారదారుణాపారభూత్కారము ల్విషములు గ్రక్కుచుండ
నీలజాలవిశాలనీలశోభావాల మృదునేత్రములు మిఱుమిట్లు గొల్ప
దండభృద్దోర్దండమండనాయితగదాదండచండోద్దండదంష్ట్రి లమర

తే. జగతిభారంబు సైరింపఁ జాలు టుడిగి, యంబునిధిఁ దేలియాడు శేషాహియనఁగ
ధవళతరదేహధగధగద్ధగలు మెఱయఁ, గదియ నేతెంచు నొకభుజంగంబుఁ గనిరి.

తే. కాంచి యిఁక నేమిసేయుద మంచు గరుడ
మంత్రము జపించుచుఁ జలించు మౌనివరుల
వెఱవనేటికి నిదియును విష్ణుదేవు
ననుమతంబునఁ జనుదెంచె ననుచు లేచి. 208

తే. ఆనరేంద్రుఁడు భీషణాత్యంతదీర్ఘ, కాలసర్పంబు రజ్జువు గా ఘటించి
మీనశృంగంబునను నావ మెదలకుండ, గట్టిగాఁ గట్టివైచి యుత్కంఠ మెఱయ.

చ. కరములు మోడ్చి ఫాలఫలకంబునఁ జేర్చి విశాలలోచనాం
బురుహముల న్మరందములఁ బోలి ముదశ్రులు జాలువార సు
స్థిరతరభక్తి భూపతినుతించె దినాంతనటన్మృగాంకశే
ఖరమకుటీతటీరటితగాంగ *కృపీటఘుమంఘుమార్భటిన్. 210

ఝరారవగౌరవోత్కలన్.

సీ. జయవియన్మణిఘృణిస్థగితగాఢతమిస్ర జయచంద్రకిరణదంష్ట్రాసహస్ర
జయచంచలాతిచంచలదీర్ఘలాంగూల జయభయంకరముఖశ్మశ్రుజాల
జయమస్తకోత్పతత్సలిలసిక్తవిమాన జయదృష్టితృప్తప్రజావితాన
జయనిర్జరేంద్రవజ్రకఠోరతరశృంగ జయలక్షయోజనోచ్ఛ్రాయశుభాంగ
తే. జయమహాచక్రచంక్రమాచరణదక్ష, జయతరంగవిలంఘనచటులపక్ష
జయవిగాహప్లవోద్దామసత్త్వభూమ, జయహిరణ్మయపృథురోమసార్వభౌమ.
మ. తళుకుంజాయకడానిమైపొడలు నిద్దామీసలు న్వేయికో
ఱలుగాటంపుగరుల్ధగద్ధగితనేత్రంబుల్మహేంద్రాయుధో
జ్జ్వలశృంగంబును దీర్ఘపుచ్ఛము మహాసత్త్వంబు హేమాద్రికిం
దులయౌ దేహము గల్గునిన్ను భజియింతు న్దంభమీనాధిపా. 212
తే. చంద్రుసైదోడు పూఁబోడి జళుకుదళుకు
వాలుగన్నుల బెళుకుల వైపుసూపు
వాలుఁగన్నుల వలపింపవలయు నని యొ
దేవమాయవుమీనవై తివి పయోధి. 213

—— నాగబంధము. ——

మ. సమధికమైనప్రేమఁ దగ సాగరమధ్యములోన నాగబం
ధమున నటించు భీమజవనాదకనక్రనకాంగధామవి
భ్రమఘనమీనమై మునులపాలన సల్పుచు వీఁకఁబూనవా
యమరఁగ నేము సాధునిగమాగమగమ్య నదీనజాసఖా. 214
మ. స్వవిధం బంతయుఁ గానలేక బహుళాజ్ఞానాంధకారంబు క
న్గవఁ బైకొన్నఁ బదార్థతత్త్వ మెఱుఁగంగాలేని మా కిట్టిచో
రవికోటిప్రతిభావిశేషముల నశ్రాంతంబు విశ్రాంతమౌ
భవదీయాకృతి చూపిప్రోవు కుహనాపాఠీనచూడామణీ. 215
క. మీనావతారమున స్వా, మీ నావఁదరింపఁజేసి తేజలరాశి
న్నే నిన్నుఁ బొగడఁ [1]గలనే, మీనమ ననుఁజేరిప్రోవుమీ నలినాక్షా. 216
మ. జడుఁడజ్ఞానమున న్సుఖంబనుచు సంసారాంధకారంబునం
బడిదుఃఖంబుల వెంబడింబడి సుఖంపన్లేక వేసారి నీ
యడుగుల్చిత్తములోఁ దలంచి నుతిసేయ న్నానికారుణ్యపుం
గడగంటం దిలకించి ప్రోతువు జగత్కల్యాణసంధాయకా. 217
క. నే నెవ్వఁడ నాకేమి, జ్ఞానం బేమిటికి వచ్చెసంసృతిదుఃఖం
బేనాఁడు వాయు మోక్షం, బేనెన్నఁడు గాంతుఁ దెల్పవే కరుణాబ్ధీ. 218
క. నావిని సత్యవ్రతధా, త్రీవిభుఁ గరుణాకటాక్షదృష్టిం గని రా
జీవాయితపాండరధా, జీవాయతలోచనుఁడు వచించె మృదూక్తిన్. 219

---

1 గలనెయ, నేనుని ననుఁజేసి ప్రోవవే నలినాక్షా.

క. నేను న్నీవనుటయె య, జ్ఞానం బందున నెగడిగె సంసృతియా య
జ్ఞానము దెగ నదియుం దెగు, జ్ఞానము సమకూరు మోక్షసౌఖ్యముదొరకున్.

క. విను మిది రజ్జువు ఫణిగా, దని తెలిసిన భయము నుడుగు నటువలె జీవుం
డనుగాను బ్రహ్మ మని తెలి, సిన నిర్భయుఁ డగుచు ముక్తిఁ జెందు నరేంద్రా.

క. విను బ్రహ్మానందము తెలి, సినవాఁ డెందులను భయముఁ జెందఁ డనంగా
వినవే శ్రుతివాక్యంబుల, ననఘా తత్ప్రీతిఁ జెందనర్హముగాదే. 222

సీ. బహుజన్మముల సాధుపరిచర్య చేసినఁ బుణ్యపురాణార్థముల నెఱుంగుఁ
బుణ్యపురాణార్థముల నెఱింగినయంత సత్కర్మ మెప్పుడు సలుపుచుండు
సత్కర్మ మెప్పుడు సలుపుచునుండిన మత్పాదభక్తి యాత్మను జనించు
మత్పాదభక్తి యాత్మను జనించినమాత్రఁ గొనసాగి జ్ఞానంబు కుదురుపడును

తే. జ్ఞానమునఁ బూర్వకర్మసంచయము లెల్లఁ
దీఱు నప్పటికర్మము ద్వేషహితుల
కగును బ్రారబ్ధ మనుభూతమగుచుఁ దెగిన
జనుఁడు కైవల్యసామ్రాజ్య సౌఖ్య మొందు. 223

తే. అని మఱియు సాంఖ్యయోగక్రియాదిబోధ
సాధకం బైన సపురాణసంహితాక్ర
మము సవిస్తరముగ సంశయములు దీఱ
యముల కెఱిఁగించుచున్న యయ్యవసరమున. 224

శా. అభ్రంబైన భుజాబలద్రఢిమ వాహగ్రీవుఁ డత్యంతసు
ప్తబ్రహ్మాస్య సమీరనిస్సృతములౌ తమ్ముం బ్రమోషించి య
య్యబ్రాశిం జొఱఁబాఱుచో శ్రుతులు హాహాకారము ల్మీఱఁగా
నబ్రహ్మణ్యము వెట్టినం గపటమత్స్యంబై గెఁ దద్రక్షకున్. 225

సీ. కమలజాతభవాండకర్పరం బొరయంగ మెఱుఁగుబంగరుచాయమేనిఁ బెంచు
బిరుదువజ్రపుగండపెండారమై మీఱుకొమ్మున శేషాహి గ్రుచ్చియెత్తు
దిక్కుంభి కుంభము ల్వ్రిక్కలై ముక్తాఫలములు పైకెగయ వాలమునఁ గొట్టు
బడబానలము దపింపఁగఁ జేయు రూక్షవీక్షణముల విస్ఫులింగములు దాల్చు

తే. భావిమంథమహీధరభ్రమణరీతిఁ, దెలుపుపాలుపున గిరగిరఁ దిరుపుగట్టు
నబ్ధి నేకాంతలీలావిహారలోలుఁ, డైనహాటకకపటపాఠీన విభుఁడు. 226

క. అని తెలిపిన వైశంపా, యన శమధనలోక నిర్జరాధిపుతోడన్
జనమేజయవిభుఁ డనియె, న్వినయము రెట్టింప మిగుల విస్మితుఁ డగుచున్. 227

శా. ఓవాచంయమిచంద్ర సంద్రములు నేఁ డొండైనవేళన్ హయ
గ్రీవుం డెక్కడనుండె నేకరణిఁ జేరె న్సత్యలోకంబు రా

జీవోత్పన్నుఁ డెఱుంగకుండ నిగమస్తేయంబు గావించి వాఁ
డేవంక న్వసియించెఁ దెల్పఁగదవే యేతత్పురావృత్తమున్. 228

క. అన వైశంపాయనముని, విన విన నింపొంద నిట్లు వినిపించె ఘనా
ఘనఘన రవగౌరవలం, ఘనజాంఘికనవరసార్థగంభీరోక్తిన్. 229

క. మును చాక్షుషమన్వంతర, మునను హయగ్రీవనామమునఁ దగుదనునం
దనుఁ డతిఘోరతపశ్చ, ర్యను హరు సంతుష్టుఁజేసి యాహరుకరుణన్. 230

క. వనరాశి భువనమోహన, మను నగరం బొకటి దానవాధ్యక్షత్వం
బును నిర్జరవరజిత్వర, ఘనబాహుబలంబుఁ గాంచి కదనోన్ముఖుఁడై. 231

క. రుషితుఁడుగా గిరి గుహలం, దుషితత్త్వము గన్నసురల కుచితంబయ్యో
స్తుషితత్వము పరు విడు నని, విషపతియు మనోజవాఖ్య మించవహించెన్.

వ. ఇట్లు దురతిక్రమ నిర్వక్రదోర్విక్రమంబున శక్రాది సకలలోకపాలకులంబు వికలంబుగావించి తదీయపదంబు లాక్రమించి వారలు దనపదంబులాశ్రయింప భువనత్రయం జేకాతపత్రంబుగాఁ బాలించుచుండి యొక్కనాఁడు. 233

చ. హరిహయవహ్ని సౌరిదనుజాప్పతి వాయు కుబేర శంకరుల్
సరసతగొల్వ మ్రొక్కిడ స్వామి పరాకవధారు దేవ హే
చ్చరిక యటంచుఁ గంచుకులు సారెకు సూరెల నుగ్గడింపఁగా
సురమణిపీఠి నిండుకొలువుండి నిశాచరనాథుఁ డిట్లనున్. 234

క. ధీరహితులఁ దనమంత్రులఁ, జేరంగాఁ బిలిచి యతివిజృంభితవర్షా
ప్రారంభాంభోధరగం, భీరవచోగుంభనంబు మించ వచించెన్. 235

తే. అఖిలదిక్పాలకాధిపత్యంబు మనకుఁ, జెల్లుచుండఁగ నిదియేమి క్షితిదివిజులు
యాగభాగంబు లర్పింప రంచు నొకని,శాచరునిఁ బంపవాఁడు యాజకులకడకు.

క. చని "యింద్రాయస్వాహా", యనుచుఁ బురోడాశమిచ్చు నవసరమున హా
తను జెయివట్టి య హా నిలు, మని గద్దించుచును బలికె నందఱువినఁగన్.

శా. సౌవర్ణాచలధైర్యకల్పితతపశ్చర్యాసహర్షీభవ
జ్జీవంజీవసుహృత్కళాధరవరశ్రీదర్పభీతామనా
క్సేవాసాంజలితానమద్ధరిహయగ్రీవుం డనాఁగా హయ
గ్రీవుం డేలెడు ముజ్జగంబులు గనత్కీర్తిప్రతాపంబులన్. 238

సీ. జేజే యనుచు మ్రొక్కి జేజేలరాయఁడు వేఁడికోనని చూచు వేఁడివేల్పు
దండంబు ధరియించు దండపాణి తదాజ్ఞ దా నవుదలఁదాల్చు దానవుండు
చేతులు మొగిచి ప్రచేతుండు భజియించు గతి నీవె యని సదాగతి చరించు
ధర్మపంచు మనుష్యధర్ముఁడు ప్రార్థించు శంకచే శరణొందు శంకరుండు

తే. జలధిసారబారు హరియును జడధియగుచు, గట్టుమెట్టును బలితోలు గట్టుదంట
దెసలదొరలకెయిటువంటి దెసలు దొరలఁ,గలరె పరు లింకనతనితోఁగలనికెదుర.

క. ఓవిప్రులార వినుఁడీ, నావచనము నేఁటినుండి నన్నేలు హయ
గ్రీవునకు యాగభాగము, లీవలయు న్వహ్నిముఖుల కీవల దనినన్. 240

సీ. ఏమేమి తాఁగాక యిఁక నెవ్వరున్నారు యాగభాగంబుల కనెడువారుఁ
దనకేలవచ్చె నింతమదాంధకారంబు తనువొల్లఁ డేమొకో యనెడివారు
నలుకక దుర్భాషలాడెడి దూతజిహ్వ యెచ్చిల్లవలయుఁబో యనెడివార
లెంతవింతలు పుట్టె నిదియేమి హేతువో యంచుఁ జిత్తమునఁ జింతించువారు

తే. నొడిగి యేమనకూరక యుండువార, లేమియుత్తర మంచు నూహించువారు
నగుసదస్యులలోఁ గొంద ఱార్యులిట్టు, లనిరి సమయోచితంబుగా దనుజుఁజూచి.

తే. నీవు సెప్పినబుద్ధి యెంతేని లెస్స, కాదనఁగ రాదు మాకు లోకముల కెల్ల
నేత గాఁడెహయగ్రీవనిశిచరేంద్రుఁ, డైన నొకమాటగల దెట్టులనిన వినుము.

క. వేదోక్తవిధిని మేమా, యాదివిజుల కొఱకెయిత్తు మధ్వరభాగం
బేదిక్కున స్వాతంత్ర్యం, బేదీ మాకనిన దనుజుఁ డేగి రయమునన్. 243

శా. ఆవార్తల్వినిపింప దైత్యపతి రోషావేశముప్పొంగ నా
హా వేదంబుల యాగభాగము లమర్త్యశ్రేణికే కాని మా
కేవంకం బనిలేక యుండునటుగా నేర్పాటు గావించెఁ గా
నీ వేగంబ హరించి తచ్ఛ్రుతులుభగ్నీభూతము ల్సేసెదన్. 244

తే. అరయఁగాఁ గశ్యపబ్రహ్మ కగ్రమహిషి, యైన దితిపుత్రులము గాన నాదిదేవ
తలము మే మట్టిమాకు నధ్వరములందు, భాగములు లేవిఁ దేమిపాపంబుగాదె.

తే. అహహ సత్రంపుఁగూటికి నమరవరులె, కానిమేమర్హులము గామె కాయటంచుఁ
[1]బరిహసించుచునత్యంతపరుషరోష, రసకషాయితనేత్రుఁ డై యసురవిభుఁడు.

ఆ. ఇంక నేఁడుమొదలు నెవ్వరు వేదముల్, [2]దలఁతు రట్టివారు దండ్య లగుదు
రనుచుఁ జాటఁబంచె నఖిలలోకంబుల, దానవులకుఁ గలదె ధర్మచింత. 247

వ. అంత. 248

క. ఆవార్త లెల్ల నారదు, చే విని వీఁ డెంత దుడుకు చేసె నటంచున్
భావంబు గలఁగ శుక్రుఁడు, [3]వేవేగనవచ్చె దైత్యవిభుసభఁ జేరన్. 249

క. వచ్చిన మునిపతితోఁ దన, ముచ్చట దనుజుండు దెల్ప మునిపతిదనలో
నచ్చెరువందుచు నిదియే, మిచ్చఁదలంచితివి దానవేశ్వర చెపుమా. 250

తే. అక్కటా స్వయంవ్యక్తము లైనశ్రుతుల
నౌనుగాదనఁ దగునె యయ్యజునకైన
సురలయందును ధర్మ మసురులయందుఁ
గలుషమునుగల్గ మీకు భాగములు గలవె 251

1 నపహసించుచు నత్యంత హర్షరోష. 2 దగఁ బఠించువారు. 3 వేవేగమకదలి దైత్యవిభు సభఁజేరన్.

క. కలకాలము పరకాంతలఁ, గలయందలఁచుటలు హింసగలగుణ మయ్యెం
గలవే ధర్మంబులు మీా, కలకలహములం దెకాక యసురాధీశా. 252

తే. అనిన నాగ్రహమొదవ లోనడఁచి సెలవి, వారఁగానవ్వి దైతేయవీరుఁ డనియె
నెంతమాటానతిచ్చితి రేనెఱుంగ, నేసుధాంధులధర్మంబు లింతయేల. 253

సీ. అమరనాయకుఁ డహల్యాకాముకుఁడు గాఁడె శిఖి ఋషిస్త్రీల కాశింపలేదె
సతతంబుయముఁడు హింసకుఁబాలుపడఁడెరాక్షసులలోపలివాఁడుగాఁడెనిరృతి
వీర్యంబు ఘటములో విడువఁడే వరుణుండు పవనుండు గన్నెలఁ బట్టలేదె
శివ కపరాధంబు సేయఁడే ధనదుండు భర్గుం డొనర్పఁడె బ్రహ్మహత్య

తే. హరియు భృగుపత్ని నొంపఁడే యజుఁడు గూఁతుఁ
గలయఁడే శశి గురుకాంతఁ గలసికొనఁడె
యింక శుద్ధాత్మ లగువేల్పు లేరి వేలు
మడఁచి యెత్తిఁగింపుఁ డెత్తిఁగిన మౌనివర్య. 254

తే. తాము చేసినయవి యెల్ల ధర్మములఁట, మేము చేసిన దఘమఁట మేలుగాదె
యేకరణివచ్చె వారల కింతయగ్ర, గణ్యతయు మాకు నింత లాఘవము జగతి.

ఉ. ఎక్కడిధర్మ మేటిశ్రుతు లింకననేటికి నేను రాజనై
పెక్కువ ముజ్జగంబులు నభేద్యపరాక్రమలీల నేలన
న్నెక్కుడుభక్తితోఁ గొలువ నిచ్చెదఁ గోరినవారికోరిక
ల్దక్కిన నోర్తుఁగాని పరదైవముల న్భజియింప నోర్తునే. 256

తే. మీారు విచ్చేయుఁ డనుచు సమృద్ధరోష
మెసఁగ డిగ్గన లేచి యయ్యసురవిభుఁడు
నగరిలోనికిఁబోవ దానవగురుండు
నచ్యుతుఁడె చక్కఁ బెట్టెడు ననుచుఁ జనియె. 257

సీ. మునివృత్తి "నో" మని ముక్కుపట్టి జపంబు చేయఁడొక్కరుఁ డేనిజిత్తశుద్ధి
"నగ్న యేస్వాహా"యటంచు వేలిమియందునొకఁడైనయాహుతినొసఁగఁబోఁడు
"హరిరోహరి" యటంచు నాయాయిపుణ్యతీర్థంబుల నొకఁడైనఁ దానమాడఁ
డుపదేశ మొనరింప రొగిఁ "దత్త్వమసి" యంచు సామవేదంబుల సరవినొడివి

తే. భూసురులలోన సింతేల భుక్తివేళ, నైనఁ "జిత్రాయనమ" యని యన్న మిడర
దేమి దెలుపుదు నింక శ్రీరామరామ, తలఁప దోసంబు నాఁటిదుర్దశల తెఱఁగు.

తే. లేశమాత్రంబు ధర్మంబు లేనికతన, జను లనావృష్టి నతివృష్టి సమయ విలయ
సమయమగుటయుజలధులైక్యమును జెంద, భువనమోహనమసురపుంగవుఁడు చేరి.

మత్తకోకిల. ఇంక నా కిది వేళయంచు ననేకసంగరరంగని
శ్శంకబాహుమహస్సనాథుల సైన్యనాథులఁ బుత్త్రులం

బంకజాక్షులఁ గార్యదక్షుల బంధులం దగువారలం
గొంక కప్పురి నిల్పి దానవకుంజరుండు మదాంధుఁడై. 260

సీ. మందులముడితాట మలఁచివేసినసిగఁ బొల్పుగానఁగనీని బొమిడికంబు
పరుఁకుఁ దాను గన్పడకుండ ఫాలభాగమునఁ బెట్టినయట్టి కావిబొట్టు
నెడవంకఁ బచ్చీరాపిడివంకిఁ బొంకించి చారికట్టిన నీలిచాయదట్టి
వలకేలఁ బిడెము డాపలికేలఁ గేడెంబు నంగంబునందు వజ్రాంగిజోడు

తే. మీఱ మఱియును దైతేయచోరభటుఁడు
కులుచకన్నపుఁగత్తి సొక్కుపొడిబరణి
మూలికల్మణులావ్వకట్టు మొదలుగాఁగఁ
జోరసంగ్రహణీయ వస్తువులు గొనుచు. 261

వ. ఇత్తెఱంగున నత్తురంగగ్రీవుం డుత్తరంగితోత్సాహసాహసంబులు మనంబునం బెనంగొన నభంగతిమిరభంగచంగన్మణిస్థగితగోపురం బగుపురంబు వెలువడి నలుగడలం గడలి విలోకించుచు నొకించుక గొంచక రసాతలశ్రూయమాణ విరించి చంచలలోచనాకరాంచల సమంచితవిపంచికారవవంచనాచుంచు చంచత్తరంగాయమాన నాగకన్యకానన్యసాధారణానూన గానతానమానంబులకుం జొక్కుచు మయమాయానియమితోపరిహరిత్పరిచ్ఛదవితానాయితతోయధిం జొచ్చి ఘనాఘనఘనాఘనజవజాయమానపవమానదోధూయమాన జలచరవర్గం బగుబాహుద్వయద్వయసమార్గంబు పట్టిపోవుచు నాడాడ నభ్యవహారంబులకై విహారంబులు సలుపు విహారంబుల కరతలప్రహారంబులం జమునకుపహారంబులు సేయుచు వక్రంబు లగునక్రంబుల చక్రంబుల నాక్రమించి చక్కు సేయుచుఁ గులాచలచక్రక్రమవక్రచంక్రమవిక్రమాభితః క్షుభితసర్వతోముఖత్వరిత సర్వతోముఖపరిపతజ్జలచరగ్రసనవ్యసనవ్యగ్రపరివృతాయమాన నానామహామీనాననంబులు సొచ్చి యుదరంబులు వ్రచ్చియు గాఢతరకంచుకవ్యూఢోరుస్తటి ఘటిల్లన మైనాకాదికులపర్వతంబులం దాఁకుచు నిజాకలోకనభయపలాయమానమానుషీవితానంబు లనవసరపదవిలగ్నవిద్రుమలతావలయపతితజలమాణవకులం గనుంగొని హసించుచు నఖండగండతలమాడనాయితపిచండిలమదప్రచండ సముద్దండంబులై యొండొండ భండనంబులు సల్పుచుఁ గాండవేదండకాండప్రకాండంబుల నడుమఁదూఱి హరిదంతదంతిదంతురితకాంతిమంతంబులగు తదీయదంతిదంతంబులం బెకల్చి వరుణాంభోజనయనా కుచకుంభవిజృంభమాణావష్టంభ సంరంభంబు లగుకుంభంబుల మౌక్తికంబు లెడల వ్రేయు నెడల జడని పరువిడ బెడిదమగు ఘీంకారంబుల నంకురించిన శంకాతంకంబుల వడంకుచుఁ దమతమయంగనామణు లొసంగుహాలింగనంబుల నుప్పొంగు జలమానుషకుమారవర్గంబుల మ్రొక్కులు

గైకొంచు నెడనెడం ద్రోవకడ్డంబై మెలంగు జలభుజంగంబులం గనుంగొని దుర్నకునంబని తలంచుచుం జేనొడిసి జిరజిరం ద్రిప్పివైచు నెడ ఫణామణులు చెదరి విస్ఫులింగంబులగములవలెం జూపట్టి యేపట్టున నిలువంజాలక మూలమూలలకరుగు మకరకర్కటకాదిజంతుసంతానంబుల కగుబడబానలసంతాపంబునకుం గొంత చింతించుచు భవిష్యత్కమఠధృతమందరవసుంధరాధరసూచకంబులగుచు గిరులక్రింద నందందం గ్రందుకొనుకూర్మంబులు గ్రుంగ శృంగంబుల మెట్టి లంఘించుచు ఘృతపరిప్లుతసముజ్జ్వలదార్వజ్వాలనజ్వాలికా సంతాపశర్కరాయితేక్షురసవ్యంజనసమంజసంబు లగుదుగ్ధంబులు గ్రోలుచుం దనివిసాలక లవణరససంమిశ్రంబు లగుదధిఖండంబుల మెసంగుచు శుద్ధోదకంబుల గండూషించుచు హేలావధారితహాలారసపానవేలావిలోలాయితకాలానలకీలాకులసమాకులాభీలారుణశోభాలవాల విశాలలోచనగోళంబులు ద్రిప్పుచు సోలుచు జంబూప్లక్షాదిద్వీపవృక్షద్విత్రిమాత్రావశిష్టశాఖావలంబనంబునం గొంతవిశ్రాంతుండగుచు దివాకరమార్గంబు నిర్గమించి సుధాకరపథంబంటి తారాపథంబున కెగసి బుధాదిగ్రహంబుల నతిక్రమించి ధ్రువమండలంబు దండకుం జేరి మహర్లోకపథంబునం బయలుదేఱి * ప్రాప్తసంయుగవిలయ సమయసముత్క్షిప్త సప్తసప్తదీప్తితప్తులగుచు నుపరిలోకంబులు వలసలుచేసి మరలి తమతమయగారంబులం జేరువారి నాలోకించుచు దాహాదివర్జితులై విరాజలు వైరాజలోకంబగు జనర్లోకంబుం బ్రవేశించి యవ్వల శతానందనందనసనకసనందనాది మునిబృందారక మునిబృందసహస్రారవిందబంధుబంధురప్రభాదురవలోకం బగు తపోలోకం బస్తోకప్రయత్నంబునం గడచి యాకడంజనిచని. 262

సీ. కడవన్నె తళుకుబంగరుకోట కెంజాయ సంజకెంజిగిరంగు సవదరింపం
దోరంపు ముత్యాలతోరణంబులకాంతి చొక్కమౌ చుక్కలటెక్కు సూప
జేజేలరాజాల చెలువంపుగృహపాళి కటికిచీకటిగుంపు గరిమసంప
రాణించు జాతివజ్రాల మేడలడాలు పండువెన్నెలచెన్ను పరిఢవిల్ల

తే. వివిధ మాణిక్యదీపము ల్వెలుంగుచుండ
స్మరరణశ్రాంత మిథునలోచనసరోరు
హములు ముకుళింప నైశధర్మముల నొందు
సత్యలోకంబు గనుంగొనె దైత్యవిభుండు. 263

చ. కనుంగొని విశ్వకర్మకరకౌశలి మెచ్చుచు రాజవీథులం
జనిచని ముందట న్వెలి హజారము వెల్వడి వచ్చుచున్న యా
సనకసనందనప్రముఖసంయములం గని పెద్దకొల్వుదీ
ఱెనలువయంచు నెంచినదు రేయి నిశాంతము సొచ్చియచ్చటన్. 264

* ప్రాక్తనయుగవిలయ.

సీ. ఉపసృష్టి క్రమమెల్ల నొప్పించి బహుమానమంది వచ్చిన కర్దమాదిఋషుల
జనులకర్మశరీరసంఖ్యలెల్ల దినాంతకము వేసి లిఖియించు కరణికులను
దమతమయాధిపత్యములు దీరహజారమందుఁగాపున్న యింద్రాదిసురుల
వినికివేళయటంచు వీణల తంత్రులు సారించుతుంబురునారదులను
తే. దానవరుసల పెంచు గంధర్వగాయ, కులను జతగూడునట్టువకోలమువారిఁ
గానెగట్టు వియచ్చరకంబుకంధ, రలను జూచుచుఁ గక్ష్యాంతరములు గడచి.
సీ. తోరంపుసాంబ్రాణిధూపధూమముగట్టు పగదాయబాబాలబారుదీర్ప
బంధురమురజధింధింధిమిధ్వానంబు బహుళగర్జావిజృంభణము నెఱప
వేలుపుమిన్నల వివిధభూషణకాంతి శక్రచాపస్ఫూర్తి సవధరింపఁ
దిరువులగట్టు బిత్తరులమైఁదీఁగెలు గ్రొక్కారుమెఱుఁగులకోపుఁ జూపఁ
తే. బుష్పవర్షంబు వడగండ్లపోలుపు దెలుప
సారమృదుగీతికామృతాసార మెసఁగ
వర్షవేళను బోలు నవ్వనజభవుని
నాట్యశాలను దడసె దానవవిభుండు. 266
ఆ. అజుఁడు గొలువుదీరి యంతిపురంబున, కరుగుపనుక నొక్కయరుఁగుగప్పు
రాలత్రోవఁ గానరాకుండ డాఁగియా, వెనుక మెల్లన వలఁజనుచునెదుట. 267
తే. భానుపరిపూర్ణనీహారభానుచిత్ర, భానుభానుమహారాజనిస్థానదృశ్య
మానమాణిక్యదేదీప్యమాన మైన, కేళికాగేహపాళి వీక్షించి కొనుచు. 268
సీ. శారికాకలకంఠసగుణనిర్గుణవాదనిర్ణయప్రవణవాణీశుకంబు
రథవియోజితమనోరథమనోజ్ఞవిహారహారివాహనరాజహంసకులము
నక్రాంతవికచహేమాంభోజవిహరమాణాజ్ఞాతవిరహిరథాంగయుగము
భారతీగళరవాభ్యసనలీలాలోలకవకివకలరవకలరవంబు
తే. గురుకుచాహాసపుషితచకోరకంబు, గానవిద్రవమాణశృంగారసౌధ
చంద్రకాంతాంబుకణపాయిచాతకంబు,నగుచుఁ జెలువొందు కేళీగృహంబునందు.
మ. తళుకుంజప్పరకోళ్లమంచమున నిద్రాజాజిపూసెజ్జపైఁ
బలుకుం జిల్కలకొల్కి రాచిలుక బాబాసాహిబూనెయ్యపుం
గలనక్క సౌఖ్యముగాంచి మైబడలఁగా గాటంపునిట్టూరుపు
ల్వోలయ న్నిద్రితుఁడైన పద్మభవు నాలోకించి యాలోపలన్. 270
తే. అతుల మాణిక్యదీపము లార్పరామిఁ,
దనదు నెమ్మేనిచాయనత్తటి శయించి
యున్నయుడిగెపుఁబూఁబోండ్ల యొడలిమీఁదఁ
బాఱనియ్యక యొకమోరఁ జేరవచ్చి. 271

మ. అతులంబై తగు బ్రహ్మవర్చసము డాయన్రామిఁ బొంచున్నచో
నతివేలాయితనాసికానుషిరయాతాయాతనిశ్వాసమా
రుతసంక్షుబ్ధచతుర్ముఖంబులను మూర్తుల్దాల్చి వేదాళిని
స్రుతమైనన్ హరియించె దక్షిణమరక్షోభర్త విభ్రాంతుఁడై. 272

సీ. హీరకుట్టిమభూము లిసుకనేలలటంచు గట్టిగానడుగులు పెట్ట వెఱచుఁ
బచ్చరాకట్నంబు పచ్చికపట్లని వెడవెడ మునివ్రేళ్ల నడచిపోవు
నిలువుటద్దంబుల నీడలు పరికించి పరులంచుఁ జేకత్తిపదిలపఱుచుఁ
దానువచ్చినత్రోవ గానకతలబొప్పిగట్టఁగాఁ గుడ్యభాగములఁ దాఁకుఁ
తే. దడఁబడుచు నిద్రపోయెడి తలిరుఁబోండ్ల
పాదములమెట్టుఁ గాని మున్పంటిధైర్య
మూనలేఁడయ్యె వినుమెంతవానికైన
దొంగతనమున్నయప్పుడె దొడరుభయము. 273

మత్తకోకిల. అంత నొక్కక్రమంబునందనుజాధినాథుఁడు భారతీ
కాంతుకేళిగృహంబు వెల్వడ కంధిగర్భముఁ జేరఁబో
నెంతయున్ మొఱవెట్టె వేదము లీశ్వరా మముదేవతా
హంతచేఁ బడకుండఁ బ్రోవవె యంచు బెట్టుగ భూవరా. 274

తే. అప్పు డచ్చెరువందుచు నంబురాశి, దరినినుండెడి సప్తర్షివరు లిదేమి
యార్తనాదంబొ కపటమీనావతార, తేటతెల్లమిగా మాకుఁ దెల్పవలయు.

ఉ. నావుడు శాంబరీశఫరనాయకుఁ డిట్లను మౌనులార వా
ణీవిభుఁ డిప్డు మైమఱచి నిద్దురవోవఁగఁ జూచి యాహయ
గ్రీవుఁడు చోరవృత్తిని హరించి తముంగొనిపోవుచుండఁగాఁ
గావఁగ దిక్కులేమిఁ గడఁక న్మొఱవెట్టెఁ దొడంగె వేదముల్. 276

ఉ. కావున ముచ్చు రక్కసునిఁ గ్రక్కున నొక్కటనుక్కడంచి వే
దావళి నుద్ధరించి క్షణదాంతవినిద్రితుఁడైనబ్రహ్మకీఁ
బోవలెనంచు మించుజలముల్ బలముం గలముం బయోధి నెం
తేవడి మీఱడించి దురతిక్రమవేగపరాక్రమంబునన్. 277

మ. సమయాంభోనిధిఁ జొచ్చి చండతరచంచద్వాల మల్లార్చుచున్
సమరోజ్జృంభితజంభశాసన భుజాస్తంభాగ్రదంభోళి దు
ర్దమశృంగంబున వేదచోరపురవప్రశ్రేణికల్ నుగ్గునూ
చముగాఁ దాఁకె సుధాశనాసహనయోషాగర్భనిర్భేది యై. 278

మ. అటులం దాఁకిన యంత దంతికరలూనాబ్జంబు చందంబునన్
స్ఫుటితంబైనపురంబు వేవెడలి రక్షోవీరు లీక్షించి యె
చ్చోటలే దిట్టికడానిచోఱ యిదిగొంచుంబోయి చేకొన్కగా

ఘటియింపందగు దైత్యనేత కని దోర్గర్వం బఖర్వంబుగన్. 279

తే. గాలములు వైచువా రదికాదటంచుఁ, బెనువలలు వేయువారవి పనికిరావ
టంచు వడిగా రచెక్కకై యరుగువారు, నైన యసురులకనియె నమ్మీనమూర్తి.

ఉ. ధీవరులార గాలము తుదింబదిలంబుగ నెట్టిగ్రుచ్చి మీ
రీవగవైచినం దగుల నేటికి నేఁటికి వింతమాంసముల్
గావలెనంచు వచ్చితిని గావున నేవలెనన్న మీహాయ
గ్రీవుని గ్రుచ్చి వైవుఁడు హరింపుదు నంతటమిమ్ముఁ జేరుదున్. 281

ఉ. ఇంత ప్రయాస మేల చనుఁడిప్పుడ యంచును వారుసూడఁ దా
నింతయి యంతయై వెనుక నేనుఁగయంతయి కొండయంతయై
యెంతయుఁ బెద్దయై కడలి యెల్లెడ నిండి సహస్రయోజనా
క్రాంతతనూవిలాసమునఁ గన్పడఁ జూచి నిశాటసైనికుల్. 282

క. నరభక్ష్య మైనమీనము, నరభోజనభక్ష్య మానసఁగఁ జిత్రంబె
పరికించెద మిట నేఁడా, సురపతి నినుదినుట నీవసురపతిఁ దినుటల్. 283

మ. పదరం గారణమేమి యంచు దనుజుల్బాహాబల ప్రౌఢిచేఁ
గదలన్మోఁదుచు నీఁటెలం బొడుచుచున్ ఖడ్గంబులం జించుచుం
గదియన్ గ్గొని మత్స్య మొక్కపరిశృంగం బట్టిటుం ద్రిప్పఁగా
నుదరంబుల్ శిరముల్ దెగంబడిరి దైత్యుల్వేనవే లొక్కటన్. 284

శా. ఆవార్తల్ హతశేషసైనికులచే నాలించి సేనాని దా
నీవేళంజని దానిఁ దెత్తునని వే యేతేరఁ ద ద్వాలలీ
లావిక్షిప్తమహానగాళిపయి వ్రాలం గూలె సైన్యంబుతో
దేవారాతివరూథినీవిభుఁడు మధ్యేరాజమార్గంబునన్. 285

వ. అంత. 286

శా. వాలోత్క్షిప్తగిరు ల్సురారిపురిపై వ్రాల న్విశీర్ణంబులై
రాలెన్గోపురముల్ గృహంబు లురిలెం బ్రాసాదముల్ నుగ్గులై
తూలెన్గోటలుమ్రగ్గె సౌధములు దోడ్తో ఛిన్నభిన్నంబులై
వ్రీలెన్మండపపంక్తు లొడ్డగిలె నావిర్భూత ఘోషంబునన్. 287

తే. వాని లోపల నొక్కపర్వతము వచ్చి, తానుగొలువున్న కేళిసౌధమునఁ బడినఁ
బగిలి పైఁ బడఁ జేతులఁబట్టి యవల, వైచి వెల్వడివచ్చి నిశాచరుండు. 288

తే. అగము రాఁ గారణం బేమి యనుచు మంత్రి
జనుల నడిగినవారలు వినయమునను
దేవ యొక పైఁడిచోఁటి యీధివి చేరి
విస్మయము సేయుచున్నది వివిధగతుల. 289

సీ. తిమితిమింగిలముఖ్య దీర్ఘమత్స్యంబులఁ గొమ్మునఁ గుదులుగాఁ గ్రుచ్చియెత్తి
దనసంతతికి మేతఁగొనివచ్చురీతి దిక్కరిశరీరంబుల గరులనాను
దృఢవాలమున గట్టులెగయంగఁ గొట్టుచుఁ గేళిమైఁ గందుక క్రీడ సలుపు
నుగ్రసత్త్వాహార ముపశమించుటకు నా బడబానలముఁగోలి పాఱవిడుచు
తే. నాశరచ్ఛేదనముఁ దృణప్రాయముగను,జలుపు లేవింత యదియెకావలె నటన్న
గుటుకుమనకుండ బ్రహ్మాండకోటి మ్రింగి,సప్తజలధులుద్రావదే క్షణములోన.
క. అని మంత్రులు వినిపించిన, విని నవ్వుచు లేచి దైత్య విభుఁ డదియేదీ
కనుఁగొందముగా కని తను, దనుజులు గొలువంగ వార్ధితటగతుఁ డగుచున్.
మ. కనియె న్దానవసార్వభౌముఁ డెదుటం గల్పాంతపాథోధిరా
డనుగామీనము సాధులోకవిపదాయాసచ్ఛిదావ్యాజసం
జనితోద్యత్కరుణాధృతాయతతరీసప్తర్షిభూమీనము
న్ఘనదంష్ట్రాగ్రవిభాజితాయుతతమీకామీనము న్మీనమున్. 292
చ. కని యిదిమీనుగాదు లయకాలమహాబలనీయమానకాం
చనవసుధరంబ యంచు మదిసందియమందుచుఁ గాలరుద్రశూ
లనిభసహస్రదంష్ట్రలు జ్వలద్బడబానలకీల లోలిలో
చనములు ధూమకేతుసదృశంబగు వాలము చూచి నివ్వెఱన్. 293
మ. ఇది మీనంబగునైన నేమి యనిచే నింతింతగాఁ ద్రుంతునో
నుదియంగొట్టుదునో గద న్నిశితమౌ కుంతంబునం గ్రుచ్చియె
త్తుదునో మీఁదికి నిప్పుడంచు మిగుల న్దుర్వారగర్వాంధుఁడై
కదియంజూచి మృషాఝషాధిపుఁడు జాగ్రద్వాలమల్లార్చుచున్. 294
తే. శార్ఙ్గలీలావినిర్ముక్తశరముల రిపు, సేనఁగీలాలసిక్తంబు సేయుశౌరి
శార్ఙ్గలీలా వినిర్ముక్త శరముల రిపు, సేనఁగీలాలసిక్తంబు సేసె నపుడు. 295
ఉ. ఓరినిశాచరాధమ పయోరుహగర్భుఁడు నిద్రవోవఁగా
నూరక యేల తెచ్చితివి యుత్తమవేదము లందు నేమిచే
కూరెను నేఁడు నీకకట క్రోఁతికి మానికమేల కూలఁగాఁ
గారణముంటఁ జేసి చెడుకార్యము చేసితి వింతె యిమ్మెయిన్. 296
క. అనవిని నీవా యెవరో, యనియుంటిని మంచికార్యమాయెను నేఁ జే
సినపుణ్యంబునఁ గా నినుఁ, గనుఁగొనఁగాఁ గలిగె నింతకాలంబునకున్. 297
శా. నే నేదిక్కునఁజూతునో యనుచు నెంతేభీతి వారాశిలో
మీనంబై మిడుకంగఁ జొచ్చితి వయో మేలే హరీ దీనికిం
కే నేమందును డాఁగఁబోయినఁ దలారిల్లయ్యె నేఁ డేడకుం
బోనౌఁ జిక్కితి వంటయింటిశశమై బోనంపుఁ బెన్నాటికిన్. 298

చ. ఇదె కనుఁగొమ్మటంచు నిటలేక్షణరూక్షకటాక్షవీక్షలన్
గుదిగొని నిప్పు లుప్పతిల ఘోరతరభ్రుకుటీకరాళమై
వదనము భానుమండలము వైఖరి జేగుఱుచాయ మించఁగా
గదఁగొని త్రిప్పివైచె లయకాలమహోద్ధతి [1]తీరుమీఱఁగన్. 299

తే. ఆగదాదండ ముద్దండమగుచుఁ దాఁకి, శోకవేంద్రుఁ డైనను దులువదయ్యె
నేమిచెప్పుదు బృథురోమనామధేయ,మపుడు సార్థకమయ్యె మత్స్యంబునందు.

వ. అంత. 301

మ. ఘనరోషంబున మీనమూర్తి నిజశృంగంబెత్తి తీరస్థుఁడై
మనుజాశిప్రభు నేయఁగాఁ దెగియె రంభాస్తంభముంబోలి త
త్తను వచ్చో నరుణోదయం బయినచందంబొప్ప రక్తౌఘము
ల్వనధిం దేలె వినిద్రతం దగెఁ జతుర్వక్త్రాబ్జము ల్బ్రహ్మకున్. 302

తే. నిదురమేల్కాంచి వేదము ల్నెమకి కానఁ, జాల కంభోజభవుఁ డబ్ధిఁదేలియాడు
మీనమూర్తిఁగనుంగొని మేనువొంగఁ, జేరి ప్రణమిల్లి సన్నుతిచేసె నిట్లు.

శా. శ్రీమీనాకృతయే నమోభగవతే సృష్ట్యాదిసంధాయినే
హైమాహార్యరుచే హృతానతశుచే సారావపాథోముచే
సాముద్రాంబువిహారిణే దితిజనుస్సంహారిణే హారిణే
స్వామి న్పాహి కృపాహి తే హితతరా సర్వేషు దేహి శ్రుతీః. 304

మ. అని వర్ణించు సువర్ణగర్భునకు వేదాళిం బ్రసాదించి గ్ర
క్కునఁ దైత్రిలోక్యము సృష్టిసేయుమని శ్రీకాంతుండు పంప న్మహా
దని వాణీశ్వరుఁ డాగమోక్తముగ సూర్యాచంద్రతార ల్దివం
బునుభూమిన్నభము న్సృజించెను యథాపూర్వంబుగా నంతటన్. 305

క. అనఘుండగు సత్యవ్రతు, మనుపట్టముగట్టె శౌరి మన్ననఁ జతురా
ననుఁ డాతఁ డె వైవస్వతుఁ, డను పేరంగలిగి యిప్పుడలరె న్మిగులన్. 306

మ. మనుజాధీశ్వర యిందిరారమణు శ్రీమత్స్యావతారంబు భ
క్తిని విన్నట్టి కృతార్థు లుత్తమరమాదీర్ఘాయురారోగ్యము
ల్గని సత్యవ్రతసార్వభౌముని గతిం గల్పాంతరస్థాయికీ
ర్తిని జెన్నొందుదు రబ్జనాభుకరుణాదృష్ట్యైకపాత్రంబులై. 307

క. అని శ్రీవైశంపాయన, మునిముఖ్యుఁడు దెల్ప విని ప్రమోదాన్వితుఁడై
జనమేజయుఁ డవ్వలికథ, యనఘా వినవలతుఁ దెలుపు మని యడుగుటయున్.

మ. తనయాగ్రేసర రామదాసవిలసత్సాహిత్య హృష్యన్మనో
వనజాశంకరదాస గానకలనా వైయాత్యవీణానువా

[1] మీఱవైచినన్.

దన సమ్మోదన పద్మనాభపరితోదారార్థశృంగారఖే
లనపద్యాదరరంగశాయి మధురాలాపప్రియంభావుకా. 309

క. లక్ష్మాంబికామనోహర, లక్ష్మీకరుణాకటాక్ష లక్షణలీలా
లక్ష్మణవాణీవైభవ, లక్ష్మణపూర్వావతార లలితాకారా. 310

కవిరాజవిరాజితము. ధనపతితారణ దుర్మదతారణ దానయుతారణరంగహరా
ఘనగిరివారణ గర్జితవారణ గంధిలవారణ మధ్యపురా
యనఘవిచారణ హర్షితచారణ యంబుజచారణ కాంతిధురా
వినమితకారణ వీరనికారణ విక్రమకారణ ధైర్యధరా. 311

గద్య. ఇది శ్రీరామభద్రదయాభిరామభద్రకరుణాకటాక్షవీక్షాపరిప్రాప్తదీప్తతరాష్ట
భాషాకవిత్వసామ్రాజ్యధౌరేయ సకలవిద్వత్కవిజనవిధేయ ధరణిదేవుల నాగ
నామాత్యసుధాసముద్రసమున్నిద్రపూర్ణిమాచంద్ర రామమంత్రీంద్రప్రణీతం
బైనదశావతారచరిత్రం బనుమహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

౧. మత్స్యావతారకథ సమాప్తము.





# ౨. కూర్మావతారకథ.



## ద్వితీయాశ్వాసము.



నారీమణికరుణాం
భోనిధిసంభవవిచిత్రభోగానంద
స్థానవిచక్షణ చంచ
న్నానాగుణకృష్ణ పద్మనాభునికృష్ణా 1

తే. అవధరింపుము జనమేజయక్షితీశ
శేఖరున కిట్టు లను వ్యాసశిష్యమౌని
ధారుణీనాథ కూర్మావతార మింకను
దెలియఁ జెప్పెద విను మని తెలుపఁ దొడఁగె. 2

తే. జగములు సృజింపఁ బోషింప సంహరింపఁ
జాలుమూర్తులఁ గని పెంపఁజాలినట్టి
యత్రి కనసూయకును సాటియైన మౌని
దంపతులు గల్గుదురు జగత్త్రయమునందు. 3

క. ఆదంపతులకు గిరిక, న్యాదయితాంశమునఁ బుత్త్రుఁ డనఁ బొడమి స్వతః
ప్రాదుర్భూతజ్ఞానుం, డై దుర్వాసస్తపోధనాగ్రణి వెలయున్. 4

క. కోమలపల్లవనిభవా, సోమునిఁ బరిపీతవసనసోముని సుషమా
సోమునిఁ బోలిన దుర్వా, సోముని నుతియింపఁ దరమె సోమునికైనన్. 5

క. ఆలీలాశివుఁ డానం, దాలోలపయోధి మగ్నుఁ డై యెల్లపుడున్
బాలునివలె నున్మత్తుని, పోలికఁ జరియించుచుండు భువనములందున్. 6

క. అతఁ డొకనాఁడు సువర్ణ, క్షితిభృత్తట విహరణంబు సేయఁగ నత్య
ద్భుతమై యొకవాసన రా, మతి నెంతయుఁ జెలఁగి భృంగమార్గోన్ముఖుఁ డై.

సీ. గంధర్వభామినీగానశ్రుతీభవత్కీచకనికషణోద్గీర్ణరవము
కపిధూతశాఖిశాఖాపతజ్జాంబవగ్రహాయాళుమునికన్యకాజనంబు
లగ్నకాషాయకాలస్కంధమిషతటిత్వద్విలోకననటద్బర్హిణంబు
శుకదష్టమాకందమకరందవాహినీతీరణలీలాలోలహరిణకులము
తే. సతతమునిదత్తహవిరన్నజనితతుంద, భారసుత్రామపహానదుర్బలఘునప్ర
కామబలవర్ధనోద్దామహోమధూమ, పావనం బగు నొక్కతపోవనంబు. 8

తే. కాంచి తత్రత్యమౌను లాకస్మికముగఁ
దనునిరీక్షించి యయ్యష్టతనునిఁ గన్న
కరణి భక్తియొనర్పఁ గ్రేఁగంటఁ గనుచు
వాసనాహేతు వరయుచు వచ్చి యెదుర. 9

సీ. చిన్నిప్రాయముదానిఁ జిన్నారిపొన్నారి యంచరానడలసోయగముదానిఁ
గోదమగుబ్బలదానిఁ గ్రొమ్మించుగ్రమ్మించు నెమ్మేనినిగనిగన్నిగలదాని
ముద్దుఁబల్కులదాని నిద్దంపుటద్దంపుమురిపంపుసోము నెమ్మోముదాని
రవలపావలదాని రంగారుబంగారుతమ్ములఁ గేరుహస్తములదానిఁ
తే. జెలువుగలదాని నెఱనీటు గులుకుదాని
సొగసుగలదాని బెళుకుకందోగలదాని
సొంపుగలదాని నొయ్యారమొలుకుదాని
నొక్కవిద్యాధరినిఁ గాంచె యోగివరుఁడు. 10

తే. అప్పు డొకయించుకేని యయ్యతివతంస
మాత్మఁ జలియింపఁ డీశ్వరాంశావతారుఁ
డీమహామహుఁ డంచు మోహింపఁజేయ
వెఱచెఁ గాఁబోలు నవ్వేడవింటిజోదు. 11

సీ. అతనుజపావృత్తి నలరారుచెలికేలు దొరసినస్ఫటికాక్షసర మనంగఁ
బాణిపంకజమునఁ బ్రభవించి యొండొండ దిగజారుతళుకుముత్తెపుసరి యన
హస్తాభిధానమోహామునశయంబున వ్రాలిననక్షత్రమాలిక యనఁ
గమనీయనవ్యశృంగారకరోర్మికాపరిపతజ్జలబిందుపాళి యనఁగ
తే. నఖరనిష్క్రాంతకాంతిసంతాన మనఁగ, మధుకరాకర్షిఘుటికాసమాజ మనఁగ
హస్తగతకంతుభాగ్యవర్ణాళి యనఁగ, నలరుసంతానసూనమాల్యంబు గాంచి.

తే. మేలుగావలె బాల నీకేలిపూల, దండకనిచేరు మౌనిమార్తాండుఁ జూచి
దండనుండు వధూటి కై దండ వదలి, దండ మని కేలుమోడ్చి వేదండగమన. 13

క. కులుకువలిగబ్బిగుబ్బలఁ, జిలుగుంబయ్యెంటఁ జక్కఁ జేర్చుచుఁ బలికె
న్నలకంఠి బెళుకుకన్న, తళుకులు వేఱొక్క కుసుమదాముగూర్పన్. 14

ఉ. ఓమునిసార్వభౌమ తపనోపమధామ గుణాభిరామ సు
త్రామముఖామరుల్ భవదుదంచితకీర్తులు సన్నుతింపఁగా
నేమును విందు మీపదము లెన్నఁడు నేఁ గనువిందుసేయ నేఁ
డీమెయి సంభవించె ఫలియించెను గోరిక లెల్లఁ గొల్లగన్. 15

క. కావలసినఁ గైకొనుమా, పావన మగుఁగాక నాదుభవమదవీయం
బీవన మంచు మునీంద్రున, కావనిత ప్రసూనదామ మామోదమునన్. 16

క. ఇచ్చిన మచ్చికఁ బుచ్చుక, యచ్చెలి మెచ్చుచు మునీంద్రుఁ డౌఁదలఁ దాల్చెన్
జిచ్చుఱకనుదేవర వై, యచ్చరనదిఁ దాల్చుచెలువ మచ్చుపడంగన్. 17

తే. ఇటుల దాలిచి సంతుష్టహృదయుఁ డగుచు
మరలి కరమునఁ గైకొని మమతమీఱఁ
గన్నుఁగవ నొత్తికొనుచు వక్షంబుఁజేర్చి
కంఠమున వైచి యవల నుత్కంఠఁ జనుచు. 18

సీ. గంధర్వులగ్రభాగమున జోడనమించు ఘోటుల దుమికించుకొనుచు నడువ
వెనుదండ నుద్దండవేదండకాండము ల్సమదమంధరయానసరణి నడువ
నిరువంక నకలంకవరరత్ననిర్మితహాటకరథకోటు లరుగుదేర
వెలిడాలు గ్రమ్మించు విచ్చుకత్తుల వేల్పుమూఁక లెల్లెడలఁ గ్రమ్ముకొని నడువ
తే. గంభనాట్యంబు మిగుల సంరంభ మెసఁగ, వెల్లయేనుఁగు నెక్కి శ్రీవెల్ల మెఱయ
వెలయువేడుక వాహ్యాళి వెడలివచ్చు, నమరనాయకుఁ గాంచి సంయమివరుండు.

తే. చేతి పూదండ పైని వైచిన సురేంద్రుఁ, డది కరంబునఁ గైకొని మదకరీంద్ర
కుంభమున నిల్పఁ జెలువయ్యె శంభుశైల, శృంగసంగతగంగాతరంగిణి యన. 20

తే. అంతఁ జంచలకుంభికుంభాగ్రనిహిత,పుష్పదామంబు దిగజాఱి భూమిఁ బడియె
దేవవిభురాజ్యగర్వతమోవినాశ, సూచకంబయి పడు తోఁకచుక్క యనఁగ. 21

వ. అంత. 22

క. శీకరమదధారాజల, శీకరభీకరము పొల్లసితమధుపాళీ
శ్రీకర మౌ కరమున గం, ధాకరమాల్యంబు దిగిచి యత్తఱిఁ గడఁకన్. 23

తే. చరణములవ్రాలి కర్ణదేశముల సోలి
యాశ్రితాళులు మొఱవెట్ట నాలకింప
కలరుసరి రాచె మదకరి యంతెకాదె
యాశ్రితులయుక్తు లేల మదాంధులకును. 24

క. ఈమెయిఁ దా నిచ్చినసుమ, దామము సామజము దిగిచి ధరఁ బొరలింపం
గా ముని గనుఁగొని తొలుతం, గాముని హరియించుహరునిగతి నుగ్రుండై. 25

చ. కటతటముల్ చలింపఁ గడకన్నుల నిప్పుక లుప్పతిల్ల భ్రూ
కుటి నటియింప నెమ్మొగము కోటిరవిప్రతికోటిగాఁగ వి

స్ఫుటపటుదీర్ఘనిశ్వసనము ల్బలితంపుసెకల్వెదిర్పఁగాఁ
గిటకిటఁబండ్లుగీటి పలికెం జటిధూర్జటి హుంకరించుచున్. 26

ఉ. కన్నులు బ్రహ్మ రెండొసఁగఁ గానఁగ లేఁడని గౌతముండు దాఁ
గన్నులు వేయొసంగె నధికంబుగ నప్పు మదాంధకారసం
ఛన్నము లౌటచేఁ దెలియఁజాలవు తన్మదకారణంబు సిం
క న్నినుఁగూడనీయ కుపకారముచేసెనఁ జూడు వాసవా. 27

ఉ. ఏమునవచ్చు నిన్నిఁక సురేశ్వర! నే సుమదామ మిచ్చినన్
స్వామి! మహాప్రసాదమని చయ్యన నంది ప్రమోదలక్ష్మి నె
మ్మోమువికాసమొంద నిజమూర్ధమునం ధరియింప కీగజ
గ్రామణి చేతికిచ్చి కసుగంద నొనర్చితి ధౌర్త్య మెన్నఁగన్. 28

ఉ. ఇందునఁగాని మే మెఱుఁగమే భవదీయమహత్వ మోరిసం
క్రందన నన్ను నెవ్వనిఁగఁ గాంచితి విప్పుడు విప్రమాత్రుఁగా
డెందమునం దలంచితివొ డెప్పర మప్పని నన్నువిన్న గో
విందధృతాబ్జరోచిరరవిందభవాదులు దల్లడింపరే. 29

చ. ఎఱిఁగెదుగాక మాట లిఁక నేటికి నేఁటికి మాటిమాటికి
న్మఱచితె నామహత్త్వము సమస్తజగజ్జనగీయమానమై
మెఱయ వసిష్ఠముఖ్యులగు మిక్కిలిశాంతులరీతిఁ జూచితో
యఱిముఱివజ్రశుంఠవుగదా యవిదారణకారణాయుధా. 30

చ. అలుకవు బ్రహ్మహత్యకుఁ బరాంగనసంగతి కోటలేదు క్ష్మా
తులపగ నీకవశ్యకము దోసముసూడవు యజ్ఞవిఘ్నముల్
సలుపుటకై పరోన్నతికి సైఁపవు నీకు సురేంద్రపట్టముల్
నిలిపినధాత దూఱవలె ని న్ననేటికి గోత్రభేదనా. 31

సీ. అవిపక్షవిచ్ఛేదనాయత్తతరుఁడవే వపిపక్షరక్షణోదారుఁ డతఁడు
పాకశిక్షణదక్షపవి వీవు సర్వతోముఖపాకపోషణోన్ముఖుఁ డతండు
ఘనశృంఖలాబంధకరణలోలుఁడ వీవు బహుఘనజీవనప్రదుఁ డతండు
పుణ్యజనద్వేషపూరితాత్ముఁడ వీవు పుణ్యజనావాసగణ్యుఁ డతఁడు
తే. సతతసత్త్వవిభాసి రాజసగుణాతి, దూరుఁ డబ్భువననిధినిస్తుల్యుఁ డెందుఁ
దలఁపఁ ద్రైలోక్యలక్ష్మి యాధన్యుఁ జేరు, నీకు నెయ్యేది యటమీఁద నిర్జరేంద్ర.

క. భూసురులకు నవమానము, సేసిన నెటువంటివాని శ్రీయు వేయునే
వాసవ మముఁబోఁటులకుం, జేసిన నందేమి చింతచేయఁగ నింకన్. 33

చ. అన విని గుండె జల్లన సురాధిపుఁ డభ్రమువల్లభంబు చె
య్యనడిగి వల్లెవాటుగ భుజాగ్రమునందగు మేలిజాళువా

జినుఁగు మెఱుంగు బంగరువు చేల చెఱంగు కటీతటంబునం
బెనఁచి మునీంద్రుపాదములమీఁదట వ్రాలి వినీతిమీఱఁగన్. 34

క. స్వామీ నే మీదాసుఁడ, నామీఁదం గోప ముంప నాయమె కరుణా
కోమలకటాక్షవీక్ష, శ్రీ మెఱయఁగఁ బ్రోవు నతులు చేసెద మీకున్. 35

క. భవనిభ మీ రిపు డెన్నిన, యవగుణపుంజముల కెల్ల నాస్పద మగు నే
నవివేకి నాదు నైనఁ, భవదంఘ్రులు చేరినాఁడఁ బాలింప దయన్. 36

క. నేరిచిన నేరకున్నను, గూరుచుకొని రాక మీరె కోపించిన నె
వ్వారిఁక మాకు శరణ్యులు, కారుణ్యం బంపవయ్య కరుణావార్ధీ. 37

క. పెక్కువగల హరి యిటువలెఁ, బెక్కువగల వేఁడ మౌని పృథుహుంకార
మ్మెక్కు వగలఁ జేయఁగ లోఁ, మక్కువ గలయట్టు లనియె మఘవునితోడన్.

తే. విబుధనాయక నీ వెంత వేఁడికొనిన, నాకు దయరాదు శాంతి యెన్నఁడు నెఱుంగ
నట్టిమౌనులు వేఱె మమ్మటులు గనకు, కఠినచిత్తుని దుర్వాసుఁగా నెఱుంగు. 39

తే. గౌతమాదులు నిన్ను శోకఘనునిఁ జేసి, వినుతి సేసిన నీవును విఱ్ఱవీఁగి
యిటులు నవమతి చేసితి వింతె కాని, యెఱుఁగలేవైతి మమ్ముల నించుకైన.

సీ. తనకుఁ బ్రత్యుత్థాన మొనరింపకుండిన క్షమియించుకొన బృహస్పతిని గాను
దనభార్య బలిమిఁ బట్టినఁ జూచుకొని తాళుకొన నే నలయుతథ్యమునిని గాను
దానంపిన త్రిశంకు ధరణి ద్రొబ్బంగఁ గాంచియును సైరింపఁ గౌశికుఁడఁ గాను
దనయాగమున నాయుధమును వైచిన తప్పుఁ బాటింపమికి గురుభ్రాతఁ గాను

తే. దనకళత్రంబు లోఁ జేసికొనుట యెఱిఁగి
యమితనేత్రము లొసఁగ గౌతముఁడఁ గాను
వసుధ సత్శాంతిసారసర్వస్వ మగుచు
వెలయు దుర్వాసుఁగా నన్నుఁ దెలియు మింద్ర. 41

తే. ఊర్వశీనందనుఁడు మేనకోపభర్త, వేగ నీయిల్లు గాచి దీవించి యక్ష
తంబు లొసఁగెడివారు నీతప్పు సైఁప, వలయుఁగా కేల సైరింపవలయు మాకు.

మ. కుటిలభ్రూకుటికంబుఁ గ్రోధదహనక్రూరజ్వలజ్జ్వాలికా
చటులాక్షంబు రదచ్ఛటాకిటకిటస్వానంబు శేషాహివి
స్ఫుటఫూత్కారకరాళనిశ్వసనసంపూర్ణంబు భూమోనట
త్కటమౌ మద్వదనంబు గన్గొనఁగ శక్యంబె పురారాతికిన్. 43

క. త్రైలోక్యరాజ్యసంపద, చాలా వశమయ్యె ననుచుఁ జర్చింపంగా
నేలా యిఁక క్షీరాంబుధి, పాలౌ నని చనియె మౌని పాలకుఁ డధిపా. 44

తే. శాంతినిధి తండ్రి యనసూయ జనని యనుజుఁ
డమృతదీధితి యట్లయ్యు నౌగ్రవృత్తి

విడుపలేఁడయ్యె దుర్వాసుఁ డడుగనేల
యంశఫలమే ప్రధానమౌ నఖిలమునకు. 45

క. దుర్వాసుఁ డిటులు శాపము, దుర్వారముగా నొసంగి తొలఁగిన నంతే
నిర్వేదన మదిఁ బర్వఁగ, నుర్వీధరవైరి నిజపురోన్ముఖుఁ డగుచున్. 46

తే. అకట యొకతప్పు సైఁపక యతి శపించె
ముక్కునను యుండుఁ గోపంబు మూర్ఖమునికి
నెఱిఁగి పూజింపలేనైతి నేను మున్నె
యింకఁ జింతింప నవ్వరే యెవ్వరేని. 47

సీ. ఊరకెయుండక యుబుసుపోకలకునై యేనేలవచ్చితి నిట్టిపనికి
వచ్చిననేరమే వలసినచోటికి నేను రా మాని రానేల యిటకు
వచ్చినవాఁడు దోవిపనెపోక పూవండ నేటికి నామీఁద నెగురవైచె
వైచిన నదిగొని వరభక్తిముడువక కరి కేలయిచ్చితిఁ గండక్రొవ్వి

తే. యంతమాత్రంబునకె మాని యలుగనేల, యింతలేనులు రానేల యేమి సేయ
నింక నెవ్వరి వేఁడుదు నేది దిక్కు, హావిధీ యెంతచేసితి వనుచు వగచి. 48

సీ. ఐరావతారోహమై రాదు తెలితేజి తెమ్మన్నఁ గానక తిరుగు సాది
సంగీతమేళ మచ్చరలఁ బిల్వఁడటన్న వెదకి లేరని వచ్చు వేత్రధరుని
నందనవనిఁ గల్పనగములు లేవని పలుకరించిన వనపాలకులను
గామధేనువు దొడ్డిఁ గాన మెందేగెనో యని విన్నవించు గోష్ఠాధిపతిని

తే. బృథులచింతామణీభద్రపీఠిఁ గొల్వు
చావడిని లేమిఁ దెల్పు సంచారికులను
బొక్కసము శూన్య మగుటకుఁ బొగులువారిఁ
గాంచి దేవేంద్రుఁడు విచారకలితుఁ డగుచు. 49

తే. చిన్నవోయినమోమునఁ జేరవచ్చి
దివిజపురి యెల్ల నేనుఁగుదిన్నవెలఁగ
పంటివలె రిక్తయగుచు [1] నప్పటికి నున్నఁ
గాంచి యతఁ డుండె నిలుపేదకరణి నంత. 50

సీ. పనిగల్గి పిలువనంపినఁ జేరరారైరి దినముఁ గొల్వఁగ వచ్చుదిగధిపతులు
నెన్నఁటివలె సప్తఋషులు వేగినవచ్చి "విజయోస్తు" టంచు దీవింపరైరి
సంబళంబులొసంగి సంతరింపఁగలేమి విడిచి పోఁదొణంగె విబుధబలము
భయభక్తియుక్తి నెప్పటి [2]మేరఁ దనయాజ్ఞఁ బాటింపదయ్యెను పౌరజనము.

తే. మించి మెం డొడ్డసాగెను మిత్రకులము, గడలకేగిరి తగునూడిగములవారు
బయలుదేఱిన సుతుఁడు లోపలను సతియు, గాసి యన్యులు లేరైరి ఖచరపతికి.

---

1 నప్పంటిదున్నఁ. 2 వలెఁ

తే. మానిశాపనిదాఘజృంభణమువలన, [1]శ్రీకృపామృతవీక్షణసిద్ధిలేక
భువనములు క్షామ మొందిన నవనిజనులు, సత్త్వహీనతఁ గర్మము ల్సలుపరైరి.

వ. అది యెట్లంటేని యక్కాలంబున సవనప్రచారంబు శార్దూలంబుల దానంబు దంతావళంబుల ధర్మంబు ధానుష్కకరంబులఁ దపోనిరూఢి కాలంబున వ్రతంబు మధువ్రతంబుల సదాచారంబు సదాగతి నధ్యయనపాటవంబు కురంగంబుల ధారాశుద్ధి తురంగంబుల నష్టాంగయోగంబులు వజ్రంబులం గాని జనులందు నెందుఁ జెందమిఁ గ్రముకమాత్ర పురోడాశంబు నెఱుంగక యాసాసల నాఁకటం గుంది కంది పురందర ప్రముఖ బృన్దారకబృందంబులు వెన్నంటికొనిన యుదరంబులు గుంటలువడినకన్నులు దిమ్మదుచుకర్ణంబులుం గలిగి యెల్లెడలం బరిభ్రమించుచుండి రయ్యవసరంబున. 53

తే. మయవిరోచనమాలిసుమాలిపాక, జంభతారకశుంభనిశుంభమహిష
నముచిముఖులగుదైత్యదానవులఁ గూడి, బలి సుపర్వులపై దండువెడలె నపుడు.

సీ. లిబ్బి నిబ్బరపుబ్బుగబ్బిగుబ్బెతమిన్న కలఁగి గొబ్బున నాథుఁ గౌఁగిలించె
బిట్టుల్కి గట్టురాపట్టి దొట్టినభీతిఁ జెవులఁ జుట్టనవ్రేళ్లు చెఱినికొనియె
నుడువులనఁబోణి జడియకుమని వెన్నుసఱచు ప్రాణేశు ఱెచ్చవడిచూచె
దిగులొంది మూర్ఛనొందినశచీదేవికి శైత్యోపచారము ల్సలిపె వజ్రి

తే. కడమ కిన్నరగంధర్వఖచరసిద్ధ, సాధ్యవిద్యాధరాంగన ల్చకిత లగుచు
నేమి యైరొకో తెలియ దుద్దామభీమ, రణరణద్భేరిధణధణంధణల నపుడు.

సీ. ప్రతిసాగరంబులై భద్రేభకర్ణస్రవన్మదాంబువులు భువనములాన
ధాటీనిరాఘాటఘోటీఖురాగ్రభగ్నపరాగములు పరాగములఁబోలఁ
జక్రపదావక్రచక్రమార్గంబుల భోగవత్యాపగాంబువులు వెడల
సైనికాస్త్యాన్యోన్యసంఘర్షణస్ఫులింగంబు లంగారవర్షంబుగురియ

తే. భూరిజయభేరిభాంకారఘోరరావ, పూరితాపారగహ్వరోదారమేరు
ధారుణీధ్రంబు మొఱవెట్ట దారుణముగ, దండువిడిసె బలీంద్రుఁ డక్కొండదండ.

తే. అంతఁ దనసైనికుల దుర్గ మాక్రమింపఁ
బంపుటయు వారు చటులదోర్బలము మెఱయఁ
గొండప్రక్కల నుక్కళ ముండువేల్పు
తండములఁ జెండి యెక్కి యక్కొండయందు. 57

క. తెంపలు గలయడవులఁ దగి, లింప నిలింపాహితుల్ స్ఫులింగము లెగయం
బెంపెసఁగెఁ బావకుఁడు బలి, సంపూరితతేజమనఁ బ్రచండస్ఫూర్తిన్. 58

తే. ఇంతపొడ వెక్కి రని బలి కెఱుకపడక, వనుల దగిలించినట్టి యవ్వహ్నికీల
దెలియరాదయ్యెఁ గనకాద్రిదీప్తివలన, ధూమ మెసఁగెను దానవస్తోమరుచుల.

1 శ్రీకృపావీక్షణామృతసిద్ధి.

సీ. వెలవెలఁబాఱుమోములులావులుసలింపఁ గదలెదిక్కులకు నై గరుడకులము
నిరవలంబంబునఁ దిరుగుచు వెఱ నోరు దెఱచుచుఁ జనియెఁ గిన్నరకులంబు
జోడనపీడి యచ్చోచ్చనిబ్బరపుఁబఱవ్వనని దాఁటదొడఁగె గంధర్వకులము
వెఱచి పతాకాకులపృత్తిఫణము ద్రిప్పి పాతాళమంటె నప్పన్నగతతి

తే. కౌశికాదులు పగలైనఁ గానలేక, కన్నుఁగవలందుఁ దిమిరంబు గప్పికొనినఁ
బఱచె నెల్లెడ బలిదుష్టబలము మించి, కాంచనక్షోణిధర మాక్రమించినపుడు.

వ. ఇవ్విధంబున బలి ప్రతాపతపనతప్తం బగుచు విగళితపౌరుషరసాసారం బగు స్వర్గకాసారంబున నిలువం జాలక నిఖిలానిమిషజాలకంబు సంచలించుచు జీవనప్రదం బగుసరస్వతీరమణుం జేరంగోరి మేరూపరిభాగభాగనితరసాధారణా మణిగణిలోకచ్ఛన్నవిలోకిలోకావలోకం బగుకమలభవులోకంబునకుఁ జని. 61

సీ. వెలిదమ్మిరేకుపొత్తుల చిన్నిపాపఁడు నలుమోముదమ్ముల వెలయుసామి
తళుకుబంగారుఱెక్కలవారువముజోదు బ్రతుకుప్రొద్దులలెక్కవ్రాఁతకాఁడు
కడుపుబంగారుబొక్కసము సేసినదొర జీవసూత్రమున సృష్టించుజాణ
కెందమ్మిగద్దె యెక్కినవేలుపులపెద్ద పలుకుఁబూఁబోఁణికిఁ బ్రాణపదము

తే. దినముఁ జోరిడుగాయకుఁ గనినగేస్తు, కలిమిజవరాలు నోముకకన్నబిడ్డ
కంతుగాఁడిలితోడు లోకములతేఁడు,నలువ గొలువున్నకనకమండపముఁ జేరి.

క. అష్టదిగీశాదిసురల్, స్రష్టను సాష్టాంగ మెరఁగి స్వామీ! కరుణా
దృష్టిని దృష్టింపుము బలి, దుష్టావష్టంభ మెల్లఁ దొలఁగింపు వెసన్. 63

మణిగణనికరము. అని మఱియును వినయముదగ విబుధు
ల్వనరుహభవపదవనజయుగము పైఁ
గనకమకుటమణిగణనికరరుచుల్
పెనఁగొన నతి సలిపిన విధి గరుణన్. 64

తరళ. తరళభావముఁ జెందనేటికి దైత్య దానవకోటికిన్
సరళవై ఖరి ముజ్జగంబులఁ జాలఁ బ్రోదియొనర్పఁగా
గరళకంధరుఁ డున్నవాఁ డిఁకఁ గ్రక్కునన్ రజతాద్రికిం
దరలఁగావలె నంచుఁ జెప్పెఁ దమ్మిగద్దియ డిగ్గినన్. 65

సీ. ఒఱగంటమెఱుఁగెక్కనొఱయుంగఁగలఱెక్క హొన్నంచుపక్కెరయుదుటుసూపఁ
దళుకుకారు మెఱుంగు దొలఁకుముక్కు మెఱుంగు పగడపునొసపరిజిగిచిగుర్ప
సంజకెంజిగి సేలుచరణయుగ్మముడాలు వలయంపువింతచెల్వంబు సూప
ముక్కున నసియాడుముదురుతామరతూఁడు ముత్యాలకళ్లెంబుమురుపు నెఱపఁ

తే. గళుకుమెఱుచాయ లుభయభాగములయందుఁ
జిలికి జగజంపుజల్లులచెలువు నింప

మలయు రాయంచకొదమసామ్రాణి నొక్క-
సాది దెచ్చినఁ జూచి ప్రసాది యగుచు. 66

మ. ఎలమి న్బంగరుతెక్కపక్కెరవహిఁమాయాతేజి దాఁటించుచు
న్నలు మోమయ్య హుటాహుటిం గదలెఁ జెంతం జేరి జేజేలరా
యలు సాహోయని హెచ్చరింప సుభటోద్యత్ఖడ్గకాంతిచ్ఛట
ల్వాలి పెంపుం దెలిచల్వపావడలువైవ న్దుందుభుల్ మ్రోయఁగన్. 67

శా. ఈలీల న్సురలెల్లరు న్గొలువ వాణీశుండు శీఘ్రంబుగాఁ
గైలాసంబున కేగి శంభునకుఁ దత్కార్యం బెఱింగించిన
న్కాలాత్ముం డొక కొంతసేపు మదిలో భావించి వైరోచని
న్దూలింపన్ హరి వేఁడఁబోద మని తోడ్తో సంభ్రమం బెచ్చఁగన్. 68

ఉ. గుబ్బలిపట్టిగబ్బివలిగుబ్బల జొబ్బిలుతావికుంకుమం
గబ్బికొనంగఁ జాలు నెదఁ గప్పిన బెబ్బులిపన్నెపచ్చడం
బబ్బురమై తనర్పఁ బ్రమథావలి యుబ్బుచు వెంటనంటఁగా
గిబ్బవయాళితేజి దుమికించుచు వచ్చె మహేశుఁ డత్తఱిన్. 69

క. ఈరీతి సకలనిర్జర, వారము గొలువంగ భవుఁడు వారిజభవుఁడున్
క్షీరాంభోనిధితీరముఁ, జేరి నతుల్సలిపి నుతులు చేసిరి భక్తిన్. 70

సీ. ఎయ్యదిప్రకృతివిహీనమై సచ్చిదానందనిత్యప్రపూర్ణత వెలుంగు
స్వగతసజాతివిజాతీయభేదముల్ గాంచు నెయ్యది సర్వకాలమునను
జీవేశ్వరాఖ్యలఁ జెలఁగు నెయ్యది యవిద్యయు విద్యయు నుపాధులై తనర్చు
జ్ఞానంబు జ్ఞేయంబు జ్ఞాతయుఁ దానయై వర్తించు నెద్ది సర్వంబునందు
తే. నట్టివేదాంతవేద్య మాద్యంతరహిత, మమలయోగీంద్రనిష్ప్రపంచాభిధాన
లక్షలక్షిత మపవర్గలక్షణంబు, నైనబ్రహ్మంబు మూర్తమై యలరుఁ గాఁత. 71

సీ. ఎవ్వఁడు 'తత్త్వమసీ'తి వేదాంతవాక్యంబు వాచ్యార్థమై యలరుచుండు
నెవ్వనికనుసన్న నీచరాచరములం బుట్టించు మాయ యద్భుతముగాఁగ
నెవ్వఁడు వరయోగిహృదయాబ్జమునఁ బరంజ్యోతిస్స్వరూపుఁడై యొప్పుమిగులు
నెవ్వఁడు లక్ష్మీసమేతుఁడై క్షీరాబ్ధి ఫణిరాజుశయ్యపైఁ బవ్వళించు
తే. నెవ్వఁ డఖిలజగత్త్రాణహేతుభూతుఁ, డెవ్వఁ డానతసజ్జనాభీష్టదాత
యెవ్వఁ డఖిలగుణాస్పద మెంచ నట్టి, శ్రీవధూనేత సాక్షాత్కరించుఁగాఁత.

వ. అని యివ్విధంబున నంభోజసంభవశంభుదంభోళిధరప్రభృతు లదంభగంభీరవ
చోనిగుంభనంబులం బొగడు చున్న సమయంబున. 73

సీ. దంతిమహాపద్మధనదక్షుఁ డగువాఁడు పద్మాప్తపత్త్రవిభ్రమమువాఁడు
కరగతశంఖచక్రవిజృంభణమువాఁడు మకరకుండలదీప్తి మలయువాఁడు

భావికచ్ఛపరూప భావకుం డగువాఁడు శ్రీముకుందాఖ్యచేఁ జెలఁగువాఁడు
ఘనసారకుంద చందనకీర్తిగలవాఁడు నీలమేఘచ్ఛాయ నెగడువాఁడు
తే. శ్రీవరఖ్యాతిచే విలసిల్లువాఁడు, శ్రితనవని ధానరీతి వర్తిల్లువాఁడు
నఖిలలోకైకరక్షకుఁ డైనవాఁడు, హరికృపామయమూర్తి ప్రత్యక్షమయ్యె. 74
తే. ఇట్లు ప్రత్యక్షమయిన సర్వేశ్వరునకు, నవని సాష్టాంగమెరఁగి బ్రహ్మాదిసురలు
నిర్భరానందమగ్నులై నిలిచియున్న, వారిఁ గనుఁగొని యాదానవారియనియె.
సీ. ఒకముఖంబున సృష్టియొడఁగూడదే విచారమున వచ్చితి వేమి కమలగర్భ
ధరణి భైక్షం బెందు దొరకదాయెనె చిక్కి సగమైతి విదియేమి చంద్రమౌళి
వేయిభంగులను గావించె దాలోచన క్రమము స్వాస్థ్యము లేదె ఖచరనాథ
దెసలనొందినయట్టి తీరుగానఁగవచ్చెఁ బలుకాడరేమి దిక్పాలురార
తే. పెక్కువగ లొందెద వదేమి బిసరుహాప్త, చిన్నపోయెద వదియేమి శీతకిరణ
యితరసుమనస్సులార మీరిటులువాడి, యుండ నేటికి నామోద ముడిగి యనిన.
తే. అంబురుహగర్భుఁ డనియె లోకైకనాథ, సహజమే సృష్టి యేమియు సాగనీక
బలి నిలింపుల నెల్లఁ బంపంగఁ దొడఁగెఁ, గించిదవశిష్టమయ్యె స్వర్గికుల మనిన.
క. ధననాయకసఖుఁ డిట్లను,వనజోదరభైక్ష మేది వసుధాస్థలిలో
జనమెల్ల బలిరుపాభా, జనమయ్యె న్నిక్క మనిన శక్రుం డనియెన్. 78
తే. స్వాస్థ్యమెయ్యది జలజాక్ష శక్తిమెఱసి, నాఁడె స్వర్గంబు గైకొనినాఁడు బలియె
యెన్నిభంగులఁ దలఁచిన నేమి గలదు, స్వామివారికృపాకటాక్షంబు లేక. 79
తే. అనినఁ దక్కినదేవత లనిరి భక్తి, జైత్రగతిమించు వైరమాజాతికెట్లు
గలుగు నామోద మింకెటు ఘనుఁడవైన, నీకృపామృతవర్షంబు లేక శౌరి. 80
తే. అనిన విని వారిజోదరుఁ డాదరమునఁ, గలిమిబలిమిని నీకు లోకములయందు
నీడుజోడును లేదుగా యింద్ర యేల, పలుకనోడితి వన వజ్రపాణి పలికె. 81
క. సర్వేశ్వర వినిపించెద, నర్వము విన నవధరింపు సంపద లెల్లన్
దుర్వారతరదురాగ్రహ, దుర్వాసశ్శాపమునను దోయధిఁ జేరెన్. 82
తే. కాన నిశ్శ్రీకమైన నాకంబునందు, నిర్వహింపఁగ లేనైతి నీరజాక్ష
కలిమి సాలనివారికి బలిమి గలదె, యింక నెయ్యదిబుద్ధి సర్వేశ యనిన. 83
క. ఔనోయి యింద్ర నామెద, పైనుండెడు రమను గానఁ బ్రణయపుటలుకం
బూని యెటు నిల్చెనో యని, యేనుండితిఁ గాన జలధి కేగుట యెఱుఁగన్.84
ఉ. అక్కట లక్ష్మిఁ బాసి క్షణమైనను నేను వియోగవేదనం
జిక్కఁగలానె యెట్లయిన శ్రీతరుణీమణి వచ్చునట్లు గా
నొక్కయుపాయ మెంచవలె నూహ యొనర్చితి లక్ష్మిరాకకున్
గ్రక్కున వేల్పులెల్ల నమరత్వముఁ బొందుటకున్ సురోత్తమా. 85
తే. కవ్వముగఁ జేసి మంథరక్ష్మాధరంబు, వాసుకినిఁ ద్రాడుచేసి దుర్వారశక్తి

జలధిమథియింపుఁ డందునఁ గలుగు నమృత,మబ్జగేహినిపొడము సత్యమ్ముసుమ్ము.
తే. అదియునుంగాక యైరావతాదు లబ్ధిఁ,బొడముఁ బోయిన వెల్లను బూర్వసరణి
నింత యత్నంబుసేయ నీ కేకదేశ, మునను గూడదు దైత్యులపొందు లేక. 87
క. బలవంతు లైనదైత్యులు, గొలువఁగ నున్నాఁడు బలినిఁ గూర్చుక కలశీ
జలధిమథియింపుఁ డమృతము, గలిగిన తర్వాత వానిఁ గడవఁగవచ్చున్. 88
తే. వినవె యహిమూషకన్యాయమున ధరిత్రి
నాక్రమంబున నమరేంద్ర యసురవిభుని
తోడ సంధింపు మని పంపెఁ దోయజాత
నాభుఁ డరుదెంచె వైకుంఠనగరమునకు. 89
సీ. శాతోదరస్వామి ఘర్షించుఁ బలుమారు వలిగాడ్పు దనుఁజేరవచ్చె ననుచు
శుకనారదాదులఁ జూడంగనొల్లఁడు శుకనారదాఖ్యలఁ జొప్పడుటను
దెలివిమైఁ దనకన్నుఁ దెఱచి దృష్టింపఁడు వామాక్షిరుచులు తీవ్రంబులనుచుఁ
దనదు పేరిచ్చి పెంచినమాధవుని జెట్లపాలు గమ్మంచు శాపం బొసంగుఁ
తే. గన్నకొడుకును బగవానిఁగాఁ దలంచుఁ,దను విపాండిమ నీశ్వరత్వంబుఁదెలుప
భృగుసుతాయోగసంతాపపీడ్యమాన, మానసుం డగుచుండె నమ్మాధవుండు.
ఉ. అంతట నాదివస్పతి బృహస్పతిచెంతకుఁ జేరవచ్చి మా
ణ్యంతరకాంతమౌక్తికవిభాంబులు పాద్యముగాఁగ మాలికా
దంతురభృంగఝంకృతు లుదంచితమంత్రము లై చెలంగ న
త్యంతవినీతిఁ దత్పదములందుఁ గరాబ్జము లుంచి యిట్లనున్. 91
మ. భవదాశీర్వచనప్రభావమునఁగా ప్రత్యర్థిదైతేయరా
డవలేపాంధతమోవిలేపకరణోద్యద్దివ్యతేజోమృషా
రవివిద్యోతవికాసి మత్కరశతారం బందు నిల్చెక్షరథాం
గివలె న్నిర్జరమర్త్యనాగపదలక్ష్మీకాంత వాచస్పతీ. 92
సీ. దేవతావళికెల్ల జీవభూతుఁడ వౌట జీవాఖ్య నీకుఁ బ్రసిద్ధమయ్యె
వాణి నీకే వశంవదయై చెలంగుట గీష్పతినామము కీర్తిఁగాంచె
బుద్ధియే మీరూపమునఁ బ్రవర్తింపఁగా ధిషణాభిధానంబు దేజరిల్లె
నహిభయపరిహర్త వౌటచేఁ జిత్రశిఖండిజాతాభిఖ్య గణనఁగాంచెఁ
తే. దండ్రివలె మమ్ముఁ బ్రోవఁ దత్త్వంబు దెల్ప
నోర్పుకతమున గురునామ ముచితమయ్యె
నీమహత్త్వంబు నాకు వర్ణింపఁ దరమె
జలధిగాంభీర్య దేవతాచార్యవర్య. 93
ఉ. ఇప్పు డదేమొ నాదుదురదృష్టమునం బరిభావమొందినా
నెప్పుడు నీకటాక్షబల మెంచుట నేభయమంద నింక మీ

కప్పులలాశిభర్త హితుఁడౌట కుపాయము సూడఁదీరుగా
కిప్పని నిర్వహింపఁగలరే యన నాయన వజ్రి కిట్లనున్. 94

క. నిన్నత్తు్యఁడ నీ వతఁ డతి, దోస్నారుఁడు మీకు సంధివొరకించుటకున్
దుస్సహము "తత్తరయో రుభ, యో స్సంధి" యనంగ వినవె యోదివిజేంద్రా.

క. ఐనను నా చేనగుగతి, నానావిధములను దనుజనాథుఁడు నెయ్యం
బూనఁగఁ జేసెద నని తాఁ, బూనుక చనియెన్ సుపర్వపుంగవుఁ డంతన్. 96

క. ఒకపర్వతగుహ దిక్కై, యకసంయుతుఁ డగుచు గురునియోగమునము సూ
చుక యున్న తఱిన్ శుభసూ, చకములతో గురుఁడువచ్చి శక్రున కనియెన్. 97

సీ. అమరేంద్ర నీవంప ననుకంప జనియింపఁ బొలదిండి నెలదారిపురము సేరి
వెలిహజారంబున నిలిచి గొల్లలునిల్వఁ బలికి నేనచ్చుట దెలుపుఁడనుచు
నవరసంబులవారి ననుసరించిన వారు సమయంబు గా దని జాగుసేయ
మంత్రుల కెఱిఁగింప మంచిదె యనుటగా కెవ్వరుఁ దెల్ప రదేమొ కాని

తే. యసురపతి తన్ను రమ్ము పొమ్మనఁగ నిచ్చ
కములు చేసుక తిరిగెడు గాయకుండు
కలహభోజనుఁ డతనికిఁ దెలియఁజెప్పి
నన్నుఁ బిలుపింపఁగా నేను నిన్నరేయి. 98

తే. సమ్ముఖమునకు వచ్చుచుఁ జనుచునుండు, గరుడగంధర్వ యక్షరాక్షససుపర్వ
బలము లెల్లెడఁదొలఁగ ద్రొబ్బఁగవశంబు, గాని కక్ష్యాంతరంబులు గడచి యవల.

తే. మయవినిర్మితనవరత్నమయసభాంత, రమునఁ జెలువొందు భద్రభద్రాసనమునఁ
గనకశైలాగ్రనీలమేఘం బనంగ, నిండుకొలువున్న బలిదైత్యనేతఁ గంటి. 100

తే. ననుఁ గనుంగొనినప్పుడె వినయమునను, లేచి కూర్చుండు మనెడి నిలింపవైరి
చేరి యాశీర్వదించినఁ జేయిమొగిచి,రమ్ము కూర్చుండు మనఁ డెంతరాజసంబొ.

తే. అపుడు మన నారదుండె నెయ్యంబుమీఱ
రా బృహస్పతి యిందురా రమ్మటంచు
నొదిఁగి చోటియ్య నందుఁ గూర్చుంటి నొదిఁగి
యివ్వలవ్వల దైత్యు లట్టిట్టుఁ ద్రోయ. 102

వ. అంత. 103

సీ. బలపాకనముచిజంభపులోమముఖ్యదైత్యులమనివికిఁ జెవియొగ్గి వినుచుఁ
జేరి వినీతి నాశీర్వాదమొనరించు గౌతమాదులను గ్రేఁగంటఁ గనుచుఁ
దనధాటిపదము లందమున విన్పించుగంధర్వుల కుడుగరల్ దయ నొసఁగుచు
నవధారు దేవ వేశ్యాభుజంగయటంచుఁ గంచుకు ల్పొగడ నుత్కంఠవినుచు

తే. హరిహరాదులతోఁ బోర నలవిగాదు
మాను మనుశుక్రుతో మఱుమాటలుడిగి

కలవె యేమైన వింతవార్తలు దివంబు
నందు నారద యనుచు నయ్యసురవిభుఁడు. 104

క. ననుఁ జూచిన నేనాతనిఁ, గనుఁగొని "సౌభ్రాత్రమస్తు ఘనతర తేజో
వనజాత హితోజ్జ్వలభూ, వనజాత దితిప్రసూత వర" యని మఱియున్. 105

మ. బలిదైత్యేశ్వర తావకీనపరిశుంభత్కీర్తి తేజోరుచుల్
దళమై లోకము లాక్రమింపఁగ సుధాధామోష్ణధామాగ్నిమం
డలము ల్నీరుచులై చనన్ శివుని కంధత్వంబు ప్రాపించినం
గులకాంతామణి చెట్టపట్టుకొని యేగు న్వీథిభిక్షార్థియై. 106

మ. అనిన న్నవ్వుచు దైత్యభర్త సురలోకాచార్య యేమీ ప్రయో
జన మన్న న్మఱియేమి లే దఖిలముల్ సంపన్నమై యుండు నీ
ఘనకారుణ్యకటాక్షవీక్షణమునం గాంక్షింప నేమున్న దై
నను విజ్ఞాపన మొక్కఁ డున్న దవధానం బొప్ప నాలింపుమా. 107

తే. అమరపతి నేఁడు నీదునెయ్యంబుఁగోరి, నన్నుఁ బంపిన వచ్చితి నాయమగుట
నన్నదమ్ముల కేల వృథాహవంబు, గలసి యుండుట మే లెల్లకార్యములను. 108

వ. అనిన విస్మయమానమానసుండును స్మయమానవదనుండును నగుచు విరోధి
స్మయమానహరణబలి యగుబలి యి ట్లనియె. 109

తే. నాట్య మీక్షింప నే నొకనాఁడు రంభ,నంపు మని చెప్పి పంప హాస్యంబుచేసి
కదలికాతరు వంపినకండక్రొవ్వు, దీఱెనే నేఁటికైన నద్దేవపతికి. 110

క. వినుము బృహస్పతి యిఁకనై, నను భక్తిని నన్నుఁ గొలిచినను మన్నింతుం
దననేరము గావున్న, న్వననేరము తోడితెమ్ము వేగమె యనినన్. 111

క. వచ్చితి నిచ్చటి కేను వి, యచ్చరకులనాథ వింటివా బలివాక్య
మ్మిచ్చకువచ్చినరీతిం, జెచ్చెరఁ గావింపు మేమిచెప్పుదు నింకన్. 112

సీ. హస్తీంద్రకుంభంబు లప్పళించుకరంబు దనుజపాదము లొత్తననువుపఱుపు
సురకిరీటముల నుంచుపదంబు దైతేయనాథు తేజీవెంట నడపనేర్పు
వందిమాగధులకై వారంబు వినుచెవి విబుధారిరాకొట్టు విన్నఁగనేర్పు
హరియింతుఁబాలింతు ననుమాటలయ్య జియ్యయటంచు వినయోక్తులాడఁగఱపు

తే. మాబలీంద్రునితోడినెయ్యంబు గోరి, తేని యీరీతి సేవకవృత్తి గాని
దొరతనంబులు మెఱయింప దొరకవింక, నీకు నెటువలెఁ దోఁచునో నిర్జరేంద్ర.

వ. అదియునుంగాక నేను నిలింపవైరిచేత నంపించుకొనివచ్చునెడ మార్గంబున
నారదుంగాంచి నేవచ్చినవెనుక నచ్చటివిశేషంబు లేమి యనియడిగిన నతం
డి ట్లనియె. 114

సీ. మనకు వారికి నైకమత్యంబుగలుగునే పొసఁగ దటంచుజంభుండు నొడివె .
వైరులయందు విశ్వాసంబు గావింప న్యాయంబుగాదని నముచి పలికెఁ

గపటంబు గాని నిక్కంబుగా నిది నమ్మఁబోకుఁడి యంచును బాకుఁ డనియె
నామాటనిజమె యీయమరులతో సంధి కీడటంచును హయగ్రీవుఁ డాడె
తే. దనుజనాయకుఁ డివియె యోజనల తెఱఁగు
విబుధనాథుండు మానంబు వీడఁబుచ్చి
కొలువవచ్చెద నన్నను బిలువరాదె
యింతకన్నను బ్రాభవం బేది యనియె. 115

చ. అన విని విప్రజిత్తి దురహంకృతితో నిదియేటిమాట వృ
త్రుని హితుఁడై వధించె నసితో దితిగర్భము సొచ్చి యింతయు
న్నీవని వినియుండి యించుక వివేకములేక సురేంద్రుమైత్రిఁ గో
రిన నగరే నిశాచరవరేణ్య యటన్న బలీంద్రుఁ డిట్లనున్. 116

తే. ఎట్టివారలు శరణన్న నేలవలయు, వీరధర్మంబు గావున విప్రజిత్తి
కావవలదన్న భీరులఁగాఁ దలంప, రేల యీయోజనలు మానుమింక ననియె.

క. అని నారదముని దెలిపెను, విను మటుగావున నిశాటవిభుఁ డెటులైన
న్ననుఁదనభృత్యునిఁ జేయం,గనె తలఁచినవాఁడు చూడు కార్యంబింకన్. 118

మ. సమదైరావతకుంభిజృంభిత శిరస్సంస్ఫాలనప్రాపితో
త్తమసింధూరవిభాతి పాటలితహస్తంబుల్ శయాళుద్విష
ద్విమతాంఘ్రిద్వయమర్దనంబునను దావృక్శోణితామ్రేడితం
బమరం గాంచవె యింక నోయమరనాథా యెట్లు సైరించెదో. 119

తే. దైవగతి యెవ్వరికి దాఁటఁ దరముగాదు
చింత సేయంగవల్వ దావంతయేని
బలికిఁ గప్పంబులిచ్చుట గొలుచుటయును
న్యాయ మటువలెఁ గావింపు మమరనాథ. 120

క. అన వెచ్చనూర్చి యవ్వుఁగాఁ, కని యనిమిషవిభుఁడు దిగ్వరాన్వితుఁ డౌచుం
దనబలములతోడ బలీం, ద్రునిసమ్ముఖమునకు వచ్చి తోరపుభక్తిన్. 121

క. దేవేంద్రుఁడు హయశతమే, ధావభృథస్నాతపూత మగుమస్తకముఁ
దేవాభియాతిపదరా, జీవభ్రమరంబుగాఁగఁ జేసినయంతన్. 122

చ. ఉరుమణిపీఠి నిండుగొలువుండు నిశాచరనాథుపాదపం
కరుహములందుఁ గోకములకైవడి నంచలరీతిఁ దేంట్లవై
ఖరిఁ దులకించె నిర్జరశిఖామణిమాళిఁ దనర్చుజాతికెం
పురపలు నిద్దపుందళుకుముత్తెము లెచ్చుకిరీటిపచ్చలున్. 123

వ. అంత. 124

మ. సముఖాయంచును వేత్రహస్తులు వచింపన్ డిగ్గనం లేచి య
య్యమరారాతి యహార్యపక్షహరణాహంకారి లే లెమ్మటం

చమితోత్సాహముమీఱ నెత్తె సురరాజ్యశ్రీకచాకర్షణ
క్రమపాండిత్యకలాపిచండిలభుజాకాండంబులం గొబ్బునన్. 125

ఆ. ఎత్తి కౌఁగిలించి యీవేల మ్రొక్కెదు, పెద్దవాఁడ వనుచుఁ బ్రియముమీఱ
భద్రపీఠినెక్కి పార్శ్వభాగంబున, నొక్కచిన్నిగద్దె నుండఁ బనిచి. 126

ఉ. అంబకు సేమమే మనజయంతుఁడు లెస్సయి యున్నవాఁడె హ
ర్షంబె శచీవధూమణికి సర్వసురల్ సుఖమున్నవారె స్వ
ర్గంబున కేవిరోధమును గాదుగదా భవదాగమంబు సౌ
ఖ్యంబె యటన్నఁ గాంచి కులిశాయుధుఁ డిట్లను దైత్యభర్తకున్. 127

ఉ. ఈకరుణాకటాక్ష మొకయించుక నాపయినిల్చి యున్నచో
నేకడ మేలుగాక వగపేటికిఁ గల్గెడు దానవేంద్రుఁడవై
నా కల దొక్కవిన్నపము నాకు సురాధిపనామమేల నీ
వే కులకర్తవై సురల నేలుము దైత్యుల నేలు వైఖరిన్. 128

తే. నేను నీసమ్ముఖమ్మున నిలిచియున్న, వారిలోపల నొకఁడనై వలయుపనికి
నిందు నందును దిరిగెద నిదియె నాకు, మనవి కట్టడిగావింపు మనిన నతఁడు.

సీ. లెక్కలు లిఖియింప లేఖకాధీశుండు పాకంబుగావింపఁ బావకుండు
దండధరుండు ముందఱబరాబరిసేయఁ జరుఁడై చరింప నిశాచరుండు
నీరధీశ్వరుఁడు పన్నీటిగిండి ధరింప మృగవాహనుఁడు తాళవృంతమూన
సర్వస్వమును విమర్శనసేయ శ్రీదుండు భూతాళిఁ గొలిపింప భూతభర్త

తే. ఖరరుచి సహస్రకరదీపికలధరింపఁ
బోసఁగ విడెమీయ శతపత్రపూగహారి
కడమవేల్పులు దగునూడిగములు సేయఁ
గట్టడ యొనర్చి పోషించె రాక్షసవిభుండు. 130

సీ. విడెముచొక్కున నొక్కవేళఁజొక్కినఁ దనచేలచెఱంగునఁ జెమటఁ దుడుచుఁ
గొలువుననుండి డిగ్గునడిగ్గునంతలో దండకై చేరి కైదండ యొసఁగుఁ
జనవరియై వడి జాఱెడురత్నభూషణము లప్పటికప్పుడు దక్కఁ బెట్టుఁ
జేర్కొనితనుఁ జేరఁబిలిచిన స్వామి యేమానతియిచ్చెడ రంచునిల్చుఁ

తే. జూచి వలదన్న మానక సురటివిసరు, నేమి మాటాడినను నుతియించు మిగులఁ
జిటికెలిడు జృంభణంబునఁ జేరి దివిజ, వైరి కగడారి యిచ్చకదారియగుచు. 131

క. ఈనయమునఁ గడు నెయ్యము, గా నుడుపఁగ విశ్వసించె ఖచరాధీశుఁ
దానవనాథుఁడు చిత్తము, రా నడచినవారె హితులు రాజుల కెల్లన్. 132

తే. అంతనొకనాఁడు పూర్వదేవాధినేత, సుముఖుఁడై యున్నవేళను జూచి యింద్రుఁ
డాప్తమంత్రులతోడ నెయ్యంబు సలిపి, పలికె నిట్లని సవినయఫణితి మెఱయ.

ఉ. ఈమదమత్తవారణము లీజవనాశ్వము లీరథోత్కరం
బీమథితారివీరభటు లీదురతిక్రమవిక్రమక్రమం
బీమహనీయకీర్తి గలదే త్రిజగంబుల నీకెగాక యా
రా! మునుసన్న వారి కిక రాఁగలవారికి నున్నవారికిన్. 134

ఉ. ఇన్నియు నొంగదా దితిసుతేశ్వర దేహ మనిత్యమాట సం
పన్నత నిత్యమంచుఁ దలఁపంబనిలే దటుగాన సంశయా
పన్నత నొందె నామది యుపాయము గల్గునె నిత్యతాప్తికిం
గ్రన్ననఁ గల్గెనేని యెఱుఁగ న్వలయుం దగియున్న యోజనల్. 135

తే. క్షుత్పిపాసాజరావ్యాధిశుష్యమాణ, కాయమున లే దొకింతసౌఖ్యంబు దేహి
కది సవిస్తరఫణితిఁ దెల్పెదను వినుము, దివ్యతేజస్సనాథ దైతేయనాథ. 136

చ. కనుఁగవఁ జీకటుల్ గవియుఁ గర్ణపుటంబుల దిమ్ము గ్రమ్ము మిం
చునుజఠరాగ్ని దుర్బలత చొప్పడు నంగములక్ శిరంబునొ
చ్చునితర భోగ్యవస్తువులు నూడ సహింపదు మాటమాత్రమా
డను మఱిపుట్టు దాఁకటఁబడ న్వశమే క్షణమైన నేరికిన్. 137

తే. పెదవి వేబెత్తు నాలుకపిడుచగట్టు, గొంతు తడిలేయు నక్కొండుఁ గొంతతడవు
దాహమున నుదకములేక తడసెనేని, కలదె మఱి యంతకన్న దుఃఖంబు జగతి.

తే. అన్నపానంబు లొకయింత యధికమైన, తఱి నజీర్ణంబ యైనఁదా దొరయుశ్లేష్మ
పైత్యవాతాదికజ్వరబాధ లవియ, విషమహేతువు లగుపథ్యవిరహితములు.

తే. కలుగునూఱేండ్లలో నర్ధకాల మపహ
రించు నిద్రయె యానిద్ర రేపుమాపు
మానియుండిన జాడ్యంబు మేనఁ బొడముఁ
గన్నుఁగవయందు నరుణిమ గడలుకొనును. 140

సీ. ఇంతకన్నను దుఃఖ మింకనొండు లేదని తెలుపుచందంబునఁ దలవడంకఁ
గనుఁగవఁ బొరలు గప్పెనొ లేదొ చూత మన్పోలిక సడలి కన్బొమలు వ్రాల
యావనస్తంభ హైన్యంబున దేహంబు కుమతిగుడారునాఁ గుదియఁబడఁగ
స్వచ్ఛవృత్తిని దనర్చంగ ముక్తములగు భాతి నొక్కట ద్విజపఙ్క్తు లురుల

తే. ఘనజరాభూతహుంకృతి నెనయ దగ్గు, నరలసద్వృత్తికర్ణవిస్ఫురణనొగుల
వృద్ధభావంబు వచ్చినవెనుక జనున, కేమిసౌఖ్యంబు గలదు దైత్యేంద్ర చెపుమ.

క. ఇదిగాక శమనకృత్యం, బిదమిత్థం బనఁగఁగూడ దీదృశదుఃఖా
స్పదమగు దేహంబున నె, మ్మది సుఖయింపంగ సులభమా యెవ్వారికిన్. 142

వ. అటుగావున జఠరజఠరగహన వనదహనప్రధాన ధారణాతుధావ్యథాముధా
విధానావధానవిధావిధానంబును, ముఖజల బిలపల్వల సరసతాపనోదన భీష్మ
గ్రీష్మ విలాస పిపాసానిరాసంబును, ప్రపంచపదార్థ ప్రజ్ఞానప్రతిబంధకబంధుర

రజోనిద్రాముద్రావిద్రావణంబును, నానామయాకృతిపురాకృతదుష్కృతిమరీచి
కావికృతినిరాకృతిక్రియయును, సంగరాజ్యజీర్ణీకరణవిజయయాత్రాజీర్ణజరాబల
నిరోధకంబును, దేహజీవనీరక్షీరభేదవిధానమానసహంసజాతపలాయనమం
త్రోపదేశదేశికంబును, సుమనోవిలాసనిత్యయౌవనవనవికాసకారణంబును, భో
గినీభోగవిభేదాదరమయూరనర్తనప్రవర్తకంబును, శృంగారరసప్రధానప్రభా
వప్రభాప్రవాహప్రకామప్రవర్ధనప్రక్రియాప్రవీణంబును నై, ప్రావృషిజపయో
జప్రస్రుతామృతంబుచందంబున నందం బగునమృతంబుసంతరించినం గాని గా
త్రంబు యథేష్టభోగంబులకుం బాత్రంబు గాదని తలంతు నందుల కొక్క
యుపాయంబు గల దది విన్నవించెద నాకర్ణింపుము. 143

తే. కవ్వముగఁ జేసి మందరక్ష్మాధరంబు
వాసుకినిఁ ద్రాడుచేసి దుర్వారశక్తిఁ
గలశవారాశిఁ దచ్చినఁ గలుగు నమృత
మనుచు హరి యానతిచ్చె మున్నసురనాథ. 144

క. నావుడు నప్పుడె యమృతము, సేవించినరీతి మిగులఁ జెలఁగుచు సభలో
దేవాదులెల్ల బళిబళి, దేవాధిప మంచియుక్తి దెలిపితి విచటన్. 145

తే. అట్టు లమృతంబుగలుగఁ బా లధికముగను
నీకు నొసగెద మిందు సందియమువలదు
తగినయత్నంబు సేయుము తడవు సేయ
రాదు వినమే "శుభస్య శీఘ్రం" బనంగ. 146

క. అని యుత్సహించి యాడెడు, దనుజులవాక్యములు దేవతాపతి పలుకు
ల్విని సమ్మతించి మంచిదె, యని బలియును వారిఁగూడి యప్పుడె కదలెన్. 147

తే. కదలి మదమత్తమాతంగకదలి చంద్ర, కదలి నమరావతీవనకదలి నెనయ
రంగదరిభంగ సంగరరంగచంగ, తుంగచతురంగసేనాతరంగుఁ డగుచు. 148

క. ముందరఁ జనిచని కాంచె, న్మందరముం దుష్టసత్త్వమయకందరమున్
సుందరమున్ శిఖరశిఖా, మందరమున్ దివ్యనవ్యమణిబృందరమున్. 149

క. కనుఁగొని యిదిగద మందర, మని యడిగిన బలికి నింద్రుఁ డనియె న్నిజవా
హన ఘనగర్జారవలం, ఘనజాంఘికనవరసార్థగంభీరోక్తిన్. 150

మ. కనుఁగొంటే దనుజేంద్ర తావకజయాంకప్రౌఢిగీతాళి వే
డ్కను గంధర్వవధూమణుల్ సతతమున్ గానంబు సేయం గరం
గిన వాసీటను బొంగి నిర్ఝరము లేగ న్వార్ధికాత్మీయునొ
క్కని రక్షించె నటంచు వృద్ధి నొసఁగంగా నెంచెనో శైలమున్. 151

చ. అనఁ జెలునవ్వునవ్వి దనుజాధిపుఁ డిట్లను నో నగారి నీ
యనుపమబాహుశక్తి దెలియ న్వివరించెదు శైలపక్షభే

దనచతురత్వము న్నొడివి తజ్ఞుఁడవౌ నన స్వామి కెట్లుదోఁ
చెనొ యటులేగణింపుదునె చిత్తమెలుంగదె యంచు నింద్రుఁడున్. 152

తే. నీయంతవాని కుపకృతి, సేయఁగలిగె నాకటంచుఁ జెలఁగుచు గిరిరా
జీయెడ నిర్మలనిర్ఝర, తోయాఖ్యముదశ్రుధార దోఁగెడుఁ గంటే. 153

క. అసురనాయక తనదుగహ్వరము సూపఁ,దలఁచి చెంగావిగప్పిన చెలువు మెఱసెఁ
దురగఖురధూత మగుచుఁ గెందూళిపొడమ,నందమై మించు నీమందరాచలంబు.

మ. బలిదైత్యేశ్వర కంటె మీఁగిరిదరీభాగంబుల న్వేడుక
ల్వాలయం గ్రీడలుసల్పు కిన్నరసతుల్ జ్యోతిర్లతాదీపముల్
జ్వలియింపం దిలకించి సిగ్గున నురోజక్షౌమచేలాంచలం
బుల వారింతురు చూచి నవ్వఁగఁ బ్రియు ల్ముగ్ధత్వము న్మెచ్చుచున్. 155

మాలిని. మృగధరమృగనాభీస్పృష్టగండోపలంబు
ల్ఖగభుగయనుతావు ల్బ్వొన్చు నీమందరాద్రి
న్మృగయువరమృగాక్షీవృత్తవక్షోజకుంభా
త్యగణితతులితత్వావాప్తిఁగంటే బలీంద్రా. 156

ఉ. దానవనాథకంటె వసుధాధరరాజము నూళిభాగసం
దానితతారకాకుసుమదామము గైరికకుంకుమంబు సం
వ్యానితమేఘవర్ణరుచిరాంబర మించుగమించె నెంచఁగా
సానులకూటముల్ గలుగుజాణలు నీటులు వెట్టకుందురే. 157

వ. అని యనితరసాధారణసుధామధురవివిధవచోరచనల న వ్వసుధాధరంబు విను
తించు సుధాశనాధినాథునకు విబుధవిరోధిమూర్ధన్యుం డిట్లనియె. 158

తే. ఔర మనరాక కలరి మిన్నంది యున్న
దీనగేంద్రంబుఁ గదలింప నెవ్వఁడోపుఁ
గలఁడె యటువంటిబలియుఁ డొక్కరుఁడు దేవ
దానవులలోన నన బలదైత్యుఁ డనియె. 159

తే. అసురనాయక నీధృతి కళికి క్రుంగి, కుతల మంటినమందరక్షోణిధరముఁ
బెల్లగించుట యిది యొక పెద్దటేకమె, యిందు నెవ్వనిచేతఁ గా దట్టిపనికి. 160

తే. దిగ్గజంబులు మొగ్గి ధాత్రీధరేంద్ర
మడఁగఁద్రొక్కుదు నో లేక యంబరమున
కెగరవైతునొ తిరిగి నగేంద్రమునకు
తెక్క లొడవెనొ యంచు విరించిచూడ. 161

వ. అనిన విని బలాసురు మెచ్చుక జంభుం డిట్లనియె. 162

క. కులపర్వతంబు లేడును, గలయఁగ నమ్మొదలఁలార్పఁ గలిగిననా క
గ్గలమే మందర మెత్తుట యలమేరువు నేఁ బగల్తునా దైత్యేంద్రా. 163

వ. అని మఱియు శంబరారిష్టనేమిత్రిపురవాసజంభశుంభనిశుంభ హయగ్రీవనముచి తారక బాణవిప్రచిత్తివిరోచనహేతిప్రహేతిమయమాయావిమాలిసుమాలి పౌలోమకాలకేయసివాతకవచ వజ్రదంష్ట్రకాలనాభశరభవృషపర్వరాహు మహిషేల్వల వాతాపిదుర్మర్షణోత్కల మేఘదంభ ద్విమూర్ధ్న కేతుక్రోధవశాది నానాదనుజయూథనాథులు మందరవసుంధరాధరసముత్పాటనపాటవంబుఁ దెల్పుచు నబ్బలీంద్రుచేఁ గనకమణిమయభూషణాంబరాదులు బహుమానంబులు గైకొనుచు మహోత్సాహంబున బాహులప్పళించుచు శంఖమర్దళపటహభేరీధణంధణధ్వనులకుం బ్రతిధ్వనులిచ్చు మందరకందరంబులకుం గుప్పించుచుఁ దనుం బెకలింపవచ్చుటఁ సిచ్చ నెఱింగి మచ్చరంబునం బెచ్చుపెరిగి యద్ధరంబుం దమతోడి యుద్ధరంగంబునకుం బంపిన బలంబులో నా దరీకుహరనిర్గత శరభశార్దూలగండభేరుండఖడ్గగవయకంఠీరవ మహోద్దండవేదండ ప్రచండ భల్లూక శశచమరశల్యభల్లసారంగ సాలావృకవరాహ మహిషమర్కట మహోరగప్రముఖ జంతునికాయంబుల కాయంబుల కషాయంబు గల్పించుచు నుపాయంబుల నగ్గట్టుచుట్టువారుకొని యిట్టట్టు మెదలక నెట్టుకొని యొకరొకరు కదలించి చూచి కదలకున్నఁ బదుండ్రు నూర్గురు వేగురు లక్షకోటిసంఖ్యాకులుం గూడికొని నలుదిక్కులం డాసితోసి ప్రేసియుం గదలింపలేక యుద్దామనిశితకుద్దాలంబులం బెద్దయుం బ్రొద్దు నా శైలంబు మూలంబు గానంద్రవ్వి నెననెడం బోడముష్టూలోపలంబులు పెకలింపంజాలక యులువకట్టునించి మించినభుజాటంకంబులనగల్చుతఱి శిలాగర్భంబుల వెడలువర్షాభులఁగని యచ్చెరువందుచు నందంద సన్నలువైచుచు మఱియునానోపాయంబులం జూచుచు నొకించుకయుం దెమలింపఁజాలక సురాసురజాలంబులు ఘర్మకణజాలకంబులందోఁగు గాత్రంబులు సవిస్నిర్ఝరంబు లగు గోత్రంబులం బోల గుహాముఖంబులు వెడలు గాడ్పులచాడ్పున నాసికారంధ్రంబుల నీరంధ్రంబులై నిట్టూర్పులు బెట్టిదంబుగా నడర భుజంబుల బలిమి సడల నొడళ్లు జడియ జడిమనిగుడ బడలియున్న వారలం గనుంగొని. 164

క. బలి యింద్రున కిట్లనునిటు, వలె నూరక యుండఁదగునె వరశైలగరు
ద్ధరణసమర్థుండ వయ్యును, భళిభళి దేవేంద్ర యనిన బలి కతఁ డనియెన్. 165

క. బలజంభ ప్రముఖమహా, బలశాలులచేతఁ గానిపని యిట నాచే
నలవడునె దైత్యనాయక, యల వెన్నుని వేడఁదగు నుపాయంబింకన్. 166

క. అని వారలఁదోడ్కొని తాఁ, గనకాద్రికి నేగి యచటఁ గమలాక్షునిఁ ద
త్తనయుం గనుఁగొని సాష్టాం, గనమస్కారములు నేసి కార్యము దెలుపన్.

క. విని నవ్వుచు వనజోదరుఁ, డనియె సురాసురలుమీరలందఱు నొకగ
ట్టు నగల్పలేరె యిఁకనే, యనుపున సుధ గ్రాంతు రనుచు నహిపతిఁ దలఁపన్. 168

సీ. తన మహాసహ నిరంతరసమ్యగాసక్తి కుండలీంద్రత్వంబు కుదురుపఱుపఁ
దనశ్రీవహనసముద్భాసితోత్సాహంబు చక్రిభావమున కౌజ్జ్వల్య మొసఁగఁ
దనభోగినీభోగజనితానుభావలీల భుజంగపుంగవోల్లాస మెసఁగఁ
దనమహాబలసముద్యద్విగ్రహప్రవృద్ధియహీనభావంబు దేఁటపఱుప
తే. సోమరుచియు ననంతవిస్ఫూర్తి భోగి, ముఖ్యతయు భూమిభరణసముత్సుకత్వ
మరలఁ జెలువొందు నెవ్వఁ డుదారఫణితి,నట్టిశేషాహి వచ్చె నయ్యవసరమున.
క. వచ్చినయచ్చిలువలదొర, మచ్చికతోఁ జేరఁబిలిచి మాధవుఁడు ఫణా
భృచ్చూడామణి మందశి, లోచ్చయ మగలించి వీరి కొసఁగు మటన్నన్. 170
క. పెకలిచి యిచ్చినఁ జాలుం, బ్రకటితదోశ్శక్తి బెండువలెఁ దెచ్చెద మే
మొకరొకరమె యని దైత్య, ప్రకరంబులు మదముమీఱి పలుకఁగ వించున్.
మందరధరము. మంచిదెయంచును మరుదశనవిభుం,డంచితశక్తిని నఖలముఁ గొలువం
గాంచనభూధరఘనతరమహిమో, దంచితమందర ధరగతుఁ డగుచున్. 172
క. పరివేష్టించె ఫణీంద్రుఁడు, ధరణీభరణాత్మసామ్యధన్యుఁ డటంచుం
బరిరంభణ మొనరించెను, ధరణీధరమౌళి నను చుదారస్ఫూర్తిన్. 173
మ. ధరణీభారము నే వహింపఁగ మహీధ్రంబయ్యెఁ దానెట్లు మం
దరమం చల్గెనొ నాఁగ నాగవిభుఁ డుద్యత్క్రోధసంరంభియై
పరివేష్టించి యగల్చెఁ దన్నగముత్క్ష్మాభృత్తుంగశృంగాగ్రభం
గురజంఘాలదృషద్ఘలంఘలఘలా ఘోషంబు ఘోరంబుగన్. 174
తే. ఇటులు పెకలించి కరముల కెత్తమిఁగుల,సంభ్రమమున సురాసురుల్ శైలమాని
పట్టఁజాలక మున్పటిపాటు గొనఁగ, కూలవైచిరి మందరకుధర మవని. 175
తే. దాననొచ్చిరి గొంద ఱత్తఱి నగారి, ముఖసుపర్వులు చక్రికి మొఱలువెట్ట
గరుడవాహనమెక్కి యక్కడికి వడిగఁ, దాన విచ్చేసె భక్తవాత్సల్యమునను.
చ. కరివరదుండు వచ్చి ఘనగైరికరాగము మందరాగముం
గరమున నెత్తి పక్షితురగంబు శిరంబున నుంప జాళువా
బురుక తెఱంగునం దనరఁ బొంజిగి తెక్కలు గుందనంపుప
క్కెర హరువూనఁ జంచువునఁ గీల్కొనుచిల్వ ఖలీనమై తగన్. 177
క. హరి గిరి ధరించి యిటువలె, సరగునఁ జన గరుడు వెంటఁ జనలేక సురా
సురులమనమ్ముల నంటిన, వెరపఱియవి గుఱుతులూని వెనకకుఁ జిక్కెన్. 178
తే. కోరి బ్రహ్మాండకోటులఁ గుక్షినుంచు, కొన్న విశ్వంభరునిఁ బూనుపన్నగారి
కవనిధర మేమిభారమా యట సురాసు, రులకుఁ జాలవిచిత్రమై యలరెఁ గాక.
తే. నిమిషమాత్రంబులోపల నీరరాశి, తటమునకు నేగి హరిని మందర ముడించి
వెనుకవచ్చు సురాసురవీరవరులఁ,గాంచి యనిపించుకొని యేగె గరుఁడు డంత.
తే. వాసుదేవునియానతి వాసవుండు, సకలదేవాసురాలికి సమ్మతముగ

వాసుకి ననంతశక్తినివాసుఁ బిల్వ, నంపి యిట్లని పలికెఁ బ్రియంబు గులుక. 181
సీ. పాలయల్కనొకవేళఁ బలుకనిపార్వతి వెలుపించి కూర్తువు విశ్వనాథుఁ
బావనబ్రహ్మకపాలమాలికల జోడాదు వొక్కొకనాఁడు హార మగుచుఁ
బడగమానికపుఁజెక్కడపుఁ గీల్కంకణం బగుదు వొక్కొకయెడ హస్తమునకుఁ
గన్నె గేఁదగితేకుకమ్మతాపులు వెఁయింతు వొక్కొకచాయ నింపుగాఁగ
తే. నెన్ని భంగులఁ జూడ విశ్వేశ్వరునకు, నీవె కా కెవ్వరున్నారు కేవలాప్తు
లట్టి నిన్నుఁ బ్రశంసింప నలవియగునె, ప్రణుతగుణగణ్య వాసుకిఫణివరేణ్య.
చ. క్షమ వహియించి శేషుఁడు యశంబుగనెక్ష క్షమయు స్వహించి నీ
వమృతము గల్గఁజేసి దివమంతయుఁ బ్రోచిన నంతకన్నను
త్తమమగుకీర్తిగల్గు వసుధాధరమంథము ద్రిప్ప నానుగు
ణ్యమువహియింప గల్గు ఫల మంనఱకు న్సరి యింతె వాసుకీ. 183
క. లేయని యింద్రుఁడుసూత్రప్రాయముగా నిటులనాడు పలుకున కెంతే
నీయెద మెచ్చుచువాసుకి, యీయకొనియె నంత సర్వరేంద్రుఁడు గడఁకన్. 184
క. వేవేగ వజ్రధారక్ష, గ్రావము నిష్కంటకముగ ఘనమృగసమ్య
గ్రావముల మించఁ బార్శ్వ, గ్రాంబుల నెల్ల నఱకి కవ్వముచేసెన్. 185
వ. అంత. 186
సీ. ఘనకిరీటంబులు గట్టిగా సవరించి కలితకుండలముల కొలుకు లదివి
బాహాంగదంబులు పదిలంబుగఁ దొడిగి ముంజేకడెంబులు మొగపు లరసి
యంగుళీయకముల నటకొన్ని ఘటియించి మౌక్తికహారము ల్కట్టుపఱచి
మొలవట్టి హారలపంకులు పొంకముగఁజెక్కి పిరిచుట్టి చేలము ల్బిగియఁగట్టి
తే. యంతకంతకు నుత్సాహ మతిశయిల్ల, నుల్లమునఁ బల్లవింపఁగ నొండొకళ్లఁ
బిలిచికొనుచును దమతమ పేరువాడి, కొనుచు దేవాసురులు దుగ్ధవనధిఁ జేరి.
తే. బంగరు మొలకట్టు రంగుమీఱంగనా, నాగభోగ మద్రినడుమఁ జుట్టి
కలశవారిరాశి నిలిపిరి తమసొమ్ము, మొదలు వెట్టఁ జుట్టి మోపి రనఁగ. 188
వ. అంత బృందారకులు దమలోన. 189
ఉ. అక్కట దానవేంద్రుఁడు బలాఢ్యుఁడు గాన ఫణీంద్రపుచ్ఛముక్ష .
రక్కసిమూఁక కిచ్చి సుకరంబుగ ఘోరవిషాగ్ని కీలలం
గ్రక్కుఫణాళి మాకొసఁగఁ గాదనరా దిఁక నేమికార్యమీ
దిక్కున నంచు నొండొరులు దీనత మోములు చూచుచుండఁగన్. 190
క. తదభిప్రాయం బంతయు, మది నారసి శౌరి కపటమార్గంబున నో
త్రిదశవరులార రత్నా, స్పదఫణిభోగములు మనము పట్టుద మనుచున్. 191
తే. భోగిభోగశయానుఁడు యాగభాగ
భోక్తలును గూడి భోగీంద్రభోగభాగ

ములు గ్రహించిన నదియాగముగ గ్రహించి
యాగతామర్షమున దైత్యు లనిరి యపుడు. 192

క. దితిసుతులము పరపతిత, శ్రుతులము సిద్ధురతపోనిరూఢమహావి
శ్రుతుల మిదిగాక బహు, శ్రుతులము మముఁ జులకసేసిచూడం దగునే. 193

తే. శౌరి మేము కులస్థానపౌరుషముల, నేమిటఁ గొఱంత తెల్పుమా యీసురలకు
వారికన్నను బూర్వదేవతల మగుట, నేమె ఘనులము గామె నీ వెఱుఁగవేమి.

ఉ. శ్రీహరి యెంత యక్రమము సేసితి వాసుకిభోగిభోగ సం
దోహము మీరలూని కడతుచ్ఛపుఁబుచ్ఛము మాకొసంగ మే
మూహయొనర్పలేక యిదియూనిన నధ్యయనశ్రుతంబులు
న్నాహసముం బరాక్రమము సత్కులజత్వము వీటిపోవదే. 195

క. అని దనుజు లూరకున్నం, గనుఁగొని నవ్వుచును శౌరి ఘను లిట మీ రిం-
తన యల్గనేల కైకొనుఁ, డని ఫణము లొసంగిపుచ్ఛ మానె సురలతోన్. 196

క. ఈనీతిసమాకర్ష, స్థానము లేర్పాటుగాఁగ దైవాసురసం
తానంబు లైకమత్యము, గా నమృతాబ్ధి న్మథింపఁ గడఁగిరి కడిమిన్. 197

మ. అమృతావాప్తికి దేవదానవులు దుగ్ధాంభోధి మంథాద్రిచే
నమితోత్సాహమున న్మథించునెడ నయ్యద్రీంద్ర మాధారహీ
నముగా నజ్జలరాశి మున్గ నదియానం జాలవిస్తారమా
కమఠాంగంబు ధరించె మాధవుఁ డభంగప్రౌఢి సంధిల్లఁగన్. 198

తే. అగశిలాపాత మోర్వక యంబురాశి, చర్మఫలకంబుచే మేను చాటుచేసె
ననఁగఁ జూపట్టె లక్షయోజనవిశాల, మైనకమఠంబు దుగ్ధరత్నాకరమున. 199

క. కఠినతరకర్పరము మృదు, జఠరము నయనాబ్జయుగళసహబహిరంత
ర్లుఠదాస్యంబును గలుగఁ గ, మఠముం గని విస్మయంబు మదిఁ బెనఁగొనఁగన్.

తే. మరల సొమ్మిచ్చుటకు బహుమథనపడిన, యబ్జజునిరోసి పూఁటకాపై నహరిని
జట్టుమోపి రనంగఁ గచ్ఛపము మీఁదఁ, గట్టునిల్పె సురాసురగణము లపుడు.

తే. ఉదధిఁ గమఠాసనమునఁ గూర్చుండి భోగి
భోగ మనుయోగపట్టిక పొసఁగ నడుమ
నమృతసిద్ధికి జపియించునట్టియోగి
కరణిఁ గనుపట్టె మందరక్ష్మాధరంబు. 202

వ. ఇవ్విధంబున దుర్ఘటసింధురకందరం బగునమ్మందరవసుంధరాధరంబు వాతంధయగుణానుబంధురంబుగా నఘ్ఘటసింధుబంధురమధ్యంబునఁ బ్రతిష్ఠించి. 203

సీ. శృంగాగ్రదళితవైరించాండగళితావరణధార లనిర్ఝరములు దొరఁగ
నానామహాగుహాంతరసమాధి సనాథతాపసనాథమస్తములు దిరుగఁ

గందరాంతరసింహగజగండభేరుండశరభాదు లాకటఁ గ్రోళ్లుఁ ఁ గాఁ
గంపితశాఖిశాఖాశిఖాఫలపత్రకుసుమము ల్గడిగొని కురియుచుండఁ

తే. జిలుతపులితోలుగట్టు జేజేలతేఁడు, దిరుపుగట్టువిధంబునఁ దిరిగె గట్టు
సవ్యభుజశక్తి దేవదానవులు దుగ్ధ, జలనిధానంబు మథియించుసమయమునను

మ. కులశైలాగ్రణి క్రింద మీఁద నడుమ న్గూర్మాదిరూపంబులన్
బలియుండై భరియించి దేవదితిభూభాగంబులన్ వారిలో
పలను న్నిల్చి స్వకీయమూర్తినిజతుర్యాబాహర్గళ ల్మార్పుచుం
గలశాంభోధి మథించె మాధవుఁ డభంగప్రౌఢి రూఢింగనన్. 205

శా. ఈరీతిన్ హరి దేవదానవులతో హేలాగతిన్ ధీరుఁడై
క్షీరాంభోధి మథింపఁ గాంచనకటీచేలప్రభ ల్మైమకే
యూరాన్యోన్యవిఘర్షణోదితరజం బుద్వేలసౌవర్ణకో
టీరచ్ఛాయలు పర్వఁ బర్వతము గట్టెం బొమ్మ హేమాద్రికిన్. 206

వ. అప్పుడు. 207

శా. రక్షోదేవమిథోట్టహాస హహహారావంబులుం గూర్మమం
థక్షోణీధరఘర్షఘర్ఘరనినాదంబు ల్దృణాకర్ష వే
గక్షుభ్యద్భుజగేంద్ర భూరిఫణ భూత్కారధ్వనుల్ ఘూర్ణితో
దక్షీరాంబుధి జంతుఘోషములు మెండై నిండె బ్రహ్మాండమున్. 208

మ. అఖిలాదిత్యసురాహితభ్రమితమంథానాద్రిఘోషంబు చే
సఖమై నించుక వెన్ను తీఁటశమియించంజేయ క్షీరాబ్ధిలో
సుఖనిద్రారతిఁ జొక్కెఁ గూర్మపతి ప్రాంశుశ్వాసవాతోచ్ఛలా
బ్ధిఖవీథింబొరలందరంగపటలోద్రేకంబు చే మాటికిన్. 209

వ. అప్పుడు. 210

మ. వలదత్యుగ్రదవాగ్ని మగ్నశలభవ్రాతంబుమాడ్కి న్విశృం
ఖలసంఘర్షణభుగ్న భోగిఫణఫూత్కారాక్షిదంష్ట్రాగళ
ద్విలయాభీలకరాళ కాలదహనోద్వేలజ్వలజ్వాలికా
వళిచే మాడిరి పెక్కుదానవులు గర్వం బెల్ల ఖర్వంబుగన్. 211

తే. ఘనత యంచును దుష్కరకార్యములకుఁ
బూనఁగాఁ జెల్లునే యెట్టిపురుషులకును
ఘనత యంచును భోగిభోగములఁ బూని
దానవులు పడ్డపా ట్లెన్నియైనఁ గలవు. 212

ఉ. ఆవిషవహ్నికీలలు సురావళినంటి తపించునప్డు రా
జీవదళాయతేక్షణవిశేషకృపామృతదృష్టిచేతఁ బా

రావరదుగ్ధవాఃకణధురంధరబంధురమంథరానిల
శ్రీ వెలయన్ ఘనాళిగురిసెన్ బరిశీతలవారిధారలన్. 213

తే. హరికిఁ బ్రతిఘటించి యసురులు విషవహ్నిఁ, గమలి రదితిసుతులు కమలనయను
నాశ్రయించి శైత్య మందిరి యొందైన, శౌరికరుణలేక సౌఖ్యమేది. 214

మ. జలసేకంబుల సేదదేరుచు నభశ్చారాళికన్నన్ విశృం
ఖలవృత్తిన్ మథియించి రా దితిజు లుగ్రంబై విషజ్వాలికల్
కలయంబర్విన సడ్డసేయక ఫలాకాంక్షం బ్రవర్తించువా
రలకుం దోఁచునె ఖేద మెందయిన వైరాటేయ భూపాత్మజా. 215

ఉ. భీమనిశాటబాహుబలపీడితవాసుకిభోగిభోగదం
ష్ట్రాగ్రముఖనిర్గళద్విషము శైలవిఘర్షణకూర్మకర్పరో
ద్దామకృశానుకీలల నుదగ్రతరంబయి దేవదానవ
స్తోమము భీతిలం గలశతోయధి వెల్వడి సత్వరంబుగన్. 216

సీ. ప్రళయకాలానలఫాలలోచనఫాలకీలికీలాకేళిఁ గేలిసేసి
సంవర్తసమయప్రచండచండాంశుమండల మండలోద్దండనటన దెగడి
త్రైలోక్యభస్మసాత్కరణదీక్షానకుంఠాశుశుక్షణిరూక్షి నొడిచి
కల్పాంతజలదనిర్గళదనర్గళదీర్ఘఘోరనిర్ఘాతనిర్ఘోష మడఁచి
తే. భూర్భువస్స్వర్ముఖానేక భువనగహన, దహనలీలాతిసహనధూర్వహనవోగ్ర
చిటచిటాయితశిఖలనశేషముం గ్రసించె హాలాహలంబు కోలాహలముగ. 217

చ. అపు డిది యేమి యక్కట సుధార్థము దుగ్ధధిన్ మథింప ను
గ్రపువిష ముద్భవించి లయకాలమొనర్పఁ దొడంగె నింక నీ
విపదపవారణంబునకు విశ్వపతిన్ శరణంబు వేఁడినం
గృపదళుకొత్తఁ బ్రోచునని యీశ్వరుచెంగటి కేగి యందఱున్. 218

క. గడగడ [1]నొడలువడంకఁగ, దడదడ దడమంచు గుండె తల్లడమందన్
బడిబడి నడ్డముదిగటముఁ, బడిబడి [2]మొగ్గుచును "పాహిపాహి" యనంగన్.

తే. ఆభవుఁ డేమేమి యనిన సురాసురుల్ భ
యమున హాలాహలము హాలాహలము హాల
హలము హలహల మని తోఁచినట్టు పలుక
నన్ని నామంబులను గాంచె నవ్విషంబు. 220

తే. వారిభయమెల్ల వారింప వారిజారి, ధారి మదినెంచి తనదుచిత్తం బెఱింగి
చిన్నవోయిన పార్వతిచెలువు గాంచి, యిట్లనుచుఁ బల్కె దరహాస మిగురులొత్త.

1 వడంకనొడళులు. 2 మొగ్గిడుచుఁ.

శా. భామా యేటికిఁ జిన్నవోయెదవు నీభావంబు నేఁగంటి నా
కేమానో గరళంబుచే ననుచు నీవెంతే[1]విచారించెదం
దేమీ గా దటుగాక నేమయినఁ గానీ సర్వలోకాళికిన్
క్షేమంబైనను జాలుఁ దద్విషము భక్షింతున్ వినోదంబుగన్. 222

క. వచ్చినవారికి నాపద, వచ్చిన నదిపరిహరించువానిప్రభుత్వం
[2]బెచ్చౌను గాని మఱిపోర, పొచ్చెము గావించినం బ్రభుత్వము గలదే. 223

తే. పరులఁ బీడించుకంటెఁ బాపముఁ బరోప,కృతి యొనర్చుటకంటె సుకృతము లేదు
పరుల కుపకృతిఁ జేసిన భాగ్యశాలి,యిహముఁ బరమును జెందుఁ బూర్ణేందువదన.

క. అని యుత్సహించి కలశీ, వనరాశితటంబుఁ గదిసి వసుధాధరరా
ట్తనయాధిపుఁ డవ్విషమును, గని హరియింపంగ వశముగా కడలంగన్. 225

తే. అంత బ్రహ్మాదిసురలు భయార్తు లగుచుఁ, దన్నుఁ బ్రార్థింప శ్రీహరి తద్విషంబు
ధీరుఁడై యారగించిన దేహమెల్ల, నల్లనయ్యెను వ్యాపించి నాఁటనుండి. 226

తే. హరియు మిగిలినవిషము కాలాంతకునకుఁ
గొంత యొసఁగిన హరుఁ డది ఘుటికసేసి
మ్రింగ నది కంఠమునని ల్చె హృదయనిహిత
గరుడవాహనవీక్షణాగతభయమున. 227

క. ఫాలాక్షుఁడు కబళింపఁగ, హాలాహలవిషము కొంతయవశిష్టంబై
తూలఁగ నది వృశ్చికములు, వ్యాళంబులు మెసవి విషధరాఖ్యల వెలసెన్. 228

క. ఈలీల దైవకరుణన్, హాలాహలబాధ యుడిగి యమరాసురులు
ద్వేలముదంబున మందర, శైలంబునఁ గడలిఁ ద్రచ్చుసమయమునందున్. 229

చ. గొరిసెలయందముం గులుచకొమ్ములచందము వెన్నుమందమున్
గరువపుమేనిలో నుదుటు కాఁగెడుపెన్పొదు గింద్రనీలముం
బెరసినముక్కు మీఁగడబలెం జెలువౌ గళకంబళంబునన్
హరు వగునామధేనువు సుధాంబుధిఁ బుట్టె నభీష్టదాత్రియై. 230

వ. అంత. 231

క. సురభిన్ సవనవనావన, సురభిన్ స్రవదమృతగళితశుష్యన్నానా
సురభిం గైకొనిరి మురా, సురభిత్కృప దేవఋషులు సురుచిరభక్తిన్. 232

తే. మొదటనున్న నిజాకారమును త్యజించి, వారిరాశితరంగ మువర్ణసహిత
మై తురంగంబు గాఁబోలు ననఁగఁ బొడమె, వెల్లవారువ మాపాలవెల్లి నంత.

సీ. కర్పూరకదళికాకళికాదళంబుల నెఱమించు విదళించునిక్కుఁ జెవులు
నేలినవానికిఁ ద్రైలోక్యసామ్రాజ్య లక్ష్మినియ్యఁగఁజాలు లక్షణములు

---

1 ని భావించెదం. 2 బెచ్చౌ నెచ్చట మఱి.

మానసాధిక వేగ మూనఁగా జపియించుపోలికఁ గదలెడుపౌ్రిఢపుటముఁ
దామరసాప్తనందనువివాహమునకు రోషంబు పుట్టించుహేషితంబు

తే. గలిగి శరదిందుకందళత్కుందబృంద, కుందగోవిందతుందారవిందకంద
చందనామందరుచినందచందమగుచు, నొనరునుచ్చైశ్శ్రవంబునేత్రోత్సవముగ.

తే. దేవమణియుక్త మని మదిఁ దెలిసియుండి
తేజిఁ దాఁ గైకొనియెఁ బూర్వదేవభర్త
దేవమణియును నలవాసుదేవుసన్నఁ
దెలిసి యూరక యుండె నిశ్చలత నంత. 235

సీ. ప్రాయంపుఁబూఁబోణిబటువుసిబ్బెపుగబ్బిగుబ్బచన్నులఁబోలు కుంభయుగముఁ
దొలిచూలిజవరాలితళుకులేఁజెక్కుటద్దములతోఁ దులఁదూఁగు దంతరుచులుఁ
బౌ్రఢకాంతామణిభాసురమృదులోరుకాండముల్ దొరయంగఁగల్గు కరముఁ
నటనచేనలసినకుటిలకుంతలిమందగతుల కొయ్యారంబు గఱపునడలు

తే. విటుని తబ్బిబ్బులకుఁ గేరువెలమిటారి, నగవు నేలినడాలు గంధర్వరాజ
సతినిసాదంబు నెనయుబృంహితరవంబుఁ, గలిగిచౌదంతివొడమెనాజలధియందు.

సీ. విశ్వేశువాహనవృషభమాఁ గాదేని ధేనుకామేళనోద్వృత్తి గనునె
శ్రీగౌరివాహనసింహమాఁ గాదేని వనకదంబకమున వసతిగనునె
యాత్మభూవాహనహంసమాఁ గాదేని బిసజాతహరణలాలసతగనునె
శక్రవాహనశరజ్జలదమాఁ గాదేని యభ్రముసంగతి నలరఁగనునె

తే. యనుచుఁ గవికులబుధముఖు లివ్విధమునఁ జేయఁ, బ్రతిగజభ్రాంతిదంతనిర్దళితధవళ
భూధరాపారపాంసుకర్బూరపూర, మెగయఁ జల్లుచు వచ్చెహస్తీంద్రమపుడు.

వ. వెండియు నాఖండలబలిప్రముఖసురాసురమండలం బుద్దండభుజాదర్పంబు మెం
డుకొన సుధాపయోధి మథియించుసమయంబున. 238

క. సకలసురేప్సితఫలదా, యకచిత్రచరిత్రములను హరిచందనక
ల్పకపారిజాతసంతా, నకమందారంబు లవ్వనధి నుదయించెన్. 239

ఉ. కైరికము ల్ప్రవాళములు గా గళదబ్ధిపయఃకణాళియే
కోరకపాళిగా నడుమఁ గోరికమీఱ విశేషమైనయా
కారముపూని మందరము కామితసత్ఫల మీయనయ్యెమం
దారము గానిచోట నగనామము సెల్లునె రెంటికింబగన్. 240

వ. మఱియు వియచ్చరనిశాచర సముచ్చయంబు విచ్చలవిడి శిలోచ్చయంబుచే
నప్పాలకడలిం ద్రచ్చుసమయంబున. 241

క. చెచ్చెర మందరసంగతి, నచ్చటిమణులెల్ల రమణు లయ్యెనటంచున్
మెచ్చుచు నచ్చెరువంద వి, యచ్చరు లచ్చరలు పుట్టిరయ్యమృతాబ్ధిన్. 242

సీ. పదకోకనదములు ప్రపదకూర్మంబులు నఖరశుక్తులు జఘనపులినములు
వలితరంగములు పొక్కిలిసుళ్లు నూఁగారుకలువచాల్గుబ్బజక్కవలకవలు
భుజనాళగళశంఖములు గల్లమకరికామకరిక లాలోకశకులకులము
లక్షిసితాబ్జోష్ఠహల్లకభ్రమరకషట్పదంబులు కేశశైవలములుఁ
తే. జాలఁ జెలువొందు సుస్వరస్పర్శరూప, రసగుణంబులచే నప్సరస్సులనఁగ
నప్సరఃకామినీమణు లలరిరపుడు, సహజసౌరభ్య మెక్కుడుమహిమ దెలుప.
ఉ. వారితనూవిలాసములు వారితనూత్నలతావికాసము
ల్వారివిలోలనేత్రములు వారివిహారవిసారజైత్రము
ల్వారిదరస్మితాస్యములు వారిదముక్తశశీతదాస్యము
ల్వారిజగన్నుతాకృతులు వారిజబాణసతీకృతానతుల్. 244
సీ. కమలాకరం బెల్లఁ గలఁగఁబారిననొల్ల కరుదెంచుకొదమరాయంచ లనఁగ
వరుణాలయాంతరవనవాసము దరల్చి చేరెడుకలికిరాచిలుక లనఁగ
విషరాశివిషమాను విషధరంబులరోసి మెట్టకు నరుగుక్రొమ్మెఱుఁగు లనఁగ
నడుగునఁబడక రత్నాకరంబునఁ దేలి నడతెంచు జీవరత్నంబు లనఁగఁ
తే. గులుకునడ జీనిచక్కెరలొలుకుపలుకు, బెళుకుఁజూపులుఁ గెమ్మోవితళుకుముద్దు
చిలుకు నచ్చరచిలుకలకొలుకు లపుడు, కడలివెలువడి వచ్చుశృంగార మమరె.
సీ. ఎచ్చోటఁ జూచిన నెలతేఁటిదాఁటులఁ బుట్టించుకప్పుఁగొప్పుల మెఱుంగు
లేవంకఁ జూచిన నిందుబింబంబుల మొలపించుముద్దుమోముల బెడంగు
లేచాయఁ జూచిన నిందీవరశ్రేణి వెలయించు వాలుఁ జూపులవిలాస
మేకడఁ జూచినఁ గోకనదశ్రీలఁ గిలింపఁజాలు కెంగేలిడాలు
తే. లేయెడనుజూడఁ గెంపులఁ జేయుమోవు, లెందుఁజూచిన వెన్నెలల్ చిందునవ్వు
లెచటఁజూచిన మెఱుఁగుల నీనుమేను, చెలువ మలరారె నచ్చరచెలువలకును.
ఉ. అచ్చపురేవెలుంగు దొరయంగలసిద్ధపుముద్దుమోములం
బచ్చమెఱుంగుతెక్కజిగిపక్కెరచక్కనిరౌతుతూఁపుల
న్మెచ్చనిచూపులం దళుకుమేనుల నిచ్చకు మెచ్చుఁదెచ్చున
య్యచ్చరమచ్చెకంటుల యొయారమయారె నుతింప శక్యమే. 247
ఉ. అచ్చిగురాకుఁబోండ్ల నెఱయంచమునందె మనంబునిల్పి వై
యచ్చరదానవప్రవరు లచ్చెరుపాటఁ బరాకుఁజెందుచు
న్మెచ్చుల కెచ్చరించుచు సమిద్ధఫలాబ్ధికిమేను లుబ్బఁగాఁ
ద్రచ్చిరి క్షీరవారిధి నుదగ్రరవంబడరంగ నంతటన్. 248
తే. పాలుసిలుకంగ వెన్న యేలీలఁ బొడమెఁ, జాలవింతని వేలుపు ల్సంభ్రమింపఁ
జంద్రుఁడుదయించె నప్పాలసంద్రమునను, వానిశిరసావహించె భవానివిభుఁడు.

క. నిస్తులమై నిస్తులతే, జస్తులమై దీప్యమానసకలదశదిశా
వాస్తుభమై కలశాంబుధిఁ, గౌస్తుభరత్నంబు తరణికరణిఁ జనించెన్. 250
సీ. అమృతంబు ద్రావునీలాభ్రమో యిదిగాదు కప్పుపెన్నెఱి గొప్పకొప్పుగాని
మరలఁబుట్టెడు చందమామయో యిదిగాదు మొలకనవ్వులముద్దుమోముగాని
ప్రభవించునమృతకుంభంబులో యివిగావు కఠినవక్షోజయుగ్మంబు గాని
జలధిఁ బుట్టిన పూర్వజగతియో యిదిగాదు మహితనితంబబింబంబు గాని
తే. యనుచు నామస్తకము క్రమంబునను నిర్వి, కల్పసవికల్పవిజ్ఞానగతి గణింపఁ
గా సురాసుర లతులశృంగారగరిమ, క్షీరవార్ధి జనించె లక్ష్మీమృగాక్షి. 251
తే. ఆరమాసతిరూపరేఖాతిశయము, వర్ణనము సేయఁ దరమె యెవ్వారి కైనఁ
గాంచినప్పుడె చిత్రతఁ గాంచె సకల, దైవదానవరాజి చిత్రంబుగాఁగ. 252
శా. శ్రీరాజీవముఖీవినూతనతనూ శృంగారరేఖాదిదృ
క్షారంభంబున దేవతావళి సహస్రాక్షత్వముం గోరె వి
స్తారప్రీతిసహస్రనేత్రుఁ డయుతాక్షత్వంబు [1]గాంక్షించె నౌ
రౌరా యాసకు మేర లేదనుట సత్యంబె కదా ధారుణిన్. 253
వ. అంత. 254
తే. పద్మగర్భాదినిర్జరప్రార్థ్యమాన, యగుచుఁ బద్మావధూటి దేవాధినాథ
ఘటితమణిపీఠి వసియించెఁ గమలమధ్యమునను జెలువందు కలహంసికను హసించి.
క. "పుణ్యాహ" మనుచు నప్పుడు, పుణ్యాహము చేసె వాగ్విభుఁడు భూమిని నై
పుణ్యార్పితనవపల్లవ, పుణ్యోదకపూర్ణకలశములు చెలువొందన్. 256
సీ. పాథోధరశ్రేణి పటహభేరీశంఖపణవాదివాద్యవిభ్రమము నెఱప
నప్సరోభామినుల్ హస్తాభినయలీల నర్థముల్ దెలియ నృత్యంబు సలుప
గంధర్వకలకంఠకంఠులు స్థాణువుల్ గనలొత్త మధురగానంబు సేయ
జయలోకపావని జయజగజ్జనయిత్రి జయలక్ష్మి యని సురల్ సన్నుతింపఁ
తే. జారుతరదక్షిణావర్తశంఖములను, విమలగంగాదినదులతోయములు ముంచి
యాగచోదితమంత్రరహస్యములను, బద్మ నభిషిక్తఁ జేసిరి బ్రహ్మఋషులు. 257
ఉ. శ్రీమహిళాలలామ కభిషేకముఁ జేసె దిగంతదంతులు
ద్దామకరప్రకాండసముదంచితకాంచనకుంభసంభృత
శ్రీమహనీయతోయములచేతఁ దదీయకచాళికోమల
శ్యామలభృంగపాళికి నవాబ్జమరందము సించుకైవడిన్. 258
క. హస్తముల కొసఁగు మిపుడె ప్ర, శస్తోరుశ్రీల ననెడిచందమున దిశా
హస్తులు లక్ష్మికి శైలే, శస్తని కభిషేచనోపచారము సలిపెన్. 259

1 గామించె.

సీ. శైవాలవల్లికాజలధియిచ్చిన పచ్చపట్టుపుట్టముఁగట్టెఁ బడఁతియొకతె
కుండలీంద్రుఁ డొసంగు కురువిందమాణిక్యకుండలమ్ములు వెట్టెఁ గొమ్మయొకతె
శారద యొసఁగిన సదమలతారహారంబు చన్గవఁ జేర్చె రమణియొకతె
వనరాశి పతియొసంగిన వైజయంతీస్రజంబు కంధరవైచె సకియయొకతె
తే. విశ్వకర్మ యొసంగిన వివిధరత్న, భూషణంబులు గైసేసెఁ బొలఁతియొకతె
పద్మగర్భుఁడొసంగిన పంకజంబుఁ, గేలఁగీలించె నొకరాజకీరవాణి. 260

క. ఈరీతి సకలదైవత, నారీతిలకములు మిగుల నైపుణితో శృం
గారింప నొప్పె రమ బం, గారపుబొమ్మో యనం జగన్మోహిని యై. 261

చ. జయజయయంచు బ్రహ్మఋషిజాలము దీవనలియ్యఁగాఁ బురం
జయజలజాతసంభవనిశాచరవైరికులాధిభూధనం
జయముఖదిగ్వరప్రముఖ సర్వసురల్వినుతింపఁ జిత్తభూ
జయకరవిభ్రమంబుల నెసంగె రమాసతి భద్రపీఠికన్. 262

సీ. మకుటాగ్రమరకతమణిరుచుల్ తనువిభాజలధి శైవాలవల్లులు ఘటింప
వాలుఁజూపులు కేళివనజాతముల వ్రాలుగండుఁదుమ్మెదలతోఁ గలసిమెలఁగ
గట్టాణిముత్యాలకమ్మడాల్ నును జెక్కుమించుటద్దములఁ గ్రొమ్మెఱుఁగు వెట్ట
గళశంఖకుచకుంభకరికుంభసంభవభ్రమదంబు లగుచు హారములు మెఱయఁ
తే. చరణనఖకాంతిజాహ్నవీపూరము వినమ, దమరవరముఖ్యసురకిరీటముల నిగుడ
స్వస్వరాజ్యాభిషేకసూచకము గాఁగ, సింహపీఠిఁ జెలంగె లక్ష్మీలతాంగి. 263

చ. ఒకగుణ మున్నచోట మఱియొక్కగుణం బరు దెన్నిచూడఁగా
సకలసుపర్వసంఘముల సర్వగుణంబులు గల్గి లోకనా
యకుఁ డన మించువానిహృదయంబున నిల్చెదనంచు సిందిరా
ముకురముఖీలలామ సురముఖ్యులఁగన్గొనుచుం గ్రమంబునన్. 264

సీ. మణికిరీటమువాని మరకతప్రత్యుప్తమకరకుండలదీప్తిమహిమవాని
బటువుకైదువువాని భాసమానమృగాంకభాసమానస్మితాస్యంబువానిఁ
గంబుకంఠమువానిఁ గారుణ్యరసనూచకారుణ్యలోచనాంతములవానిఁ
దమ్మిపొక్కిలివానిఁ దపనీయరుచిరుచ్యతపనీయపటకటితటమువాని
తే. డాలుగులికెడు పులుఁగురాడాలువాని, వాలువైరులఁ జెండాడువాలువాని
మేలుసమకూర్చు త్రైలోక్యమేలువానిఁ, బద్మనాభుని వీక్షించెఁ బద్మ యపుడు.

తే. కమలనయనమనోహరాంగములసొకు
మార్యసౌందర్యములు చూచి మగువవలచె
ననుట చిత్రంబె తన్మూర్తిధ్యానగమ్య
మైనతఱి యోగివరులు మోహంబుగనఁగ. 266

సీ. అంగవల్లిక మాధవాలోకమునఁ గోరకములొందె ననఁ బులకలు దనర్ప
గండస్థలీచంద్రకాంతము ల్విధు దర్శనంబున స్రవియించెనాఁ జెమర్పఁ
బురుషోత్తమోద్వాహభూరిసౌభాగ్యసూచకమునా వామోరు సంచలింపఁ
జక్రాప్తరుచుల లోచనపద్మములు దేనియలు చిందెనా ముదశ్రులు జనింప
తే. జలజపీఠము డిగ్గి భాసావధూటి, చేరి కైదండ యొసఁగ లక్ష్మీమృగాక్షి
పరమసాత్త్వికదృష్టిసంపర్కమునను, సాత్త్వికోదయమగుటయాశ్చర్యమగునె.
సీ. ఇంద్రాణి మొదలుగా నెనమండ్రు దిక్పాలకాంతాశిరోమణుల్ క్రమముగాఁగ
నడపంబు గిండి పావడ కుంచె కాళాంజి సామ్రాణి ధూపంబు చామరములు
చేకొని యుడిగంబు చేయ రంభామేనకోర్వశీహారిణీతిలోత్తమాది
సురవారవారిజాక్షులు చెంగుపాంగంబు ముఖవీణ మురజంబు మొదలుగాఁగఁ
తే. గొనుచు గంధర్వమేళంబు వినికిసేయ, నబ్జభవురాణి బిరుదుపద్యములు చదువ
శక్రుఁడందంద సందడిజడియఁజేయఁ, బ్రాభవంబున సకలవైభవము లమర. 268
తే. అఖిలలోకేశ నినుఁజూచినది మొదలుగ,మదనుఁడేసినశరపాలియిదిగొ యనుచు
నాథునకుఁ జూపి తెల్పుచందమున నల్లఁ, గల్వపూదండ చేఁబూని కల్మిచెలువ.
సీ. ఘంటలు మొలనూలిఘణఘణధ్వనులతో ఘనతరశ్రోణిచక్రంబు గదల
వలిగుబ్బచనుదోయివలిపెపయ్యెద కొంగు చెంగావిటెక్కెంబు చెన్ను మీఱఁ
జిన్నిలేనవ్వులు చికిలిఁజేసిన తళ్కు చెక్కుటద్దంబుల చెన్ను చూప
వెలిదమ్మిరేకుల వెలయించుకనుడాలు తెల్లజల్లులలీల నుల్లసిల్ల
తే. నంఘ్రికటకారవాకృష్టహంసతతులు, వాజులై మించఁ గచగంధవలదపార
మధుపబలములు వెలయు మన్మథరథంబు,తీవి మీఱంగ వచ్చె లక్ష్మీవధూటి. 270
తే. ఆరమాకాంతరూపరేఖాతిశయము, గాంచి హరి కప్పు డంతరంగంబు నిండి
వెలికిఁ గ్రమ్మిన యనురాగజలమనంగ, స్వేదమానందబాష్పముల్ చెలువమయ్యె.
తే. నూనసాయకశరవృష్టి నానుకతనఁ, బొడముచలిచేత నెమ్మేను పులకరించు
కరణి రోమాంచకంచుకకలిత మగుచుఁ,దనువుగననయ్యెదనుజమర్దనునకపుడు.
మ. వనజాతాక్షునిచూపు శ్రీతరుణిలావణ్యాబ్ధి నోలాడుచున్
స్తనకుంభంబులు వీడి భంగవళిపాతస్ఫూర్తిగంభీరనా
భినిభావర్తమున న్మునింగి జఘనాస్థిం దేలి యమ్మిట్టన
ట్టినిలంజాలక లోలమై యడుగువట్టెన్ రాగభారంబునన్. 273
క. చూపుమఱిత్రిప్పఁజాలక, యాపంకజవదన భాసురాకారకళా
టోపము గనుఁగొని హరి సుమ, చాపునకున్ లోఁగిమానసంబునఁబొగడెన్.
సీ. సహజత్వజనితవత్సలతచే వెనువెంట వచ్చినశైవాలవల్లి యనఁగఁ
దనపట్టిఁ బాయఁజాలనిప్రేమమున వెన్కవచ్చినయమునాప్రవాహ మనఁగఁ

దనుఁబాసి చను మెఱుంగని క్షీరపానంబు వదలి వెన్గొను నీలవనద మనఁగఁ
గమలాభిధానమోహమునఁ బైపైవ్రాలి కనుపట్టు తుమ్మెదకదు పనంగ
తే. నిరుల జేజేలరాతాలసరుల దొరయు, కప్పుచొప్పడు పెన్నెఱిగల్గి బార
కెక్కుడై సూక్ష్మకచముల కింపుసొంపు, నిచ్చె నీపద్మపాణివేణీభరంబు. 275
తే. వనిత నిడువాలుఁగన్నులు వాలుగన్ను, లౌట కిందేమి యాశ్చర్య మరసిచూడ
బెళుకుఁజూపుల నెంతయుఁ బ్రేమమీఱ, నాత్మసంతతిఁ బోషించు ననుదినంబు.
సీ. నెఱివేణి నీలాహి నిరసించుటే వింత నెమిలిపింఛమువంటికొమరు గలుగ
ముద్దునెమ్మొగము దమ్ములనెంచుటే చోద్య మిందుబింబముచంద మెనసియుండ
నధరంబు బింబంబు నగలించుటే హెచ్చుశుకరాజతుండవిస్ఫురణఁ బొదల
బటువు పెందొడలు రంభల వంచుటే చిత్ర మిభహస్తములరీతి నేపుఁ బెనుప
తే. గబ్బిగుబ్బలు జక్కవకవ బెడంగు, గాంచఁ గెందమ్మిమొగ్గల మించుటెంత
తనువు ఘనసారసౌరభ్య మనువుపఱుప, నెల్లతాపంబు లుడిగించుటేమియరుదు.
చ. స్ఫురితరవిప్రకాశపరిఫుల్లపయోరుహకేళికాగృహాం
తరసురతక్రియాలుఠనతత్పరతాప్తపరాగపాళిధూ
సరితరథాంగదంపతులచందమునం జిగికుంకుమంబుచే
గురుకుచకుంభము ల్మెఱసెఁ గోకిలవాణికి హృద్యవైఖరిన్. 278
తే. కఠినతరవృత్తకుచకుంభ కరటికుంభ, గళితమదధారలీల శృంగారమయ్యె
గారుడోపలరుచులచేఁ గారుకొనుచుఁ, జాలరమ్యగారనూగారుచారుముఖికి 279
చ. కరములఁ గాంతి మోమున వికాసము గమ్మనిమేనఁ దావియుం
జరణముల న్మృదుత్వము విశాలత నేత్రముల న్మరందము
ల్సరసవచోవిలాసములఁ జన్గవఁ గోశత పక్ష్మపాళిఁ గే
సరములసౌక్ష్మ్యముం దగఁ బొసంగెఁ గదా కమలాఖ్యలక్ష్మికిన్. 280
సీ. జాతినిద్దంపువజ్రాలకమ్మలడాలు గండపాండిమకుఁ గైదండ యొసఁగఁ
జికురలక్ష్మికి నళిశ్రేణిఝుంకృతులచే సారె పరాకుహెచ్చరికదెలుప
మొగమున కెగయు చన్గవపైని నునుమోవితళుకుకుంకుమ వసంతములు చల్ల
ముఖచంద్రునకు దృగంబుజ ధాళధళ్యంబు సరిగాఁగ నుభయచామరలు వైవ
తే. వాలుఁజూపులు కువలయశ్రీల నింప, [1]నవయవంబులసవురు రాజాధిరాజ
చర్యలనుబోల సహజసౌందర్యరేఖ, కలిమిఁ జూపగఁ జెలఁగె నీకలిమిచెలువ.
తే. ఈచెలువ నన్నుఁ జేరిన నింక నెపుడు, బొమ్ముదింపకయుందు ముదమ్ముమీఱ
ననుచు నెంతయు ననురాగవనధి నోల, లాడు వేడుకమీఱ క్షీరాబ్ధిశాయి. 282
సీ. దృష్టి దాఁకునటంచుఁ దెరవైచె నని యెంచు బహురత్నభూషణప్రభలుగాంచి
తనుఁగూడిపలికెనోయన చెలంగుఁ బదాబ్జహంసకకలకలం బాలకించి

1 నవయవంబులు పద్మశంఖాదినవనిధానములఁబోల.

యక్కునఁ జేర్చెద నని వొక్కు వజ్రాలతాళిఁదోఁచినతనతనువుసూచి
చేకల్వదండ వైచె నటంచుఁ దమి బొమ్ముఁ జూచుఁ బైఁగ్రమ్ము వాల్చూపులరసి
తే. చక్కనొత్తునెపంబునఁ జారుకౌస్తు, భంబుస్పృశియించుఁదత్ప్రతిఫలితయువతి
కఠినవక్షోజసంస్పర్శకౌతుకమున, మదనజనకుండు లక్ష్మీసమాగమమున. 283

ఉ. గౌరిక తెప్పలెత్తుచును గొంకున నంతనె తెప్పవ్రాల్చుచుఁ
శ్రీరమణీలలామ సరసీరుహనాభునిఁ జూచువేళ వి
స్తారవిలోచనద్యుతులు చక్కనిమోమనురాజు సూరెలఁ
సారెకువైచునయ్యుభయచామరలో యనమించె నెంతయున్. 284

తే. శౌరి గనుఁగొనఁ గనుఁగొన నారిగొంకు,నారి గనుఁగొన గనుఁగొన శౌరిగొంకు
గనుఁగొనకయున్నఁగనుఁగొను వనితపతియు, వారిప్రేమంబుసిగ్గుచే వన్నెగాంచె.

తే. మందయానంబునకు సిగ్గు మఱియుఁ గొంత
మాంద్య మొసగూర్ప భారతీమానినీ క
రాంచలము వీడి భయవినయములు దొరయ
వారిజాక్షుసమ్ముఖమును జేరవచ్చి. 286

శా. దృగ్రాజీవకరాబ్జము ల్తరళరీతిం జెంద శ్రీనామకం
బుగ్రీవామణి యంబుజోదరుని కంబుగ్రీవఁ గీలించెఁ దా
దృగ్రాజాననచంద్రికాహసనదీప్తిస్మేరనీలోత్పల
స్రగ్రాజంబు తదీయకాంతి యమునాసౌగంధ్యసంధాయిగన్. 287

శా. శ్రీకల్యాణనగాధివాసులు సుమశ్రేణిం బ్రవర్షింప వా
ణీకల్యాణసుగంధి యాదిగఁ బురంధ్రీరత్నము ల్సేరి గౌ
రీకల్యాణము పాడఁగాఁ బటహభేరీశంఖము ల్మ్రోయ ల
క్ష్మీకల్యాణమహోత్సవంబునఁ జెలంగెం జక్రి యుప్పొంగుచున్. 288

సీ. కమలాప్తకమనీయ కౌస్తుభరత్నంబు గృహదీపకలికను శ్రీ వహింపఁ
బావనవైజయంతీవనమాలిక కేళికాడోలికలీలఁ జూపఁ
దారహారశ్రేణి ధవళముక్తామయ రంగవల్లికలవిభ్రమముఁ దెలుప
శ్రీవత్సలక్ష్మంబు జేజేలరాజాతికట్నంపుజగతి పొంకంబు నెఱప
తే. దీర్ఘబాహాదృఢస్తంభదీప్యమాన, సురభికస్తూరికాలిప్తహరిభుజాంత
రాళహారినీలమణిమందిరమున నిలిచెఁ, బాలమున్నీటిరాకన్య ప్రమదమునను.

సీ. కౌస్తుభరత్నంబుఁ గాంచిబింబమటంచు మోహించి చేరిన ముద్దుచిలుక
బాహాంతరచ్ఛద్మపద్మాకరంబునఁ జెలువైనతావిచెంగలువపువ్వు
పావనవైజయంతీవనమాలిక గ్రొంజిగురొత్తినగుజ్జుమావి
వన్నెవాసిగనంగ [1]జిన్నంపుబొజ్జప చ్చెదమీఁద నొరసిన హేమరేఖ

---

1 సొన్నంపు.

తే. చెఱకువిలుకాఁ డురంబున మెఱుఁగుసాన
పైని మొనయిడు కాంచనాంబకము రేఖ
యనఁగఁ జూపట్టె జలధికన్యాలలామ
పద్మనాభుని ఘనభుజాభ్యంతరమున. 290

తే. ఇంపుదళుకొత్త లచ్చి యురమ్మెక్కినపుడె, జలధిమథనప్రయాసంబుదలఁపఁడయ్యె
హరి యిటులుగాదె యెందుఁగార్యంబుసఫల, మైననేటికిఁబూర్వప్రయాసగణన.

తే. ఈక్రమంబున సకలలోకైకజనకుఁ, డైన శ్రీహరి విపులబాహాంతరమున
నఖిలలోకైకమాత శ్రీ యధివసించి, ప్రజలఁ గనుఁగొనెఁ దాఁ గన్నప్రజలరీతి.

క. శ్రీలావణ్యవతీకరు, ణాలోలకటాక్షవీక్షణాళులు సుమనః
పాళీలవాప్తిలేఁ గర్బుర, జాలంబులఁ జేరవయ్యె సహజస్ఫూర్తిన్. 293

క. అకలంకరూపరేఖా, నికషోద్భవభూరిగరిమ నిరసించిన ల
క్ష్మీకటాక్షంబునఁ దలఁచిరి, నికషోద్భవభూరిగరిమనిరసించి సురల్. 294

తే. శ్రీకృపామృతవృష్టిసంసిద్ధివలన, జనులదారిద్ర్యతాపంబు శాంత మయ్యె
నఖిలజాతులు నామోదమందిచెలఁగె, సత్రతత్పరమయ్యె ద్విజవ్రజంబు. 295

వ. అంత మఱియు దెఱగంటిదొరలు వేడుక రక్కసులం గూడుకొని కలశజల
నిధి మథియించు సమయంబున. 296

మ. సురలుం దైత్యులు మేరమీఱి తను సంక్షోభించి సర్వస్వముం
హరియింపంగఁ దొడంగినా రనుచు నానాశావకాశంబుల
న్మాఱువెట్టంగఁ దొడంగెనో యనఁగ నంభోరాశి కల్లోలము
ల్మాఱసె న్వాసుకిభూరిభూత్కృతి మరుల్లోలంబులై యత్తఱిన్. 297

క. తన గంధాఘ్రాణముచే, తనె లాహిరిఁగొనఁగ దేవదానవు లబ్ధిం
జనియించె మదిర దానిం, గొనె నాసురవితతి మిగులఁ గుతుకం బమరన్. 298

సీ. ప్రజలతల్లి యనంగఁబరఁగు హారీతకి దక్షిణపాణిపద్మమునఁ బట్టి
ప్రణిదుష్టరక్తపత్త్వమున మించుజలూక వామహస్తంబున వలనుపఱిచి
రమణీయనవసుధారసపూర్ణకుంభంబు సవ్యాశయంబున నవదరించి
యఖిలదేవశ్రేణి కభయప్రదాతృత్వ మపసవ్యకరమున నవధరించి

తే. కనకచేలాద్యలంక్రియల్ కమలదళవి, శాలనేత్రంబు లసితాంగసౌకుమార్య
మమలగుణగౌరవముమించునచ్యుతాంశ, మగుచుధన్వంతరిజనించెనమృతజలధి.

తే. ఆతనిచేతిసుధాకుంభ మపహరించె, విప్రచిత్తి బలాఢ్యుఁడై [1]వేగవాని
చేతిదిహరించె జంభుఁడక్షీణబలుఁడు, వానిచేతిది గొనియె నిల్వలుఁడు గడిమి.

వ. అప్పుడు. 301

---

1 వేగనతని, చేతిదిహరించె జంభుఁ డక్షీణదంభుఁ, డతనిచేతిది గొనె నిల్వలాసురుండు.

సీ. మనతోడఁ గూడఁ ద్రచ్చినదేవతలకీక గొనుటనాయంబుగాద నెడివారుఁ
గైకొన్న మనతోడఁ గలహంబునకు రాక యమరులూరకయుండ రనెడివారు
దురమైనయంతఁ జిందఱవందఱైపోవు నమృత మెవ్వరికి లే దనెడివారు
నెందాఁకఁ గొంచుపో యెదవు మంచిది పొమ్ము నినుఁ ద్రావనిత్తుమే యనెడివారు
తే. వలదు మనకెల్ల బలి[1]చక్రవర్తి నేత, గాన నాతనిచేతికిఁ గలశ మిచ్చి
యతఁడు పంచి యొసంగిన యటులుగొనఁగ, నర్హమనువారలైరి నిశాటులెల్ల.

చ. అలమి నిశాచరుల్ గొనినయట్టి సుధాకలశంబు గైకొనం
బలిమి యొకింతలేక సురనాయకముఖ్య మఖాశను ల్సుధా
కలశము పోయెఁ బోయె నని కాతరులై మొఱవెట్టఁగా నహో
వలదు భయంబటంచు హరి వంచన సేయఁదలంచె దైత్యులన్. 303

మ. కులుకుంగుబ్బలు ముద్దుగాఱు పలుకుల్ క్రొమ్మించు మేన్మించులుం
దళుకుం జెక్కులు మందహాసములు నిద్దా కెంపుకెమ్మోవియుం
బెళుకుంజూపులు సన్నపుంగవును శోభిల్లం జగన్మోహినీ
లలనాకారము పూనెమాధవుఁడు లీలాలోలహేలాగతిన్. 304

శా. ఈరీతిం జగదేకమోహనవయోహేలావిలాసంబుల
న్నారీరూపముఁ బూని శౌరి దితిసంతానంబు వీక్షింపఁగాఁ
జేరన్ వచ్చె నవాబ్జరంజితపదశ్రీమంజుమంజీరశిం
జారావంబులు మారభూరమణనిస్సాణధ్వని స్మీఱఁగన్. 305

సీ. శ్రవణావతంసవాసనఁ గ్రోలు నెలదేఁటిగరులతెమ్మెరల ముంగురులు నెఱయఁ
గమ్మలేనిట్టూర్పుగాడ్పులఁ దెలిమించు మెఱయించు పయ్యెదచెఱఁగు దొరుఁగఁ
గులికెడుతనదుగుబ్బలభారమున కోర్వఁజాలక లేఁగౌను సంచలింపఁ
గటకారవములకుఁ గాళ్ళవ్రేళ్ళఁ బెనంగు నంచలచే నడ యలసపడఁగఁ
తే. గుసుమభగముననునుగప్పుకొప్పుజడియఁ, దొలఁకుసిగ్గునవాల్చూపు బెళుకుఁజూప
దంతరుచినాఁగు మందస్మితంబు మెఱయ, దనుజసభఁ జేరవచ్చెఁ గాంతాలలామ.

తే. పంచబాణప్రతాపాతపమున కాది, కారణంబైనసంతప్తకాంచనాంగి
మేనిమించులు కెంజాయమించెనచట, "నాతపాయాతిలోహితాయ" యనవినమె.

సీ. బలిమనోహరలీలఁ జెలువయ్యె మధ్యంబు బాణమోహనరీతిఁ బరఁగెఁ జూపు
శంబరహృదయంగమం బయ్యెఁ గనుఁగవ జంభభావ్యం బయ్యెఁ జన్నుదోయి
రాహువిభ్రమదమై రంజిల్లె నెఱివేణి హేతిమంజులరీతి నెనసె నారు
తారకాశాస్యమై తగెనఖద్యుతి విరోచనపర్వమై మించె సౌకుమార్య
తే. మంగముసుమాలికోమల మయ్యెనఖిల, కర్బురామోదకరమయ్యెఁ గమ్మతావి
మోహినీకాంత సౌందర్య[2]మును గణింప, నసురవరులనెలోఁగొన్న పస దలిర్చె.

---

1 దైత్యవరుఁడు. 2 ము వినుతింపఁ, దరమె పరమేశ్వరున కైన ధరణినాథ.

శా. మోము ల్వెల్వెలఁబాఱఁ గన్నుఁగవ నామోదాశ్రువుల్ గాఱ మై
రోమాంచంబులు మీఱ ఘర్మకలశశ్రోణాంబువు ల్జాఱఁగా
మామోఘాస్త్రపరంపరల్ నిగిడి చిత్తాంభోజముల్ దూఱఁదో
డ్తో మోహాంబలరారఁ గన్గొనిరి దైత్యుల్దంభనారాయణిన్. 309

ఉ. ఆజవరాలిఁ జూచి యసురాళి వరాళివిరాళిఁ గొన్నచోఁ
దేజము మీఱఁగా మరుఁడు ధేయని వన్నియ మీఱఁ జిల్కరా
తేజదువాళిదోలి గడిదేఱిన దారి మిటారికల్వపూ
నేజను వైచె నద్దనుజనేతల చిత్తములుచ్చిపాఱఁగన్. 310

సీ. కదళికాయూపముల్ గన నారియూరువుల్ స్తంభలీలాప్తి రాక్షసుల కొదవె
నలివేణివేణి నీలాభ్రమై తగ దేవవిమతాంగముల ఘర్మవృష్టి గురిసె
నిందుబింబానన యెలుఁగెత్తి పాడిన దానవేంద్రులకు గద్గదిక పొడమె
మెలఁత సెమ్మేను గ్రొమ్మెఱుఁగు సంచున మించు దనుజేంద్రచిత్తముల్ దత్తఱించె
తే. లేమచిన్నారి లేఁగౌను లేమిఁ బూన, నసురవక్త్రంబులందు దైన్యంబు గదిసె
నిది యసంగతమయ్యు రతీశకౌశ, లాతిశయమున సంగతంబయ్యె నపుడు. 311

సీ. మొలకనవ్వుల ముద్దుమోముఁ దిలకించి కళవట్టినట్లుండె గలువతేఁడు
చిన్నారిమైదీఁగె జిగిఁ జూచి సురపాదపంబులు తీఁగియల్ పారసాఁగెఁ
గ్రొమ్మావిచిగురాకు సెమ్మోవిరుచిఁ గాంచి కలువడి నిలిచె నక్కౌస్తుభంబు
సెలనీటుగులుకు లేనెన్నడ ల్పరికించి కడుమందగతిఁ గాంచె గంధకరటి
తే. తేనియలసోన వెదచల్లు తేటమాట, లలికి యమృతంపుగుండలో నడఁగియుండె
నేలయిటువంటి వెల్లమాకీలతాంగి, యబ్బినను జాలు నని యెంచి రసురులపుడు.

సీ. జంభుండు సాభిలాషంబుగాఁ గనుఁగొన్న మునిమునిసినగవుతో మోమువంచుఁ
గనుసన్నఁ దను వేఁడుకొను బలాసురుఁడు రాగమున మునుంగఁ గ్రేఁగంటఁ జూచు
భ్రూసంజ్ఞ సంకేతములు దెల్పు నముచికి నింపుగాఁ గనుబొమ లెగయవైచు
బలిచూడ గబ్బిగుబ్బలమీఁది పయ్యెదఁ జాఱిచి గ్రక్కునఁ జక్కఁ జేర్చుఁ
తే. నిలుచు నొక్కెడఁ జేసన్నఁ బిలుచు నొకని, నొకనితో మంతనముఁ గోరు నొకని నీఁ జీరు
నొకని సరసోక్తులకు మెచ్చు నొకని నొరయు, మోహినీకాంత యసురసమ్మోహనముగ.

సీ. రేచాయనడరు బారెఁడు కీలుజడఁ జూచి మొలకలేనగవు నెమ్మొగముఁ జూచి
తరితీపుఁ జూపు బిత్తరపుఁ జూపులు చూచి తేనె చిందెడు మోవితీరు చూచి
జిలుఁగుపయ్యెంటలోఁ గులుకుగుబ్బలు చూచి [1]కనులఁ గాన్పింపని కౌను చూచి
తతమై రహించు నితంబబింబముఁ జూచి నునుదళుక్కఁ జెందు పెందొడలఁ జూచి
తే. చొక్కి మిక్కిలి రక్కసిరిక్కతేండ్లు
చక్కనయ్యకుఁ జిక్కి రాజసము దక్కి

---

1 కనుపింపక యొమించు కౌనుఁ జూచి.

తామసంబునఁ జొక్కి యెంతయును సాత్త్వి
కమున మోహంబు తలకెక్కి కలఁగిరపుడు. 814

చ. భళిభళి మెచ్చవచ్చు నిఁక బ్రహ్మను దీనిసృజించినప్పుడే
వెలయఁగఁ జేతికిన్ బిరుదు వేయఁగవచ్చును గొమ్మమాత్రమా
యలరెడు ముద్దుగుమ్మ నడయాడెడి బంగరుబొమ్మగాక యీ
చెలువ కటాక్షమెవ్వరికిఁ జేరును వారు కృతార్థులిమ్మహిన్. 815

సీ. కంతుపట్టపుదంతి గాదేని యీయింతి ఘనమనస్సరసులఁ గలఁచు టెట్లు
కళుకుబంగరుబొమ్మ గాదేని యీకొమ్మ చిత్తంబు లాసింపఁ జేయు టెట్లు
కళలూనులతకూన గాదేని యీచాన నయనోత్పలంబుల ననుపు టెట్లు
కారుమెఱుఁగుచెన్ను గాదేని యీయన్ను మోహకైతవముల మొనపు టెట్లు
తే. చెఱకుసింగాణివింటివజీరుపువ్వుఁ, గోల గాదేని యీగోల గుఱుతుగాఁగ
హృదయమున నాటు టెట్లని యెంచి చెప్ప, వైవకీక్షించు దైతేయవల్లభుండు. 316

సీ. గజరాజగమన సింగారంబు గనుఁగొనవలవదే కన్నులుగలుగు ఫలము
జలజాక్షి మధురభాషణము లాకర్ణింపవలవదే వీనులుగలుగు ఫలము
విరిఁబోఁడి జీనిచక్కెరమోవి రుచులాన వలవదే నాలుకగలుగు ఫలము
చెలిచెక్కుఁగపురంపుఁబలుకలు మూర్కొనవలవదే నాసికగలుగు ఫలము
తే. గబ్బిగుబ్బలబిగ్గరఁ గౌఁగిలింప, వలవదే తళ్కునెమ్మేను గలిగినఫల
మటులుగాకున్నఁ బంచేంద్రియములు గలిగి, నన్దులకు నేమిఫలము[1] వ్యర్థములుగాక.

చ. కనఁగలిగెన్ విలాసములు కమ్మనిచక్కెర లొల్కుపల్కులున్
వినఁగలిగెన్ సుధారసము వెల్లువపెట్టెడు మోవియానసిం
పునను జెకుటద్దములు ముద్దుగొన న్నెలవంక లుంచి చ
క్కనివలిగుబ్బచన్నుఁగవఁ గౌఁగిటఁ జేర్ప నిఁకెప్డుగల్గునో. 318

క. ఇదియే కనుటయు వినుటయు, నెదపైఁ బవళింపఁగనుటయే గనుట రతిన్
మదనజయశంఖరణితం, బెదిరెడుమణితంబు వినుటయే వినుటగదా. 319

తే. కుసుమకోమలమైన యీకోమలాంగి, తనువు భుజబంధనఖరదంతక్షతాల
కాపకర్షణముష్టిఘాతాదిసురత, ధార్ష్ట్యమున కోర్చునే యన్యతనువుభంగి. 320

సీ. చక్కెరకెమ్మోవి చవిచూడనే కాని మొనపల్లు చుఱుకన మోపరాదు
బలితంపుగుబ్బలు పట్టిచూడనె గాని నునువాడిగోరున నొక్కరాదు
[2]అంగంబు మెల్లనే యక్కుఁ జేర్పనగాని మించిబిగ్గరఁ గౌఁగిలించరాదు
[3]లలితంపురతికేళి సలరింపనే కాని బంధచాతుర్య మేర్పఱుపరాదు
తే. ఈఁగవ్రాలినఁ గందు నీయిగురుబోఁడి, కమ్మనెమ్మేను గనఁగఁ బొంకమ్ము దెలిసి
యేలికొనవలె మన్మథకేళియందు, నాకుఁ దక్కిన మెప్పింతు సలిసముఖిని. 321

1 వంధ్యములుగాక. 2 తనులతయెదను మెల్లనఁ జేర్పనే కాని. 3 లలిరతిక్రీడల నలరింప.

క. మానవతు లెంతకోమలు, లైనను బలిసురతపటుత నలరుదు రసహం
బైనరవిద్యుతిసంగము, చే నందవె పద్మినులు విశేషశ్రీలన్. 322

ఉ. ఔర యిదేటియోజన మృగాయతలోచన నన్నుఁగోరునో
కోరదొ కోరకేమి నలకూబరముఖ్యులు నాదుబంట్లు శృం
గారము చెప్పనేల త్రిజగంబులు నేలఁగఁ గల్గి లేదె యె
వ్వారిఁక నన్నువంటిబలవంతులు శత్రుఁడె వచ్చికొల్వఁగన్. 323

క. అనియుత్సహించి యొకనెప, మునఁ జెంగటికేగి దీనిముద్దులమాట
ల్వినవలతు ననుచు నబ్బలి, [1]తనమదిలోఁ దలఁచి మిగులఁ దత్తఱమందన్. 324

చ. కలకలనవ్వు నెమ్మొగము కమ్మనితమ్మి యటంచుఁ దుమ్మెదల్
హాళహాళిఁ జిమ్మితేఁగ భయమంది గిఱుక్కున మోము ద్రిప్పచోఁ
గలికి మెఱుంగుచెక్కుపయిఁ గ్రమ్మఁ దళుక్కునఁ బైఁట జాఱఁగా
బెళుకుచు నబ్బలిం గదిసి బిత్తరి యత్తఱి దత్తఱింపఁగన్. 325

చ. వెఱవకు కీరవాణి యలివేణివి గావె మదాళిపాళికిన్
వెఱవఁగనేల యంచు బలి వేడుకతోడ లలాటపట్టికన్
మెఱుఁగులు సిందు ముంగురులు మెల్లనె చిక్కులుదీర్చి చెక్కులం
దొఱఁగెడు ఘర్మముల్తనదు దుప్పటిచేఁ దుడిచెన్ నయంబుగన్. 326

చ. అలికులవేణి భృంగగరుదంచల చంచలకర్ణమంజరి
గళితపరాగము ల్పయిని గ్రమ్మిన రాల్చునెపంబు దోఁప గాఁ
బలుమఱు జాలువాసరిగ పయ్యెదకొంగు విదుర్ప గుబ్బచ
న్నుల జిగి తేఁగి చూపఱ కనుంగవకు న్మిఱుమిట్లుగొల్పఁగన్. 327

తే. ఆసరోజాక్షిలీలా విలాసములకు, మరులుకొని దానవేంద్రుండు మనసిజాత
మత్తవేదండదోధూయమానమాన, [2]సాబ్జుఁడై యిట్లుపలికె నబ్జాక్షిఁ జూచి.

మ. సుదతీ యెవ్వరిదాన వీ వెపుడు నెచ్చోనుండు నీనామ [3]మె
య్యది యీనీభువనైక మోహననవీనాకార మత్యద్భుతా
స్పదమయ్యెం బరమేష్ఠి మాపయిఁ గృపం బంచేంద్రియాత్యంతస
మ్మదముం జేయఁ దలంచి నిన్నిటులు నిర్మాణంబు గావించెనే. 329

మ. హరిణాక్షీ యటుగాకయున్న భవదీయాకారరేఖామనో
హరశృంగార విలాసవిభ్రమములం దావంతమాత్రంబు కి
న్నరవిద్యాధరనాగకింపురుష గంధర్వాదినానామరు
త్తరుణీరత్నములందుఁ గంటిమె వృథాతర్కంబు లింకేటికిన్. 330

1 తనసెమ్మదిలోన మిగులఁ. 2 సాబ్జుఁడయి పల్కె నబ్జాయతాక్షిఁ జూచి. 3 మె, య్యది యీనీభువనైక మోహనతమశృంగార మత్యద్భుతా.

ఉ. కన్నులకల్కి నీచెలువు కన్నులు చల్లఁగఁ గాంచఁగల్గుటం
గన్నులుగల్గినందులకుఁ గ్నల్గెఫలంబటు గాకయుండినం
గన్నులుకన్నులే వలలకన్నులుగా కవియేల కల్లగా
కన్నులవింటిజోదు పదకంజములాన[1] చకోరలోచనా. 331

సీ. తరుణి నీయధరామృతముకంటె మధురమా యతికషాయంబైన యమృతరసము
పూఁబోణినీభుజంబులకన్న మృదువులా గణియింప విషమంపుఁగల్పలతలు
వనిత నీనగుమొగంబునకన్న నందమా యెందునఁ గొఱగానిచందమామ
కలికి నీగబ్బిచన్గవకన్నఁ బొంకమా కుంభీంద్రదుస్స్పర్శకుంభయుగము

తే. [2]నారి నీకన్నఁ జక్కనివారె యప్సరస్సు లారయ వారివిభ్రమము లెల్ల
నప్రయోజన మటుగాన హంసయాన, నీకు సరిగాన నీయాన లోకములను.

తే. మొదటనే నిన్నుఁజూచినమోహనాంగి, యబ్ధిమథియింపమూరకెయమృతవాంఛ
గంగచెంగట వాసంబు గలుగుజనుఁడు, డప్పికై పల్వలంబులు డాయఁజనునె.

సీ. తళుకుఁగన్నులు దృష్టిదాఁకునటంచు నో శుకవాణి తలయెత్తి చూడవేమి
యిగురంచు గండుఁగోయిల దూఱునంచునో తరళాక్షి పెదవి గదల్పవేమి
చౌదంతిప్రతికుంభిశంకఁ జేరునటంచొ గబ్బిగుబ్బలు సారె గప్పెదేమి
యంచలు వెన్నాడు నంచునో మంజీరరవము గుల్కఁగఁజేరరా వదేమి

తే. స్వర్గమర్త్యవధూటుల చక్కఁదనము, తుచ్ఛమని నాగకన్యలతోడికలహ
మునకుఁగాల్ద్రవ్వెదవొలేకబోటనవ్రేలఁ,బుడమివ్రాసెదవిదియేమిపువ్వుఁబోణి.

క. కలశాంబుధి మథియింపఁగఁ, గలిగినసుధఁ బంచికొనఁగఁ గానక మేమే
బలదుర్బలములఁబోవుచుఁ, గలహించెద మొరులదూఱఁగానేల చెలీ. 335

క. దాయాదుల మాకస్యప, దాయాదులమాట మేము దైవతములుమా
కీయమృతము సరిగానీ, వీయెడఁ బంచిమ్ము నేర్తు వెంతయుఁ దరుణీ. 336

మ. లలనా నీమధురాధరామృతము గ్రోల [3]న్గాంక్ష గావింపకీ
కలశీతుచ్ఛతరామృతంబునకు నేఁగాంక్షించినా నంచు నం
జులకంజేయకు గోటికల్పములకెచ్చున్ జేయఁగా నా తపః
ఫలముల్ గల్గినఁగాని గల్గునటె యీభాగ్యంబు భామామణీ. 337

చ. కులుకుమిటారిగబ్బి చనుగుబ్బలకోడిన దంచునెంచకీ
కలశము చేతఁబూను కలకంఠి భవన్మధురాధరంబునం
జిలికెడి తేనె బొట్టయినఁ జిందెడిమాధురి పావనత్వముం
గలిగి సుధారసం బఖిలగణ్యముఁ బుణ్యము నొంగదే యనన్. 338

మ. బలిదైత్యేంద్రునిఁ జిన్నినవ్వవోలఁకం బద్మాక్షి వీక్షించి యు
జ్జ్వలవాసంతరసాలపల్లవల వాస్వాదైకలీలాలస

1 పయోరుహాననా. 2 వనిత. 3 న్వాంఛ.

త్కలకంఠికలనాద మేదుగసచో గాంభీర్య మేపారఁగాఁ
బలికెం జెంతల వట్టిమ్రాఁకులు చిగుర్పన్ నేర్పుసంధిల్లఁగన్. 339

తే. అబలలము మూఁడుమాటల కొలుతప్పు, లమ్మ నేఁ జెల్లగా పరిహాసకంబు
చేసె నీవిట్టిపనులు మాచేత నౌనె, చాలు నగరాను పొమ్ము నిశాచరేంద్ర. 340

ఉ. స్త్రీలను నమ్మరాదు చలచిత్తలటంచు జనమ్ము లెల్లవా
చాలత చూప నాపలుకు సత్యమటంచును విశ్వసింతురే
చాలు ని దేటిమాటలు పొసంగవు మీరటుగాక నమ్మినన్
మేలొనరింతు నందఱకు మిత్రతఁజూపి జగంబు మెచ్చఁగన్. 341

ఉ. అక్కట కల్లగాదు నిజమా జనవాక్యము ముజ్జగంబులం
జక్కఁదనంబు కల్మి రతిశక్తియు జాణతనంబు ప్రాయముల్
మిక్కువ గల్గువారియెడ మచ్చిక లెచ్చు రమించు జారయం
దెక్కడిసత్య మేడ నల పెక్కడి నిల్కడ దానవోత్తమా. 342

సీ. కుంతలంబులయందె కుటిలత్వ మననేల భావంబులందును బ్రబలియుండు
గబ్బిగుబ్బలయందె కాఠిన్య మననేల హృదయసీమలయందు నెనసియుండుఁ
గీలుఁగొప్పులయందె మాలిన్య మననేల బుద్ధిమార్గములందుఁ బొడమియుండు
జళుకుఁజూపులయందె చాంచల్య మననేల మోహంబులందును మొనసియుండుఁ
తే. దలఁచి చూచిన బొమలందె ధర్మగుణము, మాటలేటికిఁ గటినె క్షమావిలాస
మనవరతరక్తి యధరంబులందె కాని, మానినులచిత్తముల లేదు దానవేంద్ర.

క. బాలామణులను గానన సాలావృకములను నమ్మి సఖ్యము సేయం
బోలదని బుధులు దెలుపుదు, రేలాగున నమ్మవచ్చు నింతులచెలువుల్. 344

క. పలుకుల నొక్కటి భావం, బులనొక్కటి చేతనొకటి పూఁబోణులకుం
గలగుణములు వారల నెటు, వలెనమ్మెద నీవు దైత్యవల్లభ చెపుమా. 345

క. ఐన న్నే నటువలెఁ గా, నీననుకోరాదు గాక యెల్లసుగుణముల్
నేనీయక లేదుసుమీ, యీనెట్టున నీవె మీఁద నెఱిఁగెద వింకన్. 346

తే. ఇతరసతులందు మతిలేక యెపుడునన్నె, యాత్మఁబొందఁదలంచుపుణ్యజనులందు
లీయమై యుందు నేనెందు లేశమైన, భేదమెఱుఁగక పరమసమ్మోదమునను.

తే. ఆదరముఁ జెందియుండుదు నఖిలమునను, బలుకులేటికిఁ జక్రంబు పంపుసేయ
వెఱనెఱుంగక స్వచ్ఛందవృత్తి నుందు, నాకొకఁడు కర్తలేఁడు దానవవరేణ్య.

తే. ఒకభుజంగునితోఁగూడియుండునతఁడు, వివిధభోగాఢ్యుఁడయ్యును జెవులవినఁడు
గానఁ దత్తల్పతపసింప నేనుగోరి, వచ్చితి నటన్న బలిదైత్యవర్యుఁడనియె. 349

మ. వినుమా యీయనుమాన మేల బెళుకన్వామైన నీయాన జ
న్వని నీచేతిది నాదుదేహమును జీవంబు న్వృథామాటలే

లనుసీచిత్తము నాదుభాగ్యమిఁక నీళ్ళస్ముంచినం బాలముం
చిన నీవేమఁటి యొండెఱుంగ నిదియే సిద్ధంబు ముమ్మాటికిన్. 350

మ. అనిదైత్యేంద్రుఁడు మోహినీ మృదులహస్తాంభోజసంపర్కసం
జనితస్వేదకరాగ్రుఁడై యొసఁగఁజంచత్కుంభికుంభోప
మ స్తనకుంభంబులు గుల్క మేనఁ బులక ల్సంధిల్ల మోదంబు సి
గ్గు నొయ్యారంబును మీఱఁ గైకొనె సుధాకుంభంబు హేలాగతిన్. 351

మ. సొలపుంజూపులు బెళ్కుబేడిస లటంచుం బట్టుమంకించి పా
ణులుసాపన్ దనుజు ల్మృగాక్షి దెలిగన్నుల్ గాన లేనవ్వుతోఁ
బలికెం బాణిపయోజభాసుర సుధాప్రచ్ఛన్న సన్మాధురీ
కలనాసూచకభావగర్భితవచోగాంభీర్య మేపారఁగన్. 252

ఉ. రక్కసులార మీరలు సుర ల్సమయత్న బలప్రయాసు లై
యిక్కడలి న్మథింప జనియించిన యీసుధ మీరు వారుఁ బె
న్మక్కువతో భుజింప నయమార్గము గావునఁ బంచిపెట్టెదం
జక్కసమంబుగాఁ గ నిది సమ్మతమౌఁగద మీకు వారికిన్. 353

తే. వెనుక నిటువలె నటువలె ననుచు నన్ను, మాటలాడిన వినను ముమ్మాటికిదిగో
నెఱుఁగఁజెప్పితి హితమౌనె యేనుబంచి, పెట్టినటువలెఁ గైకొన గట్టిగాను.

క. అని నిశ్చయంబుదోఁపఁగ, ననిన లతాతన్విమాటకౌఁగాకని య
ద్దనుజులు బృందారకులున్, ఘనతరసంతోషరసవికస్వరముఖు లై. 355

సీ. గురుఁడు దోషాచరగురుఁడు సంకల్పంబు దెలుపఁగాఁ గలశాబ్ధిఁ దీర్థమాడి
మందారమహిజ మమందారమున నిచ్చుకనకాంబరంబులు కటులఁగట్టి
పారిజాతంబు పెంపారిజాతముదంబు చే నిడునిరిసరుల్ శిఖల జుట్టి
హరిచందనముగూర్చు హరిచందనపుఁబూఁత లింపమ్ముగా మేన నలవరించి

తే. కల్పక మొనర్చు మణిమయాకల్పకములు, పూని సంతాన మొసఁగునవీనకర్ణ
పూరసంతానములు దాల్చి భూరినిష్ఠ, నుపవసించి యొనర్చిరి హోమవిధులు.

క. అంతట నెంతయు భక్తిం, జింతామణి కామధేనుశీతలభాను
ల్చింతితవస్తువు లొసఁగన్, శాంతమహీసురులకొసఁగి శాస్త్రోక్తవిధిన్. 357

సీ. వజ్రమౌక్తికరత్నవైడూర్యమణిఘృణిస్థగిత కుంభస్తంభసంభృతంబు
నసమానచీనిచీనాంబర శ్రేణికాకలితవితానశృంగారితంబుఁ
గల్పకప్రసవసౌగంధ్య గంధాంధపుష్పంధయఝుంక్రియాసంకులంబు
దీపితసామ్రాణిధూపధూమస్తోమఘుమఘుమాయిత గంధగుంభితంబుఁ

తే. బ్రకటగంధర్వ గాంధర్వబంధురంబుఁ, జటులపంచమహావాద్య శబ్దితంబు
నిపుణతరవిశ్వ కర్మనిర్మితంబు, నవమునైమించు కనకమంటపమునందు. 358

క. ప్రాగగ్రకుశాస్తరణా, భోగంబులయందుఁ దూర్పు మొగముగఁ బన్నా
ల్సాఁగిరి బలిముఖదానవు, లాగిరిభిన్ముఖ్యదివిజు లతులితభక్తిన్. 539

ఉ. జాఱెడుపైఁటతోఁ గులుకుజక్కవగుబ్బలతో మిటారిన
వ్వారెడు మోముతో గిలుకుటందెలతో నసియాడుకౌనుతో
సారసగంధి సౌధకలశంబు కరంబునఁ బూని యెప్పుడో
య్యారముమీఱ వచ్చె నొకో యంచు నిశాచరులెంచున త్తఱిన్. 540

మ. వలలోఁ జిక్కినకల్కిజక్కవల శేవం జిల్గుఁబయ్యెంటలోఁ
గులుకు న్నిబ్బెపు గబ్బినిబ్బరపుఁజన్ను ల్బల్మిటారింపఁగాఁ
గలమంజీరఝుళంఝుళల్మదనశక్త్యారూఢిఁచూప న్సుధా
కలశీకమ్రకరాబ్జయైకలికి శృంగారంబు తోరంబుగాన్. 541

సీ. గిలుకుమెట్టెలడాలు చిలువకుచ్చెలలపై జాళువాబంగారుసరిగఁ గూర్ప
జిలుఁగుపైఁ ఠాణిదువ్వలువలోఁ జెలుదొడ ల్సింగావిపావడరంగు లీనఁ
గమనీయమైమించు కటిచక్రచలనంబు రతిమనోవల్లభురాకఁ దెలుప
గమనశ్రమంబుచేఁ గమ్ముకమ్మనియూర్పు తెమ్మెరచేఁ గౌనుదీఁగెవడఁక

తే. గుబ్బ లొండొంటినొరయ ముంగురులు నెఱయ
గంకణంబులు మొఱయ నంగంబు మెఱయ
నడలు ముద్దులుగురియ లేనగవు దొరయ
వెలఁది చనుదెంచె దైత్యులు వేడ్కఁబొరయ. 542

ఉ. అమదిరాక్షిఁజూచి పరిహాసముమీఱ బలీంద్రుఁడిప్పుడో
కోమలి నీవు చేనమృతకుంభము పూనినఁ[illegible]
లామణిపంచుఁ బొల్గొనఁ దలంచెద మన్నను నవ్వుచు న్మృగా
క్షీమణి బావ నీవు దధిఁ జిల్కఁగ గోపికనైనదోసమే. 543

మ. అవు బావా యమృతంబు ముందు మనదైత్యశ్రేణికిం బంతునో
దివిజుల్గుయ్యిడకుండ ముందొసఁగి యందేగొంత తర్వాత దా
నవదైత్యాసురరాక్షసావళులకు న్వడ్డింతునో యానతీ
యవలె స్మీరన మంచిదే యనియె దైత్యస్వామి మేనుబ్బఁగన్. 544

తే. గిలుకుటందెలు ఘల్లనఁ గీరవాణి, మరలి సురపఙ్క్తి కరుగుచోఁ బిఱుదుచక్కఁ
దనము నెఱివేణిచెలువు గన్గొనిబలీంద్రుఁ, డాదికన్నను మిగులమోహంబుగాంచె.

తే. వారిజేక్షణ సురపఙ్క్తిఁ జేరవచ్చి, యింద్రుఁడెంత యమర్చిన నింతయేని
యమరకుండెడియమరులయలబలంబు, మాన్పెఁజేసన్న నొకమాట మాత్రలోన.

తే. వజ్రధరముఖ్యులౌదిశావల్లభులును, గరుడగంధర్వ కిన్నర ఖచర సిద్ధ
సాధ్యవిద్యాధరాదినిర్జరకులంబు, వారి వేర్వేఱ బంతిగా నేర్పుపఱచి. 547

సీ. ధారుణీస్థలిఁ దోఁచునూరుమూలముగాంచ నింతసిగ్గేల మోమెత్తు మనుచుఁ
బయ్యెద దొలఁగ గుబ్బలుచూడఁ బల్లంటఁ గెమ్మోవినొక్కి జంకించుకొనుచు

భుజమూల మీక్షింపఁ బోదలుసిగ్గుననీకు వడ్డించ నని కేలు వంచికొనుచుఁ
గనుఱెప్ప లెత్తిగన్గొని మెచ్చి తలయూఁచియమృతపానము సాలునాయటంచుఁ
తే. దియ్యసరసంపుమాటలఁ దేనెలొలికి, యమృతరసము కదంబింప నమరపతికి
మొదట వడ్డించి వడ్డించుఁ ద్రిదశతతికి, మోహినీకాంత జగదేకమోహనముగ.
మ. అలివేణీమణి గిల్కుమెట్టియలు మ్రోయంబంతివడ్డించుచుం
జిలుఁగుంగుచ్చెలజాఱఁ ద్రొక్కువడి డాఁచేఁ జెక్కుచోఁ బైఁటయుం
దొలఁగంగాఁ జుబుకంబుచే నదిమెఁ దోడ్తో సిగ్గునొయ్యారముం
దలుకుం దత్తఱము న్విలోకిజనచిత్తంబుల్ గరంగింపఁగన్. 549
సీ. చెదరినముంగురు ల్చెమటచే నుదురంటఁ గొనగోళ్ళచే దువ్వుకొను బెడంగు
జాఱుపయ్యెంట భుజంబుమీఁదికిఁ ద్రోసి చెలఁగు డాఁపలివంకఁ జెక్కుటెలయలు
సడలి ముంజేవ్రాలు జాళు వాపైఁడిగాజులు పైకినెగఁద్రోయుచో విలాస
మవనిభాగమున జీఱాడుకుచ్చె లకొంగు లీలఁగెంచేలఁ కేలించు చెలువ
తే. మలసి నిట్టూర్పులిచ్చు నొయ్యార మెదను,మించు ఘర్మంబుగొనగోటమీటునీటు
గలుగుమోహినిఁదలఁపమైఁబులకలొద వె,దానవులుసొక్కుటేవింతధరణికాంత.
వ. ఇట్లు మోహినీకాంత యత్యంతశృంగారవిలాసకుతూహలంబున సుధారసం బ
మరులకు నొసంగుసమయంబున. 551
సీ. వనజాక్షి యమృతంబు వడ్డింపరాదాయె మనబంతి కిదియేమొయనుచునొకఁడు
వచ్చెద ననిరాక వంచించునే ప్రేమ యధికంబు మనయందె యనుచునొకఁడు
నమృతంబు మాకుఁదెమ్మని బీఁదతనమున నడుగ గౌరవము గాదనుచునొకఁడు
కావున బిలిచినఁ గలకొంత వడ్డింపఁ దలఁగిపోవునె కడ కనుచు నొక్కఁ
తే. డమృతమేబ్రాఁతియాచకోరాక్షిచిత్త, మెడయఁజేయంగరాదనియెంచియొకఁడు
నూరకుండిరిగాని యోయువిద! యమృత, మిందుఁదెమ్మనలేరైరి యెంత వలపొ.
తే. సుదతివడ్డించునపుడుపయ్యెద యొకింత, తొలఁగగుబ్బలుసూచునబ్బలియుఁబల్క
రింపలేఁడయ్యెఁదాఁబల్కరింపఁ దెలిసి, యట్టె పయ్యెదఁగప్పునోయనుభయమున.
మ. తళుకున్ముంగఱముత్తియంపురుచి సింగారంపుఁగెమ్మోవి పైఁ
దులకింపన్మెడగుల్కి చెక్కుపయి బంతుల్సాఁగఁదాటంకదీ
ప్తులు కెంగేల బిగించుచుకబయిఁట నంభోజాక్షి వాలారుచూ
పులఁ దేలించుచుఁ బల్కుఁ బల్కులసుధా పూరంబుతోరంబుగన్. 554
సీ. తడవాయె ననుచుఁ జిత్తమున నుంపఁగనేల నిదెవత్తుఁ దాళుమీ యింతతడవు
తాళఁగూడదొ బావ కేలగూడదొ తాళ కిపు డేమిగద్దులే యిట నదేమి
బావ నవ్వితివి నాపలుకున కేమైనఁ దోఁచెనో నాకు నీతోడు దాఁచ
నేటికిఁ జెప్పుమా నేవింతదాననె దయలేదొ నామీఁద దాళు మంచి
తే. దండు కేమాయె నాకొక యవసరంబు, గలుగదే యప్పుచిక్కుదుగాక యెటకుఁ
బోయెదంచును నవ్వుచుఁబువ్వుఁబోఁణి, బలినిఁ దేలించె బరిహాసభాషణముల.

చ. మఱఁది యటంచు బావయని మామయటంచును నల్లుఁడంచు నం
దఱకును నన్నివావులిడి తచ్చనల న్మటుమాయ సుద్దులన్
ముఱిపెముల న్విలాసముల మోహము లెంచినిశాటచిత్తముల్
గఱఁచె లతాంగి యంగనలుగారె మనోధనపశ్యతోహరల్. 556

తే. ఇటులు దైత్యుల నెల్ల నోరెత్తకుండఁ, జేసి సురలకు వడ్డించు చిగురుఁబోఁడి
దేవరూపంబు గైకొని దివిజపఙ్క్తి, నున్న రాహువునకు సుధ యొసఁగెఁగొంత.

ఉ. ఆయెడ రాహువంచు వనజాహితమిత్రులు సన్న సేయ నా
హాయని మోహినీమహిళ యద్భుతరోషకషాయితాక్షి యై
హా యనునంతలోపల సహస్రసహస్రసహస్రదీధితి
చ్ఛాయ సహస్రధారమగు చక్రము వ్రాలెఁ గరాంబుజంబునన్. 558

చ. శయజలజాతవిస్ఫురితచక్రముచే మధుకైటభారి దు
ర్ణయుఁడగు సైంహికేయునిశిరంబు గలుక్కనద్రుంచునంతలో
రయమునఁ గుత్తుక న్వెడలురక్తముతోడికబంధ మొప్పె విం
తయి పరిషత్సరస్సున వరాంబువుసూత్రపుఁ గంబమోయనన్. 559

చ. క్షితిఁబడు రాహుశీర్షము ద్విజిహ్వలు రోషకషాయితాక్షులున్
సితతరదంష్ట్రలున్ బహువిచిత్రఫణామణు లుల్లసిల్ల వి
స్మితులయి దేవదానవులు చేరికఁ జేరి కనంగ మోహినీ
సతిఁ దిలకించి యిట్లను విషవ్యతిషంగకటూక్తివైఖరిన్. 560

మ. సరిగా మాకుసుధారసంబు విభజించం జేరి యీలాగునన్
సురపక్షం బొనరింపఁగాఁ జనునె యిచ్చో నంతమాత్రం బె యొ
క్కరుఁడ న్నే నిటనాసవచ్చినను జక్రచ్ఛిన్ను గావించి తిం
దరయంగా ఫలమేమి నీ వెఱుఁగలే వైతే సరోజేక్షణా. 561

ఉ. అక్కట నిన్ను దూఱఁదగవా మగువా పగవారలుండఁగా
నిక్కడఁ జంద్రభాస్కరు లిదేమి యకారణవైర మిట్లు నా
దిక్కునఁ జూపినారు కడ తేఱఁగనిత్తునె యింక వారల
న్నిక్కిలి శక్తిమీఱఁ దిగమ్రింగెద నంచుఁ బరిప్లవింపఁగన్. 562

చ. వలదని నాఁటనుండియు దివాకరచంద్రులఁ బర్వయుగ్మవే
ళలఁ గ్రసియింపఁ బంపెఁ గమలప్రభవుండు నకారణంబుగా
వలవనివైరముం గొనినవారికి భోగ్యముగాక యున్నె త
త్ఫల మది యెంతవారికిని బార్థకులాంబుధిపూర్ణచంద్రమా. 563

క. అమృతరస మింతసోఁకఁగ, నమృతంబై రాహుశీర్ష మతిభయదముగా
నమృతకరార్కులఁ బట్టెడి, నమృతరుహప్రభవునాజ్ఞ నఖిలం బెఱుఁగన్. 564

వ. అంత. 565

ఉ. ఈమటుమాయలాఁడి గద యింతయొనర్చె నటంచు దానవ
స్తోమము సుట్టుకొన్న మధుసూదనుఁ డప్పుడు నీలనీరద
శ్యామతనూవిలాసము భుజాయుగళోజ్జ్వలశంఖచక్రముల్
హేమపటంబు గన్పడ వహించి తిరోహితుఁ డయ్యె నయ్యెడన్. 566

ఉ. ఆకపటంబు గాంచి దురహంకృతిమీఱ యుగాంత విస్ఫుర
ల్లోకవిలోచనద్యుతి విలోచనుఁ డౌచు విరోచనాత్మజుం
డాకులవృత్తిలేక ధనురస్త్రము లూని సహస్రచంద్రమ
శ్శ్రీకమనీయయానమునఁ జెన్నువహించె రణాగ్రయాయియై. 567

సీ. రథచక్రనేమిఘర్ఘరరావములు కేతుపటపటాత్కృతులకు దిటము దెలుప
గంధేభఘంటికాఘణఘణల్ ఘనబృంహితధ్వానములకుఁ గైదండ యొసఁగ
జవనాశ్వహేషలు చటులఖురాఘాతచిటపటధ్వనులతోఁ జెలిమిచూప
సమరాట్టహాసనాదములు ఘోరశరాసవిస్ఫారములకుఁ బ్రాపిణ్యమునుపఁ
తే. పటహశంఖాది బహువాద్యరటనములకు
వేత్రిసాహోనినాదముల్ విజయ మొసఁగ
సకలసేనలఁగూడి రాక్షస జిగీషఁ
గదిసెఁ జౌదంతి నెక్కి సంక్రందనుండు. 568

మ. అవనీమండలి గుల్ఫదఘ్నమయి మాద్యద్దంతిదానాంబువుల్
ప్రవహింప న్వడిఁ జిక్కువాఱినఁ దమిస్రాచారి త్రొక్కుళ్లచే
నవియున్ లేవఁగఁజాలఁ డెంతబలియుండైనం జమూసంకులం
బవురా యెన్నఁదరంబె దానవమయం బయ్యెన్ జగంబత్తఱిన్. 569

శా. త్వంగద్వాహఖురాగ్రభిన్నధరణీతత్త్వంబు రేణ్వాకృతిన్
మ్రింగెన్ వారిధులన్ గ్రసించె హిమరుఙ్మిత్రాదులం బుష్కరం
బుం గప్పెన్నడయాడ దయ్యెఁ బవనంబున్ దైత్యరాడ్భీతిఁజూ
డంగా నప్పు డకాండసంప్రళయ మాటం దోఁచె దేవాళికిన్. 570

సీ. కాంచనస్యందనగంధదంతావళ రాజజంఘాల తురంగమముల
శార్దూలమహిష కేసరిగండభేరుండశరభ ప్రముఖ వన్యసత్త్వములను
కంకగృధ్ర శ్యేనకాకోలకౌశిక పారావతబకాదిపతగములను
కమఠపాఠీనకర్కటకనక్రగ్రాహశంకుప్రభృతితోయ జంతువులను
తే. వాహములుగాఁగ నెక్కి దుర్వారశక్తిఁ, బరశుపట్టసతోమరప్రాసముఖ్య
శస్త్రములుపూని బలపాకజంభనముచి, విప్రజిత్త్యాదిదైతేయవీరు లపుడు. 571

తే. చేరి వేర్వేఱ బారులుదీఱి కొల్వ, మ్రొక్కుమ్రొక్కిన వారలముఖముఁ జూచి
కంటిరే వీరవరులార కార్య మెంత, మోసమయ్యెను సురలనమ్ముటను నేఁడు.

చ. కటకట యాఁడుదానివలెఁ గంజదళాక్షుఁడు సేరి పొమ్ములం
దటపటఁజేసి తీసి యమృతంబు సురాళికిఁ బంచిపెట్టె నిం
కెటువలె నమ్మవచ్చు జగదీశ్వరుఁడే యొకయింత మేరలే
కిటువలెఁ జేయఁజూచె మనకెయ్యదితప్పు గణించిచూడఁగన్. 573

ఉ. తానొకమాయఁజేసి యమృతంబు సురాళికిఁబంచిపెట్టఁగా
నేనిఁక మాయఁజేసి త్రిదివేశుల నందఱమాయఁజేసెద
న్నానుప శక్తుఁడే యహహ మాధవుఁ డూరక లంజెతక్కులం
బూనెనె కాక యాయుధముపోటు నెఱుంగునె చూత మంతయున్. 574

క. అని పలికిన దనుజేంద్రునిఁ, గనుఁగొని యిదియెంత స్వామి కనిపించుకొనం
దునిమెదము నీప్రతాపం, బున మేమాసురల నొకనిఁ బోనీకుండన్. 575

క. తలఁద్రుంపక మ్రింగమె వే, ల్పులనందఱ నమృతసేవఁ బొలియకయున్నన్
మెలఁగుదురుగాక కడుపునఁ, గలకాలము జాఠరాగ్నిఁ గమలి బలీంద్రా. 576

క. అటువలెఁ గాకున్నను ఘన, పటలిన్ శృంఖలలువైచి బంధించినయు
త్కటదురితంబు ననుభవిం, చుటకుం జెఱసాలనిడమె సురపతిఁ గినుకన్. 577

క. అని యుత్సహించి పలికిన, విని దనుజేంద్రుండు మిగుల వేడుకమీఱన్
గనుఁగొని యిదిగో సమయం, బనుపమభుజశక్తి కనుచు నందఱఁ బనుపన్.

సీ. కృతవీరపాణకర్ణేజపభ్రమణారుణాభనేత్రముల రోషాగ్ని లొలుకఁ
గలశాబ్ధిజలఘోషఘనతమాశబ్ది కస్మయ ఘట్టితాట్టహాసనులు చెలఁగఁ
బ్రతిభటాళ్యంధకరణహాలహాలదీప్తిముష్టింధయచ్ఛాయమూర్తు లలర
మధ్యేవియద్దీప్యమానార్క నిష్ప్రభీకరణభీకరఖడ్గకాంతు లడర
తే. హైమరథములఁదోలి గంధాంధభద్రకరుల గారాడి దుముదారుగా హయాళి
జేరువకు నూకి భటులకుఁ జేయివీచి, యభ్యమిత్రీయదైవసైన్యంబుఁ గదిసి. 579

క. వాతంధయపాణింధమ, శాతశరము లసురులేయ సౌరబలంబు
ల్భితిలక ప్రతిసువర్ణా, స్వీతోజ్జ్వలపత్త్రితతుల విదళించె వెసన్. 580

మ. రథికుల్ హాస్తికులాశ్వికు ల్భటులు శస్త్రాశస్త్రిఁ బోరం బర
శ్వథకౌక్షేయకకుంతముద్గరగదాచక్రాదినానావిధా
యుధకాంతుల్ దశదిగ్విభాగముల యందొప్పారె నత్యుగ్రమా 581
మధుభృల్లోచన మాసులోచనము సామ్యంబూని చూపట్టఁగన్.

క. ఈకరణి శరాశరిఁ గుం, తాకుంతి గదాగదిని బ్రతాపము మెఱయ
న్భీకరముగఁ బోరఁగ నా, కౌకోదైత్యులకు ద్వంద్వయుద్ధంబయ్యెన్. 582

సీ. బలిశక్రులును హేతిపాశాయుధులు వృషపర్వాశ్వినులు రవిబాణులిందు
సైంహికేయులు విరోచనకృశానులు భద్రకాళినిశుంభులు కాలనాభ

కాలులు మయవిశ్వకర్మలు జంభ వృషాకపు ల్ద్విశిరోనిశాకరజులు
మాతృకోత్కలులు దుర్మర్షణవామదేవులు నముచ్యపరాజితులు పులోమ
తే. నీలులును మేఘదంభావనీతనయులు, కాలకేయమరుత్తులు కమలమిత్ర
తనయనరకాసురులునివాతకవచపవ,మానులొండొరుల్ వోరుసమయమునందు.

మ. కవచస్ఫూర్తి నభేద్య మా కవచ మేకంబైన బాణంబుచే
నవియించెన్ రథరథ్య సారథిపతాకాద్యంబుల న్నాలుగిం
ట విదారించె సురేంద్రు డగ్గలికె భుజాటంకంబునం దైత్య దా
నవచూడామణి యట్టహాసమునఁ గాండం బెల్ల ఘూర్ణిల్లగన్. 584

క. మఱియుం దఱచుగ శరములు, గఱిగఱి గఱువంగ నేయఁగా వెఱవక య
త్తెఱగంటిరాయఁ డప్పుడె, యఱిముఱిఁ బ్రతిశరము లేసి యన్నిటిఁ ద్రుంచెన్.

సీ. కోపంబు మీఱఁగాఁ జాపంబు చేపట్టి రోషంబుచే దాని రూపడంచె
శూలంబుఁ గైకొని ఫాలంబు వోడువరా వాలమ్ము చేదాని ప్రీలఁజేసెఁ
బంతంబుమీఱఁగాఁ గుంతంబు గైకొన్న నంతంబునొందించె నస్త్రనిహతి
గండంబు గుఱిసేసి దండంబు వైచిన ఖండంబుగావించెఁ గాండమునను
తే. మఱియు నేయాయుధము లూనమనుజభోజి
తత్తదాయుధములఁ ద్రుంచెఁ దక్షణంబ
యమృతసేవయు హరికటాక్షమును గలుగఁ
గలదె యీదనుజోడు నాఖండలునకు. 586

శా. ఆగ్నేయాస్త్రము దేవతాధిపతియేయన్ దానిచే భగ్గునన్
భగ్నంబయ్యె మహారథంబు దివిజప్రత్యర్థిరాజేంద్రుఁ డు
న్మగ్నుండౌట నదృశ్యుఁడై చనియె నానాదైత్యసంఘాత ము
ద్విగ్నంబయ్యె సుధాశను ల్మెలఁగి రుద్వేలప్రమోదంబునన్. 587

వ. అంత నిటులు నలోచనగోచరుండై చనినవిరోచననందనుండు కృతగర్వ వి
మోచనుండై తననేర్పు మెఱసి మాయావి యగుచు నెల్లెడలఁ దోఁచి పెల్లుగ
నాక్రమించెడు మాయగావించిన. 588

సీ. కులశైలమున వానగురియంగ గిరిభేది యంగంబు గులగులనయ్యె మిగుల
ళయకాలదహనకీలలు సుట్టుకొని యేర్చి పరితపింపఁదొడంగెఁ బావకుండు
మృత్యుపాశంబులు మెడఁబట్టితివియఁగా మొఱలువెట్టఁదొడంగెఁ ధరణిసుతుఁడు
బేతాళములు నీళ్లవ్రేసి త్రొక్కఁగఁ బాశి యుదు టెల్లఁ బెడఁబాసి యుడ్డుగుడిచెఁ
తే. బెక్కు భూతంబు లితరుల పీఁచమణఁచె, నేమనఁగవచ్చు వానిమాయామహత్త్వ
మహహ యింద్రాదులేల బ్రహ్మాదులైన, మెదలఁగాఁజాల రావేళ నెదుటఁబడిన.
వ. అదియునుంగాక. 590

మ. జలదంతావళఘోరఘీంకృతులతో ఝుంఝానిలాఘాతసం
చలితాభ్రంలిహతుంగతుంగతర చంచద్భంగఘోషంబుతోఁ
గలశాంభోనిధిఁ దమ్ముముంచిన గతిం గ్రన్నింపఁ గంపించుచున్
బలభిన్ముఖ్యులు పాహిపాహియని యబ్రహ్మణ్యము న్వెట్టఁగన్. 591

మ. వినిపించెన్ హరిపాంచజన్య రవ ముద్వేలప్రభాచక్రముం
గనిపించెన్ సురదానవావళికి రక్షస్స్వామిమాయాళిలే
దనిపించెన్ క్షణమాత్రలో సమదదేవారాతిరింఛోళిచేఁ
దినిపించెం దృణరాజి రాజిత భుజాతేజంబుశోభిల్లఁగన్. 592

వ. అప్పుడు. 593

ఉ. చిక్కితి వెందుఁబోయెదవు శ్రీహరియంచు మృగేంద్రవాహముం
జక్కఁగఁ బైకినూకి రభసంబున శూలము పూని జక్కియా
పక్కని ప్రక్కలింపఁ గని పక్కన శూలము నాడి త్రుంచె నా
చక్కని కాలనేమితల చక్రధరుండు సురాళిమెచ్చఁగన్. 594

క. అదిగనిన మాల్యవంతుఁడు, గదగొని హా! పోకుపోకు! గరుడ యటంచున్
విదలించె గరుడుఱెక్కలు, త్రిదశేంద్రుఁడు తనదు పవిని దిట్టఁగ నంతన్. 595

తే. దానవధ్వంసికరచక్రధార మునుపొ, తానుమునుపొ యనంగఁగంధరను వలచి
యద్దురమిటారివై చుమాల్యంబువలన,మాల్యవంతుఁడుసహజనామంబుఁగనియె.

క. సురభీకరణోత్కమనో, హరమూర్తి సుమాలి మాధవౌద్ధత్యమునం
దెరలెం దానవజాతియొఁ పరసుమనోజాతిమైనఁ బ్రమదము గనదే. 597

క. తనపేరు గలుగు హరినె, క్కినవాఁడని మాలిఁ దునిమెఁ గేశవుఁడు సుద
ర్శనమున మఱియు ననేకుల, దనుజులఁ దునుమాడె బాహుదర్ప మెలర్పన్.

శా. ఈరీతిం జగదేకవల్లభుఁడు భూయిష్ఠప్రతాపంబుచేఁ
గ్రూరాదిత్యవిరోధివర్గముల నుగ్గుల్సేయ నంతంతకున్
హేరాళం బగువేడ్కవాసవుఁడు మత్తేభంబుఁ గాలాడ్చిదు
ర్వారంబౌకులిశంబుపూని బలిఁ జేరంబోయి తా నిట్లనున్. 599

క. ఏరా యోరినిశాచర, యేరావృత్రారి నెఱుఁగవే నాతోడం
బోరాడలేవు పోరా, కోరా యభయంబు నిల్పుకోరా తనువున్. 600

తే. వదలి శౌర్యంబు విద్యలవానికరణి, నింద్రజాలంబు పన్నెదవే బలీంద్ర
యిదిగో వజ్రంబు మెచ్చియిచ్చెదను గొనుము, కల్లగా దనవిని దైత్యవల్లభుండు.

తే. ఇంద్రజాలంబు పన్నక యెటులనోడియు, వచ్చు ననిమిషబలము లవ్వారిగాఁగ
దోఁపొసంగక పోదు వే దొడ్డదొరవు, వజ్రమాత్రంబు నాకేల వలవ దనిన. 602

ఉ. ఇంకిట డోఁపె కాక పురమెయ్యది నీకు నిశాచరేంద్ర యీ
యంకము మాని పోయిన యథార్థమె పల్కుతి వౌర యంచు
నిశ్శంకత నిర్జరేశ్వరుఁడు సారెకుఁ బ్రల్లదమాడఁగా మహా
హంకృతిఁ జెంత నున్న బలియుం దనుజాత్ముఁడు హుంకరించుచున్. 603

తే. ఏమిరా యింద్ర యింతలో నింతగర్వ, మేలవచ్చెఁ దలంపరా యిన్నినాళ్లు
నీవు పడినట్టిపాటు నే నెఱుఁగుదు నొక, గరిడిలో వింతసాధన క్రమముగాదు.

తే. ఇతఁడు నీకోడి మాయలు నిచటఁ జేసె, నే స్వకాండ విజృంభణం బెల్లఁదోలఁగ
గౌతమీజార యెవ్వని: గాఁదలంచి, నావు బలిగాఁడె పుణ్యజనప్రభుండు. 605

ఉ. కొమ్ములుఁ దోకలేక జతగూడెను నీకు వృషాఖ్య యింద్ర రే
ద్రిమ్మరిదొమ్మికయ్యమున దిట్టతనం బరి పూరిమేసితోఁ
గ్రమ్మినభీతిచే నటులుగావలె నచ్చెరువేల దీనికై
యిమ్మహి నీదుపేరిపసు లెచ్చటఁ జూచినఁ బూరిమేయఁగన్. 606

క. కౌశికలీలను గానన, కౌశికమూలమునఁ దపముగావించెదవో
కౌశిక యటుగాకున్నం, గౌశికగతిగొంది నడఁగఁ గాంక్షించెదవో. 607

క. బలిభాస్వత్తేజంబున, నళుకుచు నీకఁ గౌశికా మహాబిలపదవి
న్నెలఁగు యథార్థాభిఖ్య, న్వలపదు మాతోడఁ బోర వశమే నీకున్. 608

వ. అనిన మదిరాపానఖదిరాంగారసదృశదృశుం డగుచు సహస్రదృశుం డిట్లనియె.

తే. కౌశికుఁడ నౌదుఁగాక రాక్షస యటైనఁ
గౌశికస్ఫూర్తి బలిపుష్టగణము లెట్లు
మనఁగనేర్చు నెఱుంగ వేమనఁగవచ్చు
ననిన విని నవ్వి బలి యిట్టు లనియె నపుడు. 610

సీ. విబుధలోకేంద్రుండు వీరాధివీరుండు గాఁడె యెన్నండైనఁ గలననోడి
పోవునె యటమొన్న పుణ్యంబునకు స్వర్గమిచ్చి తా నడవుల కేగెఁగాక
మరల నెయ్యంబున మముఁగొల్చెఁ గాఁబోలు ఘనభుజాశక్తికిఁ గడమగలదె
యింకఁ దాఁగాక నన్నెవ్వరు నవ్వెద రాహవంబున నోడియరుగుచుండ

తే. నహహ యందులకేమి కర్మానుసార, మాపదలు సంపదలు జయ మపజయంబు
దానికన లేదు దైవకృత్యంబులకును, విఱ్ఱవీఁగుట వ్రేఁగుట వెఱ్ఱితనము. 611

క. వినవోయి యింద్ర దైవం, బనుకూలంబైనఁ గలుగు నన్నిశుభంబుల్
దనకుఁ బ్రతికూలమైన, చ్చిన నేకార్యంబుఁగాదు సిద్ధము సుమ్మీ. 612

ఉ. మీకొకవేళ సేమమగు మే మొకవేళఁ ద్రిలోకరాజ్యముం
జేకొనియుందు మిర్వురకుఁ జేకుఱవొక్కట వాంఛితార్థముల్
కోకచకోరకంబులకుఁ గూడునె కోరిక లొక్కవేళనే
యాకరణిందలంపు త్రిదశాధిప గర్వపుమాట లేటికిన్. 613

క. అని వైరోచని పలికిన, విని బలి నను వాఁడు దేవవిభుఁడు కృతఘ్నుం
డని రోయక సరిచేసుక, చనునే మాటాడ రాత్రిచరమూర్ధన్యా. 614
క. క్షణమాత్ర మూరకుండుము, క్షణదాచరకోటి గొలువ సమితి సహస్రే
క్షణ కాయము గూలిచి భ, క్షణముగఁ జేసెదను భూతసంఘంబులకున్. 615
ఉ. గాలికిఁ బోవువాహము నగంబులపత్రములం దెమల్పఁగాఁ
జాలును వాలు సైన్యములు సంగరమన్న గృహోపయుక్తముల్
ప్రోలును బట్టబైట నిజపుత్రకుఁడుం బలుగాకి యిట్టిచో
వేలుపుఁ జేని గెల్పు టొకవిక్రమమే బలిదైత్యవల్లభా. 616
వ. అని దురాగ్రహాగ్రహావేశకిటకిటాయితరదనపటలుం డగుచు నిజభుజాగ్ర జాగ్రన్మండలాగ్రంబు జళిపించి యాఖండలున కిట్లనియె. 617
క. అబ్బలి సురమృగములకుం, బెబ్బులి యటఁ బోకు నీకుఁ బింకంబున్నన్
గొబ్బున రా బలినేనొక, దెబ్బం బరిమార్తు ధరణిఁ గొబ్బునఁ గూలన్. 618
తే. నాకురేంద్రుండు నవ్వి యిన్నాళ్లు గావు
నేఁడు బలివైతి వాహవోన్నిద్ర బాహు
శక్తికని పల్కి బలికి త్రాసంబు బలియ
నెలిని ఖండించెదను సురల్ బలియఁ డనఁగ. 619
క. అంతటఁ బోక సురేశ్వరుఁ, డెంతయు రోషమున వజ్రమేసిన మూర్ఛా
క్రాంతుండయ్యెన్ బలి దివి, జాంతకు నరదంబుసూతుఁ డవలికిఁ దివిచెన్. 620
సీ. చెలికానిహానివీక్షించి రోషంబున జంభుండు కదనసంరంభుఁ డగుచు
నిలునిలురా యింద్ర నేఁ డెందుఁ బోయెదు చిక్కితివం చని సింహాయముఁ
గదియంగఁదోలి యుద్ధతి గదాదండంబు బిరబిరఁద్రిప్పి యాసురపరేణ్యు
కరినివైచిన నది సురసురస్రుక్కుచు ధరణిపై మ్రొగ్గినఁ దత్క్షణంబు
తే. నందె మాతలి దెచ్చిన హయసహస్ర
రథముపై నెక్కి జంభు శిరంబు దునిమె
వాసవుఁడు గట్టుదెగఁగొట్టువజ్రమునను
జంభసంభేదమేమి యాశ్చర్య మనఁగ. 621
క. కలహప్రియుచే నెంతయుఁ, దొలుత న్విని కనలి వానితోఁబుట్టువులా
బలపాకనముచు లత్యు, జ్జ్వలశోభాభువనముచులు సంరంభమునన్. 622
క. త్రేతాగ్నులవలె ముప్వురు, దైతేయులు సుట్టుముట్టి దారుణశరసం
ఘాతములఁ గప్పఁగాఁ బురు, హూతుం డొప్పారె మేఘయుతమేరుగతిన్.
క. బలుఁడు రథంబును దురగం, బులఁ బాకుఁడు సూతు నముచి భూరిశరములన్
దళియించి యింద్రు నంగక,ములు సించిరి మించి యతఁడు మూర్ఛమునుంగన్.

వ. అంత నంతటంబోక యనలు నంతకు నసుర నబ్ధిపు ననిలు నలకేశ్వరు నలికలోచ
ను నన్యు లగునమరుల నతులితంబు లగునస్త్రంబుల నదటణంచి యట్టహాసం
బడరించిన. 625

తే. వెఱచి తెఱఁగంటిమూఁకలు మొఱలువెట్ట
నమరపతి సేఁపదేరి యుదగ్రుఁ డగుచుఁ
గులిశధారను ఖండించె బలునిమొదట
వెనుకఁ బాకాసురునిఁ ద్రుంచె విక్రమమున. 626

ఉ. వారలపాటుఁ జూచి యనివారితరోషకషాయతాక్షుఁ డై
వీరవతంసుఁ డౌ నముచి విక్రమశాలి యనేకఘంటికో
దారము మత్తశాత్రవవిదారము నైన త్రిశూలమెత్తి హుం
కారముమీఱ వాసవ పోకాలుము దీన నటంచు వైచినన్. 627

వ. అదియుఁ బ్రళయకాలకాలఫాలలోచనకీలికీలాకరాళం బై నిగిడిన యట్టిశూ
లంబు తూలంబుఁబోల నతివేలం బై యాలంబున నేలంబడ వాలంబున నేసి తద్దనుజ
కంఠనాళంబు ఖండింప నాఖండలుం డఖండదోర్మండలమండనాయితం బగు
శతకోటిజళిపించి వైచిన నదియు శతకోటిమార్తాండమండలపిచండిలరుచి
మండలప్రచండతాఖండనపండితమన్యం బగుచు సంవర్తసమయప్రవర్తిత
పుష్కలావర్తప్రముఖచటులతరమేఘపటలనిర్గళదనర్గళజాగ్రద్దీర్ఘనిర్ఘాతసం
ఘాతలింగంబు లగు విస్ఫులింగంబులు తోరం బై నిగుడం గనుంగొని దనుజ
పుంగవుండు గలంగక చెలంగుచు మదీయవక్షఃస్థలికుందనంపుతాళికి నొక య
పూర్వవజ్రంబు లేదు గదా యని వెదకుచుండు నదియుఁ ద్రిదశపతి యంపెనే
కదా యని యెదయిచ్చిన వజ్రంబును జనుమఱగ్రుచ్చి వెనువిచ్చి చనలేక
యచ్చటనేయున్నం గనుంగొని వియచ్చరప్రకరుం డిది యేమి యెచ్చటనుం
గాన మిట్టి యచ్చెరు వని రిచ్చవడి కనుంగొనుచు వెచ్చనూర్పుచున్న సమ
యంబున నార్ద్రంబును శుష్కంబును గాని దాన నముచిదానవుండు దెగు
నని నిదానంబు దెలిపిన నాకాశవాణి పలుకునాకర్ణించి నలుదిక్కులుం బరికించి
శైత్యప్రభావమానితవజ్రఘనసారం బగుచుఁ గనుపట్టు వారాశిడిండీరంబు
భవిష్యన్నముచిహననజనిష్యమాణయశస్సౌరభకారణకుసుమమంజరిం జేపట్టు
విధంబున హస్తారవిందంబున హంసంబుచందంబునఁ గనుపట్టం గైకొని దివ్య
తేజంబుసంధించి యనార్ద్రశుష్కంబిదియకాఁ గదా యని ప్రయోగించిన
నదియు నింద్రప్రతాపభూపాలుని సమీపంబున వెలుంగు చంద్రజ్యోతి తెఱం
గున రంగై నిజాభిముఖ విజయలక్ష్మికి సుపర్వాధిపతిసమర్పించు కర్పూరనీరా
జనంబు డంబున విరాజమానం బై బలిదైత్యత్రిలోకాధిపత్యవినాశసూచకం
బై పడుసుడువువడువున బెడంగై నముచిప్రాణాపకర్షణసమాపతన్మృత్యు

దేవతాట్టహాసంబు పోలికె వికాసంబై తైలాదభ్రసితాభ్రంబుసుహ్మాత్తగు రీతి శీతలజలప్రవాహంబు కూల సాలనిర్మూలనానుకూలం బగులీల సురవిరోధి శిరోధిఖండించిన దనుజవరూథినీహాహానాదంబు లుప్పతిల్లె దివిజచమూసమూహంబులు గాయకహాహానాదంబులు బ్రహ్మర్షి సముచ్చయసముచ్చైచ్చరుచ్చారిత జయజయేత్యాశీర్వాదంబులు జయదుందుభి రటనంబులు నప్సరోనటనంబులుం జెలంగె నంత. 628

తే. ఏఱులై పాఱు నెత్తురు లెందుఁజూడఁ, గొండలై పడుకండలు గుములుగూడి
దానికై పోరు భూతబేతాళతతులు,గలిగి భీకరమయ్యె సంగరము గరము. 629

తే. మెదడు ముద్దలుగావించి మెసవి మెసవి,కుతికమ్రోయంగ నెత్తురుల్ గ్రోలికడుపు
నిమిరికొంచు నగ స్త్వమంత్రములు నొడివి,శతపదంబులు ద్రొక్కెఁబిశాచగణము.

క. తుండిలదనుజకబంధము, నండొకగజమస్తకంబు నతికి గజాస్యా
యింపలి కరివిఘ్నంబులఁ, గుందింపకు మనుచు మ్రొక్కెకొనుభూతంబుల్.631

తే. వేలుపులు వారు దనుజులు వీర లనుచు
భూతబేతాళములపఙ్క్తి పొంకపఱిచి
తాను మోహినియంచు రక్తంపుసుధను
బొసఁగ వడ్డించెఁ గామినీభూత మొకటి. 632

మ. కరిగండస్రుతదానవారి యమునాకల్లోలముల్ గా నిశా
చరరక్తంబు సరస్వతీకలన మించె న్వాహలాలాంబువుల్
సురకల్లోలినిగాఁ ద్రివేణికరణి న్పొంపొందె జ్ఞాతేయసం
గరభూభాగము గాన దానఁబడమోక్షప్రాప్తి సంధిల్లెడిన్. 633

తే. ద్వంద్వయుద్ధంబు గావించు దనుజవిభులు
దక్కురక్కసు లెదురంగఁ దల్లఁడిలుచుఁ
బఱవ వెన్నాడిపొడిచె సుపర్వగణము
లహహ దాయాదిపోరు దుస్సహము గాదె. 634

వ. ఇవ్విధంబున నుపేంద్రసుదర్శనంబునఁ గాలనేమి మాలి సుమాలి మాల్యవంతులు నంభోధరవాహదంభోళిసంరంభంబుల బల జంభ పాక నముచి ప్రముఖ దానవప్రవరులు దక్కినదిశాధిపతులవలనఁ దగిన సేనాధిపతు లెల్లం ద్రెళ్లిన విలోకించి దేశకాలవిశేషవిజ్ఞానవిచక్షణుండు గావున బలీంద్రుండు దనకదివిజ యసమయంబు గాదుగా యని యెఱింగి సంగరరంగంబు దొలంగి శుక్రుసన్నిధి కేగి తదీయసంజీవినీవిద్యఁ దత్త్వోపదేశవచోవిశేషంబుల బాహ్యాంతఃకరణ దుఃఖంబులఁబాసి, తపంబునకుం జనియెఁ దక్కు రక్కసులు దిక్కులేక పెక్కువగలం జిక్కువడి నానాదిక్కులకుఁ బఱవఁ బరవరూథినీపతుల వెన్నంటి మున్నిం

టి రోషంబుకంటు దెఱగంటి దొరలు సమయింపలేక వెఱచువారును, రక్షిం పుండని యఱచువారును, దెసలకుఁ బఱచువారును, దృణంబులు గఱచువారును, కాననంబులు దూఱువారును, విధిదూఱువారును, మ్రొక్కువారును, నగంబు లెక్కువారును, నొచ్చువారును, సముద్రంబులం జొచ్చువారును నై కలంగిన రక్షోబలంబులవలన దిగంతంబులుం గరుణరసమయంబు లయ్యె నాసమయంబున. 635

ఉ. గీరమణుండు పంప ననికిం గలహప్రియుఁ డేగుదెంచి ల
క్ష్మీరమణప్రసాదమునఁ జెందితి రింతె యభీష్ట మింక బృం
దారకులార భీతు లగుదైత్యుల నొంపఁగ నేల యంచుఁదా
వారలఁబోరుమాన్పెఁ బితృవాక్య మలంఘ్యము గాదె యేతకిన్. 636

వ. అంత సుపర్వ సార్వభౌముం డవార్యశౌర్యంబున దుర్వారతరసర్వశార్వరీచర భుజాఖర్వగర్వశార్వరంబు దొలంగించి నిజప్రతాపతపను వెలింగించి పలాయమాన నానాదానవప్రాణత్రాణపరాయణుం డగుచుఁ దచ్ఛిబిరంబుల ధర్మదారలం బట్టింపక ధర్మధారలం బట్టించె నంత. 637

సీ. వృత్రనిర్జర మిత్ర వృత్రపంకజమిత్ర జంభజంభల విభంజనకుఠార
పాకవారణపాకపాకల రోషనముచిఖండన ఖండనప్రచండ
బలయుక్తబలభుజాబలమహాబలనాగ కృతపులోమవిరామ కీర్తిధామ
జితవిరోచన దైత్య సుతవిలోచనభీమ తతగరుద్ధరథరాధరనిరోధ
తే. యంచుఁ గొంచక కంచుకు లభినుతింప
విజయలక్ష్మీసమేతుఁ డై వెల్లగొరు
నెక్కి సర్వామరులు గొల్వ నింపుసొంపు
లమర నమరావతికి నేఁగె నమరవిభుఁడు. 638

మ. అమితానంద మెలర్ప డెందమున దైత్యారాతి కూర్మ్యాతా
రముగాఢస్పృహమీఱ వ్రాయ మనుజుల్ రాణింతు రాచంద్రతా
రముగా శ్రీయుఁ జిరాయు వొంది రుచిరాధారాదితోదారితా
రముగా వర్ధిలుఁ గీర్తిగల్గి ఘన సామ్రాజ్యంబున న్భూవరా. 639

క. అని శ్రీవైశంపాయన, మునిముఖ్యుఁడు దెల్ప విని ప్రమోదాన్వితుఁ డై
జనమేజయుఁ డవ్వలికథ, యనఘా వినవలతుఁ దెలుపు మని యడుగుటయున్.

మ. నవరత్నోజ్జ్వలధామ దామసుమనోనాళీక నాళీకపా
త్రవరామోదనిదాన దానవిలసత్కల్యాణ కల్యాణన
మ్రవనీచైత్రవిహార హార సువచోమాధుర్య మాధుర్యశా
స్త్రవిభాస్వాత్మవిశేష శేషవిలసత్సత్కీర్తి సత్కీర్తితా. 641

క. భర్తృహరిప్రముఖసుధీ, కర్తృకృతగ్రంథజలధి కజ్ఞానసుబో
ధర్తృమనీషామంథర, ధర్తృ శ్రీపద్మనాభ తనయవరేణ్యా. 642

ముక్తపదగ్రస్త సింహావలోకన భుజంగప్రయాతము:—
సుధామాధురీ ధుర్య సూక్త్యైకధామా
కథామాత్రధూతారి కౌన్తేయధామా
యథామాధవస్వాన్త కాదిప్రథామా
ప్రథామానితామాత్య రాజీసుధామా. 643

గద్య. ఇది శ్రీరామభద్రదయాభిరామభద్రకరకటాక్ష వీక్షాపరిప్రాప్తదీప్తతరాష్ట
భాషాకవిత్వ సామ్రాజ్యధౌరేయసకలవిద్వత్కవిజనవిధేయ ధరణీదేవుల నాగ
నామాత్యసుధాసముద్రసమున్నిద్రపూర్ణిమాచంద్ర రామమంత్రీంద్రప్రణీతం
బైన దశావతారచరిత్రం బను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

౨. కూర్మావతారకథ సమాప్తము.



# ౩. వరాహావతారకథ.



## తృతీయాశ్వాసము.




యుక్తధర్మ కృష్ణా!
నాయకమణి కృష్ణ హృదయ నాయక కృష్ణా!
నాయకజాధిప సూచక
నాయకమణి కృష్ణపద్మనాభునికృష్ణా. * 1

తే. అవధరింపుము జనమేజయక్షితీశ
శేఖరున కిట్టులను వ్యాసశిష్యమౌని
ధారుణీశ వరాహావతార మిఁకను
దెలియఁ జెప్పద వినుమని తెలుపఁ దొడఁగె. 2

శా. శ్రీదారత్వమునం బ్రసిద్ధుఁడవు లక్ష్మీకాంత నేప్రొద్దువ
క్షోదేశంబునఁ బూనఁగా నని కడుం గోపంబుచే నామహా
యాదోరాశిని డాఁగు భూసతిని దంష్ట్రాగ్రంబునం బూనితా
భూదారత్వమునం జెలంగె ధవళాంభోజాక్షుఁ డుర్వీశ్వరా. 3

సీ. శ్రీవిష్ణుపదభక్తిఁ జెలఁగుసప్తర్షి చంద్రములలో ము న్నెన్నఁదగినమేటి
దిత్యదిత్యాదిసాధ్వీశిరోరత్నంబు లను ప్రేమఁ జెట్ట పట్టినగృహస్థు
కమలాప్తభుజగేంద్ర ఖగరాజరోహిణీకన్యకారమణులఁ గన్నతండ్రి
రాముచే దానధారాపూర్వముగ భూతధాత్రిగ్రహించిన శ్రోత్రియుండు
తే. తోయరుహసంభవునకుఁ బౌత్రుఁడు మరిచి
పుత్త్రుఁడు విచిత్ర గుణమణిపాత్రుఁ డఖిల
వేదవేదాంతతత్త్వ వివేకశాలి
మహిమఁ జెలువొందుఁ గశ్యపమౌనిమౌళి. 4

క. దితిమొదలగు పదుమువ్వురు, సతు లతనికిఁ గలరు సహజసౌశీల్యరమా
సతులు జితాన్యజగత్త్రియ, సతులు వయోరూపభాగ్యసంపద్వసతుల్. 5

---

* క. శ్రీరాజితవీరాజిత, ఘోరాజితలప్రవీణకుశలధురీణా
ధారాధరధారాధర, ధారాధరకీర్తికృష్ణ దవసముకృష్ణా!

క. కులరూపగుణసమృద్ధులు, గలసతులలోన దితి సగౌరవలీల
న్వెలసిలు గశ్యపకాంతన, కలితాలయరత్నదీప కళికయు పోలెన్. 6

ఉ. ఆరమణీశిరోమణి వయస్యలతో నొకనాఁడు కేళికా
గారసమీపవర్ధితవికస్వరసూంచితచిత్రచైత్రికో
దారవిలాసభాసురలతావిక సత్ఫలపుష్పభారశృం
గారవనీవిహారకుతుకంబున నేఁగి తదంతరంబునన్. 7

సీ. పల్లవాధర యల్లమొల్లతీవలవల్ల నెల్లతావుల తావులుల్లసిల్లఁ
గొమ్మ యీవిరి గొమ్మ కమ్మదేనియగ్రమ్మ నెమ్మెమీఱఁ గదమ్మ తుమ్మెదలకు
నింతి సంపెఁగచెంత నెంతబాగాయె సేమంతిబంతులు వింతకాంతి నెరసి
కన్నె గేదఁగికన్న పొన్న చాయనె యున్న సన్నజాజులచెన్ను వన్నెమీఱఁ
తే. బంకజాక్షిరో యీపంకఁ బొంకమాయె
గుజ్జుమామిడిపజ్జనె గొజ్జఁగులును
జూడు మనుచేడియలతోడఁ గుండియాడి
వనిత విహరించె శృంగారవనితలమున. 8

మ. నిపతత్కుందమరందపూరమున దన్నృత్యన్మయూరంబు నా
లపదుద్యచ్ఛుకశారికానులము లోలద్వల్లికాజాలము౯
క్షిపదుత్త్రస్తవిహంగమంబు పరితశ్శీర్ణప్రవాళంబు నై
యపు డీక్షింపఁగ నొప్పెఁ గేళిసన మజ్జాక్షీవిహారంబునన్. 9

ఉ. సారెకు గంధసార గిరిసారసమీరకిశోరవారముల్
చేరికఁ జేరి హారి సరసీశరశీకరశీతలత్వము౯
నేరుపుమీఱఁ జూపి హరి నీలమణీరమణీయకుంతలో
దార శరీరసౌరభ మయశ్రమహారి హరించె నత్తఱిన్. 10

క. శీతలతలవనకేళీ, కౌతుకమున నున్న దితినిఁ గని యపుఁ డొకనా
రీతిలకము వచనాంభో, జాతమరందాయమాన సరసమృదూక్తిన్. 11

క. తిలకింపు మిదె విచిత్రము, లలనా మారీచమంజులత నతిమందా
నిలలోలమానసత్త్వము, టలుగుటను బ్రియాళినదలకయె పెనఁగెననన్. 12

క. చెలియా కాంతా మోహము, గలుగని యెడల న్మదాళి కలియునె తమిచేఁ
గలసిన నట నెయ్యపుస, త్ఫలమంచుఁ గటూక్తిఁదోపఁ బలికిన దితితోన్. 13

క. నారీకలితోచ్చైస్తన, హారితవిస్ఫూర్తినించె నది గను మనఁగా
నోరమణీ వ్యర్థోక్తుల, నీరీతిం బలుకనేలనే యని నగుచున్. 14

సీ. తనమనోహరుపేరు వినినంతఁగాంతకు మనసురంజిల్లిన మదనుఁ డదియె
సందుచేసుక మానస సరోవరము నిండఁ గాలువల్ దీర్చినఁ గర్ణవివర

ములవెంటఁ గోకిల కలరవచ్ఛలమున నానను సుమవాసనామిషమునఁ
గనుఁగవ మిథునిత ఖగదర్శనోపాధి నాల్క రసాస్వాదన కపటమునఁ
తే. దనువున హిమానిలాశ్లేష జనితపులక, రాజకైతవమున రాగరసము నిండి
ధైర్యమునుకట్ట నగలింపఁ దాళలేక, వల్లభునిపొందుఁ గోరె నవ్వారిజాక్షి. 15

తే. వసుధ వాసంతవేళ నెవ్వారికైన
సంగజోద్రేక మొనరించు నందుమీఁదఁ
గోమరుప్రాయంబుఁ జెలువును గూర్మి గలుగు
దితికి రతివాంఛ యరుదె తద్విరసనమున. 16

సీ. నునుదీవె సురపొన్నఁ బెనఁగొన్నఁ గనుఁగొని ప్రాణేశుఁ గౌఁగిలింపఁగఁ దలంచుఁ
గోవెల చిగురాకుఁ గొఱికిన నాథుని యధరంబు గంటిసేయంగ నెంచుఁ
గమకించి పల్కునిల్కడ కోకిరొద విన్న గళగళధ్వనులపై గాంక్షనిలుపుఁ
దమినిఁ బైకొను చకోరముల మోహముఁ జూచి పుంభావసంభోగమునకుఁ దివురు
తే. గలికిరాయంచ ముక్కున గమిచి కమల
నాళఖండంబుఁ బతికిచ్చు నలువుఁ గాంచి
మమత మొనపంటఁ దెలనాకు మడుపుఁ గొరికి
చెలువునకునీయఁ గోరు నచ్చిగురుఁబోఁడి. 17

తే. రామ శృంగారకేళికారామ సీమ, సదృశవస్తునిరీక్షణోజ్జ్వలితసురత
కేళిలీలావిలోలయై యాళిజనముఁ, గాంచి యిట్లనిపల్కె నుత్కంఠ మెఱయ.

శా. ఈయారామమునం బికస్వరము లెంతే వింతగాఁ జల్లనై
డాయం దెమ్మెర వేడ్కతో రమణుతోడం గూడి క్రీడించు నా
ప్రాయంపుం జిగురాకుఁబోఁడులు గణింపం బూర్వజన్మంబులం
దేయేనోములునోఁచి నారలో కదే యేణీకిశోరేక్షణా. 19

ఉ. ప్రాయముగా వసంతము నపాయముగా వినఁ గర్ణసూచికా
ప్రాయముగాఁ బికస్వర ముపాయముగా మరుఁ డేఁచ నిట్టిచో
దాయఁగదా వియోగికిని తాళఁగ రా దను బుద్ధియింతలే
దాయెఁగదా మనోహరున కక్కట నేనిఁక నేమి సేయుదున్. 20

క. ఉపవాసంబుల వ్రతములఁ దపములఁ, గృశియించు బదుగుఁ దపసుల కేలా
కృపపుట్టు మన్మథార్తిత, చపలాలోకనలయందు శరదిందుముఖీ. 21

తే. కన్న కొడుకులు మూఁడులోకముల నేల
నక్కటా ముక్కుఁబట్టుక యనుదినంబుఁ
గ్రిందుజడలంట గూర్చుండుఁ గ్రీడ యుడిగి
యేమి సాధింప నెంచియో యెఱుఁగరాదు. 22

తే. అకట తన కేమికొదవ గేహమున సకల
భోగభాగ్యంబులును మంచి పువ్వుఁబోండ్లు
గలిగియుండంగ ననుభవకాల మెఱిఁగి,
పడయనొల్లఁడు సౌఖ్యంబు వెడఁగుఁదపసి. 23

తే. వలపు గలిగిన నిండుజవ్వనిని వనినిఁ, గలయుకంటెను సౌఖ్యంబుగలదె వేఱ
యెఱుఁగఁడే మఱి నాదురదృష్ట మింతె, కాక యాతనిదూరఁగాఁగలదె ఫలము.

ఉ. తానయి చేరఁబిల్చి సురతప్రియుఁ డై యొకనాఁటికైన స
మ్మానము సేయఁగా నెఱుఁగ మానిని యేమని తెల్పుకొందు నే
నేనయి యెన్నఁడైనఁ దమిహెచ్చినచోఁ దనుఁజేరి యెంత ప్రా
ర్థైనఁ బదంబులొత్తి క్షణ మప్పటికేమొ ఘటించుఁ గోరికల్. 25

చ. అని సురతస్పృహాహవిరుదగ్రమనోజశిఖక్షతత్రపా
వినయవివేకియై మధుపవేణివసంతవనీ హాసంతికం
గనుఁగొనులీలఁ గన్గొనుచుఁ గంజదళాక్షులఁ బాసి యొంటిమై
దనపతియున్న యింటికి ముదంబునవచ్చెఁ బదంబుదొట్రిలన్. 26

సీ. సంపూర్ణపూర్ణిమా చంద్రబింబము చెన్నుఁ గన్నప్రసన్నవక్త్రంబువానిఁ
వెలిమెట్టతమ్ముల వెలివెట్టఁగాఁజాలు శ్రవణాంత కాంతనేత్రములవాని
శివశరాసనశృంగశృంగశృగారంబుఁ గబళించునంసభాగములవాని
నతికఠోరనిజస్తనాచలక్షోదక్షమం బైనవిపులవక్షంబువాని

తే. సూర్యతేజంబు గైకొన్న శుచికిఁ జంద్ర
కాంతియునొసంగుభంగి దుగ్ధముల నగ్ని
హోత్ర మొనరించి వేసంజ హోమశాల
నేకతంబున నున్న ప్రాణేశుఁ గాంచి. 27

సీ. చంకనత్ప్రోత్న తాటంకంబు లిరువంకఁ గనుపట్టుచంద్రభాస్కరులు గాఁగ
నలతిపయ్యెదలోని హారము ల్చెలువపవెన్నెలలోనితారకావళులు గాఁగ
వలిపెంపుకుసుమపూవన్నె చేలమెఱుంగు జగజంపుకుంజకెంజాయ గాఁగఁ
గంకణమేఖలాకటకఝళంఝళ లమితవిహంగనాదములుగాఁగఁ

తే. గనుబొమ లనంగుఁ డూనుసింగాణి గాఁగ
విప్పుఁగన్నులు విరిగల్వవిరులు గాఁగ
బటువుగుబ్బలు ముకుళితాబ్జములు గాఁగ
సంజచెలువునఁ బతిఁ జేరి కంజవదన. 28

క. తలవంచి మించుసిగ్గునఁ, బలుకకయూరకయె యున్నఁబతియచ్చెలువం
దిలకించి కలికియేమో, తెలుపఁగ వచ్చితి వదేమి దెలుపు మటన్నన్. 29

శా. కించిల్లక్షితదంతకోరకరుచుల్ క్ష్మో-మ్మోవిపై మించఁగాఁ
జాంచల్యాంచితలోచనాంచలము లజ్జాలీలసూచింపఁగాఁ
జంచచ్చూతదళగ్రసవ్యసనకూజత్కోకిలానంచనా
చుంచువ్యాహృతిమీఱ నిట్లని వచించున్ బోటిగంభీరతన్. 30

తే. అనవరతసౌఖ్యసంధాత యైననేత, కంటె దైవంబుగల్గునె కామినులకుఁ
గాన మీసేవచేసి నాకాంక్షితంబు, ఫలితముగఁ జేయవచ్చితిఁ బ్రాణనాథ. 31

క. మంచిది యటువలెఁ జేసెద, నంచానతి యిచ్చి దేని యది వినిపింతుం
గొంచక గాకుండిన భా, షించంగా వెఱతు నెంత చెప్పిన నధిపా. 32

క. అని వనితామణి దెల్పిన, విని నవ్వుచు మానవిభుఁడు వెలఁదీ యీలా
గునసంశయింప నీకుం, జనునే నీమాట నేను జవదాఁటుదునే. 33

సీ. అలసివచ్చినవేళ నడుగులొయ్యననొత్తి విడెమిచ్చి సురటిచే విసరుటకును
నాఁకటఁబడనీక యన్నపానంబుల చేతఁబ్రొద్దునఁ దృప్తి సేయుటకును
సంతరించినయట్టి సకలపదార్థముల్ దగులీలనింటిలో దాఁచుటకును
నతిథుల బంధుల నత్తమామల చిన్ని శిశువులఁ దెలిసి పోషించుటకును

తే. నవరతమగ్నిహోత్రంబు లరయుటకును, దేవపూజోపకరణము ల్దీర్చుటకును
బత్ని పాల్పడ గృహకృత్య భరము లేక, గృహియథేష్టంబుగా సుఖయించు నబల.

సీ. సంసారసంభవా క్షయదుఃఖవారాశిఁ దరియింపఁగాఁజేయుతరణి తరుణి
హృదయంగమస్ఫూర్తి నెపుడునామోదంబు గలిగించుతావి చెంగలువ చెలువ
కామితఫలములు ఘటియించి వేలుపుఱేడు పెంచినచెట్టు రెమ్మకొమ్మ
కందొగ ల్నిత్యవికాస మొందింపఁగా మించిపున్నమచందమామ రామ

తే. సదనమణిమయదీపికాజ్వాల బాల, వల్లభమనోమదావళవారి నారి
శుభపరంపరవర్షించు సోన చాన, పృథులధర్మార్థమణిగణపేటి బోటి. 35

సీ. అతిథుల నిష్టమృష్టాన్నతృప్తులఁజేసి యనుదినంబును బుణ్యమందికొనుట
శాస్త్రోక్తపద్ధతి సవనముల్ సవరించి శ్రీహరిసుప్రీతుఁజేసికొనుట
సన్న్యాశ్రమములయం ధ్యతిదుర్దమంబైన మన్మథోద్రేకంబుమాన్పికొనుట
నిజపితౄణముదీర్చి నిఖిలలోకంబులు పాలించుపుత్త్రులఁ బడయుటయును

తే. గమలలోచన నీవల్ల గాదె యట్టి, నీకుఁబ్రత్యుపకారంబు నెఱపగలనె
యేనుబదివేలజన్మంబు లెత్తినైన, మనసువచ్చినగతిఁ బనిగొనుము నన్ను. 36

తే. దుర్గముల నాశ్రయించినదొర యరాతి, వర్గముల గెల్చువైఖరి వనిత నీదు
చారువక్షోజ దుర్గముల్ చేరికాదె, కంతుశత్రుజయించెద గడియలోన. 37

క. మహిఁజతురాశ్రమములలో, గృహి యధికుండట్టిగృహము నీవే "గృహిణీ
గృహముచ్యతే" యనందగు, మహితరచోరూఢి వినవె మదగజగమనా. 38

తే. అనిన వల్లభ యీలీల నాడ నెంత, దాన నావంటివా రెందఱైనఁ గలుగ
నగ్రపత్నియటంచు నన్నాదరించి, మీరు నవ్విన వలదన నేరఁగాని. 39

తే. ఇంకఁ దాఁపఁగ నేల ప్రాణేశ వినుము, సిగ్గువడి యుండనీయఁడు చిత్తభవుఁడు
కన్నె గేదఁగి రేకుచేకత్తి గొద్దిఁ, గ్రుమ్ముచున్నాఁడు దయలేదు కొంతయైన. 40

తే. అటులు గావునఁ గామార్త నగుచు నిన్ను, శరణు వేడెద రక్షింపు సౌఖ్యమొసగి
యార్తజనరక్షణాదక్షు లఖిలభూత, సదయులును గారె మీవంటి సాధు లరయ.

మ. అనినన్ లేనగ వంకురింప మునికాంతా యింత సంతాపమే
లను మాకుం బ్రియమైన కార్య మిది వాలాయంబుగా నేనుజ
య్యన నీవాంఛిత మెల్లఁ దీర్చెదను సంధ్యావేళఁ బోనిమ్ము నా
వనజాతాక్షి స్మరేభమార్గణకర వ్యాధూతచిత్తాబ్జ వై. 42

సీ. మలయాచలాయాతమందానిలము గాదు రణరంగసన్నద్ధరథము గాని
ప్రాగస్తగిరులచంద్రదివాకరులు గారు కమనీయకనక చక్రములు గాని
సాయంసముజ్జృంభసాంధ్యరాగము కాదు కొమరుఁ జెంగావి టెక్కెములుగాని
సాధారణవిహంగసంరావములు గావు మణికింకిణులఘుణంఘుణలు గాని
తే. తారకలు గావు దేవతాద్వంద్వముక్త, నవనమస్కారకుసుమబాణములు గాని
సంజగా దిది విరహిపై స్మరుఁడు దండు, వెడలు గోధూళిశుభలగ్న వేళ యధిప.

సీ. తిలకింప ద్వాదశార్కులకన్న వేంద్రమై జలజారి పండువెన్నెలలు గాయఁ
బల్లవితాశేషపాదపచ్ఛాయలు విలయాగ్నికీలలవిధము చూప
మలయాచలాయాతమందమారుతములు ఝుంఝూమరుల్లీల సంచరింప
ఫలపుష్పనిష్యంది బహుమరందరసంబు వసుమతి నేకార్ణవంబు సేయఁ
తే. గాలకంఠకఠోరహుంకారములను, దండిదండిని కుసుమకోదండి యడర
విరహిణీలోకసంహారవేళ గాని, యిదివసంతంబుగాదు ప్రాణేశ కంటె. 44

తే. ప్రాణనాయక యిదె చూడు పతులఁ గూడి, పాయకుఁడటంచు సతులకుఁ బల్కు తేజి
పాదుషాహు శికా చేసి పంపు కాగి, తంపుఘరమానువోలె సుధాకరుండు. 45

చ. అళుకొకయింత లేక కుసుమాస్త్రుఁడు క్రొన్నెలసానదీరు చెం
గలువలకోరులంగులుకు గుబ్బచనుంగవ గాఁడ నేయఁగాఁ
గళగొనఁ గాఱు రక్తమిదె గన్గొను కుంకుమ గాదు నాథపూ
విలుతుని దుండగంబు దగవే సహియింపఁగ మీకు నిత్తఱిన్. 46

శా. ఓయాత్మేశ్వర యీవసంతమున శాంతోష్ణాంశుసంతాపముం
భూయోదృష్టతమం బధిజ్యధనురంభోజాస్త్ర ముద్యత్పటీ
రాయాతానిలశైత్యము న్విశదసర్వాంశంబు రమ్యంబు నా
సాయరవేళ రమింపవచ్చితి మదిన్సంతోష ముప్పొంగఁగన్. 47

తే. ప్రాణనాయక యొకముహూర్తంబు తాళు
మంచు నానతి యిచ్చితి రంత యేల
యొక్కక్షణ మొక్కదినమయి యున్న దిపుడు
తాళఁగాఁ జాల మత్కాంక్షితంబు దీర్పు. 48

వ. అదియునుం గాక. 49

సీ. తల్లి దైవం బని తగుప్రదక్షిణనమస్కృతుల నింద్రాదులు సేవ సేయ
నత్తగా రని బత్తినడుగు లొత్తుచు శచీవనజాక్షి కోడలితనము నెఱప
నవ్వయంచును బ్రేమ నివ్వటిల్లగఁ జేరి మురిపెంపుమనుమఁడు ముద్దుగురియ
దివ్యవాద్యములతో దినదినంబు నికేతనంబున శుభశోభనములు నడువఁ
తే. జుట్టఱికమున నిచ్చిపుచ్చుకొనుబంధు, జాల మెంతయు గౌరవసరణిఁ జూడ
విభవముల విఱ్ఱవీఁగెడు విబుధమాత, నదితి గని యెట్లు దరియింతు [1]ననవరతము.

సీ. అదితి గన్నకొమాళ్లయం దొక్కరుఁడు జగత్త్రయరక్షణాధురంధరతఁ బూన
మఱియొక్కఁ డాకాశమణియై జగత్త్రయీమూర్తియై భువనసత్కీర్తి మించె
వినతాత్మసంభవుం డనుపమేయబలాప్తి వనజాక్షువిశ్వంభరుని భరించెఁ
గద్రూతనూజుండు గహన నానాసముద్రాహార్యములతోడ నవని మోచె
తే. మఱియు నీ చెట్టవట్టిన మగువలందు, నెవ్వరికి లేరు సత్పుత్త్రు లెంచి చూడ
నందఱు నభీష్టసంపద నలరినారు, కాంత నాభాగ్య మిట్లయ్యెఁ గాని నేఁడు. 51

క. రమణుని మన్ననవలనన్, రమణీమణి రమణనొందు రవిమన్ననచేఁ
గమలిని శశిమన్ననచేఁ, గుముదినివలె నని నతఁడు గోమలి కనియెన్. 52

సీ. విరియఁబోసినజటావిసరంబు కెంజాయ సాంధ్యరాగంబుపై జౌకళింపఁ
బ్రేతవనాయాతవాతనీతవిభూతి నికరంబు నెమ్మేన నిండికొనఁగ
గృతతప్తసౌవర్ణగిరివిగ్రహంబైన ఘనవిగ్రహము భయంకరముగాఁగ
వికటాస్థిహారము ల్విషభరమాలికల్ గజచర్మవసనంబు గండుమిగులఁ
తే. గేలశూలంబు పూని దిగ్భిత్తులగల
నట్టహాసంబు చేయుచు నఖిలభూత
విసరములు గొల్వ మదమత్తవృషభ మెక్కి
రుద్రుఁ డీవేళ మెలఁగెడు రౌద్రముగను. 53

తే. అనలచంద్రార్కనేత్రత్రయంబు దెఱచి
చూచుచున్నాఁడు రోషవిస్ఫురణ దనర
మఱఁది యనుచుట్టఱికమున మాఱుమసల
వలదు దుర్మార్గులైన నెవ్వారి నైన. 54

---

1 ( బ్రాణనాథ.

క. శిక్షించు నసత్పురుషుల, రక్షించుం గడలిఁబోడమిప్ర బలినవిషముల్
భక్షించి జగముఁ గృపచే, వీక్షింపఁడె నీవెఱుంగవె జలజాక్షీ. 55

మ. అనిన న్మందమరుత్కిశోరకులలోలాకాశగంగాతరం
గనికాయంబులు దమ్మిపైఁబొరలు పొంకం బెంతయున్ వింతగా
నునులేనవ్వు ముఖారవిందమునఁ జిందుల్ద్రొక్క నక్కల్కి యి
ట్లనియెన్ యావన గర్వనిర్వహణ లీలాలోలవాచాలతన్. 56

తే. కుడువఁ గూడును కట్టుకోఁ గోకలేక, తోలుగట్టుక తిరుగు బిచ్చాలశివునిఁ
జాల వర్ణింపఁగానేల చాలుఁజాలు, నతనికొకకూఁతు నిచ్చి లోనడలుఁ దండ్రి.

తే. చూడఁదెద్దును మంచముకోడుగాని, యేమిసంపద పార్వతీ కీశ్వరునకు
మీరు దోఁబుట్టు వంచును మెచ్చుకొనిన, సిచ్చుకంబునసైన నే మెచ్చుకొనను.

క. జనకుఁడు పదుముప్వురుమముఁ, గని మీప్రియుఁడైన వానిఁగైకొనుఁ డన్న
న్నినుఁగోరమె యన్నింటన్, ఘనుఁడవు గావునను గావునను రతి ననినన్. 59

శా. "శాంతంపాప" మటంచు మానిపతి హస్తచ్ఛాదితశ్రోత్రుఁడై
యింతైన న్మదిఁగొంకులేక తగునే యీలాగు నిందింపఁగాఁ
గాంతా విశ్వజనీనవైభవ మహా గంభీరశైలేంద్రజా
కాంతద్వేష మనాత్మనీనముగదా కన్గొన్న నెవ్వారికిన్. 60

సీ. అఖిలలోకంబుల నధికుండ నేనంచుఁ గర్వించు విధిమస్తకంబుఁద్రుంచె
నధ్వరంబులఁ దన్ను నవమాన మొనరింప మీఁదక్షున కొసంగె మేషశిరము
పుష్పాస్త్రముల రక్తిఁ బుట్టింప గిట్టిన భస్మంబుగావించెఁ బంచశరుని
వ్యాసులు మును "నదైవం కేశవాత్పరం" బనిన బాహుస్తంభ మలవరించె

తే. శౌరి నయనాంబుజమునఁబూజన మొనర్ప, మెచ్చి చక్రంబొసంగె నమ్మేటిమగని
నెట్లు నిందించెదవె యెడలెఱుఁగలేక, దక్షపుత్త్రివి గనుక నోతరలనయన. 61

సీ. దండధరోద్దండతనడంచు విషభోక్త యహిఫణామణులూను నస్థిహారి
మసనంపుటిలు సర్వ మంగళాధీశ్వరుఁ డైశ్వర్యశాలి యానాదిభిక్షుఁ
డతివకై యర్థదేహ మొసంగు కామారి యాశ్రితసులభుఁ డైనట్టియుగ్రుఁ
డధ్వరఫలదాత యైనక్రతుధ్వంసి విపులారథికుఁడైన వృషభహయుఁడు

తే. హరుఁడు శంకరుఁడును భవుఁ డభవు డిందు
శితవిభానిధి నీలలోహితుఁడు నష్ట
తనుఁడు పంచాననుఁడు త్రిలోచనుఁడు నిర్గు
ణాత్ముఁ డద్దేవుఁ దెలియ శక్యంబె మనకు. 62

తే. అనిన నట్టిదేవుఁ డంగజునకులొంగి, సందెలందు దివములందు విడక
వేయువత్సరములు వెలఁదితో రమియించి, యర్థదేహ మొసఁగఁడా యటన్న.

శా. ఈలాగందురె బాల వాంఛితఫలం బీఁజాలువిశ్వేశ్వరుం
డేలాగుండిన నుండెఁగాక మఱిమాకృత్యాపసు ల్చిత్తభూ
లీలామగ్నత నుండఁగాఁదగునె తాల్మిందూలి శాస్త్రోక్తముల్
బాలింపం దగదే గృహస్థులకు సద్భావంబుతో నెప్పుడున్. 64

తే. దశమి హరివాసరమున ద్వాదశిని బర్వ, తిథులసంక్రమణంబులతిథుల నన్య
తిథులయందైనఁబగలుసంధ్యలనుఁ బ్రేమ, నంటఁగారాదు సతులగృహస్థులకును.

క. ఋతువై స్నానము సేసిన, సతి నంతర్గృహమునందు సంతానేచ్ఛన్
రతికృతిగాక జుగుప్సా, మతిఁ గలయుట గృహికి యుత్తమం బనిపల్కన్. 66

శా. ఓలేండా యిటువంటిఛాందసము లెన్నైనా గలా విందుకున్
వేళల్ గావని చెట్టవట్టితివి చెన్లేనవ్వుతో వల్లభుం
బాలారత్నము కేళికాకుతుక సామర్థ్య క్రియాదూరిత
వ్రీళాసూచకసానురాగవికసద్వీక్షారుచు ల్మీఱఁగన్. 67

తే. వెఱవ దననేల కామిని విభుసిచెట్ట, వట్టినప్పుడె స్వేదకంపంబు లొదవె
గద్గదికదోఁచె మోమునఁగానయ్యె, దీనభావంబు నది యొక్క దిట్టతనమె. 68

తే. నయము దెల్పెడుగతి కంకణములు మొఱయఁ
గానుసలియింపఁ బులకలు గ్రమ్మికొన్న
గుబ్బ యరగానరాఁ బైట కొంగు జాఱ
మగువ యీగతి తెగువతో దిగువ నతఁడు. 69

చ. వల దిది సంజవేళ చెలువా యొకయించుక తాళుమంచు నేఁ
బలుమఱుఁ జెప్పిన న్మనసుఁ బట్టఁగఁజాలక నోంటిపాటున
న్వలనుగఁగంటి కింపయిన వాని గనుంగొని ప్రేమ హెచ్చఁగా
బలిమిని జేరుజారవలెఁ బైకొనఁగోరెదు నీకు మేరయే. 70

మత్తకోకిల. ఈమనోరథ మెల్లఁదీర్చెద నీముహూర్తము దాళవే
కామినీ యిదివేళ గామినిఁ గైకొనంగఁ దలంపనం
చామునీంద్రుఁడు వేఁడినన్వినదయ్యెఁ దోయ్యలియెయ్యెడం
గామమష్టగుణం బటంచనఁగా వినంబడునే కదా. 71

క. ధీరాగ్రేసరుఁ డంతట, నీరేరుహనేత్ర చేతి నిర్బంధము దు
ర్వారముగా రుద్రనమ, స్కారము గావించి కేళికాకృతమతి యై. 72

తే. ఎంతచెప్పిన వినవె కా నింక నీవె, యనుభవించెదు రమ్మంచు హసితవదన
యైన మానిని కై దండఁబూనిమాని, కేళిసదనంబుఁ జేరిన బాల యపుడు. 73

తే. జాళువాకోళ్ళపట్టెమంచంబు మీఁదఁ, దళుకుకుంకుమపఱుపుపై వలువఁబఱచి
జాతిపట్టుతలాడలు చక్కఁబెట్టి, కాంతుఁడు శయింపఁ దాను జెంగట వసించె.

క. మదనుండంపినకిల్లా, కిదిగో మనసిమ్మటన్న యేపున నవలా
మొదట నొక మధుపొసంగుచుఁ, బిదప న్బాగాలొసంగెఁ బ్రియునకుఁ బ్రేమన్.

క. వడిగ బిగిగుబ్బజిగి గన్పడుజిలుగున్నరిగ చెలువ పయ్యంట పయిం
దడిదుడుచుచుఁ దెలియాకుల్, మడుపులొసఁగి చాలుఁ యనుమదిఁ దమిఁ బొదలన్.

తే. చెలువ పయ్యెదఁ జుబుకంబుచేత నదిమి
అవికె సడలింపఁ దిలకించి రమణుఁ డెంత
సిగ్గరివె యంచుఁ బైఁటఁదీసినను వేగఁ
గరయుగంబునఁ జనుదోయిఁ గప్పుకొనుచు. 77

మ. అలరుల్ శయ్యకుఁ జేరి యొత్తిగిలి సయ్యాటంబునన్. గబ్బిగు
బ్బలు ఱొమ్మానఁగఁ బ్రాణనాథుకటిపైఁ బాదంబు కంఠంబునన్
వలకేల్గ్రుచ్చి కవుంగిలించి జిగిజాళ్వాచెల్వొప్పున్ ముద్దు చె
క్కిలి ముద్దాడుచు మిక్కుటంబుతమిసొక్క న్కాంత కన్మోడ్చునన్. 78

చ. పడఁతుక ప్రేమమీఱ మొనపంటఁ జుఱుక్కన మోవినొక్కినం
జిడిముడిపాటుతోడ నును జెక్కిలిమీటుచుఁ జాలుఁజాలు నే
విడవె గయాళి యంచుఁ బతివేఁడినఁ జిక్కితి వింక నేలనే
విడువనటంచుఁ గ్రోలెఁ బెదవి న్మదవిహ్వలితాంతరంగ యై. 79

తే. కలికి యీరీతిఁ బరిపరిగతులఁ బెనఁగఁ
గఠినవక్షోజయుగళసంఘట్టనమున
హృదయమున నిద్రవోయెడు మదనుఁ డపుడు
మేలుకొనె నాఁగఁ బతి దమిమీఱ ననియె. 80

మ. అలుకల్ దీరిచి ముద్దువెట్టుకొని సయ్యాటంబునం జంటపై
జిలుగుంబయ్యెదకొంగుజాఱ్చి తమి నాశ్లేషించుచుం బైకొనన్
బలిమి న్వల్లభుఁ డప్పుడొల్లమి నటింపం జూచు భ్రూభంగరీ
తులనొందుం గులకాంత లింతతమి యెందుం గానఁ జంద్రానన. 81

తే. అకుటిలభ్రూశరాసన వనతితీక్ష్ణ, చంచలాలోకవిశిఖ వకంచుకాఢ్య
వపురుపాలాపలాలస వయ్య నతను, సమరసన్నద్ధవగుట యాశ్చర్య మబల. 82

క. అనిసర్మోక్తులఁ దనసతి, చనవుం జెల్లింపఁ గోరె సమరతికలనన్
మునిపతి గులకాంతలు గో, రినకోరికెఁ జిన్నవుత్తురే గృహులనుచున్. 83

తే. నెలఁత రమ్మని తనదుసంపెటికిఁ దిగిచి, చన్నుగవయంటి వాతెఱచవుల దేరి
విడువఁబోయిన నునుపోఁకముడికి గాను, కోమలి బెనంగె సిగ్గుచేఁ గొంతదడవు.

తే. నిగనిగల్ గుల్కునధర మాణిక్య మొసఁగె
గుబ్బచనుదోయి బంగారుకుండ లొసఁగె

బెనఁగెఁ దనపోఁకముడికిఁగాఁ బ్రియునితోడ
నీరజాక్షులు ముగ్ధలుగారె యెందు. 85

తే. నీవి తనయంతటనె జాఱ నీరజాక్షి
కౌర యభిమానరక్షకు లైనవారు
దొలఁగుసమయంబునను దామె తొలఁగిపోకఁ
బరులచేఁ ద్రోపుబడుదురె పలుచనగుచు. 86

వ. అంత. 87

మ. తను లేలెమ్మనికొమ్మ యెత్తులిడ మోదంబొప్ప నాథుండు పై
కొని యానందపయోధి నీఁదుచును వక్షోజాతకుంభంబు లూఁ
దినసత్త్వంబున నంతలోఁ బడలి యెంతే సోలి యోష్ఠామృతం
బునితాంతంబుగఁ గ్రోలి మున్గెను శ్రమాంభోవాహినుల్ముంచఁగన్. 88

తే. అనఘరక్షిత మనఖభేదనమకంఠ, కూజిత మభాషణ మబంధకుశల మయ్యొ
మౌనిసురతంబు మానినీమణిని బార, వశ్యమొనరించి యానందవార్ధిఁ దేల్చె. 89

తే. అంత సురతాంతవైరాగ్య మనుసరింప, నింతమాత్రసుఖంబున కేలయిట్టి
వేళఁ బ్రేల్మాలితి వటంచు విభునిమోము, చక్కఁజూడంగ సిగ్గయి శయ్యడిగ్గి.

చ. ప్రిదిలినకట్టుకొంగు సవరించి మిటారపుఁజన్నుదోయి ప
య్యెదఁ గదియించి ముత్తియపుటంచుల కమ్మలు చక్కనొత్తి క్రొ
వ్విదఘటియించి ముంగురులు విన్నువొప్పఁగఁ దీర్చి నెమ్మదిం
గుదిగొనుసిగ్గుతోఁ గుసుమకోమలి మజ్జనశాల కేఁగినన్. 91

తే. మౌని స్నానంబుచేసి నవీనధౌత, చేలములు గట్టి నిర్మలక్షితి వసించి
బ్రహ్మగాయత్రి జపియించి భావశుద్ధి, హోమశాలాంగణంబున నున్నయపుడు.

మనోహారిణీవృత్తము. ఉదరము బరువై యున్నను మదిన
మ్మదమును భయమును మల్లడిగొనఁగాఁ
బెదవులు దడుపుచు బిత్తరి రమణుం
గదియఁగఁ జనియెను గద్గదిక దగన్. 93

తే. కామమోహితనగుచు దుష్కాలమునను, నిన్నుఁగూడి రమింపఁగ నిలిచె గర్భ
మింకఁదా నేమిచేయునో యెఱుఁగఁబడదు, క్రొవ్వి నవ్వితి లోకైకగురునిహరుని.

అంబురుహవృత్తము. అనిన న్విని యమ్ముని యి ట్లనియెన్ 95

సీ. పతిచిత్త మెఱుఁగక రతిఁగోరుటపతివ్రతలకు ధర్మముగామిఁ దలఁపవైతి
విశి సందెవేళగా యీవేళ రమియింప ఘోరపాతక మని కొంకవైతి
ఫాలాక్షు వృషవాహు శూలపాణి మహోగ్రుఁగనుఁగంటఁ జూపినవెఱవవైతి
ఇటు కశ్యపుని బలాత్కృతిఁబట్టె నని లోకు లాడుకొందు రటంచు నలుకవైతి

తే. మించినే నెంత దెలుప లజ్జింపవైతి, దక్షునంగనవయ్యు సత్పదము దక్కి
చిత్తభవునకుఁ జిక్కి దుష్క్రియకుఁ జొక్కి, యింత చేసితి వేమందు నిందువదన.

ఉ. కామము ధైర్యవారణనికామము దుర్దమ దుష్క్రియాలతా
రామము సత్క్రియాధృతివిరామము క్రోధముఖాదిపంచక
క్షేమము నాస్తికత్వమతిసీమము దుర్వ్యసనాబ్ధిరాట్సుధా
ధామము సర్వదుష్టగుణధామము దానిఁ బరిగ్రహింతురే. 97

సీ. వదినె యంచు నొకింత వాత్సల్యముంచక పౌలోమి ముందల బట్టువారు
న్యాయంబు గాదిది యనిబృహస్పతి పల్క వికవికనగి చెంప వ్రేయువారుఁ
బినతండ్రియని తండ్రి గనమి జయంతుండు వచ్చినఁ జెఱసాలవైచువారు
హరిని నుతించు నటంచు నానా వేదశాస్త్రము ఖిలముగా సల్పువారు

తే. నీదుగర్భంబునందు జన్మింతు రబల, సంజ రమియించినట్టి దోషంబువలన
రుద్రభృత్యులు భద్రానుభద్రు లనెడు, వారు గడపటఁ దెగుదురు శౌరిచేత. 98

క. అన ముఖవర్ణవ్యత్యయ, మున మోదము ఖేద మగుట మునిపతి దెలియం
గనుఁగొని భయసంభ్రమములు, బెనఁగొనఁ దనమనములోన బిత్తరియనియెన్.

తే. వినుమనోహర యొకరసావేశమునను, దనువెఱుంగమి నపుడట్టి తలఁపుపుట్టె
నిపుడు విస్మయమయ్యెడు నన్నిగొనిన, దైవకృత్యంబు గాకేమి తప్పు గలదె.

మ. ఘనశౌర్యంబున వైరివీరవరులన్ ఖండించి లోకంబు లె
ల్లను బాలింపఁగఁ జాలునిద్దఱుసుతుల్ మద్గర్భ సంభూతులై
నను జాలు న్గలుషాత్ములైన వెఱవం బర్వాత శ్రీభర్తచే
తను మేను ల్ద్యజియింపఁ గల్గుట గరష్ఠంబౌఁ గదా మోక్షమున్. 101

తే. ఐన సాధునింద కాలయు లగుటను, వగవవలయు వారివారికైన
విష్ణుదేవుభక్తి విబుధానురక్తియుఁ, గలుగఁ గరుణ సేయు కాంత యనిన. 102

క. వనితా పశ్చాత్తాపం, బునఁగుందుట విష్ణుదేవుఁ బొగడుట నన్నుం
గని మని కొల్చుటవలన, న్నిను మెచ్చితి శుభముగల్గు నీకిటమీఁదన్. 103

తే. రమణి నీయగ్రసుతుఁడు హిరణ్యకశిపుఁ, డతనికి జనించుఁ బ్రహ్లాదుఁడనుకృతార్థుఁ
డతఁడు యుత్తమచారిత్ర మఖిలవిష్ణు, భక్తజనముఖ్యులను మేలుబంతి యగును.

క. శ్రీదయితపాదసేవా, హ్లాదుఁడు ప్రహ్లాదుఁ డలరు నతిపావనుఁడై
మోదమున నుండుఁ బొమ్మని, యాదితి నూరార్చియుండె నతఁడు యథేచ్ఛన్.

వ. అంత. 106

తే. దితికపోలతలంబులు తెల్లవాఱె, నదితి నెమ్మోము వెలవెలనయ్యెఁ దోఁడఁ
బంచికొనె నేమొ రుచియు సాపత్యమునను, గాక సైరింపఁగలదె యేకడ సపత్ని.

క. గర్భమున వృద్ధిఁబొందెడు, నర్భకులశరీరకాంతి యధికంబై యా

విఖ్యాతమయ్యె ననఁగా, గర్భిణికుచచూచుకములఁ గాళిమ దోఁచెన్. 108

క. చిట్టుములుపుట్టెఁదాఁ గను, పట్టికి నిటమీఁద ధర్మపథమున నిటులం
బుట్టెడు నరుచియటంచుం, గట్టిగ జనములకుఁ దెల్పుకై వడి దితికిన్. 109

క. ఇటువంటిభూమి నీవిం,కిట గైకొను మంచుఁబట్టి కెఱఁగించుగతిం
గుటిలాలకమృద్భక్షణ, ఘటితాదరయయ్యె మిగుల గర్భస్ఫురణన్. 110

సీ. శ్రేష్ఠనిష్ఠురతపోనిష్ఠచేఁ బర మేష్ఠి మెప్పించి వరముఁగా మించ నెంచు
జగతీతలం బెల్లఁ జాఁపచుట్టుగఁ జుట్టి యొకమూలదాఁపగా నుత్సహించు
శతమఖప్రముఖనిర్జరులఁ బాఱఁగఁద్రోలి యెల్లలోకములుఁ దానేలఁ దలఁచు
బ్రాహ్మణయూథంబు బాధించి రోధించి యధ్వరభాగంబు లందఁగోరు

తే. సమరకాంతలఁ జెఱలవేయంగఁ దివురు, దేవదేవునితోఁ విరోధింపఁ జూచు
గర్భమైనది మొదలుగాఁ గశ్యపాగ్ర, పత్ని భావంబులోనఁ బ్రాభవము మెఱసి.

తే. బాలకులఁ గాంచినను బాకభంజనాది, శత్రువులునొత్తురో యను సంశయమున
గర్భము ధరించె నూఱేండ్లుగాఢనియతి, జలజలోచన పుత్త్రవాత్సల్యమునను.

సీ. వదనంబుసఱచినవానిఁ గానఁగలేక ధరణీజనం బెల్లఁ దల్లడిల్ల
ఘణిఘణిల్లుమటంచు గగనమార్గంబున వైమానికుల విమానములు దాఁక
రథముపైనున్న మార్తాండుఁ జూడఁగలేమి గరుడాగ్రజుఁడు బెట్టుగాఁగఁబిల్వ
నున్నవాఁడవె యంచు నొద్ది వారలు బింబమంటి శైత్యస్పర్శనబ్బుఁ దెలియ

తే. నంబునిధి జాతహాలాహలంబులీల, నదితి దుర్భరగర్భంబునందుఁ బొడమి
భూర్భువస్స్వర్ముఖాశేషభువనములను, గాఢమైనిండె ఘోరాంధకార మొకటి.

తే. అప్పు డింద్రాదికసుధాంధు లంధులగుచుఁ, బేరు పేరులనొండొర్లఁ బిలిచికొనుచుఁ
జెట్టఁబాయక కైలాసశిఖరి గనుచు, సత్యలోకంబుఁ జేరి విస్మయముమీఱ. 114

మ. అతిచంద్రార్కతనుద్యుతిచ్ఛటల లోకాంతర్బహీరూఢగా
ఢతమోహారకుఁడై సమస్తముని చూడారత్నసంసేవ్యప
చ్ఛతపత్త్రుండయి భారతీరమణితో సౌవర్ణపీఠంబునం
దతుల ప్రౌఢిఁ జెలంగుఁ బ్రహ్మఁ గని సాష్టాంగంబు సేవించుచున్. 115

తే. భారతీనాథ సర్వసంపత్సనాథ, ప్రకటతర విశ్వనిర్మాణపారదృశ్వ
తెలియఁబడుఁ గాదె కరతలామలకసరణిఁ, ద్రిభువనంబులవృత్తంబు దేవమీకు.

తే. అంధకార మొకటి హాలాహలాగ్రమై, మించి జగములాక్రమించి యున్న
దిందులకు నిమిత్త మెఱిఁగింపు భయమెల్లఁ, దీఱ ననిన భారతీవిభుండు. 117

సీ. ఆదికాలమున "సోహం" బంచు నామానసంబునఁ బుట్టిన జ్ఞానవంతు
లీజగంబాదిగా నెల్లజగంబులఁ దృణలీలఁ జూచిన వ్రతులు విరక్తు

లుగ్రుఁడు మొదలుఁ బ్రత్యుత్థాన మొనరించి పూజింపఁగాఁ దగుపూజ్యతములు
నారదాదులకు డెందంబునఁ దోఁపని యర్థముల్ దెల్పు తత్త్వార్థవిదులు
తే. సంతతాత్మానుభవసౌఖ్య జాయమాన
తృప్తితృప్తాంతరంగులై తిరుగుచుండ్రు
సకలజగముల సనకాది శాంతినిధులు
వారలొకనాఁడు హరిఁజూచువాంఛ యొదవ. 118

సీ. ద్వారకాంచనరంభ లూరుకాండములుగాఁ గలితసోపానము ల్వళులుగాఁగఁ
గమలాకరస్ఫూర్తి గంభీరనాభిగా నారామరేఖ నూఁగారుగాఁగఁ
బదివన్నె యలకోటపసిఁడి యొడ్డాణముగా సౌధశృంగము లురోజములుగాఁగ
భవనాగ్రకేతన పాళి పయ్యెదగాఁగఁ దోఁగలతోరణము భ్రూయుగము గాఁగ
తే. హంసకారావయుతపరిఖాంబుజంబు,లడుగులును ధూపధూమంబు లలకములుగ
శ్రీవిసాక్షాత్కరించిన శ్రీవధూటిఁ, బోలిచెలువొందు వైకుంఠపురమునకును. 119

క. చని యేలోకంబునఁగాం, చనివైభవ మిందుఁజూడ సమకూరెనటం
చని ప్రాపించికరమ మె, చ్చనివా రన్యోన్య సూక్తి చాతురి మెఱయన్. 120

ఉ. శ్రీవిభుఁ డాద్యుఁ డీశ్వరవిరించిముఖామరసేవ్యుఁడంచు స
ద్భావమునన్ భజింపఁగల భక్తులు ముక్తశరీరులై ముదం
బావహిలంగ నీడజలమాడకలింగశరీరముక్తులే
ధీవిరజానదీమహిమ మెన్న సమర్థులమే సనందనా. 121

ఉ. మందసమీరచంచల సమంజసకంజపరాగపుంజ మెం
దెందురజోగుణంబువెలయింపఁ దదీయమరందలాలసేం
దిందిరము ల్దమోగుణముఁ దెల్పెడు నింతియకాని చూడఁగా
నిందురజస్తమోగుణము లెన్నఁడు లేవుగదా తపోధనా. 122

మ. అరిషడ్వర్గము లేమి దుఃఖములపాం దాపంతయున్ లేక శ్రీ
విరజానామతరంగిణీజలములో విధ్యుక్తి సుస్నాతులై
స్థిరభక్తిన్ సమయం బెఱింగి హరిసంసేవించుచుం దుష్టిచే
కుఱహర్షించు సలోక ముక్తులఁ గనుంగొం టే జటీంద్రాగ్రణీ. 123

సీ. మణికిరీటంబులు మకరకుండలములు నాకర్ణధవళనేత్రాంబుజములుఁ
బావనవై జయంతీవనమాలికాకౌస్తుభకలితవక్షఃస్థలములు
శంఖచక్రగదాసిశార్ఙ్గపంచాయుధదుర్వారబాహాచతుష్టయములు
ఘనకటీతటబద్ధకనకాంబరంబులు నాభిశోభితపాండునయనములును
తే. విబుధపతినీలరుచ్ఛిదివ్యవిగ్రహములు, దర్పకానంతసదృశసౌందర్యములును
గలిగి చెలువొందుచున్నారు కంటెపీరి, విష్ణుసారూప్యవంతులవిమలమతుల.

సీ. పదియాఱువన్నెల బంగారమే కాని యితరలోహంబు లిందెందు లేవు
నవనీయముగమించు నవరత్నములె కాని యితరోపలంబు లిందెందు లేవు
కామితార్థము లిచ్చు కల్పకంబులె కాని యితరభూరుహము లిందెందు లేవు
శ్రుతివచో రచన మించు విహంగములె కాని యితరఖగంబు లిందెందు లేవు
తే. సరసిరుహనాభసారూప్యధరులె కాని
యితరు లైనట్టివార లిందెందు లేరు
తరమె యెంచ గుణాకుంఠతరము ముక్తి
గురుకుచాకంఠసరము వైకుంఠపురము. 125

వ. అని యనీదృశ లోకసాధారణ లోకదురవలోక మణిగణలోక విలోకాయిత శతకోటికోటిలోచన సలోకవాసనివాసవర్గంబు లగు రాజమార్గంబు లవలోకించుచు నతిక్రమించి నిజసమాగమసమసమయ సమయ ద్భయభక్తి వినయ ప్రధానప్రధానజన నిటలతటముకుళితకర వందనమాలికా సందీపితారవింద కోరక వందనమాలికాకలిత నిజాగ్రం బగు హరిహజారంబుఁ బ్రవేశించి వాద వేదండంబులం బోలి బహుకక్ష్యాభిరామంబై గగనకాసారంబులం బోలి సద్వారారూఢంబై కపోతపాలికా లాలితం బయ్యు నసత్యంబై త్రైకాలిక సత్యంబును నై ఘనతర వజ్రవలభిత్రాణం బయ్యు ననాకం బై నిత్యనాకంబును నై మేచకరుచిరుచిరనీలకంఠోత్కంఠాపాదన ప్రవణ హరిన్మణి రమణీయకాంతి కాళికావిలాసం బయ్యు నఖర్జూరనగారామంబై పరిపక్వఖర్జూరనగారామంబును నై ముక్తావాసంబు గావున ముక్తావాసంబును నీలాభిరామంబు గావున నీలాభిరామంబును శ్రీనివాసంబు గావున శ్రీనివాసంబును నచలోజ్జ్వలంబు గావున నచలోజ్జ్వలంబును ననంతవిలాసభాసురంబు గావున ననంతవిలాస భాసురంబును నష్టాపదమయంబు గావున నష్టాపదమయంబును విష్వక్సేనావృతంబు గావున విష్వక్సేనావృతంబును నగుచుఁ జెల్వొందు త్రిభువనాధిపుభువనాదిరాజంబుఁ బ్రవేశించి యంతిపురంబు వెడలివచ్చు పరిచారకాజనంబుల నంబుజలోచనసమయంబు వేఁడు సేవాపరాయణుల కలకలంబులచే నుపలక్షితంబు లగు త్రిచతుఃకక్ష్యాంతరంబులు గడచి హరినామ సంకీర్తన నర్తనసామగాన ప్రవర్తనంబులం బరమ భాగవతులం బోలు కీరమయూరశారికల నుపలాలించు మించుబోఁడులం గనకాంబరునకుఁ జేకానుక లొసంగఁ గనకమంజరులుగట్టు కన కాంగుల మఱియు లక్ష్మీనారాయణవివిధ కైంకర్యపరాయణు లగు శుకవాణు లం గనుంగొనుచు నీరంధ్రసౌగంధిక తృణగ్రాహివిషహరమణీ ప్రభానీరంధ్రంబు లగు పంచషట్పరిదేశంబులుం దాఁటి యవ్వల. 126

మ. కలితస్తంభము కామినీ హసనరంగచ్చంద్రికాస్వీన్నశీ
తలరుక్కాంతసమేత కుడ్యము సరత్నశ్రేణి వైవర్ణ్యము

త్పలమారంద ముద్రశ్రుపు న్మదకపోలద్వంద్వమై సర్వమై
చెలువయ్యె న్గృహలక్ష్మి సాత్త్వికముచే శ్రీవిష్ణుసంగంబునన్. 127

వ. అని యిందిరారవింద నయనానందకరం బగు నందకకరునిమందిర సౌందర్యంబు
నకు డెందంబున నానందించుచు శతానందనందను లగు సనకసనందనాదికర్మం
దిబ్బృందారకులు ప్రజ్ఞావిజ్ఞానంబులం దాము తద్దయుఁ బెద్దలయ్యు నద్దేవదేవు
నకు ముద్దుల మనుమలుగావునఁ జౌవంచ ప్రాయంబుల వారలై కనుపట్టి దిగం
బరు లయ్యు నంబరమణిరమణీయ ప్రభాడంబర విడంబ నామందేహంబు లగు
దేహంబులు ప్రకాశింప దండకమండలువులు గైకొనకుండియుం దమయతి
లోక ప్రభావంబు భావంబున భావించి తత్రత్యదేవతాగణంబులు గావించు
సాష్టాంగ సేవలకు నుచ్చరించు నారాయణోచ్చారణం బోంకారసూచకం
బుగా నభ్యంతరగృహంబున కరుగు సమయంబున. 128

క. బాలురుగాన వివేకము, సాలదొ బిసబిసన నెందుఁ జనియెద రంచుం
గోలలువై చిరిశతధృతి, బాలులముందఱను ద్వారపాలకు లలుకన్. 129

వ. ఇవ్విధంబున. 130

క. పోవలదని రోధించిన, దౌవారికజనముఁ గాంచి తాపసవరు లే
లా వారించెద రకట, శ్రీవల్లభుపాదసేవ సేయఁగఁ దగమే. 131

తే. అనిన వేళ గాదు వనజాతనేత్రుండు, తరుణిఁగూడి యంతిపురమునందు
నున్నవాఁ డటన్న నొక్కింత నవ్వుచు, సనకమౌని వెనుక సనకయనియె. 132

మ. ఇనబింబంబున యోగిమానసములం దేపొద్దు శ్రీకాంతతో
వనజాక్షుండు వసించు మీరెఱుఁగరే వారింపరా రెన్నఁడుం
గనుదమ్ముల్వికసింపఁ గన్గొనుదు మర్కస్థాయి నాత్మస్థితున్
ఘనవిజ్ఞానవిలోక నంబునఁ గడుం గన్గొందు మిచ్ఛారతిన్. 133

క. కనుటయుఁగనఁదగు నదియును, గనుఁగొనువాఁ డాత్మ యయ్యెఁగనుఁగొనవలదం
చును వారించెద రెవ్వరిఁ, గనుఁగొనఁగా రానిదేది కనుఁ గొనుఁ డాత్మన్. 134

తే. ఏల యజ్ఞానమొదవె నీవేళ మీకు, నిర్వికారంబు పూర్ణంబు నిర్మలంబు
నైనపరమాత్మ కొక వికారానుభవము, గలుగఁజేసితి రేమనఁగలము మిమ్ము. 135

తే. ఘట[1]మఠోపాధి భిన్నమౌ గగనమట్లు, ప్రకృతిసంబంధమున భిన్నభంగిఁదోఁచు
నాత్మ యింతియెకాని వేదాంతయుక్తి, నరసిచూచిన భేద మావంత లేదు. 136

తే. ప్రకృతి భిన్నగుణంబులఁ బ్రభువుఁబోలి
మమ్ము దౌవారికులఁ జేసి మనుపుచోటఁ
దదధికారంబు దప్పింపఁ దరముగా ద
టన్న నటువలె నన్నఁగరా దదియు వినుఁడు. 137

1 ఘటోపాధి.

క. వనచరుల నడ్డగింపం, జనునే ద్వారికులకు జగదీశునకుం
దనయాత్మజులము మాకన్నను జనవరు లేరి యిచట నానాగతులన్. 138

క. ఎటువంటి బంధు లయినం, గుటిలాత్ములఁ జేరనీయఁ గూడునె యన్నన్
గుటిలుల మాటయుఁ గాకుం, డుటయును మీభావ మెఱుఁగు నూతేమిటికిన్.

తే. హరికి నెటువలెదోఁచునో యనిన మీకు, వెన్నునకు భేద మెయ్యది యెన్ని చూడఁ
గరచతుష్టయ వనమాలికా గదాసి, హైమవర్ణాంబరంబుల నలరినారు. 140

తే. ఐన సమయంబు గాదని యంటిరేని, కన్నులరవిందులును నాభిఁ గమలభవుఁడు
శయ్యయై శేషుఁడుండంగ శౌరిఁ గొల్వ, మాకు సమయంబు గాదె ధీమహితులార.

క. కమలాక్షునిఁ గొల్వఁగ నిది, సమయము గాదన్న నేది సమయం బిఁక నో
విమలాత్ములార యెప్పుడుఁ, గమలాసతి యొమ్ముఁ దించఁగాఁ గన మెందున్.

వ. ఇవ్విధం బంతయు నెఱింగియు నంజనంబునం దెలిసి వసుధాంతరంబున నుండు నిదానంబు గైకొనం జను జనులకు మహాభూతంబు లడ్డుపడు తెఱంగున బ్రహ్మాదత్తవిజ్ఞానంబున సన్నిధియగు హరిసన్నిధి కరుగు మమ్ముబోంటి నిష్కాములయందు నిష్కారణక్రోధంబు చేసి నిరోధించితిరి గావున నిక్షేపకాముకుండు మంత్రతంత్రంబుల మహాభూతంబుల నిరసించు చందంబున మత్తపోబలంబున మత్తచిత్తవృత్తుల రగు మిమ్ముబోంటి సజ్జనకంటకుల గెంటించి పరమపదంబు నిష్కంటకంబు గావించెద మని జయవిజయభూపాతననిమిత్త జాతంబు లగురీతిం బ్రభూతోచ్ఛ్వాసవాతంబులు నిగుడం దదీయనిర్గమన సమయాపవర్గపురద్వార కవాటార్గళవిఘట్టన రటనానుకరణ నిపుణరదనపటల కిటకిట ధ్వానంబులు వెలయ నితఃపరత దాహత జంతు సంతానరక్తసిక్త ధారావలయ సూచక రోషారుణాయమాననయనంబులు వెలుంగ నశనిసదృశగుణపదపరమపదజాయమానకోపరూప దోష హేతుధూమకేతుభవద్భ్రుకుటి ఘటిల్లఁ గోపాటోపంబు సైరింపనేరక వైరించి హరిద్వారపాలకుల నవని జనియించి సురద్విషద్వారపాలకులు గమ్మని శపియించిన. 143

క. గడగడ వడఁకుచుఁ బెదవులు, దడుపుచు జయవిజయు లపుడు దాసోహ మటం
చడుగుందమ్ములపైఁ బడి, జడదారుల వేఁడుకొనెడు సమయమునందున్. 144

సీ. తొడలపై నిడియొత్త నడుగు పంటవలంతి జఘనంబుఁ దాఁకించు సరసలీల
మడుపుఁ దెమ్మని మోము మలచిచూడసిలీల కుచముపైఁ జేసాఁచు కోడిగంబు
పనధికన్యక కిన్క వక్షంబు డిగ్గ నొత్తగిలిచే వలగొను దంటతనము
వీసరకు మని తాళవృంతపుత్రి నదల్చి యందఱ నవ్వించు నందగింపు

తే. నొకరొక రెఱుంగనటులు గాఢోపగూహ, చుంబనంబుల సొక్కించి సొగసువగలు
వెలయ దక్షిణనాయకవిలసనమున, శేషశయ్యాశయానుఁడై శ్రీవిభుండు. 145

క. వాకిటికలకలమంతయు, నాకర్ణించుచు సరోరుహాక్షులు దమలో
నేకడకని యూహింపఁగఁ, గాకోదర రాజశయ్య గ్రక్కున డిగియెన్. 146

మ. ఉదురార్ణ్మండల పాండురాగముఖరత్నోదార రత్నంబులో
పడగల్మించఁగ మించు నాగజగతీపాలుండు ప్రా గెంపుచె
క్కడపుందంతపుపావలై తనర శృంగారంబుగా మెట్టి యా
కడయంతస్థునఁ బక్షిరా జొసఁగు కే ల్కైదండఁగాఁ బూనుచున్. 147

సీ. కంకణంబులు మ్రోయఁగా నీళయును ధరారమణియు వింజామరములు వైవ
విమలాలతాతన్వి వెలయాకుమడుపుతో నడుగువాయక వెంటనంటి నడువ
మొలక లేనవ్వుతోఁ గలిమి నెచ్చెలివీఁచు సురటి తెమ్మెరల ముంగురులు గదలఁ
తలతలయంచు సూత్రవతీసతీపతి బలసి ముందఱ బరాధరి యొసర్ప

తే. జాఱుసిగ కేలనొత్తుచు జాళువా మె, ఱుఁగుదుప్పటి వలెవాటు కొంగుజాఱఁ
జీరకెంగేలఁబూన నెచ్చెలి యొకర్తె, యంబుజోదరుఁ డంతిపురంబు వెడల. 148

వ. అప్పుడు. 149

సీ. తనమొగ్గిక్కఁ గినుకఁ గైకొనక లచ్చివిదిర్చుపదనఖం బంటినఫాలతలము
వనరాశినందన నలచి ముద్దాడఁగాఁ దాంబూలమంటిన తళుకుఁగన్ను
లరవిందమందిర [1]యామోదముగఁ బీల్చు మొదటిరక్తిమమించు ముద్దుమోవి
కెమ్మోవి నొక్కజంకించి యిందిర మీటఁ గొనగోరుసోఁకిన మినుకుఁ జెక్కు

తే. చిటులు గస్తూరితిలకంబుః జిఱుచెమటయుఁ
గలిగిసురతాంత కాంత శృంగారలక్ష్మిఁ
జాటు శ్రీహరిముఖ జలజమున వ్రాలి
మరల వళిపంక్తులట్లు లమ్మానిదృష్టు. 150

తే. శ్రీవధూమణి చెక్కుతోఁ జెక్కుఁ జేర్చి, పవ్వళింపంగ మకరికాపత్త్రరేఖ
లంటిన ముకుందు చెక్కిటియందుఁదోఁచు,మకరకుండలమని యెన్ను మౌనిజనము.

క. పంకజసదనానవనఖ, రాంకిత వైకుంఠకంఠ మను లేపభవ
తుల్కంకుమ పంకవళాంకుర, సంకీర్ణముగాఁగ నెంచు జటికులమెలమిన్. 152

తే. యోగివంద్యుని సందిటి యొత్తులకును, రణిత కేయూరమణులు గారణముగాఁగఁ
దలఁపుదురు గానిరమ కుపధానమైన,కొప్పువిరు లొత్తు టెఱుఁగరు కొంతయైన.

తే. నీరజాలయగుబ్బ కస్తూరికుంకు, మములసోఁకులు వక్షఃస్థలమునఁ జూచి
నిస్తులము లగు శ్రీవత్సకౌస్తుభముల,విభలు ప్రసవించెనని కంద్రు విమలమతులు.

తే. కలిమిముద్దియ నిద్దపుఁ గమ్మమేని, పసపునిగ్గులటంచు నేర్పరుపలేక
కటితటంబునఁ గట్టినకనకపటికి, వింతరుచి వచ్చెనని కంద్రు శాంతినిధులు. 155

1 యామూలముగఁ

తే. అడుగు లొత్తెడు నప్పు డప్పుడమిపడఁతి, గబ్బిగుబ్బలయుంగ రాగంబు సోఁకె
ననరు కెంజిగి చరణంబు లంబుజములు,గానఁ బుష్పాడియందురు మౌనివరులు.

తే. భువనమోహనశృంగార పూర్ణమగుచు
వెలయు హరిదివ్యమంగళవిగ్రహమున
మగ్నమై చిత్త మానంద మయతఁ గాంచె
విషయవిక్షేపములు లేమి ఋషివరులకు. 157

తే. మాను లానంద బాష్పాయమాననయను
లగుట నంతట నానతు లగుచు లేచి
బ్రహ్మ దెల్పినరీతి మీభవ్యమూర్తిఁ
గాంచి ధన్యులమైతిమి కమలనయన. 158

శా. భేదాతీతుఁడవై జగన్మయుఁడవై పెంపొందు నీలీల సం
వాదం జేమొనరింప నేర్తుమె "యతోవాచోనివర్తంత" యి
త్యాదిప్రాక్తన సూక్తులొప్ప మఱి యేమన్న న్మనఃపీఠి నీ
పాదద్వంద్వము నిల్పికొల్తు మనుకంపం బొప్ప సర్వేశ్వరా. 159

సీ. పద్మరాగప్రభా భాసమానకిరీట మృగమదతిలకజృంభితలలాట
విపులనేత్రాభోగ విజితపంకజవర్ణ మకరకుండలదీప్యమానకర్ణ
మందహాసవిలాస మాధుర్యముఖపద్మ యిందిరాసందీప్తహృదయసద్మ
ఘనకటీతటబద్ధ కాంచనకౌశేయ మణిమయ దివ్యభూషణనికాయ
తే. శంఖచక్రాదిసాధన సహితహస్త, యబ్జనిగ్రహరుచివిగ్రహప్రశస్త
మీకు మ్రొక్కెద శుభనామ మిహిరధామ, శిష్టజనపద్మమిత్ర లక్ష్మీకళత్ర. 160

ఉ. శ్రీపతి తావకీన పదసేవనశీలుర ద్వారపాలురం
గోపముమీఱఁ దిట్టితిమి కుంభినిఁ బుట్టఁగ నింకనిట్టి బ
ల్పాపముచేత రౌరవము పాలయి కూలక యుండ మమ్ము నీ
ప్రాపుననుంచి ప్రోవుము ప్రసన్న జనావన లోకపావనా. 161

మత్తేభగర్భిత సీసము. వినతపద్మాసన విశ్వరక్షణచణా నాళీకపత్రేక్షణా రమేశ
సతతతేజోనిధి సజ్జనవ్రజనుతా తారుణ్యలక్ష్మీయుతా యుపేంద్ర
విజితమత్తాసుర విక్రమోజ్జ్వలభుజా శృంగారలీలానిధీ ముకుంద
మహితకార్యోద్యమ మమ్ముఁ బ్రోవుము దయ హేమాంబరాడంబరా మహాత్మ
తే. యనివిచిత్రవచస్ఫూర్తివినుతిసేయ, మౌనిమత్తేభవృత్తంబు మదిని మెచ్చి
యంబుజోదరుఁ డిట్లని యానతిచ్చెఁ, బ్రావృడంభోద గంభీర భాషణముల. 162

క. ముక్తులును విరక్తులు భవ, ముక్తులు హృదయాంబుజాతముఖ్యగుణాళీ
ముక్తులు శాంతతనుత్రా, ముక్తులు మీకేటికలుషములు మునులారా. 163

సీ. ఆఁకొన్న సురలెల్ల ననుదినం బెవ్వారి క్రతుశాలపంచలఁ గాచియుందు
భజియింతు రెవ్వారి భవనము ల్ప్రీతిమాసమును బితృదేవత ల్భక్తిగోరి
సకలభూతంబులు సంతృప్తిఁ జెందు నెవ్వరు సేయఁదగుబలి హరణసిద్ధి
సర్వావతారంబు లశ్రాంతమునుఁబూజ లందు నెవ్వారిచేత నర్హరీతి
తే. వేదశాస్త్రంబులేరిచే వెలయుచుండు, నెంచు నెవ్వారి దినచర్య స్మృతిచయంబు
లర్కజయ మిచ్చు నెవ్వారియర్ఘ్యతోయ, మట్టివిప్రుల కెనయెవ్వ రఖిలమునను.
శా. ఏమీనాక్షికటాక్షలేశమునకై యీశానవాణీశసు
త్రామాదు ల్భయభక్తియుక్తి నెపుడుం బ్రార్థింతు రాలక్ష్మి యెం
తో మోదంబునఁ జేరి పాయదు విరక్తు న్నన్నునే భూసుర
శ్రీమాహాత్మ్య మెఱింగి కొల్వఁగఁ గదా సిద్ధించు నానార్థముల్. 165
మ. అజమూర్ధాపహవృత్రశాత్రవులు బ్రహ్మద్వేషము ల్సేయఁగా
నజహత్సంపద గాంచలేక కడుభిక్షావృత్తికి న్మర్త్యులై
త్యజనోద్వృత్తికిఁ జిక్కి పొక్కెదరు సత్యం బెందు విప్రావళీ
భజనాచారము లేనివారలకు సౌభాగ్యంబు చేకూరునే. 166
క. అపరాధం బొనరించిన, కపటాత్ములఁ బుణ్యజనులు గండని కినుకన్
శపియించితి రన్నను మీ, కృప యెంతని పొగడుదున్ యతీశ్వరులారా. 167
చ. సరసులు ఘర్మకాలమునఁ జండకరోష్ణము పైని బూని యం
తరముల శీతలంబు లగు దారి భవాదృశ సాధుచిత్తముల్
పరిఘటితాపరాధములపట్టునఁ బైపయిఁ గిన్కఁబూనియుం
బొరయవు లోఁ గఠోరతఁ బ్రపూర్ణశమాఢ్యము లౌట నెప్పుడున్. 168
క. వీరలు మీ కొనరించిన, నేరంబున ధరణిఁబుట్టి నిశిచరు లగుచుం
బోరున నాచేఁ దెగి నం, జేరెద రని యతులఁ బంచి శ్రీపతి యంతన్. 169
సీ. జయవిజయులఁ జూచి దయనిటులను మున్ను యోగనిద్రాసక్తి నున్న వేళ
నాచెంతకరుదేర నళినవాసిని నడ్డగించిన మీపైని గినుకవూనె
నదియుఁదప్పించితి నవనీసురులశాప మలవియె తప్పింప నవనిలోన
నిఁక మీరు దైత్యులై యేడుజన్మంబుల దాస్యంబుచే నీపదంబుఁ జేరఁ
తే. గోరెదరొ జన్మములమూఁట వైరులగుచుఁ
జేరెదరొ యన్న వారలు వైరముననె
చేరెద మటంచు మొక్కి కన్నీరుదొరుఁగ
విన్ననైవిన్నవించిన వెన్నుఁ డపుడు. 170
వ. అటుగావింపుఁడని యంగీకరించి యంగనాసంగతుండై భుజంగపుంగవ శయ
నుం డంతఃపురంబున కరుగ సరగ జయవిజయులు సముద్రమేఖలకుం జని రుద్ర
భృత్యు లగు భద్రానుభద్రుల రౌద్రాంశంబులం గూడి దితిగర్భంబున నర్భకులై

యున్నవారిది వారియావిర్భావ సమయంబుగావున నఖిల లోకంబు లంధతమ సమయంబులై యున్నయవి యింకఁజతుర్భుజ నిర్భరకరుణాతిశయంబున మీరు నిర్భయులుగాఁగలరని హిరణ్యగర్భుం డానతిచ్చిన హవిర్భుజ్ముఖులు యథేచ్ఛం జని రంత. 171

తే. శ్రీవిభుని నామ మెక్కడఁ జెవులఁబడునో
యంచు మూసినచందాన హస్తపిహిత
కర్ణమై యుద్భవించె నాకశ్యపాగ్ర
దారగర్భంబునందు దైత్యద్వయంబు. 172

పంచచామరము. ధరంబు లొడ్డగిల్లెఁ దెళ్లెఁ దారలాతె నగ్ని భా
స్కరుండు మాసెమోగెసెజంబుకంబు లంబురాసు ల
బ్బురంబుగాఁగఁ గ్రాఁగిపొంగె భూమిఁగ్రుంగె వాహినీ
ఝరంబులింకెఁ గొంకెఁ బంకజాత సూతి యత్తఱిన్. 173

తే. కశ్యపుఁడు వచ్చి కృతజాత కర్ముఁ డగుచు
నగ్రజుఁడు హిరణ్యకశిపుఁ డని సహోద
రుఁడు హిరణ్యాక్షుఁ డనుచును రూఢిగాఁగ
నామకరణంబు గావించె నందనులకు. 174

వ. అంతఁ బ్రతి దినప్రవర్ధమాను లగు దితిసూనులయం దగ్రజుం డగుహిరణ్యాక్షుం డక్షీణబలంబున మించె నట్టియెడ. 175

సీ. అంగుష్ఠముననిల్చె నాకిరీటముదాఁకి పటపట బ్రహ్మాండభాండ మగలు
నట్టచేతులుసాఁచెనా పూర్వపశ్చిమ చంద్రదినేంద్రులఁజంకనిఱుకు
వడిగాఁగ నాలుగై దడుగులు నడిచెనా ధారుణీతలము పాతాళ మంటు
నొకయింత ఘనముగా నొడ లుబ్బఁజేసెనా హరిదంతరము లెల్ల నవియఁబారుఁ
తే. గడిఁది నిట్టూర్పుగాడ్పుల గ్రహగణంబు
లొక్క మూలకుఁ జిక్కు నత్యుగ్రదృష్టి
నిగుడుచోటెల్ల నిగుడులై యెగయు నట్టి
హాస మొనరింప విధిగుండె లవియుచుండు
వానియౌద్ధత్య మెన్న నెవ్వారితరము. 176

మ. అసురాధీశుఁడు రోహణాచల సముద్యద్రత్నముల్ సెక్కిర
మ్యసువర్ణాద్రిని మౌళిఁజేయఁ బరభూషావాప్తికై ఫాలదృ
గ్వసుధా భృన్ముఖ లోహముల్ ఫుటములై వ్రంద న్మణిప్రాప్తి క
న్నిసముద్రంబులు వెల్లజల్లఁ దలఁచున్ మోహాను రూపంబుగన్. 177

వ. అంత నొక్కనాఁడు. 178

క. జలరాసు లేడు నొండై, కలసిన జలకేళి సల్పఁగా నిమ్మగు నీ

యిలయేమి నడుమ ననుచుం, దలఁచి హిరణ్యాక్షుఁ డధిక దర్పస్ఫురణన్. 179

మ. నగరంబుల్ నగముల్ నదంబులు నరణ్యంబుల్ నదుల్ లోనుగా
జగతిం జిత్రపటంబు డంబు గనిపింపం జుట్టి చక్షుశ్శ్రవో
జగతిం డాఁచె హిరణ్యనేత్రుఁడు తపశ్చర్యాస పర్యాప్రహా
ర్షగభాషాహృదయేశ దత్తవరదోస్సారంబు ఘోరంబుగన్. 180

మ. చటులోచ్ఛ్వాస మరుత్పరంపరలచే సర్వాంకషాభ్రంలిహా
స్ఫుటిమ న్మించు మహాపయోధిని సముద్భూతోర్మిజాతంబు లు
త్కటఘోషంబున ఘూర్ణిల న్ఘనగదా దండంబుచేఁ జెండుచున్
ఘటియించెం జలకేళి హాళిమెయి రక్షస్స్వామి యక్షీణుఁడై. 181

క. అదిచాలక బ్రహ్మాండం, బుదితము గావించి బాహ్యమున నుదితం బౌ
నుదకమున నీదులాడఁగఁ, మదిఁ దలఁచుచు నుండె దితి కుమారుం డధిపా.

వ. ఆసమయంబున. 183

క. స్వాయమ్భువ మను వాకనాఁ, డాయంబుజభవునిఁ జేరి యతివయుఁ దాను
న్వాయువిధంబులఁ బొగడుచు, నేయనువున సుగతి గల్గు నెఱిఁగింపుమనన్. 184

క. వనజాక్షుఁ గూర్చి జన్నము, లొనరించిన సుగతిగలుగు నొండేమిటిచేఁ
గననేర వనుడు నలువకు, మను వని యెం జోటు గాన ముఖమున కనఁగన్. 185

ఉ. ఔ నిదినిక్కువంబు గనకాక్షుఁడు ఘోరతపంబుచేసి నా
చేనవనీతలంబుఁ గొనిచేర్చె నథోభువనంబునందు న
ద్దానవుఁద్రుంచి భూతల ముదారత రాంబుధిఁ నీరఁ దేల్చఁగా
[1]నే నెనమర్థుఁడౌదుఁ బరు లెవ్వరు తద్ధరనుద్ధరింపఁగాన్. 186

క. అని హరిదలఁచుచుఁ దనలో, నను చింత యొనర్చు బ్రహ్మ నాసారంధ్రం
బునఁ గిటి యొక్కటి వెలువడి, యెను వడి నంగుష్ఠమాత్ర దృశ్యాకృతితోన్.

ఉ. అంతట హంసమాత్ర మయి యాపయి నుక్షసదృక్షమై గజం
బంతయి యంతమీఁదఁ దుహినాచల మంతయి యాజగంబునా
ద్యంతముఁదానయై సితసమంచిత గాత్ర ముదారపోత్రముక్ష
దంతురదంష్ట్రిలుం దనర దంభకిటీంద్రము దారుణంబుగన్. 188

మ. ప్రళయారంభ విజృంభి తాంబుధర గర్జాతర్జన ప్రోజ్జ్వల
ద్గళగంభీర కఠోరఘుర్ఘురలతో గర్జింప లోకేశము
ఖ్యులు వర్ణించిరి నైగమోక్తులను రక్షోరాడ్జిగీషావిశృం
ఖలలీలాత్త వరాహ విగ్రహు సమత్కంజచ్ఛటా విగ్రహున్. 189

వ. అంత. 190

---

1 నేనె సమర్థుఁడం బరు లిఁకెవ్వరు.

మ. ఘనసూచీముఖ సూచకాగ్ర ధవళాంగ స్తబ్ధ రోమాళి డు
స్సిన బ్రహ్మాండము తూంట్లబానవలె భాసిల్లంగ మై వెంచుచు
న్వనధు ల్పల్వల లీల పంకిలములై వర్తిల్లఁ గ్రీడించుచుం
జని పాతాళము సొచ్చి యెత్తెఁ గిటిరాజన్యుండు కోఱ న్ధరన్. 191

క. జనమేజయ నృప కిటియై, కనకాంబరుఁ డవని నెత్తఁ గనఁడో వినఁడో
కనకాక్షుఁ డూరకుండెనె, యని సేయక నంటివేని యది విను తెలియన్. 192

ఉ. కాటుక కొండఁబోలు మెయి కాంతి జగంబులఁ జిమ్మ చీఁకటుల్
వాటిలఁజేయదే కనకభాసురరత్న విభూషణప్రభ
ల్మీటయి మించకున్న నని మెచ్చ కనుంగొను వార లెన్న దో
పాటకులీనమౌళి కనకాక్షుఁడు దా నొకనాఁడు వేడుకన్. 193

సీ. అంజనాచలమౌళి రంజిలు కమలాప్త బింబంబు నాఁ గిరీటంబు దనర
మింట స్వాతిపథంబు మించుసంచున మహాహారకస్థలిఁ దార హారములు వెలయ
సపయోజశైవాల జలరాశివృత ధాత్రి గతి విచిత్రాంబర కటి దనర్ప
జేజేల యెకిమీలఁ జెక్కిన గండపెండారంబు పదమున న్గండుమీఱఁ

తే. గాలఫణభృత ఫణాగ్రజాగ్రచ్ఛిరత్న
రత్నసూచికరోర్మికా రాజి మెఱయఁ
గరధృతాయస ముసల సింధురము కరణి
పరగదాదండుఁ డై త్రిదివంబు సొరఁగ. 194

క. అడుగులు దడఁబడఁ బెదవులు, దడపుచు గుండియలు వగుల దడదడయన న
ప్పుడు బెబ్బులిఁగను మృగముల, వడువునఁ దనుఁ గని సురల్జవంబునఁ బఱవన్.

చ. కనుఁగొని కేకవేయుచుఁ గికాకిక నవ్వుచు సైన్యనాథులం
గనుఁగొని యెంతసూరు లిదె గన్గొనుఁ డాసురలన్న గాక స్వా
మిని నెదిరింపఁజాలు నొక మేటి గలండె జగత్త్రయంబునం
దన సహజంబెకా యను నహంకరణోక్తుల బిట్టుపల్కుచున్. 196

మ. అమరావాసము సొచ్చి యచ్చట సుధర్మాస్థాన చింతామణీ
రమణీయాసన వాసియై భట హఠ ప్రత్యాగ్రహీతామరీ
సముదాయోదిత గాన నాట్య కలనా సంప్రాప్త సమ్మోదుఁడై
సమరాకాంక్షఁ గృశానుముఖ్య పదము ల్చర్చించి మార్గేమికిన్. 197

చ. వరుణునిఁ జేరఁబోయి రణవాంఛను వచ్చితిఁ బోరుమన్న నా
శరనిధిభర్త నిన్నెదుర శౌరి సమర్థుఁడు గాక యన్యులో
పరు చనుమన్నఁ బొల్కడలి పజ్జకు నేఁగుచు నున్న నారదుం
డరుదుగ నేఁగుదెంచి దనుజాధిప ''స్వస్తి'' యటంచు వెండియున్. 198

మ. త్వరగాఁ బోయెద వేమికార్య మనినం దైత్యుండు నేఁ బోరికి
న్వరుణుం బిల్చినఁ బోరఁజాలక హరిన్ వర్ణించినం బోయెదన్
హరి వైకుంఠమునం గలండె యన నావా యిట్టి నీ వార్తముం
దరగా నే విని ఘోణియై చనియెఁ బాతాళంబునం దాఁగఁగన్. 199

తే. ఎందుఁబోయిన బోవ నీ కిపుడు నీవు, వెంటనేపోయి గెలువు మవ్విష్ణు ననుచుఁ
బలుక నారదమౌని నీపాపమాన, పోవనీనంచుఁ బాతాళమునకు నరిగి. 200

మ. కనియెం దానవ సార్వభౌముఁ డెదుట న్గంభీర పాథోధిమ
ధ్యనిమగ్నావనిభార సంవహన దంష్ట్రాంకూర మంచచ్ఛర
ద్ఘనభృద్ఘోరము వజ్రసారకృత సంధానాంగ రుద్వారముం
స్తనితా ఘీలరవానుకారము మహోదారంబు భూదారమున్. 201

వ. ఇట్లు కనుంగొని. 202

తే. నాకచరవైరి శౌరి హా పోకుపోకు, మిదిగొ వచ్చితి నెందువోయెదవు పంద
తిరుగుతిరుగు మటన్న నుద్వేలరోష, రసభరంబునఁ గుహ నావరాహ మపుడు.

తే. కోఱఁ దనరారు ధరణీచకోరనయన
వారిరాశిని దేల్చె నవారితాత్మ
శక్తి యాధారముగఁ జేసి శక్తినాథ
ముఖులు నానాబృహద్భానుముఖులు వొగడ. 204

తే. పర్వతారాతి గురిసె ముద్బాష్పమేఘు, పుష్పవృష్టికిఁ దోడుగాఁ బుష్పవృష్టి
పర్వతారాతి భాస్వర ప్రభల నదియ, దానవోత్పాతమునకు నిదాన మయ్యె.

వ. ఇవ్విధంబున నవ్వరాహమూర్ధన్యుం డనన్యసామాన్య విరోధిరమాన్యకార
మాన్య బలంబునం గువలయంబుం గువలయంబుచందంబునఁ గమలాకరంబు
నం దేలించి మదాభంగుర మాతంగ పుంగవ సముత్తుంగ బృంహితంబునం
గెరలు కొదమసింగంబు తెఱంగునఁ గిఱుక్కునఁ దిరిగి యిట్టట్టు నసక వులి
తోలుగట్టు వేలుపుగట్టువలె పీఁటవెట్టి ముట్టెబిగించి వెన్నునటలుబ్బ సెలవులు
నప్పరించుచు వేఁడిమిడుంగుఱులు వొడమ నిడుద క్రొవ్వాడికోఱలు దీఁటుచు
దీర్ఘనిర్ఘాత ఘర్ఘర ఘుర్ఘుర నిర్ఘోషంబుల బ్రహ్మాండభాండంబు పటపటం బగిలించు
చంద్రనిప్పుల కరణి వేండ్రంబై తీండ్రించుచూపులం జూఱుచుఱంగనుచుఁ
గదిసిన నసురపతి యట్టహాసంబుచేసి యిట్లనియె. 206

తే. హరి వగుటఁ జేసి మును పందివగుట నిక్క
వంబు తుదినేఁడు నీవికారంబు నొంది
పందివైతివి నేను సొంపంది యుండుఁ
బందివేఁటాడుటకుఁ గోర్కి ఫలితమయ్యె. 207

ఉ. వాసవదంతి దంతములు వల్ల దిభాస్యునకొంటి కొమ్ముగాఁ
గా సరిపోవ దేకరణిఁగాంతకు దంతపుఁ బావలిత్తునం
చాసను గ్రుమ్మరం గలిగె నాదివరాహమ నీదుకొమ్మునేఁ
జేసిన యత్నము ల్ఫలము జెందెను తావక దర్శనంబునన్. 208

ఉ. వీరుఁడ వంచు నిన్నుఁ బదివేల విధంబులఁ బ్రస్తుతించుచు
న్వారిధిభర్త దెల్ప విని వచ్చితి మెచ్చెద నేఁడు చూపు నీ
వీరతఁ గాండిశీకపద వీరతవృత్తిని మోరత్రోపునం
బాఱెదవన్నఁ బోవిడఁడు స్వర్ణవిలోచనుఁడంచు నుగ్రుఁడై. 209

ఉ. దండము వెట్టఁగా సురవితానము లందును భక్తి సేయకఁ
దండము బెట్టుగా విసరి దైత్యుఁడు వ్రేసినఁ బొందెతూఁట వే
దండముఁ దాఁకినట్లు కిటిదాఁకి యదంతట ఖండమైన కో
దండముఁ బూని వాఁడు నిశితప్రదరంబులు గాఁడనేయఁగన్. 210

తే. సెలసికొట్టిన కిటికోఱ జీరవారి
కనకనయనునిబలు మేనఁ గానవయ్యె
వలపుమీఱఁగ నిదు మృత్యువనరుహాక్షి
వాఁడి కొనగోఁట జీరె నా వసుమతీశ. 211

వ. అంత. 212

మ. శునకంబుంబలెఁ జుట్టుముట్టుకొను రక్షోవీరు దంష్ట్రాహతిం
దునుకల్చేసి తదీయసైన్యములఁ బొందుల్వాపి తద్రక్తసి
క్త నవీనాంబుధి నోలలాడుచును భూదారేంద్రుఁ డెప్పంటిమే
రను దాల్చెఁ సురలెల్ల గోరఁ దన కోఱ న్ధారుణీమండలిన్. 213

సీ. తమ్మికన్నుల మరందముదశ్రువులు జాఱ నెలదేఁటి చూపులు బెళుకుఁజూప
శైలవక్షోజము ల్ఖర ఘర్మమున దోఁగి మబ్బు వన్నియపైఁట మాటుకొనఁగ
నబ్జాకరాస్య మోహానభంగ విభ్రమ భ్రూవిలాసంబులు పొల్పు మిగుల
మహితనితంబ బింబము నోరయుచు యమునావేణి వెనుచాయ నటనదెల్ప

తే. రంధ్రనాభియు వనరోమరాజి మెఱయఁ
దనులత చలింపఁ గపట భూదారకాంత
దంతకోరక ఘట్టితాధర నవోఢ
వసుమతీకాంత యానందవార్ధిఁ దేలె. 214

మ. పరికింపం గిటికోఱ దంతమయ దీపస్తంభమై యొప్పె పై
పరిశోభిల్లెడు ధాత్రి పాత్రవలెఁ జూపట్టెం దదగ్రాల్పపు
ష్కరముల్ తైలములీలఁ బొల్చెఁ గనక గ్రావంబు దీపంబువై
ఖరిఁ బెంపొందెఁ దదంతదీపశిఖవీఁక న్మించె మేఘాళియున్. 215

వ. అంత. 216

క. దితిజనిశాధవరాహున్, శ్రితదురితేందివరాహు శ్వేతవరాహున్
నుతియించి రవుడు శతధృతి, శతమఖముఖ వహ్నిముఖులు సమ్ముఖు లగుచున్.

శా. ఆహా యజ్ఞవరాహమూర్తి వగుటీవాశ్చర్యమే విస్ఫుర
ద్దేహచ్ఛాయలు పౌండరీకరుచి జ్యోతిష్టోమలీలన్సమ
స్తాహార్యచ్ఛద విచ్ఛిదచ్ఛహరిమేథారూఢిఁజాటం భవ
న్మాహాత్మ్యంబు నుతింప నేరుతుమె దంభక్రోడచూడామణీ. 218

సీ. క్రూరారికోటీరకురువిందములఁ గాని కురువిందముల నెందు గ్రొచ్చఁబోవు
పరిపంథిబహురక్తపల్లవంబులఁగాని పల్లవంబులఁగ్రీడఁ బడయఁబోవు
వైరివీరనిశాటవంశంబులను గాని వంశంబు లెందును వంచఁబోవు
బలసమేధితపలాశులఁగాని పెఱపలాశులఁ గొమ్ముచే నేలఁ గలుపఁ బోవు

తే. ఘోణిమాత్రంబవే దితిప్రాణదనుజ, పాణిగతఖండనఖయుగక్షోణి నీల
వేణికోద్ధారచణదంష్ట్రికాణిమేత, రబల శమితార్తి కుహనావరాహమూర్తి.

చ. వలపున నీవు ముద్దుఁగొనవచ్చిన నీదగుమోమునూచి పో
యలసితి వందగాఁడవని యంబుజగేహిని గేలిసేయఁ దా
జెలిమిని నీకు ముద్దొసఁగఁ జేరినయట్టి క్షమావధూటితోఁ
గలసితి వెందు నోర్పు గలకాంత శుభాన్వితయౌఁ గిటీశ్వరా. 220

సీ. గిరిరాజఘర్షింద్రకరిమదధారనా శ్రీకంధరాకాశశిఖయనంగ
వజ్రసౌధాగ్రభా స్వరహరిన్మణియనఁ గల్పశాఖాకలకంఠి యనఁగ
గౌరాబ్జకోరకకలహంసికయనంగఁ గేతకీకుసుమభృంగిక యనంగ
మౌక్తికైకస్తంభమఘవాశ్మగృహమన వారిభదంతశైవాల మనఁగ

తే. నున్ముఖాహీంద్రలోచనద్యుతి యనంగ, నవ్యతావకదంష్ట్రికా నాళమునను
గువలయంబనఁ జెలువందెఁగువలయంబు, రక్షితావనిదేవ వరాహదేవ. 221

క. అని పొగడెడు బ్రహ్మాదుల, ఘనకృప వీక్షించి దంష్ట్రికాభూసతికిన్
వినుపించె నఖిలధర్మము, లనుగపటకిటీంద్రు ముల్లసద్వాక్యములన్. 222

క. తొలుతఁ బెనుగంటి నుట్టుట, వలనం జాపవలెముడుగు వసుధాస్థలిపైఁ
గులగిరులఁజేసి యెల్లెడ, నిలిపె నజుఁడు ముడుఁగకుండ నేరుపు మెఱయన్. 223

చ. పురము ల్గ్రామములు న్నదు ల్సరసు లంభోధు ల్వను ల్ద్వీపము
ల్గిరులు న్విప్రనృపార్యశూద్రకులు సంకీర్ణోద్భవుల్ తేరులుం
గరులుం దేజులు ధేనువు ల్ధనమణు ల్కాంతాదులుం గల్గి భా
స్వరయయ్యెం ధర యప్పుడంబురుహభూసంకల్పమాత్రంబునన్. 224

క. ఆయెడ బహుయజ్ఞంబులు, స్వాయంభువమనువు భక్తిసల్పెన్ లక్ష్మీ
నాయకుఁడుఁ బ్రీతుఁడై ని, శ్రేయసమెసఁగన్ యథేష్టసిద్ధులనొసగెన్. 225

ఉ. శ్వేతవరాహకల్పమిది వేడుక నీకెఱిఁగించితిన్ జగ
ఖ్యాతికిటీంద్రచర్య కుతుకంబున విన్నఁ బఠించినన్ జన
వ్రాతము గాంచు సద్వరవరాహకృప న్నిఖిలేప్సితార్థసం
ఘాతము విష్ణుభక్తతిలకా జనమేజయభూమిపాలకా. 226

క. అని శ్రీవైశంపాయన, మునిముఖ్యుఁడు దెల్ప విని ప్రమోదాన్వితుఁడై
జనమేజయుఁ డవ్వలికథ, యనఘా వినవలతుఁ దెల్పుఁ డని యడుగుటయున్.

శా. శ్రీరంగ త్కరుణాకటాక్షతపన శ్రీముష్ణతీక్ష్ణప్రతా
పారామాకుచకుంభఘోణవిలసత్పత్త్రాంకకాళీశ్వర
శ్రీరామేశ్వరకీర్తివారినిధి కాంచీరక్షణోపాయవ్యా
హారప్రౌఢిమ ధైర్యశేషగిరి దృష్టా యోధ్యమాయాలిగా. 228

క. భారతశాస్త్రార్థప్రతి, భారతమత్యూఢ ధరణి భారతమోను
ద్భారతపారీణయశో, భారతబింబాస్యభృత్య భారతభృతిదా. 229

పంచచామరము. హిరణ్యగర్భముఖ్యదానహృష్టశిష్టశేముషీ
హిరణ్యగర్భభామినీసమీహితాంగసుప్రభా
హిరణ్యగర్భవైభవాఢ్య హృత్సరోజవిస్ఫుర
ద్ధిరణ్యగర్భభేదిధైర్య హేమభూమిభృద్వరా. 230

గద్య. ఇది శ్రీరామభద్రదయాభిరామభద్రకరుణాకటాక్షవీక్షాపరిప్రాప్తదీప్తరాష్ట్ర
భాషాకవిత్వ సామ్రాజ్యధౌరేయసకలవిద్వత్కవిజనవిధేయ ధరణిదేవుల నాగ
నామాత్యసుధాసముద్రసమున్నిద్రపూర్ణిమా చంద్ర రామమంత్రీంద్రప్రణీతం
బైనదశావతారచరిత్రం బనుమహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

3. వరహావతార కథ సమాప్తము.





# ౪. నరసింహావతార కథ.



## చతుర్థాశ్వాసము.



మ ద్వేంకటశైల
స్వామి కృపావర్ధమాన వైభవరేఖా
ధామేయ యసమసమర
క్ష్మామండలనూత్నకృష్ణ మగదలకృష్ణా! 1

తే. అవధరింపుము జనమేజయక్షితీశ, శేఖరున కిట్టులను వ్యాస శిష్యమౌని
ధరణినాథ నృసింహావతార మింకను, దెలియఁ జెప్పెద వినుమని తెలుపఁదొడఁగె.

శా. శ్రీలీలావతి నవ్వనేటికని ఘర్షింపంగ నేనవ్వనో
బాలా సాజనుఁ సింహవక్త్రమున కీపారీంద్ర చిత్రంబు నీ
వాలోకింపు మటంచుఁ గుడ్యమున జూయంజూపి నవ్వింపఁజా
ల్మ్రీలక్ష్మీనరసింహమూర్తి యొసఁగు౯ క్షేమంబు భక్తాళికిన్. 3

సీ. కనకాంబరుని చేతఁ గనక నేత్రుఁడు గూలె ననుమాట చెవినాటఁగనలి కనక
కశిపుఁ డత్యుగ్రుఁడై కాలకాలాంతకులీల శూలము కేలఁ గీలుగొల్పి
వెలిహజారముఁ జేరి విప్రజిత్యాదిదైత్యులఁ జూచి వింటిరె యొక్కవింత
హరికిరియై హిరణ్యాక్షువిదారించి చనెనఁట తా నెందుఁ జనెడివాఁడు

తే. చోరతనమున వారాశిఁ జొచ్చె నేని, గూర్మమై భూధరముక్రిందఁ గ్రుంకె నేని
బోత్రియై వని జేరినఁ బోవనీక, పట్టి వధియింతు నెంజిలిబాపుకొండు. 4

క. ఆరీతి దగులకుండిన, సారెకు గోవిప్రహింస సల్పుడు తద్ర
క్షారతిఁ జేరిన శౌరిని, వారించెద నంచుఁ బంప వారు యథేచ్ఛన్. 5

క. తడ విడిచిన పాములవలెఁ, బుడమిని నెల్లెడల నిండి భూసురవరుల
న్నైడపుచు గోగణములఁ బడ, నడుచుచుఁ జరియించి రంతకాకృతు లగుచున్.

తే. దైత్యనాయకుఁ డంత సోదరునిపాటుఁ
జూచి శోకార్తుఁ డగుచుఁ దత్సుతుల శకుని

శంబరాదులఁ దత్ప్రియ సతుల జననిఁ
గాంచి యిట్లనుఁ గడువివేకంబు దొరయ. 7

శా. సామాన్యుండె హిరణ్యనేత్రుఁడు భుజాశౌర్యంబుచే భీమసం
గ్రామక్షోణుల గెల్వఁడే మునుపు సుత్రామాదుల న్నిస్సమ
శ్రీమత్త్వంబున మించఁడే గనఁడె కీర్తిం గాలధర్మంబుచే
నీమేన్వీడినయంత దీని కిటఁ దల్లీ యేల దుఃఖింపఁగన్. 8

శా. వీరుండై జనియించి నప్పుడ రణోర్వి న్వైరుల న్దోర్బలో
దారత్వంబునఁ గెల్వఁగావలయు లేదా యొమ్ముగాయమ్ముల
న్వీరస్వర్గము గాంచఁగావలయు నింతేకాని వేఱొండులే
దౌరా రెండును గాంచె నీతనయుఁ డేలా యింత జాలింబడన్. 9

శా. నీపుత్త్రుం డితఁడంచు దుఃఖపడె దెంతో దేహమో జీవుఁడో
నీపుత్త్రుం డిట దేహమాత్ర మని యంటే కాదు జీవుండన
న్నీ పుత్త్రుండిపు డైనఁగర్మగతి నెందే పూర్వముం బుట్టఁడో
రేపుం బుట్టఁడొ యింక నెవ్వరికిఁ బుత్త్రీభావ మాద్యం బగున్. 10

క. విననే మున్ను సుయజ్ఞుం, డను నౌశీనరనరేంద్రుఁ డరిహతుఁడై భూ
మినిఁబడ నాతని పైఁబడి, తనయులు పత్నులును బంధుతతి విలపింపన్. 11

క. కాలుం డచటికిఁ దానొక, బాలుండై వచ్చి ప్రేత బంధుల సుతులన్
బాలామణులం గనుఁగొని, యేలా శోకింప నెఱుఁగరే కాలంబున్. 12

క. తానిత్యుండై పోయిన, వానికిఁ జింతింపఁ బోయు వలఁబడుసతికిన్
లోనదరి యొకకుళింగము, వానికి లోనయ్యె శరము వైవఁగఁ బిదపన్. 13

క. అని బుద్ధి సెప్పి వారల, ఘనశోకము మాన్పి యముఁడు గ్రమ్మఱఁగానం
జననీ గతజీవులకుం, జనునే దుఃఖింపఁ దత్త్వసంవేదులకున్. 14

సీ. అంభోజసంభవుఁ డాదిగా నల నవబ్రహ్మలు నిర్మాణ పటిమ గనుట
శతపత్త్రనేత్రుండు శత్రులోక భయంకరంబైన దివ్యచక్రంబు గనుట
వెన్నెలవిరిదాల్పు వేలుపు భువనమోహనసర్వ మంగళావాప్తిఁ గనుట
భృగుముఖ్యు లగుమహాఋషులుబ్రహ్మాదుల శపియింపఁజాలు దౌష్ట్యంబుగనుట
తే. నైదుసంవత్సరములప్రాయమున ధ్రువుఁడు, నిఖిలలోకోన్నతంబైన నెలవుగనుట
దపము చేసియె కాదె యంతటి తపంబు, నేను గావించి కాంచెద నిష్టసిద్ధి. 15

క. అని యనిపించుకయమృతా, ద్యనుపమవస్తువుల నిచ్చె హరి కిరియం
చును మెచ్చుచు మందరనగ, మునకేఁగి తదగ్రసీమమున మునివృత్తిన్. 16

సీ. తృణభక్షణము చేసి తిరుగవె ధేనువు ల్జలముల మనవె యాజలచరములు
గాలియాహారంబుగా నుండవే ఫణు ల్మధుపానమునను ద్రిమ్మరవె తేంట్లు

ఫలరసంబులు గ్రోలి చిలుకలు చెలఁగవె యిగురులు మేసి కోయిలలు దగవె
బిసఖండములు మేసి పెఱుఁగవె రాయంచ లబ్బిందుపులఁ జాతకాళి మనదె [మున
తే. యొకటి యశనంబుగాఁ గొనియుంట తపమె, యనినిరాహారుఁడై పాదమంగుట
నేల నిల్పి ఖరాంశుపై నిల్పిదృష్టి, విబుధపరిపంథితపము గావించుచుండె. 17

వ. అంత. 18

మ. ఒకనాఁడింద్రుఁడు వైజయంతమణిసౌధోదగ్రభాగంబునన్
సకియల్గొందఱు కుంచగిండిసురటుల్ సామ్రాణి పొంజాలవ
ల్లిక గాళాంజియుఁ బూనికొల్వఁగ శచీలీలావతింగూడి గాయక
చంద్రాస్యలగానము ల్వినుచుఁ గొల్వై యుండె మోదంబునన్. 19

మ. స్వకదేహంబు తెఱంగునన్ బహుగవాక్షస్ఫూర్తి రాజిల్లుజా
లకమార్గంబులఁ గేళికాకుతుక బాలావృత్తవక్షోజకో
రక కాశ్మీరకురంగికామద విమిశ్రంబై త్రివేణీగతిన్
రకమౌ నాకధునిం గనుంగొని వధూరత్నంబుతో నిట్లనున్. 20

మ. జిలుగుంబయ్యెద చాటునం గులుకు నీసిబ్బెంపుఁజన్ దోయినాఁ
జెలువయ్యెం జలజాతకోశములు హంసీపక్షవిక్షేపచం
చలగంగోర్ములఁ జక్రవాకనఖలక్ష్మంబు ల్విశేషంబులం
దుల నిందుం గలిగింపఁగావలదె తోడ్తోఁ బద్మకోశస్తనీ. 21

మ. అనినం జాలు మఱేమియంచు శచి యొయ్యారంపు లేనవ్వుజం
కెనవాల్చూపులు చిన్ని కిన్కఁ దెలుపం గెందమ్మి పూమొగ్గ చేఁ
దను వైవం గని భర్త గుబ్బయని మెత్తన్గోరనొత్త న్నితం
బిని సీత్కారముతోడఁ జొక్కుచును గప్పెం బైఁటనున్నిగ్గునన్. 22

తే. మఱియునాయావిశేషము ల్మత్తభృంగ
వేణి కెఱిఁగించుచును రాజవీథిలోన
సత్వరంబుగఁ జనుదెంచు చారుఁ గాంచి
యేవిశేషంబు గల్గెనో యిల నటంచు. 23

క. అక్కడికిఁ బిల్వనంపిన, గ్రక్కునవాఁ డరుగుదెంచి కడువినయముతో
మ్రొక్కి పరాకు సురేశ్వర, యొక్క విశేషంబు గల్గె నుర్వీస్థలిపై. 24

తే. కనకకశిపుండు ధీరుండు గనకకడఁగి, తపము సేయంగఁ దొడఁగె నాతపముశీత
మంచు నెంచక కదలనిమంచుగట్టు, దారిదారితకుధరమదారిభిదుర. 25

చ. తపములకేమి దానవులు దైత్యులు సల్పరొ కోర్కు లందరో
చపలతఁ గొందఱందు నెలజవ్వనులం గయికోరొ వారితో
నుపమకు రాఁడువీఁడు గడు నుగ్రపు నిష్ఠ వహించె నింక నే
యుపమను మాన్పఁగావలెనొ యూహ మొనర్పు సుపర్వవల్లభా. 26

తే. చండవాతోత్థభూరజో హిండనమునఁ, గొండ మెండునఁగదలకయుండు దైత్య
మండలేంద్రుని దేహ ముద్దండముగను, గండకండూతి నొఱయు వేదండగణము.

తే. మానస మచంచలంబైన మట్టుపడెనొ
గాక నానాబిలంబులఁ గ్రందుకొన్న
చిలువగుంపులు మేసెనో తెలియరాదు
వెలివి సరదయ్యె దైత్యేంద్ర విభుని యూర్పు. 28

తే. పవనమున సిండివానలఁ బదనుగన్న, రజముపైఁ గూళ్లువెట్టిన ద్విజకులంబు
రెట్టలో విత్తుగమి యంకురింపశుక్ర, శిష్యశేఖరు చెవులలోఁ జెట్లు మొలచె. 29

తే. ఇంక నొకవింత యాదానవేంద్రుకడఁది, మేనఁ బుట్టిన పుట్టక్రొమ్మెలుగుఁగొల్ల
గ్రుచ్చి తేనియఁ గైకొను నిచ్చనిచ్చ, నచ్ఛభల్లంబు లచ్చట నచ్చుపడఁగ. 30

చ. శిరసుననున్న తేనె పెఱశీతమయూఖుని రేఖగా నభం
గురతరదేహయష్టిఁ బెనఁగొన్న భుజంగ కదంబకంబు లా
భరణములై దగ న్శుకవిపాటితచూతఫలస్రవన్మరం
దరసము గంగగాఁ దపము దైత్యుఁ డొనర్చు మహోగ్రవైఖరిన్. 31

క. అని వినిపించిన విని యిం, చినభయమున నింద్రుఁ డనుపఁ జెలువలతోడం
గనకాంగి యల్ల మందర, మునకుం జని హావభావములు దళుకొత్తన్. 32

క. ఆటలఁ బాటల మాటలఁ, దేటల నలపింపలేక దితిజాధీశుం
బాటలగంధి బలాసుర, పాటనుకడ కేఁగుదెంచి భయవినయములన్. 33

చ. పలికిన మోముఁ జూపినను బాడిన నాడినఁ గేల నంటిన
న్గలకల నవ్వినన్ననుచు గా భువి నెల్లపలాశిబృంద మం
చలవునఁ బోయి నేనలపలాశిని డగ్గఱి స్థాణువైఖరి
న్నిలువఁగఁ జూచి వచ్చితిని నేర్పు వితాచనఁగా సురేశ్వరా. 34

క. నీచిత్త మింకమీఁదట, నాచేతం గాదటన్న నారీమణి యిం
కేచంద మనుచుమదినా, లోచనచేయుచు సహస్రలోచనుఁ డుండెన్. 35

ఉ. అంతటఁ గొంతకాలమున కచ్చటి కొక్కచరుండు వచ్చి వృ
త్తాంతక దానవేశ్వరుఁ డుదారతపస్థితి నున్న దేహమా
ద్యంతము మట్టికప్పెనవె నస్థులనంటుక జీవముంట మా
కింతయుఁదోఁచ దన్న దివిజేశ్వరుఁ డెంతయు సంతసంబునన్. 36

క. మన కిదియే సమయం బిఁక, నని యన్యనిశాటకోటి నణఁగింప నటం
చును వజ్రి కుమారునిఁ జూ, చిన మంచిద యనుచు నతఁడు సేనలు గూర్చెన్.

మ. జలధివ్యంజితనాదము ల్ప్రళయగర్జ న్మేఘసంవాదము
ల్దళితక్ష్మాధరపాదము ల్దనుజకాంతాగర్భ నిర్భేదము

ల్బులవన్నిర్ఝరమోదము ల్బ్రకటిత బ్రహ్మాండవిచ్ఛేదము
ల్బలిసె న్సైరినినాదము ల్కృత సురప్రత్యర్థిఖేదంబులై. 38

సీ. గంధాంధపరిపంథికంధిమంథవసుంధరా ధరస్మదసింధురములు గదల
సర్వపూర్వసుపర్వ దుర్వారగర్వ దూర్వాపర్వచర్వణార్వములు నడవ
శృంగవన్మదభంగ చంగరథాంగసంగతతుంగ తరళతాంగ్గములు వెడల
దుర్భావగార్భిణ్యగర్భనిర్భేదన ప్రబలార్భటుల వీరభటులు సాగ
తే. వీరదోహళ కాహళీవివిధవాద్య, వారఘోషంబు వందికైవారరవము
దారుణంబయి భూనభోంతరము లలమ, శక్రుఁడసురేంద్రుపట్టణ మాక్రమించి.

క. యుద్ధముసేయఁగ నపుడు స, ముద్ధబలాధికులు దానవేంద్రుని తనయుల్
క్రుద్ధులయిదనుజసైనికు, లుద్ధతులై కొలువఁ దాఁకి రుత్సాహముతోన్. 40

క. పెద్దపులి వెడలిచనె నని, గద్దఱితనమునను నక్కకదుపులుపొదలో
నుద్దవిడిఁజొచ్చి చిఱుతల, యొద్దంబడినట్టు లయ్యె నోయమరేంద్రా. 41

తే. ఎందుఁబోయిన నింకఁబోనీము నిన్నుఁ
బట్టిద్రుంతుము దైత్యేంద్రుపాదమాన
నిలువు క్షణమాత్ర మనుచు నిర్నిద్రరోష
రసభరంబున దారుణాస్త్రములు గురియ. 42

మ. శలభీశాబగరున్మరుత్కులముచేఁ జల్లాఱునే దావిక
జ్వలనజ్వాలిక యేల యీ తెగువ రక్షఃపుత్రులారా తెగ
న్వల దెందేఁజనుఁ డద్రినిర్దళనమద్వజ్రంబు జిల్లేడురె
మ్మలపైఁ బాఱదటంచు వాసవుఁడు సామర్థ్యంబుసూచించుచున్. 43

మ. శరవర్షంబున ముంప దైత్యతనయు ల్శౌర్యంబుతోఁ బోర ని
ర్జరలోకేశ్వరుఁ డంతవజ్రముగొన న్సైరింపఁగాలేక కా
తరులై యూడనిఁబాడి రస్వదనుజాతస్తోమము ల్కళ్లఁ ద్రు
ళ్లి రణోత్సేకముతక్కి యింద్రుఁడు బలాళింగూడి యత్యుద్ధతిన్. 44

చ. నగరముసొచ్చి హేమ లలనా మణి పట్టదుకూలముఖ్యవ
స్తుగణముఁ గొల్లలాడుచును దోడనె యంతిపురంబు సొచ్చిన
న్మృగపతిఁగన్నపద్మినులయేపున నెంతయుదత్తఱించుచున్
మగువలు సాలభంజికల మాటున డాఁగిరి కొంద ఱత్తఱిన్. 45

సీ. గమనించుచో మ్రోయు కటకము ల్క్రూలుడ్పములుచుట్టుబిగియించుమందగమన
యొకమూల డాఁగిమైచకచక ల్పరికించి కలఁగిపయ్యెద మేనుఁ గప్పు వెలఁది
తొట్రిలు భయమునఁ ద్రోవఁగానఁగలేక నివ్వెఱపాటుతో నిలుచునెలఁత
గాళ్లు కుప్పవడంగఁ గదలఁజాలక యట్టె నిడిముసుంగిడి శయనించుచెలువ

తే. యుదిరికంబంబు మఱుఁగున నొదుఁగురమణి
డాగఁబోయి సమక్షంబు డాయుతరుణి
స్వీయు లంచును బరులను వేఁడు కలికిఁ
గలసి యంతఃపురంబు చీకాకుపడియె. 46

చ. అదరున నిల్లుసొచ్చి యమృతాశనుఁ డొక్కఁడు పల్పుమూల యం
దొదిఁగినఁ దన్ను నీడ్వఁ బద యూరకె వచ్చెద నంచు నాలుగే
న్పదములు వెంటఁబోయి కలపంబిదె తెచ్చెద నుండుమంచుఁ దా
సదనము చేరి తల్పు గెడసాచె నొకానొకకాంత నేర్పునన్. 47

వ. అప్పుడు. 48

సీ. జిగిమేనియోరలఁ దగునంపజీరలు గొనగోటితాఁకులకోపుసూప
వడినొడుగఱచుచో వాతెఱనంటిన మొనపంటివగఁగంటిమురువు నెఱప
ఱొమ్ముగాయముల రక్తమ్ము గాఢాశ్లిష్ట కుచకుంభలగ్న కుంకుమము దెలుప
నతిరోషశోణంబులగు నేత్రకోణము ల్లీలమై నిద్దురలేమిఁ జాటఁ

తే. జాలుసికఁదోఁగు చెమ్మట శ్రమముగాఁగ
వీరశృంగారరసములు వియ్యమంద
విజయలక్ష్మీవధూసంగవిభ్రమంబు
లభినయింప నిలింపలోకాధివిభుఁడు. 49

మ. వలచే వజ్రము ఱొమ్ములో బిగువు గర్వంబుం బ్రమోదంబు మీ
సలలో నవ్వు నొయారముం జెలఁగ నుత్సాహంబుతోఁ బాదమం
జులమంజీరఝుళంఝుళ ల్వెలయ రక్షోనాథశుద్ధాంతకాం
తల నీక్షించుచు భీతి దక్కి నలుచెంత ల్చూచుచు న్మందటన్. 50

మ. కులుకుందంతపు బొమ్మచెక్కడపు బల్కంబంపు మేల్కొబ్బెలం
దళమానీలపుతాలదూలములపైఁ దార్కొన్న నున్నచ్చపం
తెలదాపించిన కెంపుటిట్టికల సందింబొంది రావజ్రగా
రెలఁ జెన్నొనొక గట్టిచప్పరములో రేరాచరాతిన్నియన్. 51

శా. కాంతల్ క్షేమముఁ గోరి సేయు వ్రతసంఘాతంబుచే నంగమ
త్యంతంబుం గృశమయ్యెఁజంద్రకలొదారప్రభస్మీఱఁగాఁ
జెంతన్ దానవదైత్యరాజ తరుణు ల్సేవింపఁగా నెంతయుం
జింత న్జెందునిశాచరేశ్వరుసిరాజీవాక్షి దొదవ్వునన్. 52

తే. తనువిలోకించి సింగంబుఁగనినకరిణి
కరణిఁ దత్తఱమంది మందిరము సొరఁగ
నెందుఁబోయెదవంచుఁ బూర్ణేందువదన
వేణిఁ బట్టీడ్చెఁ గదిసి గీర్వాణవిభుఁడు. 53

చ. తళుకులు గుల్కు చెక్కులఁ గనుదమ్ముల నశ్రుమరందబిందువుల్
దొలఁగ మెఱుంగుచన్నుఁబగడదోయి వడంక శిరోజషట్పదా
వలి చెదర న్భుజాలతలు వాడ గభోద్ధృత పద్మినీశ్రియం
దలఁకె సురారినారి గిరివైరి కరాహృతకేశపాశ యై. 54

తే. దైత్య సామ్రాజ్యలక్ష్మి చందమున నడలు
తరళలోచనఁ దెచ్చి రథంబుమీఁద
నుంచి యమరావతికిఁ జనఁ గాంచనాంగి
మూర్ఛఁ దెప్పిరి యిట్లని మొఱలు వెట్టె. 55

క. ఈయెడ నను జెఱవెట్టుక, పోయెడి విభుఁ డిందులేమిఁ బురుహూతుం డ
న్యాయము నెన్నకమునులా, రా యనదను నన్నుఁ గావుఁడని మొఱయిడఁగన్.

ఉ. గౌరశరీరకాంతితరగ ల్జడగుంపు ప్రవాళవల్లరి
వారము వల్లకీరవ మవారితనాదముగాఁగ మూర్తమా
[illegible]రధి వైఖరి స్వహృదయ సీమ సునిష్ఠితనీరజాక్షుఁడౌ
నారదుఁ డేగుదెంచి సురనాథున కడ్డమువచ్చి యత్తఱిన్. 57

ఉ. ఈనలినాక్షి యెవ్వతె సురేశ్వర నారద మీరెఱుంగరే
దానవసార్వభౌము వనితామణి యాతని సంగరంబులో
నాని జయించితే సమసె నాతఁడు ఘోరతపంబుచేత న
జ్ఞానివె నొత్తురే తపము సల్పినవార లెఱుంగ వేమియున్. 58

మ. ఇదిగో రేపె తపఃప్రభావమున వాణీశాను మెప్పించి మీ
పదముల్ గైకొన నున్నవాఁడు విబుధప్రత్యర్థి సామాన్యుఁడే
త్రిదశాధీశ్వర మీరెఱుంగక మదోద్రేకంబుతో నేఁడు త
త్సుదతీరత్నము నేలతెచ్చి తిటుల న్శోకింప నెంతేనియున్. 59

సీ. కురులు నున్నఁగదువ్వి కొప్పువెట్టెనె కాని తీరంపు విరిసరు ల్దురుమఁబోదు
పాలుపొందఁ గుంకుమ బొట్టువెట్టెనె కాని ముద్దుగాఁ దిలకంబు దిద్దఁబోదు
పాటిగా నెమ్మేనఁ బసుపుపూయునె కాని యందమౌ కలపము లందఁబోదు
పతికి సేమముఁగోరి వ్రతము సేయునె కాని శృంగారవనివిహరింపఁబోదు
తే. కంటె తాళిబొట్టు కమ్మలు కడియంబు, లొక్క నన్నచీరె యొకటి రెండు
వీడియములె కాని విభవముల్ గలిగియు, వల్లకుండు దైత్యవరపురంధ్రి. 60

క. పరమపతివ్రత యగునీ, కరిగమనమనంబు నొవ్వఁ గాఱించిన నీ
దురితం బెంతకుఁజాలదు, సురనాయక నీసురాజ్య సుఖమే దింకన్. 61

క. విక్రమ మని యెంచకు నీ, విక్రమ మక్రమము విడువు మీసతి ననిశ
శుక్రాంతేవాసీవని, శుక్రుఁడు శక్రుండు నలువచూలికి ననియెన్. 62

ఉ. తాపసనాథశేఖర ప్రతాప మటంచును దెచ్చినాఁడనే
కోపనగర్భసీమ నతిఘోర నిశాచరరాజతేజ ము
ద్దీపితమూటఁ జేసి సుదతీమణి పుత్రునిఁ గాంచినప్పుడేఁ
గోపముమీఱ వాసి శతకోటి హరించెద నంచుఁ దెచ్చితిన్. 63

వ. అనిన సంక్రందనునకు శతానందనందనుం డిట్లనియె. 64

మ. అతినైర్మల్యము గల్గి వైష్ణవకిరీటాలంక్రియాయోగ్యమై
హతదోషంబున వజ్రభేద్యతరమై యష్టాంగయోగాఢ్యమై
యితరాకల్పితరంధ్రమై సురుచిరమై యేతన్మహాదైత్యరా
ట్సతిగర్భాఖ్యఖనిం జనించు శిశువజ్రం బద్రినిర్భేదనా. 65

క. నీచేసాధ్యుఁడె హరిపూ, జాచతురుఁ డతండు గాన జలజాతముఖి
న్నా చెంత నునిచి పొమ్మన, వాచంయమివరునితోడ వాసవుఁ డనియెన్. 66

మ. తరుణీగర్భసముద్భవుండు హరిభక్తిశ్రేష్ఠుఁ డంచు నీ
శ్వర మీరానతి యిచ్చుట న్విడిచెదం జంద్రాననం గాని త
ద్వరదోశ్శక్తికి నేఁడలంక బలవృత్రధ్వంసనోదారభీ
కరవజ్రంబు కరంబునం గలుగ శంకాలేశముం గల్గునే. 67

క. మంచిది మీరీసతిఁబో, షించుం డని యొప్పగించి సేనలు గొలువ
స్వేంచేసెఁబురికిహరియిటుఁ, జంచలలోచనయు మిగుల సంభ్రమ మొదవన్.

తే. చిక్కువడుముంగురులు దీర్చి చెక్కుదోయిఁ
దొలఁకు కన్నీరుఁ బైఁటచేఁ దుడిచికొనుచుఁ
బ్రణుతి సేయ "సుమంగలీ భవ" యటంచు
వనజ సంభవభవుఁడు దీవెన లొసంగె. 69

తే. బాల చింతిల నేల నీ ప్రాణ విభుఁడు, వరతపశ్శక్తి బ్రహ్మచే వరములంది
లోకపాలుర గెల్చి ముల్లోకములనుఁ,దాన యేలికయౌను సత్యంబు నమ్ము. 70

క. నీవిభుఁడు వచ్చునంతకు, నావనమున నుండు మనుచు నారదముని య
ప్పావనిఁ దోడ్కొని చనియెఁ ద,పోవనికి న్సాధు లార్తపోషకులు గదా. 71

చ. వనితయు నాఁటనుండి మునివర్యునకుం బరిచర్య సేయఁ ద
ద్వినయ వివేకసంపదకు వేమఱు మెచ్చి మనంబులోన న
మ్మునిపతి ధర్మమార్గమును ముక్తితెఱంగును విష్ణుభక్తియుక్ష
దినదినమానతిచ్చు సుదతీమణి యెంతయు వేడ్కతో వినున్. 72

తే. మునియనుగ్రహమహిమ నేమనఁగవచ్చు,భామగర్భంబులో నున్న బాలకుండు
హరిమహత్త్వంబుఁ దెలిసితద్ధ్యానమునను, గర్భవేదన నెఱుఁగకగాంచుసుఖము.

వ. అంత, 74

తే. దైత్యనాథుని బ్రహ్మరంధ్రంబు పగిలి, ధూమ మొక్కటి పొడమె నస్తోకమగుచు
నదియ నిండి యకాండగాఢాంధకార, బంధురత సంఘటించెఁ బ్రపంచమునకు.

తే. వెంటనె తపోగ్ని ఘోరమై వెడలుటయును
శరధు లుడుకెత్తె సురగిరి కరఁగెఁ బుడమి
మంగలంబయ్యె దిక్కులు మాఁడె గృహము
లన్ని యంగార దశనొందె నాక్షణంబ. 76

తే. ఉగ్రతరసప్తజిహ్వాల నూర్ధ్వలోక, దాహమొనరింతు ననురీతిఁ దత్తపోన
లము భువర్లోకముమించి యమరనగరి, దగులుకొన్న సుపర్వులు దల్లడిలుచు.

క. వనవహ్ని దవులుకొన్న, న్వనువీథికి నెగురుపక్షివితతులవలె న
య్యనిమిషులందఱు సత్యం, బునకుం జని నలువపాదముల కానతులై. 78

మ. దనుజాధీశ తపోనలంబు త్రిజగద్దాహంబుఁ గావింప నెం
దును నిల్వన్వసగాక వచ్చితిమి తోడ్తో వహ్ని వారింపుమా
యన కోర్కుల్సమకూర్చి తామసము సేయన్న్యాయమే చేసినం
బునరుద్యోగము సేయఁగావలె జగంబుల్గల్గ లోకేశ్వరా. 79

తే. అనిన జలజాసనము డిగ్గి ననజగర్భుఁ, డంతలో సాది దెచ్చిన యంచ తేజి
నెక్కి భృగ్వాదు లయిన యనేక ఋషులు, వెంటరా సత్యలోకంబు వెడలివచ్చి.

సీ. మందరశైలంబునందు నొకానొక కోనలోఁ గానలోఁ గుమురుగాఁగ
బలసిన వెదురు జొంపముక్రింద దట్టమై పులుచుట్టుకొన్నట్టి పుట్టలోన
నీఁగలు చీమలు మూఁగి మైఁ గలిగిన చర్మంబు రక్తమాంసంబు మెసవ
నెమ్ములడింబమై యెప్పటితననిష్ఠఁ దప్పక మొగులుచేఁ గప్పఁబడియు

తే. నినుఁడు లోకమ్ములను దపియించు లీల
ఘన తపోనలశిఖల లోకములు వేచు
కాశ్యపునిఁ గాంచి విస్మయాక్రాంతుఁ డగుచు
భారతీకాంతుఁ డిట్లని పలికె నపుడు. 81

సీ. లేలెమ్ము కాశ్యప మేలగు నీకు నీతపము ఫలించు నీతలఁచుకోర్కి
యీఁయ వచ్చితి వేఁడు మేఁగంటి నీధైర్య మారయ నద్భుతం బయ్యెమాకు
దేహ మీఁగలుమూఁగిఁ దినిపోవఁ బ్రాణము ల్నల్యగతంబులై సడల నిపుడు
నిట్టితపంబు మున్నే ఋషివరులు గావింపరు మీఁదఁ గావింపలేరు

తే. జలముగోరక దివ్యవత్సరశతంబు, దనువుభరియింప నెవ్వరి తరము నీకుఁ
జెల్లె గెల్చితి మమ్మునుస్థిరసమాధిఁ, గోరు కోరినవరము నేకూర్తునీకు. 82

మ. అనుచుం బాణికమండలూదకము దైత్యస్వామిపై నంచె న
త్యనఘాత్మీయ కృపానిరీక్షణసుధా ధారాళ ధారాఢ్యమై

తనువెల్లం గడియర్ జగత్త్రితయ సంతానంబు గావింపుమీ
యనుచుం దా నభిషిక్తుఁ జేయుగతి భృగ్వాదుల్ నిరీక్షింపఁగన్. 83

ఉ. నీరజభూకమండలు వినిర్గతనిర్మలవారిధార బ్రం
దారక వైరిమస్తకమునం బడునప్పుడు చూచి మౌనిబృం
దారకు లెల్లవిస్మయమున న్మది నెంచిరి సత్యలోక ని
ర్వారితమై సదాశివ శిరస్థలి వ్రాలిన గంగకై వడిన్. 84

తే. అమృతసేకంబువలన దైత్యాంగమునకు
బలముఁ దేజంబు సౌష్ఠవపాటవములుఁ
గలుగఁజేయుట యరుదె సంకల్పమాత్ర
మునఁ బ్రపంచంబు గల్పించు ప్రోడలకును. 85

మ. అతిసంతప్త సువర్ణమా నుదయశైలారూఢబాలప్రభా
పతియో యాజ్య సమిత్సమేధిత బృహద్భానుండొ జ్యోతిర్లతా
వృతమో ద్రోణనగేంద్రమో యనఁగ నా విర్భూతదేహప్రభా
న్వితుఁడై దైత్యుఁడు పుట్టి వెల్వడి నభోవీథి న్నిరీక్షించుచున్. 86

తే. అఖలసురమునిసేవ్యుఁడై హంసవాహ, నమునఁ జెలువొందుభారతీనాథుఁ గాంచి
పులకలొదవఁ బ్రమోదాశ్రువులు జనింప,నవని సాగిలి మ్రొక్కి యిట్లని నుతించె.

శా. నీవేదైవము నీవె సేవ్యుఁడవు నీవేలోకనిర్మాతవు
న్నీవే త్రాతవు నీవె దాతవును నీవే సర్వము న్నీకు వే
ఱొవా రెవ్వరు లేరు నాహృదయ మిట్లశ్రాంత మీరీతినిన్
సేవింపన్ గరుణించి నన్నుపవే చిద్రూప లోకేశ్వరా. 88

సీ. పరమేష్ఠి నేఁగోరు వరము లన్నియు దయ నిచ్చెదనంటివి యిచ్చెదేని
నీవు సృష్టించిన నిఖిలభూతములచే నన్యుచేనైన గేహంబులోన
బయటను భూమిని బగలిట రాత్రిట నరసురాసుర మృగనాగముఖ్య
జీవులచేత నిర్జీవులచేతను నశియింపకుండ జన్యంబులందు

తే. నప్రతిద్వంద్వపౌరుష మఖిలలోక, పాలమహిమంబు సర్వాధిపత్య మొసఁగి
నన్ను మన్నింపుమన్న నన్నలువ యన్ని,వరములొసఁగె ముదంబునవానికపుడు.

క. అమరారిఖరాయుధ భే,ద్యము గాకుండఁగ నొసంగు తనువన వాణీ
రమణుఁడు "నఖరాయుధ భే,ద్యము నీతను" వనుచుఁ బలికెఁ దద్దయు వేడ్కన్.

క. అతిదుర్లభ వరములు గో,రితి వన్నియు నిచ్చినాఁడఁ బ్రీతుఁడ నగుచుం
గృతకృత్యుఁడ వని తత్పూ,జితుఁడై యజుఁ డరిగె దివిజ సేవితుఁ డగుచున్. 91

తే. అఖల దిక్పాల తేజంబు లపుడె యాశ్ర,యించి నట్టిలెలుంగు గాన్పించె నౌర
పటికనార్చిన పదివన్నెపసిఁడిగట్టు, రీతి జిగిఁబూనురక్కసి తేనిమేను. 92

క. ఈకరణి వరము లన్నియుఁ, జేకొని హర్షించి దైత్యశేఖరుఁ డనుజ్ఞా
స్వీకరమై పథయించిన, శ్రీకాంతునిఁ గూల్తునంచుఁ జింతించె మదిన్. 93

తే. నగరమున కేగుదెంచిన నారదముని, యతనిసతిఁ దెచ్చియిచ్చి బలారిచేష్టఁ
దెల్ప నప్పుడె యాజ్యాహుతి ప్రవృద్ధ, వహ్నిపలె మండె దైతేయవల్లభుండు.

శా. కానీ వాసవుఁ డెందుఁ బోఁగలఁ డింకం జిక్కె నాచేతిలో
వాని న్వానివధూటిఁ దెచ్చి చెఱపై పంజాలనే లేనిచో
నే నా కశ్యపనందనుండనె బలా యీసాహసం బెంత ల
క్ష్మీనాథాదులఁ జూడుఁ డింకిటను నాచే భంగపాటొందఁగన్. 95

క. రావి ప్రజిత్తి సేనల, రావింపు మటన్న వాఁడు రణజయభేరీ
రావాకులిత బ్రహ్మాండావళిగా బలముఁ గూర్ప నని కుత్సుకుఁడై. 96

సీ. అమరుల గెల్చి మహారాజికుల వ్రాల్చి తుషితుల నొంచి రుద్రుల జయించి
గంధర్వుల నడంచి గరుడుల వారించి వసువుల నడచి భాస్వరుఁ నోడిచి
యాదిత్యుల నలంచి యనిలుల శిక్షించి యక్షులఁ గొట్టి గుహ్యకులఁ బట్టి
విశ్వుల విదళించి విద్యాధరులఁ జించి సాధ్యులఁ దోలి రాక్షసుల నేలి

తే. యురగులను గింపురుషులఁ గిన్నరులభూత
ములను బితరులను బిశాచములను మనువు
లను నృపాలుర నోడించి దనుజనాథుఁ
డతుల దోశ్శక్తి ముజ్జగం బాక్రమించె. 97

తే. కాలనాభుఁడు మొదలైన కనకనయనపుత్రుల కొసంగె దిక్పాలపురవరంబు
లమరములకిచ్చెఁ దక్కినయమరనగర,ములు దనుఁగొలిచిన దానవేంద్రులకునమర.

సీ. వేదోక్తపద్ధతి వెలయంగ యాగంబు లలవరించినసోమయాజులకును
బగఱకు వెన్నిచ్చిపఱవక సంగరక్షోణిఁ గూలినమహాశూరులకును
నన్నదానాంబుదానావనీదానకన్యాదానములు సేయునసఘులకును
న్యాయంబుదప్పక యఖిలభూప్రజలను రక్షింపనేర్చిన రాజులకును

తే. బారలౌకికఫలమై యవారమహిమ, నాహవశతైకయోగ్యమై యలరుత్రిదివ
మాహవశతంబు గావించి యాక్రమించె, సమరవరజేత పూర్వదేవాధినేత. 99

సీ. పచ్చఱాజగతులుఁ బగడంపుఁగంబము ల్మరకతసోపానమార్గములును
వైడూర్యవలభులు వజ్రకవాటముల్ గోమేధికోన్నత కుడ్యములును
బుష్యరాగద్వారములుఁ జంద్రకాంతవేదులు నవమాణిక్య తోరణములు
భావచిత్రంబులు బంగారుబొమ్మలు మేలైనముత్యాల మేలుకట్లు

తే. సాంద్రసామ్రాణిధూపవాసనలు వీచ, పారిజాతప్రసూనబంభ్రమ్యమాణ
భృంగరవములు గలిగి యొప్పెడు సుధర్మఁ, బృథులచింతామణీభద్రపీఠియందు.

సీ. కనకాంగి యపరంజి కాళాంజి ధరియింప సొగసుగా మేనక సురటివిసర
శశిరేఖ వలిపెంపు చల్వపావడ వైవ రంభోర్వసులు చామరములు వీవఁ
దారాసరోజాక్షి తాలవృంతముపూనఁ గర్పూరతిలక బాగా లొసంగఁ
జిత్రరేఖ పసిండి చేగిండి ధరియింపఁ గ్రతుశుల్కమణి పాదుకలు వహింప
తే. ధాన్యమాలిని నిల్వుటద్దంబు సూప, మంజుఘోషాలి వేణి సామ్రాణి వేయఁ
జంద్రకళ చేరి పాదాంబుజంబు లొత్తఁ, బెద్దగొలువుండె దైతేయభిదురపాణి.

చ. గెలిచితి సర్వదేవతలఁ గేశవుఁ డొక్కఁడు దక్క నాతనిం
గెలిచినఁ గాని యీగెలుపు గెల్పుటగా దదియెట్టు లంటిరేఁ
దొలుత వరాహమై యనుజుఁ ద్రుంచు టెఱుంగరె సూడుదీర్పఁగాఁ
గలుగని గెల్పదేల బలగౌరవ మేటికి శౌర్యమేటికిన్. 102

మ. అనుచుం గాలకరాళకాలహర ఫాలా[illegible]లకీలాకులా
శనిలీలాపరిలోలశూలము భుజాగ్రస్థానిఁ గ్రాలన్ మహా
జనలోకంబుల వారుసూచి వలసల్సాగం దపోవాసు లొ
య్యనఁ గేల్మోడ్పఁగ సత్యధాములు జయం బౌనంచు దీవింపఁగన్. 103

మ. బల మెల్లన్ వెనుచిక్క నొక్కరుఁడు శుంభద్బాహుదర్పంబునం
దలుపుల్ వ్రీడఁగఁ దన్ని రక్షిగణముం దట్టించి వైకుంఠవా
సులు చెల్లాచెదరై కలంగఁ బురముం జొత్తెంచు దైతేయరా
ట్తిలకంబుం గని విష్ణుసైన్యము మదోద్రేకంబుతోఁ దాఁకినన్. 104

సీ. ఇల ఱెక్కముక్కాడ నీయకుండిన మోము దెల్లగాఁ జనెఁ బక్షివల్లభుండు
జిఱజిఱఁ ద్రిప్పివైచిన శూల మసిఁబోవఁ దొలఁకు వేడుక సునందుండు దొలఁగె
నడిదంబుచే రేఁకుమడఁగఁ గొట్టిన వికాసము దక్కి కడుస్రుక్కి జరిగెఁ గుముదుఁ
డదరింప నల్వంక బెదరు సేనలతోడ నరిగె విష్వక్సేనుఁ డదటుమాని
తే. సింహనాదంబు చేసినఁ జేవదక్కి, పుష్పదంతాది హరిబలంబులు దలంక
నాకచరవైరి దైత్యారినగరు సొచ్చి, విమలమణిమయ కక్ష్యాంతరములు దాఁటి.
తే. కళుకువిడికెంపురవల చెక్కడపు మేడ, వలపట నెసంగు శృంగారవనములోనఁ
బచ్చఁజీరుసురాలచే మెచ్చుగులుకు, చలువతావుల కెందమ్మికొలని యెదుట.
సీ. నీలంపుఱాల కిన్నెరపారమగఱాల యుగ్గుచప్పరముల నిగ్గులీన
జాళువా పడుకింట చలువఱాజగతిపైఁ గెందమ్మిసత్తావి చందురాల
పచ్చఱాతళుకు చప్పరకోళ్ల సకినెల మంచంబుపై నీవిమ్రానికమ్మ
విరిశయ్యనా నంచగరుల తెమ్మెర గ్రోలి పఱపైన చిల్వారా పఱుపుపైని
తే. ఒసఁగి కుబుసంబు చలువదుప్పటి వసించి, వేతల్పాడల నొరఁగి నవీనభోగ
రత్నకాంతులు వెలుఁగంగ రాణివాస, సతుల సేవలసొక్కు శ్రీపతిని గాంచి. 107

శా. ఔరా వైభవ మింతగోరియును నేలా ముక్తహిరణ్యాక్షుతోఁ
బోరన్వచ్చితి రాకయుండినను నీభోగంబు నిత్యంబుఁగా
దా రాజీవదళాక్ష నన్ గొలిచినం దాళంగదా యింక నీ
శూరత్వం బెఱిఁగించు పాఱకు మటంచున్ గేలిగావించుచున్. 108

శా. ఈలాశూలముఁ గేలఁబూని లయకాలేశానుచందంబున
న్రా లక్షించి రమామనోహరుఁడు దూరంబందె నేనింక నీ
వేళ న్నిన్నిజయింపరాదు పఱవన్వెన్నంటుఁ దోఁబ్రాణముల్
గాలుండుంబలె నేమిసేయుదు నిఁక న్గాలోచితం బెట్టిదో. 109

మ. అని మాయావిజనంబులోపల ఘనుండౌ శౌరి చింతించుచుం
దనలోనుండెడు వానిఁ గన్గొనఁడు ప్రత్యక్షంబు నేగాని యీ
తనినిశ్వాసములందునుందు ననుచుం దోనిల్చె సర్వాత్మకుం
డనపాయస్థితి సూక్ష్మరూపుఁడయి స్వీయాకారము న్మాటుచున్. 110

ఉ. అంతటఁ జేరవచ్చి దనుజాధిపుఁ డొయ్యన శేషశయ్య శ్రీ
కాంతునిఁ గాన కయ్యెడలఁ గన్గొని మూలవడంకుచున్న శ్రీ
కాంతనుభూమినీళలను గన్గొని మీ తెరు వేనురాను మీ
కాంతునిఁ జూపుమన్న నలకామిను లన్న యెఱుంగ మంచనన్. 111

చ. యెఱుఁగక యెందుఁబోవు మఱి యీభువనంబులయందు డాఁగిన
న్వెఱచఱవంగఁ దెచ్చి తెగవ్రేయక పోనె హిరణ్యుఁడంచుఁ
జెచ్చెర నలుమూలలం దుపరిసీమను మంచముక్రిందఁ జూచి ని
న్వెఱ వెలివెళ్లెనో యనుచు వెల్వడె నిందును నందుఁజూడఁగన్. 112

సీ. శంఖచక్రంబులు సడలించువారును వైజయంతిని దీసివైచువారుఁ
గనకాంబరంబులు గడనుంచువారును మకరకుండలములు మాటువారుఁ
గరములు రెండువెన్కకు డాఁచువారును గరిమను దెలిచేల్వఁ గప్పువారు
ధవళాబ్జలోచనద్వయి మూయువారును దమగుడాకేశంబు లిముడువారుఁ
తే. గదియవచ్చిన శ్రీవత్సకౌస్తుభములు, నిందిరయు లే దురంబున నిదిగోఁజూడు
మేను విష్ణుండఁ గానంచు నిందునందుఁ, జెదరి సారూప్యధరులు దప్పించుకొనఁగ.

మ. నగుచుం బట్టణమంతయు న్వెదకి నానాలోకము ల్వారిధు
ల్నగము ల్నిమ్నగము ల్పురంబులు నరణ్యంబు ల్మహాద్వీపముల్
మృగముల్ బక్షులు గోగణంబులును భూమీదేవతాయోగిప
న్నగదేవర్షిగణంబులు న్వెదకి కానన్ లేక విభ్రాంతుఁడై. 114

మ. అనిశంబు న్వెదకంగ సాగితిని బ్రహ్మాండంబులో నేనుజూ
డనిచోటెక్కడఁగాన నెట్టియెడఁ దా డాఁగె న్ముకుందుండు డాఁ

గినఁ గన్పట్టఁడె భానుపుత్త్ర పురికేఁగన్ బోవనీ వైరినో
చ్చిన మీఁదం బగ చెల్లునే యని మదిం జింతించి నిశ్చింతుఁడై. 115

చ. సనకసనందనాదిముని చంద్రు లెదుర్కొని త్రోవ "స్వస్తి తే
దనుజవరేణ్య" యన్న విని తాపసులార జనార్దనుండు నొ
చ్చెను ననుఁ గొల్వఁ డింకిటను జింతితమిచ్చెద నావతండువా
యిన మఱి నీవె కాక యిఁక నెవ్వరటంచు మునీంద్రు లేగినన్. 116

చ. సకలసుపర్వవేణువుల శాంతశిలీముఖధార ద్రుంచి త
త్ప్రకటితకీర్తి మౌక్తికవితానము దిక్కులనుంచి యిట్టు లా
త్మకులము వృద్ధిఁబొందఁగ నుదారభుజాబల మొప్పఁగా హిర
ణ్యకశిపుఁ డేలె స్వర్గము సురాహితదుర్గము గాఁగ నయ్యెడన్. 117

మ. దిగధీశానకిరీటకీలితమణు ల్దెప్పించి జంభాత్మజా
మృగశాబాక్షికిఁ గిల్కుటందియలు సేయించె న్శచీభామినిన్
దిగువండయ్యెఁ బదంబు లొత్త నిజపత్నీవారితౌద్ధత్యుఁడై
పగలంబొందియు సాధ్వు లన్యులను నొవ్వంజూడ రెప్పట్టునన్. 118

సీ. క్రతువులందు "హిరణ్య కశిపవే స్వాహా" యటంచు వేల్తురు సోమయాజులెల్ల
హవవాదులను "హిరణ్యకశిపుప్రీత్యర్థ" మనుచు సంకల్పింతు రవనిసురలు
నమ్రులఁ గని "హిరణ్యకశిపు రక్షతు త్వా" మని దీవించు దజ్ఞజనము
"కరుణాలయ హిరణ్యకశిపో ప్రసీద మే" యనుచుఁ బ్రార్థించు నానార్థిగణము

తే. దనుభజించిన స్వర్గపదంబొసంగుఁ, గొలువకుండిన రౌరవములను ద్రోయు
బ్రహ్మ దీవింపఁ జనుదెంచుఁ బ్రత్యహంబు, హరు తెరువుఁ బోఁడు భిక్షుకుఁ డగుట నసుర.

తే. లచ్చికడకంట వాణినాల్కను వసింప, గిరిజఁ జెఱవట్టకుండునే సురవిరోధి
యర్ధతనువంగనయుఁ గడ మర్ధతనువు, పురుషుఁడై కన్పడ జుగుప్స పొడమెఁ గాక.

సీ. వాన లేదనరాదు వడిఁ బట్టి తెప్పించి పర్జన్యుఁ జబుకులపాలు సేయుఁ
దలనొప్పి యనరాదు ధరలోన నెవ్వారు విఱిచికట్టించు నశ్వినుల నొకటఁ
జిమిడెనం చనరాదు శిఖపట్టి యీడ్చి యగ్నిని నీళ్ళ వైచి త్రొక్కింపఁబంచు
నపమృత్యు వనఁగరా దాగ్రహవ్యగ్రుఁడై శమనుని యుసుఱుగాలమున వైచుఁ

తే. గడమ కిన్నరగంధర్వఖచరసిద్ధ, సాధ్యపన్నగయక్షనిర్జరులఁ జిటుకు
మన్న నడ్డముపట్టించు నసురవిభుఁడు, చండశాసనుఁ డగుట నుద్దండుఁ డగుచు.

సీ. జలకేళిఁ దేలు నచ్చరనెచ్చెలులతోన గగనగంగాతరంగములలోన
వనవిహారము సల్పు వయసువేల్పులజవ రాండ్రతో నందనాభ్యంతరమున
వాహ్యాళి వెడలు నిర్వంక జేజెలు పావడలూన నుచ్చైశ్శ్రవంబు నెక్కి
పురవీథి నేతెంచుఁ దరళాయతాక్షి ముందటనుంచి యైరావతంబుమీఁద

తే. మేరుకైలాససరోహణధారుణీధ్ర, ములనువిహరించు *గంధర్వజలజముఖులఁ
భార్గవాదిఘలనుగూడి పుష్పకారూఢుఁడగుచు, దితిసుతుండెందు నప్రతిహతనిరూఢి.

సీ. నారద సుతిఁగూర్ప నేరవు నీవు తెమ్మని వీణె టింగుటింగునను మీటు
శిఖి హావిర్భాగ మిచ్చిన మెసంగుచుఁ జప్పనున్నది యనుచుఁ బైనుమియవచ్చు
జేరి యాశీర్వదించినసప్తఋషుల గ్రక్కునఁ బల్లకిం బట్టుఁడనుచుఁ బదరు
స్త్రీలుగా నందఱ సృష్టింప రైతి రంచును నుపధాతలఁ జూచి కెలయు
తే. మఱియు నేమైనఁదబ్బిబ్బుమాటలాడు, నంగ మెఱుఁగకకోల్పోవుదునసురవిభుఁడు
గంధగజగామినీముఖకమలగంధ, మహితగంధోత్తమాపాన మత్తుఁడగుచు.

ఉ. నీచెలువంబు నీసొగసు నీసరసోక్తులు నీవిలాసము
న్నీ చతురత్వ మింతయును నిర్జరభర్తకు నేది యాయె లే
చూచితి మెందు లేదు వెఱిచూపులె యెక్కువటంచుఁ దక్కి దో
షాచరుమేనుబాంగ వెలచానలు గూడుదు రిచ్ఛకంబునన్. 124

సీ. ఎచట నెవ్వరుగోర నచటనే వర్షించుఁ బడుగింజలనె పండుఁ బుడమినిండ
నంతగా నెండఁగాయక యుండు భానుండు కళలు వేల్పుల కీయఁదలఁకు శశియు
రత్నాకరుండు దీరముఁ జేర్చు రత్నము ల్వాలితెమ్మెరలు వచ్చు పలసినపుడుఁ
గల్పకాదులు ముజ్జగముల కిష్టములిచ్చుఁ బాకంబు దప్పఁగాఁ బ్రబలుఁ డగ్ని
తే. దుష్టమృగబాధ లపమృత్యుదోషములును
గలుగ వతఁడేలు మూఁడులోకములలోన
ధర్మమునఁ గాదు వానిహస్తమున నున్న
ధర్మమునఁగాని మేదినీధవవరేణ్య. 125

క. సురధాని యేల రక్కసి, సురధానీలీల నముచి సూదనముఖ్యు
ల్దరిదాపెఱుఁగక మేరువు, దరిదాపున గూడి బిగులఁ దహాతహపడుచున్. 126

మ. హరి సర్వాత్మక లోకరక్షక రమాధ్యక్షా సరోజాక్ష కా
తరు లన్మమ్ము దయావిలోకనములన్ దర్శించి రక్షింపవే
యరి శిక్షింపవె యంచు నిద్దురయు నాహారంబు లేకెప్పుడు
న్మొఱపెట్ట న్విని యభ్రరూపహరి యంభోవాహధీరధ్వనిన్. 127

ఉ. నిష్ఠురమౌ తపం బధిక నిష్ఠితవృత్తి ఘటించి దేవతా
జ్యేష్ఠునివల్ల దైత్యపతి శ్రేష్ఠవరంబులు గాంచి సర్వభూ
యిష్ఠమహాగరిష్ఠుఁడయి యెల్లవరిష్ఠుల మేఘవాహన
ప్రష్ఠకనిష్ఠులం గెలిచి బాధలఁ బెట్టు లఘిష్ఠబుద్ధియై. 128

చ. ఎఱుఁగుదు నైన వాని హరియించుటకున్ సమయంబుగాదు ముం
దఱ నిఁకనాకు భక్తుఁడని నందనుబాధలఁ బెట్టినప్పుడే

సతిమునిఁ దైత్యవల్లభుని సంతసుఁ జేర్చెద నిక్కమింతలో
వెఱవకుఁడన్న వేడ్క విను వీథికి మ్రొక్కుచుఁ బోయి రంతటన్. 129

సీ. ప్రత్యర్థిసురరాజ భయములతోఁగూడఁ దళుకులేఁ జెక్కులు పలుచఁబాఱె
మనుజాశనీముఖ మలినసూచకములై కుచచూచుకంబులఁ గూడె నల్పు
వనజాక్షి భక్తివృద్ధినిదర్శనంబయి యనవరతంబు మధ్యంబు బలిసె
ఖలకృత్యములు మందగతిఁ గాంచుననురీతి సమదేభయానంబు జడనువడియెఁ
తే. బతి హరిద్వేషి యితని సంగతి గొఱంత
యనుక్రమంబున రతివాంఛ యలఁతి యయ్యె
గర్భతేజం బనంగ నంగంబు మెఱసె
దివ్యదౌహృదవతికి దైతేయ సతికి. 130

తే. ఆగమపురాణములు విను ననుదినంబు, నంబుజోదరు భావించు నాత్మలోనఁ
బ్రాణసఖులకు ధర్మమార్గములు దెలుపు, జలజలోచన యాపన్నసత్త్వయగుట.

క. ప్రొద్దుల నెల నంతట న,మ్ముద్దియ యనవద్యలగ్నమున మేనిజిగిం
బ్రొద్దుల నెల గెలువఁగనగు, ముద్దుకుమారకునిఁ గనియె మోదము మీఱన్.

తే. తనయలాభంబునకుఁ బ్రమోదంబుఁ గాంచి, కనకకశిపుఁ డొసంగెను గనకకశిపు
ముఖ్యవస్తులు భూదేవముఖ్యులకును, జెఱలువిడిపించె జేజేలచిగురుఁబోండ్ల.

క. జనకుని తొలుతటి పుణ్యం,బున పరసుతుఁ డొదవుగనుక పూర్వపుజన్మం
బున హరిగొలిచిన పుణ్యమె, తనయుండై పుట్టినపుడు దైత్యేంద్రునకున్. 134

తే. అటులుఁ గాకున్నఁ బ్రభవించునపుడె జ్ఞాన
భక్తివైరాగ్యములతోడఁ బ్రభవ మొందు
బాలకుల వింటిమే భూమిపాలతిలక
చెప్పఁ జిత్రంబు ప్రహ్లాదు చిత్తశుద్ధి. 135

తే. ఎందు విందునొ గోవిందనింద దైత్య, మందిరమునందు ననుశంక డెందమంద
రెండుచేతుల గట్టిగా రెండుచెవులు, మూసికొనిపుట్టె దైతేయ ముఖ్యసుతుఁడు.

మ. జననీగర్భ సముద్భవంబయిన విజ్ఞానంబు దీపంబురీ
తిని శూర్పానిలసంగతిం బోలియు [1]నెందేఁగిన లోకవ్రజం
బునకుం దైత్యకుమారు జ్ఞానమతులం బోకెంతయుం రూఢమా
టను దావానల లీలనించె నరిషడ్వర్గాటవుల్ ప్రగ్గఁగన్. 137

తే. అంధకార నిరాకరణాభిరామ
కిరణములతోడ నుదయించు నరుణుకరణిఁ
బ్రశ్రితాజ్ఞానహరణ కారణము లైన
యమల గుణములతోఁ బుట్టె నసురసుతుఁడు. 138

1 నెందే సర్వజీవ వ్రజం.

మ. భళిరా నేఁడు ప్రసంగ సంగతులచేఁ బ్రహ్లాదుఁ గీర్తింపఁగాఁ
గలిగెన్ జిహ్వపవిత్రమయ్యె వినువక్షాణింతుఁ దద్బాల్యచే
ష్టలు భక్తిన్వినువారి కంతటికి విజ్ఞానంబు వైరాగ్యమున్
జలజాతేక్షణుభక్తియుం గలుగు నాశ్చర్యంబుగా భూవరా. 139

తే. డోలికాకేళి సల్పెడువేళ నుపరి, భాగమణిగుచ్ఛమునను దీపంబునందు
దృష్టినిల్పెడు హృదయదేదీప్యమాన, పరమహంసత్వమును మదిఁ బదిల మగుట.

ఉ. పూని కడానిడోలికను బొత్తులలోఁ బవళించియున్ హరి
ధ్యానపరాయణుండు ప్రమదాశ్రులు పూనఁగఁ జూచి నెచ్చెలు
ల్లేనియమోవిపై నగవుదేరెడు గం దడియంట నేల యెం
తేనియు విస్మయంబని గణింతురు గాంతురు మాటిమాటికిన్. 141

క. పొత్తులలోఁ బవళించిన, యుత్తటినూరుపులు నిలువ నంతర్దృష్టిం
జిత్తము హరిహత్తించిన, యుత్తముఁ గనుఁగొన్న దాదు లుంకుదురుమదిన్.

తే. అమ్మ బువ్వఁబెట్టు మనఁ డొకనాఁడైనఁ, గన్నతల్లి పైఁడిగిన్నెలోనఁ
బాలు నన్నమిడిన బత్తితోఁ గృష్ణార్పి, తంబుచేసి మెసవు దైత్యసుతుఁడు. 143

క. రారా ననుఁగనుతండ్రీ, రారా నాముద్దులయ్య రారా యనుచుం
గూరిమిని దల్లి పిలిచినఁ, జేరంగాఁ బోఁడు విష్ణుచింతాపరుఁడై. 144

తే. జనని తోనుండి యిదిగో నాస్వామి వచ్చె, ననుచు డిగ్గనలేచి సాష్టాంగమెఱఁగి
దేవ రక్షింపు మంచు నుతించువాఁడు, గాన మొనరించు నేడుచుఁ గానకున్న.

మ. జనకుం డయ్యలు విద్దె మేది యనఁ గృష్ణా రామ గోవిందయం
చు నటించుం గరతాళవైఖరులతో జోడందియ ల్మ్రోయఁ జ
క్కనిలేఁ జెక్కుల మద్దికాయలరుచుల్ గన్పట్ట బాలేందుఁ బో
లినఫాలంబున రావిరేక గదలన్ లీలావిలాసంబులన్. 146

వ. ఇవ్విధంబున దినదినప్రవర్ధమాన దానవాహిత పదారవిందా నూనధ్యానామృ
తపానంబున దరిదృశ్యమాన ప్రపంచ మంతయు మఱచి విగళితదేహాభిమానుం
డగుచు నున్మత్తుని తెఱంగున స్వేచ్ఛాలబ్ధాశనాచ్ఛాదనుం డగుచు నితరకృ
త్యంబు లుడిగి యాత్మాయత్తచిత్తంబున నవధూతవృత్తిని వర్తిల్లుపుత్రకునిం
గని తత్పితయజనకుండగు కనకకశిపుఁడు చింతాక్రాంతుఁ డగుచు శుక్రకుమారు
లగుచండామార్కులం బిలిపించి యిట్లనియె. 147

క. మునిపుత్రులార నాతన, యునిఁ గంటిరె వీనికేమి యున్మాదంబో
ఘనమగు భూతము పట్టెనొ, వినిపింపుఁడు వీనిమహిమ వింత యటన్నన్. 148

క. దానవనాయక చదివినఁ, గాని వివేకంబు రాదు గావున మేమే
వీనిఁ జదివించి మతిగల, వానిం జేసెద మటంచు వారు దదాజ్ఞన్. 149

వ. ఒక్కసుముహూర్తంబున దైతేయ తనూజాతుని మంగళస్నాతునిం గలధౌత
పరిధానసమేతునిఁ గలధౌత రమణీయమణి భూషణాన్వితునిం గావించి యనే
కశతసహస్ర దైత్య దానవ రక్షోఽసుర కుమారవర్గంబుతో బహువిధతూర్య
ఘోషంబులుం బోరుకలంగ రత్నఖచితకనకమండపాభ్యంతరంబున సకలసురా
సురబల కలకలంబులు సెలంగ విఘ్నేశ్వరపూజామహోత్సవం బొనరించి 150

ఆ. మౌనిపుత్త్రు "లోన్నమశ్శివాయ"యటంచుఁ, బసిఁడిపళ్లెరమునఁ బొసఁగ వ్రాసి
యుచ్చరించుమనిన నోం "నమోనారాయ, ణాయ"యని యెదైత్యనందనుండు.

క. అనిన న్మఱియుం జదివిం, చినయట్లనె చదువ లెస్స శిక్షింపక చె
ప్పినరీతిఁజదువఁడనిగ్రహా, మునకుం దోడ్తెచ్చి శుక్రపుత్త్రకు లచటన్. 152

క. చదివించిరి మునుపటివలెఁ, జదివిన మాటాడ నీకుఁజనునే మాతో
నిదియేమి యనిన మాధవ, పదభక్తుం డనియె మిగులఁ బ్రావీణ్యమునన్. 153

ఆ. అజహరాది సేవ్యుఁ డఖిలలోకేశ్వరుఁ, డచ్యుతుండు గలుగ నన్యదేవ
భజనమేల యనుచుఁ బలికితి మీతోడ, మాఱుపలుక నేను మౌనులార. 154

మ. అనిన న్నీకిది బుద్ధిగాదు దనుజేంద్రారాతి వర్ణింపఁగాఁ
జనునే యీచదువింతయైన వినిన న్నైస్సరించునేఁ నేఁడునీ
జనకుం డాహరిఁ జెప్పునంచు శ్రుతులు న్శాస్త్రంబులు [1]న్గాల్పఁగాఁ
గనవే మానుము వైరిపక్ష మిదియింకన్ దైత్య రాజార్భకా. 155

క. అనుచు బుద్ధులు సెప్పుచు నహరహంబు, నీతిశాస్త్రంబు లెఱిఁగింప నీరజాక్ష
చరణవిన్యస్తచిత్తుఁడై చదివె జ్ఞాని, కర్మమొనరించుగతి ఫలాకాంక్ష లేక. 156

తే. దానవేశ్వరుఁ డొకనాఁడు తనయుచదువు, వినవలయునంచు రప్పించి వినతుఁడైన
వాని నక్కునఁ జేర్చి భావంబు సెలఁగఁ, గనకపీఠికనుంచియిట్లనుచుఁ బల్కె. 157

తే. నీవు చదివినచదువులో నికరమైన, పద్యమొక్కటి చదివి యేర్పాటుగాఁగ
నర్థ మెఱిఁగింపుమనినఁ బ్రహ్లాదుఁ డనియెఁ, దండ్రి వినిపింతు వినుముచిత్తంబునిల్పి.

క. కడివెఁడు పెరుఁగుఁజిలికి ప, ట్టెఁడునవనీతంబు గాంచు తీవిని నేనె
న్నఁడు వేదశాస్త్రములలోఁ, బడసితి నొకసార మసురపాలక వినుమీ. 159

క. అన సారమెఱుఁగనేర్చితె, తనయా యని చుంచుదువ్వి తద్దయుఁ బ్రేమం
బున నేదీ సారాంశము, వినిపింపు మటన్న దైత్యవిభునకు ననియెన్. 160

క. శారీరకాంతివిజితమ, సారము భక్తావనైకచాతుర్యదయా
సారము ఖిలభీకరభుజ, సారము హరితత్త్వ మొకటి సారము తండ్రీ. 161

మ. చలపత్త్రాంచలచంచలంబయిన సంసారంబుసారంబుగాఁ
దలపంజాల నితప్పు సేయుటను గాంతాపుత్త్రసంమోహాశ్రం

1 న్గాల్పఁగా.

ఖలికాడవ్వండ్రు నిబద్ధులై గృహమహాకారానిరోధాప్తినా
కులులౌవారు హరియటంచు విభు నాక్రోశింప మోక్షం బగున్. 162

సీ. అనుమాట చెవినాట నాగ్రహవ్యగ్రుఁడై యసురనాయకుఁడు శుక్రాత్మజులను
గనుఁగొని యాచార్య తనయు లంచును మిమ్ముఁ జాల నెమ్మదినమ్మి బాలకునకు
నీతిశాస్త్రము దెల్పి నిపుణునిఁ గావింపుఁ డని వేఁడుకొనిన మీరటులు సేయు
వారమంచును నాకుమారుఁ దోడ్కొనిపోయి ప్రతిపక్షనుతులైన ప్రల్లదములు

తే. గఱపితిరెయంచు మిగుల మౌర్ఖ్యంబుతోడ, ననిజరీలనదూని దైత్యాధినేత
బ్రాహ్మణుల ప్రేయఁబూనఁ జేపట్టి పట్టి, ఓట్టతన ముట్టిపడ నిట్లు దెలిపె నపుడు.

తే. ఎవ్వఁడు వసించు జనములహృదయతటుల, నట్టివిష్ణుండు శిక్షకుం డఖిలమునకు
నసురనాయక యాపరమాత్మ దక్క, నెవ్వ రెవ్వరిచే సాధ్యు లెన్న ననిన. 164

తే. జగదధీశుండ నైన నాసమ్ముఖమున, వేఱె యొక్కని విష్ణుఁడు విష్ణుఁ డనుచు
మాటిమాటికిఁ దెలిపెద వోటలేక, విష్ణుఁ డన నెవ్వఁడోరి వివేకహీన. 165

తే. అరయ నెవ్వఁడు చిద్రూపుఁ డగుచు వెలయు
జగము లెవ్వనిచేఁ గల్గు సంతతంబు
విశ్వ మెవ్వనిరూపమై వెలయుచుండు
నతఁడు విష్ణుండు పరమేశుఁ డతఁడు తండ్రి. 166

క. ఓరీ శరీర మొల్లవా, యేరా పరమేశ్వరుండు నేనుండఁగ నె
వ్వారిం బరమేశ్వరుఁ డని, సారెకుఁ బలికెదవు బుద్ధి సాలదొ నీకున్. 167

తే. ప్రజలకును నీకు నాకును బ్రహ్మమైన, యట్టి విష్ణుండు పరమేశుఁ డతఁడె ధాత
యాతఁడె విధాత యూరకె యలుగనేల, సుప్రసన్నుఁడ వగుము రక్షోవరేణ్య.

క. అతిపాపాత్ముం డెవ్వఁడొ, మతిహీనుండైన వీని మది నెలకొని యొక్క
సతతం బటుగావున నీ,గతి దుర్భాషలు వచింపఁ గడఁగెన్ బలుచన్. 169

తే. అయ్య వినవయ్య నాహృదయంబునం దె
కాదు నీయందు సకలలోకములయందు
నుండి విష్ణుండు నయ్యె ప్రయోజనములు
దానె గావించు నెపుడు స్వతంత్రుఁ డగుట. 170

క. అనఁబండ్లు గీటి రోషం,బునఁ గన్నెఱచేసి పలలభోజనుఁడు శన
స్తనయుల కొప్పించెం దన,యుని శిక్ష యొనర్ప వారియొద్ద నతండున్. 171

తే. మఱియుఁ గొన్నాళ్లు చదివిన మనుజభోజి
మఱలఁ బిలిపించి యెయ్యది మంచివిద్య
యొకటి వినిపింపుమనిన లోకోత్తరుండు
దెలిపె నిటులని పలుకులఁ దేనె లొలుక. 172

తే. తలఁప నెవ్వనివలనఁ బ్రధానపురుషు,లైరి యెవ్వనివలనఁ జరాచరంబు
గలిగె సర్వనిదానమై వెలయు నెవ్వఁ, డట్టివిష్ణువు సుప్రసన్నాత్ముఁ డగును.

సీ. తుదఁ గెంపుఁచాయలు దొరయని ధవళాబ్జదళముల గేరు నేత్రములతీరు
గరుడపచ్చవిజాతిగా యంచు నిరసించి మెఱయఁగఁ జాలు నెమ్మేనిడాలు
కనుబింబమునఁ బద్మకన్యకన్యాయుక్తిఁ బ్రకటించు నీటిమానికముమించు
దనుసీల భూధరంబునకుఁ గైరికదీప్తి గలుగఁజూపట్టు బంగారుపట్టు
తే. పాలితాంభశ్చరాదన భద్రకుంజ, రోరుకర సూచనాచారు లూరువులును
బ్రబల నామానసంబునఁ బ్రతిఫలించు, శ్రీమనోహరుఁ డెపుడు రక్షించుఁగాత.

మ. అసిన న్భగ్గునమండి దైత్యపతి యాహా యోరి నేనెంత చె
ప్పిన నీమార్గము మానవైతి విఁక నీబింకం బడంగింతు నే
నినుఁ బొసిత్తునె యంచు దైత్యభటుల న్వీక్షించి పుత్రుం డటం
చును గొంచించక వీని నొంచుఁ డిపుడంచు న్మద్ర వాలించినన్. 175

శా. ఓహోహో! యిదియేమియంచు సభలో నున్నట్టి దైత్యాధిపు
ల్హాహాకారమునం గలంగుచును దైత్యస్వామి నేఁ డక్కటా
మోహం బించుకలేక పుత్రునెటుల న్మ్రోత్తించఁ బంచె న్పితృ
ద్రోహం బేటికిఁ జేసె వీఁడని దురుక్తు ల్వల్కుచుం జూడఁగన్. 176

తే. ఊడిగంబులు గావించుచున్న సురలు, విష్ణుభక్తున కిటువంటి వేత ఘటిల్లె
ననుచుఁ గన్నీరు [1]నించుచు నవనతాస్యు, లగుచు నుండిరి యాను గాదనఁగలేక.

శా. ఆవార్తల్విని గుండె భగ్గురన మూర్ఛాక్రాంతయై తల్లి శో
కావేశంబున హాకుమారక మహోదారా శుభాకారకా
నీవీపాటున గోల్తువే యనుచు నెంతేఁ దావిలాపింపఁ ద
ద్రావం బంతిపురంబు నిండికొనె నంతం దైత్యు లత్యుద్ధతిన్. 178

తే. పరశుతోమర ముద్గరప్రాస భిండి,వాల శూలాదిసాధనాళీలు లగుచు
వేలసంఖ్యలు పొడువరా వెఱపులేక, నిట్లనుచుఁబల్కె నాదానవేంద్రసుతుఁడు.

క. మీయెడ నాయెడ మీచే, నాయుధము లయందు నిందిరాధిపుఁ డెపుడుం
బాయం డటుగావున మీ, యాయుధములు నన్ను నొంపవని పల్కుటయున్.

సీ. అడిదంబు జళిపించి మెడమీఁద వైచిన నదిఖణిల్లనుచు రెండయ్యె నపుడు
శూలంబు దిగిచి వక్షోవీథిఁ బొడిచిన ముమ్మొన లొక్కట మురిసిపడియె
గదచేత నొక్కఁడు దంగంబుబిట్టుగ మోదఁ దుత్తుమురయ్యెఁ దోడ్తోడ నదియు
సింగాణికోలలు చేదినఁ దఱచుగా నవియెల్ల విఫలంబు లగుచుఁబడియె
తే. మఱియు నేయాయుధంబులమనుజభుజులు, నొప్పిగావింపఁజూచిన నొవ్వఁడయ్యెఁ
గఱకుసానలఁ గెంపుగాఁగలఁగడాని, చికిలియగురీతి మెఱసె బాలకునిమేను.

1 గన్నీరు గ్రక్కుచు.

తే. దనుజనాయకుఁ డంత నందనునిఁ గాంచి, బాల యీలీల నూరకె జాలిఁ జెంద
నేల యిఁకనైన హరియంచు నెంచకున్న, నభయమిచ్చెదనన్నఁ బ్రహ్లాదుఁ డనియె.

క. తనపేరు దలఁచినంతనె, జననాదిభయంబు లుడుపఁజాలినహరి నా
మనముననుండఁగఁ దండ్రీ, ననుఁ జెందునె యాభయం బనాథునిభంగిన్. 183

క. నావుడు విని యింకనునీ, కావరమడఁగదె యటంచు ఘనరోషమునన్
. దేవారి తక్షకాదుల, రావించి కుమారునిం గఱవఁ బనుచుటయున్. 184

మ. నిజదంష్ట్రాగ్ని సమేధమానవిషవహ్ని జ్వాలికామాలికల్
త్రిజగద్దాహము సేయఁగాఁ గదిసి దైతేయార్భకుం బాదముల్
భుజము ల్ప్రక్కలు బిక్కలుం గఱచె నా భోగీంద్రము ల్లగ్గడన్
భుజగారాతిహయస్మృతి న్మఱచె మేనుం బాలుఁ డాహ్లాదియై. 185

క. అతిముక్తిఁదొమ్మిదికోటులు, నలువదివేలైనతక్షకాదిమహాహు
ల్కఱకుం గోఱలవిషములు, దొఱుఁగఁగనీరీతిఁ గఱచి తూలుచునంతన్. 186

క. పడగలగలరత్నంబులు, గడఁబడనోడలుడుక దంష్ట్రకలు పొడిపొడిగాఁ
గడుబాములకున్ లోనై, గడుసరిపాములుదొలంగఁ గడురోషమునన్. 187

మ. దనుజాధీశుఁడు పంప నంతటను దిగ్దంతావళేంద్రంబులం
గొని డీకొల్పిన దద్గజంబులు మదోద్వేగంబునన్ దైత్యపు
త్రుని దుండంబులఁ జుట్టి రాఁదిగిచి తోడ్తో ధాత్రిపైవైచి త
ద్ఘనవక్షఃస్థలిగ్రుమ్ముచో విఱిగె దంతంబు ల్విచిత్రంబుగన్. 188

మ. అంత న్బాలుఁడు దండ్రిఁ జూచి దనుజేంద్రాధ్యక్షకంటే శచీ
కాంతస్ఫారకఠోరవజ్రతులితాకారంబులౌ సర్వది
గ్దంతీంద్రంబుల దంతముల్విఱిగె మద్వక్షంబునం దిట్టి య
త్యంతాంగద్రఢిమన్ హరిస్మరణమాహాత్మ్యంబుగా నెన్నుమీ. 189

మ. అనినం బాలక యేల ప్రేలెదవు పోరా యెంత నీసత్వమం
చును దిగ్దంతులఁ దియ్యగాఁబనిచి రక్షోవీరులన్ హెచ్చుగా
ననలంబుం దరికొల్పుమంచుఁ బవమానా వీని శోషింపుమీ
వని పంపం దనుజాత్మజుండు శుచియం దారూఢుఁడై యిట్లనున్. 190

సీ. శ్రీమించు గ్రొమ్మావిచిగురు గుంపులు నలుగడఁదోరణంబులు గట్టినట్లు
నిండుపున్నమనాఁటి నెలవిచ్చు చెంగల్వ విరుల మేల్కట్లుగా వించినట్లు
బాలభానుప్రభం బ్రహసించు నరుణాబ్జపత్త్రము ల్పఱుపుగాఁ బఱచినట్లు
తావి గల్గిన బంధుజీవప్రసూనము ల్సేసగాఁ బైసి వర్షించినట్లు

తే. చల్లఁగాఁ దోఁచుచున్నది సకలదిశలఁ, బీనపవమాన జాజ్వల్యమానదహన
కీలజాలంబు లౌష్ణ్యంబు గీలుకొల్పి, తావమొసరింప దింతైన దానవేంద్ర. 191

వ. అనినఁ దదీయవచన రచనాదోహదధూమస్తోమ పోషితరోషదాడిమీతరు పరిపక్వ ప్రసవపత్రనిదర్శ దర్శనారుణ్యంబున బాలుం గనుంగొనుచున్న దను జపాలు న్విలోకించి భృగునందను లమందమృదుమధురసల్లాపంబుల సంస్తుతించుచు నిట్లనిరి. 192

ఉ. ఏమిటికింతకోప మసురేశ్వర నీసుతుఁ డింతెకాని వీఁ
డేమిపరుండె మున్నె ఫలియించెఁ గదా మిషయేల దేవసం
గ్రామమునందె యింక నిటగారణమేమి శమింపఁ జేయుమీ
సామవచోవిశేషముల సాధునొనర్తుము బాలు నిత్తఱిన్. 193

క. నానోపాయంబుల నీ, సూనునకుం బుద్ధిసెప్పి చూచెదమటుగా
దేని హరింతుము మా హే, మానలమునఁగృత్య దెచ్చి యద్భుతలీలన్. 194

క. అసికనకకశిపు ననుమతి, మున బాలునిఁదోడుకొనుచుఁ బోయిరి గేహం
బునకుఁ శుక్రకుమారులు, సెనరున దద్గేహమునను నెలకొనియతఁడున్. 195

క. గురువులు సెప్పినరీతి, న్నిరతముఁ బఠియించు రాజనీతిని మఱియా
గురువులులేనియెడ న్బా, లురకు న్హరిభక్తి వత్సలుండై తెలుపున్. 196

తే. గురువు సెప్పినచదువెల్లఁ గుటిలమనుచు, నెల్లసంసారమును దుఃఖహేతువనుచు
విష్ణుఁడే సేవ్యుఁ డంచును వివిధగతులఁ, దెలిపి లోఁ జేసికొనియె బాలురను దనకు.

తే. ఇటుల బాలుర బోధించు టెఱిఁగిఁ గురుఁడు
దనకుఁ జెప్పిన విబుధారి గినుకతోడఁ
దనదుపట్టికి విషమిడుఁ డనఁగ వారు
నన్నపానంబులను హాలహలము నిడిరి. 198

ఉ. శ్రీమదనంతయంచు నభిషిక్తము సేసి విషాన్న మెల్ల నెం
తేముద మొప్పఁగా మెసవె ధీరుఁడు దైత్యకుమారుఁ డట్టిచో
నేమివికారముం బొరయఁ డెప్పటికన్నను దృప్తిఁగాంచె ను
ద్దామహలాహలం బుదరధామమున న్వసియించె నత్తఱిన్. 199

ఉ. ఆమహిమంబు సూచి దనుజాధిపుఁ డెంతయు భీతచిత్తుఁడై
తామస మేల యింకిటను దైత్యపురోహితులార వీనికిం
కేమిట బుద్ధిరాదు సృజియింపుఁడు కృత్తినటంచుఁ బంప నా
భూమిసుధాశను ల్మఱియు బుద్ధులు సెప్పుచుఁ జేరి బాలకన్. 200

మ. అతిముఖ్యంబు భవత్కులంబు జనకుండన్నం త్రిలోకేశ్వరుం
డతులైశ్వర్యము వేఱె తెల్పనల దేలా విష్ణుసేవింపఁగాఁ
బితృసంసేవ సమస్తలోకపతివై పెంపొందరాదే మహా
క్రతువుల్సేసి జమున్భజింపఁ గనవే క్రవ్యాదచూడామణీ. 201

మ. అనినం దైత్యసుతుండు భూమిసురులారా వంశము న్మఖ్యమా
జనకుండుం బతి మూఁడులోకములకుం దత్సాదేవత ల్గొల్తు రే
నును సేవించెద గారవంబున ననంతుం గొల్వ నద్దన్న మా
నను నాకుం బురుషార్థ దాయకుఁడు శ్రీనారాయణుం డెమ్మెయిన్. 202

చ. అనవుఁడు శుక్రపుత్త్రులు దురాగ్రహమెచ్చఁగ నోరిదుర్మతీ
యనలభయంబు మాన్పి దనుజాధిపు వేడుక నిన్నుఁ దెచ్చి యే
యనువున బుద్ధిచెప్పిన నహంకృతిచే విననొల్ల వింకనో
ర్చిన దనుజేశ్వరుం డలుగుఁ గృత్తి సృజించెద మన్న నవ్వుచున్. 203

క. మీ రెవ్వరు రక్షింపఁగ, మీ రెవ్వరు శిక్ష సేయ మిమ్మును నన్నుం
గారుణ్యంబునఁ బ్రోవఁగ, శ్రీరమణుం డున్నవాఁడు చింతిల నేలా. 204

తే. అనినఁ బ్రహ్లాదుఁ జూచి బ్రాహ్మణులు మాకు
బుద్ధిచెప్పఁగ వచ్చితె పోరడ యనుచు
నలిగి యభిచార హోమంబు లాచరింపఁ
గృత్యజనియించె హారణైక కృత్య యగుచు. 205

సీ. విరియఁబోసిన నల్లవెండ్రుక ల్గాగులలో గిరిగొను మెఱుఁగుఁదీఁగెల ఘటింప
మద్యపానవిఘూర్ణ మానలోచనములు వినువీథి నంగార వృష్టి గురియ
నాజానులంబివక్షోజతాడనములఁ గులభూధరంబులు గూలఁబడఁగఁ
జరణఘట్టనముల సైరింపఁగాలేక మ్రొగ్గ శేషునితోడ దిగ్గజములు
తే. కహకహార్భటి బ్రహ్మాండ కటములగుల, నోట నిప్పులు గ్రక్కుచు సాటిలేని
యుదుటుమీఱంగఁ బ్రహ్లాదుహుంకరించి, లావు చేఁబూని చేతిశూలమున వైచె.

క. వైచిన నదియును నిఖిలా, శాచక్రము గాఁగఁ దాఁకి చక్రిసమేతం
బౌచిన్ని వానిహృదయము, పైచర్మము దూఱలేక భగ్నం బయ్యెన్. 207

తే. అది విలోకించి కృత్తి శోకాత్మ యగుచు
గరలిహరిభక్తుపైఁ బ్రయోగింపఁ దగునె
పాపులార యటంచు నాబ్రాహ్మణులను
దవిలి తపియింపుచును మ్రింగఁ దఱిమికొనఁగ. 208

క. వెఱపింపఁబోయి వెఱచిన, తెఱఁగున దందహ్యమాన దేహులగుచుఁ జె
చ్చెరఁ బరువిడు విప్రులముం, దఱఁగని బ్రహ్లాదుఁడప్డు దయదైవారన్. 209

మ. గరళాహీంద్ర గజాగ్ని వాహముల చేఁ గారింపఁగా వచ్చిన
ప్పురుల న్మైత్రిని గాంతు నేని త్రిజగత్పాలుండ వీవైన నో
హరి సర్వాత్మక విశ్వరూప పరమాత్మా వీరి రక్షింపవే
త్వరగా నంచు నుతింపఁ గృత్తి సనె నంత న్భూసురు ల్వేడుకన్. 210

తే. అర్భకునిఁ జేరి యప్రతిహతబలంబు, నతులితైశ్వర్య పుత్ర పౌత్రాభివృద్ధి
ప్రబల వర్ధిల్లు నీవల్ల బ్రతికినార, మనుచు దీవించి పొగడుచు నవనిసురులు.

మ. చని యాకృత్తి విధానముం దెలుప నాశ్చర్యంబుతో నప్పుడే
తనయు న్బిల్వఁగనంపి దైత్యపతి పుత్రా యిట్టిమాహాత్మ్య మెం
దునుగాన న్మఱి నీకుఁ గల్గుటకు మందో మంత్రమో తెల్పుమా
యనఁ బ్రహ్లాదుఁడు దండ్రితో ననియె నయ్యా లేదనం జెల్లునే. 212

సీ. తాపత్రయాగ్ని సంస్తంభనం బశ్రాంత మదవదంతశ్శత్రు మారణంబు
కమనీయగుణగణా కర్షణం బాజన్మ సంచితదుష్కృతోచ్చాటనంబు
సజ్జనవశ్య మజ్ఞానభూతనివారణము దుర్విషయ విషనాశనంబు
దుఃఖశోషణము సంతోషవృద్ధికరంబు ముక్తికాంతామణిమోహఘుటిక
తే. మొక్కమంత్రంబు నదియును నొకటిరెండె
యక్షరములు పురశ్చరణాదిబహుళ
యత్నములు లేక ఫలియించు నట్టిదెట్టి
దనిన శ్రీహరియను నామ మసురనాథ. 213

తే. ఔషధంబున నొకవింత యౌషధంబు, భక్తితులసీదలంబు శ్రీభర్తపాద
తీర్థమును బానముగఁజేసి దినముసేవ, సేయుదును భవరోగము జీర్ణమంద. 214

మ. అనిపల్క న్నతయోజనోన్నతమహాహర్మ్యాగ్ర సంస్థాయియౌ
దనుజుం డచ్చటనుండి పుత్రకుని గ్రిందం ద్రోఁచినన్ శ్రీహరీ
యనుచున్ వ్రాలెడి విష్ణుభక్తుని రయంబార న్మహీకాంత మె
త్తనిహస్తంబులు సాచి యెత్తె వెఱఁగందం జూచువా రయ్యెడన్. 215

క. అందునఁ గందనినందను, చందము గని దైత్యవరుఁడు శంబరుఁ బనుపన్
బృందారక సందోహా, మందభయప్రదములైన మాయలు వన్నెన్. 216

సీ. వీరదానవకోటి విచ్చుకత్తులతోడఁ బొడుపొడుపొడుమంచుఁ బొదివికొనినఁ
గల్పాంతదీర్ఘ నిర్ఘాతసంఘంబులు ఫెళఫెళఫెళమంచుఁ బెటిలిపడిన
నభ్రంకషంబులై యంభోధివీచికల్ ఘుళఘుళఘుళమంచుఁ గప్పుకొనిన
శాకినీభూతపిశాచ బేతాళము ల్కహకహకహమంచుఁ గదురుకొనిన
తే మఱియుఁ గోటులసంఖ్యలౌ మాయలెన్ని
గనిన వెఱువక హరిహరి యనుచునుండె
బాలుఁ డప్పుడు శ్రీహరివంపచక్ర
కమలపతివచ్చి మాయాంధకార మణఁచె. 217

మ. మాయలు మాయమైనఁగని మానురె యంచును శోషకాఖ్యమౌ
వాయువు నంపఁగా దితిజవల్లభుఁ డత్తఱి శోషకంబు ద

త్కాయముసొచ్చి శైత్యమును గాఢతరోష్ణము సూప నెమ్మదిం
బాయని చక్రితత్పవన పారణజేసెను బాలుఁ డత్తఱిన్. 218

తే. ఎన్ని బాధలు పెట్టిన నన్ని బాధ, లచ్యుతస్మృతిచేతనే యపనయించి
గురుగృహంబున నప్పటికరణి నీతి,శాస్త్రమంతయుఁ జదువ నాచార్యసుతుఁడు.

చ. ప్రమదముమీఱఁ దజ్జనకుపజ్జకుఁ దోడ్కొనిపోయి దానవో
త్తమ మతిశాలియై చదివె దైత్యగురూదిత నీతులెల్ల నీ
కొమరుఁ డటంచుఁ దెల్ప నయకోవిద రమ్మని చేరఁబిల్చి యం
కము పయినుంచి నీతి వినఁగావలెఁ దెల్పు మటన్న నిట్లనున్. 220

చ. చదివితి నీతియందు నొకసారములే దది యప్రయోజనం
బది యెటులన్నఁ దెల్పెద హితాహితభేదము దెల్పునందు నీ
హృదయమునందు నాదు మది నెల్లరయందు ముకుందుఁ డుండఁగా
సదమలనీతి నెవ్వరిక శత్రులు మిత్రులు దైత్యవల్లభా. 221

మ. ఇది వ్యామోహక శాస్త్ర మిందుల ఫలంబేమున్న దీనీతిసం
పదకు న్హేతువుగాదు పూర్వజనన ప్రారబ్ధకర్మంపుసం
పదకు న్గారణ మెన్న నీతిపరుఁ డాపన్నుండుగా మూర్ఖసం
పదల న్మించఁగఁ గాంచవే తెలియదే ప్రత్యక్ష మెవ్వారికిన్. 222

సీ. కామితార్థము లిచ్చు కల్మి గల్గిననేమి దండిశాత్రవులుపై నుండిరేని
దండిశాత్రవకోటి తలలు మెట్టిననేమి భోగపాటవము మైఁ బొదలకున్న
భోగపాటవము మైఁ బొదలియుండిననేమి దేహ మాకల్పంబు దృఢముగామి
దేహమాకల్పంబు దృఢమైనఁదా నేమి కల్పాంతరమున భంగంబుగనుట

తే. తలప నివి దుర్లభంబులు గలిగె నేని, యప్రయోజన మాసించి యలయనేల
శాశ్వతానంద పదకాంక్ష సంతతంబు, హరినిగొల్చుట మేలు దైత్యాధినాథ.

మ. అన దంతావళ బృంహితంబు విని శైలాగ్రంబుపైనుండి పై
కొనుసింగంబు తెఱంగుదోఁపఁ బరుషక్రోధానలాభీల లో
చనుఁడై దిగ్గున గద్దెడిగ్గి సుతువక్షఃపీఠి దన్నెం బదం
బున దైత్యేంద్రుఁడు విప్రజిత్తిమొదలౌ మూర్ఖుల్ విలోకింపఁగన్. 224

తే. తన్ని యంతటఁ బోక యద్దానవేంద్రుఁ, డాగ్రహానల శిఖలచే నఖిలలోక
దాహ మొనరించురీతి నుదగ్రుఁ డగుచుఁ, బలికె నిట్లని భీషణభాషణముల. 225

ఆ. ఓయి విప్రజిత్తి యోయి విధుంతుద, బాలు నాగపాశ బద్ధుఁ జేసి
కడలి వైచిరండు గాకున్న వీని మతంబె యనుసరించు దైత్యకులము. 226

క. అని పంప నిలింపాహితు, లనుకంప యొకింతలేక యాప్రహ్లాదు
న్ఘన నాగపాశబద్ధుని, నొనరిచి గ్రాహోగ్రమౌ మహోదధి వైవన్. 227

మ. దితిజాధీశకుమారశేఖరుఁడు మధ్యేవారిధిం గ్రుంకి యం
దతిశక్తిం బొరలంగ వారినిధి వేలాతీతకల్లోల సం
హతుల న్పూతలమెల్ల నిండిన నిశాటాధ్యక్షుఁ డుద్భ్రాంతుఁడై
యతివేగంబున భృత్యులం బిలిచి సాహంకారుఁడై యిట్లనున్. 228

సీ. తపియింపఁ బోయి తాఁ దపియించె శుచి శోష సేయఁగఁబూని శోషించె గాడ్పు
భేదించు శస్త్రముల్ భిన్నంబులయ్యెను జిలువలు గఱువ దంష్ట్రికలు విఱిగెఁ
బొడిచిన దిగ్గజంబుల దంతములు వ్రీలె మాయలన్నియు మఱుమాయలయ్యెఁ
గుక్షిఁ జొచ్చిన కాలకూటంబు జీర్ణించెఁ గృత్తిక్రృత్యంబు లకృత్యమయ్యెఁ
తే. గాన వీనికి నెందును హానిలేదు, జలధిమధ్యంబులో వైచి శైలతతులు
బైనిఁగట్టింపుఁ డాక్రిందఁబడి సహస్ర,వర్షములకైనఁ బ్రాణముల్ వదలు జడుఁడు.

క. అని పంప భటులు ప్రహ్లా,దుని జలధిన్వైచి పైని దోడ్తో వెయియో
జనములపట్టు మహా హా,ర్యనికాయంబులను గట్టి యరిగిన పిదపన్. 230

సీ. పరుష పన్నగపాశ బద్ధుఁడై పాథోధిఁ బడియును దైతేయబాలకుండు
మధ్యాహ్న వేళ నిర్మల మనోజ్ఞాత్ముఁడై విశ్వప్రపంచంబు విష్ణుఁడనుచు
భావింప నామరూపంబులు నశియించి చిన్మాత్ర మగుచుఁ దోఁచినను దాను
నైక్యమై "బ్రహ్మాహ"మనుబుద్ధి సిద్ధింప నానంద వార్ధినోలాడుచున్నఁ
తే. దనకుఁ దా వీడె నాగబంధములు వారి, రాశి శోషింపఁ గదలె ధరాతలంబు
నంతఁబ్రహ్లాదుఁ డుపరిబద్ధాద్రిచయము, నేల వడిఁద్రోచి వెలుపలి కేఁగుదెంచి.

క. గగనాద్యుపలక్షణముల, జగముం గని భేదబుద్ధి జనియించినచో
నగిప్రహ్లాదుఁడనా యని, జగతీశునిఁ బొగడికొనుచు జనకుసఁ జేరెన్. 232

చ. కనుఁగొని విస్మయంబునను గశ్యప నందనుఁ డోరిదుర్మతీ
యనలములోన వైచితి మహావిష మిచ్చితి మాయవన్నితి
ఘ్నఘనఫణిపాశబంధముల గంధిని ముంచితి నేమిసేసిన
న్ననియెద వింతపొంగఁగ రమాపతికైనను శక్తిగల్గునే. 233

వ. అని రూక్షేక్షణంబుల నాక్షేపించు రక్షకులాధ్యక్షునకుఁ బుండరీకాక్ష భక్తుం
డిట్లనియె. 234

సీ. అతిఘోరతాపత్రయము మానుపుమనుకుఁ జిదుగుమంటలఁ జల్లఁజేయుటెంత
మృత్యుభయంబు వారించు వైద్యున కహిప్రముఖాపమృత్యువు ల్బాపుటెంత
యఖిలప్రపంచమాయ నడంచుమాయావి కిలదైత్యమాయ మాయించుటెంత
విస్తారసంసార విషరాశి దాఁటించు ధీరునకును వార్ధిఁ దేల్చుటెంత
తే. యేలయజ్ఞానమొదవె దైత్యేంద్ర నీకు, విష్ణుచేఁ గానిపను లెల్ల విశ్వమునను
గాననద్దేవుఁగొల్చి మోక్షంబుఁగాంచు,మైహికము తుచ్ఛమంచుఁబ్రహ్లాదుఁడనిన,

నరసింహావతార దండకము. శ్రీనాథపాదారవిందద్వయారాధనాహ్లాదుఁ బ్రహ్లాదు నీక్షించి యక్షీణ రూక్షేక్షణుండై యదాక్షిణ్యవృత్తి న్మహాక్షుద్రుఁడై యోరి దుష్పుత్ర పుత్రుండవే నాకు శత్రుండవే కాక లోకైకజైత్రున్మహాగాత్రు గాంగేయనేత్రు న్మృషాపోత్రియై త్రుంచి యీధాత్రి గైకొన్న దుర్భావుఁడే దేవుఁడంచుం బ్రశంసించె దా దేవుఁడెందుండురా మున్ను కంఠీరవా కుంఠశౌర్యంబుతో నల్ల వైకుంఠముం జేరి వైకుంఠునిం జీరి యుండెందునుం గాన కేతెంచనా త్రుంచనా కన్న నాకన్న నాకాదిలోకంబులం దొక్కఁ డున్నాఁడె శిక్షింప రక్షింపనుద్దక్షుఁడా త్ర్యక్షుఁడైనన్ సహస్రాక్షుఁడైన న్స్వచోధ్యక్షుఁడైన న్మదాజ్ఞన్ బ్రవర్తింపఁగాఁ గానవా గానవాచాలతన్ దేవ గంధర్వ కందర్ప వాణీమణుల్ నన్ను మెప్పించఁగాఁ గాంచవే యెంచవేలా యవేలాస్మదీయ ప్రభావంబు భావంబులో నైన నేమాయ నీమాయ దైవంబు నెందుండు దాఁ జూపరా చూపఱగ్గింపనే డిగ్గన న్నుగ్గుగావించెద న్నీవు సిగ్గొందఁ [1]బగ్గాడుకోనేల నీవేళనో బాలకా యూరకే ప్రేలకన్నన్ బరాకన్న నీకన్న చో నేలనున్నాఁడు విన్నాఁడు తన్నాడు వాక్యంబులన్నేఁడు నేనాఁడులో లేఁడు దైత్యాళి వెన్నాడు మన్నీని నిన్నిట్టె మున్నాడు మన్నీఁడు మున్నాఁడు లేఁడంటివే వాఁడు నిన్నాఁడు కోరాఁడుగాకయ్య యీకయ్య మేలా శుభశ్రీకి మేలా రమేలామనోహారికి న్వైరిసంహారికి న్సౌరికి న్మ్రొక్కవే భక్తికిం జొక్కవే ప్రాజ్యసామ్రాజ్య సంపత్తిచే నిక్కవే కీర్తిఁ బెంపెక్కవే పెక్కువే లేదులంచు న్బవిత్రుండు పుత్రుండు శ్రీమచ్చరిత్రంబుఁ బెన్మక్కుఁ బెంపెల్పఁ గల్పాంతసంకల్పజాతాహితానల్ప భీమస్వనాకల్ప ఢక్కాఢమత్కార ధిక్కార లీలాచమత్కారహుంకారముల్ ఘోరమై మీఱ నోరీ దురాత్మా దురాలాపముల్మాన వేరా నవైరానుభావంబొ నీకు న్స్వభావంబొ జీవంబుపై లేదొ భావంబు నీకంబుజాతాక్షుసాక్షాద్రిపు న్నాటికిన్నాటికిన్ జేటికిన్ ధూర్తవై కీర్తనల్ సేసెదో దుర్మతీ దుర్మదం జేటికి న్నేఁటికిన్ స్నామకాస్థాన మధ్యస్థిత స్తంభగర్భంబునం జూపరా జూపకున్న న్గృపాణంబుచేఁ బ్రాణము న్గొందు నీదేవుఁడావిష్ణుఁ డేలాగు రక్షించునో చూతమంచు న్మహారోషజాజ్వల్య మానేక్షణుఁడయ్యున్ రణారంభ సంరంభ సంభిన్న జంభారిగంభీర కుంభీంద్రకుంభాగ్ర సంభూత ముక్తావళీగుంభశుంభత్సరూఢాగ్రమా మండలాగ్రంబు చేఁబూని దిగ్గంధనాగేంద్రముల్ మ్రొగ్గగా డిగ్గనం గద్దియం డిగ్గి నాళీకనాభాగ్రతః ప్రేషితస్వీయ తేజోవిశేష ప్రభాసూచిరోచిస్స్ఫురద్రత్న పాంచాలికా పాలికా బింబితాశేషకుస్సభాస్తార విస్తారి తాత్మీయ గర్భస్థితాబ్జాక్షతాప్రాప్త సర్వాత్మకత్వోజ్జ్వల త్కాంచన స్తంభముం బూర్వ సంరోపితాశా జయస్తంభ సంభేదనప్రక్రియ న్మించి వ్యాయామ వేళా సునాయాస లీలాకృతాఘాత

1 బ్రజ్ఞాడుకోనేల, ప్రజ్ఞ-పగ్గ.

లోలాయిత స్వర్ణశైలాగ్రసాలాంపతత్పుష్పవృష్ట్యాత్మశక్తి ప్రహృష్టామరో
త్సృష్ట మేఘాభవత్తుష్టియా ముష్టిచే వ్రేయ నంత స్వైరిల్లంచు నత్యంత
కల్పాంత దుర్దాంత తంతన్యమానానిల శ్రేణి దోధూయమానాభ్ర విభ్రా
జితాదభ్ర శుభ్రేతరాభ్రచ్ఛటావిర్భవల్లక్ష్య కోట్యర్బుదప్రేంఖ దుచ్ఛృంఖలా
సంఖ్య పుంఖానుపుంఖీభవ ద్దీర్ఘనిర్ఘాత నిర్ఘోషము ల్మీఱి యత్యుగ్రమై యొక్క
రావంబుపుట్టెన్ ఘళీరంచు బ్రహ్మాండభాండంబు వ్రీలెన్ ఫణీంద్రుండు సోలెన్
గ్రహశ్రేణిరాలె స్సరోజాతజాతుండు తూలెన్ దిగంతేభము ల్గూలెఁ
బ్రాలేయ శైలాది కుక్షీల ముల్సీలె వారాసులింకె న్దినేశుండు గ్రుంకె న్మహే
శుండు గొంకెన్ ధరాచక్రమల్లాడె దిగ్భిత్తి కల్బట్టువీడె న్సురేంద్రాదుల న్మూర్ఛ.
గూడె న్వెలుంగూడ నింబాడెఁ జీకట్లుపై యాడె నానా మహాభూతసంఘంబు
గీపెట్టె విభ్రాన్తులై విప్రజిత్త్యాది దైత్యుల్హలాల్లబ్ధ చక్రాసి కోదండదండాది
నానాయుధోపేతులై జాతసంఘాతులై చెంతకుంజేర నోహో భయంబేటికిం
దాళు మంచున్మహాహార్యధైర్యంబు శౌర్యంబవార్యంబుగా దైత్యవర్యుండు
భాస్వద్గదాదండ మంసంబుపైఁ జేర్చి రూక్షేక్షలం జూడఁగా దాడిత స్తంభ
గర్భంబున న్భగ్గుభగ్గంచుఁ గాలానలజ్వాలిక ల్గ్రిక్కుచున్ దిక్కరి శ్రోత్రము
ల్వ్రీలఁగా సింహనాదంబు గావించుచుం జండబాహాసహస్రోజ్జ్వలాసిక్షుర ప్రాస
బాణాస కౌమోదకీ శంఖచక్రాది నానాయుధంబు ల్దిగంతమ్ములం జిమ్ముచు న్ఘోర
సంహారవేళా ఫణీంద్రాస్య సాహస్ర జంజన్యమానాగ్ని సంజాతసంకర్షణుండో
మహాకాలుఁడో లేక కాలాగ్నిరుద్రుండో సాక్షాన్మహామృత్యువో యంచు
నూహింపఁగా భక్తజాలాఘ శైలౌఘ విచ్ఛేదనామోఘ లేఖాధినాథాసి రేఖా
వళీ చుంకన త్పాదపంకేజ సంకీర్ణహంసావతంస క్రమోత్పాది తాపత్య మత్యా
మహాంగుష్ఠముఖ్యాంగుళీ సంగరంగన్నఖశ్రేణి వీరాభిధాచంద్ర సేనాగ్రణీ
కాహళీ మోహనిర్వాహ జంఘల్ నరాకారహర్యక్ష వక్త్రైకదా సూచనో
త్సాహ సంవర్ణితోద్దండ వేదండశుండాయితో రుద్వయంబు న్స్వకీయోరు
భాగా చిరాద్భావిరక్షః కులాధ్యక్షవక్షః స్థలాసృక్ప్రవాహైక సంసూచకా
భామినీ మేఖలోద్దామ భాస్వత్కటీరంబు నీరేజజన్మస్ఫుటీకార కాసార గంభీర
నాభీప్రదేశంబు నానాబ్జజాతాండ సంవాసముష్టి ప్రమేయోదరంబున్ బహీ
రూఢ హృద్గాఢరోషస్ఫుర త్కౌస్తుభంబు న్మహోదార కాశ్మీరపంకాంక
ముక్తావళీవ్యంజితాగామి దైత్యాంత్రపాళీ మహోరఃస్థలంబు న్మహాబాహు
భోగీంద్రభోగాభ హస్తోజ్జ్వల త్పంచవక్త్రాయమానాంగుళీ జిహ్వికాజాగ్రదు
గ్రన్నఖాగ్రంబులు న్మాంసలాంసోదయాస్తాచలాగ్ర స్ఫురచ్చంద్రసూర్య ప్రతీ
కాశ నక్రోజ్జ్వలత్కుండలంబు ల్మనుష్యాంగ సింహాగనిర్ణేతృ రేఖా స్ఫురత్కంబు
కంఠంబు సద్వేషదోషాచరాధీశ మోషామణీ రత్నభూషావిశేషావళీ జీర్ణపర్ణ

ప్రపాత ప్రభూతప్రవాతోగ్ర లోలాంధరోష్ఠ ప్రవాళంబు సంవ్యావృతాస్యాఖ్య పాతాళగర్తోద్ధితాహీంద్ర శంకావహ ప్రోచ్చలజ్జిహ్వయున్ దానవద్వేషివిద్వేషణశ్లేష హేమస్ఫుర ద్ధూమకేతూజ్జ్వలజ్జ్వాలికాజాల మోముచ్యమానాస్య శశ్వత్పునస్సంవృతా శంకిపార్శ్వస్థలస్థాపిత శ్శ్వేతదండోల్లసద్దంష్ట్రిక ల్వేషకాకోదరీ నాయకాకల్ప శాతోదరీ జన్మహేతుక్షమా భృద్ధరీ సోదరీ భూతరీతిస్ఫురన్నాసికారంధ్రములై వైరి సంహారహేవాకమాగ్నికుండాయమానాక్షులున్భక్తలోకస్తవాకర్ణనస్తబ్ధలీలావహచ్ఛంకుకర్ణంబులుం దారకామార్తికశ్రేణికారంధ్ర కృత్సూచికాగ్రేసరంబుల్స్వపక్షానలజ్జ్వాలికాదాహశంకాశిరస్థాపితామర్త్యధాత్రీధరభ్రాంతిక్రుద్ధేందుకోటీరముస్కీఁగాఁగోటిసూర్యప్రతీకాశ తేజంబుతోడ న్నృసింహుండు మించ న్నృసింహునివ్వీలోకించి కించిద్భయభ్రాంతియు న్లేక నాకారియత్యద్భుతాలోకుఁడై లోకమం దేకడం గాన మీఁజోక యాకార మాకార యాకారము న్మానవాకారమా పైని కంఠీరవాస్యంబు సూపట్టె నీపట్టునం బట్టి వాక్యంబు చేపట్టి తా నిట్టిరూపంబునం దిట్టయై పుట్టెఁ గాఁబోలు వైకుంఠుఁ డిం కెట్టువోవచ్చు నం చట్టహాసంబుతోఁ జండ వేదండ శుండాయుతోద్దండ దోర్దండ భాస్వద్గదాదండముం ద్రిప్పుచుం జేరరాఁగాఁ బతంగేంద్రుఁ డుత్తుంగరోషంబు వాఁగ న్భుజంగంబు లాగించుభంగిన్ నృసింహుండు బాహాసహస్రంబునం బట్టినం జిక్కెఁ దైతేయుఁ డంచు న్సుపర్వాళి వెల్లార్వఁగా నంత దుర్దాంతదోశ్శక్తి మల్లాడి నిర్ముక్తుఁడై సాహసోద్యుక్తుఁడై ఖడ్గఖేటంబులం బూని నీడోద్భవశ్రేణికి న్వాలు శ్యేనంబు చందంబున న్నింగికై చంగునం దాఁటుచుం గ్రిందికిం దూఁటుచుం బ్రక్కలన్ డాయుచు న్మండలాగ్రంబుచే వ్రేయుచుం బట్టరాఁ ద్రోయుచుం దిట్టయై పాయుచుం దర్జనల్సేయుచున్ లోకువల్ రోయుచుం జాలఁబోరాడు దైతేయరాడుత్తముం గాంచి యత్యంతరోషంబుతోడన్ నృసింహుండు గర్వాంధపూర్వామర గ్రాహలోలంబులౌ బాహులుత్సాహముం జృంభితాస్యాంతరాలోచ్చలజ్జిహ్వా చాపల్యముం గ్రోధజాజ్వల్యమానాక్షులుగ్రంబుభీమాట్టహాసంబు హర్షంబు వీరోక్తిగర్వంబు భ్రూభంగలౌల్యం బసూయన్ సునాయాస సంగ్రామయత్నంబు మత్తత్వముం దెల్పఁగా రౌద్రమాకారమౌలీల నిశ్శ్వాస ఝుంఝానిల శ్రేణిచేతం బయఃకుంభి కుంభీర కుంభీనసగ్రాహమీనోగ్రయాదస్సమేతంబులౌ సప్తపాథోధులభ్రంకషోల్లోల కల్లోలమై మించి సప్తాంతరీపంబులం బోలుచున్ దారుణోచ్ఛ్వాస వాతంబుల న్మగ్గుచు స్సంజ్వలద్బాడబజ్వాలచేఁ దెర్లుచుండన్ లలాటప్రవద్ఘర్మతోయంబు దంష్ట్రాస్ఫులింగంబులం జుయ్యి చుయ్యంచు మించుం బొగల్వుట్టఁగా బెట్టుగా నట్టహాసంబు మీఱంగఁ జేరంగ సారంగముం గాంచి లంఘించు వ్యాఘ్రంబు శీఘ్రంబున న్వైన్ను పద్మోద్భవాండంబుపై చిప్ప సోఁక న్సురారాతిపై నేచి

లంఘించి దైతేయునింబట్టి రేయుంబగల్గాని సంజన్ని వేశంబుఁ బాహ్య ప్రదేశంబు
నుంగాక మధ్యస్థమా దేహళిఁ సాంగమామర్త్యరూపంబుఁగంఠీరవాకారముం
గాని సమ్మిశ్రరూపంబుతో భూమి యాకాశముంగాని యూరుద్వయింబెట్టి య
ప్రాణులుం బ్రాణులుంగాని జాగ్రన్నఖాగ్రంబులన్వజ్రి వజ్రంబునం దండి దండం
బునం బాసి పాశంబున న్శూలి శూలంబునం జించఁగా రాని రక్షఃకులాధ్యక్షు
వక్షఃస్థలిం జించిన న్హృత్పుటాపూర్ణరోషంబు పైకుబ్బుచుం గొబ్బునన్ బొమ్ము
పైఁ గ్రమ్ము రక్తంబు హస్తంబుల న్మంచి తామించి లీలాజయశ్రీపయిం జల్లు
కాశ్మీర తోయంబు లేపం దిశావీథులంజల్లుచున్ హృత్పుటి న్నీడ వీక్షించి
ఫాలేక్షణస్ఫూర్తిగన్ పట్టి లాలాటదేశంబున న్రక్తపంకంబుచే బొట్టుగాఁ బెట్టు
చున్ రక్తక్తాగరు శ్రీ విడంబింపఁ గంఠంబున న్మేన నాలేపముం జేయుచుం
బెట్టుగాఁ బొట్టప్రేవు ల్వేసందీసి కట్టల్కతోఁ గంఠహారంబులుం జేయుచు న్మెం
డుగాఁ గండలుం దొబ్బలున్ మాంసమున్ గ్రొవ్వు నొండొంటి రాఁదీయుచుం
జేరికం జేరఁగా లేక యందంద వాచారు నానామహాశాకినీ ఢాకినీ భూత
బేతాళ రింఛోళికిన్ వ్రేయుచు న్వజ్రసారాస్థిపాళిన్ నెటుక్కంచు ఖండించు
చుం బోరిగుగా నించుచున్నంత విభ్రాంతితో విప్రజిత్త్యాదిదైత్యుల్ దలల్వీడఁ
గాఁ బాటి రెండెందునుం గొందఱుం దార్తిఁ బ్రహ్లాదుపార్శ్వంబునం జేరి రక్షః
కులాధ్యక్షుని న్మర్త్యహార్యక్షుఁడై పంకజాక్షుండు శిక్షించె మమ్మింక నక్షీణకా
రుణ్య దాక్షిణ్యవీక్ష న్నిరీక్షించి రక్షింపుఁడంచు న్నుతుల్సేసి యాత్మీయ శౌర్యం
బు ధైర్యంబును న్మీఱఁగాఁ గుంతకాక్షేయ బాణాసముఖ్యాయుధ శ్రేణులం
బూని ద్వేషంబు రోషంబు మీఱం జిగీషం దనుంజేరు దోషాచర వ్యూహ
ముం గానసంబేర్చు కార్చిచ్చులీలన్ ముఖజ్వాలల న్నీఱుఁగావించి మాతంగభం
గంబుగావించి తద్రక్తసిక్తాంగమౌ సింగముంబోలుచున్ దానవాసృగ్వసంతం
బునం బూయు పర్ణ ప్రసూనంబులో నా నఖశ్రేణి రాణింప నుద్యద్దినేంద్రాంశు
సంఘంబులో సాంధ్యరాగంబులో చంచలా జాలమో సుందరీ వల్లులో కంజ
కింజల్క పుంజంబొ సంతప్తసౌవర్ణ దండంబులో నాగ శోణాయమానంబులై
కేసరంబు ల్విరాజిల్లఁగాఁ గొండపై మండు దావాగ్ని విస్ఫూర్తి దైతేయసిం
హాసనాధీశుఁ డై చండరోషంబుతోనుండు జ్వాలానృసింహు న్విలోకింపఁ
గా డాయఁగా సన్నుతుల్సేయఁగా లేక బ్రహ్మేంద్రముఖ్యామరు ల్భీతభీతాత్ము
లై దూరదూరంబున న్నిల్చి రవ్వేళ హర్షంబుతో దేవగంధర్వ కాంతామణుల్
పుష్పవర్షంబువర్షించి రుద్వేలశైత్యంబుతో గంధవద్గంధవాహోర్భుకశ్రేణివీతెంచెఁ
దోడ్తోమృదంగావళీ ధింధిమధ్వానముల్ శంఖఘుంఘున్నినాదంబులున్ భేరి
ధంధం ధణారావముల్ తోరమై మీఱె నాకంబునం దచ్చరల్ నృత్య
వైయాత్యముం గిన్నరు ల్గానచాతుర్యముం జూపి రంత న్విధీశానముఖ్యు

ల్విదూరంబునన్ నిల్చి సాష్టాంగ దండప్రణామంబు గావించి సేవించి
జ్వాలానృసింహ ద్విజిహ్వ భజిష్ణునతాంహ స్తమశ్చక్రసంహార రంహస్స్వ
యంహారి హరిత్తురంగ ప్రభాఝాట పాటచ్చ రోద్యన్మణీ కోటికోటీర
కోటీ నిరాఘాటఘాటీ సమాటీక నాటోపశోభావళీ ఘోటికాక్రాంత జాటీగ
శాటీ నిశాటీ దృఢోరోజపాటీర చర్చాజటాటంక కోటీరశోభా సము
చ్చాటనాటంక పంకేజబంధు ప్రభాబంధురేక్షా కటాక్షాకటాక్షానుకంప క్రియా
శంసితోద్యన్నిలింపారిసంపత్ప్రకంపా జగద్వేషిరక్షః కులాధ్యక్షు నీక్షించి
లోకంబు రక్షించి తింకం గృపావీక్ష మమ్ముం గటాక్షించు రూక్షేక్షణం జేటి
కంచుం బ్రశంసించి యద్దేవుప్రాశస్త్యముం గానఁగాలేక ఫాలేక్షువేఁడ న్విదా
రింతు నేనంచు నత్యుగ్రమహా శారభాకారముం బూని యష్టాంఘ్రులన్ శైల
రాజంబులం జిమ్ముచుం బద్మజాండంబు నిండారి వ్యాప్తవక్త్రంబుతోఁ బైకిలం
ఘింప శంకింపఁగా సింహవైరి న్విదారించె దేవారి వక్షఃస్థలీదారుణోద్యన్నఖా
గ్రంబుల న్మర్త్యకంఠీరవం బంత శ్రీసన్నిధిం జేరి తల్లీ భవద్వల్లభుం డెంతయున్
రోషతంతన్యమానాత్ముఁడై యున్నవాఁ డిట్టివేళం బ్రసన్నాత్ముఁ గావించి యస్మ
ద్భయభ్రాంతి వారించి లోకత్రయీరక్ష గావింపఁగా మీరెగా కింక నెవ్వా
రలున్ లేరటంచుం దనుం బ్రార్థనల్సేయ బ్రహ్మాదులం జూచి కా నిమ్మటంచున్
రమాదేవి నెత్తావిపూబంతికిం గ్రమ్ము భృంగంబులోఁ నాఁగఁ గల్పప్రసూనంబులం
గొప్పయై యొప్పు కీల్గొప్పుక ప్పూవగా వేణికాషట్పదశ్రేణి నెమ్మోము కెందమ్మి
నెత్తావి యేమాత్రమో చూచి రమ్మంచు బంప న్ముఖాంభోజ సద్వాసన
ల్గ్రోలుచుం బోవఁగా లేని చారాళినామీరు ఫాలస్థకస్తూరికా రేఖయుం దాని
రాదాయనంచు న్విలోకించు బాలాళిబృందంబునా రంగులౌ ముంగురుల్
మోము జాబిల్లి గాన న్విచిత్రంబు గాలేడి లోనూని తల్లోచన ద్వంద్వముం
బైనిగన్పించు లీల న్విరాజిల్లు నేత్రంబులుం బెళ్కువాల్జూపులుం జాతినిద్దంపు
కెంపుం దుటారించు కెమ్మోవిపై నందమౌ మందహాసంబు చెన్నొందు క్రొమ్ము
త్తెపుం జెక్కడంపుం బదాఱ్వన్నె బంగారపుం గమ్మగ్రొమ్మించు లేచెక్కుటద్దం
బుల న్నిద్దములూనఁగా జాళువాగిండ్ల పూఁజెండ్ల దాడింబపండ్ల న్విడంబించు
పాలిండ్లపై రత్నహారావళు ల్వ్రేకలింపన్ వలగ్నంబు జవ్వాడ శ్రోణీమణీమేఖలా
కింకిణు ల్మ్రోయఁ జెంగావిమంజీర ముంగొంగున న్వింతఁగాఁ గ్రొత్తఁగా జంట
ముత్తెంబులన్గూర్చు చెల్వౌనఖంబు ల్విలోకించువా రల్పదోర్మేవమాయస్య తత్ప
ద్మమంచున్ సమానింప నింపౌ పదాంభోరుహంబుల్ రణన్మంజుమంజీర శింజా
రవంబుల్ చెలంగన్ జగన్మోహనాకార రేఖావయో రూపలావణ్య శృంగార
లీలా విలాసంబులున్ హర్షరోమాంచము న్మించగాఁ జెంతకు న్వచ్చుచో నాథు
మధ్యంది నాదిత్యకోటి ప్రతీకాశమౌ మోము వీక్షించి యమ్మక్క యీయక్క

జం బెన్నఁడుంగాన నేరీతి నేఁజీరుదుం జేరి యేఁజాడ మాటాడుదుం బిల్చిమాటాడిన న్నాలుమాటాడునో యాడఁడో వేడుకం జూచునో చూడఁడో యంచు నూహించుచు న్దాదృశప్రేమ మున్మున్నుగా దీయఁగా ఘోరమౌ దృష్టి వెన్వెన్కకుం ద్రోయఁగా భీరుభావంబుచేఁ జాల నాందోళితస్వాంత యౌ నిందిరాకాంత నీక్షించి పంకేజగర్భుండు ప్రహ్లాదుని న్వేఁడ నవ్విష్ణు భక్తాగ్రగణ్యుండు మందంబుగా మోడ్పు కెంగేలితో సన్నిధిం జేరి పాదాబ్జము ల్మౌళిసోఁకంగ సాష్టాంగదండప్రణామంబు గావించి శ్రీగంధయోగంబునం జల్లనౌ దత్తైలంబు లీలన్ మహారోషమెల్లం బ్రశాంతంబుగా సుప్రసన్నాత్ముఁడై యానృసింహుండు ముందగ్నితోఁ బోరు కంనమ్మి కెంజాయ సౌగంధికశ్రీవిడంబింపఁ గారుణ్యదృష్టి న్విలోకించి శస్త్రప్రదాన ప్రశస్తాత్మహస్తంబు ప్రహ్లాదు మస్తంబునన్ నిల్పినన్ స్వేదరోమాంచ మోదాశ్రుగాద్గద్యయోగంబు భక్త్యంగనాలింగితత్వంబు మైగాంచి తత్త్వజ్ఞుఁడౌ బాలుఁ డేకాగ్రచిత్తంబుతోడ న్నమస్తే నమస్తే లసద్రత్న మౌళిన్ నమస్తేనమస్తే యనామ న్కృపాళో నమస్తే నిరస్తేంద్రశత్రో ద్వ్యతారే నమస్తే నమస్తేశ నఃపాహి విష్ణో యటంచుం బునర్వందనంబు ల్సమర్పించి లక్ష్మీకళత్రా పవిత్రంబులై పాపవల్లీలవిత్రంబులై చాల చిత్రంబులౌ నీచరిత్రంబులన్ స్తోత్రము ల్సేయఁగా గోత్రపుత్రీకళత్రాదులు న్నేరరన్నన్ సురామిత్రపుత్రుండ నేనెన్నఁ బాత్రుండనే ముక్తికాంతానురక్తి న్విరక్తి న్సుయుక్తి న్భయద్భక్తి గావింతుఁ దద్భక్తికి న్సాటిరా వేజపంబుల్ తపంబు ల్మహాదానముల్ ధ్యానము ల్మౌనము ల్యాగము ల్యోగము ల్త్యాగము ల్కర్మముల్ జేసియు న్నీపదాంభోజ సద్భక్తి గావింపఁగా లేని యావిప్రుకంటెం గృతార్థుండు నీచుండు నీభక్తుఁడైనన్ యథార్థంబు సంతాపరూపంబుచే నగ్నిసంలగ్నమై యన్యలోహంబు శోషించుచుం బైఁడికి న్వన్నె హెచ్చించి తాసీటిలో నాఱు చందంబునన్ నీదురోషంబు దుష్టాసురశ్రేణి ఖండించి కళ్యాణ భూయిష్ఠమైనట్టి బ్రహ్మాండము న్వన్నెవాసింగనం జేసె నింక న్శమింపంగ యుక్తం బటన్నన్ నృసింహుండు హృష్టాత్ముఁడై వత్స నీభక్తికి న్మెచ్చితిం గోరు నీయిచ్చకు న్వచ్చు నర్థంబు నేనిచ్చెదన్ హెచ్చుగా నన్నఁ బ్రహ్లాదుఁ డెంతే వినీతాత్ముఁడై స్వామి యేయర్థముంగోరు వాఁడన్ సమస్తంబు నిత్యంబు శక్రాదిదిక్పాల కైశ్వర్యము లోకైధి దేవద్విషద్యోధభాధాకులంబుల్ నిశాటోన్నతు ల్నీవె వారింతు వట్లౌట నేనేదియు న్వల్లనీవల్లనౌభక్తియే చాలు పోత్రిస్వరూపంబునం ధాత్రికై హేమనేత్రున్ విదారించి నావంచుఁ దామించు రోషంబున న్నాదువాక్యం బసారంబు గావించి నీపైని ద్వేషంబు గావించు గావించుకైనం బ్రియంబు ల్భవన్నామ సంకీర్తనంబు ల్వినుం గొల్తునంచు న్ననుం జాలబాధించు మాతండ్రినిం బాపనిర్ముక్తునింజేయు నాకీవరంబే ప్రియంబన్న

లేనప్పుడో స్వామి హర్యక్ష యోవత్స నిన్ గ్గాంచుటం జేసి నీతండ్రి ముయ్యేడు
వంశంబులంగూడి శుద్ధాత్ముఁడయ్యె న్విచిత్రంబె నీవంటినాభక్తు లేదేశమం దుం
దురో యట్టిదేశంబులందున్న పాపాత్ములుం జాలపుణ్యాత్ములై యాయురారోగ్య
సౌభాగ్యభాగ్యంబులుం గల్గి వర్తింతురంచుం బ్రసన్నాత్ముఁడై యిందిరాకాంత
నంకంబుపైనుంచి లక్ష్మీనృసింహాఖ్యచే భక్తులం బూర్ణకారుణ్య దృష్టింగటాక్షించి
రక్షించుచున్నించె నెల్లప్పుడున్. 236

వ. అంత. 237

శా. ఆదిత్యుల్సుమవర్షముల్గురియఁ దూర్యారావము ల్మీఱ భృ
గ్వాదుల్మంత్రము లుచ్చరింప మణిపీఠారూఢుఁ గావించి ర
క్షోదక్షుండని దైత్యదానవ మహాసామ్రాజ్యమేలంగఁ బ్ర
హ్లాదుం బట్టముగట్టె బ్రహ్మ జగదాహ్లాదంబు సంధిల్లఁగన్. 238

క. ధరణీశ్వర వినిపించితి, నరహరి చరితంబు పావనంబిది నరులె
వ్వారువిన్న వారికొదవు, స్థిరభక్తి[1] చిరాయురిహితైశ్వర్యంబుల్. 239

క. అని శ్రీవైశంపాయన, మునిముఖ్యులు దెల్ప విని ప్రమోదాన్వితుఁడై
జనమేజయుఁ డవ్వలికథ, యనఘా వినవలతుఁ దెల్పు మని యడుగుటయున్. 240

శా. ఆత్మానాత్మ విచారచారుతర మేధాధార ధారాధరై
కాత్మత్వప్రతిపాదన ప్రవణదానా సారసారంగవా
హాత్మంబర్యధినాథ నిర్మలతరవ్యాహార హారస్థగా
రుత్మద్రత్న విభా నిదర్శిత హృదారూఢాచ్యుతాంగప్రభా. 241

క. కవిరాజరాజకృతకృతి, కవిరాజవిరాజితనుత ఖలపథికపురః
కవిరాజరాజసమధని, కవిరాజవిరాజితాస్య కమనీయయశా. 242

పృథ్వి. ఫణాధరపణా స్ఫురద్బహుచిరత్న రత్నప్రభా
రుణారుణవిదారణా రుణభుజా మహాభీషణా
రణాంగణభయానక క్రమజయానక ప్రస్ఫుటా
ఘణాఘణఘణార్భటీదళిత చిత్తవిద్వేషణా. 243

గద్య. ఇది శ్రీరామభద్రదయాభిరామభద్రకరుణాకటాక్షవీక్షాపరిప్రాప్తదీప్తతరాష్ట
భాషాకవిత్వ సామ్రాజ్యధౌరేయసకలవిద్వత్కవిజనవిధేయ ధరణిదేవుల నాగ
నామాత్యసుధాసముద్రసమున్నిద్రపూర్ణిమాచంద్ర రామమంత్రీంద్రప్రణీతం
బైనదశావతారచరిత్రంబనుమహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

౪. నరసింహావతారకథ సమాప్తము.



1 చిరాయుః సుమహితైశ్వర్యంబుల్.



# ౫. వామనావతారకథ.



## పంచమాశ్వాసము.



సత్యాత్మజవాసవి
నాసత్యవిలాసదాన నవ్య[1]నిధి శ్రే
ణీసాపత్న్యాన్వితయము
నాసరయూకృష్ణ పద్మనాభనికృష్ణా ! 1

తే. అవధరింపుము జనమేజయక్షితీశ, శేఖరున కిట్టు లను వ్యాస శిష్యమౌని
రాజయిఁకవామనావతారక్రమంబుఁ, దెలియఁజెప్పెదవినుమని దెలుపఁదొడఁగె.

శా. శ్రీరత్నాకర కన్యకారమణుఁ డారీతిం జగన్మోహనా
కారోదార వధూవిలాసముల రత్నశ్రేణిఁ గన్బఱిమి సొం
పారంగా నమృతం బొసంగ బలియుండై దేవసైన్యంబుతో
స్వారాజన్యుల గెల్చి యేలుకొనియె న్స్వర్గసామ్రాజ్య మున్. 3

మహాస్రగ్ధర. బలదైత్యారాతి వజ్రప్రతిహతతనుఁడై భండనక్షోణిలోనం
గులశైలంబోయనం భంగురుఁడయినబలిం గొంచు బాణాదితత్పు
త్రులు శుక్రాచార్యుఁ జేర్పం దులగనని దయం దోడుతో జీవితంబు
న్గలిగించె న్మంత్రశక్తి న్గలవె గురునిచేఁ గాని కార్యంబు లెందున్. 4

క. బ్రదికినబలి దైత్యేంద్రుం, డెదఁ దనయపజయముఁ దలఁచి యెంతయు వెతచేఁ
గొదుకుచు నిట్లని పలికెం, ద్రిదశాహితగురుని న్యాయనిష్ఠురఫణితిన్. 5

శా. నీకే శిష్యుఁడనయ్యుఁ దుచ్ఛదివిజానీకంబుచేఁ బన్నముం
గైకొంటింగద చాలదే యిదియయే కార్పణ్య మొందింపఁగా
నా కీజీవిత మిచ్చి నాఁడ వపులే నన్నుందలు న్నవ్వఁగాఁ
బాకారాతికి నింటి బంటుగ నొనర్పంజూచితే భార్గవా. 6

మ. అని నమ్రాననుఁడైన దైత్యపతి పల్కాలించి నీకేలజా
లిని జెందంగ వితా జయాపజయ ము ల్లేవా గణింపం జగం

---

1 నదీశ్రేణి.

బున నీవొక్కఁడవే పరాజితుఁడవా పూర్వంబు శక్రాదులెం
దును మీకోడరె మీకె కాదు కలుగు న్లోకాన గెల్పోటముల్. 7

మ. అదియుంగాక రమామనోహరుఁడు సాహాయ్యంబు గావింపఁగాఁ
గదనక్షోణిని గెల్చెఁ గాని సముదగ్రంబైన నీ తేజముం
ద్రిదశాధీశుఁడు సైఁపఁగాఁగలఁడె యెంతేభక్తితో మున్ను నీ
పదముల్ గొల్చుట ముజ్జగం బెఱుఁగదే ప్రహ్లాదవంశాగ్రణీ. 8

మ. విను మీతాతను గన్నతండ్రి హరితో ద్వేషించి నాశంబు గాం
చెను మీతాత సమస్తపూజ్యత వహించె న్వైష్ణవీభక్తిచే
వనధీశానసుతాధినాథపదసేవం గల్గు నిష్టంబు త
ద్ఘనవైరంబున నొందు నంతమిది నిక్కం బంచునూహింపుమా. 9

ఉ. కావున వాసుదేవ పదకంజయుగంబు సమాశ్రయించి స
ద్భావముతో విచారములఁ బాసి యొనర్పుము విశ్వజిన్మఖం
జే విజయంబుగల్గ ఘటియించెద నీకు జగత్త్రయంబున
న్నావుడుఁ దన్మహాధ్వర మొనర్చె బలీంద్రుఁడు శాస్త్రపద్ధతిన్. 10

మ. బలి యారీతి గురూక్తమార్గమున శ్రీభామామనోనాథప
జ్జలజధ్యాన పరాయణుం డయి యొనర్చె న్విశ్వజిద్యాగముం
జ్వలనాభ్యంతరసీమ వెల్వడియె హేమాభీషణాశ్వంబు ప్రో
జ్జ్వలసింహధ్వజ మైనయొక్కరథ మక్షయ్య ప్రభావోన్నతిన్. 11

తే. ఆహవంబునఁ బ్రత్యక్ష మగుచు బలిని
నాహవంబున గెల్చెద నఖిలసురుల
ననుచుఁ దపనీయమయమైన యబ్జసరము
ననుచు వేడుకతో నిచ్చి చనియె నలువ. 12

క. దరమిది నీచేఁజూచిన, దరమొందుబురందరాది దైవతబలము
ల్దరమా పొగడఁగ ననియా, దరమున గురుఁడొసఁగె నొక్క దరముం బలికిన్.

శా. కూష్మాండుండును గూర్పకర్ణుఁడనఁగాఁ గోటిప్రధానాగ్రణు
ల్గూష్మాండోదరు లర్కసన్నిభముఖుల్ గ్రూరక్రుద్ధైకోన్ముఖు
ల్కాక్ష్మీరారుణకాంతివేశ్మ నయను ల్గాలాంతకాకారులు
గ్రాక్ష్మోరక్షస్థలు లేఁగుదెంచిరి యసంఖ్యంబైన సైన్యంబుతోన్. 14

వ. అంత. 15

సీ. మధ్యాహ్న మార్తాండ మండలంబులఁబోలు పదివేల కెంపురా బండికండ్లు
అష్టదిఙ్ముఖములం దష్టాంగములుమించు గొప్పగాంచినవజ్ర కూబరములు
గౌరమాయూరచాకోరగారుత్మతచ్ఛవిఁదనర్చిన లక్షసైంధవములు
గంగాపయఃపాలి గజరాజు గాలిచే వారించుకంఠీరవధ్వజంబు

తే. దివ్యశస్త్రాస్త్రజాలముల్ దీప్తరత్న, ఘంటికాకోటి ఘణఘణల్ గల్గి యంద
మగుచు శతయోజనోన్నతం బైనయట్టి, స్యందనం బెక్కి దైత్యసంక్రందనుండు.
సీ. విబుధ శైలేంద్రంబు విశ్వరూపముచూపె నననొప్పు కాంచనస్యందనములు
ఘనసంఘములు విశృంఖలవృత్తి నడయాడు చెల్వుగాంచినగంధసింధురములు
సంవర్తసమ్మిళత్సప్తార్ణవీతరంగములఁబోలిన తురంగములగములు
కల్పాంతదీర్ఘనిర్ఘాతము ల్పురుషులై వెలసెనో యనమీఱు వీరభటులు
తే. కోటి దశకోటి శతకోటి కోటికోటి, సంఖ్యలనుమీఱి వెంటరాఁ జటులవిక్ర
మక్రమంబున బలి దేవ మర్దనుండు, దైవగంగాతటంబున దండువిడిసి. 17
సీ. ఘనచక్రి చక్రఘర్ఘర రావములకన్న సమదవారణబృంహితములకన్న
రంగదుత్తుంగ తరంగ ఘోషలకన్న రణసముద్భటభటార్భటులకన్నఁ
దతభేరికా ధణంధణనాదములకన్న నమితాన్యతూర్యఘోషములకన్న
వందిమాగధుల కైవారంబు రొదకన్నఁ బ్రబలంపు సబళంపురవళికన్నఁ
తే. జటులమై మించె గీర్వాణసార్వభౌమ, ధైర్యకైతవచక్రాంగధావనోప
దేశదేశికఘనరవా దేశదైత్య, నాథజయశంఖ భుంభుంనినాద మపుడు. 18
చ. అదివిని నంత నిండుకొలువైన సుపర్వవిభుండుగొల్వులోఁ
ద్రిదశులఁజూచి యెవ్వఁడొకొ దిట్టతనంబున బోరు సేయఁగాఁ
గదిసెను శంఖరావ మిది గ్రక్కున లెండనునంతలో ఘన
స్యదమునఁ జేర వచ్చి యొకచారుఁడు మ్రొక్కి వినీతి నిట్లనున్. 19
తే. అవధరింపుము విబుధలోకాధినాథ
యిదిగొ బలి దైత్య విభుఁడు మిన్నేటిచెంత
దండుదిగినాఁడు భండనోద్దండుఁ డగుచుఁ
బ్రతిదళంబుగ సేనలఁ బంపు వేగ. 20
క. అని తెల్పుచున్న వేళం, దను నిలుమని యడ్డగించు దౌవారికులం
గనుగొనక ద్రొబ్బి కొంచుం, దనుజుం డొకరుండువచ్చి దర్పమెల్పరన్. 21
ఉ. ముక్కున గవ్వగుట్టి నిను ముందుగ నీడిచి తెమ్మటంచు మా
రక్కసితేఁడు పంపె వినరా దివిజర్షభ యింక నట్టిటుల్
దిక్కులుసూచిన న్విడువ దేవర వైనను నీకు వెన్కనే
మ్రొక్కెద గాని రమ్మనుచు ముందలఁ బట్టఁగడంగ నుద్ధతిన్. 22
శా. హాహాహా యని వేగలేచి శమనుం డట్టాఁగితన్ ద్రోయఁగా
నోహో హో బలశాలివే యనుచు దైత్యుం డుగ్రుడై చేరి త
ద్బాహాభ్యంతరసీమఁ దన్నిన మదస్తంబేరమంబో యనన్
వాహారాతి హయుండు తూలె జవసత్త్వస్ఫూర్తి వమ్మై చనన్. 28

ఉ. అప్పు డిదౌరయంచుఁ ద్రిదశాధిపుఁ డెంతయు నాగ్రహంబుతో
గుప్పున గద్దె డిగ్గి శతకోటి నిశాటునివ్రేయఁ బూనుఁడుం
గొప్పు విడంగ గబ్బిచను గుబ్బలు గుల్కఁ బదంబు మెట్టియ
ల్చప్పుడుమీఱఁ జేరి శచి చయ్యన నాథుని కేలు పట్టినన్. 24

చ. విడువిడు పట్టరాకు మలివేణియటంచును జాతికెంపురా
కడియపు కేలు ఘల్లురనఁగా విదిలించి సురేంద్రుఁ డల్కతో
జడియక పూవుఁబోఁడి బలశాసన దూతను జంపనీతియే
వెడలఁగ ద్రోయుఁడన్న సురవీరుఁడు నట్లయొనర్చి నివ్వెరన్. 25

చ. గురునిముఖంబు సూచి శతకోటిని నిన్నను మొన్ననోకదా
గురుభుజశక్తియుక్తి బలిఁగూలిచి వచ్చితి నేఁడు వచ్చె నే
వెరవున హెచ్చెనీబలము విక్రమ మన్నను శుక్రసేవచే
దొరకెను వాని తేజమిఁక దుస్సహ మింద్ర దొలంగు మీవనన్. 26

సీ. రంభోరురంభాది గంభీరపుంభావ సంభోగ సంభూతసంభ్రమములు
శృంగార భృంగాళి రంగావితుంగాబ్జ గంగాతరంగావగాహనములు
పారావతారావధీరారి వారావతైరావతారోహ గౌరవములుఁ
బాలానిలాలోల జాలావళీలాస్య లీలావనాలోల ఖేలనంబు
తే. లెటుల విడఁజాలెనొక్కొ దైత్యేంద్రుదాడి
కోడి దివివీడి శచిగూడి యుర్వి సేరె
నడుగు చూపరి జడదారి యొడయ నింటి
కోడి కోడిగములవేల్పు ప్రోడ యపుడు. 27

తే. పరఁగఁగలకొద్ది సురలకుఁ బంచియొసఁగఁ
జాలువృత్రారి యగురాజు మూలఁబడిన
బలితమయ్యె విరోచన ప్రభవ తేజ
మమర గాఢతర స్ఫూర్తి నపనయించి. 28

శా. ఈలాగింద్రునిఁ బాఱఁద్రోలి బలితానేకాతపత్రంబుఁగాఁ
త్రైలోక్యం బటులేలుచుం గృతమరుత్తాప ప్రతాపంబుతో
భూలోకాధ్వర భాగముల్ గొనుచు నంభోజాక్షుసంప్రీతిగాఁ
జాలాజన్నము లాచరించె గుణియై శాస్త్రోక్తమార్గంబునన్. 29

మ. తళుకు న్ముత్తెపుఁ గొల్వుకూటమున సిద్ధాసింగపుంగద్దెపైఁ
గొలువై యుండె సురాసురాదులు కెలంకుల్జేరి సేవింపఁగా
బలిదైత్యుం డొకనాఁడు వైభవమెలర్పం జామరగ్రాహిణీ
కలనిక్వాణ కరాగ్రకంకణఝణత్కారంబు తోరంబుగన్. 30

తే. అప్పుడొక చారుఁ డేతెంచి యసురనాథ
నీకు జయవెట్టుచున్నారు నిఖిలజనులుఁ
గోదవ వల దెందు హిమగిరికూటముసను
గంటి నొక్కవిశేషంబుః గన్నులార. 31

సీ. అతిఘోర గహనమధ్యమున వర్తించుచో మేఘంబులోని క్రొమ్మెఱుఁగు కరణిఁ
జలికాలమున జలాశయమున నుండుచోఁ గొలనిలో రాయంచకొదమపగిదిఁ
గడగిపంచాగ్నుల నడుచక్కి నిలుచుచో లలితమౌపసిఁడి సలాకజోకఁ
బుడమిఁ బాదాంగుష్ఠమున నెలకొన్నచోఁ బాఁదులోలేఁదీఁగె బాగుమీఱఁ

తే. జిలుకవలెఁ గోయిలవిధాన ఫలముపర్ణ
ములు మెసంగుచుఁ గొన్నాళ్లు జలము మొదలు
గ్రోల కిప్పుడు రత్నపాంచాలి లీలఁ
దపము సలిపెడు సురమాత దైత్యనేత. 32

క. అని విన్నవించినప్పుడె, విని చిన్నంబోయె దైత్యవీరుఁడు మదియో
జనచేసి యొకయుపాయము, గని దైత్యులఁ బంప వారు గానిమ్మనుచున్. 33

తే. పరఁగ నిరువదియైదేండ్లప్రాయ మలరు
విప్రుఁగన్నులఁ ద్విజనవిగ్రహములుఁ
గలుగు వేల్పుల రూపము ల్గాంచి తత్త
దుచితవస్త్రాభరణ శస్త్రనిచయ మూని. 34

వ. అంత.

చ. జడనిధి నీవహీనగుణ సంగ మెఱుంగవు హేమచేలికిం
బడుచు నొసంగి దుర్విషము భర్గున కిచ్చితివంచు నవ్వి దా
పడుచు నొసంగె భర్గునకు భాసురకీర్తి హిమంబు పేరిటం
జడిగొనకొప్ప నత్తుహిన శైలముమీఁదికిఁ బోయియచ్చటన్. 35

మ. చరణాంగుష్ఠము నేలనూఁది భుజము ల్సారించి భూరేణుధూ
సరితానీలజటాభరంబు గుదులన్సంధించి మోమెత్తి యం
బరమున్చూచుచు శ్వాసవాయువుల నిర్బంధించి యత్యంత దు
స్తరమైనట్టి తపంబు సేయు నదితిం దర్శించివే మ్రొక్కుచున్. 36

శా. తల్లీ యేల తపంబు చేసెదు నవోద్యానస్థలీ మల్లికా
వల్లీజైత్రము నీదుగాత్రము వనావాసైకపాత్రంబుగా
నిల్లీల న్నొగిలింప నాయమగునే యేపాటిదీనం ఫలం
బిల్లీపాటిని జేరు మోసమగునుమ్మీ దానవు ల్సూచినన్. 37

చ. తనువుఁగృశింపఁ జేయునది ధర్మము గాదని పెద్దలాడఁగా
వినివినియుండి యేటికి వివేకము లేక తపంబు సేయఁ బూ

నిననిను నేమనంగలము నేరము లెంచఁగరాదు గాని యో
జనని యభీష్టమొందుటకు సాధ్వులకుం బతిభక్తి సాలదే. 38

తే. ప్రాణవిభుఁబాసి యతిథిసపర్య ద్రోసి, బంధువులరోసి పుత్త్రులఁబలుచఁజేసి
యట్టిజిగిదీసి యిట్టి కారడవి డాసి, గాసిఁ జెందఁగ నిందేమి గలిగె వాసి. 39

ఉ. అమ్మరొ నిన్నుఁబాసి క్షణమైనను రిక్తగృహంబునందు మే
మెమ్మెయి నుండువార మట నెందఱు గల్గిన నీవులేనిచో
హమ్మది యేల బ్రోద మిపుడాలయసీమకురమ్ము మావిచా
రమ్ముడిగింపు మింపుగను రక్ష యొనర్పుము దీర్పుమాపదల్. 40

క. రోగి దరిద్రుఁడు పరదేశాగతుఁడుం దల్లిఁజూచి యానందించు
న్భోగము భాగ్యము రాజ్య, శ్రీగలవారలకు వేఱె చెప్పఁగవలెనే. 41

క. అని యెన్ని విధంబులఁ దెల్పిననించుక వినకయున్న బెదరించుచు న
ద్దనుజులు భీషణరోషంబున నిజదంష్ట్రికల నగ్గిఁ బుట్టించుటయున్. 42

మ. అమితంబై యదివేఱు వహ్నిగతి దైత్యశ్రేణితోఁగూడ ద
గ్ధము చేసె న్శతయోజనోన్నత మహాకాంతార మంతన్ రమా
రమణప్రేరిత చక్రరక్ష నదితిం బ్రాపింపదయ్యె న్విచి
త్రమె నిష్కారణ వైరికార్తి హరిభక్తక్షేమము న్భూవరా. 43

మ. హరిభక్తాగ్రణి యున్నచోట హరిభాషాధీశరుద్రాదులుం
దురు దుష్టగ్రహరోగ వహ్నిభయముల్ దూరంబులౌ లక్ష్మి సు
స్థిరయై నిల్చు విపద్దశల్ దొలఁగుఁ దద్దేశంబు కాశీగయా
ద్యురుపుణ్యస్థలకోటికెక్కుడనఁగా నొప్పు న్జగద్గేయమై. 44

క. కానం దన నెమ్మదికోల, కానందము మీఱ విష్ణుహంసము సువివే
కానందమ్మున వలిమల, కానం దపమూను నదితి గనియె శుభంబుల్. 45

తే. అదితి యీరీతి దివ్య సహస్రవర్షములు నిరాహారయై ఘోరముగఁ దపంబు
సేయ రక్షోసురేంద్ర దైతేయదానవాళి భీతిలె సురపాళియలరె నంత. 46

సీ. కలిమిచిల్కల కొల్కి గబ్బిగుబ్బలగట్టితన మెఱింగిన యురఃస్థలము మెఱయఁ
గలికి జక్కవపిట్టకవఁగూర్ప విప్పంగ దరమైన కనుదోయి దయదలిర్ప
నసురలచేవంచ యుసుఱులు మెసవంగఁ దూకొను నైదుకైదువులు పొదల
నొఱపైన కటితటి నొఱకువచ్చుపదారు వన్నెదుప్పటి వింత వన్నె మీఱఁ
తే. గమలగర్భేశముఖులిరుగడలనడువ, జయజయధ్వానముల యోగిజనము పొగడ
గరుడవాహనమెక్కి శృంగార మమర, నమరమాతకు శౌరి ప్రత్యక్షమయ్యె.

ఉ. పశ్యలలాటజూటతటపాటలసూచిత రాగచంద్ర స
ద్వశ్యకృతోపగూహనపదశ్రితపన్నఖతారుఁ డభ్ర సా

దృశ్య శరీరుఁ డచ్యుతుఁడు దృశ్యుఁడుగా మును మంది కశ్య పా
దృశ్యవలగ్న యిట్లనినుతించె నిజోచిత వాక్యవైఖరిన్. 48

ప్రాకృతసీసము.

ళచ్ఛిత్థణాహేయ లలి అ హత్థపయోఅ పొమ్మలోఅణలో అపూ అణిజ్జ
ఖఅవర ఆణేఅ గఅరాఅరఖ అ¹ఖ అరఖందు సిఖ అరఅణి ఆస ?
² ఈసరజణఅ మహేసరభ అణిజ్జ దిక్కమజాహా? తెల్లొక్కణాహ
పుణ్ణమి అంకలావణ్ణస్స మందరఖ ఇధరధారఅ కిసణవణ్ణ

తే. భత్తకామి అఫలదాణపారి ఆఅ, యాయయూయ జణఘ్యేఅ యాయరూఅ
వాసుదేవ సఆణంద వణఅణేహ, ³కిత్తణిజ్జణవ హ్మీరఖేఅ? దేఅ. 49

తే. అనుచు నప్రాకృత చరిత్రమైన యదితి, ప్రాకృతోదితవైదగ్ధిఁ బ్రస్తుతింపఁ
బ్రాకృతగుణ వ్యతీతుండు భక్తసులభుఁ, డైన ప్రహ్లాదవరదుఁ డాహ్లాదమునను.

తే. మొలకనవ్వులఁ జికిలివెన్నెలలుగాయఁ, గాయమెంతయుఁబడలెనుగాయటంచు
నతిపవిత్రకరంబున నదితిమేను, నిమిరి నీవాంఛితంబేమి నెలఁత యనిన. 51

క. స్వామివి జగములకంత, ర్యామివి జనములకు జపిత కర్థమొసంగే
సామివి భక్తులకంతిక, గామివి నీ వెఱుఁగనట్టి కార్యము గలదే. 52

క. ఐన న్వినుపించెద విను, శ్రీనాయక మత్తదైత్యసేనలచే నా
సూనులు వసూనులై హరి, సూనుప్రభృతులును దలకఁ జూడంగలనే. 53

క. దితిసుతుల సంహరింపక, యతులితమైనట్టి వారి యైశ్వర్యము నా
సుతుల కొసంగుము చాలును, దితిజులు నాసుతులుగారె దీనశరణ్యా. 54

తే. అనిన నెంతయు మెచ్చి మాయమ్మ వాడు, వదితియనికౌఁగిలించి దైత్యారియనియె
సవతిబిడ్డలయందు మత్సరములేని, యపుడె నీసాటిగలరె యీయఖిలమునను.

చ. తనసుతులం బరాత్మజులఁ దద్దయుఁ బ్రేమఁ దగన్సమంబుగాఁ
గనుఁగొను పుణ్యమూర్తులకుఁ గల్గదు నందనశోక మింక నీ
తనయుఁడనై జనించి బలిదర్పము మాన్చి తదీయలక్ష్మి నీ
తనయులకిత్తు నీతి నయధర్మవివేకము గాఁగ నావుడున్. 56

---

1 ఖందసింఖయరణీయయాస. 2 యాసకజణయ. 3 కిత్తణిజ్జవయహ్మీరఖేయదీయ.

ఛాయ. లక్ష్మీస్తనాధేయ లలితహస్తపయోజ పద్మలోచనలోకపూజనీయ
ఖగవరయానేయ గజరాజరక్షక...........
ఈశ్వరజనక మహేశ్వర భజనీయ...... త్రైలోక్యనాథ
పూర్ణమృగాంకలావణ్యాస్య మందరక్షితిధర ధారక కృష్ణవర్ణ
తే. భక్తకామితఫలదాన పారిజాత, యాయజూక జనధ్యేయ (జ్ఞేయ) యాగరూప
వాసుదేవ శతానంద వనజనాభ, కర్తనీయజనీ.......

క. ప్రతిరోమకూపభాసుర, శతపత్త్రభవాండకోటి సాహస్రుఁడ వీ
వతిలోకచరిత్రుఁడ వే, గతిగర్భమునన్ భరింతుఁ గమలదళాక్షా. 58

మ. అని నన్నీ వనుమాట నిక్క మదితీ యైనన్ రహస్యంబు నీ
కు నెఱింగించెద నాదుభక్తులు విరక్తు ల్యోగసక్తు ల్బుధీ
జనరక్తు ల్పితృభక్తియుక్తులు పరేర్ష్యాముక్తు లాచారవ
ర్ధనయుక్తు ల్సతులు స్మరింతురు ననుం దథ్యంబు సాధ్వీమణీ. 59

ఉ. నీవు సమస్తభూతహితనిర్మలచిత్తవు పుణ్యశీలవుం
గావున నన్నుఁ బుత్రునిగఁ గాంచెద వంచును గంఠమాలికన్
శ్రీ వెలయంగ నిచ్చి దయచే నభయంబు నొసంగి దేవతా
సేవితుఁడై వికుంఠపురిఁ జేరె సరోరుహనాభుఁ డంతటన్. 60

తే. అదితి యింటఁ బయోవ్రత మాచరించి, భర్తృసంగతి సౌఖ్య సంపదలఁ బొదల
నెలమసలె వెల్లజిగి గల్లముల నెదిర్చె, నెలమసలె నెలల్ దొమ్మిది నిండెనంత.

తే. కంజనేత్రుఁడు శుక్లపక్షంబునందు
శ్రవణమున ద్వాదశీదినమున విజయ
యనుముహూర్తంబునందు మధ్యాహ్నవేళ
నదితికి జనించె వామనుండగుచు నపుడు. 62

తే. కురిసెఁ బువ్వులవానలు మెఱసె దిశలు, విరిసెఁ గావిరి దుందుభుల్మ్రోరసె దివిని
దొరసె గంధర్వగాన మచ్చరలయాట, నెరసె జగముల వేడుక ల్బెరసెనంత.

మ. మణికోటీరము నక్రకుండలములు న్మాణిక్యకేయూరకం
కణకాంచీకటిసూత్రహేమవసనగ్రైవేయమంజీరము
ల్మణిభోగాభచతుర్భుజంబులు దగ న్భాసిల్లు లోకైకర
క్షణుని న్వామనుఁ జూచి కశ్యపతపస్యాశాలి హృష్టాత్ముఁడై. 64

క. పటుభక్తి మ్రొక్కి యంజలి, ఘటియించి నుతించె వికచకైరవవేళా
నటధూర్జటిచరణకటా,త్కటక ఫణీంద్రానుకారి గంభీరోక్తిన్. 65

మ. రవికోటిప్రతికోటి తేజము శరద్రాకేందు బింబాస్యమున్
ధవళాంభోరుహ లోచనంబులు సుధాదధ్యన్నహస్తాబ్జము
న్నవలావణ్యవిశేషముం గల నినుం దర్శింతు ధన్యుండనై
శివముల్గంటి దయాచితాంఘ్రియుగళీసేవామనా వామనా. 66

క. అనిపొగడ నీకు మేలగు, జనకా మీయందు రెండుజన్మంబుల నేఁ
దనయుఁడ నైతిని మీదం, దనయుఁడనై మీకు వాంఛితం బొనఁగూర్తున్. 67

తే. అనుచుఁ దనరూపుమాటి యవ్వనజనాభుఁ
డర్భకునిలీలఁ గావుకావనుచుఁ బొర

నెన్ని నేర్చితి ననుఁగన్న చిన్నితండ్రి
యనుచు ముద్దాడుచును దల్లి యక్కుఁ జేర్చె. 68

మ. అలరున్నూనెఁ దలంటు గంధము నలుం గందంబు పన్నీటిచేఁ
జలకంబున్నను జల్వపొత్తులును రక్షారక్ష యుయ్యాల పా
టలు చక్రద్రావుడు లెంతసంతసము పుట్టంజేసె సృష్టిస్థితి
ప్రళయాపాదికి దైత్యభేది కదితీభాగ్యంబు దానెట్టిదో. 69

క. ముజ్జగము లుజ్జగింపని, బొజ్జగదల పాదపద్మముల జిగిజాళ్వా
గజ్జెలు మెరయఁగ పజ్జల, హజ్జలిడుం గుజ్జు తల్లి యానందింపన్. 70

క. విద్దెము విద్దెమటంచు, న్నద్దియ లిరుగేలనూన ముద్దులకొడుకు
న్విద్దెములు సేయుఁ దళుకుం, గద్దఱి చెక్కులను మద్దికాయలు గదులన్. 71

క. ఉపనయనము గలవేలుపుఁ, దపసులు విధిముఖులు రాఁగఁ దనయునకుం దా
నుపనయనము సేయఁగఁ గశ్యపముని సమకట్టె సకలసంభ్రమ మలరన్. 72

మ. అలరుం దావులు ధూపవాసనలు దూర్యారావము ల్పెండ్లిపా
టలు మాణిక్యపుఁ దోరణంబులును గాటంబైన యాపెండ్లిపం
దిరిలో మానులు సుట్టుకొన్న మణివేదిన్ హేమపీఠంబుపై
నలరారెం బితృమధ్య భాగమున మాయావామనుం డయ్యెడన్. 73

సీ. తపనుఁడు సావిత్రి నుపదేశ మొనరింప బ్రహ్మసూత్రము బృహస్పతి ఘటింప
జనకుఁడు పచ్చనున్నని ముంజి మొలఁగట్ట నవని యొసంగఁ గృష్ణాజినంబు
శంబరధారి దండంబు కేలనమర్పఁ బ్రేమతోఁ దల్లి కౌపీన మొసఁగ
పాథోదపద మాతపత్రంబు సవరింప నలినగర్భుఁడు కమండలువు గూర్ప

తే. సప్తఋషులు పవిత్రముల్ శారదాంబ
యక్షమాలికయీయఁ జెల్వయ్యె మిగులఁ
బ్రణతరక్షావిచారి సద్భక్తహృదయ
పద్మసంచారి వామన బ్రహ్మచారి. 74

శా. అక్షీణం బగునట్టికల్మిగల మాయావామనుం డంతటన్
యక్షేశార్పిత పాత్రఁ గైకొని కులాఖ్య ల్సెప్పుచున్ మ్రొక్కి తా
'భిక్షాందేహి' యటంచు వేడ గిరిజాబింబోష్ఠి వెట్టె న్మణీ
భిక్షం బంచల వీక్షణాంచలములం బెంపారు లేనవ్వునన్. 75

తే. అంతఁ గ్రమమున శారద యదితి సప్తఋషిపురంధ్రులు శచియు దిగీశసతులు
వెట్టు బంగారు భిక్షంబు బియ్య మద్రి, పగిది మించె బృహస్పతిభట్టు చెంత. 76

క. తాలిమిమీఱఁగ నెప్పటి, మాలిమితో దేవగురుఁడు మంత్రము దెలుప
న్వేలిమి సేసె మృగాంకుని, మేలిమిగను రక్షయిడె సుమేధుఁడు నుదుటన్. 77

క. రతిపతియహితునిసతి భా,రతి జతయై కంకణము లొరయ ముత్తెపుటా
రతిమెత్తిరి వామనునకు, రతిబోఁటుల పాటతేట తాలుగరంగన్. 78

మ. పరమేశాన పయోజసంభవులు దిక్పాలుర్ క్రమం బొప్పఁగాఁ
బరమాహ్లాదము మీఱ నొండొరులు పైపై నిచ్చుపట్టాంశుకా
భరణశ్రేణులు కేలఁ గైకొని సభాభాగంబున న్నిల్చి సు
స్వరుఁడై దేవగురుండు పీఁడుచదివె న్సర్వాగమ స్ఫూర్తులన్. 79

వ. ఇవ్విధంబునఁ గశ్యపబ్రహ్మ సకలబ్రహ్మర్షి సమేతుండై తనూజాతు నుపనీతుం గావించి దిగంతరాగత శిష్టజన వ్రాతంబుల నభీష్ట మృష్టాన్నంబుల దక్షిణా తాంబూలంబుల సంతుష్టులంజేయుచు మహోత్సవ దినచతుష్టయంబు గడపె నంత. 80

చ. బలి జగదేకదాత యని పల్కుట భూమిసుధాశనోత్తము
ల్పలుక ముదంబుతో విని సుపర్వమనోరథ సాధనోద్యమం
బలర మృపావటుండు బలి యాచనసేయుటకై నివేశము
న్వెలువడె నింక నెవ్వరొరు వేఁడనివారలు వేళవచ్చినన్. 8

తే. కురిసెఁ బుష్పవానలు మెఱసెదిశలు
విరిసెఁ గావిరి దుందుభుల్మొరసె దివిని
దొరసె గంధర్వ గాన మచ్చరలయాట
మెఱసె జగములు వేడుకఁ బొరసె నపుడు. 82

సీ. ఒకవింతహరువైన యూర్ధ్వపుండ్రంబుపైఁ బెట్టినమేధావిబొట్టు దనర
నీలంపుఁదానిగన్నిగలీను సిగగంటు నవరత్నఖచితకుండలము లమర
నవమైన కృష్ణాజినముతున్క మెలిగొన్న ధవళయజ్ఞోపవీతంబు మెఱయ
ముప్పేటఁ బెనఁగొన్నముంజి పచ్చనిగోఁచి వెలిపట్టుపంచయు మొలఁ దనర్ప

తే. మణిపవిత్రము దండకమండలువులు
గొడుగు పావాలు పాత్రిక బెడఁగుమీఱఁ
బసుపుఁబూసిన టెంకాయఁబాణిఁబూని
వామనుఁడు వచ్చె బలి యజ్ఞవాటమునకు. 83

తే. కపటవటు దివ్యతేజః ప్రకాశనంబుఁ, గాంచియప్పుడు విజ్ఞానఘనులు మునులు
లేచి కరములు ముకుళింపఁ జూచి శుక్రుఁ, డసురవల్లభుతోడ నేకాంతమునను.

మ. అదిగోఁజూచితె బ్రహ్మచారివలె దైత్యారాతి యేతెంచె న
త్రిదశాధ్యక్షున కెల్లసంపదలు నెంతే ప్రేమతో నీయఁగా
నదితీగర్భమునం జనించె నితఁడే మర్దింప నీ పీయఁగా
మదిలో నెంచకు మీయనెంచినను సామ్రాజ్యంబు లేదింకిటన్. 85

తే. ఆత్మబుద్ధి సుఖం బిచ్చు నంతకన్న, గురువుసెప్పిన సద్బుద్ధి పరులబుద్ధి

కొఁదవదెచ్చును స్త్రీబుద్ధి కులముఁజెఱచుఁ, గాన నాబుద్ధివిని సిరు ల్గనుము నీవు.

మ. అనినన్ ధర్మవిరోధ మిట్లనుట గాదాచార్య వేదార్థవి
జ్ఞను లేదేవునకుం బ్రియంబుగ నొనర్పంజూతు రశ్రాంతమున్
ఘనయాగంబుల నట్టిదేవుఁ డిట సాక్షాత్కారమై నిల్చి వేఁ
డిన బ్రాణంబులు నిత్తుఁ బ్రాణములకం టెన్ హెచ్చు త్రైలోక్యమున్. 87

క. అఘటనఘటనాసామ, ర్థ్యఘనుం డీశ్వరుఁ డతండు దలఁచినకార్యం
బుఘటింపకున్నె యీలో, నఘహర మగు గీర్తిఁగాంచు టర్హముసుమ్మీ. 88

తే. శిబి దధీచి విరోచను ల్చిత్రముగను, యాచకులకిచ్చి రట యంగ మట్టికీర్తి
యెఱుఁగలేనట్టినాదాన మేమి యనుచుఁ,గుందుచుండుదు నవిదొరకొనదె నేఁడు.

వ. అనిపలుకుచున్న సమయంబున. 90

సీ. వివిధదేశాయాత విద్వన్మిథఃకృతా లఘుశాస్త్రవాదకోలాహలంబు
సవనతత్త్రక్రియా శంక్యపద్రష్టు సాధూత్తరార్పణదక్ష హోతృకంబు
మహిమీవచస్సత్య మహిమజ్వల త్పవిత్రర్త్యక్షీర శిఖిశిఖాక్రాంత నభము
ధూమగంధిల వపాహోమవేళా సర్వజనక్లప్త కరతాళ సంకులంబు

తే. ఖదిరబిల్వాదియూపయుక్తంబు రుక్మ, పక్షపక్షీంద్రచయన విభ్రాజితంబు
నగుచు మించుబలీంద్రుని యశ్వమేధ, యాగశాలకువచ్చె మాయావటుండు. 91

శ్లో. దదాతు లక్ష్మీం తవలోకనాథో, వశంగతేంద్రస్య జగద్ధితస్య
సంప్రాప్తభూరశ్య స్సుత లాభ తాంచ, భవా న్వదాన్యోహి బలే సురాణాం. 92

క. అని యుభయార్థంబుల దీ, వనతోఁ డెంకాయ యొసఁగ వామనుచేఁ గై
కొని బలి పటుని వరాసన, మునునిడి తగనర్ఘ్యముఖ్యపూజ లొనర్చెన్. 93

క. ఒనరించి ధన్యమయ్యెం, జననము పుణ్యుండనైతి సవఫల మొదవె
న్నిను సేవించితి గావున, ననఘా నీవాంఛఁ దెల్పు మది చేకూర్తున్. 94

వ. అనిన దంభడింభకుం డిట్లనియె. 95

సీ. చక్రపాణి జయించి సకలలోకము లేలె ఘనశక్తిని హిరణ్యకశిపుఁడాది
గణనీయసకలసద్గుణరత్నరాశియై యలరారెఁ బ్రహ్లాదుఁ డంచు వెనుక
ద్విజవేషములఁదన్ను వేఁడువేలుపులకుఁ దను వొసంగెను విరోచనుఁడు మున్న
గరుడవాహప్రీతిగా శతక్రతువులు చేసినాఁడవు సర్వజేతవగుచు

తే. ననుచు వామనుఁ డెంచి యో దనుజనాథ, తపము సేయుటకై పదత్రయధరిత్రి
నడుగవచ్చితి యోగ్యుఁడ నంతమాత్ర, మిచ్చి యంపింపుమనిన బలీంద్రుఁడనియె.

మ. అనఘా కల్పమహీరుహోత్తమము డాయంబోయి కారాకు వేఁ
డినజాడ న్నను నేమివేఁడితివి కంటే నాదుసామ్రాజ్యమున్
ధనము ల్ధాన్యములుం దుకూలములు రత్నంబుల్ యథేష్టంబుగా
నొనగూర్తు న్గొను నన్ను వేఁడుజనుఁ డన్యు న్వేఁడఁగాఁ జెల్లునే. 97

వ. అనినఁ జతురవచనరచనాపటుం డగు కుహనావటుం డిట్లనియె. 98

చ. అడిగినవారిఁ జూచిన భయంపడి వెల్వెలఁ బాఱుమోముతో
జడియక యాదరించుచుఁ బ్రసన్నుఁడవై యభిలాష మేమియం
చడుగుచు ముందుగా నడిగినందుల కెచ్చుగ నిత్తునంటి వీ
యెడ నినుఁబోలుదాత గలఁడే త్రిజగంబుల నెంచిచూడఁగన్. 99

మ. అమరారీశ్వర బ్రహ్మచారులకు రాజ్యం బేల కాంక్షించుమా
త్రము భూమిం దయసేయు మేఁదప మొనర్పం బోయెద న్స్వల్పదా
నముచే నేమిఫలం బటంచనకు నానాదానము ల్పాదమా
త్రమహీదానముఁ బోలవందురు సుమీ తర్కంబు లింకేటికిన్. 100

మ. అవనీదాన మహత్త్వముం దెలియలే రంభోజగర్భాదులు
న్వివరింతు న్విను సత్కుటుంబినికిఁ బృథ్వీదానముం జేసిన
న్భవపాశంబులఁ బాసి మోక్షపదవి న్ప్రాపించు హత్యాదిపా
పవిముక్తుం డయి యెట్టి మూర్ఖుఁడును జిత్ప్రావీణ్యమే పాఱఁగన్. 101

తే. విప్రవరునకుఁ దూమెడు విత్తనముల, నేల యొసఁగిన ఫలము వర్ణింతు వినుము
లోకపావని యగు గంగలోనఁ ద్రిదిన, మజ్జనము సేయు ఫల మగు మనుజులకును.

క. చెలఁగుచు నిద్దుము విత్తన, ములనేల కుటుంబి కొసఁగు పుణ్యాత్మునకు
న్గలుగు న్శతహయమేధం, బులు గంగాతటిని జేయుపూర్ణఫలంబుల్. 103

ఉ. పుట్టెఁడు విత్తనంబులకు భూమివిశిష్టున కీయఁజాలు నా
పట్టపుదాతకుం గలుగుఁ బంకజనాభు పదాంబుజంబునం
బుట్టిన యేటిచెంతఁ బరిపూర్ణముగా హయమేధ మాది యై
నట్టి మఖంబులు న్శతసహస్రములు న్ఘటియించు పుణ్యముల్. 104

క. కలదొక యితిహాసం బిం, దులకు న్వినుపింతు వినుము దురితము దొలఁగు
న్గలుగును భూదాన ఫలం, బలఘుతరం బగుచుఁ ద్రిభువ నైకవదాన్యా. 105

సీ. మును బ్రహ్మకల్పంబునను భద్రమతియను విప్రోత్తముఁ డొకండు వేదశాస్త్ర
నిపుణుఁడు గలఁ డాతనికి భార్య లాఱువురు నందను లిన్నూటనలుపదిగురు
గల రతఁ డత్యంత కష్టదారిద్ర్యుఁడై కుడువఁగూడును గట్టఁ గోకలేక
వగనొంది వేసరి వసుమతి దానంబు గావింప కీలేమి పోవ దనుచుఁ

తే. గౌరి కౌశాంబిలోన సుఘోషువలనఁ, బంచహస్తావనిఁ బ్రతిగ్రహించి విష్ణు
భక్తున కొసంగి సకల సంపదలఁ బొదలి, వెనుక మోక్షంబుఁ గనె వింటివే బలీంద్రా.

తే. కాన భూదాన మొనరించుకంటె నధిక
మైన దానంబు లేదు నే నడిగినట్టి
పుడమి మూఁడడుగు లొసంగి భువనమహిత
యశముఁ బుణ్యంబుఁ గైకొనుమన్న నలరి. 107

శా. హేమస్థ్మాధరసుస్థిరుండు బలిదైత్యేంద్రుండు వింధ్యావళీ
హామారత్నము రత్నకుంభజలము ల్వంపన్మహావామన
శ్రీమత్పాదయుగాభిషేచన మొనర్చె న్బ్రహ్మరుద్రాదు లో
హో మేముం గనలేనికీర్తిఁ గనె దైత్యుం డంచుఁ గీర్తింపఁగన్. 108

క. క్రవ్యాద విభుఁడువామన, దివ్య శ్రీపాదపద్మ తీర్థంబు శిర
స్సేవ్యము గావించి బుధ, స్తవ్యమతిని ధారవోయు సమయమునందున్. 109

తే. వామనుఁడు దర్భగిండిలో వారిధార, కడ్డమైయున్న శుక్రుని యక్షిఁ బొడువ
మిట్టిపడి కన్నుపోయిన లొట్టపోయె,ననుచు నవ్వుచుఁ జేసాచియడుగుటయును.

క. క్షమ మూఁడడుగులు బలియు, త్తమభక్తి "సదక్షిణం సతాంబూలం తు
భ్యమహం సంప్రదదేదం, నమమ" యనుచు ధారవోసె నలినాక్షునకున్.111

మ. పెరిఁగె న్వామనుఁడంత దంతిపొడవై పృథ్వీధరం బంతయై
శరదంభోరుహమిత్రశీతకర నక్షత్రగ్రహస్వర్మహ
స్స్ఫురితుండై జనలోక మవ్వలిజగంబు న్సత్యము న్మించుచున్
హరి దంతంబులు నిండి మెండుకొనె నత్యాశ్చర్య మేపారఁగన్. 112

సీ. పద్మరాగప్రభా భాసమానకిరీట మరవిందజాండకర్పరము నొరయ
శతయోజనాయత శతపత్రపత్రజైత్రము లైన విపులనేత్రములు మెఱయఁ
బరిపూర్ణ చంద్రబింబ సహస్రవిస్మృతం బగుమోము మందహాసంబు దొరయ
దశదిగంతవ్యాప్త తతబాహువులు శంఖచక్రాది వివిధశస్త్రములు నెరయ

తే. కవదొనలు నక్రకుండల కౌస్తుభములు
వైజయంతియు లక్ష్మి శ్రీవత్స కాంచ
నాంబరము లొప్ప బ్రహ్మాండ మనెడు భరణిఁ
కస్తురియుఁబోలెఁ దగెఁ ద్రివిక్రమవిభుండు. 113

మ. హరి యీరీతిఁ ద్రివిక్రమాకృతిని బ్రహ్మాండంబునన్ నిండి యా
వరణాంగంబుల సర్వలోకములు మించన్ బ్రహ్మరుద్రాది ని
ర్జరు లగ్గింపఁగ నందముఖ్య సుభటవ్రాతంబు సేవింప దు
ర్భర తేజంబున రాజిలన్ బలి కృతార్థంమన్యుఁ డయ్యెన్ మదిన్. 114

వ. అపుడు. 115

శా. విను: డోహో జనులార విష్ణుఁ డొకఁడే విశ్వాధికుం డాద్యుఁడుం
గనుఁగొన్నారె కదా మహామహిమ మింకన్ భక్తితోఁ గొల్వుఁడీ
యనుచుం జాటుచు జాంబవంతుఁడు సముద్యద్భేరి మ్రోయించుచున్
వినరా నిర్వదియొక్కమా ర్వలగొనెన్ విష్ణున్ విరాడ్విగ్రహున్. 116

మ. అరవిందాయతనేత్రుఁ డంతట నతుల్యంబైన త్రైవిక్రమ
స్ఫురణన్ మించఁ బదాంబుజం బొకటిచే క్షోణీస్థలిం గొల్చి యం

బరమార్గంబున నొక్కయంఘ్రినిడఁ దత్పాదాంబుజాంగుష్ఠశే
ఖరదివ్య న్నఖరంబు సోఁకి పగిలెఁ గంజాతజాండం బొగిన్. 117

గంగావతరణ వచనము. ఈక్రమంబునఁ ద్రివిక్రమ ప్రసారిత వామచరణాంగుష్ఠ నిష్ఠురనఖర శిఖావిఘటిత బ్రహ్మాండ కరండోపరి పరిజనితరంధ్ర నీరంధ్ర నిరర్గళ దనర్గళ మధుర శిశిర పాండుర లఘుతర గురుతర ప్రభావాభరణ బహిరావరణ వారిపూర్ణంబు యోగిమనళికమల సంతత సంచరణంబును లక్ష్మీకుచ శాతకుంభ పూర్ణకుంభ సంభావిత నవపల్లవాచరణంబును నగు హరి చరణంబునం దొరంగి తరంగితంబై రథాంగధర పదప్రక్షాళనంబున నభంగురతరప్రభావంబును లోకైక పావనంబును బ్రహ్మహత్యాది పాపాపనోదకంబు నగుచు నప్పావనోదకంబు కంబుధరచరణాంబుజ మరందంబు చందంబున నంబుధరవర్ణపదనఖ సాంద్రతర చంద్రికలయందంబున దనుజారిపదంబు దిగజాఱి గగనకాయమాన సూనమాలికల పోలికల ముక్తికలకంఠ కంఠీకాకంఠ మాలికలలీల నాలోలవాతూల జాలంబుల బహుధారారూపంబులై సత్యతపోజనమహస్స్వర్లోకవాసి బ్రహ్మబ్రహ్మర్షి సనకాదియోగీంద్ర వైభ్రాజికధ్రువసప్తర్షి శ్రేష్ఠవందితానందితస్తుత స్నాతాంతర్గృహీత కమండలు పరిపూరితంబై గాయమాన గంధర్వగజరాజగామినీగాన ద్రవన్మహేంద్ర నగరచంద్రశాలికా కాంతచంద్రకాంత నిరంతర స్రవజ్జలధారానుగతంబును బరిసరహరిహయపురవర మరకతమణిమయ భవన సురుచిర రుచిరచిత శైవాలవల్లికావేల్లితంబును వలనిశాటపాటన పటుపుటభేదన నాటకశాలికా నటనటదప్సరః కుటిలాలకాపదపుట కరటత్కటక మురజ వాదిత్ర నాదాచ్ఛాదక వలభి పతనవేళా ఘుళఘుళారావసంకులంబును నందనవనపాదపవిటపసంసక్త నిజసలిల కణ ద్విగుణిత కుసుమజాలకంబును విస్మయాకుల ప్రేక్షమాణ గీర్వాణముగ్ధజలజేక్షణా వీక్షణస్నిగ్ధసోసూచ్యమానవలమాన మీన వితానంబును నిర్మలభర్మనిర్మిత నర్మహర్మ్యప్రాంగణ మాణిక్య వితర్దికాశయానానాయక ప్రార్థ్యమాన పురుషాయిత కేళికాననుకూల లజ్జాకుల సభ్రూభంగవిలాస విలోకనోత్తిష్ఠమాన మానవతీ వేణికాహఠాకర్షణ విశ్లథతతఇతఃపతితసహాగతమౌక్తికసూచక తత్తత్పురుహూత కలధౌత శృంగారసౌధ శృంగాహతోత్పతిత జలబిందు సందోహ కందలితమందార కుసుమకోరకాలంకృత నికటతటకందుక కేళికానందబృందారకసుందరీ చికురభారంబును సుగచకోర లోచనారతిశ్రమహరణ నిపుణతరమందానిల సందానితశైత్యంబును జారణస్తూయమానంబును గిన్నర జేగీయమానంబును నిజావలోకనమాత్రసంత్యక్తబలీకృతహృత్తాప సలీలాహృత్తాపస విబుధ ప్రార్థ్యమానంబును నమరావతీపురవరపరిఖాయమానంబును జలకేళికాలోలదివిజకుల పాలికా పాళికా కుచపాళి కాశ్మీర పాళికామనీయక తదీయ సౌర

భ్య ఘుమఘుమాయమానంబును శంఖబుద్బుదవజ్రమౌక్తికకుముదఫేనఖణ్డకర
కాయితతారకావారకంబును నిజనైర్మల్య నిమృష్టనిష్కళంక మృగాంకమణ్డల
గళత్సుధారస ధారాసధారా సంవర్ధమానంబును ఖంజోపరిభాగీరథీపతనవిస్మి
తానూరుసారథిస్తవనీయంబును ప్రణయకలహదూరస్థిత నిజనీరధారాసిక్త
మృదులాంగ సంసక్తదుకూల చేలాంతరపరిదృశ్యమాన కుచలికుచనితంబబిం
బరంభోరువిజృంభమాణావలోకనోత్సుకనాయకదత్త నూతనవసనయాచమా
నవైమానికమానినీ జనజనితసీత్కారమానితంబును నవర్షవర్షప్రకర్షనిదర్శక
వలాహక పదమోచ్యమానంబును నసమయసమయన్నిజజలబిందుతుందిలచా
తకవ్రాతంబునగుచుం దెఱగంటి దొరకువెఱచి తనతనయు వరుణునియింట దాఁ
చి వెలవెలనగుచు మంచుమలనే మంచుగట్టులకుఁ బట్టంబుగట్టెనని నలుజడ్డిగం
బుల బిడ్డనొడ్డారించి బొడ్డుతామర దొడ్డవేల్పు పుడమిదాల్పులకు నేలికవుగమ్మని
కమ్మని కుందనంపుజిగిని దన తేజంబు మెఱయించు జేజేలవిడిపట్టున కభిషేకం
బుచేసిన తెఱంగునఁబసిఁడకొండ తుదను బదివేలయోజనంబుల పఱపున నున్న
యన్నలువపట్టణంబునఁ బోరునం దొట్టిపట్టు సాలక నలువ నలుమోములందు
వెడలునలుతొలిపల్కులనలువున నలువాకిళ్ల నలుదెఱంగులై వస్వోకసారాది
దిక్పాలకపురంబు లొరసికొని వెలువడి తనవడి బెండువడి బెడబెడమని దొరలి
పడు పెదపెదగుండ్లచప్పుడుల కులుకుచప్పుడెడనెడఁబర్వులిడుజంట నలుహజ్జ
లమెకంబుల నెఱుఁగక తోడంబఱచు తెఱనొరిమెకంబులఁ గాన వెనుదవులు
గొరులతోడనరుగు మువ్వన్నె మెకంబుల నంటిపాఱు నొంటికొండ్ర సందునంబడు
దున్నల పిఱుందం జనునెలుఁగులబలగంబునకుఁ జంగుచంగునం దాఁటు కన్నె
లేళ్ళ కందండ నడ్డంబగుచుఁ గోనలలోనఁ జిగురువిలుకాని కేళిందేలుచు
నదరిపాటునం జూచి యదరిపడి లేచి తమతమ క్రొత్తముత్తియపుఁ జెఱుఁ
గులచెంగావులఁ గటీతటంబుల నొకకొంగు పచ్చినునుగోటి తాఁకులం జిలుప
చిలుప నెత్తురులుగ్రమ్ము గుత్తంపుపలిగుబ్బచన్నుల నొకకొంగు నవరించి యఱ
జాఱు క్రొవ్వెదలు పువ్వులవాన గురియఁ గొనుజడియ బెళుకుచూపుల బెగడు
కోడెబేడిసలబిత్తఱంపుటూర్పుల మృగనాభిపరిమళంబులు గుప్పళించుచు బలి
తంబులై మెలఁగు గిలుకు మట్టియల రొదలతోఁ గడలకుంజని మును తాము
కడలనిడిన తొడవులం దా లోఁగొనిన నర్పితంబులుసేయు నెయ్యంపు కర్పూర
గంధులనేర్పులకు నగుచుఁదచ్చునలాడు బృందారకకుమారులమందహాసరుచికంద
ళంబులతో సందడించుచుఁ బ్రస్రవణఝర్ఝరనిర్ఝరంబులం బ్రవృద్ధం బగుచు
గిరిశాలింగనసంగత కుంకుమపంకంబునఁ బొంకంబగు నకలంకధాతురాగంబుల
జాజువారుచుం గమలకల్హారకైరవ కువలయకోకనదాదికుసుమ సౌరభలోభ
చంచలచంచరీకచక్రాంగచక్రవాకఝుంకార క్రేంకార చంకనత్సరోవరంబులఁ

గళిందకన్యకాసరస్వత్యాదినదుల నెచ్చెలులంబోలెఁ గల్వుకొనుచు వాహంబు తెఱంగునం దుముకుచు వజ్రశైత్యంబునం గొండలుం దెగఁబాఱుచు మతంగ జంబు భంగిఁ గర్పూరకదళికాకాంతారంబుల భంగించుచు భూవల్లభుశేవం బ్రతికూలతరుల నిర్మూలించుచుఁ బలిత తరు శాఖల నున్నతమ్ముం జుట్టుకొను ప్రవాహగతసర్పంబుల కుత్తుకలు రెండుచేతులం గట్టిగాఁ బట్టికొని బిట్టుల్కి చూడంజాలక మార్మొగంబులు వెట్టు శాఖామృగంబులం గని కిలాకిల నగుచు మార్గగండోపలంబులపై వసియించు చెంచుమించుఁబోఁడుల వెనుకమర్లుగా వచ్చి యదరిపాటున భుజంబులువట్టి త్రోయు తెఱంగున వెఱపించు చెంచునా యకుల నదలించుచుఁ గడువడినడరు బెడబెడలకు జడిసి కడలకు నిగుడ నక్కొం డగుండులంబడఁదివియుచు దను గనుంగొనిన వినిన నంటిన సీకరములు సోఁకిన పై తెమ్మెరలు దొరసిన మాత్రంబున భూతప్రేతపిశాచ శాకినీఢాకినీకూశ్మాండాది గ్రహంబులు దమతమ విగ్రహంబులు మాని మానితవైమానికరూపంబులు పూని ధగద్ధగితమణి గణస్థగిత కిరీట కటక కేయూరహారాది సురుచిరాకల్పం బులు కల్పప్రసవ దామంబులు కనకాంబరంబులు దివ్యచందనానులేపనంబులు రతిమనోహర మనోహరాకారంబులు గలిగి దివ్యతర తేజంబులు నిగుడఁ దెగబారెఁడు కీల్జడలుం దొగతేనినగు మొగంబులు బెగడు బేడిసలంబోలు వాలుగన్నులు నిగనిగని జిగిమోవిమానికంబులు మగఱాలనేలుపలు వరుస బిగిగుబ్బచన్నులు మృగరాజమధ్యంబులుఁ జిగురుటడుగులుఁగలిగి చిలుకతేజినజీరుని చిలుకుటమ్ములు ముద్దుఁజిల్కు తెఱగంటి చిల్కలకొలుకులు వేనవేలు గొల్వ భాసమాన రవికరావమానకరణ దురభిమాన మణిమయవి మానారూఢులై యచ్చరమచ్చెకంటు లిరుకెలంకుల నకలంకరత్నకంకణ క్రేం కారమ్ము లొలయ వింజామరములు వైవ రంజిల్లుచు నంజలిబంధంబులతో నుతు లు సేయుచుఁ గొంతదవ్వు వెంబడి నిగిడి దివంబునకరుగ నట్టిక్రమంబుననే నిజ సలిలాకృష్టధరాతలపురాజననాంతర ప్లుష్టశరీరనరకనివిష్ట దుష్టజనంబులు యమా దులకాశ్చర్యకరు లగుచుం బుణ్యలోకంబుల కేఁగ సకలపుణ్యనదీనదంబుల దురి తాపహాకీర్తిమూర్తీభవించి తన్నుఁజేరు తెఱంగున రంగగుచుఁ జక్రాంగంబులు వ్రాల నినుం గనుంగొను జనులయందు వసియింప కుండం జేసితి వింకమాకు గతి యెయ్యది యని తత్తజ్జనులపాపంబులు రూపంబులు గైకొని తాపంబున మొర లువెట్టునట్టి తెఱంగున రోలంబజాలంబులు ఝుంకారంబులు సేయ నభంగతర తరంగత్వరంగమృదంగరంగధ్వానంబులకుం జెలంగుచు బెళుకుబిత్తఱికోడె బేడి సలు మత్స్యపుటంబులువైవం బ్రవాహవేగంబునం బెండువడి తోడనడరు పెద్ద పెద్దకొండల గండూపలంబుల మెండున నిండుకొనియుండు మకర నక్రగ్రాహ కర్కటకాదిజలజంతుసంతానంబులు వెలయం దీరంబులనిల్చి పుణ్యపురంధ్రీజ

నంబు లెత్తుము త్తైపుటారతుల తెఱంగునం జెంగల్వలపలగొను సుడులుం బెడంగుసూప సంపన్ను లగుజనులు భక్తిపూర్వకంబుగా నొసంగుపట్టాం శుకమణిభూషణంబులన లోపల వెలికి నడరుమౌక్తికంబుల నిగ్గుల బుగ్గ లగ్గలముగ దత్తత్పౌరజన సమర్పితరత్నదీపంబులకు వెలుంగు లొసంగుప్రవా హాగతభుజంగపుంగవ ఫణారమణీయమణి గణప్రభలు పొసంగఁగమలాంతర కాంత కమలాకాంతాభిషేకంబునకుం బలె జలవేదండ షండంబులు దుం డంబు లెత్త సరసప్రదేశంబుల నాశుకవితరీతి నతిత్వరితగతి యగుచుం బ్రతిహతస్థలంబుల నభిమానిజనయాచన చందంబున మందంబగుచుఁ గఠినచిత్తు లకుందొలంగి చనుసజ్జనుని తెఱంగున గగనంబునకుం దొట్టుగట్టుల కెడ గల్గుచుఁ దూర్పున సీతాభిదానంబున నభిరామలీల మెఱయ మేరుకమల కేసర కేసరాచల గంధమాధనవసుంధరాధర భద్రాశ్వవర్ష మార్గంబునఁ బశ్చిమంబునఁ జక్షువనుపేర లోలమాన మీన కటాక్షంబుల సుపర్వాశ్చర్యకరమాల్యవన్మాల్య వద్భ్యాదర కేతుమాలవర్షంబుల సరణిని నుత్తరంబున భద్రాఖ్యను స్మరణశీల భద్రప్రదయగుచు నభ్రంకషశృంగశృంగ వత్పర్వతోత్తరకురు దేశపదంబున దక్షిణంబున నలకనంద నామధేయంబున నదనారవింద నందన్మిళిందాలకయై గగనసరఃకనక కమలాయమాన హేమకూట హేమకూటకుధరభారతవర్ష పదవిం బ్రవహించి దిక్కూలముద్రుజ సముద్రవాతూలలోలకల్లోల కోలాహలం బవా ర్యతూర్యఘోషంబులై మొరయ నౌర్వాగ్నిసాక్షియై వెలుఁగం బ్రతిరవణ ద్విజకలకలంబు మంత్రకులంబులై మించఁ గలకంఠికాగానంబులు పెండ్లిపాటల నీటుసూప విష్ణుధారాదత్తయగు గంగానదియుఁ దరంగిణీరమణుండును వేల యనుతెరకిరుగడల నిలిచి బుద్బుదప్రలకాంకురములు గువలయనయన వికా సంబు గుముద ప్రభామందహాసంబునుం జెలువొంద నొండొరులునుం దరంగ హస్తంబుల శీకరమౌక్తికంబులం దలఁబ్రాలువోయుచు నన్యోన్యమీన వీక్షణం బులుం దారసిలఁ గలసి జలనికర వీచికాస్వితమౌక్తిక విద్రుమాది మణిమణ్డిత శైవాలవల్లికా కాచమణి రమణీయ మంగళసూత్రాలంకృతకంబుకంధర యగుచుఁ బవమాన విప్రకులంబు భృంగాశీర్నినాదంబులతో వేలావనకుసుమ కేసరాక్షతంబులు వధూవరులపైఁ జల్లఁ గరకమల భ్రమరమాలికా కౌతుక బంధుండును ఫేనదుకూలచేలుండును బహుళతర రత్నోర్మికాభరణుండును తటవన తరుచ్యవమాన గుచ్ఛకుసుమవిసర శేఖరుండును నగురత్నాకరవరునకు నర్థాంగలక్ష్మియై యుబ్బించుచు సుఖకేళీవిలాసంబునం జెలంగె నంత. 118

తే. పద్మలోచనుఁ డెప్పటిబ్రహ్మచారి
వేషమున నున్నఁ గనుఁగొనివిప్రజిత్తి

ముఖ్యదైత్యులు దనుజేంద్రు మోసపఱిచి
సిరులు హరియించె హరి యంచుఁ గెరలి యపుడు. 119

మ. వలదంచుం బలి సెల్విన న్వినక గర్వస్ఫూర్తి గర్జించుచుం
బ్రళయాభ్ర ప్రభల న్స్ఫురింపఁ బోదుప జాగ్రత్ఖడ్గ విద్యుజ్జ్వల
జ్జ్వలనజ్వాలిక లాక్రమించె దశదిక్చక్రంబు లొక్కుమ్మడిన్
దళమయ్యె న్శరవృష్టితోఁ దొరిగె శస్త్రవ్రాత నిర్ఘాతముల్. 120

శా. ఆలో నందసునందముఖ్య హరిసైన్యవ్రాత వాతూలముల్
తూలించెం దనుజాభ్రజాలములఁ దోర్దర్పోద్ధతి మాధవానుజ్ఞనా
వేళ న్వారుణపాశబంధితునిఁ గావించె న్వదాన్యు న్బలి
న్వ్యాళాహారి సమస్తదేవతలు హాహాకారముల్ చేయఁగన్. 121

ఉ. కట్టినఁ గట్టుఁగాక హరికట్టడ చేసినకేలు మున్ను గాఁ
గట్టక వెన్క నేమిటికిఁ గట్టె విహంగవరేణ్యుఁ డిట్టు లిం
కెట్టు నమస్కరింతు హరికే నని కన్నుల మ్రొక్కుఁ గాని యా
కట్టున కింతయైనను వికారము సెందఁడు దైత్యుఁ డత్తఱిన్. 122

క. ఆయౌదార్యము ధైర్యం, బాయాస్తికబుద్ధిఁ జూచి యారాయనుచున్
వేయువిధంబుల సన్నుతి, సేయుచుఁ గనుఁగొనిరి దనుజశేఖరు దివిజుల్. 123

తే. అంతఁ జిఱునవ్వుతోడ మాయావటుండు
దైత్యపతిఁ జేరి యోయి వదాన్యచంద్ర
యవనిపాదత్రయము నిత్తునంటి వేది
కడమపాదంబునకుఁ జోటు గలదె చెపుమ. 124

క. ఇచ్చెదనని యీకున్న, న్వచ్చుం బాపంబు రౌరవం బగు నీక నీ
యిచ్చ యన న్విని మఱదను, హృచ్ఛత్రేశ్వరుఁడు పల్కె నెంతయుభక్తిన్.

క. లేదన నేటికి నిచ్చెద, నాదుశిరంబునను నిల్పు నళినేక్షణ నీ
పాదాబ్జము నేనుం బ్రహ్లాదునివలె సుకృతి నగుదు ననుసమయమునన్. 126

ఉ. శ్రీదనర న్విశాలకటిసీమ ధరించిన హేమచేలము
న్మేదురమేఘమేచకసమిద్ధ చకచ్చకితాంగముం బతం
గోదయరంగదంబుజదళోపమ లోచనము ల్చెలంగఁ బ్ర
హ్లాదుఁడు వచ్చె నాఁటి విహంగతురంగుని రంగెసంగఁగన్. 127

తే. వచ్చి తనుఁ జూచి బంధంబు వలన వినుతి
సేయలేమికి దనలోన సిగ్గువడుచుఁ
గన్నుఁగవ నశ్రువులు గ్రమ్మనున్న బలిని
గాంచి హరిఁ జూచి పల్కె నిట్లనుచు నపుడు. 128

క. సురపద మేటికి నొసఁగుము, చరణాంబుజ భక్తి దైత్య సామ్రాజ్యంబు
న్హరియించి మేలు చేసితి, కరుణింపుము బంధముక్తుఁగా బలిని హరీ. 129
వ. అని పల్కుసమయంబున. 130
ఉ. వల్లభుఁ డిట్లు కట్టువడువార్త చెవింబడ గుండెజల్లనం
దల్లడమందియద్దనుజ [1]పత్ని యుఁబల్లవపాణి చెక్కుల
న్వ్రెల్లువగట్ట నశ్రువులు వెల్వెలఁబోవ మొగంబు నమ్మ నేఁ
జెల్ల నిదేమియంచు హరిఁజేరి నమస్కృతిచేసి యిట్లనున్. 131
తే. నీకుఁబ్రియముగ దానంబు నెఱపువారు, మోక్షమందఁగఁబురుషార్థములనొసంగు
నీదుకేల్క్రిందు తనకేలు మీఁదుగాఁగ, దాన మొసఁగిన బలికి బంధంబుదగునె.
క. విడిపింపుము నిను రాజ్యం, బడుగము నీవలయువారి కర్పింపుము మే
మడవుల నుండెద మిఁకనీ, యడుగులు మదిఁదలఁచికొనుచు నార్తశరణ్యా. 133
మ. అని దైన్యంబున విష్ణుపాదనతయై ప్రార్థించు వింధ్యావళీ
వనితారత్నముఁజూచి యేచినదయ న్వాణీమనోనాథుఁ డో
వనజాక్షా బలిబంధనంబు తగవే వారింపు మన్న న్జగ
జ్జనకుం డిట్లని యెఱ్ఱసుధామధుర వాచావీచివాచాలతన్. 134
తే. ఎవ్వని ననుగ్రహింప నేనిచ్ఛనెంతు, వానిసంపద హరియింతు వనజగర్భ
యటులుగావున బలిభక్తి కాత్మ మెచ్చి, యిటులుగైకొంటి సంపదలెల్ల నేను.
వ. అనిపలికి బలి కిట్లనియె. 136
క. వినుము విరోచననందన, ఘనుఁడవు నీవన్నిటఁ జగంబుల నీతో
నెనయైన దాత గలఁడే, తనరారితి త్రిభువనైక దాత యనంగన్. 137
తే. భావిమనువేళ దేవేంద్రపట్టమునను, నిన్ను నిల్పెద నందాఁక నీవుసుతల
మందు వసియింపుమనుచుఁ బ్రహ్లాదుఁ గూర్చి, దనుజసేనలతోనంపె దైత్యవిభుని.
తే. కడమయజ్ఞంబు సమదృష్టి గలిగి నిర్వ, హింపు శుక్ర యటన్న నుపేంద్రుఁజూచి
యేకదృష్టిని నే నిర్వహింతుసామి, కరుణచేనంచువల్కె నా సురగురుండు. 139
మ. వనజాతాక్షుఁడు మాటమాత్రమునసే వైరోచనశ్రీలఁగై
కొని యీరీతి జగజ్జనుల్ పొగడఁగా క్షోణీధరారాతికి
చ్చిన బ్రహ్మాదు లుపేంద్రుగాహరిశుభశ్రీసాంద్రు దేవేంద్రు నిం
ద్రునిగాఁ బట్టముగట్టి రెల్లరకు సంతోషంబు వాటిల్లఁగన్. 140
క. అదితియుఁ గశ్యపుఁడెటునలె, ముదమందిరో యటులు చెలఁగె ముజ్జగములు న
భ్యుదయం బ్రింద్రోపేంద్రులు, పొదలింపఁగఁగ్లేశ లేశమును లేదయ్యెన్. 141
సీ. ఘనగదాదండంబు గైకొని యిందిరాకాంతుఁడు వాకిలి గాఁచియుండఁ
దనకులోఁగాని యుద్ధతుల యుద్ధతిమాన్చు పనిపట్ల చక్రంబు పంపుసేయ

1 తల్లజపల్లవపాణి.

నేకార్యమునకైన లోకపాలాదికు లనిశంబు దనుబుద్ధియడిగి కొనఁగ
లలితరూపవిలాస లావణ్య వతులైన కన్యకామణు లూడిగములు సల్ప
తే. స్వర్గలోకంబుకం టెను శతసహస్ర, గుణము లెక్కుడుగాఁగల్గి ప్రణుతికెక్కు
సుతలమున నేఁడు నున్నవాఁ డతులకీర్తి, చక్రిమతవర్తి బలిదైత్యచక్రవర్తి.
మ. ఇలలోఁ జీఁకటిగల్గఁ దెల్పుదు రదే యిందేల లేదంచుము
గ్ధలు వేఁడం జెలులార మీముఖరుచిం గన్పట్టఁగా లేక కొ
ప్పులలోడాఁగెనటన్నఁగుంతలసుమంబుల్ దీసి పిల్లూరుచి
న్నలు పైతోఁపనివే యనం బతినగుణ్ దైత్యేంద్రవాసంబునన్. 143
మ. జలకేళీ సమయంబులం గలఁగిపోఁ జక్రంబులం దోలెనో
లలనా నీనగుమోము చందురుని లీలంగాచితే యన్న విం
తలువింటింగద చంద్రుఁ డెవ్వఁడొకో నాథా తెల్పుమంచన్నఁ గెం
పులయందంబునఁ దన్ముఖాంబుజముఁజూపుణ్ వల్లభుం డచ్చటన్. 144
మ. అతిపాత్రంబగు పద్మనేత్రునకు నత్యౌదార్య లీలాప్తిచే
క్షితిదానంబొసఁగ న్బొసంగుబలికిం జేకూరెఁగా కద్దిరా
సుతలావాసము గల్గునే యొరులకుణ్ శుద్రప్రదానంబునణ్
స్తుతవైకుంఠముఁబాసి యచ్చటవసించుం జక్రిభోగార్థియై. 145
తే. అఖిల సద్వార పాలకుఁ డైనలోక, వల్లభుఁడు ద్వారపాలకవంశజులకు
ద్వారపాలకుఁడౌట తద్భక్తిబుణము, దీఱ దేమిచ్చిన నటంచుఁ దెలిసికాదె.
తే. తమపితామహులితనికి ద్వారపాలు, రైరియదిపుణ్యమున కింతెయనుచుఁగొల్వ
ధరణిపాదత్రయ[1] మొసంగి తానుజేసె, వెన్నుఁడుణ్ బలిమాటకు వన్నెగలుగ.
క. శ్రీవామనావతారక, థావిభవము విన్నజనుఁడు ధనధాన్యయశ
శ్రీవెలయఁగ భువివర్ధిలి, యావెనుక న్మోక్షలక్ష్మి కధ్యక్షుఁ డగున్. 148
క. అని శ్రీవైశంపాయన, మునిముఖ్యుఁడు దెల్ప విని ప్రమోదాన్వితుఁ డై
జనమేజయుఁ డవ్వలికథ, యనఘా విన వలతుఁ దెల్పు మని యడుగుటయున్.
మ. జలజాక్షీమణికంకణ క్వణనచంచచ్చంచలాచామర
చ్ఛల చక్రాంగగరుద్విచాలనచలాంచచ్చంచరీకచ్ఛటా
కలనాసూచక కుంతలద్యుతితరంగస్మేరవక్త్రాంబుజో
జ్జ్వలపత్త్రాయతనేత్రకోణవిహారత్సౌభాగ్యలక్ష్మీయుతా. 150
క. తారకదారక దారక, తారకవిధి దారకాంతి తతయశ కవిబృం
దారకమందారక బృం,దారకవర వైభవా త్యుదారకళాఢ్యా. 151

1 మొసంగి ద్వారపాలుఁ, జేసె వెన్నుని బలిమాట వాసిగలుగ.

మాలిని. మగదలకులవర్యా మందరాహార్య ధైర్యా
జగదభినుతచర్యా శాశ్వతౌదార్య శౌర్యా
నిగమపదవిహారా నీతికార్యానుసారా
ప్రగుణ సుగుణహారా రంగమాంబాకుమారా. 152

గద్య. ఇది శ్రీరామభద్రదయాభిరామభద్రకరుణాకటాక్షవీక్షాపరిప్రాప్తదీప్తతరాష్ట భాషాకవిత్వ సామ్రాజ్యధౌరేయసకలవిద్వత్కవిజనవిధేయ ధరణిదేవుల నాగ నామాత్యసుధాసముద్రసమున్నిద్రపూర్ణిమాచంద్ర రామమంత్రీంద్రప్రణీతం బైనదశావతారచరిత్రం బనుమహాప్రబంధంబునందు పంచమాశ్వాసము.

౫. వామనావతారకథ సమాప్తము.





# ౬. భృగురామావతారకథ.



## షష్ఠాశ్వాసము.


ధవ కథాసుధారస
మాధుర్యాధీనహృదయ మగదల్పకలపా
ఘోధికళానిధి సకలక
ళాదికనైపుణ్య కృష్ణయార్య వరేణ్యా! 1

తే. అవధరింపుము జనమేజయక్షితీశ
శేఖరున కిట్టులను వ్యాసశిష్యమౌని
ధరణివర భృగురామావతారక మిఁకను
దెలియఁజెప్పెద వినుమని తెలుపఁ దొడఁగె. 2

శా. శ్రీకాంతోజ్జ్వల దంతవాస మలకాక్షీణ ప్రభావాప్తము
ద్రాక్షారాజవిరాజమానముఁ గళారమ్యంబు శుద్ధద్విజా
లోకం బుత్కట హేమధామవర వల్గుస్ఫూర్తి చిత్రంబు క
న్యాకుబ్జంబు కకుబ్జనస్తుతినిఁ జెల్వొంజా ముఖాబ్జంబునన్. 3

ఉ. ఆపురమేలు గాధి మనుజాధిప శైలనిరోధి బాధితా
టోపవిరోధి సాధిత కఠోరధరాంత పయోధి యూథికా
భాపటు కీర్తిశోధితకపర్దిశిరోధి సమేధితాత్మ మే
ధాపరిపూరితాంబుధిసుతాగృహమేధి మహాశ్వమేధియై. 4

చ. అతఁ డొకనాఁడు వేడుక నొయారులు గొందఱు గొల్వసేయఁగా
రతనపుమేడనున్నతఱి రాఁగ ఋచీకుఁడు చారుభక్తితో
నతిథిసపర్యలం బ్రముదితాత్మునిఁజేసి మణీమయాసన
స్థితు నొనరించి తా నతనిచెంత వసించె వినీతి నత్తఱిన్. 5

తే. పడుచుఁ దనమున బైపక్కఁ బడుచునున్న
పడుచునొక్కతె వేడుకపడుచుఁ గాంచి
రాజ యీకన్య నీకూఁతురా మఱేమి
భాగ్యశాలివి సకలసంపదల నీవు. 6

క. వీక్షించినపుడె తెలిసెన్, లక్షణవతియంచు రాజనందనిహ స్తం
బీక్షించి తపసి సతియగు, లక్షణమున్నయది నాతలఁపు చేకూరెన్. 7

క. కన్యార్థినగుచు వచ్చితి, ధన్యా నీయింటికడకుఁ దడయక నాకుం
గన్యాదానముచేసి య,నన్యాదృశ సుకృత మొందుమా నృపసోమా. 8

వ. అనిపలికిన జడదారిపలుకులు ములుకులై చెవినాటిన నుల్కిపడి యప్పుడప్పు
డమితేఁడు తనమనంబున. 9

తే. ఆకునలము మెసవి యడవిలో వసియించు, తపసులేడ రాజతనయలేడ
నంచు నించుకైన నెంచక యక్కటా, యడుగవచ్చె నిట్లు వెడఁగుఁదపసి. 10

తే. ముక్కునను యుండుఁ గోపంబు మునులకెల్లఁ
జెల్లఁబో యీయన శపించినను శపించు
నటులుగావున నొకయుపాయమున దీనిఁ
గడపెదనటంచు నిట్లను గౌరవమున. 11

మ. అమలాత్మా నినువంటి ధన్యునకుఁ గన్యాదానముం జేయుభా
గ్యము సామాన్యమె యైనఁ జంద్రధవళాంగ శ్యామకర్ణాగ్రవా
హముల న్వేయినొసంగఁ గావలయుఁ గన్యాశుల్క మస్మత్కుల
క్రమ మీరీతి నొసంగి కైకొనుమిదే కన్యామణి న్నావుఁడున్. 12

చ. వెలవెలఁబోవు మోమునను విప్రకుమారకుఁ డౌర యెవ్వరుం
దలఁపరు తొల్లి యీతలఁపు ధారుణిలోపల నిట్టిగుఱ్ఱము
ల్గలుగునె గల్గినా యొకటిగా పదిగావు సహస్రవాహము
ల్గలుగునె యేమిసేయుదును గన్నియఁజూచిన నాసయెయ్యెడిన్. 13

మ. అనుచు న్మదిఁ గొంతచింతయిడి రాజా మంచిదే తెత్తునం
చని యంపించుక భూమిఁగల్గు సకలక్ష్మాధీశుల న్వేఁడి యెం
దును దాదృక్తురగంబు లేక మదిలోనూల్కొన్న చింతాభరం
బున నిట్లుంచుఁ దలంచె మౌని యపరాంభోరాశి తీరస్థుఁడై. 14

సీ. నెఱివేణిఁగూడని నెఱులు నెన్నుదుటిపై కమ్మకస్తురి తిలకమున నెరయఁ
దెలివాలుగను కెలంకుల సోనదేఱెడి చికిలిచూపులొకింత సిగ్గుగులుక
గోఁగనొక్కిన పాలుగాఱు కెంజెక్కుల నుదిరిమ్మలకాంతి యుదుటుసూప
నొరులచూపొరయుచో నుసిరికాయమెఱుంగు చన్నుల పయ్యెదచాటుకొనఁగఁ

తే. గొమరు ప్రాయంబునను ముద్దుగులుకుచున్న
కన్నెఁజూచినమొదలు నాకన్నుఁ గవకు
నిదురగాన హాయంబుల నెమకిగాన
గాన నీచింతదరిఁజేరు క్రమముగాన. 15

మ. అనియత్యంత దురంతచింత మునిరాజౌర్వానలజ్వాలికా
ఘనసంతాప పరిప్లవన్మకర నక్రగ్రాహ మీనాదిజం
తుని కాయాభ్రనదీ నివాస కరుణోద్యత్కోర్మికా హస్తమై
కనసౌవార్ధి గుభిల్లునం దుమికె నక్రస్ఫూర్తి వర్తిల్లఁగన్. 16

చ. దుమికి మునీంద్రనందనుఁడు తోడనె వారుణభృత్యులెందఱే
సమధికభక్తిఁ జేరి కడుచక్కనిమార్గము సూపఁగా నుపా
యమున నగాళికోసరిలి యయ్యమరావతి సేరివచ్చు సం
యమి యమితప్రభావమున కప్పతి విస్మయ ముప్పతిల్లఁగన్. 17

క. ఎదురుగవచ్చి మునీంద్రుని, పదములు పన్నీటఁ గడిగి బంగరువిరుల
న్నదమల భయభక్తులు మదిఁ, బొదలం బూజించి యతని బొగడుచు ననియెన్.

శా. సామాన్యుండె భవద్గురుండు భృగుఁ డక్షయ్య ప్రభావాఢ్యుఁ డై
యామూర్తిత్రయిచేతఁ బూజగొనె నింద్రాదుల్భవత్కింకరు
ల్మీ మాహాత్మ్యము కొంచెమే కలిగెఁగా నీపాదముల్గొల్వఁగా
నే ము న్నేమితపంబు చేసితినొకో భృగ్వాన్వయ గ్రామణీ. 19

వ. అనిన నరుణు వినీతవృత్తికి వినీతప్రాప్తి యగునని సంతసిల్లి మునివల్లభుం డిట్లనియె. 20

మ. చెవి నల్పుం దనువెల్లఁ దెల్పుగల తేజుల్వేయిటిం గోరి నే
ధవళైకాశ్వుని మేషవాహనుని గంధర్వద్విపద్వాహు మా
నవవాహు న్నిరసించి కాండపతిని న్యాచింపఁగా వచ్చితి
న్భువనాధీశ్వర యిచ్చిపంపుము శుభంబు ల్మీకుఁ జేకూరెడిన్. 21

మ. అనిన న్భాగ్యము చేసితి న్మునికులాధ్యక్షా సహస్రాశ్వము
ల్గొను నేనిచ్చెద నంచు నట్టివొసఁగెన్ క్షోణీసురేంద్రుండు గ్ర
క్కున గంగానది త్రోవగా వెడలెఁ దత్కాంభోణజాతంబునం
దనరారెన్ హయతీర్థ మన్నదినిఁ గన్యాకుబ్జ పార్శ్వంబునన్. 22

క. జటివరుఁ డిటువలె గంగాతటిని గృపీటముల వెడలి తతఘోరఖురా
స్ఫుటితధరాచటులరజః, పటలారుణితాంశుఁ డగుచుఁ బఱతెంచుటయున్. 23

చ. పరనృపుఁ డెవ్వఁడో పురముపైఁ జనుదెంచెనటంచు గాధిభూ
వరుఁడు మహారథ ద్విరద బంధుపదాతుల తోడఁగూడి ము
ద్గరకరవాల తోమరగదాపరిఘ క్షురికాదిసాధనో
త్కరము వెలుంగఁ బెట్టెదురఁ గన్గొని దగ్గఱి విప్రుఁ డిట్లనున్. 24

శా. మామా తెచ్చితి వేయిగుఱ్ఱములు కొమ్మా నాకు నీకన్య ని
మ్మా మాట ల్వేయియేల యంచనిన గోత్రాధీశుఁ డౌరౌర ని

స్సామాన్యంబు తపోవిశేషమెకదా జామాతయయ్యె న్షలీ
యీమౌనీంద్రుఁడు నాకు నాకులము మెంతే పావనంబయ్యెడిన్. 25

తే. అనుచు ముదమున మునిఁ దోడుకొనుచుఁ బురము
సేరి పురమెల్ల మిగులఁ గైసేయఁ బనిచి
వేగ మాహూర్తికులను రావించి లగ్న
నిర్ణయముచేసె గాధిభూనేత యంత. 26

సీ. చెలువయొక్కతె నూనె చిలికించి జడవిప్పి నిదురరాఁ దలయంటె నేర్పుమీఱఁ
జెలియోర్తు కుంకుమ నలుగిడె భసితావళి త్రిదేహము హైమదీప్తి మెఱయ
గంధ మిందేలన గందంపు టటకలిఁ బెట్టె నవ్వుచు నొక్క బిసరుహాక్షి
యుష్ణాంబువులటంచు నొడ్డుకోఁ గోర్వెచ్చ జలముల నొకకల్కి జలకమార్చె
తే. చలువలందిచ్చె నొకచెల్వ వెలఁదినవ్వ
లుత్తరీయము లంచుఁ జేనొడియ మాల్య
భూషణంబులఁ గైసేసెఁ బొలఁతియొకతె
రాజులమె యంచు నమ్మునిరాజు సెలఁగ. 27

తే. ఇవ్విధంబున రుచికమునీంద్రచంద్రుఁ, బెండ్లికొడుకును జేసినఁ బ్రేమమీఱఁ
గన్యకామణి సకలశృంగారములను, జెలులు గైచేసి రటమున్న చెలువుమీఱ.

సీ. అటగాధిభూపాలుఁ డత్యంతముదముతో జాతిముత్యపుపెండ్లిచవికెలోనఁ
దోరమై మంగళతూర్యఘోషంబులు భూనభోంతరముల బోరుకలఁగఁ
బాటలగంధులు పాటలుపాడంగ మమతతో రుచికుపాదములు గడిగి
మధుపర్క మొసఁగి సమ్మతి సత్యవతిఁ దనపుత్త్రికామణి ధారవోసియిచ్చి
తే. యంత నాల్గుదినంబులు నైనపిదప, భూరిమణివస్తువాహన భూషణంబు
లరణముగ నిచ్చి యల్లుని నాఁడుబిడ్డఁ, దనపురంబున నిల్పఁ జిత్తమునఁ దలఁచి.

మ. అనఘా మానసశుద్ధి గల్గిన నరణ్యానిం బ్రవర్తిల్లుట
ల్లనకాగారమునందు నుంట సరియేకాదే తమోదూరుఁడై
జనకుండేలఁడె భూమి మీరటులు నస్మత్పట్టణాభ్యంతరం
బునఁ గొన్నాళ్లు వసించు టొప్పదె యన న్భామీసురుం డిట్లనున్. 30

ఉ. మంచిది సార్వభౌముని కుమారికెకు న్వనవాసఖేదమె
ట్లెంచు నటంచు నెంచి వసియించెద [1]నట్లనె దీన నేరమే
మంచుఁ దదీయ పట్టణమునం దొకకాంచన మందిరంబునం
జంచలనేత్రతోడఁ బతి సల్పె సమస్త గృహస్థధర్మముల్. 31

చ. గురుకుచకుంభముల్గదలఁ గ్రొవ్వెదజాఱఁ గడాని కమ్మక్రొ
మ్మెఱుగులు వళ్కుచెక్కులనుమించ మిటారపుఁ గల్కిచూపులం

1 నట్లగుఁ గాక నేరమే.

దొరసిన సిగ్గుతో నళుకుతో సతతంబును గ్రొత్తపెండ్లి కూఁ
తురు పరిచర్య సేయఁ బతితోరపు వేడ్క నొనర్చు సత్క్రియల్. 32

సీ. ఔపాసనంబున కక్షత ల్దెమ్మన్న తఱెనిచ్చు నపుడు తత్తఱము పేర్మి
నొనటే నైవేద్య మాయెనా యన నాయె నవక పదార్థంబు లునుచు నేరు
పడుగకమున్న మాఱెడఁ దెచ్చి యాతఁడేమాత్రంబు వలదన మగుడు సిగ్గు
మడుపులన్నియు నొక్కమఱెయిచ్చి భుజియింపఁ జనుమన్న నొండొండొసంగు ప్రేమ
తే. విశ్రమింపఁగ శయ్యగావించు నెనరు, వీజనం బల్లనల్లన విసరుమమత
యొయ్యనొయ్యన పాదంబులొత్తు బత్తిఁ, బతినిఁజొక్కింప మెలఁగునప్పద్మగంధి.

సీ. అంతట నొక్కనాఁ డాగాధినృపపత్ని పతినికోలాటంపు ప్రతిమజోళ్ల
తీరైనమంజిష్ఠి తెరతోడి పచ్చల పల్లకి యెక్కి ప్రాభవము మెఱయ
నిరువంకనుడిగంపు విరిఁబోండ్లు రా నన్నగళుముందిసందడిఁ గడలక్రొత్త
రంగులఱవికెలు బంగారుపూఁకొప్పెసవరము ల్వాగవగ [1]సన్నచీర
తే. లద్దము ల్పరిమళములు నాదిగాఁగఁ, బెట్టియలతోడరాఁ దనపట్టియున్న
నగరికే తేర నారాజనందనియును, మోదమునఁ దల్లిపాదాబ్జములకు మ్రొక్కె.

తే. మ్రొక్కినను లేవనెత్తి యమ్ముద్దుఁగూఁతు, నక్కునను జేర్చి యో యమ్మ యగ్రవర్ణు
చెట్టపట్టియు దండంబు వెట్టఁదగునె, రాచవారికి నంచు నారాజవదన. 35

క. నునుసిగ్గునఁ దలవంచిన, తనయకు వస్తువులొసంగి తపనీయగృహం
బున నొక్కరత్నపీఠిని, నెనరుగఁ గూర్చుండి యిట్లనియెఁ గూఁతురికిన్. 36

ఉ. కన్నియ నేఁడు నీముఖవికాసముఁ దెల్పె సమస్తసౌఖ్యమై
నన్నినువేఁడ వేడుకగు నాథుఁడు నిచ్చలు నింగితజ్ఞుఁడై
మన్ననసేయునే తెలుపుమా యెలఁబ్రాయపు ముద్దుఁగూఁతు మే
లెన్నక యిచ్చితిం జదువ కేనని నీజనకుండు చింతిలున్. 37

తే. అనిన నేమనకున్న సత్యవతిఁ జూచి, సఖులు దెల్పఁగరాదఁటే జననిచెంత
సిగ్గువడనేల మాతోడఁ జెలగి చెలఁగి, పతిచతురుఁడంచుఁ దెల్పుదే ప్రతిదినంబు.

తే. అమ్మయిది దెల్పకున్న నేమాయె వినుము
తనమనోహరు సాటిగా రనుచుఁ బలుకు
నింద్రుఁజంద్రుని నెడఁబాయ దింతతడవు
నేమిమంత్ర మెఱుంగునో ఋషిసుతుఁడు. 39

చ. అనవిని యంతెచాలుఁ జెలులార మహాత్ములుగారె తాపసు
ల్వనితల కింపుసేయఁదగు వైఖరిఁగూడి మెలంగఁజాలరే
యనిశము నవ్వనేల యనియా కుశనాభకుమారపత్ని త
త్తనయను గౌఁగిలించి ప్రమదంబున నిట్లనియె న్మృదూక్తులన్. 40

---

1 వన్నెచీర.

తే. కన్య నినుఁగన్న కతమున ధన్యమయ్యె, నాకులంబంతయును నైన నాకులంబు
గాకమానదు నామది నాకుబలెనె, నీకుఁదనయుండు లేమికి నీరజాక్షి. 41

క. పతి వేఁడికొనుము పుత్త్రుని, నతుల తపోన్వితుఁడుగాన నతఁడొసఁగెడియా
సుతుఁ డుభయకులంబునకుం, గతి యొసఁగెడి ననుచుఁ దెల్పి క్రమ్మఱఁజనియెన్.

ఉ. బాలికనాఁటిరేయి పతిపజ్జకుఁబోయి పయింటకొంగు కెం
గేలబిగించుచు న్నేలను గేరెడు లేనగు మోముపంచి వా
చాలతఁజూపలే కిగురుచాయల మోవి గదల్పుచున్న నీ
లాలక చెట్టవట్టి తనయంకమునందిడి మౌని యిట్లనున్. 48

తే. యేమి యడుగంగవచ్చితి వింతలోన, సిగ్గువడనేల తెల్పవే చిగురుఁబోఁడి
యెద్దియైన ఘటించెద నే నటన్న, జననివాక్యంబు సతి దెల్ప మునివరుండు. 44

క. కనిపెంచువయసు గాదే, తనకేటికి లేకపోవుఁదనయుం డిఁకనీ
కును నీజననికి నుత్తమ, తనయులు గల్గుటకుఁజరువుఁదగఁగావింతున్. 45

క. అని యున్నతటిని భృగుముని, సనుదేరఁగ రుచికమౌని సతిమణికలశం
బునఁ బన్నీరము వంచఁగ, జనకుని పాదములు గడిగి సంతసమెసఁగన్. 46

తే. చౌకమైమించు దంతంపుఁజవికెలోన, రత్నమయపీఠిపైనుంచి ప్రకటభక్తి
పొసఁగ బంగారు పువ్వులఁ బూజసేసి, వినయమునడాసి వీవన విసరుచున్న. 47

ఉ. వేడుకమీఱఁగా విభుని వీవన గైకొని చల్లతెమ్మెరల్
గూడఁగ మెల్లనే విసరుకోడలి వల్లభభక్తి యెందునుం
జూడని సద్గుణంబులును జూచి ముదంబున నమ్మునీంద్రుఁ డి
ట్లాడె వధూమణీ యడిగినర్థ మొసంగెద వేఁడుమీవనన్. 48

క. వనజముఖి పలుకకున్నం, దనతల్లికిఁ దనకు మంచితనయులు వలెనం
చును వేఁడె నిన్న రేన, న్నని రుచికుఁడు దెల్ప సతి త్రపాన్వితయగుచున్. 49

తే. తలఁగిపోయిన భృగుమౌని తనయుఁ జూచి
యాత్మజులు గల్గుటకు నుపాయంబు దెల్పి
శముల కేటికి నృపనివేశములఁ బుత్త్రుఁ
బడసి వసినుండు మీవని పలికి చనిన. 50

ఉ. అంతట భార్గవుండు తనయంగనఁ గన్గొని సిగ్గికేటికే
యింతిరో నీదుకోర్కి. ఫలియించెను నీజనయిత్రి నీవు ఋ
త్వంతమునందుఁ బిప్పలము నత్తియుఁగౌఁగిట నొత్తికండు నా
చెంతకు నీకు నేఁజరువుఁజేసి యొసంగెదనంచుఁ బంచినన్. 51

క. సరభసముగ సత్యవతీ, తరుణీమణి యవ్విధంబుఁ దనకెఱిఁగింపం
బరితోషంబున నరవర, సురపతిసతి ఋతువు కెదురుసూచుచు నెలమిన్. 52

సీ. మును దాను గడకుఁబోయినదినం బాదిగాఁదెచ్చుక దినమును దినము లెన్ను
మధురము ల్ప్రియమైన మాని భోజనవేళ సారెకునావపచ్చళ్లే మెసవుఁ
దుఱుమునఁనొకపువ్వుదుఱుము నెచ్చెలియోర్తు తెఱవపుష్పవతివై తివనబ్రమయు
నలవోకఁదోడమీఁదివలువ కుంకుమకట్టిగనుఁగొనితొలఁగితిననుచుఁ దొలఁగుఁ
తే. దెలిసి కాకున్నవగచు నజ్జలరుహాక్షి, యంత నెలవైనబుతువైనయాత్మజయును
దానుమూన్నాళ్లు మూఁడేండ్లుగానుగడపి, నాలవదినంబునందుస్నానములు చేసి.
వ. నిబ్బరంబగు నబ్బురపుసంతసపుకబ్బినుబ్బితబ్బిబ్బగు నబ్బిబ్బోకవతులు రుచికుం
డాడినక్రమంబు వోనాడి వాఁడిచను మొనలు గాఁడిపాఱఁ బుడమితేనిపూఁ
బోఁడి మేడియును రుచికమునిలికుచకుచ రావియును గౌఁగిలించి పసుపాడిన
రాచిల్కలవడువున నడిపీథినడ తేరునపుడు తమరాక మునుగల్గసౌవిదల్లులవలన
విని చంకలనిండపసిబిడ్డలు గల్గుతల్లులు సరగమఱుఁగునకరుగమందిరంబున కరిగి.
తే. మానిపతి బ్రాహ్మనక్షత్రమంత్రములను, జరువుగావించి యటయుంచినవిథనదికిఁ
జనిన నావేళ మెసవిరి తనయచరువు, జనని జనయిత్రిచరువుఁద త్తనయ పదరి.
ఉ. అంతట మానివచ్చి యదియంతయు నాత్మనెఱింగి కిన్కతోఁ
గాంతరొ నీదుగర్భమున క్షత్రకులాంతకరుండుపుట్టెడి
న్శాంతిధనుండు బ్రహ్మబుషిచంద్రుఁడు పుట్టెడి నీదుతల్లికి
భ్రాంతిని నీ వొనర్చినవిపర్యయ మిట్లు ఫలించు నావుడున్. 56
చ. భయపడి యంత సత్యవతి భర్తపదంబులవ్రాలి రాజహం
డయినకుమారునొల్ల సదయాత్మ నొసంగు మటంచు వేఁడిన
న్దయ ముని నీసుతుండగు సుదాత్తుఁడు దత్తనయుండు ఘాతుకుం
డయిజనియించు నీజననియందు మహర్షివరుండు పుట్టెడిన్. 57
క. అనిపల్కిన ముదమందిరి, వనితామణు లంత సత్యవతి జమదగ్నిం
గనియె జగత్త్రయసజ్జన, వినుతుని నృపపత్ని గనియె విశ్వామిత్రున్. 58
శా. విశ్వామిత్రుఁ డమిత్ర భీకరభుజావార్యం బవార్యంబుగా
విశ్వంబేలి వసిష్ఠమానిపతితో విద్వేషియై యంతట
న్విశ్వద్బ్రహ్మ బుషిత్వముం గనియె సాక్షాద్బ్రహ్మ దేవాగ్రణీ
వి శ్వేశాదులు సన్నుతింపఁగ జగద్విఖ్యాతశీలంబునన్. 59
క. జమదగ్ని మునియు సకలా, గమనిగమ పురాణశాస్త్రకలనాచణుఁడై
శమదమయమ నియమాఢిమ, సమధికగుణశాలియగుచు సన్నుతికెక్కెన్. 60
వ. అక్కాలంబున. 61
క. రేణుకభూపకుమారి క, రేణుక గుణగణనగణ్య బుషధరిత్రీ
రేణుకగతి జితసమదక, రేణుక విలసిల్లు రూపరేఖలకలిమిన్. 62

క. ఆకన్నె రాచిమునుఁడు ప్రాణోత్క్రతఃగావించి కాంచె నలుగురసుతుల
న్నీరికాంతుఁడై దవసుతుం,డై కూరిమి నెఱపె నతని కవనీనాథా. 63

క. అనవుఁడు నమ్మునిఁ గనుఁగొని, జనపతి యిట్లనియె శౌరి జమదగ్నికి నం
దనుఁడై జనియించుట కేమి నిమిత్తం బనిన మౌని మృదుగతిఁ దెల్పెన్. 64

ఉ. నారదమౌనిచంద్రుఁ డొకనాఁడు వినోదముగాఁగ నాసహ
స్రారముఁజేరి భాస్కర సహస్రనిదర్శన యోసుదర్శనా
వైరి నిశాటకోటి ననివారణఁద్రుంచుట నీదుశక్తియో
సారసపత్రనేత్రు భుజశక్తియొ మా కెఱుఁగంగఁ జెప్పుమా. 65

చ. అనవుడుఁ జక్రమూర్తి కమలాసనసూనునిఁ జూచి నవ్వుచుఁ
విను మొకమాట దెల్పెద వివేకముతోఁ జలవాహనిర్గతా
శని గిరిభిన్నమౌట పవిశక్తియొ యల్లపయోదశక్తియో
కనుఁగొను మట్లు శౌరి యొకకారణ మేన హరింతు శత్రులన్. 66

చ. అనవిని శౌరిఁ జేరి కలహాశనుఁ డబ్జపలాశలోచనా
దనుజవరేణ్యఖండనము తావకశక్తియొ చక్రశక్తియో
యనవుఁడుఁ జక్రమేమిపని యస్మదుదారబలంబె కాక విం
టనుహరియించెనో యసినడంచెనొ వైరుల నీవెఱుంగవే. 67

మ. అనిన న్వెన్నునిఁజూచి మౌని కమలాక్షా నీవు నీశక్తియం
చును నీచక్రము వేఁడిన న్స్వబలమంచుం బల్కె నిందేదియొ
క్కో నిజంబన్నను నవ్వి యట్లయిన నీకుం దేటఁగా నింకనే
నును ధాత్రిం జనియింతుఁ బోరుటకుఁ దానుం బుట్టుగా కుర్వరన్. 68

మ. అని పద్మాక్షుఁడు పంపఁ జక్రము హసాదంచుం బ్రమోదంబు మీ
అను మాహిష్మతి నేలుచున్న కృతవీర్యక్షోణి పాలాగ్రగ
ణ్యునకుంబుట్టె సహస్రబాహులయి నైజోగ్రారము ల్మించ న
ర్జుననామంబున ధీరతాసుగుణతాశూరత్వము లొప్పభిలన్. 69

మ. అణుమాత్రేతర భక్తియుక్తుఁడయి దత్తాత్రేయు సేవించి య
య్యణిమాద్యష్టవిభూతులం బడసి సప్తాంభోధిసంవేష్టితా
గణితోర్వీ స్తవస ప్తకత్య్యగ్రహరతూలీల రక్షించెఁ దా
రుణుఁడై తోఁచుచు నెందు యోగమహిమం గ్రూరాత్ములం ద్రుంచుచున్. 70

సీ. మఖభోక్తలయకీర్తి మాన్పఁగా వేలుపువెజ్జు మందులుసారె వేతకసాగె
హెూమధూమంబుల నుబ్బుమబ్బులు మరున్నేతశృంఖలలలో నిల్వవయ్యె
వివిధకాంతులఁ జెంది ద్విజులు గృతార్థులై దేవతాతతులఁ బ్రార్థింపరైరి
మొడలేదు నుపుగింజ యిడఁగ సప్తద్వీపముల్లయందు యూపము లొప్పదలుకతన

తే. నర్జునక్షోణిపాలకుఁ డహరహంబు, సేయుయాగంబుల నతండు సేసినట్లు
ధర్మములు చేసినట్టి భూధవునిఁ గాన, భూతభావిభవత్కాలముల నరేంద్ర. 71

సీ. ఉడురాజముఖులతో నొకనాఁడు జలకేళి సవరించుచును విలాసంబు గాఁగఁ
జేతుల చేత రేవాతోయములు గట్టి యొకయిన్ని యవ్వలి కుబుకనీక
యంతటవిడువ నయ్యంబుప్రవాహంబు సైకతలింగపూజన మొనర్చు
రావణు ముంప విభ్రాంతుఁడై కోపించి కలహించి వచ్చినఁ గాంచి నవ్వి

తే. వానిఁ గొనిచని చెఱసాలవైచెనంతఁ, బౌత్త్రునకుఁ గాఁ బులస్త్యుండు ప్రార్థనంబు
సేయ దశకంఠు విడిచె రక్షితరణాహ్వ, తార్జునుం డగు కార్తవీర్యార్జునుండు. 72

సీ. మఱియొక్కనాఁ డల్లమహిపుకొల్వున కొక్క బ్రాహ్మణుఁ డరుదెంచి పార్థివేంద్ర
యాఁకలిగొంటినే నడిగినయన్నంబు వెట్టింపుమనవుఁడు బ్రీతి నతఁడు
నటువలెఁ బెట్టింతు నవని నే దహనుండ నీదేశమాహుతి యిమ్మటన్నఁ
బొంకక దావెంటఁ బోవుచు శిఖనార్పువారి వారించుచు వనులు పురము

తే. లాదిగాఁ గాల్పనీయ నిజాశ్రమంబు, దగుల వగచుచు వరుణనందనుఁడు రామ
దళితభుజుఁ డవుగమ్మని యెలుకఁ బలుక, యులికియంతట నర్జునుం డుండెఁ బురిని.

చ. హరియును రేణుకాజలరుహాయతనేత్రకు జామదగ్ని నా
ధరిణిజనించి జాత్యుచితతాపసవేషము మీఱ శూరుఁడై
పరశువుఁ బూని మానిజనబాధకసింహహయద్విపస్మృగో
త్కరకిరిముఖ్యసత్త్వముల దైత్యులఁ ద్రుంచుచునుండె నెల్లెడన్. 74

చ. అట నొకనాఁడు రేణుక మహర్షిపురంధ్రులతోడఁ గూడి యొ
ప్పటివలె గంగకేఁగి యతిపావనతీర్థములాడి యన్యదు
ర్ఘటముగ వాలుకాపటలి గట్టి ఘటిఁ ఘటియించి నీటితోఁ
గటితటినుంచి దోవతులు గాలికిఁ బైనడ తేర వచ్చుచోన్. 75

సీ. అలతిజక్కవపిట్ట లంచుఁ బట్టితిఁ గాని గుబ్బలం చెఱుఁగనే కోమలాంగి
నునునాచుతీవియ యని యొడిసితిఁ గాని వేణియం చెఱుఁగనే విద్రుమోష్ఠి
సుడియంచు మునిప్రేళ్ళఁ బుడికిచూచితిఁ గాని నాభియం చెఱుఁగనే నలినగంధి
తామరవిరియంచుఁ దావిగ్రోలితిఁ గాని మోమంచు నెఱుఁగనే ముద్దులాఁడి

తే. యంచు నర్మోక్తిఁ జెనకుచు మించుఁ బోండ్లఁ
గూడి జలకేళిఁ గావించు కోడెకాని
తలిరువిల్కాని నగుచక్కఁదనమువాని
నొక్కగంధర్వుఁ గాంచి యయ్యుత్పలాక్షి. 76

శా. ఏమే రేణుక కూడిరాఁగదవె నీవెవ్వారి నీక్షించెదే
మామాట ల్వినవేయటంచు మునిభామారత్నము ల్పిల్వ నో

హా మీ కెంతటితీవ్రమే సిలువరే యొక్కింత సేపంచు న
క్కామిన్యుత్తమ నిల్చెఁ దోడిసతులేగ న్వానివీక్షించుచున్. 77

తే. మఱియు మఱియును వానిమన్మథవికార
ములు విలోకించుచును వేఱెతలఁపు లేక
భ్రమసి యనురక్తయై యున్న పంచబాణ
కాండ మగలించె ననఁ గటిఘటము పగిలి. 78

క. జలములఁ జేలముదడసినఁ, జెలి యది యపుడెఱిఁగి యకట చేసడలె నటం
చలగంగయిసుకనెప్పటి, వలెఘటముం జేయఁబోయి వసగాకున్నన్. 79

క. తనపాతివ్రత్యంబున,కును భంగము వచ్చెనేలొకో యని చిత్తం
బునఁ దలఁచుచు గుండియజల్లన నిఁక నేనెందుఁ జొత్తు నని సతివగతోన్. 80

శా. నానారీతులఁ బిల్చునెచ్చెలుల వెంటం బోవ కేనూరకే
యీనిర్భాగ్య నిటేల సూచితిని నాకీభంగపాటొందె నే
లా నాపాలివిధాత నానొసట వ్రాయంబోలు నీరీతి నిం
కేనేమందును గంగలోఁ బడుదునో యీదుర్యశం బింకఁగన్. 81

తే. అనుచుఁ జింతించుచును రిక్తహస్తములను
గదియవచ్చిన యిల్లాలిఁ గాంచి నాథుఁ
డెంత ప్రొద్దాయెఁ బోయి నీవింతతడవు
నెచటనుంటివి జలఘటం బేది యనిన. 82

క. ఏమన నేరక యూరక, కామిని తలవంచికొనినఁ గపటజ్ఞుండౌ
నామునికి వచ్చెఁగోపం, బేమాత్రమొ నాటికోప మీశ్వరుఁ డెఱుఁగున్. 83

క. జటివరుఁ డిటువలెఁ గనలుచుఁ, జిటచిటనిప్పుకలు సెదర జిగికనుఁగొనలం
దటతటకటతటు లదరఁగఁ, గిటకిటమన రదనపటలి గీఁటుచుఁ బలికెన్. 84

శా. ఔనే యోసి దురాత్మురాల నిను నిల్లాలంచు నేనమ్మియుం
టే నీవిట్టు దురాశఁ జెందఁదగునే నీభోగము ల్సెల్లునే
కానిమ్మంచును రుక్మవంత యిదిగోఁ గన్గొంటి దుశ్చేష్టితన్
దీనిన్ ద్రుంపుము శస్త్రపాణివయి మాతృస్నేహ మింకేటికిన్. 85

తే. అనిన శ్రీరామరామ యటంచు మౌని
నందనుఁడు హస్తములను గర్ణములుమూసి
యెంతమాటానతిచ్చితి రింత సేయ
నేమి నేరంబు గావించె నీపురంధ్రి. 86

వ. అని మఱియు స్వేచ్ఛాగర్భవతు లగుసతులసైతంబు నోర్చి కూర్చుకొను
బృహస్పతిప్రభృతుల వినమే యట్టికాయికదోషం బణురేణుమాత్రం బీరేణుక

యందు లేదుగదా మానసికదోషంబునకుం దగినప్రాయశ్చిత్తంబు చిత్తగించుట
యుత్తమం బిది నీచిత్తంబునకు రాకున్న నిమ్మత్తకాశిని వర్జించు టంతియకాక
క్రూరకర్మంబు బ్రాహ్మణునకు ధర్మంబు గాదని పలుకు రుక్మవంతుతోఁ గూడ
వివస్వత్సుషేణవిశ్వావసులను మువ్వురు సుతులట్లుపలికిన దురాధర్షామర్షంబున
నమ్మహర్షి దురాత్ములారా మాకుధర్మోపదేశంబు సేయవచ్చితిరే యలంఘ్యమ
ద్వచనోల్లంఘనదోషంబున నజ్ఞానులై వనజంతుసంతతులంగూడి తపింపుండని
శపించి యామ్ముని చెంతనున్న పరశురాము విలోకించి నీవైన నీచంచలాత్మఁ
ద్రుంచెదవో లేదో యని యడుగ గడగడవడంకుచు కేలు మొగిచి మీరునొడి
వినవడువున నడంచెద ననిన తడవు సేయకు మని తండ్రి తరువిడఁ బెల్లడరు
నడలున భార్గవుం డనర్గళధారాకఠోరంబగు కుఠారంబు దెసచూచినఁ గని కొడు
కులారా మిమ్ము నెడఁబాసిపోయెదనని కన్నీరునించుతల్లింగాంచి రుక్మవం
తుండు మొదలైన నలువురుసుతులు మాతృస్నేహంబువలని దుఃఖావేశంబున
జననికంఠంబు వట్టికొని తోఁబుట్టువుల మమ్ము మొదట మట్టుపెట్టి మఱిమీఁదట
మాతృశిరంబుఁ గొట్టి కీర్తిఁగట్టుకొమ్మని బెట్టు చలపెట్టిన వారలనెట్టు విడిపింప
లేక పరశ్వధాయుధుండు దనమోము చూచిన జమదగ్ని యగ్నివిధంబున
బగ్గున మండిపడి రుక్మవత్ప్రభృతులమున్నుగా హతులం గావించి పిదప రేణు
కను దెగవ్రేయు మని త్వరపెట్టిన బెట్టుల్కి యిట్టికట్టిడితనంబున కొడిగట్టుట
కెట్టిపాపంబు చేసితినో యని యెదఁ బట్టుసాలక నెట్టుకొనుదట్టపు నెవ్వగ
నిట్టట్టై యెట్టకేలకు నొడంబడి దిట్టతనంబునఁ దనతోఁబుట్టువుల నొకరొకరిఁ
జెట్టవట్టి కడకు రాఁదిగుచుచు వారు తమ్ముఁడా నీకిది ధర్మంబుగాదని వాపో
వుచు నొకకేల మాతృకంఠంబు విడక నొకకేల నొడ్డించుకొన నొడ్డారంబు
మానక గండగొడ్డంట నన్నలువుర న్నలజడ్డిగంబులు ద్రెంచిన దిగువంబడ్డ
తత్కళేబరంబులపై వ్రాలి వారిబిడ్డలు నిల్లాండ్రు కన్నీరు మున్నీరై
దొరుగ నురంబులు శిరంబులు మోదికొనుచు బహువిధంబుల విల
పించుచుఁ గట్టా యిట్టి శోకం బెట్టు భరింపఁ గలవారము రామా
పరశ్వధంబున నే యిఁక మావధంబునుం గావించి యధిపులం జేర్చి యధికపుణ్య
పదంబునం బొమ్మని వేఁడుకొనిన నట్టిక్రూరకర్ముండ నౌఁగదా యని రెట్టించువగ
రైణుకేయుండు దల్లికిం బ్రణమిల్లి యమ్మా భావంబున నిష్టదైవంబుఁ దలంచు
కొమ్మనిన నమ్మానిని నాకింక నితరదైవంబున్నదే యని పతికి నమస్కృతి చేసి
మహాత్మా మనోవాక్కాయ కర్మంబుల నీవ దైవంబని యుండుదుం గాని యొం
డెఱుంగఁ బురాకృతవశంబున నిప్పుడిట్టిమానసికదోషం బనుభవించితి నీదోషంబు
మరణాంత ప్రాయశ్చిత్తంబున నివృత్తంబుగావించి నాజన్మజన్మాంతరంబుల మీకే

దాసినై పరిచర్య సేయుటకు ననుగ్రహింపుం డని పునర్వందనంబు చేసి కరగత పరశుధారాభీముం డగుపరశురాముం గనుంగొని కుమారకా క్షణభంగురం బైన యీశరీరంబునకుఁ గా విచారంబు వలదు జనకవాక్యోల్లంఘనంబున రుక్మ వదాదు లిట్లయిరి గదా నీవైన జనకవాక్యప్రతిపాలనంబున దీర్ఘాయుష్మంతుఁడవై కులంబు నిలుపుమని రేణుక పద్మాసనాసీనయై పుత్త్రా యన్యుల నియమింపక నా పతి నిన్ను నియమించి మేలు చేసెఁగనుక చెదరక ధారదప్పక యొక్క పెట్టునం దె గనఱకుమీ నేరుపు సూతమను మాత తెగువసూచి తల్లి తెగనఱకుమంచుఁ బెంచి తివే యీచేతులంచుఁ బలపలకన్నీరునించి యొడలు గడగడవడఁక జమదగ్నిదు రాగ్రహదుర్గకుం బలివెట్టుచందంబున నెట్టకేలకుఁ గేలికుఠారంబున రేణుకశిరం బు గఱుక్కనం దెగనఱికినఁ దలమిడిసి యల్లంతటంబడియెఁ దత్కంఠనాళంబున జుల్లున రక్తంబు వెడలునప్పుడు హాహాకారంబులు సేయువారును రేణుకవలన నే మిపాపం బిది యధర్మం బనువారును నిట్లయిన స్త్రీలకింకఁ బాతివ్రత్య మతిదుర్లభం బనువారును ఋషుల కింతరోషంబు చెల్లునే యనువారును పరశురాముం డతి క్రూరకర్ముండు పొమ్మనువారును రాముం డేమిసేయుఁ దండ్రి సెప్పినయట్లు సేసె ననువారును దండ్రి ముదిముది తప్పు సెప్పిన నకార్యంబు రామునకుం జేయఁ ద గునే యనువారును జేయకున్న నన్నులపా టొందఁ డేయనువారును నెట్టిపాటొం దినఁదా నేమి యిట్టిక్రూరకర్మంబున కొడిగట్టఁదగునే బ్రాహ్మణున కనువారును వీ రెక్కడిబ్రాహ్మణులు జన్మాంతరంబున బోయ లనువారును బోయలైనం దమవారిం దెగఁజూతురే యనువారును నిట్టియుత్క్రుష్టకర్మంబున జమదగ్ని కిచ్చట నె యను భవంబునకు రాకపోవునే యనువారును జమదగ్ని సర్వజ్ఞుం డతఁ డెఱుఁగడే యిదియెట్టి ధర్మసూక్ష్మంబో యనువారు నైరి యయ్యాశ్రమవాసు లయ్యెడ గరుడగంధర్వసిద్ధవిద్యాధరాదులతోఁగూడ బ్రహ్మరుద్రేంద్రాదు లంబరంబున నిల్చి యాసాహసకర్మం బద్భుతంబని చూచుచుండి రయ్యవసరంబున. 87

చ. బళిబళి నిన్ను మెచ్చితి నపారభుజాబలధామ రామ నీ
వలయు వరంబు వేఁడు మనివారణ నిచ్చెద నన్నఁ దండ్రి ప
జ్జలజములందు వ్రాలి మునిచంద్ర యొసంగుము జీవితంబు ల
న్నలకును నాదుతల్లి కనినం జమదగ్ని ప్రహృష్టచిత్తుఁడై. 88

తే. వారివారితలలు వారివారికబంధ, ముల నమర్పఁ బంచి మునివరుండు
గరకమండలూదకములు పైఁ జల్లిన, సుతులతోడ బ్రతికె సతియు నంత. 89

ఉ. నిద్దురవోయి లేచుగతి నీరజలోచన లేచి నవ్వులే
ముద్దు మొగంబుతోఁ బతికి మ్రొక్కి పదానతులైన పుత్త్రులం
దద్దయుఁ గౌఁగిలించి మునిదారలతోఁ దగసుద్దులాడుచుక్
నిద్దపువేడ్క నందఱును స్వైరపాటున ముంచె నత్తఱిన్. 90

క. విరిసోనగురిసె మొరసె, న్సురదుందుభు లపుడు మిగులఁ జోద్యములనుచుం
బరితోషంబున వేలుపు, దొరలెన్నిరి వందిమాగధులవలె నంతన్. 91

క. జమదగ్ని యొసఁగె రామున, కమితభుజాబలము సంగరాంగణవిజయం
బమరనరాజేయత్వము, నమరత్వము లోనుగాఁగ నఖిలవరములున్. 92

క. హర శిష్యుండై సురరిపు, హరణం బొనరించి శివుదయఁ దివ్యాస్త్రో
త్కరముఁగని గుహునిపై మ, చ్చరమున భేదించెఁ గ్రౌంచధర మొకకోలన్.

సీ. అంతటఁగార్తవీర్యార్జునుం డొకనాఁడు వేఁటలాడఁగవచ్చి విపినవాటి
గజగండభేరుండఖడ్గాదిదుష్ట సత్త్వములను ఖండించి శ్రమముమించి
జమదగ్ని యాశ్రమస్థలముఁ బ్రవేశించి యతఁడు విందొనరింప నారగించి
కామధేనువుఁగాంచి కలుగదొకో యిట్టి యావునావంటిజనాధిపతికి

తే. నంచు నెంచుచుఁ బురమున కరుగ నతని
చిత్తమెఱిఁగి కుమారు లుద్వృత్తు లగుచు
రాముఁ డటలేనివేళ నాశ్రమముసొచ్చి
కామగవిఁ దెచ్చి తమయింటఁ గట్టికొనిరి. 94

శా. ఆవార్తల్విని భార్గవుండు పటురోషావేశసందీప్త నే
త్రావిర్భూతహుతాశనప్రభవ ధూమాకార ఫాలస్థల
వ్యావల్గద్భ్రుకుటీ మహోగ్రుఁడయి దోరంచత్కుఠారంబుతో
వే వచ్చె న్నగరాటవీ జనపదాన్వేషంబు గావించుచున్. 95

చ. అల గాధేయుఁడు చక్రవాళ కులశైలాంభోధిదేవాప్సరో
లలనాదిప్రతిసృష్టిచేసె నన సాలంబు ల్మహాసౌధరా
జులు ఖేయంబు నృపుల్సుతు ల్మొదలుగా సొంపొందు మాహిష్మతిం
దిలకించెన్ భృగురాముఁ డద్భుతరసోన్మేషానిమేషంబుగన్. 96

మ. కని యారా కృతవీర్యనందనునిభాగ్యం బెంచుఁ దద్గోపురం
బున నుగ్రాకృతి నిల్వ నచ్చటిజనంబు ల్పర్వుతోఁ బోయి య
ర్జునభూభర్తకుఁ దెల్ప నాతఁడు గడుం జోద్యంబుతోఁ దోడితె
మ్మనుచు న్నైజపురోహితుం బనుప నయ్యార్యుండు శీఘ్రంబునన్. 97

తే. ఎదురుగావచ్చి నృపతి మిమ్మిపుడుతోడి, తెమ్మనియెఁబ్రేమ భృగురామరమ్మటన్న
భార్గవుఁ డనర్గళాగ్రహభర్గపటిమ, నిట్లనుచుఁబల్కె నృపపురోహితునితోడ.

క. మేమేటికి వచ్చెద మటు, కామగవిం దెచ్చి యొసగు గ్రక్కున ననినన్
భూమీసురుఁ డెఱిఁగి ధరి, త్రీమండలపతికిఁ దెల్ప ధీరతనతఁడున్. 99

క. తనయులకుఁ జెప్పిపంపిన, విని వార లొసంగ మనిన విభుఁడు సుతులఁ గా
దనలేక గోసహస్రము, వినయంబున నొసఁగఁబనుప విప్రుఁడు నటులున్. 100

క. ఒసఁగినఁ గనుఁగొని కనుఁగొన, నెసఁగినకెంజాయపొసఁగ ఋషిపతి మద్దే
నుసమానులె యీధేనులు, మసారమున కెనయె గాజుమణు లైన్నినన్. 101

తే. వలదుపొమ్మన విప్రుఁడావార్తఁ దెలుప
విని నృపాలుఁడు మాతోడ వికటమేల
విప్రుఁ డేమాత్రమునైన వేడ్కఁ జెంద
వలయు ననుమాట వినఁడె భూవలయమునను. 102

తే. అటులుగాకున్న దనయిచ్చు యాత్మజులకుఁ, జెప్పిపంపిన విన రేమి సేయువాఁడ
ననిన నామాట విప్రుచే నాలకించి, యేల కించిత్తు నన్నెంచుఁ డితఁ డటంచు.

ఉ. మున్నుగ ద్వారరక్షుల సముద్ధతసంగరరంగదక్షులన్
ఛిన్నులఁజేయు భార్గవుని సేనలుగూడి యెదుర్చ భూధరా
భ్యున్నత మత్తదంతి హయతుంగరథాంగభటప్రతానమున్
ఛిన్నముచేసె రాముఁ డతిభీమ కఠోర కుఠారధారలన్. 104

తే. అంత హతశేషమైన సైన్యంబు గొంత
యెంతయును భీతినేఁగె దిగంతములకు
నంతయును విని రోషితస్వాంతుఁ డగుచుఁ
జింతఁ జేయుచు మేదినీకాంతవరుఁడు. 105

క. తనచేతనున్న చాపముఁ, బనిచి నిషంగంబు మెట్టఁబనిచిన నదియుం
జని గొనయమెక్కి చాపము, దనయంతనె సంధిలె న్నితప్రదరములన్. 106

క. సంధిలుచు భూనభోంతర, బంధురతన్నిగుడు బాణపంక్తులు దునిమెం
గంధరగణముల సప్త, స్కంధముగతి రాముఁడల్ల చాపము దునిమెన్. 107

క. చాపము దునిసిన నిషునిధి, రోపంబులు వెడలి తనదు బొమ్మగలింపం
గోపంబున భృగుపతి ప్రతి, రోపంబుల నృపునిశరధి రూపడగించెన్. 108

ఉ. అంతట నర్జునుండనుప నాయుధము ల్బహురూపధారులై
యంతకదండదారుణములై శతకోటి శితంబులై హయః
కాంతకరోజ్జ్వలంబులయి కాలమహాభుజగాదిరాజదు
ర్దాంతములై హుతాశన కరాళములై తనపైపయింబడన్. 109

క. పరశువున రాముఁ డన్నిటి, నిరసింపఁగ నృపతి యణిమనేర్పున నణువై
పరికింపఁగ వచ్చినదనుఁ, బరమమహాయోగి దెలిసిపట్టఁ దివురుటన్. 110

చ. దివి భువి నిండియున్న ఘనదేహము మేరులసత్కిరీటము
న్వివిధ విభూషణంబులును వేయి విధంబుల నాయుధంబు ల
త్యవితథ తేజము న్మహిమనంది త్రివిక్రముఁబోలియున్న న
య్యవనిపుఁజించె నంచిత శరావలి రాముఁ డచంచలాత్ముఁడై. 111

మ. గరిమన్ ధారుణిఁ ద్రొక్కు దిక్కరులు క్రొమ్ముగ్గం గట్టు లిట్టట్టుగా
ధరణీవల్లభు డంత భార్గవుఁడు తత్పాదంబు నుగ్రాశుగ
స్ఫురణ న్నించిన ఖడ్గఖేటధరుఁడై భూమీశుఁ డత్యాశుగ
త్వరతో మింటఁ జరించుచున్ లఘిమచే దర్పం బనల్పంబుగన్. 112

క. ఖగగతి వ్రాలి ఖరాసి, న్భృగురాము శిరంబు వ్రేయ ఋషి పరశువునం
దెగనఱికెఁ దత్ఖడ్గము, జగతీనాయకుఁడు ప్రాప్త సౌభాగ్యమునన్. 113

ఉ. హా యని చేయిసాఁప బహుళాయుధము ల్చెయిగూడు నన్నియు
న్వేయివిధంబులం దునుము వేగ భృగూద్వహుఁ డంతలోనఁ బె
క్కాయుధము ల్ధరించు మనుజాధిపుఁ డంతనె త్రుంచు రాముఁడు
న్నాయక కోటులేసి సురసంఘము విస్మయమంది చూడఁగన్. 114

క. అహమిక భార్గవుఁ డిటువలె, బహులాయుధ తతులఁ దునుమఁ బ్రాకామ్యమహా
మహిమాఢ్యుఁడు నీరమురహి, మహిలీయముగాఁ గుఠారి మహిఁ భేదించెన్.

మ. ఒకచోఁ దేలి మహీశుఁ డీశతగిరిం ద్రోద్యద్ధ్ర ధారోహణో
త్సుకుఁడై సేనకుఁ జేయివీచిన భటుల్బాలాది నానాయుధ
ప్రకరంబు ల్వేయఁగ న్భృగూద్వహుని పైపైఁ బర్వ నుర్వీజముల్
పెకలెం గట్టువనంతఁ దా నెగసి వ్రాలె న్రాముపై నత్తఱిన్. 116

సీ. నిబిడరోషజ్వాల నేత్రాగ్నిశిఖలతోఁ బటుతరోగ్ర ప్రతాపంబు వెలుఁగ
నిటలవక్రీభవ చ్చటుల భ్రూకుటితోడఁ గోదండదండంబు గొనయమెక్కఁ
గటుదంతసంఘర్ష కిటకిటస్వనముతో శింజినీనినదంబు సెవుడుపఱుప
ద్వేషణభీషణ ఘోషణంబులఁ గూడి క్రొవ్వాఁడితూపులు గుదులుగొనఁగఁ
తే. జించి చెండాడె భుజబలో దంచదహిత
హైహయాధీశ సేనల నగవితతుల
జలజములు ద్రుంచు మదమదావళము తేవ
రాముఁ డాహవవిజయాభిరాముఁ డగుచు. 117

తే. వశితచే నంత ధారుణీ వల్లభుండు, మెఱుఁగు మెఱసిన రీతి భ్రమించుచుండి
యఖిల దిక్కులఁ దానయై యనుపమాన, మానమున నిట్టులనియె నమ్మౌనిఁ గాంచి.

ఉ. భార్గవరామ నీవు నొకపౌరుషశాలివిఁ బోలె మచ్చమూ
వర్గముతోడఁ బోరెదవు వద్దిక సాహస మస్మదీయదో
రర్గళనిర్గళద్బహువిధాస్త్ర పరంపర కోర్చి నిల్వఁగా
భర్గుఁడవో ముకుందుఁడవొ పాఱుఁడ వింతియకాక పాఱుమీ. 119

చ. ధరణిసురుండ వంచుఁ జెయి దాళితిగాని పరుండవైన దు
ర్భరశరమండలిం గెడపి భండనసీమఁ బరుండ నుంతు సం

గరముఁద్యజించు మింకయినఁగాక యెదిర్చిన నోర్వఁ జెప్పితిన్
దురితములేదు నాకిఁకను దోఁచినరీతి నొనర్తు గ్రక్కునన్. 120

చ. పొలుపుగఁ గొండకట్టెలకుఁ బోయెడివానివిధంబుదోఁప గొ
డ్డలి యిదియేమి దీనజగడం బొనరింపఁగ వచ్చితే బళా
బళ భృగురామ యన్న నరపాల నిజంబు సమిత్ప్రియుండనై
నలువుగ నర్జునచ్ఛిదమొనర్పఁగ వచ్చితి నంచు రాముఁడున్. 121

శా. ఔరా విప్రుఁడ నంచు నం జులకసేయ న్వచ్చితే మంచిదే
రావమ్మా ధనువూని నీవయినశస్త్రం జేను వీక్షించెద
న్శూరత్వంబులు మీకె యంచు నజుఁ డెచ్చో ముద్ర గావించెనే
లేరా బ్రాహ్మణశూరు లింకిటను గల్పింతు న్ననుం జూడుమా. 122

మ. ప్రమథేంద్రుండు నుతింప నంపమొనచేఁ గ్రౌంచాద్రి భేదించి మా
ర్గముఁ గల్పించితిఁ దొల్త నంచలకుఁ దక్కాండంబుల న్నీదువ
క్షము భేదించి మదీయకీర్తినవహంసం బెల్లచోఁబోవ మా
ర్గముఁ గల్పించెద నాబలంబుగను మింకం గార్తవీర్యార్జునా. 123

తే. అనుచు రాముఁడు ఘనరీతిఁ దనపృషత్క, తతి సహస్రకరస్ఫూర్తి దరలఁ జేయఁ
బఱచె నంతట నర్జున పక్షబలము, మానసమున కఠినమై మనుజవమున. 124

ఉ. అంతట భార్గవుండు బిధురాగ్రకఠోర కుఠార ధార దు
ర్దాంతమహాకృతారి వనితా జనితాస్రము కార్తవీర్యభూ
కాంతభుజాసహస్రము సగర్వసహస్రముగాఁగ మించివి
భ్రాంతునిఁజేసి కుత్తుకకుఁబోవ శిరంబున దక్షిణంబునన్. 125

తే. కార్తవీర్యుఁడు ఘనసమీకార్తవీర్యుఁ
డగుచుఁ గూలిన నన్యోన్య మయుతు లగుచు
నతని పుత్త్రకు లయుత సంఖ్యాతులెల్ల
కడల కేగిరి ప్రాణము ల్గాచి కొనఁగ. 126

చ. అసదృశకీర్తికామగవి నాజిశరత్కబళీకృతార్జునుం
డెసలఁ జరింపఁబంచి జగతీవరజాహృతకామధేనువున్
మసలక తెచ్చియిచ్చి నృపమారణమున్ జమదగ్ని మౌని కిం
పెసఁగఁ గుఠారి దెల్ప నతఁ డిట్లనియెన్ సవిషాదచిత్తుఁడై. 127

సీ. నిరతంబుఁ గొల్వఁడే దురితంబు లణఁగించు దానేప్సితత్యాగి దత్తయోగి
భుజసీమ నిల్పఁడే నిజధామసంరక్షితాబ్ధి చతుష్కాంత నవనికాంతఁ
జెఱసాలవెట్టఁడె మొఱసాలవెట్టంగఁ బ్రధనజయోత్కంఠుఁ బఙ్క్తికంఠు
ధృతిఁదృప్తుఁజేయఁడే యతితప్తుఁడై వేఁడు సకలదాహామోదుజాతవేదు

తే. సకల సామాన్యుఁడే యణిమాదిసిద్ధి, సిద్ధకీర్తిత్రిభువన ప్రసిద్ధకీర్తి
స్నిగ్ధసద్గుణరత్న ప్రసిద్ధమూర్తి, శత్రుసమవర్తి యర్జునచక్రవర్తి. 128

క. ఒకయావున కై నృపునే, టికిఁ జంపితి వింతకటికిడెందము దగునే
యకటా విప్రున కఘునా, శకముగ నీకుఁ దీర్థయాత్ర సలుపుము పుత్త్రా. 129

క. అనినం గాసిమ్మని పని, వినియె భృగూద్వహుఁడు కార్తపీర్యసుతులు తం
డ్రిని జంపిన పగ తీరుచు, కొనవలెనని పొంచియుండి క్రూరాత్మకులై. 130

మ. ఒకనాఁ డాశ్రమవేదికాంతరమున న్యోగాఢ్యుఁడై యున్న య
య్యకలంకున్ జమదగ్నిఁ జుట్టుకొని చేయంటన్ జడల్పట్టి మ
స్తకముం బాణి కృపాణిఁగొట్టి ధరమీఁద న్వైచి వేచన్న రే
ణుక హానాథ యటంచు మోదికొనియెన్ శోకంబుతోఁ బల్మఱున్. 131

తే. ఏఁటిలోపలఁ దీర్థంబు లెల్లఁ దిరిగి, యప్పుడచటికి భార్గవుఁ డరుగుదెంచి
తండ్రిఁ గనుగొని శోక దందహ్యమాన,మానసుండయి విలపించె దీనుఁడగుచు.

క. కలనైనఁ బరుల కాపదఁ, దలఁపని నీకిట్టికీడు దైవముదలఁచెం
దలక్రొవ్వి నేనొనర్చిన, కలుషంబున నేమి సేయఁగల నిఁక తండ్రీ. 138

తే. అనుచు వగచుచున్నచో మునులు రుచిర
వాగమృతధారఁదచ్ఛోకవహ్ని నణఁచి
తండ్రికై తర్పణాది కృత్యములు దీర్చ
మనిన భార్గవుఁ డనియె సత్యాగ్రహమున. 134

క. అనదవలె నదిజలంబుల, జనకునకుం దర్పణం బొసంగుదునే య
ర్జునసుతశోణితములచే, నొనరుతు వినుఁ డదియుఁగాక నొక్కప్రతిజ్ఞన్. 135

చ. ఇరువదియొక్కమాఱు జనయిత్రి యురఃస్థలి మోదికొంట నే
నరసితి నన్నిమాఱులు నృపాన్వయజాతుల దుర్వినీతులన్
దురితసమేతులన్ ఖలులఁ ద్రుంపకమాన నటంచుఁ గ్రోధియై
పరశువుఁబూని యర్జుననృపాలకుమారజిఘాంస నత్తఱిన్. 136

సీ. మునుమున్న నతిరయంబునను మాహిష్మతి కరిగి తన్గనుఁగొని యార్తులగుచు
నెఱుఁగక చేసితి మీతప్పు సైరింపు రామరామయటంచుఁ బ్రాణభీతి
బతిమాలి వేఁడినఁబదములు వ్రాలిన సందులుసొచ్చిన శరణమనినఁ
దలవీడ మొలవీడ నలుగడఁ బఱచినఁ బారిగ్రసించినఁ బోవనీక

తే. బ్రహ్మఘాతుకులార దురాత్ములార, దయయుధర్మంబు మీయందుఁ దలఁపఁదగునె
యనుచు గోచరులైన యర్జునసుతులను, బాఱిగొఱియల నఱకిన పగిది నఱికె. 137

చ. పురముల కేఁగు భూవరులఁబోరికిరమ్మని చీరు వచ్చినం
బరశువు చేతఁ జీరు భయపడ్డనృపాలురు రాకయున్న స

త్వరముగ నీడ్చి తెచ్చి యమవాసముఁ జేరుచు నిట్లు ధారుణిం
దిరుగుచు నెల్లరాజుల వధించె భృగూద్వహుఁ డట్టివేళలన్. 138

సీ. కొట్టివైచినతల ల్గుట్టలై కాటుకకొండలదండిని మెండుసూప
భూరిమాంసంబులు ప్రోవులై మించుచుఁ గాంచనాచలములకరణిఁ గాంచ
నాకసం బంటిన కీకసరాసులు రజితశైలంబుల రహిఁ వహింప
నెల్లనై నెత్తురుటేఱులువాఱుచు శోణనదంబుల సొంపు నింపఁ
తే. జెలఁగి మెసవుచు భూతము ల్చిందులాడె
కంకగృధ్రాదిఖగముల కఱవుదీఱె
నారదుఁడు మెచ్చుచును దండనాలుపాడె
ధరణి నిర్భరయగుచు సంతసముఁగూడె. 139

తే. ఏనుమడుగు లగుచు నిల రాజరక్తంబు, గనె శమాప్తపంచకప్రసిద్ధి
రాముఁ డాజివిజయరమఁగూడి క్రీడింప, నలరుకుంకుమంపుఁగొలనులనఁగ. 140

సీ. ఇవ్విధంబున రాముఁ డెల్లరాజులద్రుంచి చిత్రశక్తిని గురుక్షేత్రమునను
బరిహృతపాతకపంచకంబుగ క్షోణినాయకరక్తంబునను శమంత
పంచక మొనరించి భక్తితోనటఁబితృ తర్పణంబు ఘటించి ధన్యుఁడగుచు
నశ్వమేధము చేసి యలసరస్వతిలోన నవబృథస్నానంబు లాచరించి
తే. యవని దక్షిణగాఁగశ్యపున కొసంగఁ
దన్మహత్త్వంబునను జమదగ్ని శీర్ష
యుక్తుఁడై సప్తఋషులలో నొక్కఁడగుచు
వెలుఁగుచున్నాఁడు నక్షత్రవీథియందు. 141

ఉ. అంతట శాంతిఁగైకొని వనాంతమునం దపమాచరించె దు
ర్దాంతమహాభిరాముఁ డగురాముఁడు నయ్యెడ గాధిమేదినీ
కాంతకుమారపౌత్త్రుఁ డతిఘాతుకబుద్ధి పరావసుండు క్ష
త్త్రాంతకుఁజేరవచ్చి దురహంకృతిమీఱఁ దృణీకరించుచున్. 142

మ. మును మున్నీవుప్రతిజ్ఞ చేసితివి నిర్మూలింతు క్షాత్త్రం బటం
చును నేఁడేల భయంబుఁ జెందితివి యిచ్చో నట్లుగాదే ప్రవ
ర్ధనరాణ్ముఖ్యులనొంపవేమిటికిఁగారా వారు రాజు ల్నినుం
గనినం బోవఁగనిత్తురే తొలఁగు మింకన్ దుష్ప్రతిజ్ఞానిధీ. 143

వ. అని సదృక్షమునిసమక్షమంబునం బరావసుం డధిక్షేపించిన నతిపీక్షరాక్ష
ణుండై భృగుకులాధ్యక్షుం డిట్లనియె. 144

క. బాలురు వృద్ధు లటంచును, జాలించితిఁగాక వెఱవ క్షత్త్రియుల కికన్
నేలంగల రాజులను స, మూలం బాబాలవృద్ధముగ ఖండింతున్. 145

మ. అని యత్యుగ్రత భార్గవుం డవనిలో నాబాలవృద్ధంబుగాఁ
దునిమెన్ రాజుల నేమిచెప్పుదును దద్రోషంబు రాజాంగనా
జనగర్భంబుల నూడ్చె హుంకృతి ధనుజ్యాటంకృతిన్ ఘోరగ
ర్జనలన్ రూక్షనిరీక్షణచ్ఛటల దుర్దాంతాట్టహాసంబులన్. 146

తే. ఇవ్విధంబున రాజుల నెల్లఁద్రుంచి, యరిగి మఱికొన్ని నాళ్ళకుఁదిరిగివచ్చి
ఆదిఁదనదృష్టిపథమున కందనట్టి, గర్భములఁ బుట్టుశిశువులఁ గని వధించు. 147

శా. ఈలాగిర్వదియొక్కమాఱు నృపులన్ హేలాగతిన్ రాముఁడా
బాలప్రౌఢజనంబుగాఁగ వధియింపన్ రాజకాంతావిలా
పాలాపంబులు భూమినెల్లెడల మెండై నిండెఁ దద్దైన్యము
న్మాలించె న్మదినెంచి కశ్యపుఁడు రాముం జేరి దీవించుచున్. 148

మ. ఇల నిక్షత్ర మొనర్చి చేసితి మఖం బీవిశ్వవిశ్వంభరన్
బళిరే దక్షిణగాఁగ నిచ్చితివి దానక్షాత్రధర్మంబులం
గలరే నీసరి యీక్షితిస్థితిని సాక్షాత్పంకజాక్షుండ వీ
వలఘుస్తోమయశోభిరామ భృగురామా సార్వభౌమాంతకా. 149

క. మాకొసఁగిన వసుమతిలో, నీకేటికి సంచరింప నిఁక దక్షిణర
త్నాకరతీరముఁజేరు ప్రభాకరశశికులవిరామ భార్గవరామా. 150

క. అన మంచిది యని రాముఁడు, చని చాపం బెక్కువెట్టి శరము [1]దొడిగి వా
ర్థినిఁ గొట్టఁ బోయి నంతనె, తనరంగా కొంతచోటు తత్క్షణ మొసఁగెన్.

తే. అందు విహరించె రాముఁ డనంత నంత
బ్రాహ్మణులకిచ్చి యంతఁ దపంబుసేయఁ
జనియెఁ గశ్యపుఁ డవని కాశ్యపి యనంగ
నమరె నదియాది మఱియుర్వి యాట వినుము. 152

చ. క్షితిసురు లిట్లుకశ్యపునిచే మహిగాంచి ప్రభుత్వ మొప్ప సం
తతమును రాజభోగపరతంత్రత భార్గవుచే ననాథలై
గతిమఱి యొండులేమి నృపకాంతల సమ్మతి బల్మినైన సం
గతి యొనరించుచుం గ్రతుమఖక్రియ లన్నియు నీఁగి రయ్యెడన్. 153

తే. తగిన దండంబులేమి నుద్దండవృత్తి, వైశ్యులును శూద్రులును విప్రవరు లుదార
గోధనాదుల బలిమిఁ గైకొనఁగఁ దొడఁగి, రిట్లరాజకమై ధర్మ మెల్లఁ జెడిన. 154

క. కుతలం బతలం బంటిన, వెతలం బడుచున్న జనుల విని కశ్యపుఁ డూ
రుతలంబున నెత్తఁగ క్షో,ణితలం బుర్వియనఁ బరఁగు నృపకులతిలకా. 155

1 దొడిపయో, ధినిఁజొట్టువేఁడఁజుట్టుం, దనలోఁ జేటంతచోటుఁ దటమున నొసఁగెన్.

వ. ఇవ్విధంబున కశ్యపమునివలన సముద్ధరింపంబడిన ధరావరోహ యద్ధీరాగ్రణి
కిట్లనియె. 156

మ. అనఘా విప్రులు ప్రోవలేరు నను బ్రోద్యద్బాహుశౌర్యంబుచే
ఘనులౌ రాజులె గాని భార్గవమహోగ్రక్రోధదావాగ్ని ద
ప్పినవార ల్గలరందు నందు నృపతు ల్పేర్కొందు నన్నామము
ల్విని రప్పింపుము వారి ధర్మపరుల న్విఖ్యాతశీలాఢ్యులన్. 157

సీ. కశ్యపమునినాథ కాచితిఁగొందఱ హైహయులను గుహలందు దాఁచి
పౌరవాన్వయుఁడు విదూరథతనయుండు ఋక్షవద్గిరియందు ఋక్షరక్ష
సౌదానవర్యుండు శక్తిజు శరణొంది దధివాహసుతుఁడు గౌతమునిఁ గొలిచి
గోపాలనముఁజేసి గోపతియనురాజు వత్సముల్మేఁపుచు వత్సనృపుడు

తే. గృధ్రకూటమనెడు గిరినిగోలాంగూల, జాతివలనభూతి జలధిచే మ
రుత్తుసుతులు మువ్వురును బ్రతికిరివారిఁ, బతులఁజేయు నాకు భవ్యమతుల.

మ. అని ప్రార్థించిన మంచిదే యని దయైకాయత్తచిత్తంబుతో
మునిచూడామణి శిష్యులం బనిచి సమ్మోదంబుతోఁ దెచ్చి వా
రిని సామ్రాజ్యపదాభిషిక్తుల నొనర్చె న్వారలుఁ భూమిపా
లనముం జేసిరి ధర్మమెచ్చ జన ముల్లాసంబుఁ గాంచె న్నృపా. 159

తే. విప్రులకు రాజసతుల కావిర్భవించి, రుత్తమక్షత్రియులు ధర్మయుక్తు లగుచు
నంతటను వారి సంతతులతిశయిల్లె, ధరణి నంతటఁ దామర తంపరగుచు. 160

తే. భార్గవుం డిప్పుడు మహేంద్రపర్వతమున
నున్నవాఁడు తపోధను ల్దన్నుఁగొలువ
నాతఁడేగాదె భీష్మకర్ణాదులకును
జాపవిద్యోపదేష్టయై జయము లొసఁగె. 161

మ. అనఘా యీభృగురామచర్య వినువా రత్యంత పుణ్యాత్ములై
యనిశంబుఁ బహుభోగభాగ్యములు దీర్ఘాయుష్యవైదుష్యముల్
ధనధాన్యంబులు బుత్త్రపౌత్త్రులును భద్రంబు ల్మనోభీష్టము
ల్గని రాజిల్లుదు రెందుఁ గాంతురు తుదిం గైవల్య సామ్రాజ్యమున్. 162

క. అని శ్రీవైశంపాయన, మునిముఖ్యుఁడు దెల్ప విని ప్రమోదాన్వితుఁడై
జనమేజయుఁ డవ్వలికథ, యనఘా వినవలతుఁ దెలుపు మని యడుగుటయున్.

ఉ. తీక్ష్ణమహామహోనిధిసుధీయుత దారకతారదారకా
శ్లక్ష్ణకలావిహార యుడుజాలసమాచ్ఛవిహార యాశ్రితా
భీక్ష్ణముదంచితాత్మ యవిభిన్నదృశోరచితాత్మ మేదినీ
రక్షవిధాన దానచతురస్న యశోధన శ్రీయశోధనా. 164

క. పుంఖ్యాతియుత సరస్వతి, సాంఖ్యవిశేషజ్ఞ యోగశాస్త్రాభిజ్ఞా
సంఖ్యావత్పరిపోషక, సంఖ్యాతిగసుగుణధామ సచివలలామా. 165

పంచచామరము. ధరాజరాజరాధిరాజదాతృతాజితాంగణా
ధరాజరాజరాజ దేవతావధూప్రదాసుధా
ధరాధరాధరాధరామృతస్పృహా మహావసుంధరా
ధరాధరాతిశౌర్య ధైర్య దారితారికంధరా. 166

గద్య. ఇది శ్రీరామభద్రదయాభిరామభద్రకరుణాకటాక్షవీక్షాపరిప్రాప్తదీప్తతరాష్ట
భాషాకవిత్వ సామ్రాజ్యధౌరేయ సకలవిద్వత్కవిజనవిధేయ ధరణిదేవుల నాగ
నామాత్యసుధాసముద్రసమున్నిద్రపూర్ణిమాచంద్ర రామమంత్రీంద్రప్రణీతం
బైన దశావతారచరిత్రంబను మహాప్రబంధంబునందు షష్ఠాశ్వాసము.

౬. భృగురామావతారకథ సమాప్తము.



# ౭. శ్రీరామావతార కథ.



## సప్తమాశ్వాసము.




యుతధామ దిశాక్షా
మాయత సితకీర్తి ధామ మగడలకులధా
రేయ భుజావిక్రమ గా
రేయ సుధీ గేయ సత్యకృష్ణామాత్యా. 1

తే. అవధరింపుము జనమేజయక్షితీశ, శేఖరున కిట్టులను వ్యాస శిష్యమౌని
ధరణినాయక రామావతార మింకను, దెలియఁ జెప్పెద వినుమని తెలుపఁదొడఁగె.

సీ. హారిబింబరమావిహారకేళీశ్రాంతి హారికేతనమనోహారిరథము
గంధనాగధుతాభ్రగంధవతీజాత గంధప్రసూనసగంధపదము
వాహానైకగతిప్రవాహ పాంసులగంధవాహధూసరి తాంబువాహఘటము
వీరరసోన్నిద్రవీరభద్ర హసద్గవీరమాహావ మహావీరభటము

తే. ధర్మపరధర్మసాధర్మ్యభర్మవిశ్వ, కర్మనిర్మితశర్మదనర్మహర్మ్య
నిర్మలాభోర్మిదృశిధాతుకర్మితాచ్య, తాభ్రమధ్యాపురం బయోధ్యాపురంబు.

క. ఆపుర మేలుఁ దశరథ, భూపాలకుఁ డాజివిజయభుజభుజగమహా
చాపాహితరోపాహృత, కోపాహృతవిమతనృపతి కులపాలకుఁడై. 4

చ. అతఁ డొకనాఁడు నిండుకొలువై చెలువై బలవైరికెంతయుం
బ్రతియగు శీవిమీఱఁగఁ బరాకుపరాకు పరాకటంచు వం
దితతులుసారె మ్రొక్క ధరణీతరుణీ పరిణీవరాళి ను
న్నతరుచిఁ దెల్పఁ గానకలనా లలనాకలనాదముల్వినన్. 5

సీ. విశ్వంభరాభారవిధుర కుంభీనస ప్రతిసృష్టి యెవ్వాని బ్రహ్మయష్టి
గాఢాంధకారనిర్గంధ నతమసరోజపకరం బెవ్వానిజపసరంబు
ఘటజాత గౌరవోత్కటహర్షితార్ఘ్య విగ్రహాచండి యెవ్వానిమహితకుండి
కనకగర్భాసాధ్యకౌశికేష్టవిధానతోషితం బెవ్వానిభాషితంబు

తే. కమలసంభవకమలేశ కమలభృత్క, లాకలాపాది సురలోకలోకభయద
కలశదత్తాక్షి యెవ్వాని జలరుహాక్షి, యట్టిఘనుఁడు వసిష్ఠసంయమధనుండు. 6

క. చను దెంచిన నెదురుగఁ జని, వినయంబునఁ దోడితెచ్చి విభుఁడు సువర్ణా
సనమున నునిచి సపర్యలు, నొనరిచి యిట్లనియె నతిమృదూక్తులు మెఱయన్. 7

మ. అనఘాత్మా యనపత్యతాదురిత మత్త్యాళీంద్ర మస్మన్మనో
వనజాతాని శజాతమోదరస సేవం జొక్క నే సౌఖ్యముం
గన లేనైతి సమగ్రభోగముల నింకం దన్మిలిందంబు గ్ర
క్కున వారింపుము భూరిసంతతి యొసంగం జాలఁ బ్రార్థించెదన్. 8

తే. అనిన సమ్మతి ఋశ్యశృంగాదిమౌని, పతులఁ గూడి యరుంధతీప్రాణనాథుఁ
డశ్వమేధంబు సేయించి యధిపుచేతఁ, బుత్త్రకామేష్టి వేల్పింపఁ బూనునపుడు.

సీ. శచిముద్దుమోమునఁ జక్కఁగాఁ దిలకంబు దిద్దిదిద్దకవచ్చె దేవభర్త *
కులశైలతనయ చెక్కులయందు మకరిక ల్వ్రాసివ్రాయకవచ్చె వామదేవుఁ
డోడికంబుగా వాణినిడువాలుకీల్జడ యల్లియల్లకవచ్చె నబ్జభవుఁడు
కలిమిపూఁబోఁడి గుబ్బల కమ్మకస్తూరి పూసిపూయకవచ్చె వాసుదేవుఁ

తే. డన్యదివిజులు దామున్నయట్లు వచ్చి
రింతయును దామసము లేక ఋశ్యశృంగ
మౌనిమంత్రబలాహూయమాను లగుచు
నహహ కొనియాడఁ దరమె యయ్యనఘుమహిమ. 10

మ. హవిరర్థాగత దేవతావిరహరుష్యన్నిర్జరీభేదన
ప్రవణానంగసమాహృతప్రసవసర్వస్వావృతాహారలో
కవనీదోహదధూమ మో యన వపాగంధస్ఫురద్ధోమధూ
మవితానంబు నభోంతరాళపదవిం బర్వెన్ ఘనశ్యామమై. 11

క. ఆయెడ శిఖిభవ పురుషుఁడు, పాయసభాజన మొసంగె బహువిధమంత్రో
పాయసభాజనక్షత్త్రనృ, పాయసభాజనములలర నవనీపతికిన్. 12

సీ. దశరథమేదినీధవుఁడు పాయస మగ్రసతికిఁ గౌసల్యకు సగమొసంగి
పిమ్మటఁ గైకేయ ప్రియురాలు గావున కడమ యియ్యఁదలంచి కైకకన్నఁ
బ్రాయంబుచేఁ బెద్దపత్ని నుదాసింపఁ బాడిగాదంచును బరకపాలు
మాత్రంబొసంగి సుమిత్రకుఁ గైకకుఁ బాతికె పాలిచ్చి పరకపాలు

తే. మరలి యెల్లసుమిత్రకె మమత నొసఁగె
మునుపుఁ గొంచెమె యిచ్చితి ననుచు నెంచి
యంతఁ గాంతలు దత్పాయసాంశములను
మెసవి యారూఢగర్భలై యెసఁగుటయును. 13

సీ. హరువుగా మృగనాభి యలఁదితే కుచచూచుకంబుల నైల్యంబు గదియనేల
విడియంపుకపురంపు వెలిడాలు గ్రమ్మెనే పసిఁడిచెక్కులు వెల్లబాఱనేల

కటికుచంబుల నీర్ష్యఁగాంచెనే నేఁడైన బలువుఁజూపె నదేమొ యలఁతినడుము
పరమాన్నరుచి గ్రోలఁబరపదార్థములందు నరుచిపుట్టెనో పల్చనయ్యెఁదనువు
తే. పనులుదఱచయ్యెనే యింత బడలనేల
లేలు వేఁగింతురే పగలేల నిద్ర
యనుచు దశరథుఁ డతిమోదమెనయ నర్మ
వచనములఁ దేల్చె దౌహృదవతుల సతుల. 14

ఉ. మేటిగఁ జైత్రశుద్ధనవమీబుధవారపునర్వసూడుక
ర్కాటకలగ్నవేళ గురురాజులు గూడ గ్రహంబులుచ్చతం
బాటిల నైదుఁ గోసలనృపాలసుతామణిగర్భవారిధిం
గోటిశశాంకతేజముఁజిగుర్కొన విష్ణుఁడుపుట్టె రాముఁడై. 15

తే. అచ్యుతాంశార్ధమున రాముఁ డవతరింప
హరిచతుర్థాంశమునఁ గైక భరతుఁ గనియె
నలసుమిత్రకు వెనుకఁబాయసము గొనియు
నాథునుద్దేశమే ప్రధానంబుగాఁగ. 16

క. గుణవతి సుమిత్ర సుజన, ప్రణుతుల హరి పరకపరకపా లొసఁగఁగ ల
క్ష్మణశత్రుఘ్నుల శుభల, క్షణుల న్సుజగమువారుఁ గడుహర్షింపన్. 17

సీ. దివిపిక్కటిలమ్రోయు దివ్యదుందుభుల సంరావంబు లభ్రగర్జనలుగాఁగ
నటియించు నప్సరఃకుటిలాలకలమేని మెఱుఁగులు తొలుకరి మెఱుఁగులుగను
దిలకించు వైమానికులచిత్రభూషణాంబరకాంతి యింద్రచాపంబుగాఁగ
మలయాచలాయాత మందమారుతములు తతశీతవాతపోతములుగాఁగ
తే. జనముదశ్రుప్రవాహము ల్పందడింప, మునిజనానందకందము ల్మొలకలొత్త
రావణగ్రీష్మతప్తధరాతలంబు, శైత్య మొందంగఁబుష్పవర్షములు గురిసె. 18

వ. అంత. 19

క. సరభసగమనఝళంఝళ, చరణమణీనూపురములు సగమెఱిఁగింపం
దరుణులు దెలిపిరి యంతః, పురవనితలు నుతులఁ గనుట భూపాలునకున్. 20

మ. ఘనసంతోషము మీఱఁగా దశరథక్ష్మాపాలచంద్రుండు వే
చనికాంచెం బురుటింటిలోపలను గౌసల్యాంక భాగంబునం
గనియై నిల్చెనొ సర్వలోకముల శృంగారం బనా మీఱురా
ముని గల్యాణగుణాభిరాముని జగన్మోహప్రభాధామునిన్. 21

తే. దశరథుఁడు రాముఁడై పుట్టె ధరణిలోన, నాత్మయే పుత్రుఁడై పుట్టు ననఁగ వినమె
యట్టియాత్మావలోకనం బవనిపతికి, సమ్మదముఁ జేయు టేమియాశ్చర్యమపుడు.

క. పుత్రోత్సవ మొనరించెన్, ధాత్రీపతి రత్నధాన్య ధనముల విశ్వా
మిత్రుఁడు దనలోఁ దలఁచెం, జైత్రంబుగ నుత్సవంబు సలుపఁగ నంతన్. 23

తే. నామకరణాదికము లుపనయన మవని
రమణుఁ డొనరింపఁ గ్రమమున రాముఁ డనుజ
సహితముగ వంశగురుచెంత సకలవిద్య
లభ్యసించి ప్రవీణుఁడై యధివసించె. 24

క. అట నొక్కనాఁడు కౌశిక, జటివరుఁ డరుదెంచి సవన సంరక్షణముగా
ఘటియింప రాము వేఁడినఁ, గటకట పడు దశరథేంద్రుఁ గని గురుఁ డనియెన్. 25

సీ. ధరణి నేకాతపత్త్రంబుగాఁ బాలించె బ్రహ్మర్షీశ్వరపదముఁ గాంచె
మేనకాధరసుధాపానంబునకుఁ జొక్కె రంభ నుదిట్టెఁ జట్రాయిగాఁగ
నలుకఁ శక్త్యాదిపుత్త్రుల మన్నిఁ గొనిపించెఁ బశువగు ద్విజపుత్త్రుఁ బ్రతుకఁ జేసె
గురుశాపహతుఁ ద్రిశంకుని దివంబున నిల్పెఁ బీడించె దత్పుత్త్రుఁ బెక్కుగతుల
తే. వేదమాతను గాయత్త్రి వెలయఁ జేసె, వివిధశస్త్రాస్త్రము లెఱింగె విశదముగను
వినవిచిత్రము గాధిపుత్త్రుని చరిత్ర, మనఘగుణగణ్య దశరథజనవరేణ్య. 26

క. సుతుఁ బంపు మితని వెంటం, గ్రతురక్షణమునకు శుభము గలుగు నటన్నన్
క్షితిపతి కుతుకంబున రఘుపతిఁ బిలువఁగ నూడిగములఁ బనుపఁగ వారున్. 27

సీ. సిగకునందక వెన్కఁ జెరలాడుకురులతో లాగియౌ మట్టికుళ్లాయి దనరఁ
జిన్నారి నొసటి కొంజెమట యూడిగములు వలిపెంపుఁ జల్వపావడలఁ దుడువ
నునువెడందయురంబునను జీనిసరిపెణ ల్మిన్నజన్నిదముతో మేలుఁ గొనఁగ
బెడఁగు చెంగావి చల్లడముపై బిగియించి కట్టినకొంబట్టు దట్టి దనర
తే. సంజ కెంజాయ దగు నీలజలద మనఁగ
మెఱుఁగు టెఱమట్టి జిగితోడి మేను మెఱయఁ
జిగిలి సానాకరంబునఁ జెలువు గులుక
గరిడి వెలువడి వచ్చు రాఘవునిఁ గాంచి. 28

చ. వినయము మీఱఁ జేరి రఘువీర పరాకు నృపాలమౌళి చ
య్యనఁ బిలుమన్న వచ్చితి మటన్న విశేషము లేమి కొల్వులో
ననుచు రఘూద్వహుం డతిరయంబున లక్ష్మణుకేలు దండతో
మినుకుఁ గడాని వ్రాఁత పని మేలరిగె ల్పయిపై నటింపఁగన్. 29

సీ. శిరసెత్త మునివ్రేలివరుస గన్నులుగల్గు బలుకొమ్ము మగఱాల పనుల పైఁడి
సింహలలాటంబు జీవదంతంబులగొడియలు గడవన్నె గొప్పగిండ్లుఁ
బచ్చసూర్యపుటంపుఁ బన్నాగమును మేలి పట్టుచట్టంబు కెంబట్టుపటము
సన్నజీనామాలిజాళువా పిడికుచ్చు ముసనాబు కుచ్చులు పసిఁడిసరిగె
తే. కుట్టుతాపెతబటువులు కొద్దిసులువు, పట్టయొరఁగును గుంకుమపఱపు చెలువ
మైరి నీ చేలకప్పుఁ జొప్పడు కుమార, యంతలం బెక్కె శ్రీరఘునందనుండు. 30

క. అడుగుందమ్ముల రజముం, దుడిచెన్నిబికావహుండు తోడనె యొకడ
ప్పుడు వడిగ మైత్రినొందుచు, నడకువ సౌమిత్రినడచె నగ్రజువెంటన్. 31

సీ. నగరువాకిటనె యందలము డిగ్గిబుజాన వలెవాటువైచిన జిలుగుఁజేల
కటితటంబునఁజుట్టి గండూష మొసరించి భయభక్తు లమర లోపలికి నరిగి
యొడ్డోలగంబయి యున్నతండ్రినిఁ జేరి జనపతి కౌశికముని యితండు
నతిసేయు రామ యన్నను ప్రేమ మ్రొక్కిన "శీఘ్రమేవ వివాహసిద్ధిరస్తు"
తే. అనుచు రామునిదీవించి మునివరేణ్యుఁ, డెత్తియక్కునఁ జేర్చుక యేకపీఠ
సీమవసియింప రామ కౌశికులవారి, వాఁడవైతివె యని నృపవర్యుఁ డనిన. 32

తే. మునులపాలిటివాఁడె రాముఁడు నృపాల
నిజమె పల్కితివనుచు భూభుజుఁడు వనుప
రామలక్ష్మణు లిరువురుఁ బ్రేమ వెంట
రా మునీశ్వరుఁ డాశ్రమసీమ కరుగ. 33

మ. తలపొంబట్టుకులాయలుం దళుకునిద్దాయొంట్లుఁ గస్తూరిప
ట్టెలుఁగర్పూరపునామము ల్దగటుదట్టీచల్లాడల్ ఖడ్గము
ల్మొలవంకు ల్విలునమ్ములుం గవదొన ల్ముంగొంగుబంగారు దు
వ్వలువ ల్చెల్వుగ రామలక్ష్మణులు విశ్వామిత్రుతో వచ్చుచోన్. 34

సీ. అటునిక్కిచూచిన నమరావతీపురి వీథివారలు వెఱ వేఁకిపడఁగ
నిటుబారసాఁప దిగీశానపురవాసు లళుకొంది సందుగొందులకుఁబాఱ
నటుద్రొక్కి నడచిన నణఁగుభూమిభరంబు భరియింప ఫణిరాజు పడగలెత్త
నిటు గేరినవ్విన నింద్రాగ్ని యమముఖ్య దివిజులంగుళములు సెవులఁ జొనుపఁ
తే. గఱకుఁగోఱలు మిడిగ్రుడ్లుఁ జులుకుఁజూపు
వ్రేలుఁజన్నులుఁ దెఱనోరు వికృతముగను
గదియుతాటకిఁగూల్చె రాఘవుఁడు జటిలు
మాట జవదాఁటు కట వనమార్గమునను. 35

వ. ఇవ్విధంబున. 36

ఉ. తావచియించుమాట జవదాఁటక తాటక నొక్కకోలచే
గ్రావమగల్చువజ్రికడకం బడనేసిన రాము మెచ్చుచున్
దేవనియుక్తుఁడై యొసఁగె దివ్యతరంబయి మించు నస్త్రశ
స్త్రావళి నెల్లఁ గౌశికుఁ డుదారునకున్ రఘువీరమౌళికిన్. 37

ఉ. కాచె రఘుప్రవీరుఁ డటఁ గౌశికయాగము సత్క్రియాగము
న్నీచవిచారులై దనుగణింపక విఘ్నము సేయవచ్చు మా
రీచుఁ బయోధిఁ గూలిచి హరించె సుబాహుని బాహుశక్తి దో
షాచరసేనలం దునిమె సర్వమునీంద్రులు సన్నుతింపఁగన్. 38

తే. గాధిసుతుఁ డంత శ్రీరాముఁ గౌఁగిలించి
యాది నమరుల కొసఁగితి వమృత మిప్పు
డాహవాంతంబున విరోధికీహవాంత
మునను మాకు ఘటించితి వనరుహాక్ష. 39

చ. క్రతుఫలదాయి నీకిఁక ధరాతనయామధురాధరాధరా
మృతము ఘటింపఁజేసెదము మెచ్చుగఁ బోవలె రమ్ము మైథిల
క్షితిపతిజన్నముం గనఁగ సీతవిలాసము సన్నుతింప భా
రతిపతి నేరఁడన్నఁగలరా యిల రామకు నీడుజోడిలన్. 40

మ పుపునవ్వ న్నెయితావి విచ్చుసుధ చేఁ బొంగారుబంగారుక
మ్మినగంబూనును మేను గౌను నగుఁదా మిన్నంటి వెన్నంటియా
కునలె న్వన్నెలునన్నుఁజన్ను లరిరంగున్మించుఁగ్రొమ్మించులన్
హావణించుం గనుమిన్న లెన్నఁదరమాయాబోఁటినాబోఁటికిన్. 41

క. వెన్నెలవన్నెలకు న్నెల, వన్నెలతదరస్మితంబు లందము జేజే
కన్నెల చిన్నెల వన్నెల, క్రొన్నెల నెన్నుదురు మహిజ కొలఁదియె పొగడన్.

క. అనివర్ణించుచు మిథిలకుఁ, జనుచో బహువిధకథాప్రసంగంబులచే
తను దొలఁగించుచు పథసం, జనితపరిశ్రాంతి యల్లజనఁజనఁ నెదుటన్. 43

సీ. వికచపద్మకుడుంగవిహరమాణరథాంగసహచరచ్చక్రాంగచటులభృంగ
గాహమానపతంగకరతప్తమాతంగమదగంధిలతరంగమయశుభాంగ
తీరజాతలవంగనారంగతరుసంగకలనినాదవిహంగకలుషభంగ
బహుళశ్రమోత్సంగ పథికహర్షణచంగ సురభిశీతకురంగ వరతురంగ

తే. సురగశయనపదాంగజార్యుత్తమాంగ, జీవితోత్తుంగ జననస్థితిప్రసంగ
కనకగిరిశృంగ నిర్గళద్ఘనమృదంగ, ఘనరవజలానుషంగ నాకాశగంగ. 44

మ. కని శ్రీరామవిభుండు కౌశికునిచే గంగామహత్త్వంబు విం
చును బల్మారు భగీరథక్షితిపతిన్ స్తోత్రంబు గావించి మ
జ్జనముఖ్యక్రియలాచరించి యటఁగౌశాంబీపురీరాజపూ
జనము ల్గైకొని మైథిలోపవనవీక్షం జొక్కి తానిట్లనున్. 45

క. విమలాత్మక యేమునియా, శ్రమ మిది వికచప్రసూన సత్ఫలపాళీ
రమణీయ మయ్యు జనసం, గమవర్జిత మౌట కేమికారణ మొకో. 46

క. అనవిని రామునిఁగని రా, ముని యిట్లను రామ గౌతమునియాశ్రమ మి
వ్వని నెవ్వనిఁగనకుండుట, వినుపించెద వినుము పూర్వవృత్తాంతంబున్. 47

చ. మునుపు రమామనోహరుఁడు మోహినియై భ్రమయింపఁగాఁ ద్రిలో
చనుఁడు సురాసురల్మిగులఁజప్పఁగ నెంచిరి నాదుసృష్టిఁగ

ల్గినమధురాధరామణులఁ గేవలమేనిక నంతకన్నఁ జ
క్కనివనిత న్సృజింతు నని కంజభవుం డధికప్రయత్నుఁడై. 48

సీ. జలజవికాసంబుఁ జంద్రరమ్యత్వంబు ముకురంబు తేట నెమ్మొగము సేసి
కలికిచేడిస బెళుకు కలువ రేకందంబు ఖంజనదీప్తిఁ గన్గవ రచించి
తలిరుపల్లవనంబు జళుకు కెంపు మెఱుంగు నమృతంబు రుచి నధరము ఘటించి
కనకకుంభచ్ఛాయ గట్టుగట్టితనంబు బంతిసోయగము గుబ్బల నమర్చి
తే. మించుమించును సంపెంగమించుతావి, తరుణశైరీషకుసుమమార్దవము భాసు
రాంగకము చేసి నిర్మించె నఖిలలోక, మోహనముగ నహల్యయ న్మోహనాంగి.

సీ. లక్ష్మ్యాదికులసతు ల్పతులఁ బాయ రొకప్పు డలకాంతఁ జూతురో యనుభయమున
నజుకొల్వునకు సారె కరుదేరుసనకాదు లతిచంచలము చిత్త మంచు నెంచి
తక్కినరాజర్షు లెక్కువమక్కువఁ జిక్కి చొక్కుదురు వీక్షించినంత
నేకల్పమునఁ గాన మేటులు సృజించితి వనినుతింతురు కూర్మి హరియు హరుఁడు
తే. గరుడగంధర్వ సాధ్యాదిఖచరు లైన, దినముఁ బదిమార్లు పత్తు రవ్వనితఁ జూడ
నొకఁడుఁ దన కిమ్మటని వేఁడ డువిద కేను, దగవటంచును దగ దెయమ్మగువఁ బొగడ.

క. అఁట నొకనాఁడు సుధాశన, కటకేంద్రుఁడు బ్రహ్మఁగొల్వఁ గాఁ జని యచటం
గుటిలాలక యొయ్యారము, తటకాపడి చూచెఁ జూపుతమి దీరంగన్. 51

సీ. కిసలయాధర కప్పుగీల్గొప్పుఁ బరికింప మోహాంధకారంబు ముంచుకొనియెఁ
గలకంఠి బెళుకువాల్గనుదోయి పరికింప స్వాంతమంతంతకుఁ జంచలించె
మోహనాంగి మెఱుంగుమోవి విలోకింప ననురాగవల్లిక ల్గొనలుసాఁగె
వనజాయతాక్షి లేనును గౌను దిలకింప ధృతికిఁ బ్రాపించె నదృశ్యలీల
తే. యర్హ మనవచ్చు నొకదారి నది బలారి
కువిదలావణ్యవారాశి నోలలాడ
నతనుతాపంబు జనియించు టరిది గాని
యిటులు మోహితుఁ డగుచు సురేంద్రుఁ డపుడు. 52

సీ. కలికిగుబ్బలఁ బోలఁగా నిమ్మపండులు దొరలకుఁ జేకొన్న తరము లయ్యెఁ
జిలుకలకొల్కి చెక్కులడాలు గులుకఁగాఁ దళుకుటద్దముసూడఁ దగినదయ్యె
నొసపరిమిసిమి నెన్నొసలిపసల్గాంచ మొలకక్రొన్నెల జను ల్మ్రొక్క నయ్యెఁ
దరుణికమ్మనిమేనితావి గ్రమ్మఁగఁ బూవుటెత్తులు శిరసావహింప నయ్యె
తే. మగువ నీకఁ బెండ్లియాడఁగాఁ దగినధన్యుఁ
డఖిలలోకైకమూర్ధన్యుఁ డగుట యరుదె
యంచుఁ దమిమించఁ బదరి యాచంచలాక్షి
నిమ్మనుచు వేఁడ నగి బ్రహ్మ యీయననిన. 53

ఉ. గుండియ జల్లనంగ నెదగుందుచుఁ గొంచొక ధైర్యమూదియా
ఖండలుఁ డబ్జజుండు మదిగాంచక నీగతి నాడెఁగాకయీ
యండజరాజయాన కెనయౌ పురుషుండు మదన్యుఁ డీజగ
న్మండలి నెవ్వఁడంచు బిగుమానముతోఁ బురికేఁగె నంతటన్. 54

తే. నైష్ఠికబ్రహ్మచర్యంబునను దపంబు
సలుపుగౌతమునకుఁ బరిచర్య సేయ
నజుఁ డహల్యను నియమించె నతనిధైర్య
కంచుకము చించ నించువిల్కాఁడు పొంచె. 55

మ. కులుకుంగుబ్బలు మోవి తేనె జిలుక న్గ్రొందళ్కు మేన్మించులం
దొలఁకన్మాటకుఁ జిల్క మాఱువలుకం దోర్మూలము ల్గుంపనం
బొలుకం జూపుల గండుమీలు బెలుక న్హోమాదులం దెల్లదో
య్యలి నిచ్చ ల్పరిచర్య సేయ నళుకం డమ్మౌని పూవింటికిన్. 56

క. శతధృతియట గౌతమముని, పతియతిధృతిగతికి లేదు ప్రతి యని సతిఁగా
శతపత్రనేత్ర నొసఁగిన, నతఁడుం గార్హస్థ్యసౌఖ్యమందుచు చెలఁగెన్. 57

క. పడఁతుక మునిఁ జేరుటఁ గని, జడిసి మనోజాతవిశిఖజాలమునకు లో
పడియడలుచు ననిమిషపతి, మిడికెం గడునెడఁద మిట్టి మీఁనై పడుచున్. 58

చ. ముదమున నేను వేఁడుకొన మోహమెఱింగి యొసంగ కయ్యయో
ముదిముదిదప్పి యీభువనమోహిని నేమని మౌనికిచ్చె నీ
విధి కిఁక నేమి సేయుదు వివేకముసాల దొకింత యెట్లుగా
బ్రదికెనొ యిన్నినాళ్లు నిజపట్టము గట్టుక సృష్టికర్తయై. 59

సీ. కలవారి కొసఁగడు వలయుకుమారుల నతిరిక్తునకుఁ బెక్కుసుతులఁ గూర్చు
స్వల్పాయువులఁ జేయు సకలగుణాఢ్యుల వ్యర్థజీవికొసంగు వర్షశతము
కష్టలోభి కొసంగు ఘనతరైశ్వర్యంబు నెఱదాత కొనగూర్చు నెఱయలేమి
దీర్ఘరోగినిఁ జేయు దివిరిసంపన్నుని యారోగ్యమొసఁగు క్షుధాతురునకు

తే. నజున కెయ్యది సువివేక మటులుగాన, నాకునొసఁగక కానలో నాకునలము
మెసవుతపసికి నొసఁగె నిక్కుసుమగంధి, నేమి సేయుదు ననుచు సురేశ్వరుండు.

క. నేలామంచముఁ బట్టక, చాలా జాలిం దపించె శతమఖుఁడు నిజ
త్రైలోక్యరాజలక్ష్మీ, పాలనమును వదలి మరుఁడు పాతకుఁడు సుమీ. 61

వ. అనిన మందహాసకంపళితవదనారవిందుం డగుచు సుమిత్రానందనుం డిట్లనియె.

క. ఏమోయని యుంటిమి సుత్రాముని గుట్టెల్లఁ దెలిసెఁ గ్రతుభుజులకుఁ దా
నేమని పట్టముగట్టెనొ, తామరసభవుండు వానితర మెఱుఁగఁడు గా. 63

తే. అనిన లక్ష్మణ వారి నేమనఁగవచ్చు
దేవతలు సేయుపనులకుఁ దెగడఁదగునె

యనుచు శ్రీరామచంద్రుఁ డో మునివరేణ్య
యవలికథ యానతిమ్మన్న నతఁడు పలికె. 64

క. పరులకొకనిందఁ గల్గినఁ, బరికింపవు గుణమె కాని పాటింపఁగ నీ
సరిదొరలు గలరె జగముల, వరసద్గుణధామ రామవనదశ్యామా. 65

తే. నీగుణంబులు పొగడ నే నెంతవాఁడ, వినుము మీఁదటికథ యిట్లు విబుధవర్యుఁ
డతనుపండిత శాస్త్రవిద్యావిశేష, నిగ్రహస్థానగతుఁడు నై నెఱయఁ బొగిలి. 66

చ. పొరుగిరుగాశ్రమంబులకుఁ బోవ నొకానొకవేళ వచ్చు దృ
క్చరణునియాశ్రమంబునకు సంయమి సేమము వేఁడి దేవతా
తరుసుమమాల్యమిచ్చు జడదారుల కేలని యాతఁ డంతలోఁ
దరుణి కొసంగఁ దన్వి దలదాల్పఁ గృతార్థుగ నెంచు దన్మదిన్. 67

క. సురవరుఁ డందఱముందఱఁ, దరుణీమణి నట్టెచూచుఁ దప్పక కామా
తురులను భయమును లజ్జయుఁ, బొరయవన న్వినమె రామభూపాలమణీ. 68

మ. ఎలనాఁగా శుభమానె ముజ్జగము మీ రేలంగ మావంటివా
రలకు క్షేమమె కాకయేమియవు నీప్రాణేశుఁ డెందేఁగె వ
న్యలకుం బోయెను బోదుమే యతఁడు రా నాతిథ్యముం గాంచి పొం
దులతాంగీమణి నీవొసంగు మని వేఁడున్వజ్రి యొక్కొక్కెడన్. 69

శా. దేవాధీశ్వరుఁ డాశ్రమంబునకు నేతేరంగ నాతిథ్యముం
గావించు న్మునియున్నవేళ మధుపర్కంబిచ్చి యచ్చో సహ
ల్యావామాక్షి సుధాధరంబుగను నాహ్లాదంబుతో నింద్రుఁ డా
భావంబెంచి తలంగు మాఱ్మొగముతోఁ బద్మాక్షి లేనవ్వులన్. 70

చ. సురపతి నట్టెచూచుఁ దను జూచినయంతనె చూపుద్రిప్పు వే
మఱు గనుసన్న సేయుఁ గని మాఱ్మొగమౌఁ గననట్లు దీనుఁడై
కరమున మ్రొక్కు మ్రొక్కెడఁ గ్రమ్మఱఁ గేల్గవ మోడ్చుచు న్నిజా
ధర మరపంట నొక్కఁగని తన్వి నుచుక్కను నొంటిపాటునన్. 71

వ. ఇవ్విధంబున విబుధనాథుం డహల్యావిలాసవిభ్రమంబులఁ దగిలి తదాశ్రమంబు
నకు వచ్చుచుం బోవుచునున్న యెడ. 72

సీ. మట్టెలుంగక యాఁకు మడుపు లొందుట యొద్దఁ బవళింపఁ బ్రక్కకుఁ దివియకుంట
కౌఁగిలించిన బ్రబ్బుగాఁ గౌఁగిలించుట యుఱక చెక్కిన మోములుంచుకొనుట
వలసివల్లములుగా వాతెఱయానుట యలవోకగా గుబ్బ లంటుటయును
సరసోక్తులకు సదుత్తర మీయకుండుట చూపులేకయె రిత్తచూచుటయును

తే. బలిమి దానయి పైకొన్న పారవశ్య, మొంది చొక్కమిఁ గనుగొనియున్న ఱనుచు
శచివగలఁ గుందు నాథుఁ డే జలజముఖికొ, మేలువాఁ డయ్యెనని రహఃకేళికలను.

మ. కొలువై డిగ్గునగద్దెడిగ్గు వనికేఁగు న్సర్లు గేహంబులోఁ
దలిరుంబాన్పునమర్లునంబొరలు సౌధంబెక్కు మందాకినిం
దిలకించుం జనునిల్చుచోట నిలఁ డెంతే కంతుసంతాపవి
హ్వలుఁడై చిత్తగతాంగనానయనకాల్యాధిష్ఠమార్గంబునన్. 74

చ. వనితరో నేటికైన దయవచ్చనె యెంతటి నిర్దయాత్మవే
పనివడి నీకుఁగాఁబడిన పాటులు దేవుఁడెఱుంగు నింకనే
లను గతతోయబంధ మబలాయని కౌఁగిటఁ జేర్చు భ్రాంతి దోఁ
చిన నవలా[1]నిజాలవగఁజెందెడు నాతని మోహ మెట్టిదో. 75

వ. ఇవ్విధంబునకంతుదురంతలతాంతకుంతతంతన్యమానసంతాపసంతప్తస్వాంతుఁడ గుచు శచీకాంతుం డొక్కనాఁ డేకాంతంబున విశ్వకర్మనందని యగుమనో రంజనిఁ బిలిచి నిజాభిప్రాయంబు దేటపడంబలికి యెటులనైన యీకార్యంబు సఫలంబు సేయుమని ప్రియంబు సెప్పిన నప్పద్మనయనయు నప్పుడ కదలి గౌత మాశ్రమంబున నొక్కపూఁదోఁటలో దేవపూజకుఁగుసుమంబులు గోయుచున్న యహల్యం గనుంగొని యయ్యంగన భువనమోహనశృంగారాదిగుణంబులకు నచ్చెరువడి మెచ్చుచుం జేరంజనిఁ యహల్య కిట్లనియె. 76

చ. అలికులవేణి వెవ్వతె వహల్యవొ కావలె కాకయున్న నీ
చెలువముగల్గునే కడమచెల్వల కన్న నహల్య మెచ్చఁగా
పలయునె బోటియేటిచెలువంబు తపోధనకాంత కింద్రునిం
గలసి రమింపఁజాలుశచిగౌరవ మెన్నుము నేర్పుగల్గినన్. 77

వ. అని పలికినచిలుకలకొలికి సారస్యంబుగలిగిని ట్లైనం జెలంగియచ్చెలువయిట్లనియె.

ఉ. ఇంతిరో నీదుభాగ్య మిపుడెంతని సన్నుతిసేయుదాన వి
క్రాంతదిగంతకాంతులు శిఖామణి కాంతులఁగూడమోదుప్పకే
లెంతయుఁదాల్తురెవ్వని యహీనకటాక్షముఁగోరి యాశచీ
కాంతుఁడు గాచినాఁడు కుతుకంబున నీదుకటాక్షవీక్షకున్. 79

చ. రమణిరో యద్రిపత్త్రములు రాలఁగజేసినదూఱువోవ నీ
కొమరుమిటారిగబ్బిచనుగొండల పత్త్రముల న్రచింపఁగాఁ
బ్రమదము నొందినాఁడు సురరాజ్యధురంధరుఁ డట్టివానియ
త్నముఫలియింపఁజేయుము కనందగు నీకును గోరుకోరికల్. 80

వ. అనిన లజ్జావనతముఖియై శశిముఖి సఖీమణి కిట్లనియె. 81

శా. ఔనౌనే వెలయాలనా యిటులునీవాడక్క బలా చాలుఁబో
పోనవ్వే రెవరైన విన్ననిట నేర్పుల్సూపఁగా వచ్చితో

---

1 నిజాలకును జెల్వయటంచును మోహ మెట్టిదో.

నానాథుండిదివిన్న యంతఁదనకు న్నాకు న్మహాహాని రా
దా నావంటికులాంగనామణికి న్యాయంబౌనె యీమార్గముల్. 82

మ. తగవౌనే తనవంటివాఁడు పరకాంతంగోర సామాన్యుఁడే
మగువా తానుశతాశ్వమేధి త్రిజగన్మాన్యుండు నేఁ జెల్లయీ
వగవర్తించిన యాగభాగములఁ బిల్వంజూతురే బ్రాహ్మణు
ల్నగరే తోడిసుర ల్మహాఋషులచెంతన్ గౌరవం బబ్బునే. 83

వ. అనిన విని నవ్వి యవ్విలాసిని యిట్లనియె. 84

చ. వయసునఁగంటికింపయినవానిరమించుట ధర్మ మింతి క
ట్లయె మగవాఁడు చక్కనిమిటారికిఁ దక్కి రమింపఁగావలె
న్నయమిది న్యాయశాస్త్రముల నమ్మకు మొజ్జలుపుచ్చకాయ యా
నయవిదుఁడౌగురుండు మదనత్వర నగ్రజుభార్య గూడఁడే. 85

ఉ. వేడుక లెస్సఁగా ననుభవించుటయొక్కటి తక్కఁగానియం
దేడదిధర్మశాస్త్రగతు లెక్కడిపుణ్యము లేడపాపముల్
సూడవుగాక నీవు బలసూదనుపేఁడు సుపర్వు లన్యులం
గూడియెకాక నందనులఁ గూరిమిపత్నులయందుఁగాంచిరే. 86

ఉ. వింతలె నిన్నువంటి యవివేకిను లెందఱులేరు వారినే
వంతుకు దేను నామనసు వచ్చినజాణయె కర్త తారయే
కాంతునిపజ్జమాని పరకాఁడగు చంద్రునిఁదక్క నేలఁదా
నెంతయుఁగాక నేమి దనయిచ్చఁగరంగిన సౌఖ్యమబ్బునే. 87

చ. అలుగుటో యల్గినప్పుడె భయంబున నంఘ్రుల వ్రాలివేఁడుటో
కలయఁగఁబల్కుటో బలిమిఁ గౌఁగిటఁజేరిచి మోవినొక్కుటో
చలము మిటారిచూపొనర జంకెనయో ముడిబొమ్మొ తక్కుచె
య్వులుగలవో తపస్విరతియున్ రతియే వెతగాక కామినీ. 88

తే. ఉవిద నినుఁజూచినప్పటినుండి నాకిదియె విచారంబు కటకటా దేవుఁ డిట్టి
చక్కనిమిటారి నేమని జడునకిచ్చెనని తలంకుదు నైన నేమాయె వినుము. 89

శా. దోషారంభము సంభ్రమం బొసఁగ నాథున్ సాధుమేషాసము
న్నేషాప్తిం గికురించి యొంటిఁజని యన్వేషించు నజ్జారునా
శ్లేషింపంగల సౌఖ్యమిందుముఖికిన్ లేదెందుఁ బద్మాననా
"యోషా జార మివ ప్రియం" బనెడి శ్రుత్యుక్తి న్విచారింపవే. 90

సీ. అంగన పతిఁగాని యన్యపురుషుఁ జెంద ధర్మువుగాదని తలఁచితేని
చంద్రగంధర్వకృశాను లన్యులుగారె వారుదేవతలన్న వారికెల్ల
నేలికయైన దేవేంద్రుఁడు గొంచెమా యది శ్రుతిచోదిత మంటివేని
నలినారి శుద్ధగంధర్వుండు శుభవాణి యఖిలపావనతమహుతాశి యొసఁగ

తే. వనరుహాక్షులు పరమపావనులు వారి
కెడయు వ్యభిచారదోషంబు ఋతువువలన
నని మనుస్మృతి దలపఁగా వినవె యెందు
నిందు వలవనిసందియ మేల విడువు. 91

క. అదియటులుండె న్వినుమా, మదవతి నీమీఁదఁగలుగు మక్కువ వలన
న్మదనాస్త్రములకుఁ జిక్కిన, త్రిదశేంద్రుని వెతలుగొన్ని దెలిపెద నీకున్. 92

సీ. కలకంఠకంఠినీ గుబ్బిగుబ్బలటంచు మేలిపూబంతులు కేలనలముఁ
జిలుకలకొలికి నీచిన్నవాతెఱయంచుఁ బాళితోఁ జిగురాకుఁ బంటనొక్కుఁ
గలికి నీతళుకుఁ జెక్కులటంచు లవలీదలముల ముద్దాడు మేలంబు దనర
నొప్పులకుప్పనీ యుదుటు పెందొడలంచుఁ గదళికాతరుల నఖంబులుంచు
తే. నందనవిహారవేళ సంక్రందనుండు, మదనకనకాస్త్ర విస్మృతోన్మాదుఁ డగుచుఁ
జూచి రంభాదికాంతలు చోద్యమందఁ, గల్లఁగాదిది నీయాన కరటియాన. 93

సీ. నునుఖాలకాయయొంటులు జాతి నిద్దంపు నీలంపుఁబోగులు నీటుసూప
వలకేలబూనిన తెలిచాయ నూరుదారలవాలు గఱి చిల్వచెల్వుఁ దెల్ప
నెమ్మేననలఁదిన కమ్మగంధపుఁబూత కస్తూరికాకాంతి గడలుకొనఁగ
గళమునం దగుకల్పక ప్రసూనసరంబు నీలోత్పలంబుల నీటుసూప
తే. నిగ్గులీనెడు తలఁపు మూసికపుగద్దెఁ
దొగలపగదాయ జాలీల రగలుకొనఁగ
సెగ వసముగాక దిగధిపుల్వగలఁ బొగుల
వజ్రి కొలువుండు మదనసంజ్వరమువలన. 94

తే. ఇంతమన్మథసంతాప మేలవచ్చె, శత్రుఁ డెక్కడఁ జూచె నాచక్కఁదనము
ననుచు నడిగినఁ దెలిపెద వినుమదేభ, కుంభజృంభితవక్షోజకుంభయుగళ. 95

సీ. కమలసంభవుపీటఁ గాంచెని న్వేడుక నదిమొదల్మనసు నీయందె తగిలె
నెన్నఁడు నీవు నన్నెదనుంతువో యంచు నీచక్కఁదనము వర్ణించునెపుడుఁ
గంటికి నిద్దురగానఁడు రేవగల్చిగురుకైదువుకాని చేతఁ జిక్కి
నమృతంబు పైసైత మరుచిజనించెను నినుఁగూర్పుమని వేఁడుకొనును సఖులఁ
తే. గాకవసగాక పడుబయల్గౌఁగిలించు, మూర్ఛపాలగు నీమీఁదిమోహమునసు
రేశుఁ డేకాదశావస్థ నిటులుచెందె, నింకనైనను దయఁజూడవే లతాంగి. 96

తే. అనినఁ జిఱునవ్వునవ్వి యయ్యంబుజాక్షి, వేల్పురాయఁడు నీవలవెఱ్ఱివాఁడు
గాక యెవ్వరిసొమ్ముకుఁ గాంక్షసేసి, యింతవలవంతఁ గుందెడు నింతియనిన. 97

సీ. మంచిపున్నమచందమామఁజూడనె కాని వేడుకతోడ ముద్దాడవశమె
యూరకచూచి నోరూరుటింతియె కాని యందనిమ్రాని పండ్లందవశమె

తళుకుతళ్కని మించుతీఁగెలు కారుఁ మించుఁ గాంచనె కాని కౌఁగిలించంగ వశమె
కనకాద్రిశృంగములు గనుఁగొననే కాని సులభంబుగాఁ బట్టిచూడ వశమె
తే. యటులు పరకాంత నగుమొగం బధరబింబ
మంగవల్లియుఁ జనుదోయి యలరుఁబోఁడి
కోరుటయె కాక యేల చేకూరుఁ దనకు
వలవనిదురాశ యేటికి వలదు పొమ్ము. 98
ఉ. చీమ చిటుక్కుమన్న వెతఁ జెందెడిచిత్తముతోడ జారతో
నేమిసుఖంబు గాంచు విటుఁ డేటికి యీభ్రమ వట్టిపాపమిం
తే మఱియేమిలేదు పెఱతెర్వులఁబోవుట గాదటంచునో
కామిని నేఁడునామనవి గా వినిపింపు నిలింపభర్తకున్. 99
తే. అమ్మ నేఁ జెల్ల యెంత ప్రౌఢాయెఁ జూడు, మగువ మాటలసందడి మఱచియుంటిఁ
బోయివచ్చెద ననికొన్ని పూలు గొనుచు, బాలికామణి తనపర్ణశాల కరుగ. 100
క. అనిమిషపతి దూతికయును, దనరాకల కెదురుచూచు ధరణీధరభే
దను జేరఁ జనిన నతఁడును, గనుఁగొని మోదమున నొంటిగా నిట్లనియెన్. 101
శా. నీరేజానన పోయివచ్చితివె కంటే పూర్ణచంద్రాననం
గారామొప్పఁగ మాటలాడెనె పొసంగం గేళిసంకేతమే
యోరం జూపెను నేఁడొ తెల్పి చెపుమా యుల్లంబు రంజిల్లనా
పై రాగం బొకయింతయుండు మును నేభావించుతచ్చేష్టలన్. 102
చ. తెలియఁగలేకయున్న భవదీయవచోరచనాచమత్కృతిం
గలుగకపోవుటెట్లు కలకంఠికి నాపయి మోహమంచు వే
ల్పులదొర యప్పుఁడే మృగవిలోచన దక్కినయట్లు పల్కఁగాఁ
బలికె లతాంగి లేనగవుపల్కులఁ గప్రపుపల్కు లొల్కఁగన్. 103
తే. వనిత చక్కనివాని నెవ్వానిఁ గనినఁ, జెమ్మగిలకుండ దాచోటు చెప్పనేల
నిన్నుఁ జూచునహల్యకు నెనరులేదె, హృదయ మియ్యదు పతిభీతి యింతెగాక.
చ. అనుటయు నుస్సురంచు విబుధాధిపుఁడింకిట నేమిసేయుదు
న్వనితను గూర్చునంచు నెదనమ్మిన నిచ్చెలి యిట్లుచేసె గ్రొ
న్ననవిలుకానిముల్కి యెదనాటి కలంపఁగ నోర్వఁజాలని
త్తనువుఁ ద్యజింతు నన్ను విధాత యమర్త్యునిఁగా సృజించెఁగా. 105
తే. అకటకలనైన నప్పాలంతుకఁగలయుదుఁ, గాక యని యెంచ నిద్దుర లేకయుండఁ
జేసినాఁ డొంట రెంటను జెఱచినాఁడె, యెల్లవంకలఁ జెఱచెఁగా యింద్రు నజుఁడు.
వ. అని చింతించుచు నిలింపపాలకుండు శంపాలతాంగిం బంపి నిరనుకంపంచంపక గంధిగంధననందన వనకుసుమవిశిఖశిఖిశిఖాసంతాపితసంతప్తహృదయుం డగుచు నొక్కరుండును సురతరంగిణి కరిగి వనవిహారంబునం బ్రొద్దు గడపుచున్న యెడ.

సీ. గౌతముం డఱకాలఁగన్ను చూపె నటంచు హరిపదంబునఁజూపు నత్తులనఁగ
నవనికిఁ దివియుచో నను రాగమునఁ గాంచ మొనయు సతీపతీముఖము లనఁగఁ
బ్రతిబింబబహుళతఁ బరికింపఁగా వ్రేలఁబట్టిన రత్నదర్పణము లనఁగ
సమయాంబువాహి యంసమునమించుకఁ జానిక్రొమ్మించు కావడి కుండ లనఁగఁ
తే. బూర్వపశ్చిమ పర్వతంబులఁ దనర్చె, శశిదివాకరబింబము ల్సాయమునను
జాఱె రవియంతఁ జంద్రుఁడు మీఱెఁ దివిని,బండువెన్నెల నిండెభూమండలమున.
క. తెరువరి యొండకునోర్వక, సరగున నొకయెడను జేరఁ జనఁదవవైశ్వా
నరుఁ డడరినవడు వేర్పడ, సురపతి సురసురను స్రుక్కె క్షోణిగతుండై. 109
తే. ఒకయుపాయంబు చింతించి యుత్సహించి, యాశ్రమంబున కేతెంచి యతఁడు పాదు
నుటజమునఁ బొంచె నించువిల్తూనుమించు, చింపిఁ గొండాడఁ బవిపాణి వంచనమున.
క. ఆనాఁటినిశిన హల్యా, మానిని పతిపదములొత్తి మక్కువ మీఱం
గా నొద్దఁబవ్వళించిన, నానాతిమనం బెఱింగి యాతఁడు నగుచున్. 111
శా. ఇంతీపర్వము నేఁడటన్న నవులే యేమైనఁదా నేమిపో
యంతేకాక మఱేమి యందులకు విస్మర్థించినానే బళా
యెంతే కంటికి నిద్ర దొట్టుకొనిరా నీచెంత గోరంతని
ద్రింతుం గాకని పంపినా ననుచు నీరేజాక్షి లేనవ్వునన్. 112
ఉ. మాఱుమొగంబు వెట్టుకొని మారునివేదన తాళలేక వే
మాఱుఁగటాక్షవీక్ష సుకుమారతనుం బ్రియుఁజూచుకొం చయో
కోరినవేళ నాయకుని కూటమి గల్గిసుఖించువార లే
మేరను నోఁచిరో యనుచు మించినచింత నొకింత గూర్కఁగన్. 113
ఉ. ఆయెడ కోడియై మఘవుఁ డంబుజబాణున కోడి కొక్కరో
కోయని కూయ వేగెనని గొబ్బున గౌతమమౌని యేటికిం
బోయినఁదాను గౌతమునిపోలికె వేషముపూని దేవతా
నాయకుఁడేఁగుదేర లలనామణి వాకిటనుండి చూడఁగన్. 114
తే. వెలది చూపులు దేవతావిభుని మీఁద
నెరసి నీలోత్పలంబులనీటు సూపి
యవియె సూచించె భావిసహస్రలోచ
నముల బెడఁగును స్రుక్కుల క్రమము మెఱయ. 115
వ. అంత. 116
ఉ. పల్లభ యింతలో మరలివచ్చితి రేమని విస్మయంబుతోఁ
బల్లవపాణి పల్క సురపాలకుఁ డుల్లము పల్లవింప నో
హల్లకగంధి నీచెలువ మట్టె తలంచిన ప్రేమమించెనే
కొల్లలుగాఁగ నిక్కరతులఁ గూడఁగ వచ్చితి రమ్ము నాపుఁడక్. 117

ఉ. ప్రేమయు గద్గదస్వరము భీతియుఁ గంపముఁ దొట్రుపాటు నా
నామధురోక్తిగల్గు కుహనామునిఁ దప్పక యట్టె చూచి సు
త్రాముని గా నెఱింగి యపురా యని కాముని మెచ్చి యాముని
గ్రామణిరాణి యిట్లనియెఁ బ్రౌఢవచోరచనాచమత్కృతిన్. 118

ఉ. మేనకనో తిలోత్తమనొ మెచ్చుగ రంభనొ చంద్రరేఖనో
నేనొకచారురూపవతినో క్షితి దేవవరేణ్య యేల నా
పై నిటువంటి ప్రేమమును బర్వ మటంటిరి పర్వమయ్యె నే
సూనశరాను చేత బయఁ జూడఁడుగా యతఁ డెంతపెద్దలన్. 119

వ. అని చాతుర్యంబుగాఁ బల్కు జలజాతముఖికిఁ గైతవ గౌతమముని పురుహూతుం డిట్లనియె. 120

సీ. రంభ నీమృదులోరుజృంభణం బొకయింతఁ గనుఁగొన్న లో మెత్తగాక యున్నె
శశిరేఖ నీఫాలసౌందర్యమొకయింత భావింప నొకవంకఁ బోవకున్నె
హరిణి నీకన్దోయి యంద మొకించుక గాంచినచోఁ బూరి గఱవకున్నె
యూర్వసి నీవేణి యొప్పిదం బొకయింత తిలకింపఁ జాయలు దేరకున్నె
తే. యితరకాంతల నెన్నఁగా నేల వారి, రోసియే కాదె నినుఁ గోరె వాసవుండు
మున్ను నాపుణ్యఫల మన నిన్నొసంగె, నలువ ఋణ మేమిటను దీర్తుఁ గలువకంటి.

ఉ. మాటల జాగు సేయకుము మన్మథవేదనఁ దాళఁజాల నో
పాటలగంధి నీదు కుచపాలికఁ జేర్పుము తెల్లవాఱిన
న్వాటముగా దటంచు సురవల్లభుఁ డంగనకేల్దెమల్చుచుం
బైటఁ దొలంగఁ జన్నుగవపైఁ బడి కౌఁగిట గాసచేయుచున్. 122

చ. నిలువునకుం జెమర్చె రమణీమణి మోహమొ కాక భీతియో
తెలియఁగఁ గూడ దప్పుడల దేవవిభుండును గంపమొందె మి
క్కిలి యొడఁబాటులేని పరకీయకరంబుఁ దెమల్పఁ గౌఁగిటం
గలయఁగ దొడ్డసాహసముగాదె బలారికిఁ జెల్లె నయ్యెడన్. 123

క. ఇటులు బలాత్కారంబునఁ, దటుకునఁ బైఁబడిన దేవతాపతి కెడగా
నటునిలిచి కుటిలకుంతల, యిటులనియె న్మోహభీతు లెదఁ బెనఁగొనఁగన్. 124

చ. ఇదె తెలవాఱవచ్చెఁ గదవే యిదెసంధ్యకు వేళగాదె స
మ్మదమున నిత్యకర్మవిధి మానకదీర్పుదు రాత్రివేళ మీ
మదిసరిపోవురీతి నను మన్ననచేసెద రింతె కాక నీ
యదవద మేరగా దనిమృగాక్షి గృహాంతరసీమ కేఁగఁగన్. 125

చ. వెంట నెయంటి పద్మముఖి వేణి కరంబున నంటి నిల్పి నీ
కంటికి నింపుగా నెనరు గైకొనకేగదు చౌకచేసి నీ

వంటి కులాంగనామణికి వర్తనమే యిది యేమి చేయునో
దంటగదా మరుండు దురితం బగు వేశ్యకలైన భామినీ. 126

క. అన విని నవ్వుచు జవ్వని, వినునాయక నూతిసీళ్లు వెల్లుచుఁ బోనే
వెనుక నగుఁగాక పొమ్మన, వినక యతఁడు మల్లువెనుక విసువకయతఁడున్. 127

చ. పెనఁగి లతాంగివేణి విడిపించుక జంకెన వాఁడిచూపుతోఁ
గనుఁగొని నీవునాపతివె కావు నిశాటుఁడ వింతెకాక యా
తని మునివేష మూనితివి తప్పక దెల్పుము నాదుభర్తకీ
ఘన మగుప్రేమ గాన నిఁకఁ గల్లలువల్క శపింతు నంచనన్. 128

క. గడగడ యొడలు వడంక, న్బడఁతుక యడుగులను వ్రాలి పడఁతీ నే నిం
ద్రుఁడ నీవెటువలెఁ జేసినఁ, గడుమంచిది మదను చేత గాసిలుకం టెన్. 129

చ. అనవుఁడు నింద్రుఁడంతఘనుఁ డంఘ్రులపైఁబడి యింత వేఁడఁగా
వినమి గడుం గొఱంతయని వేడుకమీఱఁగ లేవనెత్తి యో
యనిమిషనాథనీకుఁ దగవా ననుబోఁటికిమ్రొక్క నంచుఁ దా
స్తనలికుచంబు లొత్తె స్మరఘాతశరవ్రణపీడ నీడఁగన్. 130

చ. గమకపుగుబ్బచన్ను లెదఁగాడఁగ నింద్రునిఁ గౌఁగిలించుచోఁ
దమిని నహల్య దొంటిసుకృతంబునఁ గల్గెడుఁగాక నింద్రభో
గము సమకూరునే యితరకాంతల కంచును మేనువొంగ భా
వమునఁ దలంచె నాఁటి శ్రుతివాక్యము వాసవదూతి మెచ్చుచున్. 131

ఉ. కామినిఁ గౌఁగిటం దగిలి కాయము గీయ మెఱుంగఁ డయ్యె సు
త్రాముఁడు గొంత సేపునకుఁ దత్కచచూచుకభేదనంబుచే
నేమె యొకింతమై దెలిసి యింపునఁ జెక్కిలి ముద్దుగొంచు నె
మ్మోమున మోముఁ జేర్చి జిగిమోవికి మెల్లనె యాససేయఁగన్. 132

క. ఔరా మోహ మటంచును, నారీమణి మోముద్రిప్పి నాకాధీశు
న్గూరిమినిఁ జెట్టవట్టుక, చేరువఁ దనశయ్యఁ జేరి చిత్తంబలరన్. 133

సీ. పంట నొక్కనటంచు బాసచేసినఁగాని తేనెలూరెడి మోవియాననీయ
గోటనొక్క నటంచుఁ జాటిపల్కినఁగాని బటువుగుబ్బలు కేలఁ బట్టనీయ
నాదుసేయ నటంచు నమ్మికిచ్చినఁగాని మినుకుఁ జెక్కిలి ముద్దుగొనఁగనీయ
నగడుసేయ నటంచు నానవెట్టినఁగానిహాళితో రతికేళిఁ దేలనీయ

తే. వినుము నెఱజాణ నీచక్కఁదనముఁజూచి
వలచి యొప్పినయప్పుడే వారవనిత
గాను మగనాలఁ గాన నీక్రమముఁ దెలిసి
యిందు కొడఁబడి నన్నేలుమీ సురేంద్ర. 134

తే. అనుచు నొడఁబాటుగావించె నాదిసింద్రుఁ, డింతియే కాని వెనుక యథేప్సితముగ
నఖరదంతక్షతాదుల నడఁచెఁగాక, తెలియమంచన గుటికట్లు నిలుచు నెట్లు.

మ. అసకృచ్చుంబనములు ల్ముహుర్ముహురుదారాశ్లేషములు ల్మశ్వదు
చ్ఛ్వసితవ్యావృతములు ల్పునఃపున రుదంచద్దంతసంలక్షిత
వ్యసనావిష్కృతసీత్కృతంబులు మనాగ్వర్ధిష్ణుదీనోక్తులై
యెసఁగెం గౌతమగేహినీదివిజలోకేశానసంభోగముల్. 136

సీ. మోవియానుచుఁబంట మొనవొక్క విడుమంచుసీత్కృతితోఁ గోటఁజెక్కు మీటు
వలిగుబ్బలంటుచు నెలవంకలుంచినఁ గోపించి కేల్జడఁగొట్టివిసరు
రతికూజితంబు ప్రార్థన సేయుచును బాదములబ్రాలఁగిన్కతోఁ దొలఁగఁజేయు
మనతఁ బైకొన జుబుకముఁబట్టి వేఁడినఁదలకుసిగ్గునఁ గేలు వట్టివైచుఁ

తే. జెవినిజిలుబూతు లాడవచ్చిన వదల్చు, వలదు మెల్లన యని రతిత్వర నడంచు
జాలు విడరా యటంచుఁ గెంగేల మ్రొక్కు, జలజలోచననూతనసంగమమున.

తే. ఎంత కామాతురుఁడొ కాని యింద్రుఁ డహహ
యలసి తొయ్యలి గబ్బిగుబ్బలను వ్రాలి
గడియ సాలదె యిట్టిభోగంబు వెనుక
నేమియైనను మేలంచు నెంచె మదిని. 138

చ. చెలువ రతాంతవేళ బలుసిగ్గున నంగము దాఁచికొంచు దు
వ్వలువ గ్రహించికట్టికొన వల్లభుఁ డొయ్యఁ జెఱంగువట్టియో
కలికిరొ యింత సేపుఁబొడగానని సిగ్గిపుడెట్లువచ్చె నే
కెలసముదీరె నంచుఁగనుగట్టితొ ముంగడనుంచువ్రీడకున్. 139

ఉ. పొంకమె యిట్టులైన నటుపొమ్మను లజ్జ నదేల యంటివా
యింకొకసారియైన రమియింపక నాతమి దీరదన్న నే
శాంకముఖీలలామ యమరాధిప నీతమిదీఱకున్న నీ
వింకిట నేమి సేయఁగల వీతమిదీఱె నటంచు నవ్వుచున్. 140

తే. చెల్ల పనులకుఁ బోవలెఁ జేలవిడువు, మతఁడు రావేళ యయ్యె నటంచుఁ బెనఁగఁ
జేలవిడుమంటి పటువలెఁజేయువాఁడ, భామ పదరకు తెలవాఱ జాముగలదు.

క. అనవుడు నేటికిభ్రమసెదు, విన వృద్ధశ్రవుఁడ వొట విననొ యేలా
వినవైతి కోడికూసెం, దనరవమై మరునిధర్మఢక్కార యనంగన్. 142

ఉ. నావుడు నవ్వి యవ్విబుధనాథుఁడు నే భ్రమఁజెంద నొక్కనాఁ
డీవిభుఁ డీవునుం భ్రమయుఁ డింతియె యెట్లనఁ గైతవంబున
న్నీవిభురూపుఁబూనుగతి నే మును కుక్కుటమై నిశీథిని
న్నీవిభు నంపితి న్నదికి నేరుపు మెచ్చవుగా విలాసినీ. 143

క. అన వెఱఁగందుచు నింద్రుని, గనుఁగొని నాతోడు నీకుఁగల్లయొ నిజమో
వినిపింపు మిదియు నిజమై, నను వలసినవేడ్కఁ గనమె నానాగతులన్. 144

తే. అనిన నిజమాను నీయాన హంసయాన, కల్లగా దన వల్లభుఁ గాంచి యలరి
మేలు నెఱజాణ యెటులైన మెచ్చవచ్చు, ననుచుఁ జెయిలోనఁ జెయి వ్రేసి వనిత నగిన.

ఉ. ఇంతిరొ వట్టి మెచ్చు లివియేటికి నీవియొసంగు మంచుఁ దా
నెంతయు నేర్పుతోఁ బెనఁగ నిందుఁడ నీకిఁక నేమి యిచ్చెదం
గాంతుఁడ రెండుచక్రములు గావలెనన్న నొసంగుదాన నా
కింతియ కాక వేఱొకటి యెయ్యది యీవనినంచు నవ్వుచున్. 146

తే. అంత నరవిరిమజ్జనం బాచరించి, నవముగా మేన హరిచందనం బలంది
విరులు కొప్పునఁ దుఱిమియ వ్వేలఁది విభుఁడు, తారసిలి రప్పుడు పునారతంబునకును.

సీ. పతి కప్పురపుఁదావి బాగాలు గైకొన్న మదిరాక్షి సగమాకు మడుపు లొసఁగె
నెనరుతోఁ గాంతుఁ డొయ్యనఁ గౌఁగిలించినఁ గొమ్మ గుబ్బలఁ దొమ్ము గ్రుమ్మి క్రమ్మె
బ్రాణనాథుఁడు మోవిపైఁ గంటు చేసిన నలివేణి పారవశ్యమునఁ జొక్కె
విభుఁడు నిల్కడఁ గేకివిధమున రొదగుల్క లోలాక్షి చెవియొగ్గి యాలకించె

తే. మోహనాంగుఁడు నునుపోఁకముడి సడల్పఁ
దరుణి జతయయ్యెఁ జిత్రబంధంబులకును
గూర్మివల్లభుఁ డొకకొంతఁ గూడియలయఁ
గుసుమకోమలి దాను పైకొని రమించె. 148

ఉ. ఎన్నఁడు నేర్చెనో తెలియదే జగదేకమనోహరాంగి యా
చిన్నె లదేమిదెప్పు విటశేఖరుఁ డూరక చూచుచుండె నా
చన్నులకుల్కు లాసగముజాతె డివేనలి యాయొయార మా
కన్నుల బెళ్కు లాకదళికల్లనుపొంకము లావిలాసముల్. 149

తే. అతివయీగతి నుపరతినలసి సొలసి, యప్పళించుక వ్రాలె నాయకుని యెదను
సరిబెనంగుట గన్గొని శంబరారి, చెలఁగి యిరువుర నొక్కటిచేసె ననఁగ. 150

చ. అరవిరికల్వక్రొవ్విరుల యందమునొందిన కన్నులు న్సుధా
కరకళలం ద్రవించు శశికాంతముఁబోలిన చెక్కుటద్దము
ల్సరభసదక్షిణానిలము చాట్పునఁ గ్రమ్మెడు కమ్మయూరుపుల్
గరువపుబెండ సోలులతకై వడి వ్రాలునిజాంగముం దగన్. 151

చ. ఎదపయి వ్రాలియున్న తరళేక్షణ నిద్దపునిండుకౌఁగిటం
బ్రియకశవరేణ్యుఁడు న్సమరతిక్రియఁ జొక్కియు మున్ను మున్నుగా
మదవతి మోవిపానకము మాటికిఁ గ్రోలుచు సేదదేరె ద
త్సుదతియు నట్లదేరి కొనెఁ జుంబితశంబభరోష్ఠబింబ యై. 152

వ. అంత. 153

చ. కమలదళాక్షి దువ్వలువఁ గైకొని లేచి కటీతటంబునం
గొమరుగఁ గట్టిగట్టిగను గ్రొమ్ముడిఁ బెట్టి మిటారిగుబ్బలం
జిమచిమగుల్కు గోటికొనజీరలకు న్వడికెంపు కెంపుమీ
ఱుమెఱుఁగుమోవిపైఁ జుఱుచుఱుక్కను కెంపులకుం దలంకఁగన్. 154

మ. ప్రమదా నేనిఁకఁ బోయివచ్చెదను నాపై నీకృపావేశముం
చుము నీవాఁడ నటంచు దేవపతి యస్తోకస్పృహామందమం
దముగా వేఁడిన గుండెజల్లుమనఁ గాంతారత్న మొక్కింత దై
న్యముతో నక్కున మోవిఁ జేర్చి నినుఁ బాయన్నేర్తునే వల్లభా. 155

ఉ. నీవయి నాకు నాపయిని నీకును గూరిమి గల్గఁ జూచియుం
బాపపుదైవ మిట్టు లెడఁ బాయఁగఁ జేసెను దొంటిపుట్టువం
దేపగఁ జేసినామొ విధి కేమిటి కీగతతోయబంధము
ల్నాపయిఁ బ్రేమయుంచు సురనాయక మర్వక నన్నొకప్పుడున్. 156

తే. అనిన నామీఁదనింత మోహంబు గలిగె, నేని నా వెంటరమ్ము మత్తేభగమన
యెంతపనియైన నేనిర్వహింతు నంత, నడ్డసేయరు జుమ్ము ముజ్జగమువారి. 157

ఉ. నావుడు నింతయేల సురనాయక నన్నిటఁ దక్కనిచ్చునే
నావిభుఁ డట్టులైన నుడునాయకుఁ జేరిన తారరీతి మా
కావిధమింతె కాక కలదా యొకయింత ప్రయోజనంబు నా
భావమునందుఁ దోఁచిన యుపాయము చెప్పెద నాలకింపుమా. 158

సీ. దేవపూజకు విరుల్దెచ్చెదనంచును వనికాంతరములకు వచ్చునపుడు
నివ్వరిధాన్యము ల్నెమకంగఁ గేదార పరిసరంబులయందుఁ దిరుగునపుడుఁ
గడువేడ్క నన్నోదకంబులఁ గొనితేర దూరతటాకంబు సేరునపుడుఁ
జెఱుగుమాసె నటంచుఁ జెప్పి యూరకయైన నొంటిగాఁ గడయింట నుండునపుడు
తే. వచ్చి నా ముచ్చట ల్దీర్చు మెచ్చుగాను
నిచ్చ తచ్చనగాదు వియచ్చరేంద్ర
యనుచు నక్కునఁ జేర్చి మోహమునఁ జెక్కు
ముద్దుగొని పంపె నింద్రు నమ్మోహనాంగి. 159

ఉ. అంపినయప్పు డమ్మఘవుఁ డవ్వలఁ బోవఁగలేక ప్రేమతోఁ
జంపకగంధి గబ్బివలిచన్నులపయ్యెదఁ జక్కఁ జేర్చుచుం
సొంపునఁ జెక్కులుం బుణుకుచు న్మధురాధర పోయివత్తునే
యంపితివా యటంచు నిలయంబట వెల్వడి యెట్టకేలకున్. 160

చ. ముని యెదురౌనో యంచు సురముఖ్యుఁడు భీతిని బోవునంతలో
ననఘుని గౌతముం గనియె నత్తపదుండును వేషధారినిం

ద్రునిగ నెఱింగి యిట్టులను రోషసముజ్జ్వలితాత్ముఁ డౌటఁ జెం
దిన యఱకాలిమంట నడునెత్తికి నెక్క ఝటాఝటంబునన్. 161

క. ముష్కరహితవృత్తినిఁ బర, పుష్కరపత్త్రాక్షిఁబట్టి భోగించుటచే
ముష్కరహితుఁడవు గమ్మని, నిష్కరుణ శపించి మౌని నిలయముఁ జేరన్. 162

తే. తరుణి దానేమి యెఱుఁగనిదానిరీతి, నేతఁ గనుగొని కాళ్ళకు నీళ్లు దేఁగ
నలుక నమ్ముని యోసి దురాత్మురాల, యంటనర్హంబె నీచేతియంబు లిఁకను. 163

ఉ. కల్లరివేషమూని యలికాముకుఁడై సురరాజు వేఁడుచో
నుల్లము ఱాయిఁ జేసికొని యూరకయుండక నీవు లోనుఁగా
జెల్లునె యిట్టిదుష్కృతముచే రఘురాముపదాప్తిదాఁక మే
నెల్లను ఱాయిగాఁగ వసియింపుము నిర్జన మివ్వనంబునన్. 164

క. అని శపియించి హిమాద్రికిఁ, జనియెఁ గౌతముఁడు జంభశాసను మేషాం
డునిఁ జేసి రశ్వినీసుతు, లనుపమ దివ్యౌషధముల నమరులు మెచ్చన్. 165

భుజంగప్రయాతము.

బలారాతిరూపంబు భావించె గానం, బలారాతి రూపంబెఁ బ్రాపించెఁ గానం
శిలాహారినారి న్నిషేధింపుమింక, న్శిలాహారిరూపంబు శేషాఘు మింకన్. 166

క. అని ముని భవతారకనా, ముని రాముని నల్లగౌతమునివనికిం దో
డ్కొనివచ్చునెడను దత్పద, వనజరజం బింత వాయువశమున సోఁకన్. 167

క. వనరాశి జనించిన శ్రీ, వనజాక్షియొ యెదురుకొనిన వనదేవతయో
వనవనదావళిమించో, యని యెంచఁగ ఱాయి చెలువయై చెలువగుచున్. 168

సీ. మును దలమున్కయౌ మోహాంధకారంబు వెనుకదీసినరీతి వేణిఁ దనర
శాపరూపదినాంత చంద్రోదయములీల మొలకనవ్వుల ముద్దుమోము మెఱయ
బహుకాలపరచితోపలత యంటినమాడ్కి కఠినవక్షోజయుగ్మంబు గులుకఁ
దనదృశ్యభావంబు దవిలిపోవనిరీతిఁ గడుసన్నమైన లేఁగౌను వడఁక

తే. క్షితిని లోహంబులను బైఁడిసేయు స్పర్శ, వేదివలె రామపాదారవిందరజము
పూని శిలఁ బైఁడిసేసెనా మేను మించఁ, గాంతయై మించె గౌతమకాంత యపుడు.

క. తనమునుపటివృత్తాంతము, మునిపతి వీరలకుఁ దెల్పుమనుపే యనుచున్
ఘనలజ్జానతముఖియౌ, వనితకు రఘునందనుండు వందన మిడియెన్. 170

తే. పెండ్లికొడుకవు గమ్మని ప్రేమ మౌని
రామ దీవించి శ్రీరఘురామవిభుని
పూజఁ గావించుచున్న నద్భుతముగాఁగ
గౌతముఁడు వచ్చి యారాముఁ గాంచి పొగడె. 171

ఖడ్గబంధము.

క. సౌరధరధీర రఘువర, పారదదరనీరజారిభవకీర్తిరమా
మారీచమదవిరామా, నీరదనిభ ధామ రామ నృపతిలలామా. 172

ఉ. శ్రీరఘురామ నిన్ను నుతి సేయఁగ నెంతటివాఁడ నేను నీ
పేరు దలంచినంత నతిభీకర దుష్కృతము ల్దొలంగు నీ
చారుపదాబ్జసంగతిని సంభవయౌట పవిత్రగాదె భా
గీరథిలీల నీభ్రమరకేళిని యంచు నహల్యఁ జేకొనన్. 173

మ. దివివర్షించెఁ బ్రసూనవర్ష మపు డందె ల్మ్రోయ నాడె న్నవా
సివధూబృందము దివ్యదుందుభులు మ్రోసెన్ ధింధిమిధ్వానమై
యివతాళించె సుగంధగంధవహ మెంతే రామపాదాబ్జప
ల్లవసంజాతపరాగచాతురి నహల్యాగౌతము ల్గూడఁగన్. 174

తే. అంత సంతుష్టచిత్తుఁడై యక్షపాదుఁ
డధిప మాకందమయ్యె నీయంఘ్రిపద్మ
మనుచుఁ బొగడుచుఁ గాంతఁదోకొనుచుఁ జనియెఁ
గౌశికుండును జనుచు రాఘవుల కనియె. 175

మ. కనుఁగొంటే మిథిలాపురంబు ధరణీకన్యాపదాంభోజమో
హనమంజీరఝుళంఝుళత్ప్రబలనాదాకృష్టమందాకినీ
కనకాంభోరుహకర్ణికాంతరచరత్కాదంబికామ్రేడితా
యనఖండాభ్రగకేళిసౌధమయి చెల్వారెన్ రఘుగ్రామణీ. 176

తే. అస్తమయవేళఁ బురమున కరుగనేల, నేటి కీకేళివనిలోన నిల్చి తేపు
పోవ మేలగు నని మౌనిపుంగవుండు, రాఘవులతో వనాభ్యంతరమునకరిగె.

సీ. గుబ్బకస్తూరికుంకుమ యంటినది కొమ్మ గోరంట కౌఁగిట గ్రుచ్చెనేమొ
యంఘ్రిలాక్షారసం బంటియున్నది లతాతన్వి యశోకంబుఁ దన్నెనేమొ
మధువాసనలు గుల్కె మంజుళకేసరం బువిద పుక్కిటిరసం బుమిసెనేమొ
యసమయంబునఁ బూచినది సహకారంబు భామాలలామ చేపట్టెనేమొ
తే. రామ కనుఁగొంటె కేళికారామసీమ, సహజవాత్సల్యమున భూమిజాతసీత
ప్రోదిసేసినభూరుహంబులు సురేంద్రు, తగులనవ్వుచు నున్నవి విరులసిరుల. 178

క. అని సీతాకేళీవనిఁ, గనుఁగొని మువ్వురును సాంధ్యకరణీయంబుల్
వొనరిచి క్రొన్ననతలిమము, లను వసియించిరి కుతూహలంబుననంతన్. 179

సీ. శ్రీరామునకుఁ బెండ్లి తేపని వరుణుని కెఱుఁగింపఁ జనుమాడ్కి నినుఁడు గ్రుంకె
హోమాగ్నిశిఖ లిట్టు లుల్లసిల్లు నటన్న కైవడి సాంధ్యరాగములు మెరసె
మొనయుదంపతులకు మోహమీ వైఖరి యనుమాడ్కిఁ జీకటు లలమె దిశలఁ
దలఁబ్రాలుముత్యము ల్దలసించునంచును గనుపట్టె దివిని నక్షత్రగణము

తే. తెరమఱుఁగువాసి యాలీలఁదీరుసూపు, సీతమొగమను క్రమమున శీతకరుఁడు
దోఁచె నచ్చెల్వ దృష్టినాఁ దొగలు సెలఁగె, నిండె నీనవ్వులనఁగ వెన్నెలలు గంటె.

క. అని పలికి ప్రొద్దువోయెన్, జనవర నిద్రింపు మనుచు సంయమివర్యుం
డనుజుండును శయనింపఁగఁ, దనకంటికి నిదుర రాక తద్దయుఁ బ్రేమన్. 181

ఉ. కన్నులఁ జూడకున్న మహికన్యక తాదృశకౌశికోక్తులం
గన్నులఁగట్టినట్లయినఁ గన్నులవింటివజీరు నిద్దపుం
గ్రొన్ననవాఁడితూపు లెదఁగ్రుచ్చక వెన్నున దుస్సిపాఱఁగా
విన్నదనంబు దోఁప రఘువీరుఁడు మోహము చేఁ దలంకుచున్. 182

ఉ. ఎప్పుడు తెల్లవాఱు నిఁక నెప్పుడు మైథిలిరాజుఁ గాంతు నే
నెప్పుడు చంద్రమౌళిధను వెక్కిడుదుం ధరణీకుమారి నే
నెప్పుడు చెట్టవట్టుదు నభీష్టము లెప్పుడు గాంతు నంచుఁ దా
నెప్పుడు నెంచుఁగాని యెనయింపఁ డొకప్పుడు నిద్రకంటికిన్. 183

వ. ఇత్తెఱంగున సీతాకాంతనుం దలంచి యంతయు నంతరంగంబునఁ జింతించు రఘు
కాంతుం డొక్కింత నిదురింప నంత వందిజనుల చెలువంది ద్విజబృందంబులు కల
కలధ్వనుల మేల్కొని యర్ఘ్యప్రదానంబున నరవిందసఖునకు మందేహజయంబు
నొందించి విదేహరాజపురంబునకుఁ జను నెడ విరహచ్ఛిదేహ విదేహాశరవ్యూహ
కీలితదేహుండగు రఘూద్వహునకుం గౌశికుం డిట్లనియె. 184

మ. అదె కన్గొంటివె వజ్రసాల మదె ఖేయవ్యాజపాథోధి య
ల్లదె వైదేహనృపాలశేఖరమహోద్యద్రత్నసౌధాగ్ర మ
ల్లదె రథ్యాగృహకేతుజాతమదవేశ్యాభర్మహర్మ్యాళి య
ల్లదె యత్యుత్తమవాజిశాల యని యాయాదిక్కులం జూపుచున్. 185

సీ. ఆరెకట్టికవార లందంద కుంతము ల్గొని ముందుగాఁగ డీకొల్పుచుండ
హరిదంతదంతిజయంబును సూచించు కరణిని దవిణెమలహరులు మొఱయ
ధరబూను మనుచుఁ బాదముఁ బట్టివిడువని చిలువ తేఁ దన వెండిగొలుసు దనర
గంధాంధమధుపసంఘంబులు మాత్రమె కాని సరసఁ జేరక భీతి జనము దొలఁగఁ
తే. జాల మదమున మాపంతు గాలుమీఱి, పచ్చుదంతావళముఁ గంటె వసుమతీశ
కేలు మొగుచుచు నున్న దీవేళ నీకుఁ, బుడమికన్నియ నడలకు జడిసి కాదె. 186

క. అని దాని కోసరిల్లుచు, మనుజేంద్రకుమారు తీరు మౌనుల మేమా
టను దాని కోసరిల్లుట, సను నె కదా యనుచు సరససల్లాపములన్. 187

సీ. నగరివిద్వాంసు లందలములు డిగ నూరకందలం బెక్కి పోం డని నుడువుచు
నల్లంతఁ గనినంతఁ బల్లకీల్ డిగ్గి భూవల్లభు ల్మ్రొక్క దీవన లొసఁగుచుఁ
గేవలభక్తితో లేవణిక్కులఁ గ్రేవలనటుఁ గటాక్షించికొనుచు
రాము సౌందర్యంబు ప్రేమఁ జూచుచువచ్చు కామినీజనులఁ గ్రేఁగంటఁ గనుచు

తే. వేడ్కఁ గాధేయుఁ డేతేర విని విధేయుఁ
డగుచు మిథిలాధినాథుండు నగరు వెడలి
యమితగజవాజి భటసంకులముగ నెదురు
కొని సపర్య లొసంగి తోకొనుచు వచ్చి. 188

మ. జనకక్ష్మాపతి కొల్వుకూటమున విశ్వామిత్రు శ్రీరామచం
ద్రుని సౌమిత్రి యథోచితాసనములందు న్నిల్పి పీఠస్థుఁడై
మునిజంభారి ఫలించె నామఘ మఖంబు ల్దూరమైపోయెఁ బా
వనమయ్యెం గులముం గులంబు ననుచు న్వాక్ప్రౌఢి వర్ణింపఁగన్. 189

తే. జనకచిత్తంబు శ్రీరామచంద్రుఁ దగిలి, కనియె బ్రహ్మానుసంధానమునను గాంచఁ
దవిలినానంద మపుడు ప్రత్యక్షమైన, సగుణ మట్టి ప్రమోద మెసంగు టరుదె.

వ. ఈచందంబున రఘునందను శతకోటికందర్పసౌందర్యుని దర్శించి యమందానం
దంబునొంది జనకజగతీసంక్రందనుం డిట్లని వితర్కించె. 191

సీ. సృష్టికిం బ్రతిసృష్టి చేసెనంచును వింటి మీమునీంద్రునిఁ దొల్లి యిపుడు నిచట
నొకట నింద్రోపేంద్రులకుఁ బ్రతినిర్మించెనో లేకసూర్యచంద్రులకుఁ బ్రతియొ
మన్మథునకుఁ బ్రతిమన్మథులో యటు గాకున్న రాజలోకంబునందుఁ
గలుగునే యింతచక్కఁదనంబు పురుషులమనసుహరించె స్త్రీజనము లెంత
తే. యందు నీయగ్రజుని చెల్వ మరఁది పొగడ
నితనికిఁ గుమారినొసఁగి నాయింటనుంచి
కొనెడిభాగ్యంబు దొరకునొకో యదేల
గలుగు దుష్టప్రతిజ్ఞుఁడఁ గాన నేను. 192

శా. ఏలా చేసితి దుష్ప్రతిజ్ఞ యిఁకఁ జండీశానకోదండమీ
బాలుం డెక్కిడఁ జాలకుండిన వృథా పంపింపఁగా నేర్తునే
చాలింపం దగునే ప్రతిజ్ఞ నగరే క్ష్మాపాలకు ల్వచ్చెనాం
దోళం బేనిక నెట్టిచందమునఁ దీర్తుం ధర్మసందేహమున్. 193

తే. అని మహాశ్లాఘమున విదేహాధినేత, వీరలెవ్వారలో సుకుమారమూర్తు
లనిన దశరథరాజనందనులు వీరు, ధనువుఁ జూడంగ వచ్చినా రనియె మౌని. 194

క. అనవుఁడు పరమాద్భుతమున, జనకుఁడు దశరథున కిట్టి సంతానము గ
ల్గెనె యిష్టి సఫలమయ్యెనె, కనుఁగొంటిమి నాఁటి యత్నగౌరవ మెల్లన్. 195

ఉ. శ్రీశుఁడు క్షీరవార్ధి వసియించుట మాని మహిన్ మహీశుఁడై
యీశరాన మెక్కిడిన నెక్కెడుగాక మనుష్యమాత్రు లీ
యాశలఁ జెంద నేటికి సురాధిపముఖ్యులచేత నైనఁగా
దీశిశువు ల్గనుంగొనఁగ నేమిఫలంబు తపోధనాధిపా, 196

చ. అనవుడు విక్రమాను మనుజాధిప నీవనుమాట నైన యీ
జనవరనందను ల్గనఁగ సంతసమందినవారుఁ జూడనీ
ధనువులు వీరిముచ్చట వితావితసేయకు మన్న మాని మీ
మన సనుచు న్విదేహనృపమౌళి యనేకులఁ బంప వారలున్. 197

చ. మమత సురాసురు ల్దొలుత మందరభూమిధరంబుఁ దెచ్చుచం
దమున మహేశచాపసముదంచితపేటికఁ దెచ్చియుంచినం
బ్రమదముపూని మాని రఘురామ కనుంగొను మీ శరాసనముం
దెమలుప నేర్తువే యనిన ధీరుఁడు శ్రీరఘువీరుఁ డయ్యెడన్. 198

సీ. తనవిల్లునమ్ములుఁ దమ్ముని చేనిచ్చి మేరుగిరీంద్రంబు మీఁదనుండి
దుమికెడి కొదమసింగముమాడ్కి మణిపీఠి డిగ్గి నగుముద్దు నెమ్మొగముతోడ
జాఱెడిసిగ కేలఁ జక్కనొక్కుచునుఁ జెక్కులను గట్టాణిచౌకళి నటింప
వలెవాటు నెఱనీటు వలివెచందురుకావి చేలచెఱంగులు నేలజీర
తే. దివ్యభూషణకాంతులు తేజరిల్ల, సీత నెచ్చెలు లాడాడఁ జేరిచూడ
నఖిలరాజన్యు లచ్చెరువంద దివిని, సొంపుమీఱ నిలింపులు గుంపుగొనఁగ. 199

తే. సకలలోకైకమోహనచారురూప, సంపద లెసంగ శ్రీరామచంద్రుఁ డపుడు
గంధమంథరసింధురగమనలీలఁ, జెలువుమీఱంగ నల్లనఁ జేరనరిగి. 200

క. మందసముత్సాహుల కీక, మందుసుమీ యసమనంగ మనుజులు హరువి
ల్మందసముఁ దెఱచిచూచె, స్మందసముద్రేకహరకుమారుఁడు గడిమిన్. 201

సీ. ప్రత్యక్షమై మించుభర్మశైలముఁ బోలి బహుసుపర్వాఢ్యమై పరిఢవిలుచు
దృగ్గోచరంబైన దృక్కర్ణపతిఁ బోలి జ్యావహనోచితసార మగుచు
సాక్షాత్కరించిన శైవధర్మముఁ బోలి ద్రిపురనిర్వాపణనిపుణ మగుచు
నెదుటఁ దోఁచిననిర్జరేంద్రచాపముఁ బోలి బహువర్ణసూచకప్రబల మగుచుఁ
తే. గనకమయచిత్రకాండప్రకాండ మగుచు, బద్ధమణిఘంటికాకోటిభాగ మగుచు
సర్వభూభృద్భయదవజ్రసారమగుచు, నద్భుతంబైన శంభుశరాసనంబు. 202

క. కనుఁగొని శ్రీరఘువీరుఁడు, వినతానందనుఁడు సర్పవిభుఁ బట్టెడుమా
డ్కిని కుంభీంద్రము రంభా, వనిజముఁ బెకలించుప్రాభవం బలరారన్. 203

సీ. లీలఁ గెంగేలఁ గీలించి లేనగవుతో ధరణీశతాతలతరమునాఁటి
పాతపంచారంబు పసలేదు వేటెత్తె నిదివృథాస్థూల మిందేది బలము
అని మింటికొప్పు గల్గినవానిబలువింటి కొప్పున జానకీకొప్పుమీఁదఁ
గేలుంచు వేడుకఁ గీలించి యటువంచి ధర్మంబు సుగుణయుక్తంబు చేసి
తే. శివిఁ గళ్యాణవార్తఁ జాటించుఠేవ, నారి మొఱయించి తెగనిండ నారిదిగిచి
లస్తకస్థలవిన్యస్తహస్త మింత, సళ్ళ ఫెళ ఫెళ ఫెళమంచు విల్లువిఱిగె. 204

సీ. ఎదఁజొక్కి నిదురవో యెడికుంభకర్ణుండు బబ్బరింపుచులేచి ప్రాఁకులాడఁ
గల్పాంతదీర్ఘనిర్ఘాతశంక జనింప నేండ్లెన్నికొనియె వాణీశ్వరుండు
భయచంచలితవామపాణిహస్తాశ్లేష మబ్బెదం భూతవామాంగకునకు
దానును ద్రిపురారిధను వాటనో మేరుగిరి ప్రతిధ్వనులచే మొఱలువెట్టె
తే. జనకకౌశికరామలక్ష్మణులు దక్క, దక్కఁగలవారు మూర్ఛిల్లి తగఁదెలిసిరి
తత్త్రిలోచనచండకోదండదళన, నినద మబ్జభవాండంబు నిండునపుడు. 205

క. ఒకరినిబట్టం బదుగురు, సకులాశుభవార్త దెల్ప జానకి లజ్జన్
మొకమింతవంచియాకౌ, తుకమునకుం దెలిసి యొసఁగెఁ దోరపుసొమ్ముల్. 206

తే. అంత జనకానుమతిని స్వయంవరోత్స, వమునకై నెచ్చెలులు పంటవలఁతిపట్టిఁ
జందనాలేపరత్నభూషాప్రసూన, చీనిచీనాంబరములఁ గైచేసిరపుడు. 207

సీ. కడువేడ్క నుబ్బు జక్కవగుబ్బచనుదోయి బిగిజంటఱవికెలోఁ బిక్కటిల్ల
జిలిబిలిపంచదారలుగుల్కు బొమ్మంచు మోవిపైఁ జిఱునవ్వు ముద్దుగురియఁ
నునుతెప్పవాల్చి క్రేఁగంటఁగన్గొనుచూపు మారునారసముతో మాఱుమలయ
జఘనభారంబున జడియునెన్నడఁ బాదకటకముల్ ఘల్లుఘల్లు మనఁగఁ
తే. గేలఁ జెంగల్వపూఁబండ గీలుకొల్పి, సిగ్గు నొయ్యారమును మీఱఁ జెలులు వేన
వేలు దనవెంటఁగొల్చిరా విభవమునను, జనకకన్యక చనుదెంచె జనకుసభకు. 208

ఉ. ఆజనకేంద్రకన్యరుచిరాంగవిలాసముఁ జూచునంతలో
రేఁజిగురాకు నిద్దపుగలీపుననుంచిన తమ్మిరేకుఖం
డాజళిపించి మారుఁడు తటాలునఁబేరెదఁ జూచి వైవఁగా
రాజన్యపాలశేఖరుఁడు రామనృపాలుఁడు సొక్కె నెమ్మదిన్. 209

తే. కంటిమో వింటిమో యిటువంటివాలుఁ
గంటి ధరయందె కాదు వేఁగంటి నగరిఁ
గలుగు తెఱగంటి తెలిగంటిగముల నైన
నెటులు సృజియించె ధాత యీయిందుముఖిని. 210

ఉ. పూపమిటారిచన్నుఁగవపోఁకలపీకలఁ జౌకసేయు నా
రా పలుచాలు మేలుమగరాలసరాల నిరాకరించు నా
హా పగడంపువాతెఱ యొయారము చిల్కపటానిపాదుపా
తూపులకోపుసూపుఁ జెలితోరపుఁజూపులయేపు బాపురే. 211

క. కన్నె రతనంపుమిన్నా, మిన్నా నడు మనఁటియాకు మేకొను వెన్నా
వెన్నా పలుకులు పొక్కిలి, పొన్నా పొన్నా మెఱుంగుఁబోఁడికి నదిరా. 212

సీ. వనజాక్షి కటితటం బనుమహీభాగంబు బటువుగుబ్బలపేరి పర్వతములు
హరిమధ్యమధ్యమ మనునంబరంబును మెఱుఁగుముంగురులను మేఘములును

సఖియమో మనుపూర్ణ చంద్రమండలమును రదపఙ్క్తి పేరి తారాగణంబు
కలకంఠినగ వనుగంగాప్రవాహంబు బెళుకువాల్చూపుల పేరి యమున
తే. సృష్టి చేసెనో యజునిపై నీర్ష్య మరుఁడు, దానుపద్మోద్భవుఁడుగానఁగానిచోట
బ్రహ్మసృష్టిని యిటువంటి భామ గలదె, మనుమాయయో కానియీ మంజువాణి.
మ. అలకవ్యాజముచేతఁ బైకొనెడి నారారా కురుల్వ్రేకటు
ల్వాలెనంచు న్ముఖచంద్రుం డంప నుడుజాలంబంత సీమంతపుం
గళుకుంబాపట పేరఁ ద్రొక్కికొనిరాఁగా వీఁగి పాదాంబుజం
బుల వ్రాలెం జెలివేణి ప్రోవఁదగదే మూర్ధన్యసంతానమున్. 214
శా. నాసామౌక్తికరోహిణీరమణి కాంతావక్త్రచంద్రాధరం
బాసింపం గనుఁగొన్న తారకలకుం బ్రాపింప లజ్జాభరం
బానన్న శ్రుతికుండలస్ఫురితముక్తాభిఖ్యతారాళితో
నాసాదింపఁగఁ జేరెఁ గానియెడ నేలా యోరఁగాఁ జూడఁగన్. 215
తే. కమ్మవిలుచెంచుతేనిచిక్కమునఁ దగులు, కోదమజ్జక్కవపిట్టల యుదుటుఁదెగడి
జిలుగుపైఠాణిఅవికెలోఁగులుకు గబ్బి, గుబ్బచనుదోయియామ్ముద్దుగుమ్మకపుర.
చ. అని తనుఁజూచుచున్న జనకాత్మజ నెమ్మది లజ్జ ప్రేమయుం
బెనఁగొన నాలు గేను మణిపీఠికమెట్టిక లెక్కిరాజనం
దను గళసీమఁ జెంగలువదండ యమర్చెను హర్ష మంబుదం
బునఁ దిరమొందఁ గ్రొమ్మెఱుఁగుబూన్చుగతి న్నిజరాగ మేర్పడన్. 217
తే. శ్రీరఘూత్తముఁ డిత్తఱిసీత కేలు, వట్టితొడమీఁదఁగూర్చుండఁబెట్టుకొనెడి
యంతమోహాంబుతో నుండె నవనికన్య, యంత నంతఃపురంబున కరిగె నరుగ.
చ. ఇతఁడు మనుష్యమాత్రుఁడని యెంచితిఁగాని యెఱుంగనైతి శ్రీ
పతియని యామహీతనయ పద్మనివాసిని యాట నిక్కమీ
గతి రవిచంద్రవంశములు గౌరవమొంద జనించినారలో
ప్రతికులనేత నీవెఱుఁగవా సకలజ్ఞుఁడ వెన్నిచూడఁగన్. 219
తే. అని జనకనేత దశరథజనవరేణ్యు, రాఘవుల పెండ్లికిని సాగి రమ్మటంచు
నుత్తరము వ్రాయఁబంచి నియోగిఁ బనుపఁ, బరిభవముమీఱ నతఁడునప్పురికినరిగి.
తే. అవసరంబులవారిచే నధిపునకును, దనదురాక నెఱింగించి మునుపుగాను
వారు దోడ్కొనిపోవ భూవరబలారి, కడుగరలొసంగి పొడగని యొద్దనుండి.
క. జనకనృపు నుత్తరం బని, జనపతికిం దెల్పి రాయసమువ్రాయు నియో
గినిబిలిచి యొసఁగి నతఁడును, జనపతికనుసన్న నదియు సరభసఫణితిన్. 222
సీ. శ్రీమతుజనకధాత్రీతలనాథుండు దశరథమేదినీధవసురేంద్రు
చాలుమానుసులకు సంప్రీతిఁబుత్తెంచిన ప్రయోజనము దమనందనుండు

రఘువీరుఁ డిలఁగల్గురాజన్యు లెవ్వరు నెక్కిడనోపని యీశుచాప
మెక్కిడి విఱిచిన నెంతయుహర్షించి సీత నొసంగ నెంచితిమి మేము
తే. తనయులును దాము రావలెననుచుఁజాలు, మానుసులుదశరథరాజమౌళితోడ
దెలిపెడిది యనువక్కణ గలిగినట్టి, యుత్తరంబును వినుపింప నుత్సహించి. 228
తే. తనదు సారిగఁదెల్పు ప్రధానమణికిఁ, గనకపటభూషణము లిచ్చి గౌరవమున
మంచిదేకద జనకసంబంధ మనుచు, బంధువులతోడ యోజించి పైన మగుచు.
సీ. గోరథంబులనెక్కి కులగురుఁ డాదియౌ తాపసోత్తములు నందంద నడువ
భద్రేభములమీఁద భరతశత్రుఘ్నులు సరిగాఁగ నుభయమపార్శ్వములనడువఁ
గౌసల్య మొదలైనగఱితల ముచ్చుపనాగంపుపల్లకీ ల్ముందునడువ
వెనుక డెబ్బదిరెండు వినియోగములవారు నాప్తులు నృపులు నందందనడువఁ
తే. జిమటపని మీసములకప్పఁ జెంపకురులు, నెదను గస్తూరిపట్టెలు నుదుటితిలక
మలర వెలువడె దశథుఁ డౌర ముసలి, సొగ సనుచువారకామినుల్చూచినగఁగ.
తే. ఎదురుగా వచ్చి జనకనరేంద్రుడంత
యేనుఁగులమీఁద సంధించి మానవేంద్రుఁ
బురికిఁదోడ్తెచ్చి తనసహోదరునివీడు
విడిది గావించి యులుప నెక్కుడుగ నొసఁగె. 226
తే. కౌశికుఁడు రేయి రామలక్ష్మణులఁ దోడి,కొనుచు వచ్చిన హర్షించి కుశికసుతునిఁ
బొగడి తనయుల యాశ్లేషమునను దనిసె, బంతి తేరులపంటవలంతిమగఁడు. 227
సీ. మఱునాఁడు జనకునిమంత్రులు పిలువరాఁ గొలువుసింగారమై కలిమిమెఱయ
దశరథరాజు నందనులతో నగరికిఁజనుదేర నెఱఁగి హజారమునకె
యెదురుగా జనకరాజేంద్రుఁడు సనుదెంచి కేలుమోడ్చినతోడఁగేలుమోడ్చి
గేలునుగేలును గీలించి సనుదెంచి మునివరు ల్మున్నుగాఁ గనకపీఠ
తే. ములను వసియింపఁ దదుభయకులనృపాల, కులవసిష్ఠశతానందకులు గణింప
నింత యొప్పునె సంబంధ మిదియటంచు, నెల్లవారును మది సంతసిల్లిరపుడు.228
తే. మనుకులోత్తమ సీత రామున కొసంగి, లక్ష్మణకుమారకున కూర్మిళాకుమారి
చేనొసంగెద నని జనకేంద్రుఁ డనిన, నెదదశస్యందనునిమోద మినుమడించె.229
తే. తోడుతోడుత భరతశత్రుఘ్నులకును, నీకుశధ్వజతనయుల నిమ్మటంచుఁ
గౌశికుఁడుపల్క జనకుఁడౌఁగాక యనఁగ, నలదశస్యందనుముదంబునలుమడించె.
వ. ఇవ్విధంబున రామలక్ష్మణభరతశత్రుఘ్నులకుం గ్రమంబునఁ సీతోర్మిళామాళవీ
శ్రుతకీర్తుల నొసంగనిశ్చయించి జనకభూపాలుండు గురుముఖంబున మఱునాఁటి
వైవాహిక లగ్నంబు శుభప్రదంబని వచించిన నట్లయౌఁగాకయని సంతుష్టాం
తరంగుఁడై కొడుకులతో విడిదికిం జని మఱునాఁడు ప్రాతఃకాలంబునఁ దనూభ
వులకు శుభంబుగా గోదానాదిదానంబు లొనరించుచుండె నప్పుడు. 231

సీ. పట్టెవర్ధనములపైఁ బట్టెడతళుత ల్బంగారుప్రోఁగులు నుంగరములుఁ
బైగప్పుకొన్నట్టిపట్టుపచ్చడములు వెలిచాయగల శిరోవేష్టనములు
గన్నెరువన్నె నీర్కావిదోవతులును శిష్యులతోడను జెలువుమీఱ
మాకు వేదమువచ్చు మాకుశాస్త్రమువచ్చు మాకు స్మృతుల్వచ్చు మాకుశ్రౌత
తే. మంతయునువచ్చుఁదారతమ్యంబుఁదెలిపి, యధిపుచేదానమిప్పింపుఁడనుచునృపతి
విడిదికేఁగు వసిష్ఠులవెంటఁ బడిరి, తోలఁగద్రొబ్బఁగరాక విద్వాంసు లపుడు.
తే. ధీరులయ్యు స్వతస్సిద్ధదీనవృత్తి, వేఁడి రింతయెకాని యవ్విభుఁడుదాన
వేళ వీథులవీథుల వెదకితెచ్చి, విప్రుల కొసంగె దానము ల్వేనవేలు. 233
సీ. ఏమిదానంబు మీకిచ్చిరో జాబాలి స్వర్ణధేనువుగాదె వామదేవ
ఘటసూతికి హిరణ్యగర్భ మిచ్చిరదేమి యతఁడు సేసినపుణ్య మట్లుగలిగెఁ
దగవసిష్ఠుఁడు తారతమ్యంబులెఱుఁగఁడె యెక్కడాసంపడి యెఱుఁగు టెట్లు
మీకేమియిచ్చిరో మేము దానముఁబట్టమంటిమి మీరింత యధికులౌట
తే. లెఱుఁగ కంటిమి లేదంచు నీర్ష్యదోఁపఁ, బలికికొంచునుదానము ల్పట్టినట్టి
బ్రాహ్మణులు ధనమణులుగంపలను భృత్య, వరులు కొనితేర నిండ్లకునరిగిరపుడు.
తే. అంతనిక్కడ జనకజనాధినాథు, పంపునను సీత మొదలైన పద్మముఖుల
నలువురను బెండ్లికూఁతులఁజలుపఁ జెలువ, లుదిరిబంగరుపీఁటలునుంచి రపుడు.
తే. అలయరుంధతి దీవించి యక్షతములు, నుదుటఁ బెట్టినఁ గనుపట్టె సుదతిమోము
ప్రణయకుపితాత్మరోహిణి పాదలాక్షఁ, దొరసిచెలువందు పూర్ణచంద్రుం డనంగ.
క. తలయంటె నొకతె సీతా, కలకంఠికిఁగలితరత్నకంకణరణనా
కులదళికులములతోఁగర, జలరుహమధ్యమునఁ జికురజాలము వొదలన్. 237
క. కమలాస్త్రుఁడు కెంజిగురుం, జముదాళిని కమ్మతేనె చమిరెడిభంగిన్
రమణీమణి యొక్కతె సీ, తమెఱుఁగు నెమ్మేన గంధతైలం బిడియెన్. 238
క. జలరుహగంధికిఁగుంకుమ, నలుఁగిడియెన్ బోటి యొకతె నఖములసోఁక
న్గిలిగింతగొనెడి వలిగు, బ్బలపయ్యెద చెఱుగుమాటఁబకపకనగుచున్. 239
తే. తళుకుతళుకన మించు కుందనపుబొమ్మఁ, బటికనార్చువిధంబునఁ బ్రౌఢయొకతె
మంచిగంధంపుటటకలి నించిమేనఁ, జంద్రవదనకుఁ బన్నీట జలకమార్చె. 240
తే. సరసి నడయాడు రాజహంసంబుపత్తు, వలనమునఁగప్పుశైవాలవల్లి యనఁగఁ
జలువపావడపలగొన్న చెలువకురులు, సరసమైమించెఁ దడియొత్తుసమయమునను.
తే. వలిపెపైఠాణిచలువదువ్వలువ లోన, సరిగె చెంగావిపావడ సగ్గులీనెఁ
జంచలేక్షణ మేన వ్యాపించినట్టి, తలిరువిల్కానికీర్తిప్రతాపము లను. 242
తే. మేదినీసుత చెవిసౌర మిగిలియున్న, దశరథకుమారగుణసముదాయ మనఁగఁ
దనరె ముత్యాలకమ్మలు తరణికులుఁడ, నంతకల్యాణగుణశాలి యనఁగ వినమె. 243

క. నవమణిమయభూషణముల, నవనిజఁ గైసేసి రవ్వ దతివలు మిగులం
దావరాయల్లుని కెంజిగి, చివురాకుంబాకు చికిలిచేసినమాటిన్. 244

తే. జగము గెలువంగ నొకయమ్మె చాలుననుచుఁ
గడమనాల్గమ్ములను రాజకన్యలుగను
రతిపతి సృజించె రఘుకుమారకుల గెలువ
ననఁగ సీతాది కన్యక ల్దనరి రపుడు. 245

సీ. వలకారియంచ గావలెఁ గాకయున్నచో నధరంబు చరణంబు లరుణ మగునె
కలికిరాచిలుక గావలెఁ గాకయున్నచో ననవిల్తువిషహించుకొనఁగఁ గలదె
కళుకురత్నంబు గావలెఁ గాకయున్నచోఁ గన్నభూసతి రత్నగర్భ యగునె
తొలుకారు మెఱుఁగు గావలెఁగాకయున్నచోఁ జంచలాలోకముల్సంఘటిలునె
తే. కంతుబాణంబు గావలెఁ గాకయున్న
భువనమోహనశృంగారపూజ్య యగునె
యనుచుఁ బొగడంగ సకలలోకైకమాన్య
యయ్యెను సమాన్యమై మించె నవనికన్య. 246

వ. అంత జనకమహీకాంతానుమతంబున వివాహముహూర్తంబు సమీపంబయ్యె
నని పురోహితులు పిలువ వచ్చిన. 247

సీ. ఒరపుగా విరజాజిసరులతో సిగవైచి లాగియాకు బురుసాకులాయి బెట్టి
గీరికప్రంపు చిక్కొంట నామముదీర్చి శ్రీచూర్ణరేఖ రంజిల్లఁజేసి
మురువుగా హురుమంజిమురువుతో వీనుల కట్టాణిగొప్పచౌకట్లు దాల్చి
మణిహారముల కుంకుమపుపూఁత దెలియంగ రంగైనముత్యాలయంగి దొడిగి
తే. పెద్దపీతాంబరము గండపెండరంపు, కటకకటిసూత్రకేయూరకంకణాది
దివ్యభూషణజాలంబుఁ దేజరిల్ల, రాముఁ డభినవశృంగారధాముఁ డయ్యె. 248

తే. చెలులు గైచేసి రటువలెఁ జెలువుమీఱఁ, దోనలక్ష్మణభరతశత్రుఘ్నులకును
నృపసుతచతుష్టయంబు సుసృగ్జనైక, మోహనంబయి తగెఁ జతుర్వ్యూహగరిమ.

వ. ఇత్తెఱంగున రఘుపుంగవుండు దమ్ములుం దానును గల్యాణోచిత కల్యాణమణి
మయకల్యాణప్రసూనప్రముఖప్రసూనమాలికాకనకాంబరాది చతుర్విధశృంగా
రంబు లంగీకరించి మునిపతంగ మంగళాశీర్వచనపురస్సరంబుగా గృహాంగ
ణంబు వెలువడి చతుర్దంతంబులు హరిదంతదంతి సత్త్వంబులుం గుందదంత
ప్రభాంగంబులు నగుదంతావళచతుష్టయంబు నెక్కి కరంబుల నంకుశంబు
లంకించి తదగ్రంబులం జూళికలసోఁకించుచు వచ్చునప్పుడు. 250

సీ. పార్శ్వభాగంబులఁ బట్టినపడివేలపగలువత్తులుఁ బట్టపగలు సేయఁ
దగిలింపఁ జిఱ్ఱనెగయునాకాశబాణంబు లంబరవిమానముల దాఁట

దురుసుగా వెడలెడి బిఱుసులపూవులు భూనభోంతరములఁ బొదివికొనఁగ
నందందమర్చిన యట్టివిచిత్రంబు బాణవిద్య సురాళిభ్రమయఁజేయ
తే. నవరుప్రేటులరొదల బ్రహ్మాండ మగల, నెందుఁజూచినదివ్వెటీలే వెలుంగ
భూరిశోభనవాద్యము లొప్పరుకలఁగ, బలిసి యెల్లడఁ జతురంగబలము గొలువ.
తే. పదియునాఱేండ్లప్రాయంపు పద్మముఖులు, కాసెగట్టుక మిగులశృంగారముగను
దశరథేంద్రునిమీఁది పదమ్ముపాడి, యభినయించుచు నెదుట నృత్యంబు సలుప.
సీ. "జయజీవ వర్ధస్వజగతాంపతే" యంచుఁ జేరిమౌనీంద్రు లాశీర్వదింపఁ
"జండీశచండకోదండఖండన విచక్షణ" యంచు వందిమాగధులు వొగడ
శోభనంబులుపాడుచును బుణ్యకాంతలు మునువుగా గ్రంతలుగొనుచు నడువ
నాప్తమంత్రులును రాజాధిరాజులు దొర ల్నలువంకఁ గ్రమ్ముక కొలిచిరాఁగ
తే. ముగురుతమ్ములు సరిగ నేనుఁగులనెక్కి, వెంటనేతేరఁగా రాజవీథి వేడ్క
వచ్చెఁ గోటసురేంద్రుల వైభవమున, భద్రకరినెక్కి శ్రీరామభద్రుఁ డపుడు.
ఉ. కాంతరొ వీరునల్వురును గంతుజయంతవసంతరోహిణీ
కాంతులొ కాకయున్న మఱేఁగల్గునె యీభువనైకమోహనా
త్యంతవిలాసరేఖలవిధం బని యొండొరు లాడుకొంచు సౌ
ధాంతరరాజరాజముఖు లారసి యారసికాగ్రగణ్యులన్. 254
చ. వనితరొ వీరిలో మనసువచ్చినరాజకుమారుఁ డెవ్వఁడే
యని యొకరాజకన్యఁ జెలి యాడినఁ బో యిదియేటిమాట యం
చును నునుసిగ్గుమీఱఁ దనుఁజూచినఁ గాదది రూపరేఖక
న్నను రఘురాముఁడే యనిన నవ్విరి తోడిసకు ల్కలాకిలన్. 255
మ. వనజాతాయతపత్రలోచనలు భావంబిట్లు రంజిల్లఁగాఁ
గనుచు న్నెసలుజల్ల నుల్లసితశృంగారంబు భాసిల్ల న
ల్లన నేతెంచి విదేహవల్లభుని జాల్వాపెద్దమోసాలఁ జం
గున దంతీంద్రుల డిగ్గి యారతులు గైకొంచుఁ రఘుగ్రామణుల్. 256
మ. జనకక్ష్మావిభువెంబడి న్నడచి చంచద్దివ్యమాణిక్యదీ
పనికాయంబు ఫలోల్లసత్కనకరంభాస్తంభసంభావితం
బును స్వర్ణాబ్జపటీవితానకలితంబు న్సర్వలోకైకమో
హనమౌ హేమవివాహమండపమున న్సౌవర్ణపీఠంబులన్. 257
క. ఆసీనులైన యత్తఱి, శ్రీసీతాకన్యకాది సీమంతినులన్
రాసుతులఁ దోడితెచ్చిరి, భాసురతనుకాంతి బయలు బంగరుసేయన్. 258
వ. అంతవసిష్ఠవిశ్వామిత్రశతానందాది మునితవిప్రప్రవరసముదిత మంత్రపూర్వకం
బుగా లక్ష్మణపూర్వజు పదారవిందంబులు గడిగి మణిమయభూషణాదిపరిణయ
దక్షిణాసంపర్కం బగుమధుపర్కం బొసంగి, 259

శా. ఏపట్ల న్సహధర్మచారిణిగ నీకీసీత నాకన్య థా
రాపూర్వంబుగ నిచ్చితిం గలుగుభద్రం బెప్పుడు న్నీవిఁకన్
జేపట్టందగు నంచు మైథిలనృపశ్రేష్ఠుండు పల్కంగ సీ
తాపాణిగ్రహణం బొనర్చె రఘునాథస్వామి హృష్టాత్ముఁడై. 260

తే. ఊర్మిళను లక్ష్మణునకు మహోత్పలాక్షి, యైనమాళవి భరతున కనుపమాన
కీర్తిశత్రుఘ్నునకు శ్రుతకీర్తి నొసఁగె, జనకమహికాంతుఁ డెంతయుసంతసమున.

క. అప్పుడు పువ్వులవానలు, దెప్పలుగాఁగురిసె మొరసె దివిదుందుభులున్
ముప్పిరిగొను మోదముఁగని, యొప్పిరి జను లెల్లనమ్మహోత్సవవేళన్. 262

శా. ఉర్వీదేవులు మంగళాష్టకము లత్యుత్సాహసమ్మోదము
ల్పర్వ న్నెమ్మది బెట్టుగాఁ జదువుచుం బల్మాఱు నాయత్తమా
సర్వాయత్త మటంచు నంతఁ దెగవంచుం జానకీరాఘవుల్
పర్వేందూపమవక్త్రము ల్గనిరి దృక్పర్వంబుగా నొండొరుల్. 263

క. మంగళసూత్రము శ్రీసీ, తాంగనగళమునను రాఘవాధీశుఁడు గ
ట్టెం గదిసి మోవితనమో, ముం గౌఁగిలితనదు పక్షముం గోరంగన్. 264

సీ. కళుకుముత్యపుకమ్మకమ్మపూఁబంతులఁగలితకటాక్షభృంగములు గదియఁ
జీనిచక్కెరలొల్కు చిగురాకుమోవిపై మొలకనవ్వులమంచు ముంచుకొనఁగ
రమణీయశృంగారరసపూర్ణకుచఫలభర మోరువక మధ్యభాగ మలయ
నికరంపుఁజిలుపతేనెలఁదొప్పఁదోఁగినచెలువున మేనఁ గ్రొంజెమట వొడమ
తే. భక్తజనులకుఁగామితఫలము లొసఁగు, మమత ముంగిటియాలవాలమునఁదనరు
కల్పలతవోలె మేదినీకన్య యపుడు, తీవిఁదగు మెట్టుప్రాలపుట్టికను నిలిచి. 265

చ. నిజభుజమూలకాంతులకు నివ్వెరగందుచు నున్న రామభూ
భుజుని కిరీటభాగమున భూసుతవేతలఁబ్రాలు నించె నం
బుజముఖులెల్ల సీత చెయిముంచె నటంచు నుతింప నంత నం
గజనిభమూర్తియైన రఘుకాంతుఁడు నించెఁదదీయవేణికన్. 266

క. ముడివడెనని యెడఁదం జిడి, ముడివడకుఁడుమీఁకుఁగొంగు ముడిఫలమనుచున్
నొడివెడికడుక వసిష్ఠుఁడు, తొడిఁబడ ముడివైచె దంపతులచేలంబుల్. 267

క. నునుసిగ్గుఁ బ్రేమ బెనఁగొన, నొనరించె నిలాజ లాజహోమము రఘువ
ర్యునికరములఁ బొదువఁ జెమ, ర్చినదోయిటిలాజ లగ్నిఁ జిటపొటమనఁగన్. 268

ఉ. కొంచక పాదపల్లవముఁ గొంచుఁ గఠోరపు సన్నెకల్లుఁ దాఁ
కించెదవంచు నల్కఁ దిలకింపదు జానకి పాదమంటి ప్రా
ర్థించెదఁగాక యంచును సతీసఖిగన్గొన రామచంద్రుఁ డొ
క్కించుక నవ్వుకొంచు శుభకృత్యములన్ ఘటియించు వేడుకన్. 269

తే. కేలఁ గీలించి జానకీనీలవేణి
చరణకమలంబు కెంపురాసన్నె కంటఁ
గదియఁదాఁకించియంతలోఁ గందెననుచు
మరలఁ దత్కాంతి దొరసి యత్యరుణమైన. 270

క. వలగొనిరి శిఖికి వేడుక, వెలయఁగ ఫలకాంక్ష పల్లవితచూతంబున్
వలగొను శుకదంపతులుం, బలెను వధూవరులు చెట్టపట్టుకప్రేమన్. 271

తే. చూపి ధ్రువు నూరకయ వసిష్ఠుండు నిలువ
నగుచుఁ గౌశికముని యరుంధతినిఁ జూపె
మీపురోహితురాలును మీపురంధ్రి
దయఁగటాక్షించుమంచును ధరణిసుతకు. 272

సీ. మంగళం బంభోజ మంజులేక్షణునకు మంగళం బంగనామన్మథునకు
మంగళం బంభోజమహనీయమూర్తికి మంగళం బసురేంద్రమర్దనునకు
మంగళం బాకాశమణివంశమౌళికి మంగళం బురుకీర్తిమండనునకు
మంగళం బుర్వీకుమారీకేశ్వరునకు మంగళం బాజికుమారునకును
తే. ననుచుఁబాటలువాడుచునతులగతుల,సతులుకంకణఝణఝణత్కృతులుశ్రుతుల
రహి వహింపంగ జానకీరాఘవులకు, మంగళారతు లిచ్చిరి మమతనంత. 273

మ. తలుపు ల్వట్టుక పేర్లు సెప్పు మని కాంతారత్నముల్వల్కు మె
చ్చులకున్ సీతయు నేనువచ్చితి నటంచున్ రామచంద్రుండు సి
గ్గొలయన్ రాఘవుఁ డేను వచ్చితి నటంచుర్విజయుం బల్కుచుం
గులదైవంబు భజించి పెద్దలకు మ్రొక్కుల్వెట్టె హర్షంబునన్. 274

తే. నిఖిలబంధులతోడ మాణిక్యదీప, జాలము వెలుంగు పెండిలిచవికలోనఁ
బసిఁడిపీఁటల బువ్వంపుబంతిసాగి, సోదరులతోడఁ బ్రేమఁ గూర్చున్న వేళ. 275

సీ. నడిచక్కిఁ జేరోజనపుఁజెక్కడపుపైఁడిపళ్లెంబు ముక్కాలిపై ఘటించి
కడవన్నె తళుకుబంగరుగిన్నియలు చుట్టు నమరించి కూర లందంద నిలిపి
పడమటిపన్నీటికుడినీరు రాయంచగిండులు చెంగటఁ గీలుకొల్పి
వలయుపదార్థము ల్వడ్డించి కెలఁకుల వనజలోచనలు వీవనలు విసర
తే. సఖులు వడ్డించు వింతకజ్జముల మర్మ
మెఱిఁగి త్రోయుచుఁ గైకొంచు నిష్టములను
వెలఁదికందిచ్చుచును రామవిభుఁడు వేడ్క
మించుబువ్వంపువిం దారగించునపుడు. 276

సీ. ప్రొద్దుపోయె నటన్న భూపాల యిటువలెఁ బ్రొద్దుపోవలె నంచుఁబొగడికొనుచు
వింతపదార్థము ల్సంతరించు మటన్న నింతకన్నను వింత లెవ్వియనుచుఁ

గలిగినయపచారములు క్షమింపు మటన్న నీట వింత సేయ నేమిటి కటంచు
ధన్యుఁడ నీదు బాంధవమున ననిన నేమాఁడువాక్యంబు నీవాడితనుచు
తే. జనకనృపమౌళి దశరథజనవిభుంతుఁ, గూర్మి నుపచారములు వల్కికొనుచు సకల
బంధుజనములతోఁ గూడి బంతిసాగి, పెండ్లివిందారగించిరి ప్రేమతోడ. 277

మ. కలయం జేతులువార్చి యున్న యెడ బాగాలిచ్చి వే వియ్యపుం
గులుకుం గుబ్బెత యోర్తు మేలి తెలియాకుం జుట్టు లందిచ్చుచోఁ
గళుకుం గేదఁగి రేకుఁ జుట్టి యొసగంగా నంది బొమ్మంచు కెం
దలిరున్మోవిగదింప లక్ష్మణుని గాంత ల్నవ్వి రొక్కుమ్మడిన్. 278

ఉ. చక్కని పైఁటలోన జలజాతము మాడ్కి యిదేమి తెల్పుమా
గ్రక్కున నంచుఁ దన్ను నొక కామిని వేఁడినఁ బైఁటలోనివా
చిక్కని చన్నుదోయి యిఁకఁ జెప్పెడి దేమని లక్ష్మణుం డనం
బక్కున నవ్వి రవ్వికచపంకజలోచన మోము వంచఁగన్. 279

మ. విరికెందారమలోని మిద్దియ కడుం విన్నాణమయ్యె న్మరం
దరసంబుబ్బెడిఁ జుట్టుఁ గేసరము లంపంబాయె లేఁదేఁటిరా
గరులం బోలెడినంచు నొక్కనవలా కంజంబుఁ గాన్కిచ్చిన
న్సరసోక్తుల్ పచరించె లక్ష్మణుఁడు హాస్యప్రౌఢి రంజిల్లఁగన్. 280

వ. అంత. 281

సీ. కమ్మక్రొవ్విరి మేలుకట్ల ఘుమ్మనిమించు జాళువానాటకశాలలోనఁ
జికిలిదంతపుబొమ్మ చెక్కడంపుకడాని కళుకుకంబములయంకణమునడుమఁ
బఱచిన రత్నకంబళిమీఁది పచ్చసూర్యపుటంపు గద్దియ నంపమైన
బురుసాతివాసిపై నిరుగడబలుదిండ్లు తలగడ నొఱఁగి యద్దశరథుండు
తే. జనకనృపమౌళి గొలువున్న సవిధమునను, రాఘవాదికుమారవర్గంబు మునులు
నవల బంధులు రాజులు నాప్తజనులు, నిండి కనుఁగొనఁ గన్నులపండువుగను.

ఉ. అట ధిమ్మంచు మృదంగతాళములు మ్రోయన్ ఖంగునన్ ఠాయిగా
బటువుం గుబ్బెతదోయి రాగమనియె న్పాడెం బదం బొండు నం
తట గ్రొమ్ముత్తెపు తీఁగమోడి. తెరయెత్త న్మేఘముల్పాసి వి
స్ఫుటలౌ చంద్రకళల్వలె న్వెడలి రంభోజాతపత్రేక్షణల్. 283

క. నెలకొని చక్కఁగఁ బుష్పాంజలియిచ్చి నటించి రంత సఖియలు బహుభం
గుల వారియాటపాటల, శిలలు గరంగె నన జనుల చిత్తము లరుదే. 284

సీ. నెలకొని చక్కఁగా నిలిచిన నిలుకడ మిహికాంచనపుబొమ్మ మహిని నిలుపఁ
జికిలికోపులుకమ్మచేకత్తిమాప్టిని చికటారిపాదలికఁ జెలువుగులుక
నభినయించుచును బదార్థము ల్దెలుపుచో రతిముద్దురాచిల్క రహి వహింప
శీవిగాఁ దిరుపుగట్టి తటానఁ దిరుపుచోఁ దొలుకరి మెఱుఁగులు దులకరింపఁ

తే. గోసరుచూపుల బెళుకు బేడిసలు నిగుడ, సొగసు ముత్యాలచనుకట్టు బిగువు సూపఁ
దళుకుఁ జెంగావి కాసెబిత్తఱము నెఱపఁ, జెలఁగి పదచాళి నిపించెఁ జెలువ యొకతె.

తే. దురుపదంబులు సొక్కు మైసిరులు వొసఁగ, సరిగ సిరుగెలగుంచియ ల్సవదరించి
పెక్కువగ జక్కిణీకోపు ద్రొక్కె నొకతె, చక్కసిమిటారి నరపతులొక్కి చూడ.

క. ఎఱుకో యెఱుక యటంచుం, గొరవంజి నటించె నొక్క గురుకుచ చంకన్
బురుకఁడు బంగరుబుట్టియు, సొరిదిం గొల్లాపురమ్మ సుద్దులు వెలయన్. 287

క. తరకటబురకట గాదే, తరుణీ నామాట నీకుఁ దార్కాణగునే
బురుకనికి బువ్వదేవే, యెఱుకడగవె యంచు నొక్కయింతి నటించెన్. 288

తే. ఇంతి యొక్కతె యర్ధనారీశ వేష
మూని సాక్షాత్కరించిన మౌనిజనులు
భ్రమసి సద్భక్తి "జయజయ పార్వతీశ"
యనుచు మ్రొక్కిరి నృపులు గన్గొనుచు నగఁగ. 289

క. చెలి తకతోం తకతోం డ, త్తళంగతోంధిక్కుతోంత తధిగిణతో మం
చలవోక దీరెఁ జేరణి, వెలయించుచుఁ జూచువారు విస్మయమందన్. 290

తే. తరుణవిటులు నటించిన దశరథుఁడును, జెలఁగి రత్నాభిషేకంబు చేసి యంత
నటులకు సువర్ణమణిభూషణములొసంగి, చాలబహుమానములొనర్చె సంతసమున.

తే. కలయఁగుంకుమ కస్తురి కప్పురంపు, వీడెములొసంగి దశరథు విడిదికంపి
యంచితోల్లాసమున జనకావనీంద్ర, చంద్రుఁడు శయించె వేఁకువజాము వేళ.

వ. ఇవ్విధంబున సకలసంభ్రమంబులు గలిగి లక్ష్మీనారాయణుల కల్యాణంబునుం బోలె నమందరాగాధిష్ఠితంబై పార్వతీపరమేశ్వరుల పరిణయంబునుం బోలె సమరసాభిరామంబై పౌలోమిపాకశాసనుల పాణిగ్రహణంబునుం బోలె జనకసమ్మదంబై సీతారామమహోత్సవంబు వెలసె నంత. 293

క. కవిగాయకాదియాచక, నివహంబులకుఁ ద్యాగమొసఁగి నృపతులకుం బం
ధువులకు దశరథముఖభూ, ధవులకు బహుమతి యొనర్చెఁ దగు వైఖరులన్.

సీ. మదమేనుఁగులు మంచిమావు తేజీలు మేలాయుధంబుల జోళ్లు నరదములను
సకినెలపట్టెమంచంబులు పచ్చలపల్లకీల్ రాచిల్క పంజరములు
సరిగెజీనువజీని సురటీలు నిలువుటద్దంబులు నుడిగెంపుఁదలీరుఁబోండ్లు
పట్టంబరంబులు పరిమళపేటిక ల్ముఖ్యభూషణములు మొదలుగాఁగ

తే. నన్యకన్యాజనకగర్వహరణముగను, హరణముగ నిచ్చెనల్లుండ్ర కాఁడుబిడ్డ
లకును వెయ్యేసిగ్రామము ల్పసుపునకు నొ, సంగి పంచె విదేహభూజానియంత.

చ. దశరథదారుణీధవసుధాకరుఁ డెంతయు భక్తిమీఱ న
క్కుశిక కుమారు నంపి కొడుకు ల్మహిజాదివధూజనంబులున్

శశిముఖు లేఁగుదేర నిజసైన్యముతో బహుతూర్యఘోషముల్
దశదిశలన్ ఘనంబయి చెలంగ నయోధ్యకు వచ్చుచుండఁగన్. 296

సీ. రాజహంసాళి దుర్ధర్ష కామర్షవర్షాతటిచ్ఛటులునా జడలు దనర
స్వకృతరక్తాహ్రదసంసూచకంబులై దహనోగ్రరక్తనేత్రములు వెలుఁగ
నిబిడనిజోచ్ఛ్వాసనిశ్వాసపవనతీవ్రమున నా నధరప్రవాళమదర
శాంతి నిర్గమనావసరముఖాద్విశ్లథార్గళులనా దంతసంఘర్ష మొదవఁ
తే. బాదఘట్టన మేదినీభాగ మగల, గండ్రగొడ్డలిభుజమునఁగ్రాలవేఁడి
వేఁడిరాముఁ డటంచును విలయరుద్ర, రౌద్రమున వచ్చెభార్గవరాముఁడపుడు.

సీ. ఇఁక నేమిసేయుద మెందు డాఁగుదమంచు దశరథేశ్వరుఁ డెదఁ దల్లడిల్ల
సంయమిఁ బుత్రభిక్ష యొసంగు మని వేఁడుదునొయంచుఁగోసలతనయగలఁగ
నిన్ననయ్యెను బెండ్లి నేఁడిట్టియలజడి వచ్చెనే యని సీత వగలఁబొగుల
మనచే నసాధ్యుఁ డేమనవచ్చు నిఁకనంచు ననుజు లింతింత నాయత్తపడఁగ
తే. నలవసిష్ఠాదు లర్ఘ్యపాద్యములు గొనుచు, నలికి చేరకయూరక నిలిచియుండఁ
జేరి ప్రణమిల్లి యంజలిచేసి యున్న, రాముఁగనుఁగొని భార్గవరాముఁ డనియె.

సీ. ఖండించె నేపేరకార్తవీర్యావార్యఘనభుజాకదలికాకాననంబుఁ
జండించెనేమహేశ్వరకుమారునితోడఁగొట్టించభూధరవిదారణనిరూఢి
మండించె నేమహోద్దండప్రతాపవైశ్వానరుచే రాజవంశములను
బండించె నేయాగఫలముతండ్రికిని శాశ్వతమగుసప్తర్షిస్థానమొసఁగి
తే. యహహసామాన్యుఁడనె యెంచ నశ్వమేధ, సవనదీక్షాంతకశ్యపసంయమీంద్ర
దత్తసప్తసముద్రాంతధరణితలుఁడ, భార్గవుఁడ ఖావదరివాసభార్గవుఁడను. 299

తే. బాపురే నన్ను బీదబాఁపనివిధంబు
నను గనుంగొని యర్ఘ్యదానంబొసంగ
వచ్చితివె యంచు రోషంబు పెచ్చుపెరుఁగ
రామచంద్రున కనియె భార్గవుఁడు మఱియు. 300

శా. ఓరీ రాజకులాధమా తెలిసెనో హెూ నీదుబ్రాహ్మణ్య మీ
ఘోరాస్త్రంబుల దానవీహరణమే కోపంచుఁగావించి తీ
వౌరా తాటకతల్లిగాదు గదవయ్యా భూమి నిఃక్షత్రగా
నేరాసేయుట సత్యవాదివవు లే నేనెవ్వడన్ దెల్పుమా. 301

మ. అనుచున్ భార్గవరోషపోషణపటువ్యాహారము ల్మీఱఁ ద
ద్ధనువుం దేజముతోడఁ గైకొని సముద్యద్బాహుదర్పంబునం
గొనయం బెక్కిడి యమ్ముగూర్చి యిఁక నీకుం శాస్తి గావింపకే
జన నాబాణ మమోఘమంచు ధరణీజాభర్త యత్యుగ్రుఁడై. 302

తే. భార్గవుఁడు పెక్కునాళ్లు తపంబువలనఁ, గూర్చు స్వర్గలోకములనెల్ల గూల్చె నొక్క-
కోలఁ 'గుమ్మరికేఁడును గుదియకొక్క,'పెట్టటంచును బల్కఁగాఁ బృథివివినమె.

తే. జామదగ్న్యుండు విష్ణుతేజంబు సనిన
రామచంద్రనృపాల మార్తాండు దండఁ
జందురుఁడు పోలి కనుపట్టె సవినయముగఁ
దొలఁగెఁ దా మున్ను వచ్చిన త్రోవఁ బట్టి. 304

తే. సకలజనము సెలఁగె జానకీకల్యాణ, వేళకన్న రామవిజయలక్ష్మి
కలసియున్న రాముఁ గాంచి సీతయు మెచ్చె, సవతిమత్సరంబు సతికిఁ గలదె. 305

వ. అంత. 306

మ. జనకుండుం జనను ల్సహోదరులుఁ దజ్జాయ ల్మునిజ్యాయలుం
జననాథు ల్హితులుం బురోహితవరు ల్సైన్యంబు లేతేరఁగా
జనకక్షోణివరాగ్రగణ్యసుతతో శత్రుంజయారూఢుఁడై
తనసాకేతపురంబు సొచ్చె రఘునాథస్వామి హర్షంబునన్. 307

సీ. అకలంకమణికంకణకళంకరహితేందుముహితాస్య లుభయచామరలు వీవ
నుడిగంపువిడికెంపుపొడికెంపునునుమోవిపడఁతులు వన్నెపావడలు వైవ
మరుదధ్వచరదధ్వబిరుదధ్వజచ్ఛాయ నేలకు నీలిబూర్ణిసు గాఁగ
నెలవంకవలవంక నలశంకరకుమారుఁ బ్రతిఘటింపఁగఁ జాలు భటులు గొలువఁ

తే. పౌరవారిజముఖులు సొంపారయనుచు, సేసకొప్పులు గదలంగ సేసఁ జల్ల
రామభూజాని జానకీరామతోడ, నగరుచిరసౌధ మగుతన నగరు సొచ్చె. 308

వ. అంత. 309

సీ. చికిలికెమ్మోవి కెంజిగురు మిటారింప దంతకోరకము లందంబు గాఁగ
మవ్వంపుఁజిఱునవ్వుఁబువ్వు సివ్వటిలంగఁ బొదలువాల్చూపుతుమ్మెదలు మెదలఁ
గలకలఁగోయిల పలుకులు చెలరేఁగఁ గలితనాసాచంపకము దనర్పఁ
జెన్నుగాఁ బొక్కిలి పొన్న క్రొవ్విరిమించ గుత్తంపుగుబ్బపూగుత్తు లలరఁ

తే. ప్రథమఋతుమతియయ్యె ధరాతనూజ, శుభదినంబున నంతట శోభనంబు
సేసి రారేయి రఘుపతి చిత్తజాత, కేళికాలోలుఁడై కేళిగృహమునందు. 310

చ. పగడపుఁగోళ్లఁ గుందనపుఁబట్టెలు గుజ్జరినేఁతపట్టెయం
చగరులపాన్పు జాజివిరిశయ్య దుకూలము పై తలాడలుం
జిగిదళుకొత్తు చప్పరము చెందొవ క్రొవ్విరిచందువాలతా
విగలిగిమించు మంచమున వేడుక శ్రీరఘురాముఁ డున్నెడన్. 311

సీ. తళుకుముత్యపుకొప్పు వలనిగ్గు మదబంభరాళికి విరిగుత్తి మూసఁగొలుపఁ
జిలుకుకెంపులకమ్మ మెఱుఁగు వేఁజెక్కులఁ గుంకుమమకరికల్ గుదురుకొలుపఁ

గడకంటికెంజాయ గర్ణాంతరంబులఁ బలగొని మేనిజవ్వాది యుంచఁ
గస్తూరితిలకంబుకాంతి దీవెలుసాఁగి చెదరుముంగురుల యొప్పిదము గులుకఁ
తే. జెలులు గైసేసి జానకిఁ జెలువుమీఱ, నల్లనల్లనఁ దోడ్తెచ్చి యధిపుచెంత
నిలిపి వారెల్ల నొక్కొక్క నెపము వూని, వెడలి చనినను శ్రీరామవిభుఁడు వేడ్క.
ఉ. బాలిక వీడె మిమ్మనుచు బాహువు సాచిన మాట దాటఁగాఁ
జాలక సాధ్వి గాన జలజాతవిలోచన కప్పురంపు బా
గాలొసగంగఁ గైకొని తగన్మడుపొయ్యనఁ జుట్టి యీయశం
పాలలితాంగి నీదుకుచభారము నెన్నడు మోర్వ నేర్తునే. 313
ఉ. రమ్మని రామచంద్రుఁ డనురాగము మీఱ ధరాకుమారి నం
కమ్మున నుంచ సిగ్గునను గ్రక్కున డిగ్గిన డిగ్గనీక హ
స్తమ్ములఁ బట్టి ముంగురులు సక్కఁగ దువ్వుచుఁ దళ్కుబెళ్కుపై
చెమ్మట గోటమీటి వలిసిబ్బెపుగుబ్బసరుల్ దిమల్చుచున్. 314
సీ. చవిచూడనీయవే చంద్రబింబాస్య నీకండచక్కెరమోవి కరఁగిపోదు
లీలఁ గెంగేలఁ గీలింపనీయవె కొమ్మ వలిగుబ్బిబంతులు వాడిపోవు
మించి బిగ్గరఁ గౌఁగిలింపనీయవె బాలజాళువా నెమ్మేను సమసిపోవ
దింపుతో ముద్దాడ నీయవే కామినీమణి చెక్కుటద్దము ల్మాసిపోవు
తే. తెఱవ తల యెత్తి చూడవే దృష్టిదాఁక, దిందుముఖి పల్కవే తేనె చిందిపోవ
దువిదనవ్వవె క్రొవ్విరు లుడిగిపోవ, నంచు వేఁడుచు రఘుభర్త మించు తమిని.
ఉ. కంచుకమేటికే చెమట గ్రమ్మెడి నంచు సడల్పఁబూని యు
బ్బించకు మేనటంచనిన బిత్తఱి యంతకునుబ్బఁగాఁ బటా
పంచయి వీడెఁ గంచుకము పక్కున నిద్దపుపైడికొండలం
దంచితమైన మంచనఁగరాప్తి నిమించు క్రమంబు దోఁపఁగన్. 316
తే. వజ్రసంపర్కమున గోర్చి వరవిచిత్ర, పత్రవైఖరిఁ బొల్చు నీబటువుగబ్బి
కులుకుగుబ్బలు కులశైలములను మించె, నేటి కలికెదు నాకోట కిటవధూటి.
క. అనిసయ్యాటంబునఁ జ,న్మొనలంటుచు మోవియాన ముద్దియ నొక్కెన్
మొనపంటఁ జుఱుక్కననొ, క్కనఁ దెప్పిరి చెక్కుద్రోచి కినుకన్ లేవన్. 318
చ. తరుణిరో వాఁడిగోరు గలదాన పటంచును జక్కిలించి నీ
వరిగెదు పొమ్ము పొమ్ము నినునారడిపెట్టక పోదు నే సఖీ
పరిసరసీమఁ జూపననబాలిక పోవఁగఁ గాళ్లు రాక ని
బ్బరమును లజ్జ నిల్వఁ బయిపాటున గౌఁగిటఁ జేర్చె గ్రమ్మఱన్. 319
క. అలరుల్ శయ్యకుఁ దారిచి, జలజానన చిత్తమెఱిఁగి సమరతికలనన్
గళలంటి కరఁచి శ్రమజల, కలితుం డయినయంత మదనకదనాంతమునన్. 320

సీ. ఒకసాలభంజిక యొయ్యనఁ గమ్మదెమ్మెరలురాఁ గపురంపుసురటి విసరె
నొకరత్నపాంచాలి యొసపరితావిపన్నీటి చేగిండి పాణికి నొసంగె
నొకపైఁడిప్రతిమ యొద్దికతోడ గండూష మొనరింపఁ గాళాంజిఁగొనుచు వచ్చె
నొక్కజంత్రపుబొమ్మ యుమ్మెత్తవిరిచాయ నందమౌ పావడ యందియిచ్చె
తే. నొక్కమణిపుత్రి వాసనప్రక్క లొసఁగె
మడిచియుండిన తెలనాకుమడుపు లొసఁగె
రాఘవుఁడు నేర్పుమీఱ సూత్రము గదల్ప
సీత చెలులంచు లజ్జచే సెజ్జడిగియె. 321

క. మతిదెలియ నవ్వుచుఁ బునా,రతులం దేలించి యంత బ్రౌఢను జేసెన్
సతిఁ గ్రమమున శ్రీరఘుపతి, చతురతరుఁడుగాఁడె యతనుశాస్త్రములందున్.

క. ఈగతి రఘుకులపతి యను,రాగమతి ధరాసుతావరారోహాసం
భోగాభోగసుఖోన్నతుఁ,డై గిరిగొను వేడ్క నహరహము విహరించెన్. 323

క. అని శ్రీవైశంపాయన, మునిముఖ్యుఁడు దెల్ప విని ప్రమోదాన్వితుఁడై
జనమేజయుఁ డవ్వలికథ, యనఘా వినవలతుఁ దెలుపు మనియడుగుటయున్.

క. ప్రౌఢ్యసితద్రాక్షారస, లేఢ్యసమవచోవిలాస లేఖాచార్యా
రూఢ్యంచిత మేధావిభ, వాఢ్య నవోదారతోత్సవాఢ్యకమనా. 325

మ. రమణీకీర్తితకీర్తిత ప్రహిమతారాకాశరాకాశశాం
కమనోజ్ఞానన జ్ఞానవన్మిథిలాకాంతేంద్ర కాంతేంద్రనీ
లమణీకుంతలకుంతలక్ష్మభటలీలాభవ్యలాభవ్యయ
ప్రమదాపాదన పాదనమ్రనృపశుంభద్రాగభద్రాగమా. 326

ఉత్సాహ. అమృతధామ గిరిశధామ హారసుధామరాశికా
హిమకరా మరతరుసోమహిమకరామజాహ్నవీ
కమలభూమదరలలామకరివిరామ దేవతా
రమణసామజసితతామరస యశోమనోహరా. 327



క. శ్రీరమ్య మగదలాన్వయ, సారసనవహంసయోగ సారసమేతా
త్మారూఢ హంససన్నుత, సారయశోహంస కృష్ణసచివవతంసా. 1

తే. అవధరింపుము జనమేజయక్షితీశ, శేఖరున కిట్టులను వ్యాసశిష్యమౌని
ధారుణీనాథ యవలికథావిధంబు, తెలియఁ జెప్పెద వినుమని తెలుపఁదొణఁగె.

సీ. శ్రీరామచంద్రునిఁ జికరాయపట్టంబు గట్టగా దశరథక్ష్మావిభుండు
సమకట్టి పురమెల్లఁ జాలశృంగారింపఁ బనిచినయట్టి సంభ్రమముఁజూచి
దురితాత్మురాలు మందర సహింపఁగలేక గునుకుఁ బర్వున గూనుగునియ నేగి
యిఁకనేటినిదుర లేవే యని కైకను దొడదట్టి లేపి యోపడఁలి వినవె

తే. రాముఁబట్టముగట్టఁగా రాజుపూనె, భరతుఁ డింకిట రఘుపతిబంటువాఁడు
నీవు కౌసల్యదాసివి నే నిఁకేల, వెలఁది తొత్తుకుఁ బడితొత్తుగలదె యెందు. 3

తే. అటులుగాదేని రాముపట్టాభిషేక, విఘ్న మొనరింపఁగా నొకవింత యుపమ
గలదు తగినది నీకుఁ గావలసెనేని, చెప్పెద నటంచుఁ జెవిలోనఁ జెప్పి పనుప.

క. తలపట్టు బెట్టి కోపపు, టిలుసొచ్చెం గైకదశరథేశుఁడు వచ్చెన్
వలపు దలకెక్కఁ జూచెన్, లలనామణి గుండెజల్లనఁగ నిట్లనియెన్. 5

ఉ. [1]ఎందుకుఁ బల్కవేతరుణి యేమిటి కల్గితి వేమిటారి నా
యంపలి నేర మేమె చెలి యేమియెఱుంగనె కొమ్మ కొండెముల్
విందురె ముద్దుగుమ్మ వెడవింటివజీరున కొప్పకించకే
యిందుముఖి యయోరతుల నేలఁగదే జగదేకసుందరీ. 6

సీ. తరుణినియధరామృతం బొసంగఁగఁ గాదెయవనిలో నాకుదీర్ఘాయు వొదవె
రమణి నీదుముఖాంతరమునగాదె యశేషరాజమండలము గర్వం బడంగె
లలన నీశ్రోణీఫలకజితమై గదే ధరణిచక్రంబు నామఱుఁగుఁ జొచ్చె
లోలాక్షి నీదయాలోకంబునను గాదె ప్రాపించె నాది శంబరజయంబు
తే. నిట్టి నినుఁ బాయజాల నీకేల 'యలుక, యనుచుఁ గైకను దశరథుఁడనునయించి
ముదిసిముప్పునఁదనకేలమోహమనుచు, మరుఁడురతిచేతిలోఁ జెయిసఱచెననఁగ.

క. జనపతి యిటువలె వేఁడుచు, వనితామణి యలుకలేల వలసినవిత్తు
న్ననుఁగోరుమనినఁగేకయ, తనయామణి యిట్టులనియె దశరథుతోడన్. 8

ఉ. భూవర పూర్వదత్తవరము ల్దయచేయుము నేఁడునీకు నేఁ
గావలెనన్న నందొకటఁగట్టుము పట్టము మత్కుమారు నీ
తావిభు నొక్కటన్ వనపదంబున నుంచు చతుర్దశాబ్దము
ల్నావుడు మూర్ఛపోయె నరనాథుఁడు రాముఁడు వచ్చియంతటన్. 9

మ. జననీ భూపతిపల్కఁడే లని వచింపం గైక సీతాధిపా
వినుమా నేనిట నిన్నుఁగాన కనుపన్వేడన్ వరంబిచ్చినం
బనుపం బిల్వఁగబంచి సంశయపడెం బల్కంగ నేమందువో
యని సత్పుత్త్రుఁడవీవు మాటవినవే యంచుం బ్రశంసింపఁగన్. 10

క. అమ్మా యింతేగద కా, నిమ్మని యోతండ్రి యడలనేటికి నీవా
క్యమ్ముఁగయికొంటి నిదిగో వ, నమ్మున కరిగెద నటంచు నయనిధి యంతన్. 11

సీ. కైక యొసంగువల్కలములు దాఁగట్టికట్టనేరక సీత గాంచునపుడు
హారామ ననుఁబాసియడవి కేఁగెదవంచు భూపతి వెలవెల బోవు నపుడు
పట్టి నాకడుపునఁ బుట్టియిట్లైతివే యని తల్లి కౌసల్య యడలునపుడు
శ్రీమించు పట్టాభిషేకసామగ్రికి వలగొని యంజలి సలుపునపుడు

1 ఎందులకల్గితే కలికి యేటికిఁ బల్కవు కుల్కులాఁడి నా.

తే. మది చుఱుక్కనకుండునే మహితధైర్య, శాలి గావున శ్రీరామచంద్రమూర్తి
యందుఁ గనఁబడనీయక మందహాస, కందళితమైన మోము వేడ్కలనె దెలుప.

సీ. మహితనితంబ బింబంబు జాంబూనదమయమహారథవిభ్రమంబుఁజూప
గుత్తంపువలిగబ్బిగుబ్బచన్గవటీవి భద్రకుంభులవిజృంభణము నెఱపఁ
జిల్కతేనియలొల్కఁబల్కెడిపల్కులఁ బ్రద్యుమ్న వాహము ల్బారుదీర
జఘనభారంబున జడియునెన్నడలును రాజహంసకులీనరాజిపాదల

తే. సీత వెనుకొన రాజ్యలక్ష్మియుసు బోలి, తాను దమ్ముఁడు దశరథదత్తయైన
క్షమవహింపక యప్పటి క్షమవహించి, రామచంద్రుఁడు శృంగిబేరమున కరుగ.

మ. కులుకుంగుబ్బలపైఁట జాఱఁ జిగిచెక్కుల్ చెమ్మగిల్లంగ మై
పులకల్మించఁగఁ జెంచుజవ్వనులు సొంపు ల్మీఱ శ్రీరామునిన్
బెళుకుంజూపులఁజూడ సీతయటనీర్ష్యాదృష్టిచే నట్టివా
రలఁజూచుం జిఱునవ్వు మోమునఁదనుం బ్రాణేశుఁ డీక్షింపఁగన్. 14

వ. అంత. 15

తే. శబరిపతిపూజలకు మెచ్చి జడలుపూని, దశరథనృపాలుని మనోరథంబుతోడ
రథము మరలించి యానాగపదగభీర, మైన భాగీరథిఁ దరించి యవలిసరణి. 16

సీ. కమనీయపద్మరాగకిరీటతులితమై పల్లవారుణజటాభరము దనర
హరిచందనపుఁబూఁతహరువునఁగపురంబుబూది నెమ్మెయిపూఁతపొలుపుమిగులఁ
దెలిసొలెజిలుగుదువ్వలువ చెల్వంబున లలితకటీరవల్కలము లలర
మకరకుండలహార మణిముద్రికలుకోటినవరత్నమయభూషణములు గాఁగ

తే. మినుకుదంతంబుపావలు మెట్టి గట్టి, విల్లునమ్ములు చేపట్టి వెంటముద్దుఁ
గులుకునడసీత వినయంబు దెలుపఁదమ్ముఁ, డరుగుదేరఁగ శ్రీరాముఁడరుగునపుడు.

మ. ఎలనాఁగా తలయెత్తిచూడఁగదె వీరెవ్వారు వీరేమిగా
వలెనే యంచని యమ్మలక్క లటఁద్రోవన్ వేఁడనీపైఁడిచా
యలచేమించు నతండు నామఱది యానం చంతటన్ సిగ్గుచేఁ
దలవంచు న్మహికన్య వారలదె యాతం డెవ్వఁడేయంచనన్. 18

సీ. వడిగాఁగ నాలుగైదడుగులు ముందయి వెనుకఁజిక్కితి వేమి యనుచుఁ బిలుచుఁ
దనుజూచుకాఁపుజవ్వనులు ముత్తైపుసొమ్ము ధరియింప రేలని ధవుని వేఁడుఁ
జెలికత్తెవలె లెస్సపలుకుచున్నది మావి నలచిల్కఁబట్టియిమ్మనుచుఁ గొసరు
మనయింట శృంగారవనిగల్గ వనవాసమున కిందు రానేల ననుచు నలయుఁ

తే. జెట్టుజెట్టు గనుంగొను జెలఁగుచెలమఁ
జల్లనీరాను బొదపొద మొల్లవిరుల
చిదుమ రమ్మన్న నిదిగో వచ్చెదపదుండ
యనిసొలయు సీత త్రోవలోఁ జనుచునపుడు. 19

మ. అదె కన్గొంటె విచిత్రకూటము ప్రఫుల్లాంభోజపత్త్రాక్షిపై
కుదురయ్యె న్నెలవంక యీచెలువు నీకుంజూడ నెట్లొప్పె మా
కుఁదగం దెల్పుమటంచు సీత నగుచుం గోరంటగాఁ జంటిప
య్యెదగప్పంగ రఘూద్వహుండుచని యయ్యద్రీంద్రకూటంబునన్. 20

చ. రజనిచరాంతకుండు రఘురాముఁడు వేడుకమీఱ జానకీ
గజగమనాసమేతముగఁగానలఁద్రిమ్మర నచ్చటచ్చటన్
ధ్వజకలశాతపత్త్రసముదంచితతత్పదముద్రఁజూచి త
ద్రజముమహామునీంద్రులు శిరంబునఁదాల్తురుభక్తిమీఱఁగన్. 21

వ. అంతనక్కడ. 22

ఉ. శత్త్రుల రావణాదులను జంపు మటంచును రామచంద్రు నా
పుత్త్రకుఁ బంచితిన్ భయముఁబొందకు మింకిట నంచుఁబూర్వపున్
మిత్త్రుఁడు దేవతాపతికి మేలెఱిఁగింపఁగఁబోయెనోయనన్
ధాత్రినిఁబాసి యద్దశరథక్షితిపాలుఁడు చేరె స్వర్గమున్. 23

ఉ. అంతవసిష్ఠుఁడంపఁగ రయంబునఁజారులుబోయిపిల్చినన్
స్వాంతము సంచలింపఁగను సానుజుఁడై భరతుండు వచ్చి య
త్యంతసువర్ణరత్నమయమయ్యు నొకింతయు దాతగాని శ్రీ
మంతునివీఁడుఁబోలెఁ గళమాసిన యట్టియయోధ్యఁ జూచుచున్. 24

తే. నగరుసొచ్చినయంతలో నిగుడువేడ్క, నెదురుగావచ్చి కైకేయి యిదిగొ నీకుఁ
గాను బంపితి రామలక్ష్మణుల వనికి, జనపతియు నీల్గె ధరణిఁగైకొను మటన్న.

చ. అడవులకేఁగె రాముఁడు సహానుజుఁడై యనుమాట వీనులం
బడభరతుండు మూర్ఛిలి యమాత్యులు దెల్పఁగఁ దేరి కైక నీ
కడుపునఁబుట్టినిందకొడిగట్టితిఁగా యని[1] బాష్పనేత్రుఁడై
యడలి పితృక్రియ ల్సలిపి యంతట రాఘవుఁజేరె వేఁడఁగన్. 26

సీ. నినుఁజూడకుండఁజాలనురార నారామచంద్ర యటంచుఁ గౌసల్యపిలువ
నేరంబు గలదు మన్నింపు మంచును గైక విడక చేతులువట్టి వేఁడుకొనఁగ
వలదన్నయీవె పిల్వఁగను రారాదొకో[2]పుత్ర యటంచు సుమిత్రనుడువ
నిందఱుప్రార్థింప నిదియేటిచలము పోద మటంచు సౌమిత్రి తరువుసేయ

తే. భరతశత్త్రుఘ్ను లిరువురు పాదయుగముఁ
బట్టుకొని రాకవిడుమంచు నెట్టుకొనఁగ
దొరయునగవునఁ దనదు పాదుకలొసంగి
పనిచె రఘుభర్త పురికిదంభరతు భరతు. 27

1 సాశ్రునేత్రుఁడై. 2 మేలేయటంచుసుమిత్ర.

వ. ఇవ్విధంబున. 28

ఉ. పట్టము గట్టుకొమ్మనుచుఁ బల్మఱుఁ బ్రార్థన సేయ రాముఁడే
పట్టున నిచ్చలేక తనపాదుకలిచ్చినఁ దెచ్చి వానికిం
బట్టముగట్టి భూమిపరిపాలన చేసెను గ్రామవాసియై
పుట్టునె యెందునుం భరతుఁబోలినసోదరుఁ డెంచిచూచినన్. 29

మహాస్రగ్ధర. జనియించెన్ గ్రీష్మమంత న్సమధికరవిరుగ్జాలజాజ్వల్యమానా
శ్మనితాంతోద్భూతవహ్ని జ్వలితనికటసంఛిన్న తామ్రుగ్నిదహ్యా
త్తనువీరుద్గుల్మశాఖాతతితరుదర్జ్ఞానోదగ్ధజీర్ణాటవీమ
ధ్యనిషటరీణవేణ్వాత్క రచిబిచిటనిధ్వానణాభ్యన్మృగంబై. 30

తే. అట్టివేళను జిత్రకూటాద్రిడిగ్గి, జానకీలక్ష్మణులతోడ భానుకులుఁడు
శరభకేసరకరటికాసరవరాహ, చటులకాననసీమలజరుగునపుడు. 31

సీ. సురటివిధంబున సరిగపయ్యెదచేల చెఱగు మోమెండకుమఱుఁగుఁజేయు
మెండయ్యె బడలిక మెల్లనె పదఁడంచు దండకుఁజేరికై దండయొసఁగుఁ
గ్రమ్మెఁజెమ్మటలంచుఁ గర్పూరకదళికాదళవీజనమున నందముగవిసరుఁ
జెల్లఁబో యెంతనొచ్చెనొ పాదపద్మంబు లొత్తెదనిలుఁడంచు బత్తిసేయు

తే. సీత తేపటివేళ నాప్రీతిఁజూచి, చెలువ మాకుపచారంబుఁజేసినటులు
నీవుబడలకరమ్ము పొద్దెక్కె ననుచు, రాఘవుఁడువల్కె నవ్వ నారాజవదన. 32

మ. కనుఁగొంటే కలకంఠకంఠి మగసింగం బట్టెపైకొంచు హ
స్తిని నుచ్చైస్స్తన కుంభము ల్నఖముఖశ్రీ వ్రచ్చినం జల్లుజ
ల్లునరాలెం దెలిముత్తియమ్ములన నాలోకింతురే యిట్టికే
ళినిబ్రాణేశ యటంచు జానకి నగుం లీలావినోదంబులన్. 33

సీ. స్తనభార మొక్కింత సరసుకవచ్చెద ననుగబ్బిచనుగుబ్బ లంటునెనరు
ఇదియింత ఘనమాటఁగద మందమయ్యెనునడయంచు శ్రోణిఁగేలిడు బెడంగు
బడలితిదప్పిపుట్టెను దీర్పవేయని కొసరుచుఁ గెమ్మోవి గ్రోలుమమత
యింతదూరమువచ్చి తెంతనొచ్చెనొయంచు వెడవెడఁదొడలఁజై వేయుదుడుకు

తే. మదిగరంగింపగమనశ్రమం బెఱుఁగక, కేవి శృంగార వనులఁ గ్రీడించునటుల
విజనవనభూమి శ్రీరామ విభునిఁగూడి, జానకీకాంత విహరించె సంతసమున. 34

వ. అంత. 35

సీ. మదకలప్రతిమల్ల మల్లసంగరభిల్లభిల్లసన్నుఘభల్లభల్లతతము
పంకజాతవిఫాలఫాలలనాజాలజాలలాలితసాల సాలకులము
ధీరయానగభీరభీరహితోదారదారకపరివార వారణంబు
జ్వలితానలపిచణ్ణచణ్ణచారుశిఖణ్డఖండకుండలికాండకాండకంబు

తే. గండలసమానకుండల కంపమాన, మస్తకాఖణ్డలముఖారిమండలాగ్ర
భండనఖరాదిమానిప్రకాండదండ, కావనంబనఁ దగు దండకావనంబు. 36

క. చొచ్చి చని విశిఖయతికిం, జెచ్చర నటఁ బ్రథమభిక్ష చేసెఁ దివిజుల్
మెచ్చఁగ రఘుపతి క్షితిసుతఁ, గ్రచ్చఱఁగొనిపోవు సాపరాధువిరాధున్. 37

తే. అంత శరభంగమునికి బ్రహ్మపద మొసఁగి, యత్రిసుచరిత్రు సేవించి యతనిపత్ని
యైనయనసూయ యనసూయనంగరాగ, మవనిసుతకీయఁ గైకొనియవలఁజనుచు.

సీ. భామినీకుచవిజృంభణము వీక్షించెనో భద్రకుంభీంద్రముల్బఱవఁదొడఁగె
లేమ నీసన్నపులేఁగౌను గనియెనో కలగిసింగంబులు గట్టులెక్కెఁ
గలికి నీకనుదోయి బెళుకులకళికెనో పదపడిమృగములు పొడలుతూఱెఁ
గాంతనీ నూగారుఁగాంచెనో నీలాహి యిట్టిట్టుబొర్లుచు గుట్టలెక్కె

తే. ననుచులక్ష్మణధనుగుణధ్వనులవలనఁ, దలఁకిపఱువిడువన్యసత్త్వములఁ జూచి
జనకజకు మెప్పుఘటియించు సరసవణితి, రఘువరేణ్యుఁడు దండకారణ్యమునను.

తే. జాతివైరగుణంబొక చైత్యనందె, కాని సత్త్వంబులం దెందుఁగలుగనీక
రహివహించునగస్త్యునాశ్రమముఁజొచ్చి, మౌనిచంద్రునిపాదపద్మములకెఱఁగి.

సీ. అలిగి 'సర్పోభవ' యనినంతనహుషభూధవుఁడు గాఁడే పెద్దత్రాఁచుపాము
నేవచ్చునందాఁకనిట్లుండు మనిపోవ వెఱచియట్లుండదె వింధ్యశిఖరి
యెక్కడ వాతాపి యింకజీర్ణింపవే యనిన జీర్ణింపఁడే యసురభర్త
యాపోశనజలంబుకాఁగాక చతురర్ణవీతోయమనఁగాదె విస్మయముగ

తే. విజయమొందుమటంచు దీవించుమాట, చాలదే మాకు శస్త్రంబులేల ననుచుఁ
గలశసంభవుఁబొగడుచు ఖడ్గతూణ, మఘవధనువులు గైకొని రఘువరుండు. 41

క. అంభోజనయనుఁ డసురా, లంభమునకుఁ బ్రతిన సేసె లక్ష్మణయుతుఁడై
కుంభజవని"సిద్ధస్యా, రంభోనియమార్థ"యను సురల్వీన మఱియున్. 42

సీ. గొనబైన తట్టువున్గునను గోడలువైచి మంచిగందంపుఁ గంబములు నిల్పి
తళుకుటేనుంగుదంతముల దూలము లెత్తి వారాహిదంష్ట్రిలవాసఁబోసి
తీరుగాఁబగడంపుఁదీఁగెపెండె లమర్చిగట్టిగాఁగురువేరు కట్లుగట్టి
బహుచామరంబుల పైకప్పుసవరించి కళుకుపచ్చల గృహాంగణముఁ దీర్చి

తే. పంచవటిలోన సౌమిత్రి యంచితముగఁ, జాలనేరుపుతోఁ బర్ణశాలగట్టి
వాస్తుహోమంబుగావించి వాసుధేయిఁ, బ్రేమతోఁగూడియుండె శ్రీరాముఁడచట.

మ. వనరాశిన్ వటపత్రశాయి వయి ముక్తావర్తింతుపంచుం జెవిన్
వినుటల్గాని కనంగనేరముగదా విన్నట్టులన్ దండకా
వనవాసి స్వటపత్రశాయి వగుచు న్వర్తించు నిన్గంటిమం
చును దత్పంచవటీనివాసు ఘనభాసుం గాంతురాయామునుల్. 44

సీ. అటనొకనాఁడు మోహమున శూర్పణఖ రా నిటునటుద్రిప్పి హాస్యంబుచేసి
శ్రీరఘుపతి సన్నఁజేసినసౌమిత్రి యేమిశూర్పణఖ రావే యటన్నఁ

గటకటా యికనైనఁగరఁగెఁగా మనసంచు నురియుచుఁజేరరాముఁడు వట్టి
యేసీమసరసంబు లివియమ్మ నేఁజెల్లయనిన నీవెఱుఁగవే వనిత యింత

తే. జాణవయ్యును మాసీమసరసమనుచు, మొలకరాచూరిఁ బెదవితో ముక్కుఁ జవిరి
చెవులుఁగూబలతోఁ గోసి చేత నిడిన, నరిగె ముక్కిఁడి యోలక్ష్మణా యటంచు.

తే. అరిగి ఖరదూషణాదిదైత్యాధిపతుల, దర్పబలసంయుతులఁ జతుర్దశసహస్ర
రథికముఖ్యులఁ దెచ్చె సంగ్రామమునకుఁ, దద్బలంబులఁ జెండెఁ[1] గోదండధరుఁడు.

ఉ. ఆహరివంశమౌళి ప్రథమాహుతి చేసె ఖరుం బ్రభాతవే
ళాహవభూమి బాహుజమహానలకీలల దూషణున్ ద్వితీ
యాహుతి చేసె నత్త్రిశిరు నవ్వలియాహుతి చేసెఁ దోడుతో
నాహుతిసర్గదోషపరిహారముగా విధిచోదితక్రియన్. 47

వ. అప్పుడు. 48

సీ. అరవీడుకొప్పుతో నపరంజిచాయచెక్కులదళాలను కమ్మతళుకుతోడ
జాలుపయ్యెంటతో జంటబవికలోన గమకించుగుబ్బజక్కవలతోడ
నడలెడునీవితో జఘనస్థలిని మ్రోయు మొలనూలిచిఱుగంట మ్రోఁతతోడ
గిలుకుమెట్టియలతోఁ గలహంసముల గెల్వనవుజాళువాయందెరవళితోడ

తే. జిలుఁగవుమోముతోడను సిగ్గుతోడ, సొలపుఁజూపులతోడ పైవలపుతోడ
సీత చనుదెంచి కౌఁగిటఁ జేర్చె రాము, ఖరముఖవిరాము వీరశృంగారధాము.

చ. ఖరకరకాండకాండ మెదగాఁడినయప్పుడు పారవశ్యముం
బొరయనిరామభూవిభుఁడు భూమిసుతాకుచఘట్టనంబునం
బరవశుఁడయ్యెఁ జన్గవ నెపంబునఁ గంతుఁడు పద్మకోశపున్
శరములనేసెఁ గాదనినఁ జన్మొనలంటి యురంబునాటునే. 50

తే. శూర్పణఖ యంతఁదననేర్పు శోభిలంగ, రామకర్పూరగంధిని బ్రణుతిసేయఁ
గపటమునఁ దెత్తునని దశకంధరుండు, పంపెమారీచు జానకి బ్రమయఁజేయ.

మ. అలమారీచుఁడు నంతఁగాంచనమృగంబై పర్ణశాలాగ్రత
స్థలినానావిధచేష్టలన్ మెలఁగ గోత్రాపుత్త్రికాలోచనం
బులకుంగల్గెను నుత్తమంబయిన సమ్మోదంబు చిత్రంబె యీ
యిలలో నేరిసరూపదర్శనముచే నింపొంద వీక్షింపమే. 52

శా. స్త్రీచాపల్యముచేతఁ దెమ్మనియెఁ బో సీతాలతాతన్వి తా
నేచందంబున లేడివెంబడిని బోయెన్ రామచంద్రుం డహో
తూచా జానకివాణి తప్పఁడుగదా దూరంబె తెంగెన్ బళీ
యాచోఁ బోవలదంచుఁ దెల్పెననుజుం డైనన్ సుధీశాలిగా. 53

---

1 మార్తాండకులుఁడు.

తే. అధిపుఁ డీరీతిలేడివెన్నాడి పోయి, సీతకన్నులముందఱచెలువుఁగులుకు
నంతమద మేమిటికి దీని కన్నభంగి, శరము వైచె మృగంబు లక్ష్యంబు సేసి. 54

సీ. శ్రీరామశరమున క్షితిఁగూలు దైత్యుఁడు హాసీత హాలక్ష్మణా యటంచు
వ్రాలిన యాయార్తరావంబు చెవిసోఁక క్షితిసుత బెదరి మూర్ఛిల్లి తెలిసి
యేమిసేయుదు మింక నెందుఁబోయెను నాథుఁ డట్లయ్యె నాదువాక్యంబు వినక
మొదట నేఁదెలిపితి మునులతోడఁ బ్రతిజ్ఞగావించునపుడె రాక్షసులతోడ

తే. వలదు వైరంబటంచు నీవలనవచ్చె, దానవిని ముక్కుగోసిన దాన నలిగి
ఖరుఁడు వచ్చినఁద్రుంచెరాఘవుఁడు నేఁడు, రక్కసులఁగూడిసూడుమరల్పఁబోలు.

క. ఈయెడఁదామసమేటికి, నీయన్నను జూచిరమ్ము నీవనిలోనిం
గాయమ్ములఁబడినాఁడే, మో యనవుడు లక్ష్మణుండు ముగుదకు ననియెన్. 56

చ. ఎఱుఁగవె యన్యదుర్దమగిరీశశరాసనఖండఖండనం
బెఱుఁగవె రాజలోకభయహేతుభృగూద్వహమానమర్దనం
బెఱుఁగవె నిన్నుఁగాంచిన సమిద్ధఖరాదిజయంబు లెల్లనీ
వెఱిఁగియు నిట్టులెంచఁదగవా తెగవేయఁడె రాముఁ డాయరిన్. 57

చ. దనుజుఁడు నేఁడు నిన్నిట వెతం బొగిలింపఁగఁ గూనెఁగానియ
మ్మనుకులుఁ డట్లుచీరఁ డసమాన బలాఢ్యుఁడుగాడె యంచునన్
జనకజ యేటిమాట చిననైఁపదురాఘవునాద మానుజ
య్యనఁజనుమన్నఁబోవక నయక్రియఁదెల్పినఁగోపగించుచున్. 58

ఉ. వంచనచేసెదే తగినవాఁడని రాముఁడు నమ్మి యీడ ని
న్నుంచి చనంగఁ గామునునియోజన చేసెద విట్టులైన నా
సించునె యీశరీర మింకసీత యటంచును దాళలేక చే
లాంచలమూఁదినేత్రముల హారఘువీర యటంచుఁ జింతులున్. 59

ఉ. కలకన్ లక్ష్మణుఁ డింతయేల జననీ కాఁగానిదోసాన నీ
పలుకుల్పల్కకు మమ్మ కంటఁ దడినింప న్నీతి గాదమ్మ నా
పలుకు ల్నమ్మఁగదమ్మ యిప్పుడిదె నీప్రాణేశుఁ డేతెంచుఁ బో
వలెనన్న న్వడిఁబోయివచ్చెద ధృతిన్వర్తిల్లు మబ్జాననా. 60

క. అని యంపించుక చనుచుం, జనఁగాల్గాడక మహీజజాలములో ని
ల్చిననటకుం జనిపొంచెదె, చనవా యని సీతపలుకఁజనెనతఁ డంతన్. 61

చ. అతనుగదార్తుఁడౌట దశలారును మూఁడును జెంది యంతనే
గతిగడలేక యాతురము గైకొనురీతి యతీంద్రవేషుఁడై
గతిగలుగన్ స్మరించు గతిఁగంజదళాక్షు హరేనృసింహ యం
చతికపటంబుమీఱఁగ దశాస్యుఁడు జానకిఁజేరి యిట్లనున్. 62

సీ. ఘననీలవేణి నీకచపాళిమత్తాళి పక్షంబునకు నైల్యభిక్ష యొసఁగు
ముకురాస్య నీముద్దుమొగము రాకాచంద్రబింబంబునకుఁ గాంతిభిక్ష యొసఁగుఁ
గమలాక్షి నీవాలుఁగనుదోయి వలకారి జేడిసలకు లౌల్యభిక్ష యొసగుఁ
గుంభవక్షోజ నీకుచములు కనకకుంభికలకు శృంగారభిక్ష యొసఁగు
తే. రామ యటుగాన నీయధరామృతంబు, భిక్ష యొసఁగవె తృషితుండఁ బ్రేమననిన
బెదరి శ్రీరాముఁడే శరభిక్ష యొసగుఁ, దాళుమని సీత శాలికాంతరముఁ జేరి.

ఉ. అమ్మకచెల్ల యెవ్వఁడో నిశాటుఁడు భిక్షుక వేషమూని మో
హమ్మున వచ్చెఁగాదన సమర్థులు లేరిట నేమిసేయుదుం
చమ్మహికన్య చింతిల దశాననవింశతిబాహుకండఘో
రమ్మగుమూర్తిఁజూపి యలరావణుఁడంతట హుంకరించుచున్. 64

చ. పరవశ భూసుతన్ రథముపై నిడి లంకకుఁబోవువేళ న
య్యరదము పెక్కుఁబున రయంబున నొక్కట గ్రద్ధ్రాలి యా
సురపతిమూర్ధముం బొడుచు స్రుక్కక దానివధించెఁగాని లో
నరయఁ డొకింత దుశ్శకునమాట దశాననుఁ డెంతమూఢుఁడో. 65

క. ధరణిజను దెచ్చి లంకా, పురవనమున నిలుపఁ దనుజపుంగవసామ్రా
జ్యరమాపతి తాఁ దొలఁగెం, బరసతిగోరఁగ నసూయపడియెనో యనఁగన్. 66

తే. మరలి రాముఁడు త్రోవ లక్ష్మణునిఁ గాంచి, తమ్ముఁడా యేలవచ్చితి తప్పెఁగార్య
మనుచు వేగ నిజోటజంబునకు వచ్చి, సీతఁగానకయలసి మూర్ఛిల్లి తెలసి. 67

శా. ఏరాతమ్ముఁడ పర్ణశాల తెరువేది తాళవే చూపుమా
యోరామా యిదె గాదె సీత నెలవేదో తెల్పు మీశాలమై
తేరామామణియేది కాన మదె యెందేగెం గనంజాడు శాం
తారశ్రేణుల లేదు హాధరణిజా తా సీత యెందేగితే. 68

మ. అవురా లక్ష్మణ యెందుఁబోయితిమి యన్నా వేటకై కాదె యే
ల విదేహాత్మజవేడ నిమ్ము మృగ మేలాగిత్తు నేదేవిఁగా
నవనిన్ హాజనకక్షమారమణకన్యం గానవే సీతఁగా
నవె యంచు న్విలపించు రాఘవుఁడు నానాదీనవాక్యంబులన్. 69

మ. కటిభూమండలము న్వలగ్నతలనాకంబున్ లసన్నాభివి
స్ఫుటపాతాళబిలంబు చేకుజగంబుల్మూఁడుమున్నేలుచు
న్నటులందోఁచె మహేంద్రభోగముఁదృణప్రాయంబుగానెంచి తి
ప్పటికిందోఁచెఁ బ్రవాసదుఃఖము నినుం బాయంగ నోయంగనా. 70

సీ. వెలఁది నీకుచపాళి విహరించు నప్పుడు కృతకమహీధరక్రీడ మఱతు
పొలఁతి నీపొక్కిలి పుణికెడువేళల కేళీసరోవరక్రీడ మఱతు

నెలఁత నీనూగారు నిమిరెడు వేళలఁ గేళీవనాంతరక్రీడ మఱతు
సకియ నీకెమ్మోవి చవిచూచువేళల మధురోపహారసామగ్రి మఱతు
తే. కౌఁగిలింపఁగ రాజ్యభోగంబు మఱతు, మఱతు సకలంబు నినుఁ గూడి మలయువేళ
నట్టి నిన్నును నెడఁబాపెన దయువృత్తి, దైవ మిఁక నేమి సేయుదు తరళనయన. 71
సీ. ఇది పంచవటి యంచు నిపు డెఱింగితిఁ గాని మును భూతలస్వర్గ మనుచునుంటి
నిది ఘోరవన మంచు నిపు డెఱింగితిఁ గాని మును కేళికారామ మనుచునుంటి
నిది కొండదరి యంచు నిపు డెఱింగితిఁ గాని మును కేళికాసార మనుచునుంటి
నిది పర్ణశాలయం చిపు డెఱింగితిఁ గాని మును కేళికాగార మనుచునుంటి
తే. నిది వనావాస మని తోఁచె నిపుడు గాని, మును వనవిహార మని యుంటి మోదమలర
నిది తపశ్చర్య గాఁ దోఁచె నిపుడు గాని, మును కృతార్థుఁడనై యుంటి వనజనయన.
సీ. తెలినవ్వు మొగమునఁ దిలకంబు దీర్తుగా యిఁక నెందుఁ దీర్తునే యిందువదన
వలిగుబ్బచన్నుల నెలవంక లుంతుగా యిఁక నెందు నుంతునే హేమగాత్రి
పెన్నెరికొప్పునఁ గ్రొన్ననల్ సేర్తుగా యిఁక నెందుఁ జేర్తునే యేణనయన
చిక్కిలి లేఁజెక్కులమకరికల్ వ్రాతుఁగా యిఁక నెందు వ్రాతునే యిగురుఁబోణి
తే. జలరుహాము పువ్వుగుత్తులు షట్పదాళి, లవళిదళములఁ జూపి తోయవిసహింప
కన్యవనితాంగతులితంబు లౌటఁ దావ, కాంగసమములు గామి నోహంసయాన.
సీ. పటుసింహగర్జల భయముఁ జెందని నన్నుఁ బికనాదములు భయపెట్టదొణఁగె
సుడిగాడ్పులకు మున్ను జడియకుండెడి నన్ను లేఁదెమ్మెరలు సంచలింపఁజేసె
దవవహ్నికీలలఁ దాపమొందని నన్ను మించువెన్నెల దపియింపసాగె
ఖరయుద్ధమునను భంగమ్ము గాంచని నన్ను భంగంబు నొందించె నంగజుండు
తే. అకట నీనిని సైరింప నలవిగాన, గలదె నినుఁ బాసిన నుద్ధణాగ్రంబునైనఁ
గదలఁగా వించుత్రాణ నాకలిమి బలిమి, జీవదేహంబులును నీవె గావె సీత. 74
సీ. చల్లనిదరహాసచంద్రిక లైవ్వఁ జల్లజాబిల్లి వేఁడిమి చల్లఁజేసి
పలుకులఁ గపురంపుపల్కు లొల్కఁగఁ బల్కి కలకంఠకటువచఃకలన మాటి
తనుసౌరభంబున దక్షిణానిలమునఁ గలవిషస్పర్శంబు దొలఁగఁ జేసి
భ్రూవిలాసంబులఁ బుష్పకోదండకోదండ దండము ఖండితంబుఁ జేసి
తే. నన్నుఁ బోషించితివి కాననంబులోన, నీ విపుడు లేమి నివి యెల్ల నిజముఁ బూనె
కాకయుండినఁ గలదె యేకంబునందు, రెండుగుణములు[1] నవపుండరీకనయన. 75
సీ. అని విలపించుచు నందందజానకి వెదకుచు నఁట గృధ్రవిభునిఁ గాంచి
సంస్కార మొనరించి చనుచోఁ గబంధుని బాహులు ఖండించి ప్రకటభక్తి
శబరి యొసంగు పూజనములు గైకొని పంపాసరోవరప్రాంతములను
హనుమంతుతో మాటలాడి తన్మంత్రంబు వలన సుగ్రీవుతోఁ జెలిమి చేసి

1 సమదవేదండగమన.

తే. యడుగుఁబొటవ్రేల దుందుభి యొడలు మీఁటి
సప్తసాలంబు లొక్క యస్త్రమునఁగూల్చి
వాలిఁ బడనేసి కపిరాజ్య మేలుటకును
గరుణ సుగ్రీవుఁ బట్టంబుగట్టియంత. 76

సీ. రవికర్కటముఁజేరరాజసింహము రాముఁ డటమాల్యవద్గిరి కటకమునను
మీనకేతనధనుర్జ్యానాదపరిముక్తవృషభకేతనభీమవిశిఖమేష
యానకీలలనతులాధిచే జనకకన్యాళివేణీసమాయత్తచిత్త
వృత్తినుండంగ సుగ్రీవుండు తారారుమామత్తకరికుంభమహితకుచల
తే. మమతతోఁగూడి మరకతమందిరములఁ, గల్పకారామతులితశృంగారవనుల
స్వర్ణసౌధంబులను గేళిసదనములను, వేడుకలుగాంచె మిథునసంక్రీడనముల.

వ. అంత. 78

తే. గ్రీష్మభీష్మశిఖండినర్తితశిఖండి, కాననహుతాశిఖండిమేఘప్రతాన
కల్పితవిధాన చిత్రశిఖండియునయి, లక్షితంబయ్యె వానకాలంబు క్షితిని. 79

సీ. నృపవరాస్థానమండపసరోవరము హాసంతికాహల్లకోజ్జ్వలితమయ్యె
మంత్రీంద్రశిబికారిమావధూటిమధూర్ధ్వపరికల్పితనిచోళపటముఁబూనెఁ
జరమానవభుజాభుజంగంబు కేతకీదళకలితాతపత్రఫణమయ్యె
విరహిణీచిత్తంబు విరహితాశ్రయకాననాశ్రితాళికి నాశ్రయత్వమొందె
తే. విపణికమలాక్షియాపణవీక్షణముల
దడికేఁగనుతెప్ప వాల్చె మోదమునఁ బొదలి
గేహమూకాస్యగోగణక్రియను గోగ
ణంబువసియించె నాసమయంబునందు. 80

మ. గొనబుంగింటెపుజంటగొంగడి ముసుంగుల్వెట్టి సంకేతతా
వనికిం గొంచెపుఁజిన్కులోపలనుబోవన్ వీథిలోనం దళు
క్కన నక్కాలమునందుఁగ్రొమ్మెఱుఁగుడాయందమ్ముఖాంభోజముల్
గనియుం గానరు జారలం దలవరుల్గాఢాంధకారాంధులై. 81

ఉ. ఈమెయిఁగ్రొమ్మెఱుంగులు పయింబయి మించుపయోధరంబులున్
వేమఱుగట్టివాన కడువేగమె వచ్చునటంచు నెంచి తే
నీమదికింపుగా దిచట నిల్వుమటంచును బల్కెఁబాంథుసిం
గోమలి యోర్తు తోడియలికుంతలనున్ మరుపెట్టినేర్పునన్. 82

చ. వడిఁకెద వేటికే తడిసివచ్చితి వల్లభ వానలోపలం
దడిసివడంకలేదు గృహనాయకు వంచన సేయ నింతగాఁ
దడిసితిఁ గావునన్ వడకెదన్ మఱియేగతినీకుఁ దోఁచునో
యెడఁదనటన్న మెచ్చుకొని యిత్వరిఁగూడె భుజంగుఁడత్తఱిన్. 83

సీ. అమరేంద్రముక్తమేఘములఁ దెచ్చుక్రమంబు రవణించ మించు వాయువులు విసరె
మబ్బుచేతను వారి మరలింప వరుణుండు ధనువుఁబూనఁగ నింద్రధనువుఁదోఁచెఁ
దననైల్యమున దండితను కాంతి దండింపఁ గదలెనాఁగ వలాహకములు నడచె
నానటన్నీలకంఠజటాచ్ఛటలు నాఁగఁ దోలు కాలు మెఱుఁగులు తులకరించె
తే. జలదకరిశంక గర్జించు సమయసింహ, గర్జనగర్జితము లొప్పె గగనకరటి
సాంద్రమదధార లనఁగ వర్షంబు గురిసె, వనధిఁ బైకొనెఁ బౌరుషమునకు నదులు.

శా. తేతేలక్ష్మణ విల్లునమ్ములును దే తే తామసం బేటికిం
దై తేయుం డదె పోయెఁ బోయె మనసీతం గొంచు నంచున్నిజ
భ్రాతన్ వేఁడుచుఁ దత్తఱించె రఘువీరస్వామి యుద్ధామజీ
మూతశ్రేణి తళుక్కునన్ మెఱసి సొంపుల్లుల్క విభ్రాంతుఁడై. 85

మ. మనపై మూఁకలు గూడివచ్చె దితిజన్మస్తోమము ల్గంటె భ
ర్జనలుం జూప విజృంభణంబు జయనిస్సాణధ్వను ల్లక్ష్మణా
యనినన్ రాముని జూచి లక్ష్మణుఁడు గాదయ్యా విలోకింపుమా
ఘనము ల్గర్జన లింద్రచాపమును నిర్ఘాతధ్వనుల్ రాఘవా. 86

మ. అదె గర్జించుచుఁ జిత్రపర్ణసుమబాణాసంబు భాసిల్లఁగా
మదనుం డేసె శరప్రకాండములఁ దెమ్మావిల్లు వీనిన్ హరిం
చెదనన్నన్ రఘురామ క్రొమ్మెఱుఁగులువచ్చెం గాని మారుండుగా
డదియింద్రాయుధ మింతె పువ్వువిలు గాదన్ లక్ష్మణుం డయ్యెడన్. 87

సీ. ఘనగర్జవిని యుల్కి ననుఁ గౌఁగిలించిన వెఱవకుమనినచోఁ బింతసొలపు
జడి సెనీనడలకు వెడవెడ రాయంచ లనినచో నను మెచ్చుకొనెడు ప్రేమఁ
గొప్పున మొగలిఱేకులు సెక్కి మెఱుఁగుతో మొగిలిదె యనినచో నగు బెడంగు
నెమ్మినీనెఱివేణి నీలాహి యని గ్రసించఁగఁ జేరెననినచో జళుకుఁజూపు
తే. మఱువరాదిఁక మున్నిటిమమత లివిగొ, చెల్ల యిప్పటి కిటువలెఁ జేసె దైవ
మిట్టిదుర్దినముల సీత యేమియయ్యె, నొక్కొ తమ్ముఁడ యెటువలె నోర్చువాఁడ.

మ. అని చింతిల్లఁగఁ లక్ష్మణుం డనియె నన్నా కంటివే మేఘముం
దనసర్వస్వంబుల నెల్ల ధాత్రికిడి యంతన్ వంతచే వెల్లనై
ధనదాశం జనెఁ దొల్లి యెల్లెడల గోత్రం దట్టమా కీర్తియుం
జనెఁ దాత్కాలికదాత కెయ్యెడల శశ్వత్కీర్తి సంధిల్లునే. 89

సీ. క్రశిమానరావణ రాజ్యలక్ష్మియుఁబోలె నెంచెందునిమ్నగ లింకఁబాఱు
"విజయస్వ" యనుచు దీవింపఁగా నేతెంచు కైవడిఁదోఁచె నగస్త్యమౌని
భవదీయకీర్తి సంపదఁబోలి యెల్లెడ నుల్లసిల్లెను తెల్లు వెల్లువెఱఁగి
తానును హంససంతతిగాన సాహాయ్య మడరించుబలె నంచలరుగుదెంచె

తే. నాశరస్ఫూర్తి నారీతి నతిశయిల్లు, నింక నీదుశరస్ఫూర్తి హెచ్చఁజేయ
కేలఁ గురియించె దీవస్రగ్వృష్టి వైరి, బలములఁ దదీయవనితలఁ గలుగఁజేయు. 90

మ. అని సౌమిత్రి తదాజ్ఞఁ దోడుకొని రాఁ నంభోజినీబంధునం
దనుఁ డేతెంచె వలీముఖప్రముఖనానాసింహనాదార్భటీ
జనితప్రత్యురుశబ్దసూచిత భవిష్యద్దక్షిణాంభోధిబం
ధనవేళోద్ధరణక్రియాకులసమస్తక్ష్మాధరాక్రోశుఁ డై. 91

క. ఏతెంచి నాల్గుదిక్కుల, సీతాసతి వెదకఁ బ్లవగసేనఁ బనుపుచో
సీతాపతి హనుమంతుని, చేతికి ముద్రిక యొసంగి శీఘ్రం బనుపన్. 92

మ. అతఁ డుప్పొంగుచు నంగదాదికపిసారంగాచ్ఛభల్లేంద్రసం
గతుఁడై దక్షిణదిక్కునం జనుచు రంగత్పక్షసంపాతసం
వృతసంపాతిఖగోక్తమార్గమున నుర్వీకన్యకాలోకనో
ద్ధతుఁడై యెక్కె మహేంద్రశైలము మరున్మార్గస్పృహాత్సాలమున్. 93

సీ. నిలిచి యంఘ్రులఁ దన్ని నిగుడుచో గిరి ఘటోద్భవపదన్యాసవింధ్యాద్రిఁ బోల
గట్టినాళపుటుంటపిట్టకై వడి యురోఘట్టన తెక్కలగట్టుగూల
సురసార్థకృతమహత్త్వసూక్ష్మతరరూపములను హారిత్వంబు విలసితముఁగ
నంజనాసంతతి యందు సింహికనొంచు టనినిలింపులగుంపు లభినుతింప
తే. రాముచే దైత్యుఁ డీల్గు కార్యంబు దెత్తు, విశ్వసింపుడు నామాట వేల్పులార
యనుచు బాడబలంఘనమాచరించు, పగిదినౌర్వాంబునిధిదాఁటెఁ బవనసుతుఁడు.

ఉ. ఏపున నాసువేలగిరి యెక్కి యట న్నతయోజనోన్నతం
బై పదియాఱువన్నెఁ జెలువైన త్రికూటము మీఁద సింహల
ద్వీపమునన్ బలారిముఖదేవభయంకరదీప్తి నొప్పు లం
కాపురరాజ్యలక్ష్మి తటకావడి చూచుచునున్న నత్తఱిన్. 95

మ. రవి యస్తంగతుఁ డైన సూక్ష్మతనుఁడై రక్షోధిరాట్పట్టణం
బవలీలం జొరఁబాఱి పఙ్క్తిముఖ ముఖ్యానేకనాకద్విష
ద్భవనశ్రేణుల నెల్లెడన్ వెదకి సీతం గానఁగాలేక శో
కవనిం బావని గాంచెఁ బావని మహీకన్యం బ్రహృష్టాత్ముఁ డై. 96

క. కనుఁగొని లెస్సగ గుఱుతులు, కనుఁగొని యటవచ్చి పఙ్క్తికంధరుఁ డనిపో
యినమాటలు విని నమ్మిన, జనకసుతం జేరి మ్రొక్కి సవినయుఁ డగుచున్. 97

తే. తల్లి జానకి నీప్రాణవల్లభుండు, శ్రీరఘూద్వహుఁ డనుజసుగ్రీవముఖ్య
యోధతతితోడ సుఖమున నున్నవాఁడ, టంచు శ్రీరాము నంగుళీయక మొసంగె.

క. కైకొని కన్నుల నొత్తుచు, హాకాంత రఘూద్వహా యటంచును బ్రణయ
వ్యాకులితచిత్తయై క్షో, ణీకన్యక యిట్టులనియె నివ్వెఱతోడన్. 99

శా. అన్నా యేగతి దాఁటివచ్చితివి నీవంభోధి సేమంబుతో
నున్నారా రఘురామలక్ష్మణులు లంకోద్యానమద్యాసముల్
విన్నారా దశకంఠరాధము రణోర్విం గూల్చుకార్యంబుదాఁ
గన్నారా వినిపింపు నీకుశుభమౌఁగాకంచుఁ దన్వేఁడినన్. 100

మ. తనవృత్తంబును రామలక్ష్మణుల యందంబు స్వావస్వాత్మకామా
రునిసఖ్యంబును దెల్పి భీమతరమౌ రూపంబునుం జూపి సీ
తను నమ్మించి[1] శిరోమణిం బడసి యోతల్లీ ముదంబుండుమీ
యనఘుల్ రాముని దెత్తునేనని తదీయాజ్ఞాను సారంబునన్. 101

తే. వెడలి యవ్వనిలోపల వృక్షవితతి, విఱిచి కుప్పలు వేసె నవ్వీరవరుఁడు
లంకభస్మంబుసేయువేళకును గాష్ఠ, జాలమును గూడవేసిన చందమొంద. 102

తే. అంత వనపాలపంచసేనాధినాథ, సప్తమంత్రి సుతాక్షశిక్షాప్రవీణుఁ
డైన హనుమంతు నింద్రజిత్తును నెదిర్చి, బ్రహ్మశరపాశమునఁగట్టి పట్టితెచ్చి.

తే. తండ్రిముందఱఁబెట్టి యోదానవేంద్ర, కోఁతిఁదెచ్చితి నన్నఁబోయి కోఁతిదెచ్చి
నాఁడననపుడుముక్కులునలఁచుకొనిరి, కొలువువారెల్లనపుడుపక్కునను నగుచు.

క. కరువలిసుతుఁ డిట్లనియెం, గోఁతి నగుదునీపలాశకులము దహింపన్
సురవైరి సత్యవాణిని, సరస్వతి యనంగ వినమె సత్యంబనుచున్. 105

ఉ. శ్రీరఘువీరచంద్రునకు సీత నొసంగి యభంగవైభవో
దారుఁడవై చెలంగుము దశానన యంచును బుద్ధిచెప్పినన్
మారుతితోఁకచూఁడుమనె మండుచు రావణుఁ డౌర సమ్మతిం
జేరి మదాంధచిత్తునకుఁ జెప్పఁగఁ బోయిన హానివచ్చుఁగా. 106

ఉ. శ్రీజనకేంద్రనందనకుఁ జిత్తమురంజిలఁ గంజరాగవి
భ్రాజితకీలకాభినవపంకజపూజ లొనర్చి కేళికా
రాజితవాలకీలి నలరావణు లంకఁదగుల్పఁజేసె నీ
రాజనమెంత భక్తుఁడవురా హనుమంతుఁడు క్షోణిపుత్రికిన్. 107

మ. దనుజాధీశపురంబుఁగాల్చి మహిజాతంగాంచి వాలాగ్నివా
ర్ధినిజల్లార్చి కపీంద్రులం గలసి యెంతేవేగ నేతెంచి నేఁ
గనుఁగొంటిన్ రఘువీర జానకిని లంకాపట్టణాభ్యంతరం
బున నంచున్ హనుమంతుఁ డిచ్చె ధరణీపుత్రీశిరోరత్నమున్. 108

క. ఇచ్చినఁ గైకొని మారుతి, మెచ్చినఁ గౌఁగిటను గ్రుచ్చి మిహిరకులీనుం
డచ్చెరువగుబలములతో, వచ్చెన్వారాశితీరవనిఁ జేరంగన్. 109

క. శరణాగతు దశకంధర, శరణాగతుఁ డనక యనఘసద్గుణమణిసం
భరణు విభీషణుఁగరుణా, భరణుం జేపట్టె రామభద్రుఁడు ప్రేమన్. 110

1 శిరోమణిం గొని ప్రమోదం బందుమీతల్లియ త్వనఘుల్.

ఉ. కట్టఁడు వారివాశి లయకాలధురంధరుఁ బ్జ్కంధరుం
గొట్టఁ డదెంతనమ్మెనొ యకుంఠితనైజభుజాబలంబు చే
పట్టుగ నవ్విభీషణు నపారకృపారస మూర రలంకకుం
బట్టముఁగట్టె రామజనపాలశిఖామణి రాజమాత్రుఁడే. 111

ఉ. అంత విభీషణోక్తగతి నంబుధిచెంత దినత్రయంబు తా
నెంతయు భక్తి దర్భశయిలయించి నిరాహృతియై ధరాసుతా
కాంతుఁడు ప్రోవ యిమ్మని యకంపితచిత్తముతోడ వేఁడ నం
తంతకు నుబ్బువార్ధిఁ గని యారఘువీరుఁ డుదగ్రకోపుఁడై. 112

సీ. కుంభకర్ణస్ఫూర్తి కొమరొంద నందంద జలకుంభడింభము ల్పందడింప
మేఘనాదనిరూఢి మీఱుచు నుల్లోలకల్లోలజాలము ల్గడలుకొనఁగ
నతికాయవిభ్రమం బతిశయిల్లఁగఁదిమింగిలగిలాదివిసారకులము పొదలఁ
బటుమహోదరమహాపార్శ్వవైఖరి వారిచరజంతుసంతతు ల్చకళింపఁ

తే. బ్రతిఘటించిన రావణుబలముఁబోలి, యెదుటఁగనుపట్టఁగంటివె యీపయోధిఁ
దెమ్ములక్ష్మణ చాపంబుఁదీవ్రవేగ, రూపరోషంబులను వార్ధి రూపడంతు. 113

వ. అని హంసడోలికాయమానకల్లోలపాలికాశాలిశాలికావాలరింభోళికా సము త్పతజ్జలకణమాలికాకల్పిత గగనకేళికాలోల మరుద్బాలికాచూలికాపాలికా నవమాలికాజాలక దుర్నివారం బగుపారావారంబు నిరీక్షించి పునఃపునః ప్రవర్ధమానరోషంబున జటాపటలి కన్నముందుగ ముడిగొను కుటిలభ్రూకుటి యును దూణీరాంబకంబులకన్న ముందుగ గొప్పలగు నిప్పులకుప్పల వెదచల్లు విశాలాంబకంబులును దటినీవిటహృత్స్ఫుటంబుకన్న ముందుగఁ గటతటనదరు కటతటంబులును దుర్వారమార్వినినాదంబుకన్న ముందుగఁ బర్వురథసంఘర్షక టుతరకిటకిటధ్వనులు వెలయ నిజసహోదరకరోదరకలిత కాకోదరతులితశరశ రాసనంబు సెలసి పుచ్చుకొని భవిష్యజ్జలధిశిరోనమనసూచకంబుగాఁగార్ముకం బువంచి యప్పు మరలించు మరలించు మని పొగడదండ వేయుక్రమంబునఁ గోదండంబున నారిసారించి లంకాంతరీపదనుజగార్భిణ్యగర్భనివారణావారణ మన్త్రాయమానంబుగ గుణధ్వానంబు చేసి యిటువలె శరధిశరంబులు రిత్తసే యుదు ననువలెఁజటులతరమాంసలాంసరుచిరశరధిశరంబు లొక్కపరితి విచి వైచిన నంతకంతకు నుప్పొంగుశరధిశరంబులంబోలి నిజశరధిశరంబు లక్షయం బుగాఁ దొడిగి యేయుచుండ నప్పుడు ధారాశుద్ధివెలయ వారాశినీరంబునకు లంఘించు కాండప్రకాండంబులును జలధిరాజన్యుండు వదాన్యుండని జలకరి కరభంబుల వేఁడుకొన నిగుడు మార్గణగణంబులును జలకన్యకాముఖాంభోజం బులవ్రాలు శిలీముఖంబులును మకరప్రాణసమీరణపారణంబు సేయుమహాజిహ్మ గంబులును వనాంతరంబుల నెల్లెడం జొచ్చి వర్తించు పృషత్కంబులును పొదఁ

జొరవంజొచ్చి చనువిశిఖంబులును జలపాయి తోదయంబుల వారించునాశుగంబులను మణిమాంసాపేక్ష ఫణిఫణంబులందును వరుకంకపత్త్రసముదాయంబునుం గలిగి ప్రళయాంతసప్రకటీభవదేకభావసకలాకూపారవారిశోషణప్రణవద్వాదశద్వాదశాత్మాదారుణకిరణ శ్రేణికాధురీణంబులై రామబాణంబులు దీర్ఘనిర్ఘాతసదృశలింగంబులగు విస్ఫులింగంబులు చెదర వారాశిం జొరఁబాఱిన రఘువీరశరఘాతఘూతదంభోళిపాతభీతపలాయమానంబు లగుచుశతశఃకణశఃఛిన్నభిన్నంబులగు నంగంబులును రఘునాయకుసాయకంబు లేచాయనిగుడునోయని నిర్నిమేషంబునఁగనుంగొనుచుండియు ఖండఖండంబులగు సగండకసముద్దండపాఠీనమండలంబులును దలలు దాఁచుకొనియురుం దప్పలేక తెప్పలుగాఁగూలు కమఠకర్కటంబులునుముడిగొనునడుగుల నెడనెడంబడబడుచుఁజుట్టలు చుట్టుకొని బిట్టొరలుభుజంగంబులును నారాచంబులు నాసారంధ్రంబులందూఁటి శిరంబుల కెక్కినంగ్రక్కతిలి తుండంబులుద్రిప్పుచు ఘీంకృతులు గుప్పుచుఁగుప్పదెప్పలంగూలు జలకరిఘటలునుం గలిగి రత్నాకరంబు హల్లకల్లోలమైయుండె మఱియును. 114

సీ. జలనీలికాశిరోజశ్రేణి బెదరించి చంకనత్పంకజాస్యంబు దూఱి
కలితముక్తాహారదావళినుగ్గు గావించి ప్రకటప్రవాళాధరంబుచించి
శంఖకంధరనాటి శైలశృంగాంసములగలించిభుజగబాహాలుదళించి
కమఠవక్షఃస్థలిగాఁడిభ్రమీనాభి యవియించి కరికరోరువులు చీల్చి

తే. మనుకులశరంబు లాపాదమస్తకంబు, ముంచిభువనైకమోహనమూర్తిఁగలఁప
హతమహాసత్త్వమయ్యె నుబ్బడగదయ్యె,నమృతనిధిగానఁ బ్రాణభయంబులేదొ.

ఉ. ఇటు లుప్పొంగ నభంగభంగజలధిన్ వీక్షించి రూక్షేక్షణా
స్ఫుటదంభోజభవాండుఁడౌచు ఖరరక్షోహర్త బ్రహ్మాస్త్రమున్
ఘటియించెం దనవింట వింటఁగలమూఁ కల్వఁ గెనూఁగెన్ సము
త్కటశైలంబులు వేఁగె మూఁడుజగముల్గ్రాఁగె న్నిధిస్వాంతమున్. 116

తే. చకితుఁడై యంత గంగాదిసతులతోడ, నబ్ధి యేతెంచి రత్నోపహార మొసఁగి
జానకీజానిపాదాంబుజాతయుగళి, కవని సాష్టాంగ మెఱఁగియిట్లని నుతించె. 117

సీ. శ్రీజానకీమనోరాజీవసారంగ రంగదభంగశౌర్యప్రచండ
చండకరాన్వయజలధిపూర్ణశశాంక శంకరధనురహీశ్వరసుపర్ణ
పర్ణమూలాశితాపసమానసవిహార హారాదిభూషణోదారవత్స
వత్సలతాగుప్తపవనజాతతనుజాతఁజాతరూపాంబరద్యోతమాన

తే. మానవాశనగర్వశిక్షానిదాన, దానజలవాహినీపూర్ణతమనదీన
దీనజనవాంఛితార్థప్రదానదక్ష, దక్షజానుతనామ కోదండరామ. 118

సీ. తనసహోదరున కిత్తటి సెద్దిగతియంచుఁ దల్లడించుచుగౌరి ధవుని వేఁడెఁ
[1]గద్రువపుత్రశోకంబు నేగతిమాన్ప నగునంచుఁగశ్యపుఁ డడిగె నజునిఁ
దనపౌత్రుఁ డేమియయ్యెనొబలీంద్రుఁ డటంచుఁ బ్రహ్లాదుఁ డెంతయుఁబలవరించె
గిరికొనుచింత చేఁ గిటికూర్మరూపము ల్సంహరింపఁదొణంగెఁ జక్రపాణి
తే. నీశరాగ్నులు నానీరునీఱుఁజేసి, మీఁటి పాతాళలోకము ల్దూఱునపుడు
లోకసంరక్షణైకలోలుండ వయ్యుఁ, దగునె నీవింత సేయ సీతాసహాయ. 119
తే. అని నుతులుచేసి మరుభూమి నజునియాశు
గంబుఁబఱపించి సేతుబంధంబునకును
నలుని నియమించి చనియె నజ్జలధి నలుఁడుఁ
గపులుదెచ్చిన గిరులచేఁ గట్టునపుడు. 120
మ. ఒకచేఁ బట్టెఁడు నెంతగట్టు నితఁడం చుగ్రాత్ముఁడై గంధవా
హకుమారుం డటను త్తరంబుగన దేవాహార్య మేలంచు భూ
మికుమారీవరుఁ డన్న వద్దనఁగ నేమీ తెచ్చుఁగాకంచును
త్సుకుఁడై కట్టె నలుండు వారధి సురస్తోత్రైకపాత్రంబుగన్. 121
మ. మును సుగ్రీవునకు న్విభీషణునకున్ మోదంబుతోఁ బట్టమున్
దనుఁజేరంగని కట్టెనంచును సముద్రంబుం దనుం జేర శో
భనలీల న్భువనాధిపత్యమునకుం బట్టంబుఁదాఁ గట్టెనో
జననాథాగ్రణినాఁగ సేతు వమరెన్ సాముద్రగోధిసలిన్. 122
మ. హరిసంఘంబులు గొల్చిరా సరసవాతాపత్యసంరూఢుఁడై
ఖరశత్రుం డసమాస్త్రరీతి వెలయం గామాతురుం బజ్జికం
ధరు నంతోగ్రదశార్తుఁ జేయుటకు దోర్దర్పంబునన్ దైత్యరా
ట్పురముం జేరెను హంససంతతి నుతు ల్వ్రాంగార శృంగారియై. 123
వ. ఇవ్విధంబున రఘునాథుండు పాథోనిధానంబుం దాఁటి యనేకబలజాలంబులతో సువేలనగరంబునఁ బాళెంబు డిగిన శుకసారణులు వచ్చి చూచి చని రామలక్ష్మణసుగ్రీవమహాబలనందనాదిబలంబుల వేఱువేఱ విన్నవించిన విని నిశితక్రూరకటాక్షంబుల నాక్షేపించుచు జిహ్వాగమనద్విజిహ్వుని విద్యుజ్జిహ్వునిం బిలిచి మాయసేయ నియోగించి యద్ధురాత్ముండు వద్దురా రావణా యనక మహాంరఘూద్వహుని శిరంబును సశరాసనశరంబునుంగాఁ దెచ్చి సీతముందఱ బడవైచినం జూచి యుల్లంబునఁ దల్లడిల్లి పెల్లడలు పుడమిపట్టికి నవికల్లలని తెల్పు సరమవాక్యంబుల సముల్లాసరమంగాంచి యుండెనంత. 124
చ. ఇనకులుఁ డాసువేలగిరి నెక్కి కనుంగొనఁబైఁడిమేడపైఁ
బనివడి కుంచెగిండి యడపంబును బావడలూని వేల్పుజ

1 గద్రువపుత్రశోకము మాన్ప ననువెయ్య దనుచుఁగశ్యపుఁ డజు నడుగఁ జనియె.

వ్వాను శిరుగ్రీవలం గొలువ వన్నెయుఁగాఁ గొలువున్న రావణుం
గని పడఁదన్ని వచ్చె భుజగర్వమునన్ రవిపుత్త్రుఁ డత్తఱిన్. 125

క. పడమట ననిలజుఁ దూరుపు, కడ నీలుని దక్షిణమునఁ గపిరాజసుతున్
విడియించి యుత్తరంబున, విడిసి రఘూద్వహుఁడు సామవిధితత్పరుఁ డై. 126

ఉ. అంగదుఁ బంప నాతఁడు రయంబున లంకకుఁబోయి పఙ్క్తికం
ఠుఁగని దుర్మతీ మహీతనూజను రామున కొప్పగించి నీ
యంగము నిల్పుకొమ్ము వల దావల దానవవైరి వీడుఁగాం
చంగలవంచు నక్కొలువు సౌధము గూలఁగఁ దన్ని వచ్చినన్. 127

లయగ్రాహి. సంగరము గల్గెనని యంగములు మిక్కిలియుఁ
బొంగఁగ రయంబునను జంగలిడుచున్ వే
బంగరపుకోటలతుదంగలుగు మానికపు
శృంగముల కెక్కుచు నలంగములపై కిం
జంగునను దాఁటుచుఁగురంగముల రీతియుఁ
దురంగములభాతియుఁజలంగఁగనభంగో
త్తుంగభుజసత్త్వము వొసంగఁగఁబ్లవంగ
కులపుంగవులు శూరత మెలంగిరట వేడ్కన్. 128

వ. అంత. 129

సీ. స్మరహరాదికసురాసురదురాసదధరాధరవరాతిగరథోత్కరముతోడ
మదవదాయతపదాస్ఫదవదావదఘనాంగదమదావళరాజఘటలతోడ
మృగహయాధికరయాహ్వాతిజయాహతభయావహహయాత్యుత్తమావళులతోడ
నలికులానలవలాహకబలాహితబలార్ణవకులాచలబలప్రతతితోడ

తే. వసురనాయకు లెదిరి శస్త్రాస్త్రవృష్టి, గురియ నగధారులై యెదురొక్కసిరికపులు
ద్వంద్వసంగ్రామ మయ్యె నత్తఱిని మేఘ, నాదుఁడంగదుఁగికురించినభముఁజేరె.

క. భవపాశమోదనులరా, ఘవులన్ దశకంఠసుతుఁడు గట్టెం గద్రూ
భవపాశంబుల గరుడుం, డవియుడిపెన్దమము మాన్పు రవియుం బోలెన్. 131

తే. అంత హనుమంతుచేత ధూమ్రాక్షుఁడీల్గె, ననిన కంపనుఁ డతనిచేతనె యడంగె
వాలినందనుచేఁ గూలె వజ్రదంష్ట్రుఁ, డనిలపుత్త్రునిచేతఁ బ్రహస్తుఁ డీల్గె. 132

వ. అప్పుడు. 133

మ. రణనిస్సాణధణంధణధ్వనులచే బ్రహ్మాండము వ్రీలరా
వణుఁ డేతెంచి శితాస్త్రపఙ్క్తి రవిజున్ వారించి యయ్యక్షశి
క్షణు నొప్పించుచు నీలునింగదిసి దోశ్శౌర్యంబు వాటించి ల
క్ష్మణు శక్తిం బడవైచి రామవిభుపై శస్త్రాళి వర్షింపఁగన్. 134

మ. అలుకన్ రామనృపాలశేఖరుఁ డధిజ్యంబైన వింటన్ శరం
బులు సంధించి ధ్వజాశ్వసారథిరథంబు ల్గూల్చి మాణిక్యమౌ
ళులు నేలంబడ నేసి యేటికిఁ కఁజాలున్ వీటికిం బొమ్మనం
దలవీడం బరువెత్తె రావణుఁడు సేన ల్కేకిసల్గొట్టఁగన్. 135

చ. ఇటువలె లంకఁ జేరి దనుజేశ్వరుఁ డంతటఁ గుంభకర్ణుఁ బం
పుటయును వాఁడు నాకసము భూమియు నిండినకొండ మెండునం
బటపటనార్చుచుం గపులఁ బట్టుక మ్రింగుచువచ్చి భానుజ
త్రుటితసనాసకర్ణుఁడయి త్రుంగెఁ దుదన్ రఘువీరుతూపులన్. 136

తే. నెనరుగల్గిన యన్నయ నిదురలేపి, పనుప వచ్చినకుంభకర్ణునకు దీర్ఘ
నిద్ర యొసఁగె రఘూత్తమనిశితమార్గ, ణంబు లవిపక్షపాతు లనంగరాదె. 137

తే. అంత దేవాంతకుండు నరాంతకుండు
త్రిశిరుఁ డతికాయుఁడును వింశతిభుజసుతులు
దగ మహాపార్శ్వుఁడును మహోదరుఁ డనంగ
వెలయు పినతండ్రులనుగూడి వెడలి రపుడు. 138

సీ. రంగదభంగశౌర్యమున నంగదుఁ డప్పు డంగదుం డయ్యె నరాంతకునకు
దేవాంతకుండును ద్రిశిరుఁ డంగదవైరి హనుమంతుచేతి మహాద్రులకును
భుజమహోదరవహ్నిపుత్త్రుచే భిన్నమహోదరుండయ్యెమహోదరుండు
వృషభునివలన నివేశితయను మహాపార్శ్వుఁడయ్యెను మహాపార్శ్వుఁడొకట

తే. సంగరము చేసి యతిఘోరసంగరమున, గపులఁ బెక్కండ్రఁ జంపినాకపులవాగడ
నంత నతికాయుఁ డతికాయుఁ డయ్యె లక్ష్మ, ణప్రయుక్తవిరించిబాణప్రహతిని.

ఉ. అంతట నింద్రజిత్తు సమరాంగణ హోమము చేసి వీతిహో
త్రాంతరసీమ వెల్వడు మహారథ మెక్కి పయోధరాధ్వసం
క్రాంతి చెలంగ వైధసశరంబున పక్షిసహస్రకోటివి
క్రాంతకపీంద్రలక్ష్మణుల రాఘవు మూర్ఛిల నేసి నవ్వుచున్. 140

చ. గెలిచితి రామలక్ష్మణులఁ గీశులనంచు మహాట్టహాసము
ల్సలుపుచు నింద్రజిత్తు చనఁ జయ్యన బ్రహ్మసుతోపదిష్టుఁడై
మలయక వేగ నేగి హనుమంతుఁడు మందులగట్టుఁ దెచ్చి వా
రలరుజ లెల్ల మాన్పె రఘురాముఁడు మెచ్చుచుఁ గౌఁగిలింపఁగన్. 141

వ. అంత. 142

మ. ఖలుఁ డారావణుఁ జేరియుండెనని యింకం దీనిఁ గైకోఁడు ని
ష్కలుషుండైన విభీషణుం డనుచు లంకన్ శుద్ధిగావింప ను
జ్జ్వలకీలానలముం దగిల్చెఁ గపిరాట్సైన్యంబు హాహారవా
కులదైత్యాళి తదంతరాఘము వలెన్ క్షోభించె నత్యుద్ధతిన్. 143

క. కుంభుఁడు సంస్ఫాలితభుజ, కుంభుఁడు పురివెడలె మఱి నికుంభునితోఁ ద
త్కుంభచ్ఛిదకు దివాకర, సంభవదోర్దండ మపుడు చండంబయ్యెన్. 144

తే. తోడఁబుట్టిన కుంభునిఁ జూడనేఁగె, నలనికుంభుండు నంతట ననిలసుతుని
చేత నంపించుకొని మైందుచేత శోణి, తాక్షుఁడుద్వివిదుచేతయూపాక్షుఁడరిగె.

క. మకరాలయబంధనరా, మకరాళశరాస్త్రశస్త్రమహిమరుషోద్ధా
మకరాక్షుఁడగుచుఁ గూలెన్, మకరాక్షుఁడు దనుజసేన మల్లడిగొనఁగన్. 146

వ. అంత. 147

ఉ. జంభవిదారి వైరికృతసంగరుఁడై రఘువీరరోషసం
రంభముఁజూచి నిల్వక పరాజితుఁడై కుహనామహీసుతా
లంభమున న్మరుత్సుతుఁదొలంగఁగఁజేసి యంట న్నికుంభిలా
కుంభిని దీక్షఁగైకొనుచు గొబ్బున హోమము సేయుచున్నెడన్. 148

మ. హనుమంతుం డటపోయి యశ్రువులతోహారామ హారామ యం
చును శోకింపఁగ సీతఁజంపిచనె నచ్చో నింద్రజిత్తుండటం
చును దెల్పన్ విని హావిదేహసుత యంచున్ మూర్ఛిలెన్ రాఘవుం
డు నివారించెఁ దదీయమూర్ఛ ననుజుండున్ యత్నపూర్వంబుగన్. 149

ఉ. అక్కట నేఁడు నీదగునసర్థము దెల్పెను నిట్టులైన నే
నెక్కడఁజొచ్చు వాఁడ నిఁక నెవ్వరిఁజంపిన నేమియంచుఁ దా
వెక్కుచు లక్ష్మణుండు పలవింపఁగ రాముఁడు చేరియాఁగతిం
జొక్కిపడన్ విభీషణుఁడు భూసుతమేలు వచించి యిట్లనున్. 150

చ. ఇనకుల యాంజనేయు భ్రమయించి నికుంభిలహోమదీక్షగై
కొనఁజనె నింద్రజిత్తటకు గొబ్బునలక్ష్మణుఁబంపుమన్న న
జ్జనపతి విస్మయంబున ససైన్యముగాఁ బనుప న్నికుంభిలా
వనికరుదేర లక్ష్మణుఁడు వాసవవైరియు ముక్తహోముఁడై. 151

మ. కనకస్యందనమెక్కి బిట్టెగయ నుగ్రంపశ్యనేత్రాబ్జుఁడై
హనుమద్వాహనమెక్కి లక్ష్మణుఁడు దివ్యాస్త్రాళిచే వానిమా
య నివారించి శిరోధరంబుఁ దెగవ్రేయం గల్పకశ్రేణికా
ళిసవర్షించెఁ బ్రసూనవర్షములు మెండయ్యెన్ సురస్తోత్రముల్. 152

వ. అంత. 153

శా. సౌమిత్రేయుఁడు శక్రజిజ్జయరమాచంచన్నఖశ్రేణికా
సామగ్రిం బిశునాశుగవ్రణితనూసౌందర్యుఁడై మ్రొక్కినన్
వైమాత్రేయునిఁ గౌగిలించుకొని ముద్వారాశినోలాడె శ్రీ
రామక్షోణివిభుండు రావణు గతప్రాణుండుగా నెంచుచున్. 154

మ. హతశేషత్రిదశాహితుల్ బలవిపక్షారాతియాయోధన
క్షితిలోఁ గూలుటఁ దెల్ప మూర్ఛిలి దశగ్రీవుండు హా పుత్త్ర దై
వతలోకేంద్రుఁడు తన్నుఁ బట్టుకొని పోవన్ వాని వారించి తె
చ్చితి నేఁ డేటికి నొప్పగించి చనితి శ్రీరాము బాణాగ్నికిన్. 155
మ. అని శోకించి సరోషుఁడై జనకకన్యం జంపఁగాఁ బోయి మం
త్రినిరుద్ధుండయి పంపి మూలబలముం దెల్లన్ రఘూత్తంసుచే
తను దా వచ్చి యనేకకీశభటులం దండించి యత్యుగ్రశ
క్తిని సౌమిత్త్రిని నేయ నాతఁడు ధరిత్త్రిన్ వ్రాలె నిశ్చేష్టుఁడై. 156
చ. అనుజునిఁ జూడ శోకము దశాననుఁ జూడఁగ వచ్చు రోషముం
బెనఁగొన రామభూవిభుఁడు పేర్చి జ్వలద్విశిఖార్చి నేర్చఁగా
దనుజవిభుం డెదుర్పటకుఁ దాళక యూడనిఁ బాఱె ఖిన్నుఁడై
వనచరులో దశాస్య యలవాటుగదా యిదినీకు నంచనన్. 157
సీ. అంతట హనుమంతుఁ డౌషధుల్గొని తేరఁ గదలుచు మునివేషుఁ గాలనేమిఁ
గని మున్నుగాన మిమ్ముని నంచడిగి వానిజలము వేఁడినవాఁడు గొలనుజూపఁ
జని యచ్చటను మానిశాపంబు దీర్చి పొమ్మని పదంబులువట్టుకొనినమకరి
మర్దింప నది ధాన్యమాలినియై కాలనేమిఁ దెల్పిన నైననేమియనుచు
తే. వానిఁ బరిమార్చి ద్రోణపర్వతముఁ జేరి, యచట కాపున్న గంధర్వనిచయములను
గెలిచి తరిగట్టుఁగొని తెచ్చుపులుఁగు చేసి, సరణిమందులకొండ యంసమునఁ జేర్చి.
క. తెచ్చిన యంతనె ప్రాణము, వచ్చె న్సౌమిత్త్రి కఖిలవానరబలము
న్మెచ్చెన్ రాఘవు శోకము, విచ్చెన్ రావణమనోరవిందము నొచ్చెన్. 159
సీ. అసురేంద్రుఁ డంతశుక్రాదిష్టమగునియమమునఁ బాతాళహోమంబు సేయ
ననలుఁడు చెప్పివంపెనో నాఁగ ధూమంబు భీమమై వెడల విభీషణుండు
దెలిసి రాఘవులకుఁ దెలిపి తద్విఘ్నంబు గావింప సబలు నంగదునిఁ బంప
నతఁడు మందోదరీహరిణాక్షి వేణిఁ బట్టీడిచి తెచ్చి దైత్యేంద్రు చెంత
తే. నిలుప నాకంజవదన కన్నీరు దొరుగ, నాయకునిఁ జూచి వెసరోయఁ బోయె వాఁడు
సృక్స్రువంబులు పడవైచి సురియఁ బూని, యంగదాదులఁ దఱిమి మహారయమున.
సీ. దశమస్తకాధగద్ధగితరత్నకిరీటకాంతిభాస్కరుఁ గచాకచికిఁ గవయ
భుజచతుఃపంచకాద్భుతసాధనశ్రేణి భుజగజిహ్వాభుజాభుజకి మొనయ
జాజ్వల్యమానవింశతిదంష్ట్రిమర్త్యహర్యక్షదంష్ట్రారదారదికి నెదుర
దీప్తరోషజ్వలద్విదశకాలోకముల్ శిఖిశిఖావళిముఖాముఖికిఁ డాయ
తే. వెడలె సంగ్రామమునకుఁ బృథ్వీధరేంద్ర, సహజగౌరవవైభవాసహాశతాంగ
పటపటాత్కారపటలలంపటపటాగ్ర, గళితదశకంధరుఁడు దశకంధరుండు. 161

చ. మనుకులచంద్రుఁ డట్టియెడ మాతలిదెచ్చిన వాసవీయకాం
చనరథ మెక్కి యెక్కిడిన చాపముతోఁ బ్రతిఘాజ్వలద్విలో
చనములతో యుగాంతయమశాసనుకైవడి మించువేల్పులం
గనుఁగొనగొంకిరంతదశకంఠు నెదుర్పడి పోరు నయ్యెడన్. 162

సీ. పల్లవారుణజటాపటలంబు ముడిగొన ముడిగొనుబొమల నెమ్మొగము వెలుఁగ
వెలుఁగుతోఁజనుచూపువిలయాగ్ని వెదచల్లఁజల్లగానిమహోచ్ఛ్వాసనముదనరఁ
దనరఁబై బైఁగటితటియంగ మదరంగఁ దరగలైరథపటు ధ్వానమాన
మానని ఘోలఘర్మమునఁజెక్కులునాన నానతంబగుచు బాణాసమలర

తే. మలరహించిబోల్చు రావణు మర్మమంట, మంటలన్నియుఁదనకదంబములగూటి
మాటికేయంచు సంధకమథనభీమ, భీమమగురోషమున వీరరాముఁ డెదిరె.

మ. పరుషానోన్యవికద్థనంబు విహితప్రత్యస్త్రశస్త్రాస్త్రత
స్మరజాతం బితరేతరత్వరితమూర్ఛామగ్న సారథ్యభం
గురరథ్యంబుఁబరస్పరాహతదళత్కోదండదండంబునై
కరమొప్పెన్ రఘురామరావణుల సంగ్రామంబు భీమంబుగన్. 164

మ. గుణజాతంబులొ యంగుళీభవములో కోదండకృత్యంబులో
గణుతింపం బసకాదు కాదన నిషంగంబంటిచేసావిమా
ర్గణముల్ దీసినయప్డు కుండలితమై కన్పట్టునే భానుదా
రుణమా విల్లనిమెచ్చి రందురఘువీరున్ దేవతాబృందముల్. 165

మ. శరవేగప్లవమానగండక సమంచద్భృంగలీలాప్తిసా
గరముల్ రాహుతులాధికాయతధనుఃకంఠీరవప్రాప్తి నం
బరముం బోలుచు రామరావణుల సామ్యంబైన యుద్ధంబుఁజే
సిరినక్తందివమేడునాళ్లు దివిజశ్రేణు ల్విలక్షింపఁగన్. 166

వ. అంత. 167

ఉ. రామవిభుండు నిస్తులశరంబుల రావణుహస్తమస్తక
స్తోమముఁద్రుంచినన్ మొలచుఁదోడనెతోడనె త్రుంచురాముఁడున్
వేమఱునట్లు ద్రుంచి యటువెన్కవిభీషణుఁడెచ్చరింప గ
ర్భామృతమున్ హరించె ననలాస్త్రమున న్నిర మొండు చిక్కఁగన్. 168

శా. బ్రహ్మణ్యంబయి మించురాఘవపరబ్రహ్మంబు ధన్వంబునన్
బ్రహ్మాస్త్రంబరివోసి యేసినఁగృతాబ్రహ్మణ్యవిప్రాపహున్
బ్రహ్మాండోజ్జ్వలతేజు రావణు జగద్బాధాచణుం ద్రుంచివే
బ్రహ్మాదు ల్నుతియింప రామశరధిం బ్రాపించె నత్యుద్ధతిన్. 169

తే. విజయకమలాభిరాముఁడై వీరరాముఁ, డనుజకరమున కొసఁగి బాణాసనంబు
రథముడిగ్గి మనోల్లాసరమనుభాను, సుతునికై దండగొని యనిఁజూచుచున్న.

మ. పరితఃకీర్ణకచావృతాంసము గళద్బాష్పంబు సిక్తస్తనాం
తరచేలంబుఁబతద్విభూషణము హానాథేతివాగాస్య ము
త్వ్యరనిశ్వాసవిశోషితాధరము శోకవ్యగ్రచిత్తంబునై
యరుదెంచెన్ రణభూమిఁజేరదశకంఠాంతఃపురంబయ్యెడన్. 171

క. అరుదెంచి వరునిపైఁ బడి, పొరల విభీషణుఁడువారి బోధించి ధరా
వరునాజ్ఞఁబంక్తిముఖునకుఁ, బరలోకక్రియలు దీర్చి పావనుఁడైనన్. 172

శా. యావత్కాలము భూమిరామకథ సూర్యాచంద్రముల్ వారిధుల్
తావత్కాలము లంకనేలు మని తాత్పర్యంబుతో రామసం
సేవాలోలు విభీషణున్ సుగుణరాశిన్ నిల్పె సౌమిత్రి సీ
తారామాహృదయేశజంగమజయస్తంభంబునా నంతటన్. 173

మ. తళుకున్నిద్దపుఁబైఁడిబొమ్మవలె సీతాకాంత పెంజిచ్చుని
చ్చలపుంగాఁ కలవన్నెవాసిగని మించంగాంచి హర్షించుచుం
గులకాంతామణి చెంతనుంచుకొనియెం గోదండదీక్షాగురుం
డలఘుప్రౌఢవచోనిరూఢిఁ దగ బ్రహ్మాదుల్ప్రశంసింపఁగన్. 174

వ. అంత. 175

తే. దశరథుని గాంచిమ్రొక్కి యింద్రవరమునను
బలముబ్రతికించి పురికేఁగఁదలఁచురాము
నకు విభీషణుఁ డొసఁగె సాంద్రప్రఫుల్ల
పుష్పకంబైన కౌబేరపుష్పకంబు. 176

క. రతివలెఁ గామగమనమయి, వితతంబగుపుష్పకము బ్రవేశించి చమూ
తతితో సతితోధృతితోఁ, బతితోరపువేడ్క రాజపథగతుఁడగుచున్. 177

సీ. అదెచిత్రమకరాంక హాయవిచిత్రవిటంకవశైతిలగ్నశశాంక యనురలంక
సకలలోకములందు జయలక్ష్మినేఁజెందఁగుంభకర్ణుం డిందుఁ గూలె ముందు
మనలక్ష్మణునితోడ మల్లాడి మదమూడి శత్రుగెల్చినప్రోడ సమసెనీడ
నటవ్రాలె బటుదండుఁ డైయుండు మును నిందురాజసంబుననుండు రావణుండు
తే. సేతువదె యంచుఁదెల్పుచు సీతతోడ, రామచంద్రుఁడు రామేశ్వరంబు చేరి
తనదుపేర సమీరణతనయుపేర, దివ్యలింగంబు లంటఁబ్రతిష్ఠించికొలిచి. 178

వోష్ఠ్యాచలజిహ్వాద్వ్యక్షరికందము.
భవభావిభవవిభావా, భవభావభవాభిభావభావిభూభా
భవభావభావివైభవ, భవభావిభుభావివిభువభావావిభవా. 179

మ. అనివర్ణించి విభుండు సేతువు శరాసాగ్రంబునం ద్రుంచె శే
షునకైనం బొగడంగ శక్యమె ధనుఃకోటిప్రభావంబు గ

న్గొనినంతం జనుబ్రహ్మహత్య మొదలౌ క్రూరాఘసంఘంబు మ
జ్జనముంజేసినవారి పుణ్యమెఱుఁగ శక్యంబె మాబోంట్లకున్. 180

తే. అంత రఘువల్లభుఁడు పుష్పకాధిరూఢుఁ, డగుచుఁగిష్కింధఁ దారోవఁగానరిగిరవిజ
సతులరప్పించి సీతపార్శ్వముల నిలిపి, జనకనందనతో నిట్టులనియెఁ జనుచు.

సీ. పంపానదినిఁగంటె శంపాలతాతన్వి ఋశ్యమూకముఁగంటె ఋష్యనయన
శబరీవనముఁగంటె శబరీజితఘనాళి దండకఁగంటె వేదండయాన
పర్ణశాలఁగంటెసువర్ణభాసురవర్ణ ఘటజాశ్రమముఁగంటె కుటజగంధి
చిత్రకూటముఁగంటె చిత్రశాలికపోల గంగఁగన్గొంటె విభృంగచికుర

తే. యనుచుఁ దెల్పుచు వచ్చి యయ్యనిలసుతుని
బిలిచి తమరాక భరతుతోఁ దెలుపఁబంచి
ఘనభరద్వాజుఁగనఁ బ్రయాగమున నిల్చి
యాతఁ డొనరించు మంచివిం దారగించి. 182

వ. ప్రభాతసమయంబునఁ బ్రభాపతీప్రభాతరంగితపుష్పకాభిరాముండై భరద్వాజసమాసాదితభోజనానందిగ్రామసమేతంబుగా రామచంద్రుండు నందిగ్రామంబునకుఁ జనుదెంచునప్పుడు నెదురుగా సకలసేనాపరివృతుండును శత్రుఘ్నసేవితుండును గౌసల్యాదిజనయిత్రీసహితుండును నైన భరతుండు కృత్యాచారతరంగిణీరోధఃపురోధఃపురస్సరంబుగా నరుగుదెంచినం జూచి రఘువీరుండుడిగ్గునలేచి సుగ్రీవుకై దండగొని విభీషణపురోనిర్దిష్టమణిసోపానమార్గంబునఁబుష్పకంబుడిగ్గి వసిష్ఠునకు వందనంబాచరించి వందమానులగు భరతశత్రుఘ్నులఁ గౌఁగిలించికొని తల్లులకుం బ్రణమిల్లి తదీయానందబాష్పధారాసేకంబు చిరాద్భావిపట్టాభిషేకసంసూచితంబుగా సంతసిల్లి నందిగ్రామంబు ప్రవేశించి భరతపూర్వకంబుగా సుమిత్రాపుత్త్రులతో జటావల్కలంబులు సడలించి పతంగనందనదనుజపుంగవాది పురోహితసహితంబుగా నభ్యంజనస్నానంబు చతుర్విధశృంగారంబు లంగీకరించి మణిమయశతాంగం బెక్కి సుగ్రీవాంగదవిభీషణాదులు మాతంగతురంగాది వాహనారూఢులై కొలిచిరాఁ బురాంగనలు సేసలుచల్ల వందిమాగధులువొగడఁ బంచమహావాద్యంబులుబోరుకలుగమహోల్లాసంబున.

సీ. అలమేరువునుబోలి యందంపునందమై కురుజులు మేరువుల్గొమరుమిగుల
గలువడంబులలోన యలజవ్వనపుమిటారులచూపు కలువడంబులు ఘటింపఁ
గలయనెల్లెడవణిక్కులదీపములవాకిళులయందు మణిదీపములు వెలుంగ
మకరతోరణములంబరమార్గమకరతోరణవిచక్షణములై రాయడింప

తే. రహిఁవహించునయోధ్యాపురంబు సొచ్చి, తననగర లక్ష్మణునియింటఁ దపనసుతవి
భీషణులనన్యులను నన్యపృథులరత్న, గేహముల నుంచి తా రాజగృహము చేరి.

ఉ. ఆమఱునాఁడు మారుతసుతాదికపీంద్రులు వారిరాశి గం
గాముఖపుణ్యతీర్థములు గైకొనిరా శుభవాద్యఘోషముల్
భూమిసుపర్వమంత్రరవముం జెలఁగన్మణిపీఠి సీతతో
శ్రీ మెఱయంగ రాము నభిషిక్తునిఁ జేసె వసిష్ఠుఁ డత్తఱిన్. 185

సీ. భరతుండు ముక్తాతపత్రంబు ధరియించి యిందుబింబంబు కొల్వొక్కఁ జేయ
సరిగాఁగఁగపులు చామరములువీచుచు విష్ణుపయోధులవిధము దెలుపఁ
గపిరాజతనయుండు ఖడ్గంబుధరియించి శేషాహివల్లభుసేవ నెఱపఁ
బవమానసూనుండు పగలుదీవటిఁబూని స్వప్రతాపంబు సాక్షాత్కరింప
తే. సీతప్రతిబింబమనసురస్త్రీప్రదీప, మర్కసంకాశరత్నసింహాసనమునఁ
బ్రేమఁగొలువుండెఁబట్టాభిరాముఁడగుచు, రామచంద్రుండు భక్తసంరక్షణుండు.

తే. అపుడు బ్రహ్మాదిదేవత లఖిలమునులు
వచ్చి కృతపూజులగుచు రావణునిఁద్రుంచి
మనిచితివి లోకముల రామయనుచు వినుతి
చేసి రంతఁ బేర్వేఱఁ జిత్రగతుల. 187

పుష్పమాలికాబంధము.

చ. ఖరకరఘోరతేజ కవికల్పక బంధనదీనజానకీ
వరధరధీర రాఘవభవస్తవలోలుప చాపరోధ భా
స్వరకర వీరగుప్తసవసర్వసమారమణీమణీమనో
హార శరహారకీర్తియనయప్రియదానపదావజీవనా. 188

గోమూత్రికాబంధము.

చ. రఘువరధీరతా విమలరామ దయాపర దివ్యమూర్తిమా
నఘునలినాక్ష దానరతయక్షయరూప జితారిభాను రా
లఘుశరవీరభూవిభులలామజయాకర భవ్యకీర్తిని
త్యఘునఘునాథ దాశరథి యక్షయరూపప్రతాపభాస్కరా. 189

ఛత్రబంధము.

క. సురవరదరకరఖరకర, కరఖరశరవారవీరఖరహారహార
స్ఫురదరనరవరధీర, త్రరమారఘురమ్యరక్షిరణరతరథ్యా. 190

నాగబంధము.

స్రగ్ధర. భవ్యారామక్షితీశా భవనవజలజప్రాయవైశద్యకీర్తీ
దివ్యాగత్యాగరాజద్విజకులరమణాదీనభద్రాఫలాయ
త్క్రవ్యాదాకీర్ణనానాదహనవినతపక్షాజరాతీతధీరా
నవ్యాపద్మేశభావ్యానరభరణదిశానాథగణ్యోపసేవ్యా. 191

పాదగోపనము.

చ. నరవరధీరగు ప్తకృపణావరభూధవమన్యువేగజే
త్రరియుతధీరతాలఘుతరావనభృల్లలితాభభూసురా
త్యురుఘనభావమావిభవ యు కరమావహపత్యనిర్మలా. 192
[illegible]

అనులోమవిలోమము.

క. మానవపాయజనుతశివ, మానధనాసారభవనమదసవవనదా
దానవదసదమనవభర, సానాధనమానశినుత జయపావనమా. 193

అష్టదళపద్మబంధము.

స్రగ్ధర. హారినిత్యాసనర్మాహరవినుతనయాత్యాయసత్రావిరాధీ
ధీరానిత్రాసయత్యాధృతపదనతధాత్రీపదివ్యాభరాకా
కారాభవ్యాది పత్రీడ్గమన శుభగుణగ్రామసక్తాసరామా
మారాసక్తాసమగ్రామహిత వరధనుర్మానసత్యాదిరీహా. 194

క. అని బ్రహ్మాదులు వొగడఁగ, వినిసంతసమొందు రామవిభునకు భక్తిన్
వినుతియొనర్చి సమీరణ, తనయుం డిట్లనుచుఁబొగడెఁదనవాక్ప్రౌఢిన్. 195

ఉత్పలమాలికలో మంజుభాషిణియను వృత్తము.

ఉ. భ్రాజితవిక్రమా వికచపంకజపత్త్రవిలోచనా రణ
శ్రాజిత దానవా విమలకార్తికచంద్రనిభాననా మహా
రాజశిరోమణీ జనకరాజలలామకుమారికామనో
జ్ఞాజలజాప్తతేజ యతిసన్నుత చారుగుణోన్నతా హరీ. 196

క. అనిహనుమంతుఁడు పొగడఁగ, విని వేడుక మీఱ రామవిభుఁడుధరిత్రీ
తనయఁగనిచెలువవించె, నను బొగడెడి పద్యమునను నైపుణిమెఱయన్. 197

మంజుభాషిణి. వికచపంకజపత్త్రవిలోచనా, విమలకార్తికచంద్రనిభాననా
జనకరాజలలామకుమారికా, జయతిసన్నుతచారుగుణోన్నతా. 198

మ. అనినాస్తోత్రము మంజుభాషిణి త్వదీయస్తోత్రము న్గర్భితం
బును నైమించ రచించె నంచు ననినన్ భూపుత్త్రి మోదంబుతోఁ
దనచేహార మొసంగ మారుతియు ముక్తాదామముం దాల్చి చె
ల్వెనసెన్ స్ఫాటికమాలికామహితవాణీశానుచందంబునన్. 199

వ. అంత. 200

తే. వారివారి యథోచితవైఖరులను
బనిచి కృతయుగధర్మంబు ప్రబల సకల
యాగములుచేసి జనులు సౌఖ్యములఁ బొదల
జగములను బ్రోచు శ్రీరామచంద్రవిభుఁడు. 201

క. ఈరామాయణకథ యె, వ్వారు పఠించినను వినిన వ్రాసిన సౌభా
గ్యారోగ్యభాగ్యయుతులై, వారలు వెలయుదురు సుమతి వసుమతిలోనన్.

క. అని శ్రీవైశంపాయన, మునిముఖ్యుఁడు దెలుప విని ప్రమోదాన్వితుఁడై
జనమేజయుఁ డవ్వలికథ, యనఘా వినవలతుఁ దెలుపు మని యడుగుటయున్.

శా. శ్రీరాగోజ్జ్వలగేహ తోయజదళాక్షీ మోహనాదానవ
[illegible]రంగప్ర[illegible]ళిపార్శ్వనినదద్ఘంటీరవప్రాంగణా
సౌరాష్ట్రప్రియశంకరాభరణరాజత్పాఙ్జ్ఞకేదారకా
శ్రీరామేశ్వరధీరమధ్యలలిత శ్రీ[illegible]భిరామక్రియా. 204

క. పూర్వోత్తర మీమాంసా, పూర్వోత్తరవినుతసమరభూసాహసితా
పూర్వోత్తరసారథిరథ,పూర్వోత్తరరాజమిత్ర భూరిధనాఢ్యా. 205

స్రగ్విణి. చంద్రకాంతోన్నమత్సౌధయూథక్రమా
చంద్రకాంతోపలాంచద్యశశ్చక్రమా
చంద్రకాంతోపమాసన్ముఖాబ్జక్రమా
చంద్రకాంతోత్తమాశ్వస్ఫురద్విక్రమా. 206

గద్య. ఇది శ్రీరామభద్రదయాభిరామభద్రకరుణాకటాక్షవీక్షాపరిప్రాప్తదీప్తతరాష్ట
భాషాకవిత్వ సామ్రాజ్యధౌరేయ సకలవిద్వత్కవిజనవిధేయ ధరణిదేవుల నాగ
నామాత్యసుధాసముద్రసముత్పన్నిద్రపూర్ణిమాచంద్ర రామమంత్రీంద్రప్రణీతం
బైన దశావతారచరిత్రం బనుమహా ప్రబంధంబునందు సప్తమాశ్వాసము.

౭. శ్రీరామావతారకథ సమాప్తము.





# ౮. బలరామావతారకథ.





అష్టమాశ్వాసము.

దసఖశౌర్య యాధుని
కాదిమహారాజదాన హాసనతుమర్థై
ర్యాదార్యాదికగుణధు
ర్యాదవనము కృష్ణమార్య యధికైశ్వర్యా. 1

తే. అవధరింపుము జనమేజయక్షితీశ, శేఖరున కిట్టులను వ్యాసశిష్యమౌని
ధరణివర బలరామావతార మిఁకను, దెలియఁజెప్పెద వినుమని తెలుపఁదొణఁగె.

ఉ. మధురమణీయకేళి వనమంజుళవంజులకుంజమంజరీ
మధురసధారలన్ రమణమానితమానితమానినీమణీ
మధురవచోవిలాసముల మాసరమై సరమైకవాసమై
మధుర యనంగ నొక్కపురి మండితమా మహిమండనంబుగన్. 3

క. అసదృశవితరణలీలా, వసుదేవుఁ డమిత్రమిత్రవనజాతవిభా
వసుదేవుఁ డనఁగ మధురన్, వసుదేవుఁడు దనరు యాదవకులోద్వహుఁడై. 4

క. కల రతనికిఁబదునలువురు, కులభార్యలు వారిలోసగుణలౌ భార్యల్
వెలయుదురు వచోజితకో, కిలలై రోహిణియు దేవకియు ననిరువుర్. 5

క. కమలాక్షుఁడు దేవకిస, ప్తమగర్భముఁజేరి పిదపఁదనయోగముచే
విమలంబౌ రోహిణిగ, ర్భమునఁ బ్రవేశించి పుట్టె బలరామాఖ్యన్. 6

తే. గర్భసంకర్షణమున సంకర్షణాఖ్యఁ, గలిగె బలరామునకు నంతఁ గంసభీతి
రోహిణీకాంత నందుని గేహమున వ, సించి పోషింపఁబెరుఁగుచుసీరపాణి. 7

మ. హరియుం దాను గొల్లగుబ్బెతలగేహంబుల్ ప్రవేశించుచుం
బెరుఁగుం బాలును గొల్లలాడుచును గోపీవృత్తవక్షోజముల్
కరజాగ్రంబులఁ జీరుచుం గదిసినం గౌఁగిళ్లఁజొక్కించుచుం
గరమర్థిన్ విహరించు సీరి సఖసంఘంబుల్ ప్రశంసింపఁగన్. 8

క. బృందావనముల నావుల, మందలు మేఁపుచును గోపమాణవకులతో
నెందును బాలక్రీడా, నందంబునఁబొదలు నందనందనుతోడన్. 9

సీ. ఒకనాఁడు బలభద్రుఁ డుత్సాహమునఁ దోడిబాలురఁ బిల్చి యోబాలురార
మనలోన నెవ్వ రేమాత్రంబు దాఁటఁగా వలతురో కనుఁగొనవలయు హెచ్చు
దాఁటినవారిని దాఁటఁజాలనివారు వహియించి భాండీరవటము దాఁక
నరిగి రావలెనంచు హరికి శ్రీదాముని దక్కినవారికిఁ దగినవారి
తే. యుద్దులేర్పాటు సేయుచు నున్నచోఁ బ్ర, లంబదైత్యుండు గోపవేషంబుతోడ
వచ్చి వంచనచే సీరివధ మొనర్తు, ననుచు సంకర్షణుని కుద్ది యయ్యెనపుడు. 10
తే. నేరుపున నిట్టులుద్దులు నేరుపఱిచి, రామకృష్ణాదు లొకట శ్రీదామముఖ్యు
లొకట నెలకొనితమతమయురుబలంబు, వెలయలంఘించుచుండిరి వేడ్కమీఱ.
క. చిరుబొజ్జగదల జిగిబం, గరుగజ్జెలు మొరయ మద్దికాయలు మెఱయం
బరువెత్తివచ్చి దాఁటెన్, హరి యిరువదినాల్గుయడ్గు లౌరా యనఁగన్. 12
క. హరిపాటిగ దాఁటెద నని, పరువున శ్రీదాముఁ డెగిరిపడె ముప్పదిటన్
సరివారలు ముప్పదిరా, యరయఁగ వేయనుచు గొల్లుమని నవ్వంగన్. 13
సీ. సిగఁజుట్టుకొన్న సంపఁగిమొగ్గ తాయెత్తు చేరు చేరువ తేఁటిబారుఁ గదుమ
నొసపరి మొసలివాయొంట్లు జాళ్వాచెక్కు నిద్దంపు చెక్కుల నీడఁ జూడ
బిగియించికట్టిన మొగిలువన్నియచేల చెఱగులు కటియందు జిందు ద్రొక్క
వనమాలికవిశాలవక్షఃస్థలీశాలి బాలికాడోలికాకేళి దెలుప
తే. దూరమున నిల్చి కొడదట్టి తోవవారిఁ
దొలఁగుమని దృష్టిచక్కఁగా నిలిపి పిడికి
లించి కరములు గుదియించి శీవిఁగునుకు
పరువునను దాఁటె బలుఁడు తొంబదియడుగులు. 14
తే. ఒకట కుదయాద్రి కస్తాద్రి కొక్కటంగ
దాఁటజాలియు గిరుదుగా దాఁటియోడె
దానవుఁడు మీఁద గెలువఁగాఁ దలఁచియాడె
గెలువసులభంబె యోటమిగలుగుఁగాక. 15
సీ. ఎగిరినల్బదినాల్గడుగులు దాఁటగ నొకం డళికింప దాఁటక నెలమి నొకఁడు
దాఁటినలివనుముందఱికి మ్రొగ్గ నొకండు మ్రొగ్గక యట మొరంబున నొకండు
గుఱికిపవ్వ లడుగిడ గుఱిలోనఁ బడెనొక్కఁ డివ్వలవ్వలదాఁటె నెలమినొకఁడు
పరువిడుచో జాఱుచెఱగుద్రొక్కె నొకండు లివగాదనుచుమరలిచె నొకఁడు
తే. నడుమఁబిరినట్టి ఱొమ్ములఁబొడవుభుజము, పొడవుకుత్తుక పొడవునుబూన్కిదప్ప
కుండగుప్పించి రొండొరులుద్దులగుచు, గెలిచెహలిచేర్వయవ్వలిబలనులోడె.
శా. అంతంగృష్ణుఁడు గేరినవ్వుచును బావా యింక నీకేనుమున్
బంతంబుల్ పలుకంగవంగుమనిదర్పంబొప్ప శ్రీదాముపై

సంతోషం బలరంగ నెక్కి పదముల్ జాడించుచుం దావల్లెత్రా
డెంతే నైకొని హాయటంచుం గదిమెన్ హేలావినోదంబునన్. 17

క. వేడుక గెలిచిన బాలకు, లోడినబాలకుల నెక్కియుల్లసములు పె
క్కాడుచుఁ బఱవఁబ్రలంబుఁడు, తోడనె బలుఁ డావహించి దులదుల నడిచెన్.

తే. దిటము మీఱంగ భాండీరవటము దాఁక, నరిగి యందఱుమరలంగ మరల కసుర
బలునిఁ గొని సనె గుఱిదాఁటి భారమైన, యంతఁ దనరూపు గైకొనె నద్భుతముగ.

సీ. తగిలి కాలినమోడు చిగిరించినటువలెఁ గఱకుజుంజురు వెండ్రుకలు దనప
నగ్నికుండములంచు నక్షిగోళంబులు గములుగూడుక పతంగములు వ్రాల
వివృతాస్యపాతాళవివరనిస్సరదచ్ఛదారుణాహులు లనాఁగ దంష్ట్రలమర
గగనంబునను వాన కాళ్లు జాఱినరీతి నురుతరదీర్ఘబాహువులు దనరఁ

తే. గుంభతటమునసింగంపుఁ గొదమనుంచి, తనువెఱుంగక చనుమత్తదంతిలీల
వరనిశాటవిపాటనబలుని బలుని, యంస మెక్కించుకొనిపోయె నసురవిభుఁడు.

క. అపుడా బలుఁడు నిశాచరు, కపటముఁగని కృష్ణకృష్ణ గ్రక్కునఁ జెపుమా
యిపుడేమియుపమవచ్చెన్, విపరీత మటన్న నగుచు వెన్నుండనియెన్. 21

సీ. గగనాదిసృష్టిగల్గకముందు వెల్గొందు నిర్మలబ్రహ్మంబు నీవకావె
ప్రభవించువెనకఁ బ్రపంచస్వరూపమై నెగడు విరాణ్మూర్తి నీవకావె
జన్మాదిరహితుఁడై సత్త్వగుణంబు వహించునారాయణుం డీవకావె
వేయుఫణంబుల విశ్వంభరభరింప నిపుణుఁడౌ ఫణిరాజు నీవకావె

తే. యేను నీవయకాదె నీవేనుగాదె, యవనిరక్షింప నిరువుర మైతిమింత
తల్లఁపునిజమూర్తి మానుషత్వంబు నిలుపు, మఱువనేటికి యన్న నీమహిమలన్న.

క. కడువడి బలుఁడు నిజస్మృతి, బెడిదం బగుకడిమి దనుజుఁ బిడికిటఁ బోడవన్
బోడబోడ నెత్తురుగ్రక్కుచుఁ, బడియెఁ బ్రలంబుండు గోపబాలురు నెలఁగన్. 23

వ. అంత. 24

క. తొలుతన్ రాముఁడనై ఖరు, బొలియించితి నిటులనుచు భూజనములకుం
దెలిపెడుగతి బలరాముఁడు, పొలియించెన్ ఖరుని తాళముల నవనిబడన్. 25

వ. యివ్విధంబున ననేకబాలక్రీడాలోలుండును బ్రలంబధేనుకాసుర విఘాలుండును
నగుచుం గామపాలుం డంత నృశంసుండగు కంసుండు జిఘాంసాక్రూరబుద్ధియై
యక్రూరుచేత ధనుర్యాగావలోకనవ్యాజంబునఁ బిలిపించినఁ గొంచక కాంచనాం
బర సహాయుండై మధు పురంబున కరిగి. 26

సీ. తొగతేనిలీలముద్దులు గుల్కు నెమ్మేను వలుదకాటుకకొండవంటిరూపుఁ
బిడికిటికడఁకువౌ బెగడు నెన్నడుమును బ్రేవులప్రోవైన పెద్దకడుపు
నట్టహాసంబున నడరెడు తెఱనోరుఁ దళుకుగోఱల పెరిదంతయుగము
వెఱకపైగమకించువిక్రమక్రమమును మైయెఱుంగని మదోన్మత్తవృత్తి

తే. దనర హరియును గరిని మార్కొనినకరణిఁ, గంససభలోన ముష్టికుఁగఠినకులిశ
నఖముఖంబులఁజీరితన్మస్తదళన, గురుయశోమౌక్తికములఁ గైకొని యెబలుఁడు.

తే. కృష్ణుచేఁగంసుఁజంపించి యెలమి నుగ్ర, సేనుతద్రాజ్యమున కభిషిక్తుఁజేసి
తల్లులునుదండ్రియునుదాము మొల్లమిగసి, యెల్లసంతోషములఁ జెందియుల్లసిలఁగ.

వ. అంతఁ గంసపత్నులును దనపుత్రికలునగునస్తియుఁబ్రాప్తియునను నాస్తిమధ్యలు ప్రోత్సాహంబుచేసిన నాహవబాహులేయబాహుబలుం డగుజరాసంధుండు పదునెనిమిదవమాఱు మాఱులేనికడిమి నిరువదిమూఁడక్షోహిణులంగూడి మధురాపురంబు సుట్టుకొనినం గలఁగఁబాఱు యదువృష్ణిభోజాంధకవీరులం జూచి పురక్షోభంబు గాకుండ నేర్పున రాజసుతులతో జరాసుతుం బరాజితుం జేసెద నని మురాహిత సహితుండై ఖరారిపురంబు నిర్గమించి దక్షిణాభిముఖుండై యనేకజనపదవనంబులు దాఁటి సహ్యనగంబున నసహ్యతేజోభిరాము భార్గవరాము దర్శించి తదీయకామధేనుపయఃపానపీనబలుఁ లగుచు భార్గవోక్తదుర్గమార్గంబున ననర్గళప్రమోదంబునం జనిచని 29

శా. శ్రీమంతంబు శిరోగ్రధామసుషమాసింధూరితద్యోరమా
సీమంతంబు వధూసమేతవిహరత్సిద్ధాదినానామరు
త్సామంతంబు విలోకిదుష్కృతపయోజస్తోమహేమంతమా
గోమంతంబునకేఁగి యబ్బలుఁ డనుంగుందోడుతో నిట్లనున్. 30

సీ. కాంచనమయమౌటఁగనకాద్రి యనవచ్చుఁ గలితైకశృంగంబు గాదుగాని
ఖర్జూరమయమౌటఁ గైలాసమనవచ్చుఁ బలలాశిచేఁ బెల్లగిలదు కాని
హిమనిధానంబౌట హిమశైల మనవచ్చుఁబడుచుఁజూలని చెప్పఁబడదుగాని
కలితగంధంబౌట మలయంబనఁగవచ్చు జడమరుద్వ్యాప్తిచొప్పడదు గాని

తే. యదిర యేగిరు లెనయింక నమరమిథున, మందహాసనాతితుహిన హేమంతదరికి
హరివిలోకపలాయదభ్రాంబుపాయ్య, మర్త్యనామంతకరికి గోమంతగిరికి. 31

మ. అనివర్ణించుచు నగ్గిరింగలుగు నాయావింత లీక్షించుచున్
ఘనతాపింఛమహావనీతమములోఁ గం జేక్షణుం బాసి యొం
టినిడానొక్క కదంబభూరుహముక్రిందన్ వసించెన్ బలుం
డనురాగంబున నట్టె యప్పుడుదయంబౌ చంద్రు నీక్షించుచున్. 32

ఉ. అంతట నొక్క మందమలయానిల మెంతయుఁ జల్లనై శ్రమం
బంతయు శాంతిగా మలయునప్పుడు మద్యము తావి రాఁగ వి
భ్రాంతమనస్కుఁడై హరి పిపాసఁగదంబమహీజకోటరా
భ్యంతరసీమ నున్న సురఁ బానము జేసెఁ బ్రమత్తచిత్తుఁడై. 33

తే. అంతవారుణి కాంతియు నబ్జసదన, యనఁగ ముప్పురుప్రవ్వబోం డ్లతనుభువన
విజయలక్ష్ములొ యన రూపవిభ్రమముల, హెచ్చిమచ్చిక హలిఁజేరవచ్చిరపుడు.

సీ. మదిరారసముగబ్బు మాటలతబ్బిబ్బుఁగోదమగుబ్బల యుబ్బునిదుర మబ్బుఁ
దోలఁగుపయ్యెదకప్పు దూసియాడెడుకొప్పు వెడఁదీడునెఱికొప్పువిరులయొప్పు
మొదటిలత్తుకఠీవి చెదరినకెమ్మోవి జాఱినచెంగావి చీరనీవి
కమ్మ నెమ్మేనిగ్గుకడకేడు బలుసిగ్గుఁ దడఁబాటు నడజగ్గుఁదగ్గుమొగ్గు
తే. వాలుఁగన్నుల కెంపుపైవ్రాలుమంపు, నేలపాటిలనొక్క కెంగేలిమ్రొక్కు
మురువు నెమ్మేనిబిగువుఁగెమ్మోవినగవు, నలర నిట్లనె హేల మోహాలవాల. 35

క. వరుణునిపంపున వచ్చితి, వరు నిను వరియింపఁ గుముద వల్లభునివిభా
వరి యింపుమీఱె మదిలో, వరియించు క్రమంబు మెఱయ వరియింతు నినున్.

క. అనునంతఁగాంతి శశిక, న్ననుజక్కనివాఁడవౌట నాయకుఁగా ని
న్ననుమతిఁగోరితి న న్నీ, యనుమతి రతిఁదేల్పుమని పటాంచల మలమన్. 37

క. ఆరామచిలుకలందగు, నారామలఁగూడియున్న యారామునితో
శ్రీరామ యనియెఁగుచతట, హారామలకాంతి నగవునందుఁజిగుర్పన్. 38

మ. వినరామాయభిరామవీరల దయన్ వీక్షించిగైకొన్నరీ
తిని నన్నుంగయికొమ్ము దెచ్చితిఁబయోధిన్ నీలచేలంబులున్
ఘనకోటీరము వజ్రకుండలము సింగారించుకొ మ్మన్న మ
న్నన వానిన్ గ్రహియించి యెచ్చినమతిన్ నారీమణిం జేకొనెన్. 39

మ. బలితంపున్ వలిగుబ్బచన్ను ఘుఱయం బైవ్రాలుబంగారపుం
గళుకుం జెక్కిలిముద్దుఁబెట్టుకొను సింగారంపుఁగెమ్మోవి కెం
దలిరుం దేనెలు గ్రోలు సోలు మొనపంటన్ నొక్కు సొక్కున్ ముదా
కులయై తానరగంటఁగాంతునుర మెక్కున్ హేల ప్రౌఢక్రియన్. 40

సీ. ఉదుటుచన్దోయి మేనొరయదగ్గఱనిల్చుఁగౌఁగిలించినప్రేమఁగౌఁగిలించు
మోహంబుమీఱ నెమ్మొగము చెక్కిలిఁజేర్చుముద్దుఁగొన్నను వేడ్కముద్దుగొనును
దావిచెంగావికెమ్మోవిమోవిని గూర్చుఁగంటిచేసినఁ దమిఁగంటిసేయు
బంధోచితంబుగాఁబవళించుఁ బైకొని బడలినఁ బైకొనిబడలఁజేయుఁ
తే. జిలుగుఁబయ్యెదసురటిచే సేదదేర్చి, వేడ్క మీఱంగఁగపురంబువిడెమొసంగు
రమణుఁడిటురమ్మనినఁబునారతికినొగ్గుఁ, గాంతిహరిమధ్యమధ్య శృంగారములను.

తే. చన్నుఁగవముట్ట నీయదు చిన్నిమోవి, యానఁగానీదు నీవిఁ జెయ్యాడనీయ
దటులనయ్యును మిగుల మోహంబు వెనిచె, వనజగేహిని ముగ్ధభావమున పతికి.

సీ. ఒకకొమ్మఁగౌఁగిలించుక వెన్కమెలిగొన్నఁ గేలనిర్వురగుబ్బక్రేవలంటుఁ
జెలుల లోఁదొడఁబిఱుందుల గోరులుంచుచు మురువుతోనొక తెకుముద్దొసంగు
సకియలజఘననాభికలఁజేయార్చుచు మొనపంటనొకతె కెమ్మోవి నొక్కుఁ
గేలిచేనొకతెసొక్కించియిర్వుర నంగవిరతంబునం గళల్ జాఱఁజేయు

తే. మధురగంధోత్తమాపానమత్తులగుచుఁ, జిత్తమున నానయెఱుఁగక మొత్తముగను
హత్తుకొనుబిత్తలులఁగూడి చిత్తజన్ము, జన్మసాఫల్యకరుఁడు ప్రసన్న వరుఁడు. 43

ఉ. గంధగజేంద్రలీల యెసఁగంగ హలాయుధుఁడానతాంగపు
ష్పంధయనీలవేణికటి చిక్కఁబొసంగఁగనిల్చి ధేనుకా
బంధధురీణుఁడౌచు నిరుప్రక్కలఁ గాంతలయందు నొక్కసౌ
గంధికగంధి ముద్దుగొనుఁ గ్రమ్మఱనొక్క తెగుబ్బ లంటుచున్. 44

చ. అలసితివంచుఁ బైకొనులతాంగి మిటారముఁ జూచి నవ్వుచున్
వలపునఁదాళలేక యెదవ్రాలెడుబాలికఁ గౌఁగిలించుచున్
జిలిబిలిచెక్కుముద్దుఁగొను చేడియవాతెఱతేనెలానుచుం
గళలుగరంచి యేలె హలి కాంతల మువ్వుర నొక్కనేర్పునన్. 45

తే. కంతుకేళిక నీరీతిఁగలసిమెలసి, యంత సురతాంతరంబున నలసిసొలసి
యలయికలు దీర్చి తెమ్మెరల్వొలసిబలసి, చెలులు జెలువుఁడు వేడ్కల వెలసిరొలసి.

తే. అంతఁగృష్ణుఁడు చనుదెంచి యాదవేంద్ర, యదెజరాసంధుఁడరుదెంచెనఖిలరాజ
సైన్యములతోడ నంచునాశైలశిఖర, మెక్కి కనుఁగొనుచుండిరయ్యిరువురపుడు,

మ. శరధి న్నిద్దురవోవుశ్రీహరి శిరస్సౌవర్ణకోటీరమున్
విరసుండై కొనిపో విరోచనువడిన్ వెన్నాడి దైత్యఘ్నుఁడై
గరుడుం డాత్మకఠోరతుండమున దేఁగా నవ్వుశ్రీకృష్ణశే
ఖరభాగంబున వ్రాలెఁదన్మకుటమర్కచ్ఛాయ నందంబుగన్. 48

క. హలికిన్ మకుటము మణికుం, డలమేచకనిచయచయము నందసుతునకుం
గలితసువర్ణకిరీటము, గలిగెన్ గిరినిటు లయత్నగౌరవసిద్ధిన్. 49

వ. నగరంబు వెలువడివచ్చిన యది మొదలుఁగరంబు చలంబునం బ్రలంబారి యొండుఁ బాఱిపోయెదు నా బారింబడితి వింక బాగిలించక యింగిలించిన విడుతునే యనుచుం బారీంద్రంబు వెంబడిం బడు గంధసింధురంబు తెఱంగున జరాసంధ వసుంధరావరాజరాధిరాజన్యుండు కంటకంబు లాడుచు వెంటంబడి యగ్గట్టు చుట్టుముట్టి నేలమట్టంబుగాఁ గొట్టుచు నని బెట్టిదంపు కట్టల్కఁ పుట్ట నక్కట్టిడి దిట్టయై నెట్టుకొని మద్రకళింగచేకితాన బాహ్లీకకాశ్మీరగోనర్ద కరూశకింపురుష మాళవభూపాలురఁ బర్వతాపరభాగంబునందు దుర్యోధన దుశ్శాసన కర్ణ వైదర్భ భోజాధిపరుక్మిద్రుపద విందానువింద దంతవక్త్రశతధన్వ విదూరథ భూరి శ్రవత్రిగర్తాదు లుత్తరపార్శ్వంబున నులూకకైతవేయైకలవ్యదృఢాక్షక్షత్రధర్మజ యద్రథోత్తమౌజసాల్వకారవేయులు పూర్వభాగంబునఁ దరదచేదిరాజసహితుం డై దక్షిణభాగంబున విడిసి దుర్గంబులు లగ్గలువట్టు నగ్గలిక వెగ్గలంబు గటంకం బులు గిరివిటంకంబులు భుజాటంకమ్ములఁ బొంకంబులుగా భేదించియు గదాదం డంబు వేదండోపమగండంబులఁ దుండించియుఁ బరిఘలఁ బ్రేసియుఁ బట్టసంబులఁ గ్రు

చ్చియు ఖనిత్రంబుల గ్రొచ్చియు సుద్దవిడి సుద్దామకుద్దాలంబులం ద్రవ్వియు నగ్గుంటి గంటిసేయంజాలక మందరవసుంధరాధరోత్పాటన పరాయణులై నిరాకృతులగు సురాసురులచందంబునఁ బరానీకినీనిరాకరణప్రవీణపరాక్రమవిరాజిత ధరాదిరాజన్యులు దురాపంబిద్ధరాధరంబని పరాక్రాంతులైన సురాళించి జరాసంధుండు గరాలంబిత కరాళశరాసనపరాముక్తకరాళశరాసారంబున ధరాగ్రంబుఁగప్పియుంబురాణపురుషులగు ఖరాహితమురాభిరాతుల బరాభూతులం జేయఁజాలక దురాలోచనంబు చేసిన. 50

మ. సరసాభృచ్ఛిఖరానుజస్వకదిదత్తాకోపభూపాగ్రణీ
పరితఃప్రజ్వలితానలోజ్జ్వలశిఖాపర్యాకులఖడ్గకా
సరమత్తేభవరాహసింహచమరీశార్దూలముఖ్యాటవీ
చరదుర్వారభయారవాకులితమా శైలంబు వీక్షించుచున్. 51

శా. గోమంతంబున కీయవస్థ మనలం గూడం గదా కల్గెనా
హా మేలే యిటువంటిదుర్యశము బాహాశక్తిమీఱన్ నృప
గ్రామంబుల్ మడియింపలేమొ యనిశృంగం బద్రిశృంగస్థమై
యామత్తద్వీపకోటిలో దుముకుచాయం గుప్పునన్ సేనలోన్. 52

క. దుమికిన హలితో దుమికెం, గమలాక్షుఁడు ముసలనందకప్రముఖములౌ
విమలాయుధములుఁదోడనె, సమకూడెన్ మింటనుండి జను లరుదందన్. 53

క. ఈరీతి శౌరిసీరియు, ఘోరాయుధపాణు లగుచుఁ గ్రూరారిచమూ
వారణహయదారుణరథ, వారణలీలాపరానివారణభంగిన్. 54

క. చరియించుచు బలుఁదుద్ధతిఁ, గరముసలముచేత సమరకరులన్ ఖరులం
బరులం గరులన్హరులం, బొరలంగాఁ జేసెఁగదనభూభాగమునన్. 55

క. దరదుఁడను ధరణిరమణ, ద్విరదుని ముసలమునఁ గూల్చె విబుధారి చమూ
దరదుఁడు సంస్మితనవకుం, డరదుఁడు హలధారి దేవతలు మేలనఁగన్. 56

క. అంతజరాసంధుఁడు దు, ర్దాంతగదాదండతుండదారుణమదమా
దంతావళంబు రేవం, బంతంబునఁ గదిసి కామపాలుని బలికెన్. 57

మ. హలముం గైకొని దున్నగావలయుఁగా కాయోధనక్రీడకుం
బొలయన్ శక్తుఁడవే హలాయుధ రణంబున్ మాని మాభూమిలో
పల్లఁబాలెక్కుడు దున్నర మ్మటకు గోపాలుండవై తేని సం
బళమిత్తుం బసిఁగావు కావు ప్రతిభూపాలుండ వీ వాజికిన్. 58

చ. హలమున వచ్చుధాన్యముల కప్పటికప్పుడు దంచుకోఁగ రోఁ
కలిఁగయికొంటి వౌర యిటు గామిని గూలికి ధాన్యమెద్ది ప
ల్లెలఁబసిగాచుచున్నఁబనిలేదిఁకఁజక్రము శూర్పధారిగా
వలయును నీదుసోదరుఁడు వారిజనాభుఁడు రోహిణీసుతా. 59

వ. అనిన మాగధునకు హలాయుధుం డిట్లనియె. 60

మ. క్షితినాథత్వము లేదుగావునఁ బరక్షేత్రంబులం దున్నిలో
హితధారం బదనిచ్చి రాజమకుటీహీరావళీబీజసం
తతులం జల్లితిఁ గీర్తిసస్యములకై తద్వేళ యుష్మద్భుశా
కృతిపుల్ మొల్వఁగఁ గల్పితీయుటకునే నేతెంచితిన్ మాగధా. 61

తే. మాగధాధమ బహుధాన్యమర్దనమున, కేను రోఁకలి గైకొంటి నిదినిజంబె
యింకమీఁలోన గట్టిపా ల్లేరుపఱిచి, చెరఁగఁ జక్రంబె చాలదే శ్రీహరికిని. 62

శా. రారా మాగధ మానరా మదము తూత్రం బేదిరా నీకుఁ గై
వారంబుల్ సవరింపరా నృపసభన్ వారింపరా నీచమూ
వారంబు ల్పురిసేర ఘోరతరదుర్వారుండరా నేను గ
ర్వారంభంబులు పీడరా యన మదేర్ష్యామర్షదుర్ధర్షుఁడై. 63

చ. అటునిటుఁ బొంచి పొంచి మగధాధిపుఁ డొయ్యన నేటవాటుగాఁ
దటుకున వ్రేసె వేటు దనుదాఁకఁగ నీయకతట్టివైచియ
క్కుటిలు నురంబువైచె యదుకుంజరుఁడందునఁ గొంతనొచ్చియ
ప్పటుబలశాలి సందుగొని పార్శ్వమువేసెఁ దటానఁదప్పఁగన్. 64

వ. ఇవ్విధంబున మాగధహలాయుధులు గదారణప్రవీణులై పెక్కువిన్నాణంబులం బోరునెడ డస్సిన మాగధువధింప నుద్యోగింప మాగధవైరి వేతెయున్నాఁడు నీవు ప్రయాసపడవలవ దనినుడువు నాకాశవాణిపలుకుల కులికిపడు జరాసంధుం బ్రథమసంగరంబున దశకంధరు దయదలంచిన సింధుబంధనుం డగు రఘురాము చందంబునఁ గృపాభిరాముండై బలరాముండు వెఱవక పురంబునకరుగుమని జరాసంధుం బంచి యన్యరాజన్యులం బరాజితులంజేసి విజయలక్ష్మీవిరాజితుండై విజయసఖసమన్వితంబుగా ద్వారకాపురమునకరిగి సుఖంబుండె నంత.

మ. ఎలవంకన్ వలవంకఁ జక్రధరుఁడున్ వృష్ణ్యాదులౌ బాంధవుల్
నలువంకన్ మడిఁజంకచేతులిడి నానాభూపతు ల్గొల్వఁగాఁ
దలపంకం నెలవంకఁ గల్గు దొరచందానన్ ప్రభావాఢ్యుఁడై
కొలువయ్యెన్ నలువైహలాయుధుఁడు దళ్కుం గొల్వు కూటంబునన్. 66

తే. అప్పు డొకద్వారపాలకుఁడరుగుదెంచి, స్వామివిన్నప మొకటియెవ్వాఁడొ కాని
పుడమి జనులకు ముమ్మడిపొడవువాఁడు, నివ్వెఱఁగుతోడ వాకిట నిలిచినాఁడు.

క. దనుజుఁడు గాఁడునృపాలక, ఘనలక్షణలక్షితుండు గాఁడ మరుండుం
గనుతెప్పపాటుగలఁ దా, తనిఁ గని జను లదరిపాతెదరు పురిలోనన్. 68

చ. అదియునుగాక యొక్కధవళాంబుజలోచన వెంటవచ్చి యు
న్నది భువనైకమోహన మహాద్భుతరూపము కల్మి నిందిరా

సుదతియుఁదప్ప దీధరణిఁజూడము తాదృశరూపలక్ష్మి యా
త్రిదివములోన నైనఁగలదే యిఁక దేవరచిత్తమంచనన్. 69

క. ఎవ్వఁడొకో యని మదిలో, నివ్వటిలఁగ సంశయంబు నృపవరులన్నం
గవ్వడిచెలికాఁడని యెఱఁగ, నవ్వాచఁగృతపురుషుఁడౌట నాకుందోఁచెన్. 70

తే. ఎవ్వఁడైననేమి యిటకురావలె నన్నఁ, దోడితెమ్మటన్న వాఁడువోయి
తోడితేర నతఁడు దుస్సహాతనుదీప్తి, పెచ్చుఁగొలువుసేర వచ్చుటయును. 71

క. ప్రత్యుద్యతుఁడై యతనిం, బ్రత్యేకవరాసనంబు పై నిదియర్చా
కృత్యములుదీర్చి హలధరుఁ, డత్యుత్తమప్రీతి వినతుఁడై యిట్లనియెన్. 72

ఉ. వింటిరె మిమ్ముఁజూచినను విస్మయమయ్యెడు నాకునన్నఁగ
న్గొంటి మహాద్భుతంబు సమకూరెడు మీకును గాలభేద మీ
రెంటికి హేతువింక వివరించెద నా కథవిన్ము నాకభి
త్కంటకలుంఠనప్రవణకారణజన్మఫలా హలాయుధా. 73

సీ. ధర్మంబునాల్గుపాదంబులఁ జరియించు నేయుగంబునఁగుం టొకింతలేక
తోడ మాటాడుచుందురు బంధువులఁజోలి యేయుగంబున నాకనాయకులును
దనసాత్త్వికముదోఁప ధవళాంగుఁడై మించు నేయుగంబునను లక్ష్మీశ్వరుండు
నేవిఘ్నములులేక యెల్లవాంఛితములు వేయుగంబున ఫలియించుచుండు

తే. సత్కృతయుగమున కీర్తిహారి యగుచుఁ, బ్రబలు నానర్తమేదినీభర్తసుతుఁడ
పేరురైవతుఁ డంద్రు నాయూరు లవణ, జలధిలోపల దగుఁ గుశస్థలి యనంగ.

క. అనఁగృష్ణుఁడు రైవతకా, ఖ్యనగరమదె నీదుపేరఁగావించినదే
యలసర్వజ్ఞుఁడ వీవెఱుఁ, గనిది గలదె యటుల నేను గంజదళాక్షా. 75

క. అదియుండె వినుమునాకథ, హృదయాంబుజమధ్యమునను శ్రీహరిమధ్యం
బదిలముగ నిల్పిసలిపితిఁ, బదివేలేఁడులు మహాతపం బతినిష్ఠన్. 76

తే. అంతనైదేండ్లబాలిక నైపయోధి, కన్నె నాతోడనున్న రాకన్నె యనుచు
బ్రేమనుద్దాడుచుండితి రామ నాఁటి, యద్భుతప్రేమ యింతంత యనఁగరాదు.

తే. కడపట మతేమి యిటుసంటికన్నె గలుగ, వలయునంచును నాతపఃఫలము గాఁగ
నడిగితిని వెన్కఁ బ్రత్యక్షమైన లక్ష్మి, నటులదయజేసె నాయమ్మ హర్ష మొదవ.

క. తనయుల నూర్వురఁగంటిం, దనుసంభవ యొకతె లేమిఁ దటినీపరిణీ
తనయఁగ వేఁడితిఁదనయం, దనియఁగ లేకున్నఁ గోటితనయులనైనన్. 79

తే. ఆఁడుపడుచా యటంచు నత్యల్పముగను, మదినెఱుంగక కొందఱాడుదురు గాని
కన్యసామాన్యమే పుత్త్రుఁ గాంచెనేని, నుభయకులముఁ దరియింపనోపుఁ గాదె.

తే. అదివిని చెలంగె మత్సతి యటులుఁగాదె, యల్లుఁడని యాఁడుబిడ్డని యగవుతగవు
లంపకము శుభశోభనమని యివెల్ల, సంతసముఁ జేయుఁ గన్యకా జనములకును.

క. కొన్నాళ్లకు గర్భిణియై, కన్నియఁగనె సమద్వితీయ కరములు మొగుపం
గన్నజనుల్ శశిరేఖం, గన్నట్టిద్వితీయపోలెఁ గళఁ జెలువొందన్. 82

తే. చూచువారెల్ల నమ్మక్క చుక్కరీతిఁ, జొక్కమైయున్న దీకన్య చక్కఁదనము
నిక్క మెక్కడలేదని చొక్కిపడఁగ, రేవతీనామ మిడిరిఁ బుత్త్రికి మహాత్మ. 83

తే. ఏఁటఁ బెంచుదానిఁ బూటఁ బెంచెనటంచు, జనులుపల్కుపలుకు సత్యముగను
గన్నతల్లిమిగుల గారాబమునఁ బెంపఁ, బెరిఁగెఁ జైత్రలతిక పెంపుమీఱ. 84

సీ. అచ్చనగండ్లు దోయాలును డాఁగిలిమూఁతలు నాలుగుమూలలాట
గుజగుజరేకులు గుజ్జనగూళ్లును బొమ్మలపెండ్లిండ్లు నమ్మనములు
నత్తగోడలియాట నాలుమగనియాట తాటిచెట్టాట కోలాటములును
బింపిల్లిఁ జెండుగోరింపులు వామనగుంతలు వెన్నెలకుప్పలాది [లఁగూడి

తే. మఱియుఁ బుడికిళ్లు మొదలుగా మనసువచ్చు, నాటలన్నియుఁ దోడితోయ్యాలు
పడుచుఁ దనమున వేడుకపడుచు నాడు, ముద్దరాండ్రకు నల్లారుముద్దుగాను.

సీ. అయ్యయ్యయ్యయటంచు నెయ్యంబుమీఱఁగాఁ బలుమాఱుపైపక్కఁబడకయుంటఁ
జెల్లె బొమ్మలపెండ్లి చేసెదిందేటికిఁ జేయవైతివె యన్న సిగ్గుపడుట
దాదుల మనవి యత్నమున నాతోఁ దెల్ప నరుదెంచితివి యన్న మఱలిచనుట
యమ్మ యెవ్వరిఁ బెండ్లి యాడెదవే యన్న ముసిముసి నగవుతో మసలుటయును

తే. గరిగరికగాఁగ సుమనోమఁగలుగుటయును, బ్రేమమీఱంగ వన్నెలు వెట్టుటయును
గురులుగొప్పనఁగూడెడు కోమరువయసుఁ, దెలిపెనానాఁటఁ గన్యకాతిలకమునకు.

వ. ఇవ్విధంబునఁ గన్యకారత్నంబునకు మెఱుఁగుసానయుంబోలి యనన్యాదృశహావ
భావం బగుయావనప్రాదుర్భావం బగుటయు స్వయంవరంబు చాటించిన. 87

శా. సప్తద్వీపమహీపశేఖరసుతు ల్సౌందర్యరేఖాన్వితుల్
సప్తార్చిప్రతిమానతేజులు బిడౌజస్స్పర్ధిసంపద్భుజుల్
సప్తాశ్వక్షణదాకరాన్వయభవు ల్శౌర్యక్రియాశాంభవుల్
సప్తాంభోధిమణీవిభూషణధరుల్ చక్కఁ దెంతు రశ్రాంతమున్. 88

క. చంద్రానన యింద్రాకరా, జేంద్రకుమారునిని గోర దింతియ కాదా
యింద్రుని మెచ్చదు మఱియా, చంద్రుని మెచ్చదు విలాససంపదకలిమిన్. 89

ఉ. ఓయిగురాకఁ బోఁడి కనవో వినవో యిదియేమి చెల్ల నీ
ప్రాయపుతోయజాక్షు లెడఁబాయ రొకప్పుడు ప్రాణనాథులం
బ్రాయము రిత్తపుత్తురటె పల్కవె నీమదినున్న యట్టియా
నాయకుఁ దెల్పవే త్రిదశనాయకుఁ గోరినఁ దెచ్చికూర్చెదన్. 90

క. అని కన్నతల్లి వేఁడినఁ, జనవున నేవేఁడికొనిన సకులడిగిన నీఁ
డని వ్రీడనొడువకున్నం, దనయకుఁ బతినిశ్చయించు తలఁపు జనించెన్. 91

శా. సన్న్యాసంబునఁగాని మర్త్యులకుగాంచన్ రాక త్రైలోక్యమూ
ర్ధన్యంబై తగు బ్రహ్మలోకమున కేతన్మర్త్యదేహంబుతోఁ
గన్యారత్నముతోడ నేఁగి భవనాగ్రక్షోణి సంప్రాప్తసౌ
జన్యుండై మను ద్వారపాలకుఁడు వంచం బోవుచోఁ గొల్వనన్. 92

చ. మిళితగభీరమర్దళధిమింధిమినాదముఁ గిన్నరాంగనా
కులకలతానమానములు ఘుమ్మని వీనుల విందు సేయసం
కులసురసిద్ధసాధ్యమునికుంజరముఖ్యులఁ ద్రోచికొంచు లో
పలికటువోయి సంపడిని బాలిక యెంతయుఁ దత్తఱింపఁగన్. 93

క. ఒక యోరనిలిచి దివిష, న్ముకురాస్యల మంజులాస్యములఁ జూచుచుఁ గొం
డొకదడవుండితి నా నృ, త్యకళావైభవము లెన్నఁ దరమే మనకున్. 94

క. ఎక్కడఁజూచెనో యప్పుడె, వాక్కాంతుఁడు సూచి పిలువ వడిఁజని భక్తిన్
మ్రొక్కి నిలుచున్నఁ గన్నియ, నిక్కడి కేమిటికి దెచ్చి తివని యడుగన్. 95

శా. ఈయారాజు లటంచుఁ గొందఱికిఁ జేరేర్పాటు గావించి ధా
తా యిందేనృపమౌళి కిత్తుఁదనుజాతన్ దెల్పుమా కన్యకుం
బ్రేయుం డెవ్వఁ డటన్న నవ్వుచు వచోబింబాధరావల్లభుం
డేయేరాజులు నీవు దెల్పితివొ వారెవ్వారు లే రుర్వరన్. 96

తే. నీవువచ్చినవెనుకను క్షోణితలము, కృతయుగంబాది యిరువదియేడుమాఱ్లు
తిరిగె నాలుగుయుగములు దెలియవింత, వింతగాదిది యిదియొకవింత వినుము.

చ. మును వరమిచ్చుటం గలిమిముద్దియ ముద్దులకూఁతురయ్యె గా
వున నెటువారినేగతి ధవుండుగఁగోరు మురారి సీరియై
తనరెడు ద్వాపరంబునను ద్వారకలో హరి కిమ్ము పొమ్ము చ
య్యన నన వారిజాసనుని యంఘ్రులకున్ నతిచేసి గ్రక్కునన్. 98

వ. సత్యలోకంబు వెడలి తపోలోకంబుదాఁటి జనర్లోకంబు నిర్గమించి మహర్లోకంబు
గమించి నాకలోకసౌభాగ్యంబులు గనుంగొనుచు భువర్లోకంబు డిగ్గి. 99

సీ. తమతమనిత్యకర్మములు గావించుచు నధిపులఁగొల్చు బ్రాహ్మణులఁజూచి
దాయాదిపాళ్లకై తమలోపలనె పోరు నన్నదమ్ముల కలహంబుఁజూచి
పరులకుఁగలుగు సంపదలు జూడఁగలేక మతినీర్ష్య నొందు దుర్మతులఁ జూచి
పతులనొల్లక యన్యసతులఁగోరెడివారిఁ జేరఁగోరెడుకులసతులఁజూచి

తే. హ్రస్వదేహుల బధిరుల నంధకులను, రోగపీడితులను దరిద్రులను లోభ
వంతులను దుఃఖశీలుర వింతగాఁగ, ధరణిజూచుచు మిగుల ఖేదంబు పొడమి.

తే. వెనుకకాళ్లనె దాఁటులు వ్రేయుపాండు, వృషభమీక్షించి ముందటిరెండుపదము
లెవ్వియన నొప్పి వట్టిన దిందులోనఁ, గుడిపదంబని యతివల్క జడిసి యేను.

క. వచ్చితి నీద్వారావతి, కిచ్చటఁ గృత యుగముఁ బోలె నింపై నది నీ
వచ్యుతుఁ డవుటం గన్నియఁ, బుచ్చుకొనుము తపము సేయఁ బోయెదనింకన్.

చ. అని సుత నొప్పగించిన హలాయుధుఁ డెంతయుఁ బ్రేమమీఱఁద
ద్వనితగళంబుపై హలమువైచి యొకించుక వంచునంతలో
మనుపాడవైన యమ్ముదిత ముద్దుగ వల్లభు నంతమాత్రయై
తనరె విలాససంపదలు తద్దయుమించె విచిత్రవైఖరిన్. 103

సీ. జలజాక్షినగుమోము చంద్రుఁడు శారదపూర్ణిమాశశిఁ బోలె పొలుపుగాంచె
ముద్దియకమ్మకెమ్మోవిమాణిక్యంబు సానదీరినరీతిఁ జాయలూనెఁ
బద్మాక్షివలిగుబ్బ బంగారుకుండలు మెఱుఁగుఁబెట్టినఠీవి మెఱుఁగుసూపె
నంగనామణిమోహనాంగహేమశలాక పటికనార్చినరీతి బాగుమీఱె

తే. మఱియు వాసంతవేళఁ గ్రొమ్మావిలీలఁ, దొలకరినిమించు కేతకీదళము పోల్కి
వింతచెలువున రేవతీకాంత వెలసె, హలధరునియోగమాయామహత్త్వమునను.

వ. అంత గర్గాదిపురోహితు లారేయి వివాహ శుభముహూర్తం బున్నదని విన్న
వించిన నెంతయు సంతసంబున యాదవసార్వభౌముండు పురంబు నై సేయించిన.

సీ. రాజబింబాననల్ రాజవీథులఁజల్లు మలయజోదకముల జలకమాడి
మేలిమిమీఱంగ మేలుకట్టులుగట్టు రమణీయచీనాంబరములుగట్టి
కేవలరమ్యమౌక్తికరంగవల్లికాతారహారంబులు దనరఁబూని
కమనీయవిపణికా ఘుమఘుమాయత బహుపరిమళంబులు మేన హారుపఱిచి

తే. మానితవితానకుసుమదామములుదాల్చి, ప్రతిగృహద్వారరత్నదర్పణములందు
గాంచుచున్నెడ నాద్వారకాపురంబు, లక్ష్మియొప్పెఁ జతుర్విధాలంకృతులను.

వ. అంతట బలభద్రుండును మంగళతూర్య ఘోషంబులు మొరయ నభ్యంగన
స్నాతుండును జతుర్విధాలంకార సమేతుఁడును నై సమావర్తనాది వైవాహిక
శుభకృత్యంబులు నిర్వర్తించి కల్యాణవేదికాంతరంబున నున్నయెడ. 107

సీ. శిరసుమజ్జనమయి నెఱిగొప్పసవరించి యరవిరి విరవాది సరులుదుఱిమి
వలిపెచెంగావిపావడనిగ్గు లీనంగ జాళువాసరిగంచు చేలఁగట్టి
తిలకంబుదీర్చి చెక్కుల జవాదియలంది గుబ్బచన్దోయిఁ గుంకుమముఁబూసి
కట్టాణిముత్యాలకమ్మలు మొదలుగా నవరత్నమయభూషణములు దాల్చి

తే. నిలువుటద్దంబులోపల నీడఁజూచి, వ్రీడఁజెలియిచ్చుకపురంపువీడియంపుఁ
గెంపుకెమ్మోవి కొకవింత సొంపునింప, రేవతీకాంత యభినవ శ్రీఁజెలంగె. 108

తే. రేవతీకాంతఁ దోఁదెచ్చి రైవతాఖ్య, భూమిపాలుఁడుమధుపర్కపూర్వముగను
రామునకు ధారవోసిన రామకేలు, వట్టెబలరాముఁ డెంతయుఁబ్రమదమునను.

క. అప్పుడు పువ్వులవానలు, దెప్పలుగాఁగురిసె మ్రోఁగె దివిదుందుభులుఙ్
ముప్పిరిగొను మోదంబున, నొప్పిరి జను లెల్ల నమ్మహోత్సవవేళన్. 110

వ. ఇవ్విధంబున సకలసంభ్రమంబులు గలిగి వెలయు రేవతీబలరాములవివాహమ
హోత్సవంబు కన్నులపండువుగాఁ జూచి వైవాహికదినచతుష్టయానంతరం
బున రామకృష్ణానుజ్ఞాతుండై రైవతకమహీపతి బదరికాశ్రమంబునకుం దపంబు
సేయం జనియె నంత. 111

మ. కళుకుస్ముత్యపు గచ్చుసౌధముల సింగారంపుఁబూఁదోఁటలన్
జలధిప్రాంతరకాంతసైకతములన్ సౌవర్ణగేహంబులన్
నెలఱాతిన్నెలఁ దూగుటుయ్యెలల మాణిక్యంపుసౌధంబులన్
బలుఁ డారేవతిఁగూడి క్రీడసలిపెన్ భావంబురంజిల్లఁగన్. 112

సీ. అదివింత యిదివింత యని రిత్తచూపుచు సొలపుఁజూపులసారెఁజూడనేర్చెఁ
జెలిమితోఁ బయ్యెదచెఱఁగుదెమల్చుచు విడుమంచు నొయ్యన నుడువనేర్చె
నరవింద మందు కొమ్మని కేలు పొడవెత్తి వలిగుబ్బ లురమున నలమనేర్చె
నధరబింబముఁజూరుక్కన నొక్కి కిన్కతో మినుకుఁ జెక్కిలి గోట మీటనేర్చె
తే. సొంపుమీఱఁగఁగళలంటి సొక్కనేర్చెఁ, గూడి రతికేళి వేడ్క నోలాడనేర్చెఁ
గూర్మిఁగొసరుచు నంతఁబైకొనఁగనేర్చె, నెఱతనంబున రమణుఁ డన్నియునుసతికి.

క. కతిపయదినములలోపలఁ, జతురతఁబ్రౌఢత్వమొంది జవ్వని యొకనాఁ
డతిముదమున రైవతక, క్షితిధరమున మెలఁగుచుండి చెలువున కనియెన్. 114

సీ. మును పిందుఁగదళికావనరాజి చెలువొందుఁ బందిటిద్రాక్షలఁబ్రబలెనిప్పు
డీకానలోపల నేఁగాననీకాన నెంతగాబలిసెఁ బ్రాణేశకంటె
యమృతోపమానంబు లాదొనయంబువు లనిశంబు మాతండ్రి కదియప్రియము
పొలుపొందె గొజ్జంగి పూఁదేనెకాలువ నీవు దీర్పించితో సిన్న నేఁడు
తే. మొన్నఁజూచిన యటువలె నున్న దపుడె, యింతలోపలనే యెంత వింతపుట్టె
ననుచుఁ బలుకంగ బెడబెడలైనగంబు, గదల రేవతి ప్రాణేశుఁ గౌఁగిలించె.

చ. వెఱవకు మంచుఁ దేర్చి యదువీరుఁడు నల్లడఁ జూడగట్టురా
పఱిగట నిల్చియన్నగము బాహులఁ నూపుచు మంచుగట్టునా
మెఱయు కపీంద్రుఁజూచి తరమే ధరమెత్తఁగ నెవ్వఁ డీవురా
యెఱుఁగవె రామ నన్ వనచరేశ్వరుఁడన్ ద్వివిదుండ శూరుఁడన్. 116

క. తరమే పెకలింపఁగ నీ, గిరియంటివి మునుపు జానకీపతిపనుపన్
శరనిధిగట్టఁగఁ దెచ్చిన, గిరులశిఖర మాత్ర మింతగిరియే యిదియున్. 117

క. నాసఖుఁడగు నరకాసురు, శాసించెను శౌరి గాన శైలముతోని
న్నాసంద్రంబున వైచి ము, రాసురరిపుతోడ ముంతు నట ద్వారకయున్. 118

క. అని మాటలాడుచునె యా, ఘనశైలం బగలఁజేయఁ గని హరికినుకం
తనముసలంబున వ్రేసిన, వనచరపతి శిరమువగిలి వసుమతిఁగూలెన్. 119

వ. ఇవ్విధంబున ద్వివిదు వధియించి యెప్పటిలీల బాలికామణిం గూడి కేళీనీరమణి
కేళికాలోలుండై విహరించుచు హలామనోహరుం డొకనాఁడు పూర్వాను
భూతగోపికలం దలంచి కృష్ణానుమతంబున నందవ్రజంబున కొక్కరుండ చని
చుంబనప్రతిచుంబనాలింగనమృదుభాషణంబుల నందయశోదాశ్రీదామోపనం
దాదిబంధువులకు సంతసంబు సేయుచు జరాసంధాదిపలాయనంబు నొడువుచుఁ
బ్రొద్దు గడుపుచున్న యెడ. 120

సీ. మధుమదాకులహలాయుధవిలోచనలీల నరుణుఁడై యరుణుఁ డస్తాద్రిఁ జేరె
వరుణుండు వారుణీవరుని కీవచ్చు చెంగావి నా సాంధ్యరాగంబు మెఱసె
హలిహలాకృష్టయై యమునయాగతి నుండు ననురీతి నిండె గాఢాంధకార
మాతమోయమునపై నలరారు దెలికల్వవిరులునాఁ జుక్కలు విరివి గొనియెఁ

తే. గలితనీలాంబరుండును గామపాలుఁ, డమలపర్ణుండు రేవతీరమణుఁ డగుట
రాముపోలికలోకాభిరాముఁ డగుచు, సోముఁ డుదయించె సురసార్వభౌమదిశను.

తే. పాంథజనములు గొమ్మలప్రాపుఁ గోర, సొరిది నొండొంటి లతకూనలొరఁగిపడఁగ
ధరణిచక్రంబు మిగుల సంతాపమంద, నడరె రేయెండ లప్పు డత్యద్భుతముగ.

వ. అట్టిపండువెన్నెల నయ్యేకకుండలుండు గోపికాపుండరీకనయనల సంకేతంబులఁ
గూడుక యమునాతీరంబునకుం జని. 123

సీ. కలికి యీపొదరింటఁ గాదె నీవూరకె కినిసి నా చేత మ్రొక్కించుకొనుట
తెరవ యీద్రాక్షపందిటఁ గాదె నడికిరే యనివచ్చి నీవు నన్నేలికొనుట
మెలఁత యీగుజ్జుమామిడినీడఁ గాదె చిల్కలుపల్కఁ జెలులంచు నులికిపడుట
వనిత యీకదళికావనిఁ గాదె దళపీజనముచే రతాంతరశ్రమ ముడుపుట

తే. దలఁచుకొందువె యీసైకతమునఁ గాదె, నానఁ బైకొనకున్న నోచాన మంచి
దత్తతోఁ జెప్పి కొట్టింతు ననిన జడిసి, నీవు నాకోర్కి దీర్చుట నీలవేణి. 124

క. అని యిష్టాలాపంబుల, వని దిరుగుచు మద్యపానవాంఛ జనింపన్
వనితామణులుం దానును, గొనియెన్ మదిరారసంబు గుత్తుకమోవన్. 125

సీ. అలవోక తెప్పవేయక చూచుచును దెల్పె భామయోర్తు సురానుభావపటిమఁ
గాంతు నేరము ద్రోచి కౌఁగిలించుచుఁ దెల్పె నాతియొక్కతె ప్రసన్నాతిశయముఁ
దలయూఁచి చొక్కుచుఁ దలపించె నొకపంకజానన గంధోత్తమానుభవము
పరిహాసబహుళోక్తి ప్రకటించె నట నొక్కకంబుకంఠి యిరాతికౌశలంబు

తే. హసనకుసుమంబు లందంద నెసఁగఁ జేసి, వనితయొక్కతె మధువైభవంబు సూపెఁ
గన్నుఁగవయందు సాంధ్యరాగంబు మొనయఁ, గాంతయొక్కతె వారుణీగరిమ నెఱపె.

మ. తళుకుంగుబ్బలపైఁట వ్రేయ మని కాంతల్ దూఱ హాలామదా
కులితస్వాంత యొకర్తు వేగజిలుగుంగుచ్చెళ్లకొం గెత్తి గు

బ్బలపైఁగప్పిన చేలు దెల్పుజఘనవ్రాతంబు వీక్షించి యో
చెలువా సిగ్గరి వౌదువంచు నగియెం జిత్తేశ్వరుం డింపునన్. 127

తే. కొదమగుబ్బల తావికుంకుమముప్రాఁత,విభుఁడు చెంగావిఱవికంచువిడువఁబోవఁ
గొసరుఁజూపులఁదప్పించుకొనుచునొక్క, కలికివెన్నెలఁబైఁటగాఁగప్పుకొనియె.

సీ. ఓయత్త చిలికితి నూరకె నన్నేల కొట్టెద వనియొద్దుకొనియె నొకతె
మగఁడు వచ్చెనటంచు మచ్చికఁ గట్టుకొం గెడలించి తమిఁ బడుకిచ్చె నొకతె
యొకసురాఘటి నెత్తినుంచి చల్లోచల్ల యంచును వనవీథి కరిగె నొకతె
యెలనాఁగ బలరాముఁ డేలరాఁడాయెనే యని సారెముచ్చట లాడు నొకతె
తే. తోడికోడ లటంచును దోడిచెలిని, దబ్బఱలెతిట్టె నొక్కతె దానిఁ దనదు
కోడలంచును జెక్కిలిగొట్టె నొకతె, మదిరసొక్కిన గోపికామానవతులు. 129

మ. మదిరాపానవిఘూర్ణమానసయనున్ మత్తద్విరేఫాలకున్
వదనాంభోరుహగంధలుబ్ధమధుపవ్యాఘూతలోలద్భుజాం
గదుఁ గర్ణోజ్జ్వలవజ్రకుండలు వలగ్నప్రస్థనీలాంబరున్
మదధామున్ బలరాముఁ జూచి వ్రజభామారత్నము ల్వేడుకన్. 130

మ. తళుకుం జెక్కిలిముద్దుకెంపుజిగినిద్దాకమ్మకెమ్మోవి తే
నెలు నాలింగన మంగనాజనము లెంతేవేడ్కతో నొందొరుల్
పలుమాఱుం దగ మార్చికొంచు సుఖయింపన్ వారితోఁగూడి యా
బలభద్రుండును గ్రీడసల్పుచు ననల్పంబైన దర్పంబునన్. 131

ఉ. వారివిహారముం జలుప వాంఛ జనించెను జేరరాఁగదే
వారిజమిత్రపుత్త్రి యనివాకొనిపిల్చిన ఫేనహాసము
ల్మీఱఁగ నెంతలేదనుచు మించి చనన్ యమునాస్రవంతిక
న్నారఁగఁజూచి యల్కను హలాగ్రమునం బెకలించె నత్తటిన్. 132

వ. ఇవ్విధంబున గోధుగ్వధూసవిధంబున నేధమానసమధికక్రోధధనంజయక్వథితన
యనపథుం డగుచు హలాయుధుండు నిర్ణిరోధపాథఃప్రవాహధామనిధితనూ
భవారోధంబు విశ్లథంబుగావించి శతధాప్రవహింపంజేయుసమయంబున. 133

సీ. కోకజక్కవగబ్బిగుబ్బచన్నులమీఁద దరగపయ్యాదకొంగు పొరలిపడఁగఁ
దమ్మికన్నుల మరందపుబాష్పములు చింద గరుకంపుతేఁటిముంగురులు చెదర
జలపక్షిమేఖలాకలకలధ్వనిమించ సైకతజఘనంబు సంచలింప
నబ్జపాదంబుల హంసకంబులు మ్రోయ బెళుకుబేడిసచూపు బిత్తఱింప
తే. నృపబలాకృష్ట పరమృగీనేత్రఁ బోలి
హలికరాకృష్టవేణియై జలనినాద
నటన మొరయుచు యమునబృందావనంబు
నందుఁ బ్రవహించె వ్యాకులితాత్మ యగుచు. 134

తే. అంత భయమునఁ గాంతయై యమునచేరి, సీరికి వినమ్రయై కటాక్షింపు మన్నఁ
దగునె కులసతిమార్గంబు తప్పినదువఁ, బరులు నవ్వరె రేవతీప్రాణనాథ. 135

చ. అలుక శమించి నాపయి హలాయుధ తావకలాంగలాగ్రని
ర్దళితవికీర్ణమత్తటనితంబములన్ నఖరేఖలట్లు నీ
హలముఖరేఖలం గని వయస్యలఁ బోలుసపత్నులెల్లఁ బాం
సులవయిఁ దంచు నవ్వెదరు శుద్ధపయోజనిభాంచలంబునన్. 136

చ. జలనిధి యేమియంచనునో చయ్యనఁ బోవలెఁ దోడిచేడియల్
నిలువకపోయి రేపగిది నింద గడింతురొ యంచు వేఁడినన్
బలుఁడు దయాళుఁడై భువనపావని యేమిటి కింతమాట నీ
చెలువునిఁ జేరుమంచుఁ బనిచెం గని చెంతలవారు మెచ్చఁగన్. 137

తే. కొదమరాయంచ జవరాండ్రగుంపుతోడ, సరసివిహరించు రాజహంసంబుఁబోలి
గోపికాహంసయానలఁగూడియాము,నాంబువులఁ దేలెయదురాజహంసమపుడు.

క. ఈరీతిఁ గొన్ని దినములు, నారీతిలకములఁ గూడి నందవ్రజసం
చారముల నలరి యంతట, ద్వారావతిఁ జేరెఁ గృష్ణదర్శన రతుఁడై. 139

వ. అంతట. 140

సీ. వలపుమీఱఁగ స్వయంవరమహోత్సవమున లక్షణకన్య బలంబు మెఱసి
కొనివచ్చుసాంబుని గినిసి పట్టుకచున్న కురుకుమారులఁ గని క్రోధమునను
బదఘట్టనల మహీభాగ మట్టిట్టుగా నలసీరి వడిఁ జేరి హస్తిపురము
ఘనసాలమూలంబునను లాంగలమునఁ గ్రుచ్చి పెకలించఁ బెళపెళఁ బెకలి పురము

తే. యమునకై యొడ్డగిల భీతి సాంబుతోడ, లక్షణాకన్య నర్పించి యాక్షణంబె
చేరిమ్రొక్కుసుయోధను చెలిమి మీఱఁ, గౌఁగిటనుజేర్చె రేవతీకాంతుఁడంత.

తే. అవని యొక్కెడఁ దె సాంబుకల్యాణవేళఁ, బెల్లగిలె నట్టిదేవుని పేరివాని
పెండ్లి కొకపట్టణంబైనఁ బెల్లగిలదె, యనుచు భీష్ముఁడునగియెఁ దాలాంకుఁజూచి.

వ. అంత హస్తినాపురప్రవేశంబుచేసి సాంబునకు లక్షణకన్య వివాహంబుచేసికొని దుర్యోధనుం డరణంబుగా నొసంగు శతాంగమాతంగతురంగమణిమయభూషణాంబరకోటులఁ గైకొని ద్వారవతి కరుగుదెంచె నిప్పుడు నాహస్తినాపురంబు యమునానది కొడ్డగిలినట్లె యున్నది బలదేవు భుజాబలంబు సన్నుతింప నెవ్వరి తరం బదియునుంగాక నింకనొక్క విచిత్రంబు వినుము. 143

సీ. అలభోజపురమున ననిరుద్ధునకు రుక్మవతిఁ బెండ్లిచేసి తర్వాత రుక్మి
ద్యూతంబు దలపెట్టి యొడ్డిన యొడ్డెల్ల గెలిచి హలాయుధు గేలిచేయఁ
జేసచ్చినట్టిపాచికలు గావునగెల్చె దవివలదని వేతె యక్షములను
గ్రీడించు హలిగెల్చు గెలుపులన్నియు రుక్మి కావనిపలుక నక్కడిజనంబు

తే. వానినేఁగూడ నాకాశవాణి యపుడు, బలుఁడు గెల్చె నటంచన నలిగి బలుఁడు
రుక్మినష్టాపదంబున రూపణంచి, పరనృపాలురఁ గెలిచె దోర్బలము మెఱయ. 144

మ. జనకక్షోణివిభుండు భక్తుఁ డగుటన్ సౌహార్ద్రవింపొందఁగాఁ
జని తత్పట్టణవాసియై యతనిచే సంపూజితుండై సుయో
ధనుఁ డచ్చోటికి వచ్చి శిష్యుఁడయి పాదద్వంద్వ సంవాహనం
బొనరింపం దెలిపె న్గదాకదననానోపాయము ల్మక్కువన్. 145

క. కురుపతి శిష్యుం డయ్యెన్, హరిపక్షము పాండుపుత్త్రు లనితలఁపుచుఁ దా
నిరువురఁ గలయక తీర్థా, చరణంబున కరిగె సీరి సమరమువేళన్. 146

వ. అరిగి యశుభతిమిరవిభాకరప్రభాసముదంచితం బగుప్రభాసతీర్థంబునఁ గృత స్నానుండై నిజవిలాసనసముదితసరస్వతి యగుసరస్వతీతటిని మునింగి గగనర మాకబరీసుమనఃకోరకాయితబిందుసరం బగుబిందుసరంబున నవగాహనంబు చేసి కలుషభూధరవజ్రధరం బగువజ్రతీర్థంబున మజ్జనంబొనర్చి రామాదిభూగామేశ తటస్థాపితమాసరయూపం బగుసరయూనది నాడి దురితలతానివారణాసి యగువారాణసిం జేరి యచ్చట. 147

మ. కని యెన్ రాముఁ డభంగమంగళతరంగన్ రంగదంభోధిలం
ఘనసంప్లావితదేవమానవభుజంగన్ జంగమాఘచ్ఛటా
ఘనసైకతక్షమదివ్యనామశతసంగన్ సంగరాసింధుబిం
బనభశ్చారితరూప మానసుషమాభాగంగ గంగానదిన్. 148

వ. కని వినయభక్తిపూర్వకంబుగా నమస్కరించి. 149

మ. సవరించెన్ యమునాభమాధవు సరస్వత్యాభపద్మోద్భవున్
భవదీయచ్ఛవిశంభు నైక్యమగుటం బ్రత్యక్షమా బ్రహ్మమీ
వె వివేకాఢ్యుఁడు నీయెడం దనువు వేఁ వీడ్కొన్నచో బ్రహ్మయో
గవిశిష్టాత్ముఁడవోలె ముక్తిఁ గను గంగా సర్వముక్తిప్రదా. 150

వ. అని నుతియించి స్నానదానంబులు చేసి ముముక్షుజనశరణ్యం బగు నైమి శారణ్యంబున కరిగి తన్నుంగని ప్రత్యుత్థానంబు సేయని ప్రతిలోమజాతు సూతు ముసలాఘాతంబున గతజీవితుం జేసి మునిప్రార్థితుండై పురాణార్థవేది పునర్జీవి తుంగాఁ గటాక్షించి సవనాంగణకల్పిత మునిజనరక్తపల్వలుండును నిల్వల తనూభవుండు నగు పల్వలు వధియించి మునిజనసంస్తూయమానుం డగుచుఁ బ్రశంసాపరకాశిక యగు కౌశికం దీర్థమాడి ప్రతిదినకల్పిత విప్రయాగం బగు ప్రయాగంబున కరిగి కృతమజ్జనుండై సంశ్రితాపాశ యగువిపాశను గోకనద శోభాశోణ యగుశోణంబునం గృతమజ్జనుండై తరువిజితమహేంద్రనగం బగు మహేంద్రనగంబున నిశ్చలసమాధిలీలాసమావృత రేణుకాయుని రైణుకేయుని

దర్శించి కృతమజ్జనా గోదావరీతి వెలయు గోదావరీతీరంబు చేరి కృతప్లావనుండై
వినతశ్రీశైలబిలపాతాళాధిష్ఠితం బగు శ్రీశైలంబు దర్శించి వేంకటాచలంబున కరిగి.

సీ. జాతికిరీటపచ్చలకిరీటముడాలు ఖంజరీటంబుల ఫుంజి దెలుప
మకరకుండలమరీచికగండమండలి మండలీనాట్యసంభ్రమముం జూప
గరశంఖచక్రము ల్వారచక్రతిమిరవారణచక్రరిపుహితప్రౌఢి మెఱయ
రమణీయపీతాంబరప్రభాడంబర మంబరంబునకు హేమంబు నెఱప

తే. వక్షమునఁ గౌస్తుభంబు శ్రీవత్సతులసి, దామముల కాంతియును సముద్దామలీలఁ
గలసి కుంకుమకస్తూరికల ఘటింప, మెరసి కొలువుండు వేంకటేశ్వరునిఁ గాంచి.

సీ. సదయవీక్షాచకచ్చకలవీక్షావని గనుపట్టు వీరరాఘవునిఁ గొలిచి
త్మా కాంచి యనమించు కాంచీపురంబులో విలసిల్లు వరదరాజులభజించి
యుభయకావేరీమహోజ్జ్వలా శ్రీరంగధాముని శ్రీరంగధాముఁ బొగడి
దక్షిణద్వారకాస్థలరాజమునను గృపాళుఁడౌ రాజగోపాలుఁ జూచి

తే. దర్శనంబున బ్రహ్మహత్యాసువర్ణ, మోషణాదిమహాదోషములు దొలంగఁ
జేయుటకు హేతువౌ రామసేతువునను, మునిఁగి రామేశ్వరునిపదములకు మ్రొక్కి.

తే. ముత్యములు పండు నదిలోన మునిఁగి మించి, గందపుంగొండయందున గస్త్యమౌని
భర్గు సేవించి కన్యాఖ్య దుర్గ గాంచి, భక్తి గోకర్ణనాథునిఁ బ్రణుతి సేసి. 154

తే. అంత మాహిష్మతీపురి కరుగుదెంచి, భక్తి మను దీర్ఘమాడి ప్రభాసమార్గ
మునను సీరి కురుక్షేత్రమునను గాంచె, యోధమానుల భీమదుర్యోధనులను.

క. కాంచి దయ న్వాలదనివా, రించుచు వినకున్న శ్రీహరిప్రహితుండై
కాంచనమణిమయభవన, ప్రాంచితమగు ద్వారకాపురంబున కరిగెన్. 156

సీ. బలదేవుఁ డొకనాఁడు పద్మాక్షుతోఁ గూడ ధర్మనందను సభాస్థలికి వచ్చి
యిష్టగోష్ఠిని వసియింప నారదమౌని యరుదెంచి సత్కృతుఁడై వసించి
బకుని హిడింబుఁ గీచకుని జరాసంధు రారాజు గెల్చి విక్రమము మెఱసె
ఘనుఁడు గదాయుద్ధమునను భీముఁడు బలదేవున కొరునకు దిగుడుగాని

తే. యనిన నటులేల హలిసరి వెనఁగలేనె, యనిన భీముని గనుఁగొని కినుకవొడమి
సీరి గదదిక్కుఁ జూచినఁ జిత్తమటుల, నైన నాకోర్కె ఫలియించె ననుచు లేచి.

క. భీముఁడు గదఁ గైకొనినన్, రాముఁడు గదఁ బూనెఁ గ్రోధరక్తాక్షుండై
యామేటిమగలఁ గనుఁగొని, భూమీశులు మిగుల వెరఁగుఁ బొందుచుఁ దమలోన్.

సీ. కలహాశి యిప్పు డెక్కడనుండి వచ్చె నీయన్యోన్యరణమున కనియె నొకఁడు
గురుఁడు గాఁడే సీరధరుఁ డధికుండన్నఁ దనకేల యీరోస మనియె నొకఁడు
ఇతనిశిష్యుఁడు కురుపతి గెల్వఁడే సీరికిని సరిపోఁడా యనియె నొకఁడు
నదియేటిమాట తాలాంకులోపల సహస్రాంశంబుఁ బోలలేఁ డనియె నొకఁడు

తే. వలదు బలభద్రుతో నేల కలహ మనుచు, బుద్ధికొలఁదిని సమవర్తిపుత్రముఖులు
దెలిపి వినకున్న నూరకె నిలిచి రంత, నురివి బలభీమసేను లొండొరులఁ దాఁకి.

ఉ. ఆర్పుల నట్టహాసముల నబ్జభవాండము పిక్కటిల్లఁగా
దర్పము మీఱఁ బోరుమదదంతులఁ బోల్కి యుగాంతలోకభి
ద్దర్పకవైరిరోషమున దారుణులై యరుణాయతాక్షులై
నేర్పులుమీఱఁ బోరి రతినిష్ఠురమైనగదారణంబునన్. 160

క. తనశిష్యుండైనసుయో, ధను జంపెనటంచు మిగుల దారుణమగు కి
న్కను గొట్టె బలుఁడు భీముని, ననిలసుతుం డతనిగురుఁ డటంచుం గొట్టెన్.

క. బలుగదపెట్టున భీముఁడు, కులిశాహతిఁ గొండఁబోలి గులగులలగు న
బ్బలుఁ డనిలజుగదపెట్టున, నలరు సరిఁ వింధ్యమట్టు లలుకఁడు కడిమిన్. 162

ఆ. చేరి మూఁడునాల్గు చేతులు వెడలిన, యంతలోన నలసి యనిలసుతుఁడు
చెదరి యదరి చాలపెదవులు దడుపుచు, స్రుక్కి నాల్గుదెసలు చూడఁదొణఁగె.

క. అప్పుడు విడువక వ్రేసెం, గుప్పున నడునెత్తిపగులఁ గుదిగొని వెడలెం
గప్పెఱ నెత్తురు భీమున, కప్పాండవలోచనముల నశ్రులుతోడన్. 164

సీ. కన్నీళ్లు వఱదలై కాఱఁగాఁ గుంతియు ద్రౌపతి యొకచోటఁ దల్లడిల్ల
మునుపు నేఁజెప్పిన వినఁడాయెఁ గార్యంబు దప్పెనంచును ధర్మతనయుఁ డడలఁ
జూచి యుపేక్షచేసుక యున్న నాయమా కృష్ణాయటంచుఁ గిరీటి నుడువ
ధౌమ్యాదు లింతక్రోధం బేలశిష్యుపై నంచు నక్కడనుండి యభినుతింపఁ

తే. గినిసి యెవ్వరు చెప్పిన వినక భీముఁ, జంపఁగడఁగెడు యాదవసార్వభౌము
కేలు గదఁ గూడబట్టి శ్రీకృష్ణుఁ డప్పు, డేల వల దన్న కోపంబు చాలునన్న.

క. హరి వాక్యామృతధారం, బరుషరుషానామదావపావకుఁ డాఱం
గరుణించి విడిచె లాంగలు, ధరుఁ డనిలకుమారుఁ బాండుతనయులు చెలఁగన్.

క. కళవట్టిపడిన భీముఁడు, దెలిసెఁ హరికరుణ నంత దేవుఁడ నిన్నుం
దెలియక పోరితి నేరము, గలదనఁగా భీము సీరి గౌఁగిటఁ జేర్చెన్. 167

ఉ. పుణ్యము శౌనకాదిమునిపుంజశరణ్యము నైన నైమిశా
రణ్యమునందు నొక్కమఖరాజ మొనర్చెను రేవతీసతీ
మణ్యభిరాముఁడై బలుఁ డమానుషవైభవముల్ జగత్త్రయీ
గణ్యములై తనర్ప జనకాంక్షితము ల్దయసేయఁజాలుచున్. 168

తే. సాంగదక్షిణ లొసఁగి యజ్ఞంబుచేసి, యవభృథస్నాన మొనరించె నతివఁగూడి
సకలబంధుజనములతో సంభ్రమమునఁ, గలుషతిమిరహరుండు లాంగలధరుండు.

సీ. ధగధగద్ధగితరత్నకిరీటకాంతులు పదివేల సూర్యబింబములు దెలుప
ధళధళద్వజ్రకుండలకాంతిమండలి గండమండలమున మెండుకొనఁగఁ

జలచకజ్జలదమేచకకటీరపటాంచలము భుజాగ్రమ్మునఁ గొమరుమిగులఁ
గలకలక్వణితకంకణముఖ్యనవరత్నమయభూషణములు నెమ్మెయిఁ దనర్పఁ
తే. బుష్పవర్షంబు సురదుందుభులరవంబు, బ్రహ్మరుద్రాదినిర్జరప్రణుతు లలర
బ్రహ్మరథమెక్కి రేవతీప్రాణభర్త, ద్వారవతిచేర వాలించె వైభవమున. 170
క. ఇది బలరామచరిత్రం, బిది దురితలతాలవిత్ర మిది యతిచిత్రం
బిది భక్తియుక్తివినినం, జదివిన జనుఁ డిందునందు సౌఖ్యముఁ జెందున్. 171
క. మును బలునిచరిత దెలిపిన, వెనుకన్ కృష్ణుకథ నీకు వినిపించెదనం
టి నరేంద్రా యిపుడది విను, మని ముసిపతి దెలుపఁ దొణఁగె నధిపతితోడన్.





# శ్రీ కృష్ణావతారము.

శా. శ్రీమత్కృష్ణవలాహకంబు సుమనశ్శ్రీదాయియై దేవకీ
శ్యామాభ్రంబునఁ బుట్టె శ్రావణమునన్ సద్యోగళత్తాపథా
త్రీమానుష్యముపైఁ గృపామృతము వర్షింపన్ నిజోరఃస్థల
శ్రీమించం దులకింప నిచ్చ సురభేరీగర్జన ల్మీఱఁగన్. 1
సీ. కమనీయదేవకీగర్భసంభవుఁ డయ్యు రోహిణీసంభవరూఢిగాంచి
దీప్యమానధరావతీర్ణుఁ డయ్యు నభోవతీర్ణవిఖ్యాతిచేఁ దేజరిల్లి
కృష్ణపక్షమున భ్రాజిష్ణుఁడై కలిగియు శుద్ధపక్షమునఁ బ్రసిద్ధిగాంచి
యిందిరాలింగితహృదయుఁ డయ్యును రేవతీనాథసహజనిస్థితి వహించి
తే. చంద్రదశదెల్ప ముఖము త్రిస్థానభాను,కరణి గనుపట్టు తేజంబు గురుము ఖేచ్ఛ
హేతువై దివ్యకారుణ్యదృష్టి వెలయ, శౌరి దనరారె సూతికాసదనమునను. 2
తే. ఘనమనోరంజక కరంజకప్రవాళ, మంజురుచిబాలుఁ గనుఁగొని మంత్రసాని
సమ్మదముపూని శూర్పానిల మ్మొనర్ప, బొడ్డు గోయఁగఁజూడ నద్భుతముగాఁగ.
సీ. మొలిచెఁబొక్కిలిచక్కిఁదొలుపల్కుఁనుమ్రోయునలుమోముతుమ్మెదగలుగుతమ్మి
పొలిచె మస్తమ్మున భూరిరత్నప్రభాపాళిలాలితకోటిహేళిమౌళి
నిలిచె హస్తంబుల నిఖలదైతేయభయంకరోదగ్రపంచాయుధములు
వలచె వక్షంబున వైజయంతీదామశోభితతులసీప్రసూనపటలి
తే. మఱియుఁగంకణకేయూరమకరకుండ,లాదిమణిభూషణములు హేమాంబరములు
జారుతరమైన మేనితేజంబుమీఱి, శౌరి పురుటింటిలోన సాక్షాత్కరించె.

తే. అప్పు డాశ్చర్యమును మోద మతిభయంబు, వెనుకొనఁగ మంత్రసాని వేవేగవచ్చి
యవలికడను నవమోనమోయనుచుఁ గాచి, యున్న వసుదేవుఁ గన్గొనియుల్లమలర.

సీ. వెడఁదకన్నులవాఁడు వెడఁదమానికెపుతా వెడఁదకన్నులమిన్న నిడినవాఁడు
నీలకాయమువాఁడు నిద్దంపుఁ తెగుల్కు నీలకాయమువేల్పు మేలువాఁడు
కేలిచక్రమువాఁడు కితవులమన్నించు కేళిచక్రముఁ ద్రోవఁ జాలువాఁడు
వన్నెమించినవాఁడు చిన్నంపు పదియాఱు వన్నెమించిన వల్లెవాటువాఁడు

తే. దేవదేవుఁడు దేవకీదేవిగర్భ, జలధి జనియించె సంపూర్ణచంద్రులీల
నేమి తపమాచరించితో యీవు పూర్వ, మునను వసుదేవపాలితభూమిదేవ.

క. అని తెలిపిన వసుదేవుఁడు, విని రొదవల దనుచు ననుచు వేడుకతో డక్ష
జని లక్ష్మివిభుఁ గన్గొని, కనుఁగవ నానందబాష్పకణములు దొరుగన్. 7

చతుష్కంధము. శ్రీవాసుదేవప్రియస, ద్భావావేదాంతవాదఫలితామోదా
సేవింతు నిన్ను మునికృత, సేవా శ్రితసుప్రసాద శ్రితబహుభేదా. 8

క. పటుమతి ననుమానోక్తిజ, ఘటియింతు "జగత్సకర్తృకం కార్యత్వాత్
ఘటవత్త" ని తాదృశునిను, నిటువలెఁ గాంచితిమి చిత్ర మేమనవచ్చున్. 9

తే. అనిపొగడశౌరిదయమీఱియాదివృత్త, మంతయును దెల్పిభావివృత్తాంతములును
దెలిపి యెప్పటిబాలునిచెలువుగులుక, శయమునను బూనెవటపత్రశాయితండ్రి.

క. విడికెంపుపడగగొడుగులు, కడువేడుక శేషుఁ డూనఁ గాళిందియు గా
ల్నడగాఁగ నరిగి నందుని, పడఁతుకకడ కొడుకునునిచి పడుచును దెచ్చెన్. 11

తే. తెచ్చి కంసునికొసఁగ నుద్వృత్తి నెగుర, వ్రేసి యసిపూన నద్దేవి మింటనిలిచి
వేతెయున్నాఁడునీవైరి వెత్కియనుచుఁ, జని యెనటపల్లెలో మహోత్సవము చెల్లె.

సీ. దళపుష్పఫలసమాకులకోకిలములిందకీరంబు లగుచు శృంగారవనులు
కలహంసికాదత్తకమలనాళమరాళజాలంబు లగుచుఁ గాసారములును
గలశాబ్ధికల్లోలకల్పనోత్కటక్షీరక్షీరంబులై నైచికీకులములు
నిరతిశయానందనిర్నిద్రమానసాబ్జముల నాబాలగోపాలజనము

తే. లలరె వింతగు మాధవోదయమునందు, సప్తకులపర్వతంబులు సౌరభేను
లక్షణోజ్జ్వలధేనువ్విలక్ష నొసఁగె, ధరణిసురులకు నందుఁ డౌదార్యమునను.

తే. అభినవగుణైకసామగ్రి నుభయకులయ, శోదయై మించునట్టియశోద యంత
భువనపోషణుఁబోషించెఁ బుత్త్రమమత, సర్వసముఁడును మాతృవత్సలతఁదనరె.

తే. మేదినీనాథ నెలలు తొమ్మిదియు మోసి, కన్న దేవకి యటులుండ కడకు నందు
భామినికిఁ గల్గె శ్రీకృష్ణబాలలీల, కన్నులారఁగఁజూడ భాగ్యంబుగాదె. 15

ఉ. జోలలువాడఁగా మిగుల సొంపగుపున్నమచందమామనుం
బోలినకృష్ణుముద్దుమొగముం బలుమాఱును ముద్దులాడఁగా

లాలనమించుజిట్టకములం గనుదోయి చెలంగిచూడఁగాఁ
దాలిమి నేమి నోఁచిరొకో తల్లియుఁ దండ్రియుఁ దొంటిపుట్టునన్. 16
తే. కంసుపంపునఁ బూతన కామరూప, యగుచు జను బాలు విషమీయ నమృత మొసఁగె
వైరులందును దయగలవాఁడు కృష్ణుఁ, డాశ్రితులపట్ల నిఁక వేఱె యడుగనేల.
తే. బండిఁ బడఁదన్నెఁ దొడలపైఁ బండి పఱ్వ, తల్లికి ఘటించె సురగాలి త్రుళ్లడంచెఁ
జన్ను గుడుచుచుఁ దల్లికి సకలజగము, లాస్యమునఁ జూపె శౌరి మహాద్భుతముగ.
తే. అస్తిభాతిప్రియాత్మకమైన బ్రహ్మ, మాకృతి వహింపఁ జూచి కృష్ణాఖ్యయిడియె
గర్గమౌనీంద్రుఁ డాగమక్రమము మెఱయ, నందునకు దన్మహత్త్వమంతయును దెలిపి.
సీ. సిగను జుట్టినతావి చెంగల్వలరవీడఁ గొనరావిరేక ముంగురుల నాడ
నపరంజిమద్దికాయలు చెక్కుల నటింపఁ గమ్మకస్తురితిలకము రహింపఁ
బంచరత్నమ్ముల పంచాయుధము మించఁ దళుకుముంగామురంబులు సలింప
గంటల మొలకట్టు ఘణఘణధ్వని సేయ నందెలు ఘలుఘల్లు మనుచు మ్రోయ
తే. నబ్బె గాలిడి యొకపాణి యవనినూఁది, యన్యకరమున నవనీత మవధరించి
బాల్యమునఁ గ్రీడసల్పు గోపాలకృష్ణు, చెలువు వర్ణింపఁ దరమె యాశివునికైన.
ఆ. సగము రాత్రివేళ జనియింపఁగానేమొ, జారచోరలీల మీఱె శౌరి
విశ్వవిభునికేల వేళానుసరణంబు, లవియు నొకవినోద మయ్యెఁగాక. 21
క. నందునియింటను రాధ య, నందగు నొకకన్య జవ్వనంబునఁ దనరుం
గెందలిరాకుజిరాదొర, పందెము గెలుపింపఁజాలు బాగులు మెఱయన్. 22

గూఢచతుర్థి సీసము.

కలికిచూపును గుచంబులు మోవి మోమును గమలారిబింబవిభ్రమము గాంచి
రమణికొప్పును మధ్యమము దృష్టి నూఁగారు వరుస నీలాభ్రాళి గరిమఁ బూని
నెలనాఁగ చెవులు పల్కులు కరంబులు మెడ నవసితాబ్జస్ఫూర్తి నవఘళించి
మగువ నాసిక నితంబము నఖంబులు మేను స్వర్ణాచలాభాతిశయము గడచి
తే. రతికిఁ గుచఫలిరత్నదర్పణతమోణు, కాండశైవాలశష్కులికాశుకీకి
సలయపాళీతిలకుసుమసైకతాచ్ఛ, కుందకోరకతిలకలఁ గుందుపఱుచు. 23
క. వల్లభుసిఁ బ్రోచురతిగతి, నెల్లప్పుడు ఱొమ్ముడించ కెంతయుఁ దమి న
ప్పల్లవమృదుపద పెనుపఁగఁ, గల్లరికృష్ణుండు దానిఁ గని మదిసొక్కెన్. 24
సీ. తొడలపైనుంచి యుగ్గిడువేళఁ జికిలి పెందొడలసం దొయ్యనఁ బుడికిచూచు
వేడుక విందులు విందు లంచును బిల్వఁ గదిసి పయ్యెదజార్చి కౌఁగిలించు
నును ముద్దుఁ బెట్టుమంచును వేఁడుకొనఁ గోటికొనఁ జెక్కు మీటిచుంబన మొనర్చు
ముదముతో నెత్తుక మోవిముద్దాడినఁ జక్కెరకెమ్మోవి చప్పరించుఁ
తే. బట్టుకొని లేచుగతి నీడ్చుఁ గుట్టుకొంగు, తొలఁగి జఘనంబు గనుపింపఁ గెలసి నవ్వు
నెన్ని మాయలు నేర్చెనే చిన్నికృష్ణుఁ, డనుచు దనుఁ బెంచు రాధ ముద్దాడ శౌరి.

ఉ. ఎవ్వరుపట్టిన న్నిలువఁ డెంతయుఁ గృష్ణుఁడు పోరు పెట్టెడిక్
జవ్వని యెత్తుకొమ్ము పనిచాలు నటంచు యశోద పిల్వఁగా
నవ్వుచు రాధయెత్తుకొనిన న్నగుఁ గృష్ణుఁడు నొద్దివారలుం
దవ్వులవారు నిద్దఱకు ద్వంద్వ మటందురు వారలుబ్బఁగన్. 26

తే. చిన్నికృష్ణుని దినము గైసేయ వెన్న, ముద్ద పెట్టఁగనెత్తుక ముద్దులాడఁ
గాని వేఱొక పనిసేయఁ గానరాదు, రాధికాదేవి మిగుల గారాబమునను. 27

తే. అంత నైదేండ్లప్రాయంబునందె శౌరి, తోడిబాలురతోఁ గూడి వేడుకలర
గొల్లయిండ్లను వెన్నలు కొల్లలాడు, గొల్ల లాడుకటూ_క్తికిఁ గొంకులేక. 28

సీ. వెన్నఁబెట్టెద మేది విద్దెమన్నను గోపరమణులయొద్ద విద్దెములు సల్పు
నొకయింత నేమఱియున్నఁ గవ్వముదీసి పక్కన భాండము ల్పగులఁగొట్టు
నదియేమిరా కృష్ణ యనిన నేమియులేదు చేతప్పి పడెనంచుఁ జెలఁగినవ్వుఁ
బట్టుకోవచ్చిన బ్రహ్మాదులైనను బట్టనేర్తురె యంచుఁ బరువులెత్తు

తే. భామయొక్కతె వెన్నంటిపట్టుకొనిన, మోముద్రిప్పుచుఱుక్కనమోవినొక్క
నమ్మనేఁజెల్ల నెంతకాయకుఁ డటంచు, తరుణి విడిచిన విడుపక దాఁ బెనంగు.

క. లోలయగు లోలలోచన, వాలుంజనుదోయిఁ గేల వడిఁ బట్టుక ను
య్యాలోజంపాలో యని, వ్రేలుం గృష్ణుండు సఖులు వికవికనవ్వన్. 30

మ. కినుకన్ వ్రేఁతలువచ్చి కొల్లలిడియెం గృష్ణుండు పాల్వెన్నలం
చనినం గోపముతో యశోద యది యేరా కృష్ణ వ్రేపల్లెలో
నను బాల్వెన్నలుఁ గొల్లవెట్టితని యన్నం దల్లి లేదే తమిం
డ్లనెయుండే ననఁ జూడఁ బంపఁ జెలినట్లున్నిండియుండు న్వడిన్. 31

చ. పనివడి దొంగిలించుతఱిఁ బట్టుక కృష్ణుని దొంగసిక్కె ర
మ్మని యొకప్రౌఢ చేడియల నంగడిఁ గూడుక తల్లియొద్దనుం
చినతఱి వత్తనాంభవుని చెల్వముగైకొన నీకుమారు దం
డనమొనరింప మేముపలెనా యన సిగ్గునఁ బోదురందఱున్. 32

సీ. జనయిత్రి రోటఁగట్టిన నర్జునంబులఁ బడద్రోసె నర్జునప్రాయముగను
బృందావనంబునఁ బృథుశ_క్తి దగ ధేనుబృందావనము సేసెఁ బ్రేమదనర
బకునిరోషారుణాంబకునిచంచులు రెండు చించిచెండాడె విచిత్రముగను
వత్సరూపకుఁడైన వత్సదైత్యుని బట్టి వత్సుంబుపగులఁగా వైచిచంపె

తే. బాలగోపాలకబళనప్రాపితాఘు, నఘు విదారించె గహనమధ్యంబునందుఁ
బద్మలోచనుఁడై దేండ్లప్రాయమునను, భ_క్తలోకైకరక్షణప్రౌఢి మెఱసి. 33

వ. అంత నొక్కనాఁడు. 34

ఉ. వెన్నునబర్హిబర్హమును వేత్రముగేలఁ గటీతటిం బదా
ర్వన్నెపటంబు దట్టిపొరవాంశికనాళముఁ బైఁడికొమ్ము ద

ధ్యన్నకరంబు గల్గి చెలుఁగొందుచు గోపకబాలయుక్తుఁడై
వెన్నుఁడు ధేనుబృందముల వెంటఁ జరింపఁగఁ జూచి నివ్వెఱన్. 35

తే. జలజగర్భుండు గోపవత్సముల డాఁప, భక్తవత్సలుఁ డట్టిరూపముల నొక్క
వత్సరంబును మెలఁగ శ్రీవత్సవక్షుఁ, గాంచి వెరగంది మ్రొక్కి నుతించె నిట్లు.

సీ. మహనీయతతపుష్పమాలికాంచితచంచరీకపక్షసపక్షకాకపక్ష
చిత్రైంద్రచాపరోచిస్సాంద్రచంద్రికాంచితకరాదికలాపకృతకలాప
బాలభానుప్రభాజాలకల్పనశీలకటివిలోలవిశాలకనకచేల
వేత్రదండవిషాణవేణుదధ్యన్నప్రశస్తపంకజశస్తచారుహస్త

తే. నందనందన శాశ్వతానందభక్త, నందనద్రుమసనకసనందనాది
ముక్తజననందకాకార యుక్తిదూర, నందకకరాబ్జ నినుఁగొల్తు నన్నుఁబ్రోవు.

తే. ఏను నీమాయఁ దెలియఁగా నెంతవాఁడ
మోహినీరూపమున శంభుమోహితాత్ముఁ
జేయవే మున్ను నను దయ చేయుమయ్య
సంతతాక్షయ్య శేషభుజంగశయ్య. 38

తే. జనకుఁడవు నీవు గోపవత్సలుఁడ వౌట, నేను నటువలె నైతి నేఁ డింతెగాక
లేదు నేరంబు నామీఁద లేశమైన, ననుచుఁ జతురోక్తి వినుతించి యజుఁడు చనియె.

వ. ఇట్లు భక్తవత్సలుండు వత్సగోపాలబాలకుల మరలించి మఱియుఁ బెక్కు వినో
దంబులఁ జరియించుచుండె నంత. 40

క. ఏడెనిమిదివత్సరముల, వాఁడై కృష్ణుండు కొన్ని వగలఁ జరించె
న్వేడుకతోఁ గాయకపుం, జాడలు విడువక నె గోపసహితుం డగుచున్. 41

సీ. నాబంతి దాఁచుకొన్నను నేను విడుతునే యని యొక్క చెలి గుబ్బలంటిచూచుఁ
జెలువ యేకాంతంబు చెప్పెద రమ్మంచుఁ జెవి యొగ్గినను గవకివలు గొనుఁగుఁ
బడఁతియీముడి నేమి ముడిచితే యేదేది విడుమంచునును పోఁకముడికిఁ బెనఁగుఁ
గాల్దాఁకి మ్రొగ్గునంగనకు ముందై పుత్త్ర గనుఁగొమ్మనుచు నెత్తి కౌఁగిలించు

తే. నొడలెఱుంగక నిదురించు నువిదతొడలఁ, గుచ్చులదెరల్చి యత్తను దెచ్చిచూపు
నేమిచేసెద రిద్దఱే యిం దటంచు, దంపతుల వేఁడు హరి దంటతనము మెరసి.

చ. రమణి యొకర్తె యొంటి మధురాపురికిం బెరుఁగమ్మఁబోవుచో
సమయము గాచి పోఁకముడిజార్చిన జాఱెడుచీరగట్టఁగా
నమరికలేక కుండ విడ కత్తభయంబున దించుమంచు న
క్కమలదళాక్షి వేఁడుకొనఁ గల్లరిచేష్టలు చేయుచున్నగున్. 43

సీ. క్షోణీశ యంత యశోదతోఁబుట్టిన కుంభకుం డనియెడిఘోషభర్త
మిథిలాపురము చెంత మేటిసంపదలచేఁ దనరంగ సతనిమందను నికౌటు

లేదవ్వారు మదమత్తవృషమూర్తులై చొచ్చి యనిశంబు బాధింప నతఁడు వీనిఁ
జంపినవారికిఁ జక్కనినాకన్య భక్తినిచ్చెదనంచుఁ బ్రతినసేయ
తే. శౌరి యటకేగి వృషముల సంహరించి, భువనమోహిని నీలను స్వవశఁజేసి
తత్సహోదరు శ్రీదాముఁ దనకుమిత్రుఁ, గాఁగఁగైకొనివచ్చెనుత్కంఠహెచ్చ.
క. ఆనీలాకన్య యశో, దానందులపట్ల నెల్లఁ దగుభయభక్తు
లూనుచు రాధాచంద్రని, భానసతోఁ జెలిమి సలుపు నప్పయటంచున్. 45
వ. అంతఁ గ్రమక్రమంబున. 46
సీ. మొనలుచూపెడి పినపినముల్కుచనుదోయి యలఁతిపయ్యంటకు నాససేయఁ
గొంకున తెప్పలాఁగుచుఁ జూచుచూపులు మిసిమికన్గొలకుల దుసికిలంగఁ
జిగురాకుపోలిక జిగిఁజూపువాతెఱఁ జిన్ని లేనవ్వులు చెంగలింప
నొక్కింతబటువైన యుదుటుఁ దెల్పెడి శ్రోణితటి పటంబునకు నెత్తగము నెఱపఁ
తే. బొన్నపొక్కిలి లోఁతైన సన్నమైన, నడుము బిగిఁజూపునునుబొఁకముడికిలోఁగ
శాకబీజాలివలె నారు చంద మొంద, నీల నవయౌవనంబున నెగడెఁ జాల. 47
క. మదవృషభంబులఁ గూలిచి, సుదతీమణిఁ దెచ్చునపుడు చూడఁగ హరికిం
బదుమూఁడేడులు గావునఁ, బొదలుం జవ్వనము భువనమోహనలీలన్. 48
సీ. కలికిసింగారంపు మొలకలో యన ముఖాబ్జమున నూనూఁగుమీసములు దనరఁ
గెంపులగెల్చిన కీర్తియోయన గావిమోవిపైఁ జిఱునవ్వు ముద్దుగులుక
సంతతగోపికాస్తనఘట్టనంబున గడుసయ్యెనాఁగ వక్షంబు మెఱయఁ
గలభహస్తోపమోరులఁబోలి యాజానులంబియై బాహుయుగ్మంబు వెలయ
తే. జవ్వనంబున గోపాలచక్రవర్తి, నిండుపున్నమచందురు గండుమిగిలి
కన్నుఁదొగలకు విందయియున్నఁ జెనుల, మనసు నెలతాలఁగదగించిమమతనించె.
ఆ. పిన్ననాఁటనుండి కన్నులకింపయి, యున్న రాధ మీఁదఁ గన్ను వేసి
యున్నవాఁడు గాన వెన్నుఁడాప్రాయంపుఁ, గన్నెపొందుఁగోరి సన్న సేయు.
సీ. ఫలపుష్పములు దెచ్చి పట్టునుంచును బైఁట నించుచో గుబ్బఁదాఁకించుఁ గేల
నిక్కట్టుత్రోవల నెదురైన నొదుఁగక యొయ్యారిమేను మే నొరయ నేగుఁ
జీఁకటిలోఁ గన్నఁ జెలియ నాపైదయ లేదటే యని కౌఁగిలింపఁ దిపురు
సఖులతో రతిరహస్యములు ప్రసంగించు నెలగాఁగవినఁగఁ దా నెఱుఁగనట్లు
తే. చిలుకసాంబ్రాణి తేజివజీరుఁ గేరు, కమ్మనెమ్మేన వగవగ సొమ్ములూని
యెమ్మెమెరయించు శ్రీకృష్ణుఁ డెల్లవేళ, రాధలంకించుకొనెడి యారాటమునను.
క. శౌరి కడుఁ బ్రేమనిటువలెఁ, జేరిక సేయంగ సిగ్గు చిత్తము గరఁగఁ
మారుఁడు పొడుపొడుమని యొ, య్యారంబున వెడలె నంత ననురాగమునన్.
క. కిలికించితవతి కృష్ణుం, దిలకించఁగసారె సారెఁ దీరగుగుబ్బల్
పులకించఁ గళుకుఁ జెక్కుల, గులకించుక చెమటజాఱఁ గోర్కులుమీఱన్. 53

సీ. పనిలేనిపనిఁబూని పైఁడియందియ ఘల్లుఘల్లన గృష్ణుచెంగట నటించుఁ
దనపైఁటయతనిఁ దాఁకిన గిలుక్కనమొగం బోరయైచూచు సిగ్గొలయు చూడ్కి
నేఁ జెల్లనమ్మ వానికి నెట్లుదోఁచునో చెలఁగుదాఁకె నటంచుఁ జెలికిఁ దెలుపు
నెటులదోఁచిన మంచిదే యన్నఁ జాలును పొమ్మంచుఁ గెంగేలఁ దమ్మివైచు
తే. నాననమువంచు బొటవ్రేలనవనివ్రాయు, వేఁడినిట్టూర్పుపుచ్చు నావెతయెఱుంగ
వింతెగదెయంచుననఁబోవునంతలోన, గ్రుక్కుమక్కుచఁజొక్కియక్కవలయాక్షి.

మ. నునుపయ్యెంట చెఱంగు జాఱ హరి కన్నుం గోనలం జూచినం
గినుకన్ వాతెఱ పంట నొక్కుచును జంకించున్ మృగాంకాస్య గ్ర
క్కునలేదంచును శౌరికన్నులను మ్రొక్కున్ రాధ కెమ్మోవిపై
నెనయించుం దరహాస చంద్రికల శ్రీకృష్ణుండు హర్షింపఁగన్. 55

మ. కనుఁగోకృష్ణు నెఱుంగనట్లు సకియం గౌఁగింటికిం దార్చుచుం
బెనగున్నాపయి బత్తిలేదనుచుఁ గోపించున్ బలాయేలనే
యనుచు న్నివ్వెఱపాటుతోడ నది తన్నెట్టోవిలోకింపఁ బ
క్కుననవ్వున్ వలిచన్నుదోయి గులుకం గౌఁదీగెజవ్వాడఁగన్. 56

ఉ. కొప్పునజాజులున్ బిగువుగుబ్బల కుంకుమతేనె మోవిపైఁ
గప్పురవీడియంబు జిగికస్తురిబొట్టును నిచ్చుచల్వముం
జొప్పడ వారకాంతవలెఁ జూడ్కికి విందొనరించెఁ గాని యొ
క్కప్పుడు మైలదోఁప నడయాడదు రాధ ముకుందు ముందటన్. 57

సీ. దోర్మూలములుగాంచుఁ దొలఁగించుఁబయ్యెద నాభిగన్గొన వితానానఁబూను
మురువుతోఁ గెమ్మోవి విఱుచుచుఁబుక్కనసుదుటుగుబ్బలు నిక్కనొడలువిఱుచు
మెలఁతమైనొరగు నేమోచూచి పక్కన నగుఁ బాలుముద్దాడు నన్నఁ జూడు
మనునొక్కవ్యాజంబునను జెంతఁ జేరు జెక్కులచెమ్మవోమీటుఁ గొప్పనిమురుఁ
తే. గటితటంబంటిసొలయుఁ గ్రేఁగంటఁ జూచుఁ, బంతమీఁదేరె నా యని పైని విరులు
వైచుఁ గనుసన్నఁ బిలుచు రావాయటంచుఁ, జిలుకపైనిడి కెలయునచ్చిగురుఁబోణి.

క. అలచెలువ వలపుసొలపులు, దిలకించుచుఁ జెలఁగి బళిర తేరకుడక్కెన్
వలకారిచిలుక యని చం, కలు దాటించుచును శౌరి కడునిర్భయుఁడై. 59

సీ. మగువ నీవ్రేలికి మట్టాయెనా యని కడవ్రేలుఁబట్టు నుంగరము వెట్టు
నిదిలెస్స యనుచుఁ బాలిండ్లమీఁదికిఁ బాణికమలములూఁచు హారములువైచుఁ
జెలిచూడవేయని చెంగల్వమొగ్గ యిందని వేఁడియిచ్చు కర్ణమున నుంచుఁ
గుంకుమ యలఁదుచు గోటనితంబంబు కడ విదలించుఁ బక్కనహసించు
తే. గురుజనంబులు నెడగల్గి తిరుగువేళ, శౌరి రాధను జేరి రాజసముమీఱ
నామిటారిమునతనిమాయలకులొంగి, యుండెఁగాపునఁ జెలరేగుచుండెనపుడు.

క. వనితామణి యిటువలె న, వ్వనజదళాక్షునకుఁజాల వలచి మనంబా
ఘనవర్ణుచెంతఁ దనువుం, బనిపాటలుమాని మెలఁగు భవనములోనన్. 61

సీ. ఒంటిపాటునఁ గౌఁగిలొసఁగుఁ దత్తఱముతో నంతలోపల మళ్లీ నలుకుఁడైన
నేమైనఁజూచుచు నెఱుఁగనిరీతిని మాఱుమోమునఁ జెంతఁజేరి నిలచుఁ
గట్టుకొం గెడలించి గట్టునల్లల్లన గంభీరనాభి క్రేగంటఁ జూడఁ
జెలియరావే యని చెయివేయుఁ జీఁకటిగాంచి నీవాయంచుఁ గడకుఁబోవు

తే. నెదురెదుర చూచు మందల కేగియున్న, నేలతావైతివని దూఱునాళిఁజూచి
యతనిపల్కులె చెవియొగ్గి యాలకించు, వలపునను రాధ కృష్ణునివలకుఁ దగిలి.

తే. మాధవుఁడు రాధ నీరీతి మరులుకొల్పి, మఱియు గొల్లమిటారుల మరులుకొల్ప
నారజపువన్నెఁ బెట్టుచు ననుదినంబు, వీథిలోపల విహరించు వేడ్కమీఱ. 63

చ. మునిమునిచీఁకటి న్నడువ ముంగిటవాఁకిట నైన నొంటిపా
టున నడయాడు జవ్వనుల డొంకక పయ్యెదయైనఁ జట్టయై
నను జడయైనఁబట్టు నెఱనవ్వునఁ గృష్ణుఁడులోఁగిలేసి గ్ర
క్కననొకచోటుఁ జూచుకొను గాదనినన్ వెడలున్ హుటాహుటిన్. 64

సీ. జిలుఁగుఁబయ్యెదజాఱఁ జెక్కులచెమరూరఁ గనుతెప్పయిడక చూడనిమిటారి
చెలియచెక్కనను దోఁచినకృష్ణవదనంబుఁ గూర్మిమీఱఁగ ముద్దుగొననివనిత
పులకండములుగుల్కు బొమ్మంచుమోవికిఁ గ్రుక్కిళ్లుమ్రింగని కుందరదన
పైఁడికంబంబునఁ బ్రతిఫలించినమూర్తిఁ గౌఁగిటఁజేర్చి చొక్కనిలతాంగి

తే. కలుగనేరదు రేపల్లెచెలులలోన, గురుజనంబుల కళికి పైకొనరు గాని
కరఁగరే చంద్రుగనుచంద్రకాంతమణుల, జోక గోపాలరాయనిఁ జూచునపుడె.

తే. ఉల్లమునఁగృష్ణమూర్తియచ్చొత్తినటులు, సంతతంబును జెలువొందచంద్రముఖులు
తన్నిమగ్నైకచిత్తలై ధ్యానయోగి, వరులవలెఁ జొక్కుదురు పారవశ్యమునను.

సీ. అమ్మనేఁజెల్లి మాయత్తచూచినఁగొట్టుఁ బయ్యెదవిడర గోపాలరాయ
యోరి నాగుబ్బల గోరజీరకు పోర నీకుమ్రొక్కెద యశోదాకుమార
యవులేర మంచివాఁడవు గంటునేతురా వాతెఱపై నవనీతచోర
చెల్లఁబో నడివీధి నెల్లవారును జూడ ముద్దాడవత్తురా ముద్దుకృష్ణ

తే. యంచు బ్రక్కను బవళించుమించుబోండ్లు, నిదురమబ్బునఁబగలిట్లు జదురులెల్లఁ
గలవరించిన నాసంచు తెలియలేరు, పనులఁగాచిరి కాన తత్ప్రాణవిభులు. 67

ఆ. పనులుసేయువేళఁ బాటఁబాడెడువేళ, నాటలాడువేళ హరినెకాని
యన్యమెఱుఁగ రెందు నలగోపసతు లేమి, నోమినారొ తొల్లి బాములందు. 68

సీ. అదిగొ కృష్ణుఁడు వచ్చెనన నెంతపనియైన వదలివత్తురు తలవాకిళులకు
యమునసీళ్ళ కటంచు నరిగి మాధవు వేణునాదంబువిందురు మోద మలరఁ

బనిలేనిపని పెట్టుకొని నందసుతుని గేహమున కేగుదురు నూతాఁరుమాల్లు
తమినిబ్బరమునఁ జెంతలవారి నెఱుఁగక కులుకుదు రాశౌరి కెలన నిలిచి
తే. కమ్మవిలుకాని చే కీలుబొమ్మ లనఁగ, సమ్మదంబునఁ బసిగాపుకొమ్మలట్టు
లెమ్మె నడయాడుదురు సంతతమ్ము మాన, సమ్ము వెన్నునియందు మగ్నమ్ముగాఁగ.
క. ఈకైవడిఁ గృష్ణుఁడు వ్రజ, కోకిలవాణులను మరులుకొల్పె మనోజ
వ్యాకులితలైన వారలఁ, జేకొని క్రీడింపఁదలఁచి చిత్తములోనన్. 70
మ. కమలావల్లభసౌఖశాయ నికమాగచ్ఛద్వచోవల్లభా
శ్వ మణీసౌవ్యగతికంబు గైరవనుహృత్స్వర క్తికంబాపగో
ద్యమ మాశబ్దిక మంగభూవిజయయాత్రావాదకాంబునై
కమనీయంబుగ మించె నంతట శరత్కాలంబు భూపాలకా. 71
తే. ఆశరత్కాలమునఁ బూర్ణిమావసరము, నందునపిజాతెఁజంద్రోదయంబుమీఁతెఁ
దనరె నిరుదెసఁ గెంజిగి ధవళరుచియుఁ, గిరహయుని ప్రతాపసత్కీర్తులనఁగ. 72
మ. స్మరతేజంబు జనించె నించె భువి సచ్చక్రంబు చక్రంబు దు
స్తరమోహాబ్ధి భ్రమించె మించెఁ దుహినాసారంబు సారంబులౌ
నరవిందంబులు తీరెఁ దీరెనసఁ గల్హారంబు హారంబుడాల్
నెరయన్ వెన్నెలమించె మించె విటసందేశంబు దేశంబులన్. 73
సీ. అట్టివెన్నెలలోన యమునాతటంబున ననిచినశృంగారవనములోనఁ
బారిజాతముక్రింద మారుగెల్చినభంగి నంగుమీఁఱ త్రిభంగి యగుచునిల్చి
పదముపై వేఱొకపదముంచి జాళువావన్నెదుప్పటి వలెవాటుమించ
సాచీకృతానన జలజాతవేణురంధ్రములయందుఁ గరాంగుళము లమర్చి
తే. ప్రౌఢిమీఁఱంగ మదనగోపాలమూర్తి, గాన మొనరించె నలతానమానములకు
మానములుపీడ గోపికామానవతులు, గీతికాదూతికాసమాహూతలగుచు. 74
సీ. కెంగేలజలపాత్ర గిలించియులదోఁట త్రోవగా నవ్వలదూఁటెనొకతె
* యత్తయెక్కడి కంచు నడుగ నెక్కడకిలేదిడగొ వచ్చెదనంచు నేఁగెనొకతె
పొరుగింటనుండు మాపొరుగింటి పడుచును చూచివచ్చెద నంచు లేచెనొకతె
మంచినీళ్ళకుఁబోయి మఱలివచ్చెదనంచు వేడ్కమీఁఱగ నేఁగె వెలఁదియొకతె
తే. త్రోవలో తోడికోడలు పోవఁజూచి, యేడకేయన్న నదియు నీవేడకన్నఁ
గూయకుమటంచు నిద్దఱుఁగూడి తోడి, దొంగలై పోయి రాగోపధూర్తుకడకు.
చ. కడవెఁడువేఁడినీళ్ళ జలకంబయి కమ్మనిపాలు వంటకం
బిడినభుజించి నాథుఁడు శయించిన పీడెము వేసికొక య

* తోడెలు విడిపించుకొనె నంచు వాకిటి మఱదిలోవలికంచి జరగెనొకతె
మగఁడు నిద్దురవోవ మంచమించుకసద్దు గాకుండ దిగజాఱి కదలెనొకతె,

ప్పుడె నిదురా యటంచు నొకబోటి హసించుచుఁ దల్పుమూసి వె
ల్వడియె ముకుందు డున్నెడకుఁ బంచశిలీముఖచంచలాత్మయై. 76

సీ. మొగములోఁ దేటలేనగవుపై డెముకెంపు పెంపునింప సమర్థపెండ్లికూఁతు
లనువొంద నీరువట్టినమేని తళతళల్ దిలకింపఁ దొలుచూలుతలిరుఁబోండ్లు
పసదేరు పసపుదువ్వలువ కాటుకబొట్టు వింతచెలువ్వాన బాలెంతరాండ్రు
గమకపుగుబ్బ లంగములలో నుదుటునిచ్చలు ప్రేమగల నిండుజవ్వనులును

తే. మఱియు వ్రేపల్లెలోనున్న మంచమంచ, గామినులు కామినులు కీరకాండకాండ
కుసుమదోదూయమానమానసముతోనఁ,[1]దోనఁదన్నందపుత్రుండు తోననగుచు.

తే. ఏలవచ్చితి రీవేళ బాలలార, యనినఁ గొందఱు ప్రౌఢరాకాబ్జముఖులు
కృష్ణ నిన్నేలవచ్చితి మిప్డు మరర, ణంబునందన నందనందనుఁడు పలికె. 78

క. మగనాండ్రు మీరు మిమ్ముం, దగిలి రమించుటలు నాకు ధర్మవె నేనా
వగకాఁడుగాను బోండో, మగువలు మీకైన నిట్టిమార్గము దగునే. 79

మ. అనినం గన్నెలు చిన్నవోవ నగి ప్రౌఢాంభోజపత్రేక్షణ
ల్వీన మేచుంటివి కృష్ణకృష్ణ యపురా వేసాలు మాతోడనా
యనరా దింతియెకాక కన్నయపుడల్లా తప్పుదండాలువె
ట్టిన మాసామివి నీవకాక వలపంటే వచ్చెనా బింకముల్. 80

శా. కానీ పోదుమె పొద్దుపొద్దునను వేడ్కన్నీవు ప్రార్థింపఁగాఁ
బోనీపో మనవాఁడుగా యనుచు మాపుణ్యానకుఁ నచ్చితే
కానంజాలక ధర్మశాస్త్రములు వక్కాణింపఁగాఁ జొచ్చినా
వౌనే కాక మఱేమిప్రోది కడులెస్సాయెఁ యశోదాత్మజా. 81

మ. దినముం జేష్టలచేఁ గరంచఁగను బాతివ్రత్యధర్మంబుమే
మెనయంజాలుదు మెట్లుగా నదియుఁ గాకేనాఁడు కాళిందిలో
నను నీరాడఁగ వస్త్రముల్గొనితొ యానాఁడే జనెఁ లజ్జ య
న్నను గోపాగ్రణి యేమిచేసితిని నానాఁడేల నఁదూరఁగన్. 82

చ. అనవుడు నవ్వి యవ్వికసితాంబుజనేత్రలు నీవెఱుంగవే
కనికని యుండి బిత్తలియె గట్టుకు రమ్మని చేతులెత్తి మ్రొ
క్కిన దనకాళుఁబోరి తిలకింపవె మర్మములెల్ల నెట్టినీ
మను సతులట్లు సూపుదురె మాయెడఁ గల్గెనుగాక మాధవా. 83

తే. అనిన నింతియకాదె పద్మాక్షులార, దృష్టిదోషంబు పనిలేదు తెలియకేను
జెనకితినెగాక నన్నుఁజూచితిరె చూడ, పల్లవుఁడగాని నేమీకు వల్లభుఁడనె. 84

సీ. అలివేణి నీవెకావా గుబ్బపయిఁ జెయివేసిన జెయిఁ దట్టివేసి చనుట
వనజాక్షి నీవెకావా మోవియాన వచ్చినన్నెమ్మొగం బోర చేసికొనుట

1 తోనఁ దన్నందనందపుత్రుండు నగుచు,

యంగననీవెకావా వేణిపట్టినఁ బెనఁగినాచెయి విడిపించుకొనుట
అబ్జాస్య నీవెకావా వెన్కఁ జేరినే కన్నులు మూసినఁ గసరుకొనుట
తే. వలపులేదేమొ నల్లనివాఁడ నగుట, నటులనేల పతివ్రత లగుదురింతె
యదియె మంచిదిసౌఖ్యంబులందునిందుఁ, జెందుటకుమంచికార్యంబుఁ జేసినారు.

ఉ. చిత్తమెలర్పఁగా మగల సేవలొనర్పక యిట్టివేళలన్
వత్తురె మెత్తురే పరులు వంశమువారికి గాసిదెత్తురే
చొత్తురె జారవిద్యలకుఁ జూచినపెద్దలు సాగనిత్తురే
యుత్తమశీలలార [1]ననుదూఱక మీశరణంబు లొందుఁడీ. 86

మ. అనినం గాంతలు దృష్టిదోషములు లేవా ధర్మము ల్పల్కునీ
వనినం జాలును సృష్టిదోషములు లే వట్టైన బల్సిగ్గునన్
నిను సేవింపము గాని యుండునెపుడున్ నీయందె మాచిత్తము
ల్పెనఁగన్ వల్లవచక్రవర్తి వివహాభేదంబునం జూడఁగన్. 87

తే. రూఢి శృంగారరసమె యీరూప మగుట
శ్యామవర్ణుఁడ వౌదు గాదనఁగనేల
యెఱుఁగుదుము నిన్ను మమ్ము నీవెఱఁగియుందు
వేలయీవట్టిజోలి యీవేళఁ గృష్ణ. 88

సీ. ధవసేవ ధర్మ మంటివిగదా నీవె మాధవుఁడవుగావె కందర్పజనక
వంశంబునకుహాని వచ్చునే చేపట్టినావు వేడుక వేణునాదలోల
కనిన నిత్యానంద కాముకుల్మెచ్చరే తగులుచేసిన నమృతస్వరూప
యాత్మనివేదనం బౌఁగాకమాభక్తి జారత్వమే భక్తపారిజాత
తే. కలరె సర్వనియంతను గాదనంగఁ, దగినపెద్దలు జగదద్భుతప్రభావ
శరణ మెయ్యది నీపాద జలజయుగమె, శరణ మగుఁగాక గోపాలజనశరణ్య.

వ. అని మఱియు నిట్లనిరి. 90

సీ. నటియింపవా విషానలఘోరఫూత్కార కాళీయాహిస్ఫటాగ్రములయందుఁ
గబళింపవాజ్వాలత్కాలానలజ్వాలికాకీలలోలదావానలంబు
ధరియింపవా మహీధరవైరిముక్తాశ్మ వర్షదుర్ధర్ష గోవర్ధనంబు
మరలింపవా వార్ధివరభటానీతతల్లోకగామినినందు లోకులెన్న
తే. మఱియు గలవెన్నియైన నీమహిమలెన్న
సులభమా మాకుఁ బరపురుషుండ వగుదు
ననఁగ నినుఁగొల్చెదము నేఁడు కరుణఁజూడు
మేల మమ్మింత సేయఁ గోపాలరాయ. 91

---

1 చనుఁదూరక మీశరణంబులొందఁగన్.

క. గాయకునకు మోహింపుదు, రేయెడ స్త్రీలనుచుఁ దెలుపదే శ్రుతిగావో
గాయకుఁడ వేముగామో, తోయజనేత్రలము వట్టి దూఱెమిటికిన్. 92

క. చిక్కులఁ బెట్టినఁ బోమిక, నక్కున గదియించి తారహారావళులం
జిక్కులఁ బెట్టక యనుచున్, మక్కువఁ బైఁబడిన యదుకుమారుం డంతన్. 93

సీ. అలమఁబోయినఁ జేతికందని చిన్నిగుబ్బలబాలల వికాసబంధములను
దిమిరంబునిండుప్రాయము మోహనాంగులఁ గెరలించియుపరతిక్రీడనముల
నగవులనఖరదంతక్షతంబులఁ దెల్పు ప్రౌఢల బహుచిత్రబంధములను
జాతిస్వభావ చేష్ట లెఱింగి తత్తత్కళాస్థితు ల్గరఁగించి లలితగతుల
తే. నందఱికి నన్నిరూపంబు లందిపొంద
దక్షుఁడయ్యును నొకవినోదంబు గాఁగ
నిరువురకు మువ్వురకు మఱి నేవురకును
బడుకయిచ్చుచుఁ బెనఁగె గోపాలుఁడపుడు. 94

చ. అలయవొకింతయైనఁ జెమటంటదు చెక్కుల మించి యూర్పులం
బొలయవు చాలుఁజాలు నిఁక బొమ్మనఁ బెందఱు వచ్చి వేఁడినం
గలయక నీవు దేవుఁడవు గాక మనుష్యుఁడవే యటంచుఁ బ్రేఁ
మలననిరింతులాహరిని మన్మథకేళికమించు లాహరిన్. 95

తే. పాలుచల్లాఱఁ బెట్టి యావేళయింత, పాలుమాలిక రాఁగ రాధాలతాంగి
పవ్వళించెనొ లేదొఁ గోపాలగీతి, చెవినిఁ బడ నుల్కి పడి లేచి శీఘ్రమునను.

క. పాలని మజ్జిగలోపలఁ, బాలునితోడంటువెట్టి భ్రమ్మచే నిదురన్
సోలెడిగృహజన మదియే, వేళయనుచుఁ బడుకయిల్ఁ బ్రవేశించి తమిన్. 97

సీ. ముంగొంగు బంగారు చెంగావి యటులుండ జిలుఁగుపైఠాణి దువ్వలువ గట్టి
సంపెంగలటులుండ జాజిక్రొవ్విరిదండ మెండుగాఁ గీల్జడనిండఁ జుట్టి
కుంకుమపంకంబు పొంకంబుగానుండ గబ్బిగుబ్బల మంచిగందమలఁది
కళుకు ప్రాగెంపుచెక్కడపుసొమ్ములటుండఁ దెలిముత్తియంపు సొమ్ములు ధరించి
తే. సొగసుమీఱఁగ వెన్నెల సోగయంచుఁ
గాంచువారలు భ్రమయ శృంగార మెనయఁ
బండువెన్నెల నొకయింత భయములేక
రాధ వెలువడె గోపికానాథుకడకు. 98

ఉ. తోరపుగుబ్బజక్కవలతో వలతోదన నీలజాలముల్
తూఱెడివేణిఁజాక చకితోచకితోరు మృగంబులం బొదల్
దూఱఁగఁజేయుచూపరహితో రహితోర్జితగంధ కేతకిన్
దూరముసేయువాసనలతో నలతోయజగంధి వచ్చుచున్. 99

తే. పొద్దుముద్దులకూఁతురి యొద్దితోఁటఁ, గన్నె మావులకింద నీడఁ గలువరాచ
చలువతాతిన్నెపై జాజిశయ్యమీఁద, గోపకాంతాసహస్రము ల్గొల్వ సేయ.

ఉ. ఒక్కతె గుబ్బపై నొరగి యొక్కతె యూరుల నంఘ్రి సాచి వే
తొక్కతె వీడెమీయ మఱియొక్కతె వీవన వీవ బత్తితో
నొక్కతె పైఁటఁ జెక్కు చెమరొత్తఁగ లీలరతాంతతాంతుఁడై
చొక్కెడు కృష్ణు దూరమునఁ జూచి గిఱుక్కున రాధ మర్లుచున్. 101

సీ. సిందూరపండువెన్నెల కాకకోర్వక యెలమావినీడల నిలిచినిలిచి
కలకలపల్కు చిల్కలపల్కు వినలేక చెవులనంగుళములు చేర్చిచేర్చి
చల్లనితెమ్మెరలై న్నపఁగాఁజాలక జిలుఁగుఁబయ్యెదచాఁటు చేసిచేసి
హృదయంబు భేదించు మదనాశుగములకుఁ దప్పించుకొనలేక తలఁకితలఁకి

తే. ధవవియోగదవాగ్ని చేఁ దాళలేమి, సాహసము పద్గుణంబంట సహజముగను
గంజపనలోలయగుచుఁ దత్కంజలపన, చూతవనమండలాగ్రంబుఁ జూచునపుడు.

క. అమ్మమ్మ తెగువ యేటికి, సమ్మతి నీవిభుఁడువచ్చుఁ జయ్యననుచుం
గొమ్మపయినుండి కొమ్మ క,రమ్మున నొకచిల్కవాలెఁ బ్రమదముమీఱన్. 103

క. చిలుకా పక్షము నాపైఁ, గలిగెనె నీకైన ననుచుఁ గరమునను నుతె
క్కలు దువ్వుచు నొక్కపూఁబొద, జలజాక్షుని దూఱుకొనుచు సతియున్నంతన్,

సీ. అదియెవ్వరే రాధ యాఁగదా యిందేల వచ్చెనో హరిఁబిల్వ వచ్చెనేమొ
యీవేళ నొంటిగా నింతదూరము వచ్చునా యశోదాదేవి యంపఁబోలుఁ
గాదుగాయిదియేమొ కలదుపో దోసమే యటువలె నుందురా యంబుజాక్షి
యెక్కడి దోసమె యెవ్వతె వలవదె వనజనాభుని చక్కఁదనము గనిన

తే. ననుచుఁ జెలులాడఁ జూచి యిట్లాడనేల, పిలువవచ్చుట నిక్కంబు తెలిసిపత్తు
మీర లిటునిల్వుఁడని నిల్పి శౌరివెడలి, యల్లపూఁబొద కడఁబొంచి యాలకింప.

తే. చిలుక శ్రీకృష్ణదేవుండు చిన్ననాఁట, నుంచినాపయిఁ గడుఁబ్రేమ నుంచిదినము
చెలఁగి యెన్నెన్నఁ జేష్టలు సేయునకట, యేల లేదాయె నొక్కొ యాహాళినేఁడు.

సీ. వెనుకపాటునవచ్చి వెడఁదకన్నులు మూయుఁ జెలిపేరు చెప్పిన జెలఁగినవ్వు
చెలులెవ్వరైన వచ్చెదరు పోపొమ్మన్నఁ బడుకయిమ్మనికొంగు పట్టితివియు
నలతోఁటలోన నన్నలయించి కొనిపోయి విడువక నగుచు నీవిక సడల్పు
నెడరైనతావున నెదురైన నన్నాఁగిపోనీక వాతెఱ తేనెలాను

తే. సిగ్గుప్రతిబంధమై యంత సేయనాదు, కోర్కెయీడేఱదయ్యనీ కూర్మి యెంత
యరసియుండ్రు యశోదాదులైనవారు, సెనరుకలిమిని గనిపించుకొనరుగాని.

ఉ. ఒకనాఁడొంటిగఁ గేళికాగృహములో నుండంగ శ్రీకృష్ణుఁడే
టికొ నేఁబోయితిఁ బోయినం జెఱఁగుఁబట్టెం బట్టినం గొంగుదీ

యకురావచ్చెద రెవ్వరైననని మల్లాడంగ నావేళనే
లకొ యేతెంచి యశోదచూచి చనె నుల్లాసంబు సంధిల్లఁగన్. 108

క. అదిమొదలుగ ముదమున నా, సుదతీమణి నామొగంబు చూచిననగుఁదా
నిదియేలనినను నేమో, పెదవిగదలనీక తెలుపుఁ బ్రియసఖితోడన్. 109

సీ. హరిఁ జేరవచ్చుచో నట్టె నేఁజూచినఁ బడఁతులఁగనుగీఁటి కడకుఁబోవు
నందుఁడదేమన్న నవ్వుచు మీకేల పొమ్మంచు నొకవేళఁ బులిమిపుచ్చు
నొంటిగా నున్నచో నొకలేనిపని చెప్పి కమలలోచనుని చెంగటికిఁ బంపు
వనితనీచేఁగాని వల్లఁడు మాకృష్ణుఁ డనినన్నుఁ బనుపు భోజనము వెట్ట
తే. గంధమైనను విరులైనఁ గానివిడియ, మైనఁబండైననా చేతఁ గానివేత
యొకరిచే నంప దేనెంత యొడ్డికొనినఁ, బ్రేమ వేఁడు యశోదయదే మొయెఱుఁగ.

ఉ. నవ్వుచు మాయశోద యొకనాఁడు విలాసిని యాగృహంబులోఁ
బువ్వులు దెమ్మటన్న నటఁబోయెడిచో హరి గుబ్బలంటరా
నివ్వలికేఁగుదెంచిన నదే విరు లేవియనన్ యశోద నేఁ
బువ్వులుగాన నందనిన బోటులు హాస్యము సేసిరయ్యెడన్. 111

చ. హరియొకమాపునన్ జలకమై కురులార్పఁగ జీనిజాళువా
సురటి యొసంగి చేతికి యశోద చనెం దమి నేను వీవ బం
గరునును జెక్కులం జెమట గ్రమ్ముట సాత్త్వికమా యెఱింగి యో
గురుకుచ నీకిఁకన్వ్యసరికొమ్మనె శౌరి దరస్మితంబుగన్. 112

చ. తిలకము దిద్దుచున్న సుదతిన్నగఁ దిన్నఁగ నీవుదిద్దుమా
తిలకిని యమ్ముకుందునకు దిద్దెడిచోఁ భుజమూలకాంతి క
న్గొలఁకులఁ జూడ నే నెఱిఁగి గొబ్బునఁ గేలటు వంపఁ దోడితో
య్యాలు లదియేమటంద్రు వశమా వినుతింపఁగ వ్రీడమున్గుచున్. 113

ఉ. హరితో నేనొకవేళ నొంటిమయి మాటాడంగ నీళాకృశో
దరి తానత్తఱిఁ బొంచిపొంచి కన నంతన్ శౌరిహాసమ్మన్నచో
నగుథు న్నేనటు చిన్నదానిపయి నేలా యింతకోపంబనన్
దరహాసంబున నెంతలేదను జగన్నాథుండు నాపైఁ దమిన్. 114

ఉ. ప్రేమము నిచ్చ నిట్లు వలపించి ననుంగికరించి యిప్పుడీ
భామలతోడఁ గూడుకొని భావములో నను నెంచఁడీవిధం
బేమనిచూచుదాన నిఁక నెవ్వ రెఱుంగుదు రీ యధర్మమా
కాముఁ డెఱుంగుఁగాని చిలుకా కలకాలము తన్నె నమ్మితిన్. 115

క. అని మంచిది రాపలెఁ గద, యనికోపము మీఱఁ నేమొ యనఁబూనినచో
నిను నమ్మినాఁడ రాధా, యని హరి కౌఁగిటను జేర్చ నది గని యలుకన్. 116

తే. పెనఁగి విడిపించుకొనుచు నబ్జసరుహాక్షి
మంచివాఁడవు పొమ్మంచు మాఱుమొగము
సేసికొనియుండ నేమిచేసితిని నేర
మేలనే యల్క యనుచు గోపాలవిభుఁడు. 117

సీ. బారికిన్నెరకాయ బటువుగుబ్బలుమీఁద గోరుంచనీయవే కీరవాణి
తళుకుబంగారు నిద్దాచెక్కుటద్దాలు ముద్దాడనీయవే ముద్దుగుమ్మ
కండచక్కెర పానకము గుల్కు కెమ్మోవి గంటిసేయఁగనీవె కలువకంటి
తొలుకాఱు మెఱుగుతోఁ దులదూఁగు నెమ్మేను గౌఁగిలింపఁగనీవె కమలవదన
తే. పైఁటచాటేల చేసెదే పద్మగంధి, మోము ద్రిప్పెదవేలనే మోహనాంగి
సారెజంకించెదేటికే సారసాక్షి, యేల నేనొసరించెదే యిగురుఁబోణి. 118

క. నాళీకశరుఁడు సుమనో, నాళీకము నేయఁ దాళ నవచంద్రకళా
ఫాలా బాలా యీలా, గేలం చాలా నలంచ కిఁక నేలఁగదే. 119

క. అనివేఁడుచు నేరంబిది, యనిమోపక యలుగ నేమి యనియెద నేఁడే
చనియెద నని యివలికిరా, వనితామణి పిలుప కేలవచ్చితి వనినన్. 120

చ. వనజదళాక్షి యెచ్చటికి వచ్చితి పిల్వక పొద్దువోక యే
వనమునఁ బాటపాడినను వల్లవ కామిను లెల్లవచ్చిరిం
తనుచునుఁ జేర నీవునను దారున గన్గొని వారిఁబాసి క్ర
న్నన నిటువచ్చితిం గలదె నాయెడ నేర మొకింత యేనియున్. 121

తే. అనినఁ జిలుకయుఁ గలికి నీవపుడు చూచి
మగుడు సాహసమెఱిఁగి నీమగఁడు వేగ
నన్నుఁగనుగీఁటవచ్చి క్షణంబులోన
నీతెగువ మాన్పనేయనఁ గృష్ణుఁడపుడు. 122

తే. కాక నామీఁద నేరంబు గలిగెనేని, యిదిగో నామేను నీవేణి యిదిగోవలయుఁ
లీల దండించు మంచు గోపాలవిభుఁడు, గీలుజడఁ గేలు కందీయ బాలనగియె.

వ. అంత. 124

ఉ. వెన్నుఁడు సంతసించి మనవేడ్కకు వెన్నెల లెస్సగాఁగఁ గ్రే
గన్నుల చిన్నినవ్వు దొలఁకం దిలకించుచు సిగ్గులాడు న
క్కన్నియ ద్రాక్షచప్పరము కమ్మని శయ్యకుఁదార్చియంక సీ
మన్నెలకొల్పి ముంగురు లమర్చుచుఁ జెక్కిలిముద్దులాడుచున్. 125

తే. మోవి తనకిచ్చి కనుఁగవ మూసికొనిన, బాళిమీఱంగఁ దేనియ గ్రోలిబాల
సొగసుకాఁడింత యటకంటఁ జూచెనేని, మానుమరలంగ మోడ్చిన నానఁబూను.

ఉ. చక్కెరమోవి యానినను జన్నులఁ గ్రొన్నెల వంక లుంచినం
జెక్కులుమించ నొల్లమి నటించుఁ బెనంగును నింతెకాని యా

చక్కనిసామి లోఁదొడల చక్కిఁ జఱుక్కన గోటనొక్కినం
జొక్కిమిటారి సొమ్మసిలుఁ జూపు కరంగుట సాటి చెప్పఁగన్. 127

చ. వలపులు రేచి గోలయని వల్లభుఁ డల్లనఁ గేలిసల్పుచో
మెలఁతుక నిబ్బరంపు తమిమించగఁ జేతులుద్రిప్పికొంచు న
చ్చెలువుని మందవేగము హసించుచు వెఱజఱచెం గరాగ్రసం
కలితసువర్ణకంకణము ఘల్లన వల్లపుగుండె జల్లనన్. 128

మ. గళనాదంబులు దత్తరించుచును సీత్కారంబు రెట్టింపఁ జె
క్కులపై స్వేదము గ్రమ్మ సొమ్మసిలి తళ్కుల్మేను వాల్గన్ను ద
మ్ములుసోలన్ మృదులోరువు ల్వణఁచుచుం బూఁబోణి దీనోక్తులం
జెలువున్వేఁడ రతాంతమంత సడలెన్ శ్రీకృష్ణుఁడున్ వేడుకన్. 129

ఉ. సురతాంతంబున తాంతయై తరుణి మించు ల్గుల్కుశ్రోణి స్నిజాం
బర మొక్కించుక వైచి యొత్తిగిలఁ బ్రేమం గృష్ణుఁ డొయ్యారిబం
గరుచెక్కుల్దనచేలచేఁ దుడిచి సింగారంబు గావించి క
ప్పురపున్ వీడె మొసంగె నంత నలరెం బూఁబోణి విశ్రాంతయై. 130

వ. అంత. 131

మ. తిలిరున్ మోవిని గద్దులేదనెడు నిద్రాకెంపుచిన్నారి చ
న్నులపై సన్నపుగ్రొన్నెలవ్రేలయ వెన్నుండిచ్చు కైదండతోఁ
గలకంఠీతిలకంబు వెల్వెడలి రాఁగాఁ జల్లనై యామునా
నిలముల్ మెల్లనవచ్చెఁ జెంగలువపూనెత్తావి పైఁజల్లుచున్. 132

తే. అంతఁ గృష్ణుఁడు రాధాలతాంగిఁజూచి,కంటె యుత్పలపత్త్రసంక్రాంత మగుచు
నీనితంబంబువలె మించె నీరజాక్షి, యనుచు యామునసైకతంబున వసించి. 133

సీ. ఒప్పుగావిరులతో నొరగొప్పు ఘటియించి బటువుముత్యాలపాపట యమర్చి
తావిపన్నీటిచేఁ దడియొత్తి మోమున సొగసుగాఁ గపురంపు చుక్కదీర్చి
చిరుగోటితాఁకులఁ జిమచిమల్గొను చెంప సందిఁ కుంకుమగంధ మందపఱచి
చెక్కులమకరిక ల్చిత్రించి పాలిండ్లఁ జెదరినహారము ల్చిక్కుదీర్చి

తే. కటినిబురుసా చెఱగుచీరఁగట్టనిచ్చి, సొంపుమీఱ నెగాదిగఁ జూచి ప్రేమ
గడలుకొన శౌరి నిలువునఁ గౌఁగిలించి, మోహనాంగిని జెక్కిలిముద్దుగొనుచు.

తే. చిలుకతో నన్ను దూరుచుఁ జెలువ వెనుక, నలిగి యేమని గడఁగితి వనిన నేమి
లేదనియె రాధ యెటువలెఁ గాదు తెలుపు,మనుచు గృష్ణుఁడు వేఁడసిగ్గునలతాంగి.

ఉ. వచ్చినయప్పు డేననుచు వాకొని గ్రుక్కగ చాన యేటికో
మచ్చికదెల్పుమంచు హరి మాటికి వేఁడిన నిన్ను బాహులం
జెచ్చెరఁ బట్టి క్రిందుపడఁ జేసిమదం బణఁగింతు గట్టిగాఁ
దచ్చెనసైనఁగంతునకుఁ దప్పదునంచుఁ బ్రతిజ్ఞపూనితిన్. 136

మ. అనినన్ రాధ హసింప యింత యలుకా యోరోరి నామీఁదనై
ననునీకోపము తీర్చుకొమ్మటులనైనన్ నీదుకోపంబు దీ
ర్పనె భావింతు నటంచు వేఁడుకొనుచున్ రాధావధూరత్నమో
హనపుంభావకళావిలాసముల నబ్జాక్షుండు హర్షింపఁగన్. 137

క. ఆరాధాధరమధురసు, ధారసధారాతిదర్పితస్వాంతమునన్
గూరిమి రమణుఁడు దముఁదమిఁ, జేరమి నేరమిగ నచటిచెలియలు కలఁగన్.

మ. ఇదిగో వచ్చెద నంచుఁబోయి యిదియేమీ రాఁడు కృష్ణుండు రాఁ
గదరే చూతమటంచు నంగనలు రంగద్రత్నమంజీరము
ల్గదలం గుబ్బల పయ్యెదల్వొదల సింగారంపుఁ గీల్గొప్పులం
బొదలం దుమ్మెదలెల్లఁ బూఁబొదల నెమ్మిం బల్మరుం జూచుచున్. 139

చ. ఒకపొదరింటిలో దలిమ మొక్కటిగాంచి యిదేమి చెల్లనా
యకుఁడు విశేషబంధముల నంగనఁ గూడినపొల్పు దెల్పరే
వికసితజాతిశయ్య కడువేడుకమీఱఁగ రాధఁగూడియే
డకొంచన నోపు నింక నకటా శకటారిని నమ్మవచ్చునే. 140

సీ. గట్టిగాఁగీల్జడఁ గట్టివేయక మున్నె మోసపోతిమి గదా ముగుదలార
గ్రుచ్చి కౌఁగిటఁజేర్చుకొని విడువకయుండ నేరమైతిమి గదా నెలఁతలార
మనచేలచెఱఁగులాతనిచేల ముడిగొల్పఁ దెలియమైతిమి గదా చెలువలార
యొకతెపై నొకతె మానకగూడి యలయింప నేరమైతిమి గదా నెలఁతలార

తే. యెవ్వ రెఱుఁగుదు రింతలో నిన్నివగలు
సేయుటలు దక్కె. గాయని చెలఁగియుంటి
మెంత గృష్ణుని వెతకెద మింతననుచు
వెతల మతితల్లడిల్లి యా వ్రేతలెల్ల. 141

సీ. లత పెనంగొను తమాలముఁజేరి యదెరాధికాకృష్ణు లని చేరి కనుచుఁ గనుచు
శారికకృష్ణకృష్ణ యటన్న నదె కాంత శౌరిఁబిల్చె నటంచుఁ జనుచుఁజనుచుఁ
జాటున బర్హిపింఛముఁజూచి చెలికొప్పుహరియూనుపింఛమో యనుచుననుచుఁ
గలరవంబులు వల్క లలనామనోహర ఘనగళధ్వనియంచు వినుచువినుచుఁ

తే. దరువుఁదరువును బొదఁబొదఁ దెరువుదెరువు
సైకతముసైకతమ్మును సారెసారె
యరసియరసి వ్రజాంగన లందునందు
మఱియుమఱియును వెదకుచు మమత మెఱయ. 142

సీ. నెమిలిపించెమువాఁడు నెఱిమించుసరిమించుగరమించుకాంచనాంబరమువాఁడు
వేణునాదమువాఁడు వినుగెంపు నునుగెంపు గనుపింపు కౌస్తుభకాంతివాఁడు

మొగులుచాయలవాఁడుమురిపెంపుఁగరిపెంపుమఱపింపుగతివిభ్రమములవాఁడు
వెడఁదకన్నులవాఁడు విరిపువ్వుసరికొ్రొవ్వు చిఱునవ్వు కెమ్మోవిఁ జిలుకువాఁడు
తే. సారఘనసారచందనచర్చవాఁడు, కాంతతిలకాంతమౌళిభాగంబువాఁడు
మారసుకుమారసౌందర్యమహిమవాఁడు, మాధవుఁడువచ్చెఁ గానరే మల్లెలార.
వ. అని మఱియు నగంబుల ఖగంబుల మృగంబుల నడుగుచు నడుగుచుఁ జాలు
క్కను వెన్నెలబయిళ్ల వల్లభాయల్లకభరంబునం దల్లడిల్లుచు హల్లకీభల్లకృపా
ణులకు లోఁగి వల్లవపల్లవపాణు లల్లనల్లనం జనిచని. 144
క. కందళదిందీవరని, ష్యందితమకరందబిందు సందోహపరి
స్పందామందానందా, ళిందమిళిందవ్రజం గళింద్రజఁ గనుచున్. 145
మ. యమునా నాయము నాకుఁ గాదనక పద్మాక్షుండు మమ్మీవనాం
తమునన్ స్వాంతమునం దొకింత దయమైనన్ లేక యే డించి స
ప్రమదుండై ప్రమదంబుతో నరిగెఁ జూపన్ లేవుగాఁ దద్వియో
గమునన్ భంగమునందె మాధృతు లనంగప్రౌఢి రూఢింగనన్. 146
తే. భూరికాఠిన్యమత్కుచంబులను బోలి, యవనిఁబుట్టంగ నట్టి దోషాప్తివలన
నబ్జచక్రాంగకరసంగ మభిలషించి, వగచెదరు మీరు నిటచక్రవాకులార. 147
క. అనుచున్ వెదకుచుఁ జనుచో, వనజాప్త సుతానితంబ వైఖరి బటువై
నునుఁదెలివెన్నెల చెలువుం, దనరిన యొక విపులపులినతలమధ్యమునన్. 148
సీ. విరవాదిసరులతో వెడఁజాఱుసిగతోడఁ గమ్మకస్తురితిలకంబుతోడ
మోవిపైఁదిలకించు మొలకనవ్వులతోడఁ గలితనాసామౌక్తికంబుతోడఁ
గండమండలచలత్కుండలంబులతోడ రమణీయతారహారములతోడ
ఘనకటీతటబద్ధకనకాంబరముతోడ నవరత్నమయభూషణములతోడ
తే. నిఖిలభువనైకమోహననిరుపమాన, మానితాకారరేఖాసమగ్రగరిమ
నమరు మన్మథమన్మథుఁ డైనకృష్ణుఁ, డంబుజాక్షుల మ్రోలఁ బ్రత్యక్షమయ్యె.
వ. అప్పుడు. 150
ఉ. చక్కనివాని బోధనిధిసాధుతపోధనచిత్తవృత్తికిం
జిక్కనివానిఁ బ్రహ్మశశిశేఖరముఖ్యుల కైన దృక్పథం
బెక్కనివాని సంతతసమేధికభక్తికి కాని యేటికిం
జొక్కనివాని మానధనచోరుని శౌరినిఁ జూచి కామినుల్. 151
క. మనమానధనము దొంగిలి, చనుచోఁ ద ద్ద్రోహమునను జరణంబులురా
కనిలిచె విడిగొఁగృష్ణుం, డని యవ్విభుఁ జేర నేఁగి యంగనలెల్లన్. 152
సీ. ఏకుందరదనరా యీకమ్మకెమ్మోవిచిగురాకు నజ్జు నజ్జుగను గఱచె
నేగుబ్బలాఁడిరా యీవెడందయురంబు గ్రుచ్చుచో గుబ్బలగ్రుమ్మికమ్మె

నేపద్మపాణిరా యీతేటముద్దుచెక్కుల నెత్తురులుగ్రమ్మ గోరఁజీరె
నేనీలవేణిరా యీతళుక్కుమేనంట ఘనవేణచే వ్రేసెఁ గందువార
తే. నట్టిజగదంటకే గాని యనఁగి పెనఁగి
యుండుదువెనీవు మాభోంట్లయొద్దఁ జేరి
యనుచు నెకసక్కెయములాడువనజముఖులఁ
గాంచి నవ్వుచు గోపికా కాంతుఁ డనియె. 153

చ. నెలఁతుకలార మిమ్మిచట నిల్పి యటం జనుదేర రాధ చె
య్వులనెలయించి తావకవియోగము తెల్పిన నల్గిపోయె నా
మెలఁతుకఁ గూర్చుకోక మనమేవిహరించిన రట్టుపుట్టునా
వెలఁదులుమంచిదంచు హరివెంటను రాధనుజేరి నంటునన్. 154

సీ. ననవిల్తుగరడిసాధనకట్టుకంబంబు శుకవాణి ప్రాణనాయకునిమేను
కమలసాయకుపానకపుఁజలివెందర యిగురుఁబోణిరో జీవితేశుమోవి
మకరకేతనునిధర్మంపుగోటారంబు జలజాక్షి విభునివక్షఃస్థలంబు
వలరాజుపెండ్లిబువ్వపువిందు సంపూర్ణచంద్రాస్య కృష్ణుని జవ్వనంబు
తే. కలికి యటుగాన మనము నాటలకుఁ బెనఁగి, దప్పిదీరంగఁ గ్రోలి ఖేదంబులెల్ల
వదలఁ బవళించి యనుభవింపుదము గాక, యలుగ నేటికి ననరాధ చెలఁగెనంత.

మ. హరిమధ్యాద్వయమధ్యవీథి హరిమధ్యా శౌరిమధ్యంబునన్
హరిమధ్యామణి గల్గుమండలము మధ్యంబొంది యానంది యై
మురళీనాద మొనర్చెఁ గృష్ణుఁడు జగన్మోహైకశృంగారభా
స్వరత న్గన్గొని యచ్చర ల్పొగయ రాసక్రీడయం దంతటన్. 156

సీ. అలసటమీఱ నొయ్యారంబుగాఁ గేల దుఱుమునఁ దుఱిమినవిరులురాల
వలసివల్లములుగా వలిగుబ్బచన్నులఁ గదియించు సరిగెపయ్యెదలు జాఱ
నొకవిలాసముగాఁగఁ జికిలి గోరులమీటు చెక్కుల జవ్వాది చెమటదోరుగ
బడలికపొడమి పై పైనూర్చునూర్పుల కమ్మకస్తురితావి ఘుమ్మనంగ
తే. నల్లనల్లన నిడుపాదపల్లవముల, ఘల్లుఘల్లున కీలందెకవలు మొరయఁ
జెలువుకై దండగైకొనిచెలువుమెఱయ, నంబుజాక్షులుయమునాతటంబుదోరయ.

చ. అతివలవక్త్రము ల్వికసితాబ్జములంచును జేర షట్పద
ప్రతతులచేర నిమ్ము మధుపానమునన్నిశియీూ తెఱుంగ వ
ద్భుతమిది గాదె వారి కుచము ల్దమజోళ్లనుభ్రాంతి నెంతయున్
హితమతిఁ జేరు కోకముల కేమి వివేకము లేక పోయెనే. 158

వ. అయ్యవసరంబున. 159

మ. సరిగె మెఱుంగు బంగరపుఁ జందురకావిపటంబు లూడ్చి బి
త్తరముగఁ జల్వపావడలు దాల్చి బయల్పడుగుబ్బజక్కవ

ల్గరములఁ గప్పుకొంచుఁ గౌతుకంబునఁ దోయముఁ జొచ్చి రయ్యెడం
దెఱకువతో మిటారు లొఱదీసిన మారుకటారులో యనన్. 160

తే. మదవతుల మర్లుకొనఁ జేయు మదను మెచ్చి
ముదముతో దోఁ బొసంగిన మురువుదోఁపఁ
దాళిగోణంబుగట్టి గోపాలమౌళి
చెలులతోఁ గూడి జలకేళి సలుపునపుడు. 161

రగడ. అదిగోఁ జూచితె కృష్ణ యరవిందకోశంబు
సుదతి యానౌను వక్షోజప్రకాశంబు
అవులేర యివిగంటె యలరారె విరిగల్వ
లవియె నీకన్నులకు ననుఁగుఁజుట్టలు చెల్వ
పిలుకుజేడిసమీల బిత్తరంబులు గంటె
నెలఁత బెళ్కుఁగలాదె నీదుచూపులకంటె
ఎడలేదు నిదురించె నిది చిన్నరాయంచ
నడికియున్నది నీదు నడకూరకాయంచ
మెండయ్యెనౌర తుమ్మెదల ఝంకారంబు
దండిమన్మథునికోదండటంకారంబు
కడలేనివెతలచేఁ గందెగాఁ గోకంబు
పడఁతిఁగానకయున్నఁ బాయునే శోకంబు
సుడిలోనఁ గేలేల చొన్పెదవు గోపాల
బెడఁగొల్చులీలలం బెంపొందు నోబాల
కలువపూవులప్రేయఁగాఁ గందె నామేను
తలిరాకుఁబోఁడి మెత్తనిదాన వౌనౌను
పూనినను గొంచానఁ బోను పోపో చాలు
కాననామది యేటి కనిపించు నీమేలు
లోతైనవెఱతు లోలోపలికిఁ దీయకుము
నాతోనె యీవగలు ననువింత సేయకుము
తలరోరి నీచోర తనను లేటికిఁగూడుఁ
తొలుపల్కులకుఁ గదా దూఱెదవు నను నేఁడు
తలచూప నెందుఁ బోఁదరము నీకే వేళ
కలికి నీచనుగొండకడనుందు నీవేళ
పూనుకొని మోరతోపునఁ బోవ బోనీను
నేను నీకటిభూమి నిల్తు నేడకుఁ బోను

క్రొవ్వాఁడినీచేతి గోరఁజీరఁగరాదు
నవ్వెదను నీమేన నాఁటింతు నా పోదు
వేఁడెదవు కోపంబు వీడితిని మన్నించి
మూఁడులోకంబు లిమ్ముల నేలనామించి
తావికుంకుమశోణితహ్రదము చేసితివి
కావునను నేఁగట్టుగనిమేల దీసితివి
వనములో విహరించు వాంఛపుట్టెనె నీకు
నినసూతిపైఁ బ్రేమ హెచ్చ నట్లనెపోదు
బలశాలి వాదు పైపై నీళ్లు చల్లకుము
చెలియ నీయధరమధుసేవవలె మళ్లకుము
మగవాండ్రనింతగా మరులుకొల్పితివౌర
వగలాఁడి నే జక్కవలువఁ గట్టఁగనేర
కలికిచెయ్వుల నెన్ని గతుల మించెదో యింక
వెలఁది ధర్మపుత్రీవ విహరింతు నీకింక. 162

వ. అని పెక్కుతెఱంగుల మర్మగర్భితంబులయి శర్మదంబులగు నర్మోక్తులు వెల యంగఁ గర్మసాక్షికూర్మినందననిర్మలోర్మికలఁ దేలి కుసుమధర్మధర్మసధర్మ భ్రూవిలాసపటుభర్మపటునితోడం దటము సేరి యంతట. 163

మ. బురుసాసీరలు గట్టి జంటఱవికల్పొంకించి సంపంగిక్రొ
వ్విరిదండ ల్నెఱిగొప్పులం దుఱిమి తావిన్మించు గంధంబుఁ గ
స్తురియుఁ గోవజవాది కుంకుమము మెచ్చుల్లుల్కఁగాఁ బూసిక
ప్పురపుఁ నాభులుదీర్చి సొమ్ములిడి యంభోజాతపత్రేక్షణల్. 164

సీ. చికిలిసేయించిన చిగురుఖండాజోదుకన్నెగేదంగిచేకత్తు లనఁగఁ
గందర్పుఁ డాడించు కుందనాటకమునఁబొల్చు కుందనపుకీల్బొమ్మ లనఁగఁ
జిలుకతేజీదొర శృంగారవనమున మెలఁగెడికస్తూరిమెకము లనఁగ
రతిరాజుమణిపంజరమువాసి తమయిచ్చఁ జెలఁగెడు ముద్దురాచిలుక లనఁగఁ
తే. గొలనువెలువడు రాయంచకొదమ లనఁగ
మేఘములఁబాయు క్రొక్కాఱు మెఱుఁగు లనఁగఁ
బూర్ణిమాచంద్రకళలనఁ బువ్వుఁబోండ్లు
వెలసి రభినవశృంగారకలనమునను. 165

ఉ. ఒక్కతె పూలుచుట్ట మఱియొక్కతె గంధమలంద ముందె వే
ఱొక్కతె మిన్న సొమ్ములిడ నొక్కతె బంగరుసాల్వు గట్టఁగాఁ
జక్కెరవిల్తుకన్న నెఱిచక్కఁదనంబుల జాణరాయఁడ
మ్మక్క యనంగఁజాలిన యొయారమునం దగె నట్టివేళలన్. 166

సీ. స్వామి పరాకు హెచ్చరికంచుఁ గొందఱు పంకజాక్షులు బరాబరులు సేయఁ
గీలుకంకణముల కేలెత్తి కొందఱు మోహనాంగులు కొల్వు మ్రొక్కులిడఁగఁ
దంబుజమీటి కొందఱు కుందరదనలు తనమీఁదిపదములు వినికిసేయ
ఘనగోపికామానధనహారి యనుచుఁ గొందఱు చెలుల్బిరుదపద్యములు చదువఁ
తే. గొమలుకొందఱు దగ నూడిగములు సేయ, భవ్యయామునసైకతభద్రపీఠి
రాధనంకంబునుంచి రా రాజసమునఁ, బెద్దకొలువుండె గోపాలభిదురపాణి. 167

మ. తొడపైనుంచిన రాధికామణియు నెంతో వేడ్కతోఁ గప్రపుం
మడుపుల్వల్మాననొక్కి తానొసఁగఁ బల్మాఱున్విలాసంబు గ
న్పడఁగానందుచు మోవినొక్కుచును బైపైఁబొంగు పాలిండ్లఁ గే
లిడుచుం జెక్కిలి ముద్దుగొంచు నలరెం గృష్ణుండు లీలాగతిన్. 168

సీ. తరలాక్షి యొకతె చేసుగటినడ్డము సేసి బోటినొక్కతె కన్ను గీఁటికొనియె
సిగ్గులే యేమి చూచెదమంచు నొకలేమ భామనొక్కతెను జేవట్టిదిగిచె
సుదతి యొక్కతె యట్టెచూచిజంకెన బొమ్మముడితోనుచుక్కని మోముత్రిప్పె
నెఱుఁగవా యిందురాయిఁకనంచు నొకకల్కి చిలుకపై నిడియట్టె కెలయసాగె
తే. మఱియుఁ దగునీరసంబున మగువలెల్ల, గుసగుసలఁబోవవారల కోర్కి నెఱేఁగి
యందఱకు నన్నిరూపులనతులగతుల, రతులనలయించె గోపికారమణుఁడపుడు.

చ. వలచనుగుబ్బలూఁతగొని వాతెఱగ్రోలుచు నెత్తి కౌఁగిటం
మెలఁపుచుఁ గొంతసేపు తమిమించఁగఁ గేళిఘటించి తెచ్చుకో
లలయిక నూరకున్న జలజాక్షునిచిత్త మెఱింగి గోపికల్
చెలఁగుచుఁ దాము పైకొనిరి చెల్వుఁడ చిక్కితి వంచు నవ్వుచున్. 170

సీ. కలగళధ్వనులతో ఖగకులంబులు మ్రోసెఁ గ్రమ్ము నిట్టూర్పుతో గాడ్పువిసరెఁ
దెగుముత్తెసరులతోఁ దెరలెఁ దారావళి చెదరుముంగురులతో మెదలెఁ దేంట్లు
కులుకుగుబ్బలతోడఁ జెలరేఁగె జక్కవ ల్వీడువేనలితోడ వీడెఁదమము
నెమ్మోముచెమటతోఁ గ్రమ్మెఁదమ్మిని తేనెసొగయుగన్నులతోడఁ దొగలమునిఁగె
తే. నింకమీమీగృహంబులకేఁగవలదె, యనుచు రత్యంతమున గృష్ణుఁడాదరమునఁ
బలికినను విన్న నౌ గోపికలముఖాబ్జ, తల్లజంబులతోఁ దూర్పు తెల్లనయ్యె 171

తే. అంత వారల మక్కువ నక్కుఁజేర్చి, యిందుముఖులార యీవేళ నిండ్లకేగుఁ
డటులనయ్యెడు రాత్రులయందుననుచు, నమ్మికలొసంగి హరివంప నలినముఖులు.

తే. వెన్నుఁగనుఁగొని కనుఁగొనివిడిచిపోవ, లేక తమిమీఱఁగాఁ గౌఁగిలించికొనుచు
రేయి రమ్మని వేఁడుచు వేయువగల, మఱలి రొకభంగి గోపికామానవతులు.

సీ. అంఘ్రిలు ఘలుఘల్లుమనఁగఁగీలూడ్చి వైచినరత్నఖచితమంజీరములును
హొయలుగాఁ గొప్పుల పయిపయిఁ జరుపుచో జాఱిన కమ్మగొజ్జంగివిరులు

త్వరఁగొన్ని డ్రెవ్విన దగఁ గ్రువ్వగాలేక యట్టవేసిన తారహారములును
ఘణిఘణిల్లనమ్రోయఁగా విసర్జించిన చిఱుగంట మొలనూలి సరిపెణలును

తే. మరలి త్రోవలఁగాంచు విస్మయముతోడ, నాదునిలు వెళ్ళినంజాలు ననుచు వెడలి
నట్టిరమణులురమణు లేమండ్రో యను భ,యమున నిజగేహములు సేరి రవనినాథ.

తే. కొమిరె చందురుకావి టెక్కెములలీల
నమరె నరుణోదయద్యుతు ల్కమలనాభు
రథమువలెఁ దోఁచె రవియంత రశ్మిగణము
లలమ ద్విజసంఘములకలకలము లెసఁగ. 175

మ. తళుకుంగన్నుల కెంపు కెంపు జిగినిద్దామోవిబల్ గెంపు చ
న్నులపై గ్రొన్నెల సొంపు సొంపుగనియున్ నోరెత్తఁగాఁజాలక
త్తలుమామ ల్మగలున్ లతాంగుల యశోదాపుత్త్రుఁ డెన్నేనిమా
యలుగావించెనో కాని కాక యిటు సేయంబూనునే దాసులన్. 176

ప. అంత శంఖజూట వృషభాసుర కేశిహంతకున కొకనాఁడు నారదుం డరుగుదెంచి
సత్కృతుండై యిట్లని నుతించె. 177

ఉ. శ్రీవసుదేవపుత్త్ర సరసీరుహనేత్ర సుపర్ణనేత్ర బృం
దావనమిత్ర పుత్త్రహవినష్టద మిత్ర హితాబ్జమిత్ర సం
భావితగోత్ర వేత్రపరిపాలిత గోత్రకరాంత గోత్రతా
రావగగోత్ర కృష్ణ యదురాజశిఖామణి నిన్నుఁ గొల్చెదన్. 178

ప. అని ప్రశంసించి భావికార్యవృత్తాంతంబు దెలిపి చనె నంత జిఘాంసాకంసప్ర
హితుండై విప్రహితుండగు నక్రూరుఁడును రేపల్లెకు నరుగుదెంచి వల్లవీవల్లభు
పాదంబులకుఁ బ్రణమిల్లి యిట్లని నుతించె. 179

చ. జయజయకృష్ణకృష్ణ ఘనసన్నిభవిగ్రహ విగ్రహాక్షమా
జయజయ దేవదేవ జలజాతరవిక్రమవిక్రమస్పృహా
జయజయ శౌరిశౌరి వరసంవృత మార్గణ మార్గణప్రియా
జయజయచక్రి చక్రి వరసంభృత గోపకగోపకల్పనా. 180

ప. అని యక్రూరుం డభినందించిన నందనందనుఁ డానందించి నందయశోదాను
మతుండై రాధాదిగోపికల నూఱడించి బలరామాక్రూరసమేతుండై మధురా
పురంబున కేఁగు నెడ. 181

క. భువనవ్యాపకుఁ డగుమా, ధవుఁ డప్పుడు చూపె భక్తతమునకు యమునా
భువనంబున మృదుతాజిత, భవితాఖిలనీలమూర్తి ప్రత్యఙ్మూర్తిన్. 182

క. అక్రూరుని వెంబడిగాఁ, జక్రాయుధుఁ డేఁగుదెంచి సహితాగ్రజుఁడై
చక్రాది దివిజగేహస,మక్రమ మణిధామమధుర మధురకు నంతన్. 183

సీ. రజకునిఁగొట్టి వస్త్రములు గట్టకయున్న దనకు లేదాయెనే కనకపటము
వెస సుదాముఁడొసంగు విరులు దాల్పకయున్న వక్షఃస్థలిని లేదె వైజయంతి
కుబ్జచేకలపంబు గొనకున్న నింది రాకుచకుంభఘుసృణంబు కొదవె తనకు
నంధకారాతివి ల్లపహరింపకయున్న నరయమే మునురాముఁ డనుచుఁదన్నుఁ
తే. గరివరదుఁడయ్యుఁ జెల్లునే కరి వధింప, భువనపతియయ్యుఁ జెట్లతోఁ బోరవలెనె
హరికినిదియు వినోదంబు లయ్యెనేమొ, యనుచుఁదోవచ్చునక్రూరుఁడనఁగ శౌరి.
క. చనువున బలిమిం దగఁ గై, కొనఁదగుఁ గద మేనమామ కూఁతురి నిఁకఁ గం
సునిజంపి జయరమా క, న్యను వరియించెఁ ముకుందుఁ డందఱుమెచ్చన్. 185
క. ఆశింపఁడయ్యెఁగంస, శ్రీసర్వంబునకు నుగ్రసేనునిఁ బతిఁగాఁ
జేసెం బరమానందము, చేసెం దలిదండ్రులకును శ్రీహరియంతన్. 186
తే. గొల్లయిల్లాండ్ర మానంబుఁ గొల్లలాడి, నట్టికల్లరి బ్రహ్మచర్యంబుఁ బూనె
వెనుకటికెగాని యిటునంటివిద్య లేదు, వెనుకనొకనాఁడు కుబ్జఁగూడినదె గాని.
క. గురుసుతునిఁ దెచ్చుకొఱకై, యరిగిన శంఖంబుదొరకె హరికిందద్దు
ష్కరకార్యకార్యఘటనము, దొరకిన సత్కీర్తిమూర్తితోఁదగె ననగన్. 188
వ. అంత. 889
సీ. నలువంకఁ దగుకాంచనముల పూమొగ్గలు ప్రజ్వలస్తంభదీపములుగాఁగఁ
పొన్న క్రొన్ననకమ్మపుప్పొడిదిన్నె యడంబు మీఱినదాడిమంబుగాఁగఁ
దళుకెందలిరుటాకుల గుంపు లందందఁ జఱచుహరిద్రహస్తములు గాఁగఁ
గలకలకంఠికాకలకలనంబులల్లొనేరెడి పాట యనువుచాటఁ
తే. ఛిమిమిఱంగ లతఘాన పేరటాండ్రు, కొమరుక్రొవ్విరివెండిపళ్లెములఁ దేఁటి
యలఁతిజిమ్మిలివాయన మందుకొనఁగఁ, బ్రథమబుతువయ్యెవనలక్ష్మి ప్రాభవమున.
తే. అట్టివాసంతవేళ నుద్యానమునను, మక్కువఁజరించుచుమురారి యొక్కనాఁడు
చెలిమిమీఱంగ నుద్ధవుఁ జేరఁబిలిచి, పలికెఁ గెమ్మోవిచిఱునవ్వ మొలకలెత్త.
ఉ. అక్కట నన్నుఁబాసి క్షణమైన సహింపఁగలేరు గోపిక
ల్చక్కెరబొమ్మ లేకరణి నైఁచిరొ యిన్ని దినంబు లందు లో
మిక్కిలి రాధ యీయెడను మేనుభరించుట దుర్లభంబు నీ
వక్కడికేఁగి కృష్ణుఁ డిదెవచ్చె నటంచు వచింపు ముద్ధవా. 192
ఉ. అత్తల మామలఁ మగల నన్నలఁ దమ్ములఁ దల్లిదండ్రులం
జిత్తులదుద్దువెట్టుచును జీటికిమాటికి నన్నె చేరఁగా
వత్తురు మేలుకజ్జములు వంతుల కిత్తురు నిందుఁగొఁగిటం
గ్రుత్తురు మారుకేళికను గూడుచు మెత్తురు మత్తచిత్తలై. 193
శా. ఏ నక్రూరుని వెంట వచ్చునపు డట్టే నన్ను వీక్షించి నేఁ
డైనన్నిల్వు మటంచుఁ గన్నుఁగొనలం బ్రార్థించినం గూడదం

బేనెమ్మోములు వంచి యున్నరనుచు న్నేత్రాంబువర్షంబులన్
స్నానంజేసిరి పైఁటలచ్చెలులు మానక్ నేర్చునే యుద్ధవా. 194

ఉ. ఎన్నఁడుగారవింతు నొకొ యేనిఁక నిచ్చటనుండివచ్చినం
గన్నెలు గౌఁగిలించి ముఖకంజము లక్కునఁ జేర్చిమక్కువం
గన్నులబాష్పము ల్దొరఁగ గద్గదికోక్తుల నన్నుదూఱినం
దిన్ననిమాటలం గలఁక దేర్చుచు వేడుక నోలలాడుచున్. 195

సీ. చొక్కమైయరగంటఁ జూడఁగానేర్చిన నప్సరస్త్రీలనీడనఁగవచ్చు
నడకువ తిన్నగా నడుగిడనేర్చిన నాగకన్యల నీడనంగవచ్చు
నెలవంటిముద్దుమోములు గల్గెనేని గంధర్వ[illegible]ల నీడనంగవచ్చు
మెఱుఁగుఁదీఁగెలవంటి మేనులూనినను గిన్నరకామినుల నీడనంగవచ్చు

తే. నితరమానవకాంతల నీడనంగ, రాదు కల్లలుగాదు నీ మీఁదియాన
కంతుప్రతిసృష్టి యేమొ యీకంజముఖులు, బ్రహ్మసృష్టిని గాన మాపాటివారి.

క. చుక్కలలోపల మిక్కిలి, చొక్కంబగుచంద్రరేఖ సోయగమున నా
చక్కెరబొమ్మల మించిన, చక్కఁదనంబునను రాధ సన్నుతికెక్కెన్. 197

సీ. సొలపుమీఱఁగ నోరచూపులుచూచెనా వలరాచజాలరి వలలు వెదకు
మొలకనవ్వులు గుల్కు మొగమింత యెత్తెనా ఘనచకోరముల యాఁకండ్లుదీరు
ముద్దుమాటాడి కెమ్మోవి గదల్చెనా కలకలధ్వనులఁ గోయిలలు చేరు
నొయ్యారమునఁ జిల్లు పయ్యెదజార్చెనా కుంభిరాజములు ఢీకొనఁగడంగు

తే. నాచపలమీనలోచన నామృగాంక, వదన నాపల్లవోష్ఠి నామదగజేంద్ర
కుంభజృంభితవక్షోజకుంభ రాధ, నభినుతింపంగ శక్యమే యజునికైన. 198

తే. మగువ నెఱికొప్పుగొప్ప నమాసయనుచుఁ
బొలఁతి నెమ్మోముఁ గన్గొని పున్నమనుచు
భ్రమసియుండుట సంతసపర్వమయ్యెఁ
గలదె యిటువంటి వింత లోకంబునందు. 199

తే. ఇంటివార లొకించుక యెఱుఁగనీయ, రాదనుచు సంచరింతుము రాధ నేను
నాభయము సంభ్రమముఁ జేయు నపనిపాన, కంబులోపలిమిరియపుకారమట్లు.

సీ. ఒకగుబ్బనాప్రక్క నొరయ మూఁపునఁ గేలి నిడునుత్సవములసందడులయందు
జాతరలోనున్న సన్న సేయుచు లేని పనులఁ బెట్టుకవచ్చు భవనమునకు
సంకేతమొనరించు సంధ్యవేళను దాసె వెదకుచో టిదియంచు వేడ్కమీఱ
నడురేయి నిద్రించు నను లేపి కొనిపోవు వేగ యామునతీరవిపినమునకుఁ

తే. బాటఁబాడిన నామీఁదఁ బాటబాడు, మించు పాలిండ్లయందు నేనుంచునట్టి
పచ్చిగోరులు పయ్యెదవిచ్చివిచ్చి, పెరిఁగి లేచిన గనురాధ వింతవగల. 201

మ. కలకంఠు ల్వాలిగుబ్బజంట నెలవంక ల్వ్రేఁడ నేమేనియుం
బలుకన్నేరక రాధ నీళ్లనములున్ బంతిన్ యశోదాంగనా
తిలకం బేమిటి మాట తాఁకినవి యింతే కేతకీకంటకం
బులు బొమ్మం చదలింప నట్లయను నప్పూఁబోణి లేనవ్వునన్. 202

క. ఆనాఁటి వినోదములె, నైన్నినంగలవైననెన్న నాకలుగునొకో
యానారి పరిరంభం, బేనాఁటికినైనవచ్చు నిదె హరి యనుమీ. 203

క. అనిపంపనుద్ధవుఁడుచని, వనితలతో మాటలాడి వచ్చిలతాంగు
ల్వినిపింపుమనినమాటలు, తనతోఁ దెల్పిన మురారి దరహాసమునన్. 204

ఉ. ఏమనిరోయి యుద్ధవ మృగేక్షణ లా మధురాపురంబులోఁ
బ్రేమను వన్నె వెట్టివలపింపఁగ నాయకురాండ్రు గల్గ మా
మోములఁ జూచునే యిఁకను ముచ్చటగా ననిరే బలాబలా
యేమిటిమాట నామనసొకింత యెఱుంగరుగా వ్రజాంగనల్. 205

ఉ ఎప్పుడు వచ్చునంచుఁ దమి హెచ్చఁగ నొక్కెడఁ గాచియున్నచోఁ
గొప్పరపీడ గబ్బిచనుగుబ్బలపయ్యెద జాఱ సంభ్రమం
బుప్పతిలంగఁజేర ముదమొప్పఁగ వచ్చియుఁ గౌఁగిలించుచో
నప్పటిసౌఖ్యమింత గలదా వెలబోటులయందు నెయ్యెడన్. 206

మ. అనినన్నవ్వుచు నుద్ధవుండు కమలాక్షా ముద్ధజారాంగనా
జనసంగం బిది యెంత మన్మథకళాశాస్త్రైకపారీణలై
వినయోక్తు ల్ఘనరక్తులు న్వెలయఁగా వేయాఱుబంధంబులం
బెనఁగంజాలిన ప్రౌఢవారసతులం జేర్కొన్నచో నాపుడున్. 207

మ. ఐనం జూతమటంచు నున్న యెడ నబ్జాక్షానుకూలంబుగా
భానుం డస్తనగంబుఁ జేరఁజనుచోఁ బ్రాగద్రికూటంబునన్
శ్రీనాథప్రియకారిమై పొడమె రాజీవారి తచ్చంద్రికా
శ్రీనైపుణ్యము మించెఁ జోరజనరాజీవారిమై యయ్యెడన్. 208

సీ. తళుకుసంపఁగిమొగ్గతాయెత్తుల్మెఱయంగ నరవిరివిరజాజి సరులుచుట్టి
తీరుగాఁగస్తూరి తిలకంబుదీరిచి మేలిమి బురుసారుమాలగట్టి
మురువైన హుఱుమంజిమురువుతోఁ గట్టాణి ఘనమైనగొప్ప చౌకట్లుదాల్చి
తావికుంకుమపు గంధముపట్టె యురమున రాణించు తారహారములువైచి
తే. వలిపెచెంగావి దుప్పటి వల్లెవాటు, నేలజీరాడ గిలుకుపావాలు మెట్టి
చికిలుసానాకరంబునఁ జెలువుగులుక, నగధరుం డొంటిగాఁ దన నగరువెడలె.

తే. వెంట నరుదెంచు నడప వాల్గంటిచేతి, యుదిరియడపంబు గైకొని యుద్ధవుండు
కెలనఁజనుదేర పరిజనంబుఁను బనిచి, కమలనేత్రుఁడునగరమార్గమునఁజనుచు.

సీ. విటవిటీసల్లాపవికవికహాసము ల్గళనాదసహకారికలరవములుఁ
బురుషాయితాంగనాపరిహాసవచనము ల్చటులకచాకర్ష సంభ్రమములుఁ
దతహ్రృత్కళాదిభేదనముష్టిఘాతము ల్మోదకల్పితశుష్కరోదనములుఁ
గోపనానూపురకోలాహలంబులుఁ గఠినరతాసహాక్రందనములుఁ
తే. భ్రథమరత్యంతకామినీప్రార్థ్యమాన, సరసశృంగారపదపద్యసంభ్రమములు
వేణువీణావినోదము ల్వినుచు వేశ్య, వాటిలో వాసుదేవుండు వచ్చునపుడు.

తే. చకితనేత్రలు దమతమ సంభ్రమములు, వదలి కృష్ణునిఁ జూడఁగా వచ్చిరపుడు
ఏమియాశ్చర్య మాతని నెప్పుడెపుడు, గాంతుమని యున్న వారలు గారె వారు.

సీ. విడువిడురా యని విటుని చెక్కిలిగొట్టి తనమోవి విడిపించికొని యొకర్తు
విటుఁడు పయ్యెదఁబట్టి విడమిఁగుచ్చెలలెల్లఁ జనఁబోఁకముడిబట్టుకొని యొకర్తు
వసగాదు వలపురావలెనంచుఁ గినుకతో నధిపుకౌఁగిలివిడనాడొకర్తు
రతిమధ్యమున లేచి రమణుదుప్పటి చీర యనుచు నట్టిటుఁజుట్టుకొని యొకర్తు
తే. కేళిసదనంబు నందుండి జాలకముల, గాంచి రితరులు ద్వారభాగములఁగడచి
కెలనఁ జేరియు నేఁడి శ్రీకృష్ణుఁడనుచుఁ, జెలులు వేఁడిరితమకంబు కొలఁదిమిగుల.

చ. కనుఁగొని కృష్ణుఁ గామినులు కంతునిబారికిఁ జిక్కి చొక్కుచుం
గొనకొని యేమినోఁచిరొకొ గోపిక లోపికమీఱ నిట్టి దే
వుని మనసార నిద్దపుగవుంగిటనుంచఁగ నిప్పు డేమిటా
రిని గరుణించి వచ్చెనొకొ ప్రేమ నటంచును జూచుచుండఁగన్. 214

చ. కలికిమిటారికత్తె నయగారిచొకారపు మేలుబంతి క
న్నెలతలమిన్న బంగరపు నిగ్గు మనోభపురాజ్యలక్ష్మి నాఁ
గలయొకకాంత మాధవునిఁగన్గొని మోహరసైకలోలయై
తొలఁకెడు వేడ్కతో హరిని దోడుక రమ్మని తల్లిఁబంపినన్. 215

సీ. కప్పువేసిన వెండ్రుకలగొప్పసవరంబు సవరించి పెట్టినజాఱుకొప్పు
దురుసుగాఁ బైకెగఁద్రోసికట్టినవాలుఁజనుదోయి బిగిచూపుజంటఱవిక
మిసిమిపైపూఁత క్రొమ్మెఱుఁగునెమ్మోమున సొగసుగా నిడిన కస్తూరిబొట్టు
జిగిదక్కి స్రుక్కిన చెక్కిలికుబ్బుగా దాపిన కపురనెత్తావి విడెము
తే. వడియు నెమ్మేని కొకవింత బెడఁగునెఱపు, సరిగెచెంగావిపావడ చలువవలువ
చెలువుగులుకంగఁ జెలువు చెంగలువబంతి, హరికిఁగానుకయొసఁగిలోలాంబుజాక్షి.

క. కేలెత్తి మ్రొక్కుతఱి భుజ, మూలనఖక్షతాలు చెలఁగు మురువున మోముం
గీలుకొనగంటివడువుఙ, మేలిమి దెలుపంగ హరికి మెలఁతుక వలికెన్. 217

తే. దేవరకు గంధమొసఁగిన పూవుఁబోఁడి, వక్కలాకులు గైకొని వత్తురనుచు
నింటికై తోడి తెమ్మనె నిపుడటన్న, నౌనె యాకుబ్జగేహమా యనుచు శౌరి.

క. అనుటయుఁ గుబ్జానామం, బునకుం బని లేదు స్వామిపుణ్యంబునఁ జ
క్కనిదయ్యె నియ్యెడను నే, ననరా దివాడఁగలరె యాపాటిచెలుల్. 219

తే. అనిన నీకేల సంకోచ మంబుజాక్షి
కంతుసింగాణిమువ్వంక గాదె మెఱుపు
పలుదెఱంగుల మెఱయదే పద్మముఖికి
మునుపు కొదవేమి యనుచు సమ్ముదితఁ గనుచు. 220

సీ. నీరజాననముద్దునెమ్మోము చెలువంబు గనుఁగొన్నఁ బద్మిని యనుచుఁదోఁచెఁ
గంబుకంధరకంఠకంబుసౌందర్యంబు గనుఁగొన్న శంఖిని యనుచుఁదోఁచె
హస్తీంద్రసిభయాన యానశృంగారంబు గనుఁగొన్న హస్తిని యనుచుఁదోఁచె
నీమనస్వినికి నాపై మది గల్గుట గనుఁగొన్నఁ జిత్తిని యనుచుఁదోఁచె

తే. జాతి యెయ్యది యొక్కొ యీనాతికనిన, మాధవున కేల జాతిసంబంధమనుచు
నుద్ధవుఁడు నక్క నవ్వుచు నుద్ధవమున, నద్ధవుఁడు సేరఁగావచ్చునవసరమున.

చ. పొదిగిట నిల్చిచూచు విరిఁబోడి ముదం బెదఁ బిక్కటిల్లఁగా
నెదురుగవచ్చి తోనచెలులిచ్చిన కమ్మనితావినీటఁ ద
త్పదజలజాతము ల్గడగి పయ్యెదచేఁ దడియొత్తి యింపుసొం
పొదవఁగఁ గేలొసంగి వినయోక్తులఁ దేనియలొల్కఁ బల్కుచున్. 222

సీ. గోపికారమణులఁ గూడుక క్రీడించు శ్రీకృష్ణు వ్రాసినచిత్తరువులు
సకినెలతలగడ ల్పప్పుడైనను దోన కివకివల్గొఱుగుపవపుజోల్లు రు
కమ్మక్రొవ్విరిమేలుకట్లకుఁ దేటులై తిలకించు సాంబ్రాణిధూపములును
బదివన్నె దివ్వెకంబమున మాణిక్యంబు లీల నెంతయుఁ బ్రజ్వలించుదివ్వె

తే. గలిగి విలసిల్లు కేళికాగారమునను, జాళువాకోళ్ళ పట్టెమంచంబునందు
ధవుని వసియింపఁ బంచియుద్ధవుని జెంతఁ, బసిఁడిగద్దియనుండె నప్పద్మగంధి. 228

తే. వక్కలాకులు విరు లొక్క వరుససొమ్ము
లవి కెపావడ జంట చెఱంగుచీర
యుద్ధవుఁ డొసంగ వింత సేయుదురె యంచుఁ
జెలువజనని ప్రియోక్తులు పలుకుచుండ. 224

తే. సదనమునకేఁగి పన్నీట జలకమాడి, హరువుమీఱంగఁ గైసేసి యారగించి
లలితమన్మథసామ్రాజ్యలక్ష్మివోలి, వచ్చినిలుచున్న చెలిచెలువంబుఁ గాంచి. 225

సీ. శశిసహస్రకళాప్రసన్నుఁడై యుండెనా చెలిమోముతో సాటి సేయవచ్చు
జలజపత్రములు చేరలకెక్కుడుండెనా పొలఁతికన్నుల సరిఁబోల్పవచ్చుఁ
బదియేడువన్నెల బంగారు గల్గెనా కలికిమేనికిఁ బ్రతిఁబలుకవచ్చుఁ
గనకాద్రికింక నొక్కటి జోడుగల్గెనా వనితగుబ్బల కెన యనఁగవచ్చు

తే. ననుచుఁ బొగడుచుఁ దలయూఁచి హరి వయస్య
మోముఁజూచిన యంతట స్వామికరుణ
యట్టిదే కాదె యాశ్చర్యమా యటన్న
మంచిమాటంటివని వేశ్యమాత యపుడు. 226

తే. కామినీమణి చిన్నది యేమియెఱుఁగ, దెటుల మతిసెప్పి సేవ సేయించుకొనఁగ
వలెనొమీచిత్తమనుచు నచ్చెలువచేత, విడియమిప్పింపఁగైకొనివెన్నుఁడపుడు.

క. గందవొడి పక్కలాకులు, నందుక సుద్ధవుఁడు వారిజాక్షులు సన గో
విందుఁడు గాంభీర్యంబున, ముందుగఁ దను జెనకకున్న మోహము మీఱన్.

సీ. మడుపు సాలుటయును మదిరాక్షిసకినెలు గులుకుమంచముమీఁదఁ గూరుచుండి
చిఱునవ్వుమోమునఁ జెలువుని పాదపల్లవములు కోమలోరువులనుంచి
తలిరులు పెనఁగొను చెలువున నొత్తుచు గిలిగింతగొనఁగఁ గెంగేలుదొడల
సోఁకించుచునుగోటి నుకలంటఁ బిసుకుచుఁ గరకంకణంబులు ఘల్లుఘల్లు

తే. మనఁగఁజిటపొటగ్రుద్దుచునంగుళంబు, లొయ్య నెటికలుదివుచుచు నెయ్యముసను
గన్నుఁగవనొత్తుచును గబ్బి చన్నుఁగవను, జేర్చుకొంచుఁ బదాబ్జసంసేవచేసి.

చ. పలుకవదేమి సామి యొకపాటివధూటిని నీవు మెత్తువే
చెలువముగుల్కు రాధవలెఁ జిత్తమురంజిల సేవసేయఁగాఁ
గలిగినకాంతఁ జేకుటినగాకిపు డావెఁ దలంచుకొంటివో
పులకలు నిండెనంచు విరిబోఁణి ముదంబునఁ బక్కఁజేరుచున్. 230

సీ. ఏదేది సామి నామీఁదిప్రేమకు గుఱు తనుచుఁ బుక్కిటివిడియంబుఁ గొనుచు
నవు మంచివగలకాఁడవె నీవు చేనందుకొన వంచు విడెము పల్లానన్నొసఁగుచు
విడువరా మడుపుసందడి మోవి నేలనొక్కెదవంచుఁ గినిసి జంకించుకొనుచు
మొదటనే నునుబోఁకముడికిఁ బెనంగెదు పసగాదొతమియంచు మసలుకొనుచు

తే. నెంతదడ వూరకుండఁగా నేమియెఱుఁగ
వేమొ యనియుంటి నీవేల యెఱుఁగ వింత
నాఁడె ప్రేపల్లె సతులమానములుగొన్న
చతురుఁడవుగావె యన నగి శౌరి పలికె. 231

చ. చెలి యాభీరుల నెన్న నేల యిదె యక్షీణప్రతాపంబుతో
నలరున్నే జవజీరుపోరునను బోరాడంగ నీకే తగుం
దొలుతన్ రాధకుఁ జెల్లు నన్నుఁగినుకన్ లోలాక్షి దేవాంగనా
తిలకం బేయది యంచు మార్గొగముగా ధీరుండు లేనవ్వనన్. 232

చ. వనితరో కోపమేమిటికి పల్లవకాంతలలోన జాణయౌ
నని యలరాధఁ జెర్గొనుట యంతియె నీసరిరైనఁ జేసినం

గినుకను నేర్పుసూపుటలు గెలిగదా యని వేఁడి నిక్కమౌ
నని మరుఁ డెచ్చరింప ఘనమౌ తమి మన్మథయుద్ధలోలరై. 234

సీ. అంగనకనుబొమ సింగాణి యెక్కిడి పొరిఁబొరిఁజూపుఁ దూపులనిగుడ్పఁ
బతివానిలక్షణ ప్రత్యస్త్రములఁ ద్రిప్పి నిఖిలాంగకంబుల నిగుడఁజేయ
నభిమంత్రితంబులై యవి వశీకరములై కుచకుంభమధ్యంబుఁ గ్రుచ్చునపుడు
కుంకుమఘర్మపు క్రొన్నెత్తురందంద యలరంగఁ గళవట్టినట్టు సొగయ

తే. నలుక బలమేడకోఁజన నటపటాగ్ర, కలితకేతువు వాల్పులోకట్టు సెదరి
బట్టబయలయ్యె రణమహీభాగ మంతఁ, గాంతలోనయ్యెనని శౌరి కౌతుకమున.

క. స్తనకుంభికుంభయుగము జ, ఘనఘనచక్రంబు నఖముఖక్షతములు గా
నొనరిచి బాహాయుద్ధం, బునఁ బెనఁగుచుఁ గ్రిందుపఱిచి పోరఁగనంతన్. 235

చ. పొలఁతుక క్రిందుమీఁదగుచు భూషణతూర్యనినాద మొప్పఁగా
కొలకనకోళ్లు లావుకలు కోకిలము ల్కలహంసము ల్శిఖా
వళములు బోరువాలు నలువంకఁ బ్రతిధ్వను లీయలీయమై
గళరవము ల్ఘటించె రతికాంతరణాంతరశంఖభంకృతిన్. 236

సీ. అంగంబులవు డేకమయ్యెనో నా గట్టిగా బాహులతలచేఁ గట్టికట్టి
మొనలుఁబోమ్మునటి వెనుచక్కి వెడలఁగాఁ గోడెగుబ్బలఁబోమ్ము గ్రుమ్మిక్రుమ్మి
యలుకలు కబళించి యధరాధరము పంటఁజిక్కించికొని గంటి చేసిచేసి
మొనగోర నిజబాహుమూలము ల్కంఠంబు చిన్నారిచెక్కులుఁ జించిచించి

తే. యతనుసమరంబు సేయు నయ్యతివ క్రిందు
బఱచె హరి యంత నంతలోఁ బద్మముఖియు
మరలి పైకొనె మొలనూలి చిఱుతగంట
మ్రోఁతచే డిండిమధ్వని బోదిసేయ. 237

ఉ. కుంచితపాదయై తివురుకోపులుమీఁటఁగ ధూర్తకృష్ణునిఁ
వంచనచేసి క్రిందుపడవైచితి నింకిట నీమదం బడం
గించకపోదు నే యనుచుఁ గేరడము ల్పచరించు చెక్కుదా
టించుఁ గురుల్గ్రహించు నెఱపెక్కున వాతెఱ గ్రోలు వ్రాలుచున్. 238

తే. అంతనొక్కింత బడలి పద్మాయతాక్షి, స్వామి చెంగట నే పౌరుషంబు నెఱప
నెంతదాన నటంచు శయించి చిత్ర, రతులఁ దేలించెఁ జాశీతిగతుల శౌరి. 239

వ. అప్పుడు. 240

సీ. ఏదేదినాసామి యిది వింతయౌనంటి వని గళధ్వని మెచ్చుకొనెడి సొలపు
శౌర నాప్రాణనాయక యేలితివి మేలు మేలని రతిశక్తి మెచ్చు మెలఁపు
నయ్యలూ నీదాసి నయ్యెదరా పాయకుర యంచుఁ దమిరేగి కొసరువలపు
బడలితివేమొ నా పంచదారలమోవి యిందరాయని తేనెలిచ్చుతలఁపు

తే. వలసినా నింక విడవరా యనుచు సాక్కి, మోడ్పుకన్నులఁ గెంగేల మ్రొక్కు నలపు
బతిని గరఁగించెఁ బతి కేళి సతి నిగరఁచె, నిరువురును గేళివిశ్రాంతిఁ బొరసి రంత.

మ. సరసాలాపములన్ వినోదగతులన్ సంగీతసాహిత్యవై
ఖరులన్ ద్యూతకళావిలాసముల శృంగారప్రసంగంబులన్
స్మరశాస్త్రార్థవివేచనంబులను శశ్వద్ద్వంద్వవైచిత్రులన్
హరికిన్ వేడుక సేసె నిద్రపయి నీర్ష్యం గాంత రేయంతటన్. 242

వ. అంత. 243

క. కలకల పక్షులు బలుకఁగ, జలజాక్షుఁడు విస్మయమున సఖియరో యపుడే
తెలవాఱె నేఁడొక నిమి, షము వలెఁ దోఁచెన్ విలాసవైఖరి వలనన్. 244

క. నెఱజాణవు నిను మెచ్చితి, వరమిచ్చితి వేఁడుమనిన వనిత దినము నీ
పరిరంభము కావలె నన, హరి మంచిది యనియె ననిన నతివ చెలఁగుచున్. 245

చ. తలిమము డిగ్గుచో చరణతామరసంబులు పైఁడిగుల్కు పా
వలు ధరియించి కేలొసఁగ వల్లభుఁ డల్లన కేళిగేహమున్
వెలువడి కాంత నిల్పి కడువేడుక నుద్ధవు కేలుదండతో
నలరుకటారి కాని నెఱయంపము గేలి యొనర్చు బాగునన్. 246

ఉ. చెంప కొకింత జాఱుసిగ చెక్కిటి గోరును కన్నుఁ గోనలం
గెంపును గెంపుమోవి బలు కెంపును నెమ్మెయి చిట్లు గంధమున్
సొంపులు మీఱ నారజపు సోయగ మారయటంచుఁ గోరి లో
చంపకగంధులాడుకొన శౌరి గృహంబునకేగె నీటునన్. 247

క. లోకారాధ్యుఁడు గావున, శ్రీకృష్ణున కిటుల నడువఁ జెల్లెం దగు నే
యాకైవడి వర్తింపఁగ, లోకము వారలకు రాజలోకవతంసా. 248

వ. అంత. 249

క. హరి యక్రూరుని బంచెన్, ధర పాలిప్పించు పాండుతనయుల కంచున్
కురుపతి యంధతనా స, త్పురుషుని శుష్కోపచారముల మరలించెన్. 250

తే. సైన్యములఁ జంపి యల జరాసంధధరణి
పతినిఁ బదియేడు మాఱులు పాఱఁద్రోలి
యవనుముచికుందు నేత్రాగ్ని నణఁగఁజేసి
హరి యుపాయంబుననె యపాయములు దొలఁగ. 251

క. అలభర్గనుతుఁడు జలధిన్, ఖలదుర్గమమైన ద్వారకాపురి సేరెన్
బలవర్గముతో హరికిన్, జలదుర్గమువలనె వలదె జనపాలురకున్. 252

శా. శ్రీకాంతాస్పదమై దమైకనిధి ధాత్రీదేవతాసంతత
వ్యాక్లృప్తాధ్వరమై రమైధకసముద్యద్విక్రమక్షత్త్రియా

నీకషోల్లసమై సమైలబిలవాణిజ్యార్యశూద్రార్జితా
స్తోకార్థాధికమై కమై జనుల కెందుఁ జెల్వమా ద్వారకన్. 253

తే. అప్పురి కుశస్థలియనంగ నొప్పుమున్ను, ద్వారవతినాఁగరహిమీఱుద్వాపరమున
దాని సౌభాగ్యమెన్న నెవ్వాని శక్య, మల్లవైకుంఠమే తప్పదు నరేంద్ర. 254

ఉ. యాదవ వృష్ణిభోజ కుకురాంధకసాత్వతు లాదశార్హులా
మోదదశార్హులై కొలువ ముఖ్యసుధర్మసభానివిష్టుఁడై
శ్రీదయితుండు రంజిలె నశేషసురాశ్రితపార్శ్వభాగుఁడై
నాదివిజాధినాయకునియందమునన్ భువనంబుఁ బ్రోచుచున్. 255

సీ. మునురుక్మిణిసి విన్న యనురాగ మంతరంగావాలతలమున నంకురించె
వెనుకవిప్రుఁడువచ్చి విచ్చేయు మనిపిల్వఁగొమరుమీఱఁగ ననల్కొనలుసాగెఁ
గుండిననగరంబుదండనిల్చినవేళ మేలుగీలుకొనంగఁ బూలుబూచె
శైలకన్యానివాసంబు వెల్వడఁబోఁగఁ గనుఁగొనగా దోరకాయలయ్యె
తే. నెత్తిరథమున నిడ ఫలియించెనన్య, రాజలోకంబు గెల్చి ద్వారకకువచ్చి
ప్రేమఁగల్యాణమై రతిక్రీడఁదనియ, వనజనాభునకనుభవంబునకు వచ్చె. 256

మ. మొదలం దొంగగు నేమియాఁడఁజను సొమ్ములాసపైఁబెట్టి ప
ల్కుదు రెవ్వారిలలో "గ తానుగతికో లోకో" యనన్ సత్యమా
నదిరా మున్నవనీతచోరుఁడని కాదా భక్తినిశ్శ్రేయస
ప్రదుఁగృష్ణు స్మణిచోరుఁ డంచనియె సత్రాజిత్తు విత్రాసియై. 257

చ. వసుమతి నెంతవారలకు వచ్చునొకానొక నింద వచ్చుచో
నసురవిఘాతిరీతిఁ బరిహారముసేయ నొకండు నేర్చునే
బిసబిసనేఁగి జాంబవతిఁ బెండిలియై మణిఁదెచ్చి యిచ్చి యిం
పెసఁగఁగ సత్యభామ వరియించె వినిందకుఁ డార్తిగుందగన్. 258

మ. అటఁగాళిందిని మిత్రవిందనుసుదంతాబ్జాక్షి భద్రామహీ
కటినిన్ లక్షణ బెండ్లియై నరకునిన్ ఖండించి వానింటఁజొ
క్కటమైమించు పదాఱువేల మహీరాట్కన్యావతంసంబులన్
ఘటియించెం దనకుం గులాంగనలుగాఁ గల్యాణలీలాగతిన్. 259

సీ. కలహాంతరిత భోజకన్యను లాలించు స్వాధీనపతిక సత్యను భజించు
వాసకసజ్జిక యాసుదంతను గూడు విప్రలబ్ధను మిత్రవింద నరయు
ఖండితయైన లక్షణ వేఁడికొనువిరహోత్కంఠితను భద్రనూఱడించుఁ
గాళింది నభిసారికనుజేరి కలయుఁ బ్రోషితభర్తృకను జాంబవతినిఁ జేరుఁ
తే. గడమ పదియాఱువేవురుకంజముఖుల, భావహావవిలాసవిభ్రమవిహార
లలితబిబ్బోకచకితలీలాదరస్మి, తాదిశృంగారచేష్టల కలరు శౌరి. 260

క. నీలానీలాలక రా, థాలలనను దోడితెచ్చి దయమీఱంగా
నేలెం గులకాంతలతో, నాళీకాక్షుండు రతుల నానాగతులన్. 261

తే. చంద్రముఖి కోరఁగను పేంద్రుఁడింద్రుఁగినిసి, పారిజాతంబు గొనెఁదనపాలుగాఁగ
భామినులవల్లఁగాదె సౌభ్రాత్రమునకుఁ, గలుగునొక్కొక్క యెడవిభాగంబుధరను.

క. కనెఁబదుగురిఁ బదుగురిఁ బ్రతి, వనితామణియందు సుతుల వనజాక్షుఁడు ద
త్తనయులకు లెక్కలే దిల, ఘనవర్ణనిభాగ్య మెన్నఁగాఁ దరమగునే. 263

చ. అలరుకటారిజోదు మొదలైనకుమారులు తత్తనూజులుం
జెలువము మీఱఁగాఁ గొదమసింగములంబలెఁ బార్శ్వసీమలన్
గొలువఁగ నిండుకొల్వయి ముకుందుఁడు వేడ్క జగజ్జనంబు మె
చ్చులకయి విశ్వరూపమును జూపినవైఖరి మించె నెంతయున్. 264

క. హరుఁ గొలిచి సాంబుఁ గనియెన్, హరియందురు గాని యెదిరి యనిఁ జేసినయా
హరుఁ గెలిచి బలికుమారుని, కరములు ఖండింపఁడే జగంబులెఱుంగన్. 265

వ. అంత నఘశిక్షకుండు నృగునకు మోక్షంబొసంగి యాదవవేదండంబు గావున నారదు భ్రమియించి భీమాయుధస్ఫూర్తి రాజమండలగ్రాహక మాగధ తమస్స్ఫురణం బడంచి సుదర్శనంబునం దమఘోషనందనుని తేజంబునం గూల్చి మరియు భూభారకులగు సాల్వదంతవక్త్రవిదూరాది భూవరుల హరించి సకల దిగ్విజయలక్ష్మీసమేతుండై జగత్కల్యాణకరుండై ద్వారక సామ్రాజ్య మేలుచుండె నంత నొక్కనాఁడు. 266

తే. తనకుచేలత్వ మట యథార్థంబు గాఁగఁ, జింపిదోవతి కొంగునఁ జేరెఁడంత
ముడిచి తెచ్చినయడుకులుపిడికెఁడంటె, మమతకృష్ణుఁడు మెసవెడిసమయమునను.

సీ. చినిఁగి మాసికలు వేసినకోక బంగారు చెఱఁగులచెంగావి చీరయయ్యెఁ
జెవులకుఁ జాలని చిఱుతలక్కాకులు కట్టాణిముత్యాల కమ్మలయ్యెఁ
పుస్తెమాత్రమె కాని పోఁడిమెఱుంగని గళమున హారము ల్నెలవుకొనియె
నొకటిరెండోఁ గాజులున్నకరంబుల నవరత్నమయకంకణములు వొదవె

తే. నలకుచేలునిసతికి దుస్సలకు మఱియుఁ, జూడచూడంగ మైఁగ్రమ్ములకును
గొదవలేదయ్యెఁ బ్రబలుసంపదలవలన, రుక్మిణీనాథుదివ్యకారుణ్యమునను. 268

ఇవ్విధంబున సుగృహీతకుచేలుం డగు కాంచనచేలుండు సుశ్రీలుఁ గావించి ఖాండవదహనంబున నైన యాఖండలు భండనంబున గాండీవకోదండునకు విజయసుభద్రావాప్తి ఘటించి మనసు భద్రావాప్తిం జేసినది హెచ్చుగాదు పరవాసుదేవలోకనివాసు లగు భూసురకుమారులం దెచ్చి విప్రుచుం జిచ్చుసారకుండమాన్చి రక్షించె నదియునుంగాక మీపెద్దలగు పాండునందనులఁ బెక్కుచందంబులఁ బోషించె నది యెట్లనిన. 269

సీ. కృష్ణమానంబు రక్షించె శాకాన్నంబు గొని పాత్ర నక్షయోదనము నించెఁ
గట్టిసారథియయ్యెఁ గాంగేయుపైఁ జక్ర మెత్తి విష్వచ్ఛున కీశుచేతఁ
బరమాస్త్రమిప్పించె భానుగప్పెను భగదత్తాస్త్రమున కురఃస్థలము పూనె
ద్రోణువారించెఁ గర్ణునిశక్తిమఱపించె నహిబాణమునకు దేరణఁగఁ ద్రొక్కె
తే. సన్నజేసి సుయోధను సమయఁజేసెఁ, బెనిచె నుత్తరగర్భంబు భీముఁ బ్రోచె
మహికిఁ బట్టముఁగట్టె ధర్మజుని వింటె, పంకజాక్షుని పాండవపక్ష మధిప. 270

క. తనుఁగొలిచిన తనుఁబొగడినఁ, దనచారిత్రములు విన్న ధన్యులకెల్లన్
వనజాక్షుఁడు గృష్ణుఁడు గో, రినకోరికె లొసఁగుననిన నృపుఁ డలరారెన్. 271

సీ. పెనఁచికట్టినపట్టు పించంబు నడిపట్టు చంద్రకాంచితవిలాసములు దనరఁ
బుట్టినవంశంబుఁబట్టినవంశంబు బహుపర్వసంగతిఁ బరిఢవిల్ల
భాసమానగళంబు పదపద్మయుగళంబు నమల ముక్తాశ్రయంబైతనర్వ
నపదానుజాతంబు నాస్యాంబుజాతంబు నానాసుకృజ్మోహనంబు గాఁగ
తే. శ్రీలవిలసిల్లు గోపాలకృష్ణమూర్తి, గంధగజహేమపర్యంకికాతురంగ
చామరఛటాది శాశ్వతైశ్వర్య మొసఁగి, సేవకశ్రేణి నెపుడు రక్షించుఁగాత.

క. అని శ్రీవైశంపాయన, మునిముఖ్యుఁడు దెల్పవిని ప్రమోదాన్వితుఁడై
జనమేజయుఁ డవ్వలికథ, యనఘా వినవలతుఁ దెల్పుమని యడుగుటయున్. 273

మ. ఛలనిద్రాననచుంబనావసరదృష్ట శ్రీకపోలస్ఫుర
త్పులకప్రీళిత ముగ్ధకోకకుచసభ్రూభంగమధ్యాధర
స్థలదంతక్షతకేళికాపరమనోజ్ఞాతప్రగల్భాంగనా
కలనాదోదిత పాహిపాహి ముఖవాః కల్లోలహల్లోహలా. 274

క. అనురాగ సమాకర్షిత, కనకాంశుక నీవిబంధఘటనా క్షమతా
పనమన్మగథీగోపిక, ఘనజఘనా దానవర్షి గజరాజఘనా. 275

ఉత్సాహము. రాధికాదిమహితపర్వరసిరసాన్న దానధీ
రాధికానుమోదరంగదంతరంగసంగతా
రాధికాధినాథభక్తరంజనాననప్రచా
రాధికారసంగసంగరాంగణాదిభంగదా. 276

గద్య. ఇది శ్రీరామభద్రదయాభిరామభద్రకరుణాకటాక్షవీక్షాపరిప్రాప్తదీప్తతరాష్ట
భాషాకవిత్వ సామ్రాజ్యధౌరేయ సకలవిద్వత్కవిజనవిధేయ ధరణిదేవుల నాగ
నామాత్యసుధాసముద్రసమున్నిద్రపూర్ణిమాచంద్ర రామమంత్రీంద్రప్రణీతం
బైన దశావతారచరిత్రం బనుమహా ప్రబంధంబునందు అష్టమాశ్వాసము.

ల. అవతారంబగు బలరామావతారము సమాప్తము.

# ౯. బౌద్ధావతారకథ.





నవమాశ్వాసము.

లాలిత మగదలవం
శాలంకారాయితోదయ సమగ్రదయా
లీలాలవాల హృదయతః
మాలేయశరణ్య కృష్ణమంత్రివరేణ్యా. 1

తే. అవధరింపుము జనమేజయక్షితీశ, శేఖరున కిట్టులను వ్యాసశిష్యమౌని
బుద్ధకల్క్యవతారములుఘ్పయిఁకను, తెలియఁ జెప్పెదవినుమని దెలుపఁదొడఁగె.

సీ. శ్రీతారకబ్రహ్మసేవకుం డై భవతారకుం డగునర్ధతారకాధి
పతిశిఖామణితనూభవునిచేఁ బరవీరతారకాభయదుఁడౌ తారకాసు
రుఁడు గూలఁ దత్కుమారులు తారకాక్షుండుఁ గమలాక్షుఁడును భుజాగర్వశాలి
యైన విద్యున్మాలి యనశనవ్రత మూని వేయేండ్లుతపము గావింప మెచ్చి
తే. ధాత ప్రత్యక్షమై కామితములు వేఁడుఁ, డనిన దైత్యు లమర్త్యత్వ మభిలషింప
వలదు వేఱొకకోరికెఁ దెలుపుఁడనిన, బ్రహ్మఁ గనుఁగొని వారలు పలికి రిట్లు.

తే. అబ్జసంభవ స్వైరవిహారయోగ్య, మమర గంధర్వసిద్ధసాధ్యాదినిఖిల
శాత్రవాసాధ్యమైన పురత్రయంబు, మాకు దయసేయు మనిన నాలోకవిభుఁడు.

క. మయునిం బిలిపించి పుర, త్రయము న్నిర్మింపు మీవు తాదృశమహిమ౯
దయసేసెదఁ బురములకని, ప్రియమున నజుఁడనియె దనుపుబిడ్డలతోడన్. 5

ఆ. ఎన్నఁడైన నేమి యీపురత్రితయంబు, నొక్కదిక్కుఁ జేరు నొద్దికగుచు
నాఁడు బలియుచేత నాశమౌ నందాఁక, సమయ దనుచు నజుఁడు సనియె దివికి.

సీ. శతయోజనాయుతసాలసౌధాగారశృంగారవనికావిచిత్రములుగఁ
జిన్నంబుచే వెండిచే నుక్కుచేతను ద్రిపురము ల్మయుఁడు నిర్మించి యొసఁగె
హేమపురంబున కేలికయై తారకాక్షుండు త్రిదశాలయంబునందు
రాజితమగు నగరంబున కొడయుఁడై కమలాక్షుఁ డంతరిక్షంబునందు
ఆ. నాయసపురికీశుఁ డగుచు విద్యున్మాలి, యుర్వియందు మెలఁగుచుండి రష్ట
దిగధిపాలముఖ్యదేవతాజయ్యులై, సకలభోగభాగ్యసహితు లగుచు. 7

సీ. ప్రాలునింద్రాదిదిక్పాలవల్లభుల పట్టణములు నేలమట్టములుగాఁగఁ
బఱచు హేమనగాదిపర్వతరాజశృంగంబులు ఛిన్నభిన్నంబులుగను
నెగయు భానుశశాంకనిఖిలగ్రహము లూడిపడఁగ బ్రహ్మాండకర్పరముదాఁకఁ
దూఱువారాసులు దుర్వారతరసప్తపాతాళవాసులు పగిలిపాఱఁ
తే. దిరుగు బహుచిత్రగతుల సంబరమునందు, నిజగతాగత మెఱుఁగక నిబ్బరముగ
నొరసి దేవవిమానము లుర్విఁ గూలఁ, బ్రశమితజగత్త్రయంబు పురత్రయంబు.
సీ. అనిచేసి పొడిసేతు మని యెందువెదకుచు పురములు గానక తిరుగుటకును
బరికించి చోరలేక పైవైచి వజ్రాదిబహుశస్త్రములు మొక్కపఱుచుటకును
బాలెంబుడిగి యున్నపట్ల నెందేనొక్కపురి గుప్పుమని కూలఁ బోలియుటకును
కైలాస మందర కనకాద్రి ముఖ్యభూధరకందరములందు దాఁగుటకును
తే. నెందు బెడబెడమనిన మహీధరంబు, విఱిగి పైఁబడునంచును వెఱచుటకును
గాసిదైత్యాధిపతులతోఁ గలసిమెలసి, యాహవముసేయఁజాలరింద్రాదిసురులు.
క. పురదైత్యపరాజితులై, హరిహయముఖదివిజు లజునిఁ బ్రార్థింప వచో
వరుఁ డాయమరులతోఁ జని, హరువేఁడిన నతఁడు శౌరి నడుగుదమనుచున్. 10

మ. నెలపూఁదాలుపు గిబ్బనెక్కి వెడలన్ వెన్వెంట నచ్చంపుతె
క్కలతేజీ నడిపించెఁ బద్మజుఁడు మున్గాకుండ దట్టించుచున్
వలచే వాగెబిగించి హస్తిడిగి యశ్వంబెక్కి కూడెన్ విశ్వం
ఖలుఁడై వాసవుఁ డన్యనిర్జరులు వెన్కంబోయి రంతంతటన్. 11
క. అప్పుడు గలశాంభోనిధి, చప్పుడు పెద విన్నపములు సాగింపంగా
నప్పలుకుచెలువచెలువుఁడు, విప్పం గనుదొరలతోడ వేడుక ననియెన్. 12
మ. చెలువారంగఁ దరంగహస్తముల రాజీవాయతాక్షీలచం
చలవాతాహతధూతశీతల వృషత్సంఘాతముక్తాళిచేఁ
గలశాంభోనిధిసార్వభౌముఁడు వియద్గంగాలతాతన్విపైఁ
దలఁబ్రాలొయ్యు తెఱంగు గంటిరె శుభోదర్కంబుగా నీయెడన్. 13
క. కలశాంభోధి మథింపఁగఁ, గలిగినయమృతంబు మీరు గైకొని వెన్నన్
నలినాక్షునిపా లిడినటు, వలెనున్నది తెల్లదీవి వైఖరి నిచటన్. 14
క. సమ్మదమెసఁగం గంటిరె, తుమ్మెదగల మావిపంటితులదూఁగుచు నీ
క్రొమ్మొగులుడాలు వేలుపు, కమ్మనికుందనపుమేడఁ గడుచోద్యంబై. 15
వ. అని యకుంఠితమహిమాకరంబగు వైకుంఠపురంబు వాణీకలకంఠకంఠికామనో
హరుండు వర్ణింప సముత్కంఠత వినుచు నీలకంఠాది విబుధకంఠీరవు లుపకంఠ
నిరవకుంఠనముక్తాతోరణఘృణిశుంఠిత శతసహస్రగురువరారోహాజారం బగు
హరిహాజారంబుఁ బ్రవేశించి దగద్ధగితమణిమయచతురకక్ష్యాంతరంబులు గడచి

యవల వలమానజనంబులవలన లలనాసమేతుండై శృంగారవనంబున కరుగుట
విని యద్దేవుని రాకకై యుద్యానవనవాటికాద్వారంబునఁ గైరవాప్తుం దృణీక
రించు నిగనిగని మగఱాల వెన్నెలగనియగు తిన్నెలుగని వసియింప నెంచు
నవసరంబున. 16

తే. చెలువ యొక్కతె వచ్చె నా చెలువఁ జూచి
కమలయంచును భ్రమసిరి యమరులెల్లఁ
గనకవేత్రంబుఁ గని దాదిగాఁ దలంచి
యుండి రాఖండలాదు లయ్యువిద యంత. 17

క. హరుని వచోయువతిమనో, హరునిఁ బులోమాసురేంద్రహరునిన్ గురునిన్
హరి రమ్మనియె నటన్నన్, హరుసముతో వారు నలువు రతివినయమునన్. 18

మ. చని వీక్షించిరి భూమి నీళ మొదలౌ చంద్రాస్య లంతఃపురం
బున కేఁగం గమలాలతాంగి యెదపైఁ బొల్పొందు మాల్యంబు చా
టున నిల్వన్ ఫణిరాజపీఠమున నీటుల్గుల్కఁ గూర్చున్న ఖగేం
ద్రునిచేత న్మడుపందు మందరధరున్ లోకైకచూడామణిన్. 19

క. కని మ్రొక్కినఁ గనికరమునఁ, గని కరమున లేవనెత్తి కలుకంఠుం డెం
త నుచితపీఠి వసింపం, బనిచెన్ నిలుచుండి రెదుట బ్రహ్మేంద్రగురుల్. 20

తే. చంక చేతులువెట్టుక సవినయముగఁ, గెలన నిలుచున్నవారి నీక్షించి శౌరి
మీరు గూర్చుండుఁడనిపలుమాఱుఁబలుక, నుచితవైఖరివారుఁ గూర్చుండి రంత.

క. ఏమీ వచ్చినకార్యము, కామారి యటన్న ముకుళకరకమలుండై
స్వామి యెఱుంగనికార్యము, లేమున్నవి త్రిపురదైత్యు లెచ్చి రటన్నన్. 22

శా. స్నానంబున్ జపముం దపంబు గ్రతువు ల్స్వాధ్యాయము ల్దేవతా
ధ్యానంబున్ మొదలౌ ధరిత్రిఁ గలశ్రుత్యాచారము ల్దప్పి రిం
తైనన్ దానవచేసి దానవు లజయ్యత్వంబున న్మించి ర
ట్లైనన్ సత్యము శౌచమున్ దయయు లేవావంతయున్ శంకరా. 23

సీ. చంద్రశాలలయందు సంపూర్ణచంద్రుని గన్నులకింపుగాఁ గాంచుటకును
వైడూర్యమయసౌధవాతాయనంబుల సూర్యకరాళి మై సోఁకుటకును
సురతాంతతాంతలై సురపొన్నవీచిన సురభిమారుతములఁ జొక్కుటకును
శీతకాలంబుల శ్రీచందనహసంతికాహుతాశను సెగఁ గాంచుటకును
తే. భయపడుదురన్నఁగలనైనఁబరులఁదలఁప,రనుటసువ్యక్తముగుఁగదా యసురవరుల
కట్టిపరమపతివ్రత లాంధ్రుగాఁగ, నెట్లువారల గెలువనౌ నెవరికైన. 24

తే. అదియునుం గాక యలతారకాక్షసుతుఁడు
హరవిరించులఁగుఱిచి యత్యద్భుతముగఁ

దపము గావించి స్వపురమధ్యమున నొక్క-
యమృతకూపంబు వడసె నీయజునికరుణ. 25

క. అదికారణముగ దైత్యులు, త్రిదశులతో వెఱవ కెదిరి తెగినదనుజులన్
బ్రతుకంజేయుదు రోకనిం, బదుగురిఁగా నజుఁవరప్రభావమువలనన్. 26

తే. అయిన నేమాయె నిప్పుడాయమృతరసము,సంగ్రహింప నిశాచరాచారమడఁపఁ
బురపురంధ్రీపతివ్రతాచరిత ముడుపఁ, గడ నిశాటుల గెడప నేఁ గంటి నుపమ.

క. అని యోజన దెలిపి కపర్దిని బలమర్దిని సురేజ్యు దివిజగణంబుం
బనిచి యజు దూడఁ గమ్మని, వనజాక్షుఁడు ధేనువై యవారితశక్తిన్. 28

తే. ఖచరకిన్నరగంధర్వగరుడసిద్ధ
సాధ్యవిద్యాధరాది నిర్జరవితాన
దుర్గమంబైన దానవేంద్రునిపురం బు
పాయమునఁ జొచ్చి యటమట మాయ మొదవు. 29

సీ. రాణించుచును బచ్చుతా చెక్కడపునేల మెఱుఁగుపచ్చికలంచు మేయు సొబగు
నర్భకు ల్దనదూడ నదలింప హుంమ్మని వలుదకొమ్ములఁ గ్రుమ్మవచ్చు కినుక
చేఁపినపొదుగు వర్షించుదుగ్ధంబులు నించి వెల్లువలు గట్టించువింత
యొద్దికమీఱంగ నొక్కెడ వసియించి యెడనెడ నెమరువెట్టెడివిధంబు

తే. గాంచి యెక్కడనుండి యిక్కడికివచ్చె
నొక్కొ [1]యీయావు దూడయుఁ జక్కననుచు
నసురు లచ్చెరువంద నందంద మెలఁగి
భ్రమయఁజేయుచు నమృతకూపమునఁ దుమికె. 30

వ. అప్పుడు. 31

ఆ. ఆవు బావిఁ బడియె నయ్యయో కాలుఁగీ, లేమియయ్యెనొక్కొ యెట్టులనుచు
వగచి దైత్యులెల్ల డిగి యెత్తఁ జని యందు, ధేను వమృతరసముఁ గానలేక. 32

క. ఆవిటుల నేర్చునే మాయావియయి యనుచుఁ దారకాఖ్యాసురుతో
నావింతదెలుప దనుజుల, లావింతట నణఁగె నని ప్రలాపాన్వితుఁడై. 33

క. శోకించు తారకాక్షుని, వ్యాకులభావంబు తత్త్వవైఖరి వెలయన్
లోకోక్తులు దెలుపుచును ని,రాకృతిగావించె మయమహాయోగి యటన్. 34

మ. కరపద్మంబున బర్హిబర్హము వొసంగం జూళికాహీనమై
శిరమున్ బంగరుబొంగరంబువలె రాజిల్లం గటీలోహితాం
బర మొప్పారఁగ నుజ్జ్వలప్రభ దలిర్పన్ వార్ధికన్యామనో
హరుఁ డాదైత్యులఁ జేరఁగాఁ జనియె బౌద్ధాకార మేపారఁగన్. 35

1 యీయాఁవు చక్కనైయున్నదనుచు.

సీ. మణిమయకోటీరమండితం బగునుత్తమాంగంబు ముండితం బైనదేమి
కనకాంబరంబులు గట్టనర్హం బైన కటి కావికోకలు గట్టనేమి
యాయుధోచితమైన హస్తపద్మంబున బర్హిబర్హంబును బట్టుటేమి
జగము నేలంగఁ దేజంబు గల్గియు నిట్టి సన్న్యాస మవధరించంగనేమి
తే. యహహా సన్న్యాసిగాఁడు సన్న్యాసియైన
దండముఁ గమండలువు నెద్ది ధరణి నెన్నఁ
డిట్టివేషంబు గనుఁగొన మెవ్వఁడొక్కొ
యీమహామహుఁడంచు దైత్యేంద్రు లపుడు. 36
తే. తనకు మ్రొక్కిన కుశలమా దనుజులార, యనిన వేదోచితాచారమున మెలంగు
మాకుఁ గీడేల గల్గు సేమంబె కాక, యనినఁ బకపకనగి బుద్ధుఁ డనియె నపుడు. 37
క. ప్రస్తుతియోగ్యమె శ్రుతివ్యత్యస్తము పునరుక్తవాక్య మనృతోదితవి
ధ్వస్తము మఱి వ్యాఘాత, గ్రస్తం బది నిజము సేయఁగా నేమిటికిన్. 38
క. "[1]యజమానప్రస్తర" యను, నిజమా యామాట యదియ నిక్కం బైనన్
"యజతే" యనువాక్యంబును, నిజమని నమ్ముదుము శ్రుతికి నిజముం గలదే. 39
క. కనుఁగొన శ్రుతి యేమెఱుఁగును, దనుజాధిపులార "కో హి తద్వేద" యటం
చును నే యది యెఱిఁగినచో, మన కేటికి నట్టి శ్రుతిఁ బ్రమాణము సేయన్. 40
క. మన మెఱుఁగమె యేటికిఁ జెప్పెను శ్రుతి "యగ్నిర్హిమస్య భేషజ" మనుచున్
మన మెఱిఁగిన మాత్రమె యది, యు నెఱుంగఁగనుండు యుక్తియుక్తము గాఁగన్.
సీ. కర్మంబు ఫలదాత గా దీశ్వరుండంచు ద్వివిధమై మీమాంస విఫలమయ్యె
నొక్కజీవుఁడటంచుఁ బెక్కుజీవులటంచు వేదాంతశాస్త్రంబు వితథమయ్యె
హరి యెక్కుఁడంచును హరుఁ డెక్కుఁడంచును బహుపురాణంబులు పాటిదప్పె
నైకవిధ్యంబు లేదరయఁగా స్మృతుల నే తెఱఁగునఁ దీసినఁ దీయవచ్చు
తే. దానము లొసంగి ద్విజుల నుదగ్రనరక
కూపములఁ ద్రోయుదురె మేలుగోరి తమకు
బుద్ధిహీనులు ప్రతిమలఁ బూజసేతు
రనఁగ నెందును వినరె ప్రజ్ఞాఢ్యులార. 42
సీ. అకలంకులార యింకొకకర్మఠుల యవివేకంబు వినుఁ డతివిస్మయంబు
గర్మంబువలన వైకల్యంబు గలదటుఁ గలుగఁ బ్రాయశ్చిత్తకలనమునను
బోనఁట పాచితంబునను వైకల్యంబు బోరయఁ బోనఁట హరిస్మరణమునను
అదియె నిశ్చయమైన నాస్మరణము మున్నె సేయరాదే యేమి సెల్లెఁ దమకు
తే. నేర్పుతోఁ గొంగసత్తిని నెయ్యి వెట్టి, కరఁగి కన్నులనిండినఁ గానకుండఁ
బట్టికొనవచ్చునను మతిభ్రష్టు గలఁడె, కలఁడె యననేల తాదృశు లక్కర్మరతులు.

---

[1] "యజమానః ప్రస్తర."

సీ. స్నానంబువలన మోక్షంబు గల్గిన నీరుకాకికి మోక్షంబు గలుగవలదె
కాక ధ్యానమున మోక్షము గల్గినను దటాకము బకంబులకును గలుగవలదె
ముక్తి ప్రదక్షిణంబులఁ గల్గునన్నను కాకిగ్రద్దలకును గలుగవలదె
పుడమిఁ బశ్వాలంబమున స్వర్గమన్నను బలలభుక్కులకెల్లఁ గలుగవలదె
తే. కాననస్థితి బోయకుఁ గల్గవలదె, బిలములందున్నఁ గలదె గబ్బిలములకును
గానయందున్న మోక్షంబు గానరాదు, క్షణికవిజ్ఞానముననె మోక్షంబు గలుగు.

సీ. ఎక్కడివేదంబు లేడయాచారంబు లీవట్టిభ్రమలు మీకేలపుట్టె
నవియెల్లఁ గల్ల లెట్లనిన "గ్రావాణః ప్లవంతే" యనవె ఱాయి వారిఁ దేలు
నే నిర్ణయం బెద్దియిదిగో "ననుది తేజు హెూతి" యం "చుది తేజు హెూతి" యనుచుఁ
గ్రతుపశువునకు స్వర్గస్థితి గలదఁట యట్లైన యజమానుఁ డాత్మజునకుఁ
తే. బశువుఁ గావించి దివినుండఁ బనుపరాదె
చెల్లఁబో నోరెఱుంగని జీవములను
గూయగాఁ బట్టుకొని గొంతు కోయవలెనె
తినమరిఁగి సేయుదురుగాక దనుజులార. 45

క. ధరలో వినరె "యహింసా, పరమోధర్మ" యనియంచుఁ బ్రాణివధను జే
తురె యకట యజ్ఞవిధియని, యరయఁగనది యజ్ఞవిధియె యగుఁ జింతింపన్. 46
క. ఏతెఱి విధియంచుం బశు, ఘాతమె మంత్రోక్తి నిదియొకటి సత్యమె యా
రీతి "నహింసా త్సర్వా, న్భూతాని" యటంచునుడువుఁ బో శ్రుతి యహహా.
క. తల పేనైనను జంపక, నలిచి విడువవలయుఁ ద్రోవ నడుచునపుడు చీ
మలనైనఁ ద్రొక్కకయె పో,వలయుఞ్ హెచ్చరికె జంతువధ కొఱగామిన్. 48
క. సమిదాజ్యపశులు శిఖి భస్మములై ఫలమొసఁగెనేని మరుధరనిడుబీ
జములు ఫలింపవె యేటికి, భ్రమ క్షణకర్మములు భావిఫలదము లగునే. 49

సీ. అంధున కొదవునే గంధేభగామినీలోకశృంగారావలోకనంబు
బధిరున కబ్బునే మధురాధరాధరాకథితనర్మోదితాకర్ణనంబు
నిర్దంతునకుఁ జేరునే నీరజాననారదనక్షతాచ్ఛిదారంజనంబు
కడునపుంసకునకుఁ గల్గునే కలకంఠకంఠికారతికేళికాసుఖంబు
తే. కర్మఫలసాధనములు భంగంబు లొందఁ
గర్మఫల మెట్లుసిద్ధించుఁ గనరుగాక
ఘటము ఘటియింపఁ దగు మృత్తికను జలంబు
లోనఁ గలసిన ఘటముగాఁ బూను టెట్లు. 50

శా. రంభాభోగముఁ గోరి యాగముల కర్థంబెల్ల వెచ్చించు టా
యంభోదంబులఁ జూచి చెర్వుజల మాద్యంతంబుఁ జల్లించుట

ల్పంభోగేచ్ఛ జనించెనేని మఱివేశ్యారత్నము ల్లేరొకో
సంభోగింపఁగరాదె కానరు జడుల్ జ్ఞానంబు సామాన్యమే. 51

క. వినుఁ డొకటి బావమఱఁదులు, జనకకుమారకులు మఖముసల్పిన రంభా
వనితం గలయుదు రటులైన,నను లేవే వావివర్తనలు యజ్వలకున్. 52

మ. వికటం బింతియొకాక తృప్తియగునే వేయైన శ్రాద్ధంబుచే
నకటా ప్రేతల కట్టులైన మఱియేలా యూరికిం జద్దిగ
ట్టుకపోఁగాఁ దనపేరు సెప్పికొని యింట్లోవారె బోనేయుమం
చొకమాటాడి చనంగరాదె తనబాహల్లొవ్వ మోపేటికిన్. 53

తే. కాక పితరులు కూటికిఁ గాతురనినఁ, దెలియదే యందునసె పుణ్యకలుషఫలము
లనుభవింపమి మరలి యీయవనియందు, జననమొందమి శేముషీసాంద్రులార.

శా. లోలంబై జలరాశిలోఁ బొడము కల్లోలంబు వేలాహతిం
దూలన్ వేఱొకవీచి వచ్చుగతి జంతుశ్రేణిలో నొక్కఁడా
చాలింగూలినఁ బుట్టునొక్కఁడు పునర్జన్మంబు లేదెన్నఁడుం
జాలుం బుణ్యము దుష్కృతంబనుచు దుశ్శంకం బ్రవర్తిల్లుటల్. 55

సీ. సురఁద్రావుచుండు మీగురుఁడు భార్గవమౌనిపాలుఁ డేనరకకూపమునమునిఁగెఁ
జలపట్టియధ్వరాశ్వముల దొంగిలిపోవు వాసవుం డేరౌరవమునఁ గూలె
నేకర్మములు లేక యిచ్ఛగా విహరించు సనకాదు లెట్టియాతనలఁ బడిరి
బలవంతమున గురుకులకాంతఁ బట్టినవనజారి యేదోష మనుభవించె

తే. బళిర వారికిలేనిపాపములు మనకె, గలిగెనే తనయుక్తిని గద యటన్నఁ
గాయమెడలిన మోక్షంబుగాక మఱి శరీరమేడది సుకృతదుష్కృతము లేవి.

క. సత్తైనదెల్ల క్షణికము, నిత్యము గాదంచు వాహనివహమువలెనే
చిత్తైన జీవుఁడటువలె, సత్తై క్షణికుండుగాక శాశ్వతుఁ డగునే. 57

క. ఎటువలె నున్నది పటమిది, ఘటమిది యనుచోటఁ బటిని గల జ్ఞానంబా
ఘటిలేదు ఘటజ్ఞానము, పటిలేదటు గానఁ గనుఁడు ప్రత్యేకముగన్. 58

తే. అఖిలభోగానుభవయోగ్య మైనతనువు, వడసియును జపతపములపాలు సేసి
సౌఖ్యమొందక చెడుమూర్ఖజనులఁ దెల్పఁ, బూటయేమాకు వారట్టెపోవనిమ్ము.

క. మొదటికి నిహమే లేదట, పిదపం బరమెటులుగల్గు దెలుఁదనముగా
కిది మతముగాదు నామత, మిది నైకొనుఁ డిహపరంబు లిచటనె కల్గున్. 60

తే. అప్పుగొనినైన దొంగిలినైన లెస్స, జిహ్వకింపైనదాని భుజింపవలయుఁ
గంటికింపైనకాంతలఁ గలయవలయు, బ్రదుకుదినముల మోక్షంబు వెదకనేల.

తే. క్షితిని సర్వజ్ఞుఁ డన మారజిత్తనంగ, నేనె తన్నామములు సెల్లె నీశ్వరునకు
నతని కివి చెల్లునని మాయామునుందు, నెఱుఁగ కేటికి వలచె దైత్యేంద్రులార.

వ. అని ప్రత్యక్షానుమానప్రమాణోత్తరంబు లగు హేతువాదంబుల బుద్ధుండు బోధించిన సిద్ధం బని నమ్మి వేదంబు లర్థవాదంబు లనువారును యజ్ఞవిధు లజ్ఞ విధులనువారును శాస్త్రార్థంబు లపార్థంబు లనువారును నై బహుకాలంబు చారు తరవేదాచారు లగు త్రిపురనిశాచరులు శీఘ్రంబున సత్ప్రచారులు యథేచ్ఛాసం చారులు నైనవారివిధంబు చారులవలన విని యింద్రాదిగగనచారులు గతవి చారులై యుండి రంత. 63

శా. శ్రీమద్బుద్ధమునీంద్రుఁ డంతిపురి గౌరీపూజ గావించు సు
త్రామారాతికులాంగనామణులఁ జేరంబోయి తద్రూపురే
ఖామాహాత్మ్యము మానసంబు గలఁపం గందర్పదర్పోదిత
వ్యామోహం బతివేలమై నిగుడఁగా వారి న్నిరీక్షించుచోన్. 64

క. పరపురుషుఁ డెవ్వఁడో యిట, కరుదెంచె నటంచు దానవాంగన లవనీ
ధరకన్యగర్భగృహమున, కరగి రపుడు దాది నిలిచి యమ్ముని కనియెన్. 65

తే. అరసిచూడఁ ద్రిమూర్తులయందు నొకఁడ, వింతయే కాని యన్యుల కిట్టిదివ్య
తేజ మొడఁగూడనేరదు దేవదేవ, తెలుపుఁడన బోడిదేవర తెలిపె నపుడు. 66

క. బుద్ధుఁడ నను గొలిచినభవ, బద్ధుల రక్షింతు నిహము పర మొసఁగి చటన్
సిద్ధముగా నావచన మ, బద్ధముగా దనిన దాది పర్వునఁ జనుచున్. 67

క. ఈవేళ మ్రొక్కఁబోయిన, దేవర యెదురయ్యె బుద్ధదేవర మనకున్
గావలసిన వరమీయఁగ, దావచ్చినవాఁడు రండు తామరసాక్షుల్. 68

క. అని దాదిపలుక దేవుం, డనుభక్తిని సతులువచ్చి యంఘ్రుల కెఱఁగం
దనువు పులకింప మునిలె, మ్మని వనితల నెత్తి యిట్టులనియెం బ్రీతిన్. 69

ఉ. హృద్యముగాదు మీర లిట నీశ్వరియంచును ధూపదీపనై
వేద్యము లిచ్చి యాప్రతిమ వేయువిధంబులఁ బూజసేయుట
లోద్యముగాక యేఫలము నూపెడి ఱాళ్లను నీళ్లుపోసినన్
వేద్యము లాఫలార్థులకు వృక్షములుండఁగ నీవృథాశిలల్. 70

తే. రాజముఖులార శుక్రవారమున బాహ్య,జలముల మునింగిబత్తిబిత్తలియొరావి
కౌఁగిలించిన మీకెల్ల కార్యసిద్ధి, గలుగు నామాట సత్యము కల్లగాదు. 71

మ. అనినన్ మంచిదె యంచు లేనగవుతో నబ్జాక్షు లంతఃపురం
బునకేగంగఁ దదంగసంగతమనోబుద్ధ్యాదియై మారుమో
హనబాణంబులు సోఁకి మ్రాన్పడియె నాయశ్వత్థమై బుద్ధుఁడా
వనమధ్యంబున నుండె లౌల్యము దళవ్యాజంబునం దెల్పుచున్. 72

తే. చంద్రసూర్యమరుత్తులు సంచరింప, నళికి కడకడ త్రోవల నరుగుచున్న
ప్రమదవనమున కొకనాఁడు ప్రమద మమర, సమరపరిపంథివల్లభ ప్రమద లరిగి.

ఉ. పొన్నలు పోఁకమ్రాఁకులును బూచినసంపెఁగలున్ మధూకము
ల్తిన్ననినారికేళములు తియ్యనిద్రాక్షలు గుజ్జుమావులుం
గన్నులగోరగించు జిగిగల్గిన మోదుగులున్ వనంబులో
నన్నియుఁ జూచి కాంచి చెలు లచ్చట నచ్చటఁ బూలుగోయుచున్. 74

క. పదిరెండేడులపాయపు, సుదతీమణి యవయవములు సొబగుదలిర్పన్
గుదిగొనఁ జిగిర్చి తమకట్టెదుటం గనుపట్టురావు లీక్షించి సతుల్. 75

క. బుద్ధముని చెప్పినటువలె, బద్ధాదరచిత్తవృత్తి పాటించి తమిన్
సిద్ధంబుగ మనకోరికె, సిద్ధించు నటంచుఁ గొలను సేరి పురంధ్రుల్. 76

సీ. కురువేరు మొగలిరేకులు పెట్టి యల్లినజడవిప్పి కీల్గొప్పు సవధరించి
బిగిచన్నుఁగవ గుత్తమగుముత్తియపుజంటఱవికె సడల్చి హారములు దివిచి
తళుకులేఁజెక్కుటద్దముల విద్దెముచూపు కట్టాణికమ్మలు కదియ నదిమి
చిలుక బసంతిచీరెలు గట్టుపైనుంచి బెడఁగు చెంగావిపావడలు విడిచి

తే. మారుఁ డోఱఁదీయ మెరయుకటారు లనఁగ
సోఁకుమూఁకమిటారులు సోలిగాఁగఁ
గొదమ రాయంచబారుల యుదుటు దెగడి
కొలనుసొచ్చి విహారము ల్సలుపునపుడు. 77

సీ. పెంటిఁ గానఁగలేక బిస్సున వలిగుబ్బచంటవ్రాలెడు చక్రవాకమునకుఁ
దల్లిఁ గానఁగలేక తళుకుబిత్తరితేఁటివాలుఁగన్నులవ్రాలు వాలుగకును
గొదమలఁగానక గుమికూడి యలకభాగమ్ములఁగ్రమ్ము భృంగంబునకును
దోడియంచలఁబాసి తొగరాకుటడుగులఁ బెనఁగెడురాయంచపిలుకలకును

తే. బెళికి తప్పించుకొనుచు బిట్టులికిపఱచు, కలికి నవ్వుచు రావె యీవలికి నీవు
వలికి వెఱచిన నని కేరి పలికికొనుచు, వెలఁదిమిన్నలు నీరాడి వెడలునపుడు.

తే. వారి వీక్షించి యామునవారి వెడలి, గోపవారిజనేత్రలు కోక లడుగ
వచ్చునాఁటి విలాసంబు మెచ్చుకొనుచు, నుల్లమున నెన్నెఁజెట్టున నున్న శౌరి.

సీ. అపుడె వెన్నాడు దుర్వ్యశమన నంసభాగమునఁ గన్పట్టు కీల్గంటుతోడఁ
బదిలమైయుండుము హృదయమా యనురీతిఁ జనుఁగవగదియు హస్తంబుతోడ
నిది దాఁచుకొన్నఁ దా నేమి సేయునటన్న కరణి నందుంచిన కరముతోడ
నభిమానములు ప్రోవుమని నమస్కృతి సేయు గతిమించు నానతాంగంబుతోడ

తే. బెళుకుఁ జూపులు నునుసిగ్గు మొలకనవ్వు
కదలుపిఱుఁదును మిగులసింగార మొలకఁ
గులుకునడఁ జేరి దిసమొల పొలసుదిండి
లేమ లశ్వత్థములఁ గౌఁగిలించి రపుడు. 80

మ. అసురాబ్జాస్యలు కౌఁగిలించుతఱి నయ్యశ్వత్థనారాయణుం
డసమాస్త్రోపమరూపరేఖఁ దగి బుద్ధాకారుఁడై తాను ది
గ్వసనుండై దనుజాంగనాకుచతటీగాఢాంకపాళిక్రియా
రసికుండై కళలంటఁజొక్కిరి సతుల్ రాగాబ్ధినిర్మగ్నలై. 81

మ. జను లగ్గింప జలంధరాసురుని వేషంబూని తత్కాంతబృం
దను గామింపఁడొ గొల్లగుబ్బెతల మానం బెల్లఁ గొల్లాడఁడో
దనుజధ్వంసికిఁ గ్రొత్తయే త్రిపురకాంతాసంగధార్ష్ట్యంబు గ
ల్గినఁ జాలుం జెలులేడనైనఁ గలయున్ లీలావినోదంబులన్. 82

తే. అంత మఱియేమి చేసెనో యసురసతుల, బుద్ధదేవర యిది యేల ప్రొద్దువోయెఁ
గడమకథవిను మాదిత్యగణము గొలువఁ, గమలలోచనుఁ డీశుచెంగటికి నరిగి.

సీ. తనమహీమహిళ శతాంగంబుగాఁ జేసి కన్నుల రెంటిఁ జక్రములు చేసి
బలితంపుటూర్పుగాడ్పుల హయంబులు చేసి యాత్మజాగ్రేసరు యంతఁ జేసి
యగ్రజుబలగ మిల్లస్త్రాసనముఁ జేసి సెజ్జయా చిలువశింజినిగఁ జేసి
బలములయం దర్ధబలము రథింజేసి తనుసముత్తేజితాస్త్రముగఁ జేసి

తే. చటులలయవహ్ని చిటచిటచ్ఛటలు వొదల
దైత్యపురములఁ గూర్చి దగ్ధంబు చేసి
శంకరుఁ బురారి యనిపించె జగములందు
శ్రితజనయశస్కరుండు లక్ష్మీశ్వరుండు. 84

మ. కురిసెం గల్పకపుష్పవర్షములు రక్షోరాజి భీతిల్లఁగా
మొరసెన్ నిర్జరదుందుభుల్దివి మహాంభోవాహగర్జార్భటిన్
నెరసెం దెల్వి సమస్తదిగ్వలభులన్ నిర్నిద్రహర్షస్థితుల్
దొరసెన్ వేల్పుల నెమ్మనంబులకు నుల్లోలంబుగా నత్తఱిన్. 85

క. శ్రీవిభుఁ డిటువలె బుద్ధుం, డై విహరించినవిధంబు హర్షము మీఱం
గా వినువారలు ప్రబలుదు, రీవసుమతి సుమతిశుభసమృద్ధులతోడన్. 86

గద్య. ఇది శ్రీరామభద్రదయాభిరామభద్రకరుణాకటాక్షవీక్షాపరిప్రాప్తదీప్తతరాష్ట
భాషాకవిత్వ సామ్రాజ్యధౌరేయ సకలవిద్వత్కవిజనవిధేయ ధరణీదేవుల నాగ
నామాత్యసుధాసముద్ర సమున్నిద్రపూర్ణిమాచంద్ర రామమంత్రీంద్రప్రణీతం
బైన దశావతారచరిత్రం బనుమహాప్రబంధంబునందు నవమాశ్వాసము.

తొమ్మిదవ యవతారంబగు బౌద్ధావతారము సమాప్తము.

# ౧౦. కల్క్యవతారకథ.



## దశమాశ్వాసము.

క. విను మిఁక హరి కల్యంతం
బునఁ గల్క్యవతారభావమున మ్లేచ్ఛుల నె
ల్లనడంచి ధర్మసంస్థా
పన మొనరింపఁగలఁ డవనిపాలకతిలకా.

క. అని శ్రీవైశంపాయన, ముని దెల్పిన మిగుల మోదమున జనపాలుం
డనఘా కల్క్యవతారము, వినుపింపుమటన్న మౌనివిభుఁ డిట్లనియెన్. 2

క. శ్రీకృష్ణుఁడు మహివీడ్కొని, వైకుంఠము సేరినపుడె వచ్చెం గలిరా
జా కల్లోలిన్యధిప, త్సాకోపన నేలఁజాల శతవల్లభుఁడై. 3

సీ. బలినివంచించిన మలినాత్మకుని కాళ్లు గడిగిననీళ్లు గంగాస్రవంతి
యందులోఁ గలసిన యమున వేఱై యున్న నదియేమిబ్రాతి నైల్యంబు దొరసె
చూడసరస్వతి జొత్తువై ఖరినుండు గుప్తగామినియది కొఱయె మనకుఁ
బరికింపఁగా సహ్యగిరియూట కావేరి యంబులంటినఁ బడిసెంబువట్టుఁ
తే. బుష్కరిణులందుఁ గదుఁబ్రాచి పాకలియుండుఁ
జెప్పఁగారాదు వారాశి యుప్పునీళ్లు
మంచిగుంటల జలములే మంచివనుచు
జనులు దెచ్చిరి కల్క్యభిషేకమునకు. 4

క. అనృతములు వేదమంత్రము, లని బౌద్ధులు స్వైరవృత్తి నభిషిక్తునిగా
నొనరించిరి కలి విలకుం, గనుఁగొని పాషండగణము గర మలరారన్. 5

సీ. పరలోకదృష్టికి మఱుఁగైనకై వడి శ్వేతాతపత్త్రంబు చెన్ను మీఱఁ
బరిహృతాహంకారఫణిరాజు మేనుబ్బఁ జామరానిలములు సందడింప
సుగుణహంసములఁ బోఁ జోపు మెఱుంగుల రహివేత్రి కనకనేత్రములు పొదల
సకలపాపోపదేశముఁ జందమునఁ [1]జార్వాకవారముల కైవార మమర
తే. యవనికీకటశకమలయాళసింధు, పారసీకాదిభూవరు ల్బలిసికొలువ
నలువుమీఱ నధర్మసింహాసనమున, నిండుకొలువుండెఁ గలినృపాఖండలుండు. 6

---

1 చార్వాకకైవారముల్ ప్రోఁథిసెఱప.

మ. దయ వర్ణాశ్రమధర్మరక్షణము నౌదార్యంబు దాక్షిణ్యము
న్నయముం గల్గిన క్షత్త్రవంశజుల చెంత న్నిల్వ కీవెందుని
ర్దయులౌ మ్లేచ్ఛులఁ దుచ్ఛజాతుల సముద్యత్ప్రీతి వర్తింపు దు
ర్నయులం చెన్నకు లక్ష్మి వారలెకదా నాప్రాణబంధు ల్మహిన్. 7

క. శిష్టాచారులు లేమిని, కష్టాత్ములఁజేసి వెనుకఁ గార్పణ్యముచే
భ్రష్టులఁజేయుము నీవిఁక, జేష్టా పోపొమ్ము సీమసీమలమీఁదన్. 8

సీ. శాబరమంత్రము ల్సఫలంబులుగఁ జేయు వేదమంత్రములెల్ల వృథ యొనర్పు
మెన్నెన్నివిధముల హీనజాతులనుండు ముత్తమద్విజులందు నుండవలవ
దుండిన బ్రతుకునీ కుపయోగముగనుండు సద్ధర్మభక్తులు సాగనీకు
వివిధశాస్త్రార్థము ల్విశ్వసింపఁగనీకు ధర్మశాస్త్రంబులు దలఁపనీకు

తే. కామశాస్త్రంబు ముఖ్యంబుగా ఘటింపు, బౌద్ధచార్వాకజైనకాపాలికాది
మతము లెచ్చింపుము శ్రుతియుతము లుడుపు,తిరుగు మెల్లెడ శారదాదేవి నీవు.

వ. అని మఱియు వారివారిం దగునుద్యోగంబుల నియోగించి శూద్రనృప లక్ష
ణంబుల ముద్రితుండగు కలి మదోద్రేకంబున రౌద్రసమున్నిద్రుం డగుచు
ధర్మపురుషుని కొదవపాదంబు గెంటింప కంటికి నిద్ర రాదని వెదకుచు భాగీ
రథీతీరంబున గోరూపధారిణియగు ధారిణింగూడి నడయాడు ధర్మవృషభంబుఁ
బ్రసభంబునం దన్ని తన్నిరాకరణకుపిత భవజ్జనక పరీక్షిత్ప్రతిహతుండై తదను
మతంబున స్త్రీద్యూతపానాదుల వసించియున్నవాఁ డింకం గొంతకాలంబు
భవాదృశులగు రాజులకు వెఱచి యీమేరవర్తించు నంత యథేచ్ఛం బ్రవ
ర్తించుఁ దత్క్రమంబుఁ గొంత వినుపించెద నాకర్ణింపుము. 10

క. జనపతులన్నము భూసుర,జనములు వేదములు సతులు స్మరగేహములం
బనివడియమ్ముదు రింకఁ, వినుమీ కలియుగము దుష్టవృత్తి నరేంద్రా. 11

క. ధనమిచ్చు నతఁడె యేలిక, ధనమిచ్చినవాఁడె మగఁడు తరుణులకెల్లన్
ధనవంతు నాశ్రయింతురు,ధనము ప్రధానంబు దుష్టతరకలివేళన్. 12

క. క్రతుదానవ్రతములకుం, బ్రతివిధు లొనరించికొంద్రు బ్రాహ్మణులులే
శ్రుతులు పఠింపరు గీతా, శ్రుతిచదువుదు రదియుఁబోవు సురనదితోడన్. 13

సీ. క్షితినిధర్మంబు మించినలేదు వాన వానలులేమి క్షామంబు బలియు లెస్స
క్షామంబు ప్రబలినఁ గడిచేసి యన్నంబు భుజియింప దొరకమిఁ బ్రజలు నొగిలి
మడవులఁబడి యాకునలము మెక్కుచు నెవ్వఁడే నపూర్వంబుగా నున్న కాయ
పండుదిన్నను వానిబట్టుక యుదరంబు చించి లోపలిది భక్షించికొనుచు

తే. హ్రస్వదేహులు హీనాంగు లల్పధనులు
క్రూరు లశనైకతత్పరు ల్కుటిలమతులుఁ

జోగు లన్యోన్యభక్తు లాచారదూరు
లగుదు రటమీఁదఁ గలియుగాంత్యంబునందు. 14

తే. జగతి ధర్మార్థకామమోక్షంబు లనఁగ, వఱలు నాలుగుగనువుల చెఱుకుఁగోల
ఆది తుది నీరసంబు మధ్యద్వయంబు, సారమందు కుయుక్తి దుర్జనులు గలిని.

తే. కలియుగము దుష్టయుగమంట కల్లమాట
కలియుగమువంటి మంచియుగంబు లేదు
సతికిఁ బతిభక్తివలన మోక్షంబుగల్లు
శూద్రులకుఁ గల్లు విప్రశుశ్రూషవలన. 16

చ. కృతయుగవేళ జ్ఞానమునఁ ద్రేతఁ దపంబున ద్వాపరంబునం
గ్రతువుల గల్లుముక్తి కలికాలమునం దవిలేకయున్న సం
తతము హరే ముకుంద రఘునాథ యదూద్వహ యంచు మించు స
న్మతి నుతియించినం గలుగు మర్త్యులకెల్లను ముక్తి భూవరా. 17

సీ. నూటిలో నొక్కఁడే పాటిదానంబు గావింపఁడే యంచును వెదకివెదకి
వెయ్యింట నొకఁడైన వేదంబుచదువఁడే క్షోణీసురుఁ డటంచుఁ జూచిచూచి
పదివేల నొకఁడైనఁ బట్టెఁ డన్నము పరదేశి కిడఁడె యంచుఁ దెలిసితెలిసి
లక్షలోపల నొక్కలలనయైనను సాధ్వియై యుండదే యని యరసియరసి

తే. కోటి నొకపుణ్యమైన గన్గొనఁగలేక, సంచరించుచు మ్లేచ్ఛదేశములలోన
ధర్మవృషభంబు కొదవపాదంబుపిఱిగి, విబుధపురిఁజేర కలి కేకవేసె ననఁగ. 18

సీ. బాలరండలు గొడ్డుబ్రహ్మచారులు మహావ్రతము లన్వేషింతు రతిశయముగఁ
జక్కనినిజకులసతులకు జారులఁ గూర్తురు సంసారికులు యథేచ్ఛ
శాంతులు గండదోషములుఁ దద్దినములు భూసురు లెంతురు భోజనేచ్ఛఁ
బలుకఁ బోయినఁ గొండెములు పల్కుదురు రాజసంసేవకులు దొరచనువుఁ గోరి

తే. యభ్యసింతురు శ్రుతులు దానార్థులగుచు
నేరుతురు శాస్త్రములును బాండిత్యమునకె
నైష్ఠికత పూనికొందురు ప్రతిష్ఠకొఱకు
ధార్మికులు లేరు కలియుగాంత్యంబునందు. 19

సీ. బ్రహ్మసూత్రమెకాని బ్రాహ్మణోత్తములకుఁ గలుగదు షట్కర్మగౌరవంబు
పరదారపరధనహరణవృత్తియెకాని ధరణీశులకు లేదు ధర్మబుద్ధి
కపటమార్గమెకాని క్రయవిక్రయంబుల న్యాయంబు లేదు వైశ్యాన్వయులకు
ధర్మశాస్త్రంబులు తారుసెప్పనె కాని వినరు విప్రులచేత వృషలకులులు

తే. జ్యోతిషము వైద్యసంగీతశాబరములు, నేర్చి చండాలకాదులు నిఖిలపూజ్యు
లౌదు రిల్లాండ్రు త్యజియించి యాత్మపతుల, నర్థవంతులఁ గూడుదు రభిమతముగ.

సీ. [1]అన్నదాతలమంచు యాయజూకులమంచు దొరలచే రూకలు దోఁచువారుఁ
గడుపుకక్కుఱితికిఁ గావికోకలుగట్టి యతులమంచును భిక్ష లడుగువారుఁ
దల్లిదండ్రులఁజంపి ధనమెత్తుకొనిపోయి చెలఁగి తొత్తులపొత్తు గలయువారుఁ
గానువీసములకై కలహించి యతిరోషవివశులై ప్రాణము ల్విడుచువారు
తే. దూరపరదేశి నని పంచఁజేరి రాత్రి
వేళ యిలుసొచ్చి ధనమెల్ల వెరఁజువారు
నవిరతంబును జూదంబు లాడువారు
నగుచుఁ జెడుదురు కలియుగాంత్యమున జనులు. 21

తే. అవని నొక్కొక పుణ్యాత్మురాలు పతినిఁ, జంపకయె జారువెంబడి జరుగుఁగాని
పిట్టపిడుగున మగనిఁ జంపింప కిల్లు,వెడల దిల్లాలు కలియుగవిలయవేళ. 22

తే. ఎన్న నైదేండ్లనైన నాఱేండ్లనైన
బిడ్డలనుగంద్రు కన్నెక ల్గొడ్డువీఁగి
పదియు నొకయేఁటఁ బెద్దలుఁ బదియునాఱు
నేండ్లు పరమాయువగుఁ గలిహెచ్చుకతన. 23

వ. అట్టి సమయంబున. 24

శా. శ్రీమద్విష్ణుయశోభిధానమున రాజిల్లున్ మహీదేవను
త్త్రాముం డొక్కఁడు సర్వసంపదల విభ్రాజిష్ణువై శంబళ
గ్రామాభిఖ్యపురంబులో నతనిభార్యారత్న మబ్జాలయా
హైమగ్రావసుతాభయై తగు సుశీలాఖ్యాతి శీలంబునన్. 25

సీ. కలనైన మగవానిఁ దలయెత్తిచూడదు కలకలనవ్వుచుఁ బలుకబోదు
కులటలఁ గూడదు తొలఁగనీయదుపైఁట మీఁగాళ్లపైకోక మెదలనీదు
విభునితోఁ జెప్పక వెడలదు వాఁకిలి పొరుగిండ్ల నిరుగిండ్లఁ బ్రొద్దుగడప
దధిపుఁడు బిల్చినట్లైన డిగ్గునవచ్చు మమత దేవోపచారములు సలుపుఁ
తే. బ్రతిదినము నత్తమామల బత్తిసేయుఁ, దోడికోడండ్రఁ గనుసయిదోడుజాడఁ
బరిజనంబులఁ బోషించుఁ బ్రజలరీతి, సరసభాషణసాధ్వి యప్పరమసాధ్వి. 26

క. ఆపుణ్యసాధ్వి కాత్మజుఁ,డై పుట్టును గల్కి యనఁగ నంభోనిధిక
న్యాపతి పంచగ్రహములు, దీపితముగ నుచ్చసంస్థితిం బొరయంగన్. 27

క. లౌల్యప్రధానమై తగు,బాల్యము గ్రమియించి తరుణభావము దనరం
బాల్యము భూతలమిఁక నని, లౌల్యంబున గల్కివిజయలంపటుఁ డగుచున్. 28

సీ. తళుకుబంగరుచెఱంగులయోర తలపాగ తలకుఁ జౌవంచె మిన్నలతురాయి
మొసలివాయొంటుల మిసిమికస్తురిబొట్టు నంగిపైఁ బొసఁగు వజ్రాంగిజోడు

1 అగ్నులం ధరియించి.

కడవన్నె జిగిపట్టు నడికట్టు పడిదలపట్టంబు నేజయు బాగుదేర
నంసభాగమున బాగైనతూణీరంబు కరమున జీనిసింగాణివిల్లు
తే. మెఱయ నుచ్చైశ్శ్రవముఁ బోనిమించు తెల్ల, తేజిపై నెక్కి తేజంబు తేజరిల్ల
వెడలు దిగ్విజయార్థియై వేదబాహ్య, గళితధర్మైకజీవాతు కలికిరాతు. 29
సీ. జోడన ల్దాకిక్కించు శూరసేనాంగబంగాళము ల్పంచబంగాళముగను
జుట్టువేడెము వెట్టుఁ జోళమాళవగౌళపాంచాలములు పటాపంచగాఁగ
రవగాలు నెఱపు సౌరాష్ట్రగూర్జరలాటమత్స్యభూములను దుమార మెగయ
నిబ్బరంబుగ నూకు నిషధమాగధసింధుమేదినీంద్రులు కంచుమించు గాఁగఁ
తే. గర్కకర్కశతరఖురాఘాతజాత, నూతనక్ష్మితరేఖికాజాతభూత
లోదరీమేదురీభూతసాదరార్పి, తాత్మనఖముఖభంగి మాయాతురంగి. 30
మ. జవలీలాహసితానిలం బగుజిరాసంజోకగుఱ్ఱంబు మేల్
రవగాల్ జోడన చుట్టువేడెము లొనర్పం బుట్టుకెందూళికై
తవతౌరంగికఖడ్గఖండితసమ స్తమ్లేచ్ఛతుచ్ఛాంగర
క్తవిలోలంబయి మించు భూతరుణికిం గాశ్మీరచర్చాకృతిన్. 31
క. ఈరీతిఁ గల్కి జనసం, హారము గావించి తెలిసి మహిధర్మము వి
స్తారము సేయుననన్ విని, కౌరవముఖ్యుండు మునిశిఖామణి కనియెన్. 32
తే. విష్ణుయశునకు విష్ణుఁ డావిర్భవింపఁ, గారణం బేమి యతఁ డెట్టిఘనతపంబుఁ
జేసెనో తదీయచరితంబుఁ జెప్పు మనిన, వ్యాసమునిశిష్యుఁ డిటువలె నానతిచ్చె.
సీ. అవనీశ తొల్లి స్వాయంభువమనువు బ్రహ్మర్షి లోకశరణ్యమైన నైమి
శారణ్యమునఁ దర్పకారి జటావాటినలరు వేలుపుటేటివలెఁ దనర్చు
గోమతీద్వీపవతీమణితటమున ద్వాదశార్ణ మనుమంత్రము జపంబు
సేయుచుఁ గలశాబ్ధిశాయిఁ గూటిచి పూర్ణతమనిష్ఠ మును లద్భుతంబు నెంద
తే. దశశతాబ్దంబు లతిఘోరతప మొనర్ప
మెచ్చి కనువీనుకవణంబు మెక్కుపక్కి
జక్కిపై నెక్కి తనయిరుపక్కియలను
నలువ మొదలైనవేలుపు ల్బలసికొల్వ
శౌరి యాతని యెదుట సాక్షాత్కరించె. 34
చ. కమలదళాక్షుఁ డిట్లు దనకట్టెదుటం గనుపట్టినం బ్రమో
దము మదిఁ గ్రమ్మ నమ్మనువతంసము నేఁటికి నాతపంబుజ
న్మము ఫలియించెఁగా యని నమస్కృతులున్ నుతులున్ ఘటింప వేఁ
డుము వర మెట్టిదైన ననుడున్ విని యాతఁడు శౌరి కిట్లనున్. 35
సీ. శతపత్త్రదళనేత్ర జననత్రయంబు మత్పుత్త్రుఁడవై నీవు పొడమవలయు
నా ధర్మసంస్థాపనము సేయ నీకునే సుతుఁడనై జనియింప మతిఁ దలంతు

నన దశరథుఁడయ్యె మనువు దొల్తఁ దదీయ జాయసుశీల కౌసల్య యయ్యె
హరి రాముఁడయ్యె రెండవపరి దేవకీవసుదేవు లగుటయు వారియందుఁ

తే. గృష్ణుఁడై విష్ణుఁడుదయించె నింకవిష్ణు,యశుఁడు దేవప్రభ యనఁగల్క్యంతమునను
వారెయుదయింపఁగల్కియైశౌరియవత,రించికృతయుగచర్యఁ గావించఁగలఁడు.

క. ఈకల్క్యవతారక్రమ, మాకర్ణించిన జను ల్సదారోగ్యశుభ
శ్రీకలితు లగుదు రతులగు, ణాకర జనమేజయక్షమాధ్యక్షమణీ. 37

సీ. సకలసత్కవినుతాష్టాదశవర్ణనాపూర్ణమై నవరసోదీర్ణ మగుచుఁ
గదళికాఫలపాకకమనీయభాషావిశేషమై కృతపరిశోష మగుచు
నశ్వమేధాదియాగాభోగఫలదానదక్షమై కృతిశతాధ్యక్ష మగుచు
భాగవతాగ్రణీపారంపరీభాగధేయమై సజ్జనగేయమగుచుఁ

ఆ. దనరు నీదశావతారమహాప్రబం, ధంబు వినినయట్టిధన్యమతులు
ధరణిఁ గృష్ణుకరుణ ధర్మార్థకామము, ల్గలిగి పిదప ముక్తిఁ గాంతు రధిప. 38

క. అని శ్రీవైశంపాయన, ముని వినుపించినను భక్తి విని వేడుకతో
జనమేజయజనవిభుఁ డా, మునిసోమునిఁ గమలభవసముని బూజించెన్. 39

శా. శ్రీమద్వేంకటమాభిధానవరపుత్రీరత్న పుత్రీవివా
హామేయోత్సవసుస్మితాస్యరఘుపత్యాశ్లిష్టగాత్రాశ్లేషణో
ద్దామప్రేమరసాభిరామసతి సీతానామకన్యామణీ
హైమాందోళికాకలన వీక్షాయత్తచిత్తాంబుజా. 40

క. ద్విడ్భేదయాథపాథో, రుడ్వ్యామిన్యధిపకీర్తిరుచిరచిరసుధా
త్విడ్భగధవళితాశా, కుడ్యాంతరధర్మమర్మకోవిదహృదయా. 41

మత్తకోకిల. హైమభూధరగౌరనీరజహంసమండలజైత్రదో
ర్దామకీర్తిరమాధురంధరరమ్యనీతియుగంధరా
భీమసారహృతాహితావనిభృద్వసుంధరరుగ్యజు
స్సామవేదవిశారదద్విజచాతకవ్రజకంధరా. 42

గద్య. ఇది శ్రీరామభద్రదయాభిరామభద్రకరుణాకటాక్షవీక్షాపరిప్రాప్తదీప్తతరాష్ట
భాషాకవిత్వసామ్రాజ్యధౌరేయ సకలవిద్వత్కవిజనవిధేయ ధరణీదేవుల నాగ
నామాత్యసుధాసముద్ర సముస్నిద్రపూర్ణిమాచంద్ర రామమంత్రీంద్రప్రణీతం
బైన దశావతారచరిత్రంబను మహాప్రబంధంబునందు దశమాశ్వాసము.

ఇది పదియవ యవతారంబగు కల్క్యవతారము.

దశావతారచరిత్ర సర్వము సంపూర్ణము.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము. 1926.

# సవరణపత్రము.

పాఠకులీక్రింది సవరణలను గ్రంథమునం దొనర్చికొని పిదపఁ జదువవలయును.

| పుట | పంక్తి | ఉన్నది | సవరణ |
|---|---|---|---|
| 1 | 4 | తేఁగృప | తేకృప |
| 6 | 28 | భారతీ | భారతి |
| 16 | 2 | శ్శృంగార | శృంగార |
| 17 | 2 | యైవ | యైన |
| 18 | 16 | గాదవి | గావవి |
| 22 | 26 | పవడంవు | పవడంపు |
| 26 | 30 | లసఁగ | లనఁగ |
| 33 | 31 | జడసి | జడిసి |
| 34 | 16 | సప్తసప్త | సప్తసప్తి |
| 35 | 9 | సవధరింప | సవదరింప |
| | 10 | దిరువుల | ఇరుపుల |
| 36 | 8 | గట్టిగా | గట్టఁగా |
| | 12 | దొంగతనమున్న | దొంగతనమన్న |
| 41 | 12 | గల్గుదురు | గల్గుదురె |
| | 19 | భృత్తట | భృత్తటి |
| 42 | 32 | బెళుకుకన్గ, | బెళుకుకన్గవ, |
| 45 | 6 | బాలింప | బాలింపు |
| 48 | 4 | వెఱచి వతా | వెఱచి మా |
| | 26 | తరల | దరల |
| 50 | 21 | వానిజోదరు | వారిజోదరు |
| 51 | 7 | యనుర | యసుర |
| 52 | 11 | నవరసంబుల | నవసరంబుల |
| 55 | 14 | కట్టడి | కట్టడ |
| 56 | 18 | పైత్వ | పైత్ర |
| 57 | 2 | రాజ్యజీణీకర | రాజ్యజీర్ణీకర |
| 58 | 7 | మీగిరి | యీగిరి |
| 65 | 20 | ద్ద్వేల | ద్వేల |
| | 24 | వగునామ | వగుకామ |
| 66 | 2 | దామరసాప్తనందనువి | దామరసాప్తనందనుని |
| 69 | 25 | రసనూచకా | రసనూచితా |
| 71 | 32 | యనచెలంగు | యనఁజెలంగు |
| 72 | 23 | కలికనుశ్రీ | కలికసుశ్రీ |
| 73 | 10 | పాలీలవ్రాలెఁ | పాళులవ్రాలెం |
| 74 | 31 | మంగమును | మంగముసు |
| 78 | 2 | గ్నగ్లె | గగ్లె |
| | 9 | రస్సు | రస్స — |
| | 32 | వల్లవ | పల్లవ |
| 79 | 22 | విందమ్ము | లందమ్ము |
| 81 | 9 | దనఠక్కా | దనథక్కా |
| | 32 | నేఱుపఱచి | నేరుపఱచి |
| 82 | 12 | గెంచేల | గెంగేల |
| | 15 | సుదారసం | సుధారసం |
| | 20 | ............ | కాదని పిలిచినఁ గల |
| | | | కంఠి వడ్డింప కలిగి |
| | | | పోవునో కడ కను |
| | | | చు నొక్కఁ |
| | 21 | నమృత | డమృత |
| 87 | 3 | గతిగ్గన్పింప | గతిం గన్పింప |
| | 19 | జాతియోఁ ప | జాతియుం వ |
| 90 | 8 | కషాయ | కషాయి |
| | 15 | జళింపించి | జళిపించి |
| 91 | 27 | దగిన | దెగిన |
| | 32 | జిక్కవడి | జిక్కువడి |
| 94 | | వరహావతార | వరాహావతార |
| 95 | 26 | టలుగు | కలుగు |
| 98 | 15 | పూటోపకార | పూజోపకార |
| | 32 | గృహాముచ్చతే | గృహాముచ్యతే |
| 101 | 32 | రమియంచి | రమియించి |
| 103 | 24 | జంద్రానన | జంద్రాననా |
| 104 | 28 | అనిన న్వని య మ్ము | అనిన, న్వనియు, మ్మ |
| | | ని యి ట్లనియెన్ | నియి, ట్లనియెన్ |
| 105 | 26 | డతఁడు | డతని |

| పేజీ | పంక్తి | ఉన్నది | సవరణ |
|---|---|---|---|
| 107 | 17 | ముక్తులే | ముక్తిలే |
| | 18 | ఢీవిర | దీవిర |
| 108 | 24 | నాదిరాజ | నాధిరాజ |
| 111 | 10 | బరాదరి | బరాబరి |
| 113 | 6 | కెస | కెన |
| | 23 | నుస్న | నున్న |
| 115 | 16 | ముఖమున | మఖమున |
| 116 | 12 | మహూరశిస్థలిఁ | మహోరశిస్థలి |
| 129 | 27 | మూఁగిఁ దినిపోవ | మూఁగి తినిపోవ |
| 130 | 13 | వ్రతమో | వ్రతమా |
| 134 | 17 | కళిపు | కళివూ |
| | 31 | జేజెలు | జేజేలు |
| 137 | 28 | చండామార్త్య | చండామార్క |
| 150 | 10 | చుక్రరర క్తక్తాగరు | చుక్ర క్తరక్తాగరు |
| 151 | 13 | స్మర్తృకంఠీరవ | స్మర్త్యకంఠీరవ |
| 152 | 15 | పారువల్లీ | పాపవల్లీ |
| | 33 | భాధించు | బాధించు |
| 153 | 24 | ప్రస్ఫుటా | ప్రస్ఫుటా |
| 155 | 6 | ప్రహ్లాద | ప్రహ్లోద |
| | 27 | కౌరులు | కారులు |
| | 31 | గొపుగాంచి | గోపుగాంచి |
| 157 | 28 | జాలాజన్నము | జాలంజన్నము |
| 159 | 7 | బోదమిపుడా | పోదమిపుడా |
| 160 | 32 | కర్తనీయ | కీర్తనీయ |
| 162 | 10 | గదులన్ | గదలన్ |
| 167 | 12 | కంఠీకాకంఠ | కంఠికాకంఠ |
| | 14 | మహాస్వర్లోక | మహాస్వర్లోక |
| 172 | 5 | I పత్నియంఁ బల్లవ పాణి | తల్లజపల్లవపాణి |
| 175 | 7 | భృగురామావతారక | భృగురామావతార |
| 176 | 10 | శపించినను | శపియించిన |
| 177 | 23 | క్కృనగంగానది | కృనగంగానది |
| 183 | 11 | నవని | ననిన |
| 188 | 5 | విప్రుఁ డేమాత్రము నైన | విప్రుఁడేమాత్ర మున నైన |
| | 24 | హాయశి | యహాశి |
| 189 | 13 | ద్రోద్యధ్రథా | ద్రోద్యద్రథా |
| 190 | 17 | బిధురాగ్ర | భిదురాగ్ర |
| 192 | 5 | రజిత | రజత |
| 194 | 1 | ధరావరోహ | ధరావరారోహ |
| 197 | 15 | హూయయమాను | హూయమాను |
| 198 | 4 | లేలు | రేలు |
| 199 | 9 | శక్త్యాదిత్రుల | శక్త్యాదిపుత్రుల |
| 200 | 14 | చల్లాడల్ | చల్లడల్ |
| 202 | 14 | దగవటంచు | దగనటంచు |
| 205 | 11 | బలిచి | బిలిచి |
| | 20 | గలిగిని ట్లైనం | గలిగిన ట్లైనం |
| 207 | 7 | గుబ్బిగుబ్బ | గబ్బిగుబ్బ |
| 208 | 15 | వచ్పితివె | వచ్చితివె |
| 209 | 8 | సృక్కె | స్రుక్కె |
| 214 | 14 | వడ్డసేయను | సడ్డసేయను |
| 215 | 7 | యలికాముకు | యతికాముకు |
| 216 | 20 | రాఘుపుల | రాఘవుల |
| 219 | 1 | వికృవమాను | నికృవమాను |
| | 12 | వలివె | వలిపె |
| | 21 | విపుణ | నిపుణ |
| | 29 | జానకీ | జానకి |
| 220 | 18 | రేఁజిగురాకు | లేఁజిగురాకు |
| 221 | 5 | కురుల్వేఁకటు | కురుల్చేఁకటు |
| | 11 | బానన్న | బాసన్న |
| | 30 | యొసఁగి | యొసఁగె |
| 222 | 9 | పనాగంపు | పన్నాగంపు |
| | 29 | ఇవ్విధంబుస | ఇవ్విధంబున |
| 225 | 27 | లోకైకమోహన | లోకైకరంజన |
| | 30 | రాసుతుల | రాసుతల |
| 226 | 26 | నొడివెడికడుక | నొడివెడికడఁక |
| 229 | 5 | నొక్కొగురుకుచ | నొక్కగురుకుచ |
| 230 | 4 | స్వకృతరక్తా | స్వకృతరక్త |
| | 20 | ధావదరి | ధావదరి |
| | 26 | దానవీహరణయే | దానవీహరణమే |
| 232 | 8 | నేర్తునే | నేర్చునే |
| | 11 | బట్టముంగురులు | బట్టిముంగురులు |
| | 22 | మంచనగరాప్తి | మంచినకరాప్తి |

| పుట | పంక్తి | ఉన్నది | సవరణ |
|---|---|---|---|
| 232 | 27 | జక్కనించి | జెక్కనించి |
| 233 | 5 | వాసనప్రక్క | వాసనవక్క |
| | 11 | వరారోహాసం | వరారోహాసం |
| 234 | 9 | కొప్పకించ | కొప్పగించ |
| | 11 | తరుణి నియధరా | తరుణి నీయధరా |
| 236 | 14 | బోయిపిల్చినన్ | వోయి పిల్చినన్ |
| 237 | 7 | సంచిన్న తాముగ్ని | సంఛన్న తార్ణాగ్ని |
| | 8 | తరుదర్ణానోదగ్ధ | తరుదమునోదగ్ధ |
| | 9 | ధ్యనిషట రీణ వేణూత్కర చిచిచిట నిధ్వాణాభ్య స్మృ గంబై | ధ్యనిష్ణారీణ వేణూత్కర చిటచిట నిధ్వాన బిభ్యన్మృగంబై |
| | 24 | పుట్టైను | పుట్టైడు |
| 238 | 7 | భద్రకుంభీద్ర | భద్రకుంభీంద్ర |
| | 12 | సరసవణితి | సరసఫణితి |
| | 28 | వాస్తువోమంబు | వాస్తుహోమంబు |
| 239 | 9 | నత్త్రిశిరు | నత్రిశిరు |
| | 14 | నడలెడు | సడలెడు |
| 240 | 17 | చినసైఁపదు | వినసైఁపదు |
| | 22 | జింతులున్ | జింతిలన్ |
| | 31 | హారేన్నృపింహ | హారేన్నృసింహ |
| 241 | 4 | శృంగారభీతు | శృంగారభితు |
| | 12 | టెక్కింబున | టెక్కియంబున |
| | 18 | తెలసి | తెలిసి |
| 242 | 4 | నేయుందు | సేయుందు |
| | 28 | Iనవపుండరీక | నవపుండరీక |
| 243 | 30 | వడిఁకెద | వదఁకెద |
| | 32 | దడిసితి | దడసితి |
| 244 | 23 | మఱువ | మఱవ |
| 245 | 3 | నఁభోజినీ | నంభోజినీ |
| | 12 | స్వృహాత్సాలమున్ | స్పృహాత్సాలమున్ |
| | 15 | మహా త్తంసూత్మ | మహా త్తరసూత్మ |
| 247 | 6 | దర్భశలయించి | దర్భలశయించి |
| | 15 | రింభోళికా | రించ్ఛోళికా |
| 248 | 20 | నమృతనిది | నమృతనిధి |
| 249 | 26 | జిహ్వా | జిహ్మ |
| 250 | 24 | పాశమోద | పాశనోద |
| 251 | 8 | తృటిత | త్రుటిత |
| | 16 | డంగదవైరి | డంగదలైరి |
| 252 | 27 | రుపవర్షించె | రునవర్షించె |
| 253 | 11 | ఊడనిఁబాజె | ఊడనిఁబాడె |
| | 25 | బోయెవాఁడ | బోయెవాఁడు |
| 254 | 9 | మూటి | మాటి |
| | 11 | వికద్ధన | వికత్థన |
| 255 | 12 | ల్చలపు | చ్చలపు |
| | 22 | వనతి | వసతి |
| 256 | 11 | నిల్పి | నిల్చి |
| 257 | 1 | మారుతఁసుతా | మారుతసుతా |
| 258 | 5 | ............ | వరకృప ధన్యుఁ జేయుం రఘువల్లభ రాఘవభక్తవత్సలా |
| | 9 | అష్టదశ | అష్టదళ |
| | 22 | చెలువవింవె | చెలువవింటే |
| 259 | 6 | త్యాళీరంగపుపాళి | త్సారంగప్రవరాళి |
| | 8 | శ్రీధాభిరామ | శ్రీదాభిరామ |
| 261 | 10 | నాల్గుయడ్గు | నాలుగడ్గు |
| | 21 | కొక్కబంగ | కొక్కపంగ |
| 262 | 7 | దనప | దనర్ప |
| | 15 | నీవకావే | నీవకావె |
| 264 | 2 | వెడలీడు | వెడపీడు |
| | 17 | మెఱయం | లొరయం |
| | 27 | నివి | నీవి |
| | 32 | నంగవిరతంబు | నంగుళీరతంబు |
| 266 | 23 | నవకుం, డరదుఁడు | నవకుం, దరదుఁడు |
| 267 | 4 | యుష్మద్రుశా | యుష్మదృశా |
| | 12 | నేటవాటు | నేటవాలు |
| 268 | 7 | నిదియర్చా | నిడియర్చాళి |
| | 14 | బంధువులఁజోలి | బంధువులఁబోలి |
| | 16 | వేయుంగంబు | నేయుంగంబు |
| 269 | 1 | సమద్వితీయ | మద్వితీయ |
| | 17 | గరిగరి | గరగరి |
| | 25 | చంద్రానస | చంద్రానన |
| 270 | 17 | వెనుకనుత్శోణితలము | వెనుక శోణీతలమునే |
| 273 | 4 | చందనప్రతి | వందనప్రతి |

# సవరణపత్రము

| పుట | పంక్తి | ఉన్నది | సవరణ | పుట | పంక్తి | ఉన్నది | సవరణ |
|---|---|---|---|---|---|---|---|
| 273 | 31 | వ్రేయమని | వేయుమని | 303 | 19 | పల్లవోష్టి | పల్లవోష్ఠి |
| 276 | 12 | భూదర | భూధర | 304 | 7 | పచ్చిలతాంగు | వచ్చిలతాంగు |
| 277 | 2 | శ్రీశైలబిలపాతా | శ్రీశైలబిలహితా | | 17 | ముద్ధజారాంగ | ముగ్ధజారాంగ |
| | 3 | జాతికిరీట | జాతికిరీటి | 305 | 19 | నయగారి | నయగా |
| | 17 | దీర్ధమాడి | తీర్ధమాడి | | 20 | మనోభపు | మనోభవు |
| 281 | 13 | నబ్బెగాలిడి | నందెగాలిడి | | 29 | నఖక్షతలు | నఖక్షతులు |
| | 14 | యాశివునికైన | యాశివునికైన | 306 | 19 | పావపుజోల్లు | పారువపుజోల్లు |
| 282 | 24 | బోదురందురర్ | బోదురందఱుర్ | 307 | 18 | పులుకలు | పులకలు |
| 283 | 1 | చెలువొందుచు | చెలువందుచు | 308 | 20 | బఱిచె | పఱిచె |
| | 21 | యన్నుఁదెనుల | యన్నుఁదెగల | 309 | 3 | నినోదగతుల్ | వినోదగతుల్ |
| ~~286~~ | ~~4~~ | ~~[illegible]~~ | తేరినిలుచు | | 9 | తెలవాఱెనేమొయి క..... డోఁచెల్ విలాస | తెలవాఱెనె యొకని మిషము, పలెఁడోఁ చెల్ నీవిలాస |
| | 23 | అమ్మనేఁజెల్లె | అమ్మనేఁజెల్ల | | | | |
| 287 | 13 | నించెవివి | నించెదివి | | | | |
| | 20 | సాచీకృతానస | సాచీకృతానన | 309 | 20 | లోకారాధ్యుఁడు | లోకారాధ్యుఁడు |
| 288 | 24 | కాళీయాహి | కాళియాహి | 310 | 4 | తప్పదని | తప్పదది |
| 290 | 20 | బడుకయిటఁ | బడుకయిలుఁ | | 20 | బరిహారము | బరిహారము |
| 291 | 16 | దువ్వుచునొక్క | దువ్వుచునొక | 311 | 25 | గమ్ములకును | గ్రమ్ము సొమ్ములకును |
| 292 | 25 | నగురు | నగుచు | | 28 | కాండవదహన | ఖాండవదహన |
| 294 | 28 | జెలుప | జెలువ | 312 | 4 | ద్రోక్కి | ద్రొక్కి |
| 295 | 6 | దముఁదిమి | దముఁదమి | | 6 | మధిపా | మధిప |
| | 30 | వెదుకుచు | వెదకుచు | | 18 | కుచసిభ్రూ | కుచసభ్రూ |
| 298 | 1 | గతుకంబున | గుతుకంబున | 314 | 31 | ఘృణికుంఠిత | ఘృణికుంఠిత |
| | 4 | మురుపు | మురువు | 318 | 18 | నహింసాత్సర్వ | నహింస్యాత్సర్వ |
| | 20 | లీలలఁ | లీలలం | | 20 | హెచ్చరకె | హెచ్చరిక |
| | 28 | దూఱెదపు | దూఱెదవు | | 25 | రదనభదాచ్ఛిదా | రదనచ్ఛదాచ్ఛిదా |
| 299 | 25 | కన్తూరి | కస్తూరి | 319 | 22 | శాశ్వితు | శాశ్వతు |
| 300 | 1 | పంకజాక్షులు | పంకజాక్షులు | 320 | 4 | శీఘ్రంబున సత్ప్రచారులు | శీఘ్రంబున నసత్ప్రచారులు |
| 301 | 16 | పుర్యహ వినస్యద మిత్ర... | ప్రత్యహ వినస్యద మిత్ర హితాబ్జమిత్రసం | | 8 | తద్రూపురే | తద్రూపరే |
| | | | | | 12 | కరగిరపుడు | కరిగిరపుడు |
| 302 | 18 | దళకెందలి | దళుకుకెందలి | 321 | 9 | సవధరించి | సవదరించి |
| | 19 | గలకల కంఠికాకలక లనంబు | గలకల కంఠికాకల కంఠకలనంబు | 323 | 23 | బ్బలిసికోలువ | బ్బలసికొలువ |
| | | | | 324 | 25 | క్రతుధాన | క్రతుదాన |
| 303 | 9 | గంధర్వసతుల | గంధర్వకాంతల | | | | |

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండుసన్స్‌వారి
వావిళ్ల ప్రెస్సున ముద్రితము.—1926.

# సంస్కృతగ్రంథములు.

## వేదాంతగ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| షడుపనిషద్భాష్యమ్, ఆనందగిరిటీకాసహిత శ్రీశాంకరభాష్యేణ, విశిష్టాద్వైతభాష్యేణ చ సంయోజితాః ... | 8 | 0 |
| తైత్తిరీయోపనిషద్భాష్యము (సంస్కృతము) ... | 2 | 8 |
| ప్రశ్నోపనిషత్తు, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | 12 |
| ముండకోపనిషత్తు ,, ... | 1 | 0 |
| యోగశిఖోపనిషత్తు ,, ... | 0 | 12 |
| తైత్తిరీయోపనిషత్తు ,, ... | 3 | 8 |
| మాండూక్యోపనిషత్తు ,, ... | 1 | 12 |
| శ్వేతాశ్వతరోపనిషత్తు ,, ... | 1 | 12 |
| బృహదారణ్యకోపనిషత్తు, భాష్యము ... | 8 | 0 |

## కావ్యములు.

| | | |
|---|---|---|
| ఋతుసంహారము, సాంధ్రటీక ... | 0 | 10 |
| కవిరాక్షసీయము, ద్వ్యర్థికావ్యము, టీక ... | 0 | 12 |
| కుమారసంభవము, సవ్యాఖ్యానము ... | 1 | 0 |
| ,, ఆంధ్రటీకాతాత్పర్యసహితము ... | 1 | 12 |
| కాదంబరి, చక్కనిప్రతి ... | 1 | 8 |
| గీతగోవిందము, (అష్టపది) సటీక ... | 2 | 0 |
| దశకుమారచరిత్రము, చక్కనికూర్పు ... | 1 | 0 |
| నైషధము, సవ్యాఖ్యానము, 6 సర్గలు ... | 1 | 4 |
| భర్తృహరిసుభాషితము, తాత్పర్యము ... | 1 | 4 |
| ,, వ్యాఖ్యానప్రతిపదాంధ్ర టీకాపద్యతాత్పర్యసహితము ... | 3 | 8 |
| భారవి, సవ్యాఖ్యానము, 9 సర్గలు ... | 1 | 0 |
| భారవి, ఆంధ్రటీకాతాత్పర్యవ్యాఖ్యానసహితము, 3 సర్గలు ... | 2 | 8 |
| భోజచరిత్ర, ఆంధ్రటీకాతాత్పర్యము ... | 1 | 8 |
| మేఘసందేశము, సవ్యాఖ్యానము ... | 0 | 8 |
| ,, ఆంధ్రటీకాతాత్పర్యసహితము ... | 1 | 0 |
| మాఘము, సవ్యాఖ్యానము, 6 సర్గలు ... | 1 | 4 |
| ,, 3 సర్గలు, సమాసతాత్పర్యసంస్కృతాంధ్రవ్యాఖ్యానసహితము | 2 | 8 |
| రఘువంశము, 10 సర్గలు, సవ్యాఖ్యానము ... | 1 | 4 |
| రఘువంశము, ప్రథమసర్గటీకాతాత్పర్యము, పాతప్రతి ... | 1 | 8 |
| విక్రమార్కచరిత్రము, సటీక ... | 1 | 4 |

## నాటకములు.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఉత్తరరామచరిత్రము, సవ్యాఖ్యానము | ... | 1 | 8 |
| వేణీసంహారము ,, | ... | 1 | 8 |
| శాకుంతలనాటకము ,, | ... | 2 | 8 |

## చంపూగ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| భారతచంపు, సవ్యాఖ్యానము | ... | 3 | 0 |
| రామాయణచంపు ,, | ... | 3 | 8 |
| విశ్వగుణాదర్శము, మేలుప్రతి | ... | 1 | 8 |

## వ్యాకరణము, అలంకారములు.

| | | | |
|---|---|---|---|
| అభినయదర్పణము, సాంధ్రతాత్పర్యము | ... | 1 | 4 |
| అథర్వణకారికావళి, టీకాతాత్పర్యము | ... | 1 | 8 |
| ఆంధ్రీకృతన్యాయదర్శనము, ప్రథమభాగము | ... | 1 | 4 |
| చంద్రాలోకము, సటీక | ... | 0 | 12 |
| తర్కసంగ్రహము, సవ్యాఖ్యానము | ... | 1 | 4 |
| ప్రతాపరుద్రీయము ,, | ... | 2 | 4 |
| లఘుకౌముది, సటిప్పణము | ... | 1 | 0 |
| ఆంధ్రీకృతలఘుసిద్ధాంతకౌముది | ... | 3 | 0 |
| న్యాయకుసుమాంజలి, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 3 | 0 |

## స్తోత్రములు.

| | | | |
|---|---|---|---|
| కృష్ణకర్ణామృతము, సాంధ్రతాత్పర్యము | ... | 2 | 0 |
| శ్రీకృష్ణలీలాతరంగిణి, సటీక | ... | 2 | 0 |
| రామకర్ణామృతము, సాంధ్రపద్యతాత్పర్యము | ... | 2 | 0 |
| లక్ష్మీస్తోత్రరత్నత్రయము, సాంధ్రటీకాతాత్పర్యము | ... | 1 | 0 |
| శారదాచతుశ్శ్లోకీస్తవము, తాత్పర్యసహితము | ... | 1 | 0 |
| స్వరూపజ్ఞానదర్పణము | ... | 1 | 8 |
| శ్రీత్రిపురసుందరీదేవీపూజావిధానము | ... | 1 | 0 |
| శివానందలహరి, ఆంధ్రటీకాతాత్పర్యము | ... | 1 | 0 |

## సహస్రనామములు నామావళీసహితము.

| | | | |
|---|---|---|---|
| శ్రీలలితాసహస్రనామస్తోత్రము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 3 | 4 |
| శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రము ,, | ... | 2 | 8 |
| సహస్రనామకదంబము, నామావళీసహి | ... | 1 | 0 |

## వైద్యగ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| జీవధనరక్షిణి, పశువైద్యశాస్త్రము | ... | 1 | 4 |
| ఇలాజుల్‌గుర్బా, యూనానివైద్యము | ... | 3 | 0 |

| | | | |
|---|---|---|---|
| | | ప్రతి 1-కి రూ. | అ. |
| చరకసంహిత, సూత్రస్థానము I | ... | 6 | 0 |
| ,, శారీర, ఇంద్రియ, నిదాన, విమానస్థానములు II | ... | 5 | 0 |
| ,, చికిత్సాస్థానము III | ... | 8 | 0 |
| ,, సిద్ధి-కల్పస్థానములు IV | ... | 3 | 8 |
| అష్టాంగహృదయము' సూత్రస్థానము | ... | 6 | 0 |
| ,, చికిత్సాకల్పస్థానములు | ... | 5 | 0 |
| ,, శారీరనిదానస్థానములు | ... | 3 | 8 |
| ,, ఉత్తరస్థానము | ... | 6 | 0 |
| గదనిగ్రహము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 2 | 8 |
| ఘృతతరంగము ,, | ... | 1 | 4 |
| చక్రదత్త ,, | ... | 4 | 0 |
| చికిత్సాసారము ,, | ... | 2 | 8 |
| లోలంబరాజీయము, సద్వైద్యజీవనము, ఆంధ్రతాత్పర్యము | ... | 0 | 12 |
| వస్తుగుణమహోదధి, తెనుఁగువచనము | ... | 6 | 0 |
| శార్ఙ్గధరసంహిత, క్రొత్తకూర్పు, సాంధ్రతాత్పర్యము | ... | 3 | 8 |
| సుశ్రుతశారీరము | ... | 2 | 8 |
| సర్వౌషధిగుణకల్పము, తాత్పర్యము | ... | 2 | 8 |
| మాధవనిదానము, ఆంధ్రవ్యాఖ్యానము | ... | 4 | 8 |

నిఘంటువులు.

| | | | |
|---|---|---|---|
| త్రికాండశేషము, సటీక | ... | 1 | 12 |
| మేదినీకోశము, సటీక | ... | 4 | 0 |
| విశ్వకోశము, (విశ్వనిఘంటువు) సటీక | ... | 2 | 8 |
| హారావళి, ఏకాక్షరీకోశము ,, | ... | 0 | 8 |
| అమరము, ప్రథమకాండము, మూలము, పెద్దచ్చు | ... | 0 | 4 |
| ,, ,, టీక | ... | 0 | 6 |
| ,, ,, మేలుప్రతి | ... | 0 | 8 |
| అమరము, 3 కాండలు, మూలము | ... | 0 | 12 |
| అమరము, సటీక మేలుకాకితములు | ... | 2 | 8 |
| ధనంజయనిఘంటువు | ... | 0 | 12 |
| నానార్థరత్నమాల | ... | 1 | 4 |
| గురుబాలప్రబోధిక, చక్కనిప్రతి | ... | 6 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.